# శ్రీ భగవద్గీతా భాష్యము.

## ప్రథమాధ్యాయ ఫలస్తుతి.

వైకుంఠమందు విష్ణువు లక్ష్మితో నిట్లు చెప్పెను. హే! లక్ష్మి సుశర్మయను నొక బ్రాహ్మణుడు అతి నీచవృత్తిలో సంచరించుచు మంచి కర్మ యెప్పుడును చేసి యుండలేదు. నిత్యము మద్య మాంసములు భక్షించుతూ వ్యవసాయ వృత్తిని జేయువాడు. విషయ భోగముల జిక్కియుండెడి వాడు. అతని వద్ద కొన్ని మేకలునూ గలవు. యీ మేకలను మేపుట యందు చాలా సేపు కాలమును గడపుచుండెడి వాడు. ఒక దినమందు మేకలను తోలుకుని ఒక యడవికి వెళ్లి యొక చెట్టు యెక్కి ఆకులు కోయుచుండగా ఆ చెట్టుమీద నుండు నొక విషసర్పము ఆ సుశర్మను గరవగా మృతినొందెను. పిమ్మట యమదూతలచే యమలోకమునకుం గొంపోబడి వాడు చేసిన పాతకములను బట్టి నరక కుండమందు ధగద్ధగ జ్వాలలచే చిరకాలము దగ్ధము చేయబడుచుండెను. ఇట్టి ఘోర నరకబాధను, చిరకాల మనుభవించిన పిదప, తిరిగి భూలోకమందు కొంచెము పాపశేషముతో ఇక్కడ కష్ట మనుభవించుటకు యెద్దు జన్మమెత్తెను. భిక్షాటనము జేయు నొక కుంటివాడా యెద్దును గొని వాహనముగా దానిపై నెక్కి చాలాదూరము ప్రయాణములు జేయుచు ప్రతి గ్రామమందు భిక్షాటనము జేసి సాయంత్రమును ఇంటికి వచ్చి భిక్షా ద్రవ్యముచే ఇంటివద్ద నున్న దారా పుత్రాదులను పోషించుచుండెడివాడు. యెద్దునకు పగలస్తమానము యేమీ ఆహారము లేదు సరిగదా ఇంటికి వచ్చిన తర్వాత కట్టివేసి కొంచెము ఊక మాత్రం పోసెడివారలు గాని అంతకంటె ఎక్కువ యేర్పాట్లు యేమీ లేవు. భిక్షుకుడు దీని మీద సవారీ చేసి ధనము సంపాదించి కుటుంబ పోషణ చేసు కొనుటయే యెరుగును గాని

యీ యెద్దునకు మేత విషయమై శ్రద్ధ చేయువాడు గాడు. ఇట్లు కొంత కాలమునకు ఆ యెద్దునకు క్రమశః శక్తి తగ్గి నడుచుటకు శక్తి లేకుండెను. ఒక రోజు ప్రయాణములో అకస్మాత్తుగా యెద్దు పడిపోయి కొట్టుకొను చుండగా ప్రాంతవాసులు జూడవచ్చి యెద్దు యొక్క బాధను జూడలేక భగవంతుని ప్రార్థించుచు యిట్లు బలుకుచుండిరి. ఓభగవానుడా! యేఉపాయము చేతనైనను ఈయెద్దు శీఘ్రముగా మరణించు నుపాయము గల్పింపుమని వేడుకొనుచుండిరి. దాని పూర్వజన్మ పాపము వలన చూడశక్యము గాని బాధ నొందుచున్నది, ప్రాణము పోవున్నది, కండ్లు పైకి వచ్చినవి, నాలుక అడ్డము గరచుకొని పోయినది, రక్తమును కక్కుకొనుచున్నది, మల మూత్రములు విశేషముగా నగుచున్నవి, యెద్దుయొక్క యీదుర్దశను జూచి యనేక మంది వచ్చి చూచి భగవంతుని స్తుతించుచు ఓభగవానుడా! యీ యెద్దు యొక్క ప్రాణము శీఘ్రముగా పోయిన యెడల నేను చేసిన ఫలాని పుణ్యమును యెద్దున కిచ్చి వేయుచున్నామని పలువురు తమ తమ పుణ్యముల నర్పింప సాగిరి. ఇంతలో నొకవేశ్య వచ్చి యీ గందరగోళ మేమని యడుగగా యెద్దుయొక్క వృత్తాంతము జెప్పి మరణోన్ముఖమైన దీని ప్రాణములు శీఘ్రముగా బోవుట కొరకు మేము చేసిన ఫలాని పుణ్యకర్మల నెద్దున కర్పించి భగవానుని బ్రార్థించు చుంటిమని చెప్పగా నావేశ్య యును నోభగవానుడా! నేనేమియు పుణ్యమును జేసి యుండలేను. నొకవేళ నీశరీరముచే నేదైన పుణ్యము జేయబడిన యెడల నాపుణ్యము చే నీ యెద్దు యొక్క ప్రాణము శీఘ్రముగా పోవు గాక యని భగవానుని బ్రార్థించి నంతలోనే, నాయెద్దు యొక్క ప్రాణము పోయెను. తదనంతరం వేశ్యార్పిత పుణ్య ప్రభావముచే మానవ జన్మ సంప్రాప్తమై నొక బ్రాహ్మణ గృహమందు జన్మించి పూర్వ జ్ఞానము గలిగి యుండెను. తర్వాత వేశ్య యొక్క ఆహ్వానముపై దాని గృహమునకేతెంచి ఓసుందరి! నీపుణ్య మర్పించిన కారణము వలన నాకు యెద్దుజన్మ

వదలిపోయి బ్రాహ్మణ జన్మ సంప్రాప్తమైనది, నీవు చేసిన పుణ్యమేదో నాకును దెలుపమని యపేక్షతో నడుగు చుంటిని. నేను కూడా నట్టి పుణ్యమును సంపాదించుకొని నీకృతజ్ఞతను వెలువరించగలను.

వేశ్యయిట్లనియె: ఓబ్రాహ్మణదేవా! నేను వేశ్యను గదా, పుణ్యమును సంపాదించుట నేనేమి యెరుగుదును? మావాండ్లు ఒక చిలుకను పెంచిరి. అది నిత్యము ప్రాతఃకాలమందు కొంచెము పారాయణ చేయుచుండెడిది. దాని పాట విని నేను చాలా సంతోషించు దానను. నేను యీ చిలుక పలికిన మాటల పుణ్యమును నీకర్పించితిని. ఇందులో యేమి పుణ్యమున్నదో చెప్పజాలను. అప్పుడు బ్రాహ్మణుడు చిలుకతో పలుకుచున్నాడు. ఓచిలుకా! నీవేమి చదువుచున్నావు? చిలుక యిట్లనెను. నేను వెనుకటి జన్మయందొక బ్రాహ్మణుడను. ఆజన్మయందు విద్యలన్నియు చదువుకొంటిని. నాగురువు భగవద్గీతను నాకొరకు అభ్యాసమును చేయించినాడు. ఇట్లుండగా నొకనాడు నేను ప్రమాదంబున నాగురువుగారు నాకేమియు శిక్షచేసినాడు గాడని పలికితిని. ఈవచనమును విని నాగురువుగారు కోపముతో నిట్లుశపించిరి. మంచిది ఓకొడుకా! నేనేమియు నీకు శిక్షజెయ్యనియెడల ఇప్పుడు చేస్తాను. నీవు పక్షి జన్మలో చిలుకవై పుట్టుము. పొమ్ము, అప్పుడు నేను చిలుకనై పోయి మరియొక బ్రాహ్మణ గృహమునకు వెళ్లితిని. అప్పుడు వారు ఆదరముతో నన్ను పట్టుకొని పంజరములో బెట్టి పెంచుచుండిరి. ఆయింటి బ్రాహ్మణుడును గీతా శాస్త్ర పారంగతుడు. తనకుమారునకును గీతను కంఠస్థ మగునట్లుగా సంత చెప్పుచుండెడివాడు. నేనును ఆకొమరునితోడ గీతను కంఠస్థమును జేసితిని. ఇట్లుండగా నీవేశ్యయింటి కొచ్చువాళ్ళు యీ బ్రాహ్మణ గృహమునందు చోరనిమిత్తము వచ్చి పంజరములో నున్న నన్నును పంజరముతో తెచ్చిరి. యీవేశ్య చోరులనడిగి నన్ను ఇక్కడ నుంచుకొని పోషించుచున్నది. బ్రాహ్మణదేవుని యాశీర్వచనముచే కంఠస్థమును జేసిన గీతా

ప్రథమాధ్యాయమును నిత్యము పారాయణ చేయుచుంటిని. ఓబ్రాహ్మణ పుత్ర! నేను ప్రేమతో నెట్లు పారాయణ చేయుచుంటినో అట్లే ఈ వేశ్యయు వింటూన్నది. దీని యభిప్రాయము తెలియక పోయినను దీని యొక్క శ్రవణమాత్ర ఫలము నే మీకు యిచ్చినందున పశుజన్మ వదలి బ్రాహ్మణ జన్మప్రాప్తమైనది. ఇట్లు చిలుక చెప్పిన వృత్తాంతమును బ్రాహ్మణుడు విని చాల సంతసించి యింటికి వచ్చి గీతాపారాయణ నిత్యవ్రతముగా బెట్టుకొని చేయుచుండెను. అంతమందు యీబ్రాహ్మణుడున్నూ, చిలుకయు వేశ్యయున్నూ గీతాప్రథమాధ్యాయ పారాయణ వలన పరమశివపదము నొందిరని విష్ణుమూర్తి లక్ష్మితో జెప్పెను.

ఇందు అంతరార్థ మేమియనగా. బ్రాహ్మణుడు, ఈశ్వరుడు; శుకము జీవుడు, వేశ్య మాయా, ఇట్టి మాయా జీవేశ్వర రూపమైనదే, ప్రపంచము. ఇట్టి ప్రపంచము నాదియని మోహము నొంది దుఃఖించుచుండిన యర్జునునకు కామక్రోధాది శత్రుసంహార విషయమైన విషాదముగాన అర్జున విషాద యోగమనునది ప్రథమాధ్యాయము.

---

## ద్వితీయాధ్యాయ ఫలస్తుతి.

దక్షిణదేశమందు ఇంద్రపురమను నొక నగరముండెను. అందు విష్ణుశర్మయను నొక బ్రాహ్మణుండు గలడు. అతను చతుర్వేదముల యందును షట్ శాస్త్రముల యందును పండితుడు. దేవ పితృ పూజల యందు తత్పరుడై సదాచార సంపత్తి కలిగి యుండెను. అతిథి అభ్యాగతులకు సత్కార మొనరించి వారివలన ధర్మసంబంధమైన ప్రశ్నల నడిగి తెలుసు కొనువాడు. ఒకానొక దినమందు ఒక బాల బ్రహ్మచారి యతని యింటికి రాగా సత్కార మొనరించి విష్ణుశర్మ బ్రహ్మచారి నిట్లు ప్రశ్నిం

చెను. ఓ మహాత్మా! మోక్షము నొందుటకు గాను నాకు బ్రహ్మజ్ఞానము నుపదేశింపుడని వేడుకొనెను. 'ఓ విష్ణుశర్మ! నీవు మంచి ప్రశ్ననడిగితివి. దీనికి ఉత్తరువు గీతా ద్వితీయాధ్యాయ మందున్నది. దానిని వినిపించెదను. విన్నందున ముక్తి మార్గము దొరకగలదు.' యనెను. విష్ణుశర్మ యిట్లు దీనిని విని యెవరు ముక్తినొందిరో యావృత్తాంతము నాకు ముందెరింగించి పిమ్మట యుపదేశింపుడని కోరెను. బ్రహ్మచారి యొక ప్రాచీన కథను జెప్పుచున్నాడు. 'నేను తపము చేయు వనమందు ఒకగొల్లవాడు మేకలను మేపుచుండెను. వాని పేరు ప్రవాలీ. ఒకదినమందు నేను సమాధి యందుండగా నొక పెద్దపులి వచ్చి ఒకపార్శ్వమందు గూర్చుని యుండెను. రెండవ పార్శ్వమందొక లేడి పిల్ల గంతులు వైచుచుండెను. ఇట్టి సమయములో ప్రవాలీ మేకలను మేపుట వదలి నాకుటీరము వద్దకు రాగా నక్కడనున్న యవస్థను జూచి భయపడి నొక చెట్టుపైకి యెక్కి తనకు భయము లేదను కొనుచు కుటీరము యొక్క రెండవ వైపు పరికించగా లేడిపిల్ల గంతులిడుట జూచి యీపులి లేడిపిల్లను యెందుకు పట్టదు? హాశ్చర్యముగా నున్నదే యని విచారించుచుండెను. ఇంతలో నాసమాధివదలుటను జూచి కేకలిడుచుండెను. నేనును వాని వైపునకు చూడగా వణకుచుండెను. నేను భయము లేదు యిచటకు రమ్మని పిలచితిని. మొదట రావక్షముకు అంగీకరించ లేదుగాని నేను ఉత్సాహమును చూపించి నందున వచ్చి సాష్టాంగ నమస్కారము జేసి తన యవస్థను వినిపించి, మహాత్మా! యీపులి లేడిపిల్లను యెందుకు పట్టదు? అని ప్రశ్నించెను. నేనిట్లు చెప్పితిని. ఇక్కడ అహింసా వ్రతముయొక్క ప్రభావమున్నది. యేమనుజుడు అహింసా వ్రతమును ధరించునో వానియొద్ద ఘాతుక జంతువులునూ వైరభావమునువదలివేయును. మాపూర్వాచార్యులునూ శాస్త్రములయందు చెప్పినన్ని యుండిరి. (అహింసాప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః) నీవుయిక్కడ సంగతినిజూచి హాశ్చర్యపడితివి. ఇదినాయహింసావ్రత ప్రభావమనిచెప్పగా

మహాత్మా! నాకునూ దేనివలననూ భయములేనట్టి శక్తియిప్పింపుడని ప్రవాలి వేడుకొనెను. అంతట బ్రహ్మచారి గీతయొక్క ద్వితీయాధ్యాయమును వినుమని వినుపించెను. అందు ఈశ్వర జీవ ప్రకృతులు వర్ణింప బడినవి. అప్పుడతడు ఆ యధ్యాయమును విని గృహమును వదలి నావలన యోగాభ్యాసమును పొంది బ్రహ్మమందు లీనమాయెను. హేనరశ్రేష్ఠా! నీవునూ యీ యధ్యాయమును ధ్యానముతో విని ఆచరణ జేసితివో అవశ్యముగా మోక్షపద మనుభవింప గలవని పలికి, ద్వితీయాధ్యాయమును విని విష్ణుశర్మ యు నిర్వాణ పదమును బొందెనని విష్ణువు లక్ష్మితో జెప్పెను॥౨॥

---

## తృతీయాధ్యాయ ఫలస్తుతి.

శ్రీ విష్ణుమూర్తి లక్ష్మిదేవి కొరకు గీతయొక్క మూడవ అధ్యాయము యొక్క మాహాత్మ్యమును యిట్లుపదేశించెను. ఓ లక్ష్మి! ఈ మూడవ అధ్యాయము యొక్క మాహాత్మ్యము అతి పవిత్రమైనదియును అనేకమైన పాపములను పోగొట్టునదియు గాన శ్రద్ధతో నాలకింపుమని చెప్పదొడంగెను. కుశిక వంశమందు జడుడనే, పేరు గల బ్రాహ్మణు డొకడుండెను. అతడు కడు దుర్మార్గుడు. పవిత్రమైన తన బ్రాహ్మణ వృత్తిని వదలి వైశ్య వృత్తిచేత జీవించుచుండెను. జారచోరత్వ మందును మద్యపానమందును అతనితో సాటి మరియొకడు లేడు. జూదమాడుటలో అతి నేర్పరిగా నుండెను. యిట్టి దుర్నడతలచేత వర్తకమందు కూడా లాభము లేక నష్టపడి దరిద్రుడై, ఒకచోట కన్నము వేసి విశేషముగా ధనమును దొంగిలించి ఆ ధనమును తీసుకొని విదేశ వస్తువులు తే నుద్దేశముతో పర దేశమునకు వెళ్ళెను. అప్పట తన వర్తకమునకు కావలశిన మంచి విలువ గల వస్తువులను కొని వాని నన్నిటిని నొక ఓడమీద చేర్పించి తిరిగి తన దేశమునకు వచ్చుచుండెను.

అట్లు వచ్చుచుండగా దైవవశముచే మధ్య మార్గమందు దొంగ లడ్డు తగిలి అతని సొత్తంతయు లాగుకొని వతనిని చంపివైచిరి.

ఓ లక్ష్మి ! అట్లు చోరుల వల్ల చంపబడిన జడుడనే బ్రాహ్మణుండు తన కర్మానుసారముగా ఫలము ననుభవించుటకు గాను పిశాచత్వము నొందెను. తన నీచమైన దుష్కర్మల యొక్క కారణముచే ఎట్లు మానవజీవనమందు వానిని యెల్లప్పుడు ఆకలి బాధించు చుండెనో అవిధముగానే పిశాచజన్మమందును మహాదరిద్రుడై ఆకలిబాధచేత పీడితుడై యుండెను.

ఓ లక్ష్మి! పిశాచ శరీరము కడు భయముగా విచిత్రముగాను నుండుట ఒకటే. ఎల్లప్పుడు ఆకలిచే వానియొక్క పొట్టయు వీపును నొకటిగా నంటుకొని పోయెను. రెండవది మరియు రెండుకాళ్ళు అతి దీర్ఘములుగాను తల పెద్దదిగాను కండ్లు వికృతిగాను వెంట్రుకలు కడు నిడుదలుగాను నుండి ధైర్యవంతులకు సయితము కడు భయముగా గనుపట్టుచుండెను. జడుడనే బ్రాహ్మణుడు పిశాచ రూపము ననుభవించుచు చిరకాలముండ వలసి వచ్చెను. అది యట్లుండగా - యింటెదగ్గర, వ్యాపారమునకు పోయిన తండ్రి రానందున నతని కుమారుడు తండ్రిని వెదకుటకు బయలుదేరెను. అట్లు బయలుదేరి చాలా దూరమున నున్న నది దగ్గర చోరులు తన తండ్రిని చంపిన సంగతిని తెలుసుకొని కడు విచారించెను.వాడు విద్వాంసుడును ధర్మాత్ముడును గనుక తన తండ్రికి ప్రేతరూపము పోవు మార్గము యేది యని ఆలోచించి, తనకు వలసిన వస్తువులను తీసుకొని కాశీ యాత్రకు బయలుదేరెను. సాయంకాలమునకు బహు దూరము నడచి ఒకచెట్టుక్రింద బసచేసి సంధ్యోపాసన జేసుకొని శ్రీ గీతయొక్క మూడవ అధ్యాయము పఠనచేయ నారంభించెను.

తాను ఏచెట్టుక్రింద పఠించెనో ఆ చెట్టుమీదనే తన తండ్రియు నివాసముగా నుండెను. అందుచేత ఆ వృక్షము కడు భయమని ప్రతీతి

యగుచుండెను. తన కుమారు డట్లు గీత చదువగా నది వినుటచేత ప్రేత శరీరము పోయి దివ్యమగు దేవతా శరీరమును పొంది విమానము మీద గూర్చుండి తన పుత్రుని దగ్గర కరుగుదెంచెను. అట్లు వచ్చి తన కుమారుని దీవించి పుత్రకా! నేను నీతండ్రిని. నేను చనిపోయి పిశాచ రూపముగా నుండెడివాడను. యిప్పుడు నీవుచదివిన దానిని వినుటచేత పిశాచ రూపము పోయిదేవతా దేహమునుపొందితిని.యిప్పుడునీవునన్నుధ్ధరించితివి.నీయొక్క దయచేత నేను స్వర్గమునకు వెళ్ళు చున్నానని చెప్పగా విని పుత్రుడు. తండ్రీ! నీకు నేను చేయవలసిన దానిని ఆజ్ఞ యివ్వ వలయునని కోరెను. అంతట దేవతా శరీరిట్లు చెప్పెను. నాయనా! నాయొక్క పితృదేవతలు యేడు తరముల నుంచి నరకమున బడి దుఃఖించు చున్నారు. గాన నీవు గీతయొక్క మూడవ అధ్యాయము పఠించి దానియొక్క ఫలమును వారి కిమ్ము. దాని వలన వారు నరకము నుండి ముక్తులయి స్వర్గమును పొందు దురని చెప్పి దేవతా శరీరి యగు నత నితండ్రి స్వర్గమునకు బోయెను. అటు పిమ్మట ఆబాలకుడు తనతండ్రి యానతిచొప్పున గీతామూడవఅధ్యాయమును పఠించి దానియొక్క పుణ్యమును తనపితరులకిచ్చి పరమపదవిని ప్రాప్తింప చేసెను. అది యట్లుండగా యమలోకము పాడుబడి పాపులు సయితము విమానము మీద స్వర్గమునకు పోవుచుండుట గని ఆశ్చర్యముతో యమ దూతలు యమధర్మరాజు దగ్గరకు బోయిచెప్పిరి. అంతట యముడు పర మేశ్వరుని దగ్గరకు బోయి నమస్కరించి యిట్లు నుడివెను. హే! త్రి లోకనాథా! జన్మాంతరములనుండి చేసిన పాపులు విమానారూఢులై నీసన్నిధికి వచ్చుచుండిరి. గనుక నేను యమలోకములో నెవ్వరిని దండిం తునని నుడువగా పరమేశ్వరు డిట్లుచెప్పెను. యమరాజా! దుఃఖించకుము. సావధానముగా నాయాజ్ఞ వినుము. యెవడు గీతాపాఠమును చేయునో లేక వినునో యెవ్వడైనను తాను చదివి దానిఫలమును మరియొకనికి నిచ్చునో వీర్లందరిని నీవు యమలోకమునకు తీసుకు పోవలదు. ఇదియే

నాయాజ్ఞ, ఇది సత్యముగా తలంపుమని చెప్పగా విని యమధర్మరాజు తన పురమును చేరెను. అంతట తన దూతలను రావించి, ఓ దూతలారా! ఎవడు గీత చదువునో వినునో ఎవడు దానిఫలమును పొందునో ఈ ప్రాణులను మీరు ఎన్నడును నరకమునకు తేవలదని నుడివెను. గీత వినుట చేతను చదువుటచేతను పాపాత్ములు సహితము వైకుంఠమును బొందుదురని లక్ష్మీదేవి కొరకు నారాయణుడు యామూడవ అధ్యాయము యొక్క ఫలమును జెప్పెను.

---

## చతుర్థాధ్యాయ ఫలస్తుతి.

శ్రీ విష్ణుమూర్తి చెప్పుచున్నాడు. ఓలక్ష్మీ! గీతయొక్క మూడవ అధ్యాయము ఎట్లు పవిత్రమైనదో అట్లే ఈనాల్గవ అధ్యాయము మహాత్మ్యము మున్ను పవిత్రమైనదియు మనోరంజకమైనదియును గాన శ్రద్ధతో నాలకింపుము. గంగానదీ తీరమందు కాశీయను పట్టణమొండు కలదు. అందు ఆత్మజ్ఞానియైన వైశ్యుడొకడుండెను. అతనికి గీతయనిన అతిభక్తి. ఒకరోజున ఆవైశ్యుడు పట్టణము వెలుపలకు షికారుకు. బయలుదేరెను. కొంత దూరము రాగా మిక్కిలి విశాలమైన మైదానమందు గొప్పవిరెండు రేగు వృక్షములను చూచెను. అవి మిక్కిలి పెద్దవిగాను దట్టముగాను నుండెను. అచ్చటి ప్రదేశమంతయు పచ్చిక చేత రమణీయముగా నుండెను. అంతట నావైశ్యుడు ఆనందించి అవృక్షముల నీడను కూర్చుని ప్రేమతో గీతా నాల్గవ ఆధ్యాయమును పఠింప నారంభించెను. అధ్యాయము సమాప్తి కాగానే అతనికి గాఢమైన నిద్ర వచ్చుట చేత ఒక వృక్షము యొక్క వేరు మీద శిరస్సును రెండవ చెట్టు వేరుమీద పాదములను ఉంచి నిద్రపోయెను. అట్లు కొంతవిశ్రాంతిని జెంది ఆవైశ్యుడు తన

యింటికి రాగా ఆరెండు వృక్షములును ఎండి చచ్చిపోయెను. పిమ్మట కొంతకాలమునకు ఆరెండు వృక్షములును ఆపట్టణమందే నొక బ్రాహ్మణునికి కన్యకలై జన్మించి పెరుగుచుండెను. ఆకన్యకలు 7 సం॥రములుగల ఈడు రాగా ఒకరోజున దైవ యోగముచేత నావైశ్యుడు వారికగుపడెను. అంతట వారిరువురు అతనికి నమస్కరించి స్వామీ తమ దయచేత మేము జడరూపమైన రేగు చెట్ల రూపమును విడచి జ్ఞానము గల ఈమానవ రూపములు పొందితిమి. ఇప్పుడు మాకు విచారము లేదనగా నావైశ్యుడు ఆశ్చర్యమును చెంది వారి మాటలు తనకు అర్థము కాకవారిని నావలన మీరెట్లు రేగుచెట్ల రూపమును విడచితిరని నడిగెను. అంతే నాకన్యకలు తమ పూర్వజన్మ వృత్తాంతమును పూస గ్రుచ్చినట్లు నంతయు చెప్పిరి. అంతనావైశ్యుడు ఆనందమును చెంది ఓకన్యకలారా మీరు రేగుచెట్లకంటె పూర్వము యేజన్మ మెత్తితిరి? ఎందువల్ల రేగు చెట్ల జన్మమును పొందవలయు ననగా కన్యకలు చెప్పుచున్నారు. ఓపూజ్యుడా తొలుత మేము. ఇంద్రలోకమున నుండుఅప్సరసలము. సత్యతపుడనే ఒక ఋషి ఘోరమైన తపస్సు చేయుచుండెను. ఆతడు జితేంద్రియుడును సత్యనిష్ఠుడును ఆతని తపము వలన ఇంద్రుడు తన ఇంద్రత్వమునకు భంగము వాటిల్లు నని భయపడి సత్యతపుని తపోభంగము గావించి రండని ఇంద్రుడు మమ్ములను పంపెను. అంతట మేము ఇంద్రుని యాజ్ఞానుసారముగా సత్యతపుని యొక్క ఆశ్రమమునకు బోయి ఆతని యెదుట అనేకమైన శృంగారచేష్టలు చేసితిమి. నృత్యమును చేసితిమి. మృదంగమును ప్రయోగించితిమి. రాగము లనేకములు పాడితిమి గాని కేవల సత్వనిష్ఠగల యాముని మమ్ములను కన్నెత్తియైనను చూడలేదు పిమ్మట మేము ఆఋషిని మిక్కిలి బాధించితిమి అంతనాతడు కన్నులు తెరచి చూచి తన దివ్యజ్ఞానము వలన మమ్ములను తెలుసుకొని కోపించి మీరు జడరూపమైన రేగు చెట్లుగా పుట్టుడని శపించెను. ఆమాటవినిన తోడనే మేము నిశ్చేష్టులమై

మూర్ఛను చెందితిమి. పిమ్మట కొంత తడవునకు మాలో మేము మూర్ఛను తెలిసికొని ఋషినిట్లు ప్రార్థించితిమి. మునిచంద్రమా ఇంద్రుని పంపున వచ్చితిమి గాని మా స్వబుద్ధిచేత మీతపస్సు భంగము చేయుటకు రాలేదు. మాకు యిట్టి ఘోరమైన శాప మివ్వతగదు మాశాపము పోవు మార్గము ఆనతీయ వలయునని అనేక విధముల ప్రార్థించితిమి. అంత మా మొరాల కించి ఋషియిట్లు, చెప్పెను. నాశాపము మీరు అనుభవించితీరవలయును. మీరు రేగు చెట్ల రూపముతో నున్నప్పుడు భరతుడనే నొక వైశ్యుడు మీదగ్గరకు వచ్చి గీతా నాల్గవ అధ్యాయము నెప్పుడు చదువునో అప్పుడు మీరు నాశాపము వలన ముక్తులై తిరిగి ఒక బ్రాహ్మణునికి కన్యకలై జన్మింతురని పలికెను. గాన ఓవైశ్యకులోత్తమా! యిప్పుడు మేము తమ కృపచేత కన్యకలమై ఇచ్చట జన్మించితిమి. ఇదియే మాపూర్వజన్మ వృత్తాంతము.

ఓ లక్ష్మి ! కన్యల వలన గీతాప్రభావమును విని ఆవైశ్యు డానందించెను. పిమ్మ టాకన్యకలు ఆవైశ్యుని అనేక విధములు పూజించిరి. తరువాత నాకోమటి తనయింటికి వెళ్లెను. అటులగాయితు ఆకన్యకలు గీతా నాల్గవ అధ్యాయమును ప్రతిదినము పఠించి జన్మాంతమందు స్వర్గమును చేరిరి. గనుక ఓలక్ష్మీదేవి! గీతా ప్రభావము సాధారణమైనది గాదు. కేవలము వినుట మాత్రముననే జడరూపము వలన ముక్తులై అప్సరసలకు మానవ దేహము లభించినది. గనుక గీతా మహాత్మ్యము అసాధారణమైనది.



# పంచమాధ్యాయ ఫలస్తుతి.

విష్ణుమూర్తి లక్ష్మీదేవితో పంచమాధ్యాయము యొక్క మహాత్మ్యమును చెప్పుచున్నాడు. పురుకుత్సనగరమునందు పింగళుడనే బ్రాహ్మణుడొకడుండెను. ఆయన కడుదురాచారుడు. ఆయన ప్రతిదినము జూదమాడుట, దొంగతనము చేయుట, తాగుట యిట్టి దురాచారములతో మెలగుచుండువాడు. అతని భార్యయయిన అరుణ, కూడా వ్యభిచారిణి. ఆమె ఎల్లప్పుడు తనభర్తతో జగడమాడి దెబ్బలు తినుచుండెడిది. అట్లు దెబ్బలు తినుచున్నను భయములేక మగనితో పోట్లాడుచునే యుండెను. ఇట్లుండగా నొకరోజున ఆమె అర్ధరాత్రి సమయమున భర్త నిద్రించుచుండగా కని కత్తితో నరికి చంపివైచెను. పిమ్మట పింగళుడు తన పాపకర్మవలన యమలోకమందు నరకము ననుభవించి పిమ్మట గద్దయై జనించెను. తరువాత ఇచ్చట అరుణకూడా భగంధరరోగముచే చచ్చి నరకము ననుభవించి తనభర్తయయిన పింగళుడు ఏవనమునందు గ్రద్దయై పుట్టెనో ఈమెకూడా ఆవనమందే చిలుకయై పుట్టెను. ఇట్లిద్దరు ఒకవనమునందే నివసించు చుండగా గ్రద్ద పూర్వవైరవాసనచేత చిలుకను చంపివైచెను. ఆచిలుక క్రిందనున్న మనుష్య పుర్రెయందు పడెను. తరువాత ఒకబోయవాడు వేటకైవచ్చి అకస్మాత్తుగా ఆ గ్రద్దనుకూడా చంపగా అదియును ఆమనుష్య పుర్రెయందే పడెను. అట్లు చచ్చిన ఆరెండు జీవులను యమదూతలు తమలోకమునకు తీసుకువెళ్లి యముని యెదుట హాజరుపెట్టిరి. అంతట యముడు వారినిద్దరిని చూచి ఈవిధముగా చెప్పెను. మీరిరువురు కడు పాపాత్ములు. కాని మీరు పడినచోటు కడుపుణ్యమైనది. ఏమందురా? మీరు పడిన పుర్రెగల మనుష్యుడు బహుజ్ఞానియై యుండెను. ఆతడు గీతయొక్క అయిదవ అధ్యాయమును, నిత్యము పఠించువాడు. యిప్పుడాయన బ్రహ్మలోకమునందు వసించుచుండెను.

కాబట్టి మీరా పుణ్యాత్ముని యొక్క కపాలమునందు పడుటవల్ల మీరు పవిత్రులైతిరి. కాబట్టి మీరిరువురు మీయిష్టానుసారం ఉత్తమలోకమునకు పోవచ్చునని యముడు చెప్పిన మీదట వారిరువురు విమానము నెక్కి పరమ పదమునకు వెళ్లిరి.

---

## షష్ఠాధ్యాయ ఫలస్తుతి.

ఓలక్ష్మీ యిక గీతయొక్క ఆరవ అధ్యాయము యొక్క మహాత్మ్యమువినుము. గోదావరీ తీరమందలిప్రతిష్ఠానపురమందు జ్ఞాన సురతుడనే పేరుగల ధర్మాత్ముడగు రాజొకడుండెను. ఆతడు ధర్మార్థ కామ మోక్షముల యందు నిపుణుడు. అతనియొక్క ప్రజలును ధర్మ విచార శీలురు. ఒకదినమున పండితులతోను మంత్రులతో సహితము దర్బారునందు కూర్చొని యుండగా హంసలయొక్కబారు ఎగురుచు నగరు మీదుగా పోవుచుండెను. వాటిలో కొన్ని హంసలు అతివేగముగా పోవుచుండెను. మిగిలిన హంసలు వాటిని చూచి సోదరులారా! మీరు వేగముగా పోవుటయే కాని ఈ పుణ్యాత్ముని యొక్క నగరము వంక చూడరైతిరి. ఈ నగరపురాజు కడుధర్మాత్ముడు. ఇతని యొక్క కీర్తి ప్రపంచమంతయు వ్యాపించియున్నదని చెప్పగా విని ముందు బోవు హంసలు ఈరీతిగా జవాబు చెప్పెను. మీరు మిక్కిలి మూర్ఖులు. ఈరాజు యొక్క కీర్తి బ్రహ్మజ్ఞాని యైన రైక్యమునియొక్క ప్రభావమెదుట ఎన్నవవంతు? ఇట్లు సంభాషించు కొనుచు పోవుచున్న హంసలయొక్క సంభాషణవిని రాజాశ్చర్యపడి పండితవరుల నడుగగా వారీరీతిన చెప్పిరి. మహారాజా! హంసలయొక్క మాటలసత్యములు కావు. రైక్యముని యొక్క ప్రభావము కడుగొప్పది. అట్టి ఋషి లోక మందెచ్చటనైన

నుండవచ్చునని నుడివిరి. పండితుల యొక్క మాటవిని రాజునకు రైక్య మునిని చూచువేడుక పుట్టెను. అంతట రాజు పండితులతో బయలుదేరి ప్రయాగ, నైమిశారణ్యము, మధురా నగరము, గోకుల బృందావనము మొదలగు పుణ్యక్షేత్రముల వెదకుచు కాశ్మీరము వెళ్ళిన మీదట మణికేశ్వర మహాదేవ క్షేత్రమునందు రైక్యమునిని చూచెను. చూచుటతోడనే భక్తి శ్రద్ధలతో సాష్టాంగ నమస్కారము చేసి చేతులుజోడించి వినయ పూర్వకముగా నిల్లడిగెను. ఓమునిచంద్రమా! తమయొక్క ప్రభావమును విని నేను చాలాదేశములు తిరిగి తమదర్శనమునకు వచ్చితిని. ఓమహాత్మా! మీరు ఏధర్మము నాచరించి యింతటి కీర్తివంతులైతిరో దానిని నాకుప దేశింప వేడెదను. దయయుంచి మీరు నాకు తెలుపవేడెదను. అంతట రైక్యముని యిట్లు చెప్పదొడంగెను. రాజా! నాకు యోగములు రావు. నే నేశుభకర్మను చేయుట లేదు. గాని నేను ప్రతిదినము గీతయొక్క ఆరవ అధ్యాయమును పఠించు చున్నాను. అందువల్లనే నాయొక్క కీర్తి దేవలోకము వరకు వ్యాపించి యున్నదని నుడువగా విని రాజానంద పడెను. అప్పటినుంచియు జ్ఞానసురతుడు ఆరవ అధ్యాయమును పఠింప నారంభించెను. కొలది దినములు పఠించిన తరువాత ఆయనకు స్వర్గమునం దుత్తమ స్థానము లభించెను.

---

## సప్తమాధ్యాయ ఫలస్తుతి.

ఓలక్ష్మీ! ఈ చెప్పబోవు 7 వఅధ్యాయ మాహాత్మ్యము వలనను అనేక ప్రాణులకు ఉత్తమ లోకము గలిగినది, గాన శ్రద్ధగా నాలకింపుము.

పాటలీపురమందు సంకర్షణుడను బ్రాహ్మణు డొక డుండెను. ఆయనకు ముగ్గురు కొడుకులుండిరి. అతడు వైశ్యవృత్తిచే జీవించుచుండెను.

అతడు దయగలవాడు కాని తనకులోచితమగు, తర్పణ, గాయత్రీజప హోమాదులను వదలి, కేవల ధనోపార్జన యందే మగ్నుడై యుండెను. అట్లు చాలా ధనమును సంపాదించి కొన్ని దినములు గడచిన తరువాత వేరొక కార్యము కొరకు బోయి మార్గమధ్యమందు చెట్టునీడను నిద్రించెను. ఆచెట్టు క్రిందనే పాము కాటువలన నతనికి మృత్యువు కలిగెను. పాము కరచిన తరువాత వెంటనే తన దగ్గరనుండు ధనమంతయు నక్కడనే బదిలముగా పూడ్చిపెట్టెను. తదుపరి నాతడు తన పూర్వ కర్మవలన సర్పమై జనించి తాను పూడ్చిపెట్టిన ధనము దగ్గర నుండు పుట్టలో నివసించుచుండెను.

ఓలక్ష్మి ! ఉత్తమ మయిన మానవ శరీరమందు సుఖము కలుగని జీవునికి నీచమైన సర్ప జన్మయందు సుఖము గలుగునా ? అట్లు నాతడుసర్ప జన్మయందును అతికష్టములు అనుభవించుచునే యుండెను. యిట్టి కష్టములు పడలేక ఒకనాడు తన కుమాళ్ల స్వప్నము నందు కనుపించి ఇట్లుచెప్పెను. అయ్యలారా ! నేను అకస్మాత్తుగా పాము కాటు వలన మరణించి తిరిగి సర్ప జన్మను పొందితిని. నాదగ్గర చాలా ధనమున్నది. ఈసర్ప జన్మవలన చాలాకష్టముల పడుచుంటిని. అందువలన మీరు నన్నుద్ధరించిన గాని మీకు త్తమ గతులు రానేరవనియును, నన్నుద్ధరించి ఈ ధనమును తీసికొను డనియు, నుడివెను. అట్లు తమ తండ్రి స్వప్నమందు చెప్పిన వృత్తాంతమును విని, జ్యేష్ఠకుమారుడు తీర్థయాత్రలచేతను యజ్ఞ యాగాది పుణ్యక్రతువుల చేతను తన తండ్రినిఉద్ధరించ వలెనని యోచించెను. మూడవ కుమారుడు తన తండ్రి నుద్ధరించు నుపాయము తోచక ఏడవ నారంభించెను. రెండవ కుమారుడు తనతండ్రి సొత్తంతయు నపహరించ వలెననియును. సర్పమును చంపవలెననియు నాలోచించి తన భార్యను వెంటతీసుకొని తనతండ్రి ధనమును పూడ్చిన చెట్టుదగ్గరకు వెళ్ళి, ధనము తీసికొనుటకు భూమిని త్రవ్వ నారంభించెను. అట్లు త్రవ్విన మట్టి నంతయును యతని భార్య దూర

ముగా పోయుచుండెను. ఇంతలో బుసలు కొట్టుకొనుచు ఒక పెద్ద కాల సర్పము వచ్చి యిట్లు నుడివెను. ఓరీదుష్టా! నేనే నీ తండ్రిని. నీవునాయొక్క బిలమును ఏల త్రవ్వుచుంటివని నుడువగా పుత్రుడిట్లు సమాధానము చెప్పెను. తండ్రీ! తమ సొత్తంతయును తీసుకువెళ్లి మీకు విముక్తి గలుగు నొక యజ్ఞమును చేయుదునని చెప్పెను. అంత నాసర్పము అబ్బాయీ! ఆ ప్రకారము నాకు విముక్తి గలుగ నేరదు. నీవు నా శ్రాద్ధ దినమందు శ్రీ గీతయొక్క ఏడవ అధ్యాయమును పారాయణ చేయించి శ్రద్ధగా వినుదువో అప్పుడు నాకు సద్గతి గలుగును. అప్పుడే నాకష్టము లన్నియు తొలగును. తదనంతరమందు మీముగ్గురును వచ్చిన ఎడల ఈ సొత్తును మీ కిత్తునని చెప్పెను. అంతనా రెండవ కొడుకు సిగ్గుపడి తనభార్యతో యింటికి మరలి వచ్చి తండ్రికుత్తర క్రియలు నెరవేర్చి గీతా 7 వ అధ్యాయ మును పారాయణ చేయించి బ్రాహ్మణ సమారాధన గావించెను. అది మొదలు తానుకూడా దీక్షవహించి నిత్యము గీతా 7 వ అధ్యాయము పారాయణ చేయుచుండెను. ఆ ప్రభావము చేత అతని తండ్రికి సర్పజన్మ వల్ల ముక్తిని పొంది వైకుంఠము లభించెను.

---

## అష్టమాధ్యాయ ఫలస్తుతి.

ఓలక్ష్మీ! యికనెనిమిదవ అధ్యాయమును గూర్చి చెప్పెదవినుము. దక్షిణ దేశమందలి ఆమర్దక మనెడు క్షేత్రమందు భావశర్మయనెడు బ్రాహ్మణు డొకడుండెను. అతడు చోరకృత్యము చేయువాడును, విస్తార ముగా మాంస భక్షకుడును, త్రాగుబోతువాడును అయియుండెను. మరి యును నాతడు ప్రతిరోజును ఒకనికైనను కష్టము కలుగ చేయకుండా ఉండ లేడు. ఒక రోజున తన దుస్స్నేహితులతో కల్లు దుకాణమునకు బోయి మిక్కుటముగా త్రాగుట చేత స్మృతితప్పి చివరకు ప్రాణమును వదలెను.

తిరిగి రెండవ జన్మమున నాతడు తాడిచెట్టై జన్మించెను. ఆ చెట్టుమీద బ్రహ్మ రాక్షసమిథునము నివసించు చుండెను. యిట్లుకొంతకాలముగడచిన తరువాత వారిరువురకు నిట్లు సంభాషణ జరిగెను.

బ్రహ్మరాక్షసుని భార్య- ఎట్లు మనకు ఈ జన్మవలన విముక్తికలుగును?

బ్రహ్మరాక్షసుడు - యిప్పుడు మనకు ముక్తిదొరకుట చాల కష్టసాధ్యము. గాని మనము బ్రహ్మవిద్య యొక్క జ్ఞానము సంపాదించి నట్లయితే ముక్తి దొరకగలదు.

భార్య:—మనమాజ్ఞానమును పొందుటకు మార్గమే లేదా ?

రా:— ఓప్రియురాలా। నేను మానవజన్మయందుండగా అధ్యాత్మయొక్కయున్ను బ్రహ్మవిద్య యొక్కయున్ను జ్ఞానము ఒక చిన్న పుస్తకము వలన లభించునని వినియుంటిని. ఆ పుస్తకమును ప్రతి దినమును పఠించిన తప్పకఏప్రాణికైనను ముక్తి గలుగును. నేనారోజులలో దుర్వ్యసనముల యందులోలుడనై దానివంక చూడనైనను లేదు. ఒకరోజున గీతయొక్క సగశ్లోకమును ఒకపుణ్యాత్ముడు చదువు చుండుగా వినియుంటిని. అదియిప్పుడునుజ్ఞాపకమున్నది.

భార్య:—అటు లయిన ఆ శ్లోకమెట్టిదో చదువుడు?

రా:—వెంటనే. (చదివెను) ఈశ్వరస్సర్వభూతానాంహృద్దేశేఽర్జునతిష్ఠతి। ఓలక్ష్మి ! అట్లా బ్రహ్మరాక్షసుడు చదువగానే వారు నివశించిన యాతాళివృక్షము విరిగి పడెను. వెంటనే యెండి చచ్చిపోయెను. తదుపరి జన్మయందు భావశర్మ పవిత్రమైన బ్రాహ్మణ జన్మయందు జన్మించెను. ఆసగశ్లోకమును చదువగానే ఆబ్రహ్మరాక్షసుడు తన భార్యతో సహితము, ముక్తుడై పరమపదమునకు వెళ్ళెను. భావశర్మయును ఆ అర్థ శ్లోకమును ప్రతిదినమును పారాయణ చేయుచు జీవితాంతమున కైలసంతమునకు వెళెను.

———

## నవమోధ్యాయ ఫలస్తుతి.

ఓలక్ష్మీ! తొమ్మిదవ అధ్యాయ మాహాత్మ్యమును వినుము. మాహిష్మతీ పురమందు, మాధవుడను బ్రాహ్మణుడు గలడు. అతడు విద్వాంసుడును, ధర్మబుద్ధియును గలవాడై యుండెను. అతని దగ్గర విశేషముగా ధనముండుటవలన ఒకగొప్ప యజ్ఞమును చేయు బుద్ధిగలిగెను. శుభ ముహూర్తమునందు యాగమును ప్రారంభించెను. పిమ్మట యజ్ఞ పశువును పూజించి బలియిచ్చుటకు కత్తి నెత్తగానే, అంతట నామేక నవ్వి మనుష్యవాక్కులతో నిట్లునడిగెను. ఓబ్రాహ్మణుడా! మొదట నాయీమాటకు బదులు చెప్పి పిమ్మట నన్ను నరుకుము. యజ్ఞము చేయుట వలనఎట్టిఫలము గలదు? యజ్ఞఫలమైతేనశ్వర్యమైనది. దీనివలన నిజమైనఫలము రాజాలదు. మమ్ములచంపియాగమును చేసి పిమ్మట ఎట్టియోనులయందు జన్మింతురు? ఈవిధముగా నడుగగా నాబ్రాహ్మణుడు చకితుడై రెండుచేతులు జోడించి ఓయజ్ఞపశువా! నీయొక్క జ్ఞానము కడు శ్రేష్ఠమైనది. నీ పూర్వజన్మవృత్తాంతమును చెప్పవలయునని యడిగెను. అంతట నామేక యిట్లు చెప్పెను. ఓబ్రాహ్మణుడా! నేనీక్రితం జన్మయందు బ్రాహ్మణ కులమందు జన్మించి యుంటిని. యజ్ఞాది కర్మలయందు బహు నిపుణుడను. నాకు భార్యా పుత్రులును గలరు. నాకుమారునికి జబ్బు చేయగా నాభార్య దేవతకు బలియిచ్చుటకు ఒకమేకను తెప్పించి నరికించెను. అంతనామేక తల్లి కోపించి, ఏబ్రాహ్మణుని మూలముగా నా కుమారుడు బలి యివ్వబడెనో ఆబ్రాహ్మణుడును నాకుమారుని మాదిరి చంపబడుగాక, యని శపించెను. గాన ఓబ్రాహ్మణుడా! నేనా జబ్బు పడిన బ్రాహ్మణుడను. యిప్పుడు నేను మేక జన్మమెత్తి నీచేత చంపబడుటకు సిద్ధపడితిని. యిదియే నాపూర్వజన్మ వృత్తాంతము. నాపూర్వస్థితి స్మరణకు వచ్చి నీకును యిట్టి అవస్థ కలుగునని నవ్వితిని. గనుక నీకుపదేశించు చున్నాను. వినుము. నీవు పూర్వపుణ్యా కర్మవలన

బ్రాహ్మణ జన్మనెత్తితివి. యిప్పుడును అట్టి శుభకర్మచేసి సద్గతిని పొందుము. ఈయజ్ఞమువలన నీకు సద్గతిరాజాలదని చెప్పగా విని మాధవుడను బ్రాహ్మణు డానందపడి యిట్లు మేకను బ్రార్థించెను. మేషరాజా! యీక్రతువు కంటె ముక్తి నొందు వేరుమార్గమున్న ఎడల నుపదేశించి పుణ్యము కట్టుకొనుమని వేడెను. అంత నామేక యిట్లు చెప్పదొడంగెను. నేనా బ్రాహ్మణ జన్మకంటె మొదట కోతిజన్మనెత్తి గంగా నదియొడ్డున నొకచెట్టు మీద నుంటిని. ఒకరోజున సూర్యగ్రహణము సంభవించెను. ఆ గ్రహణమునకు గంగానదిలో స్నానము చేయుటకు అనేకమంది జనులు వచ్చిరి. వారిలో ఒక రాజును స్నానమునకువచ్చి స్నానము చేసి దానముయివ్వ నారంభించెను. యిచ్చిన దానమంతియు ఘట్టముయొక్క విప్రుడుతీసుకొనుచుండెను. అంతట యితర బ్రాహ్మణు లాతని జూచి యీదానము తీసుకొని పాపమేల పొందుచుంటివని నుడివిరి. అంతనా ఘట్ట, విప్రుడిట్లు బదులు చెప్పెను. నాకు ప్రతిదినము యిదియే పని. నాకు దీని పాపమేమాత్రమును నంటజాలదు. ఏమందురా నేను గీతయొక్క తొమ్మిదవ అధ్యాయము ప్రతిదినము పఠించుచుంటిని. గీతా పారాయణచేత తామరాకునునీరెట్లంట జాలదో, అట్లే పాపమంట జాలదు. యిందువలన నేను నిర్భయముగా ఈదానము గ్రహించితి వని నుడివెను. అంతనా యితర బ్రాహ్మణులు గీతా 9 వ అధ్యాయము యొక్క మాహాత్మ్యమును వినిరి. గనుక నో బ్రాహ్మణుడా! నేనా చెట్టు మీద నుండి యిదియంతయు వినిన మాత్రమున నే నాకోతిజన్మ పోయి బ్రాహ్మణజన్మ కలిగెను.

---

## దశమోధ్యాయ ఫలస్తుతి.

ఓలక్ష్మి! యిక 10 వ అధ్యాయ మాహాత్మ్యమును జెప్పెద నాల కింపుము. కాశీపట్టణమందు ధీరజుడను బ్రాహ్మణుడుండెను. అతడు ప్రతి

దినము గంగానదియందు స్నానము చేసి విశ్వనాథ స్వామిని దర్శించుచు భగవద్భక్తుడై యుండెను. అతడు దీనులకు తనశక్తి కొలంది ధనము నిచ్చువాడు. ఇట్లు కొంతకాలము గడచిన తరి గ్రీష్మఋతువునందు ఒక నాటి మధ్యాహ్నసమయమున విశ్వేశ్వరుని దర్శించు నుద్దేశ్యముతో బయలుదేరెను. గాని ఆనాడు వడగాలుపు విస్తారముగా గొట్టుటచేత కాశీ విశ్వనాథుని ఆలయ సమీపము వరకు వచ్చు సరికి వడగొట్టి పడిపోయెను. ఇంతలో భగవంతుని కింకరుడైన భృంగీశ్వరుడు వెలుపలికి వచ్చి మూర్ఛను పొందియున్న బ్రాహ్మణుని చూచి పరమేశ్వరునితో నిట్లుచెప్పెను. ఓస్వామీ! ఒకవిప్రుడు తమదర్శనార్థమునకు వచ్చుచూ మార్గమధ్యమందు వడగొట్టి పడిపోయెను. గనుక యతని నుద్ధరించుడని చెప్పెను. యిట్లు భృంగి చెప్పిన మాట విని శంకరుడు ఏమియు జబాబు నుడువలేదు. తరువాత భృంగీశ్వరుడు మరల వెలుపలికి వచ్చి చూడుసరికి చచ్చి పడి యుండెను. అప్పుడు మరల ఈశ్వరుని దగ్గరకు వెళ్లి పరమేశ్వరా! ఆ విప్రుడు తమసమీపమున చనిపోయెను. కాన ఆతడెట్టి పుణ్యమును పొందు నని యడిగెను. అప్పుడు పరమేశ్వరు డిట్లు చెప్పెను. ఓభృంగీ! అతని పూర్వజన్మ వృత్తాంతమును చెప్పెద వినుము. కైలాస పర్వతము మీద పార్వతితో మేమొకదినమున కూర్చుని యుండగా ఒకహంసమాదర్శనము నకు వచ్చుచుండెను అది బ్రహ్మదేవునియొక్క వాహనము.బ్రహ్మలోకము నుండిమానస సరోవరమునకు పోవుచుండెను. ఆసరస్సునందు కమలములు చాలా అందముగా నుండెను. అపద్మముల మీద నుంచి ఎగురుచు తిరుగు చుండెగా ఒకపుష్పముయొక్క నీడ పడుట తోడనే అహంస మూర్ఛ పడెను. వెంటనే దాని శరీరము నల్లబడెను. ఇదంతయును మాగణము లలో నొకడు చూచి మాతో చెప్పెను. అప్పుడు మేమాహంసను ఎందు చేత నీవు నల్లబడితివని అడిగితిమి. అప్పుడు హంస యిట్లు చెప్పెను. ఓ స్వామీ! తమ దర్శనమునకు నేను బ్రహ్మలోకము నుంచి వచ్చుచూ మార్గమధ్యనున్న ఈసరస్సు మీదుగా రాగా అకస్మాత్తుగా నాశరీర

మంతయు నల్లనయ్యెను. కారణమేమియు గానరాదయ్యెగాని నేను హేతువును తెలిసి కొనుటకు ఆలోచించుచుంటిని. ఇంతలో నాకొలను నుండి ఈక్రింది వాక్యాలు విననయ్యెను. యేహంస మూర్ఛను పొంది నల్లనయ్యెనో దానికి కారణము నావలన వినదగును. అంత నేను ఆశబ్దము వచ్చిన దిక్కునకు పోగా అక్కడ అన్ని కమలములకన్న మిక్కిలి పెద్దది యగు పద్మము నన్నుగూర్చి యిట్లుచెప్పెను. ఓహంసా! నీవు భయపడ కుము. నీకు దీనివల్ల కీడేమియు గలుగజాలదు. వ్యర్థముగా చింతించకుము. ఓస్వామీ! అంత నేను పద్మము మాట్లాడుట విని ఆశ్చర్యముతో నిట్లంటిని నీవెవరవు? అంత నాపుష్ప మిట్లు చెప్ప దొడగెను. నేను పూర్వజన్మ మందు బ్రాహ్మణునికి కన్యకనై జనించితిని. నాకు వివాహమైన తరి అత్తవారింటికి బోయి కాపురము చేయుచు ఒకమైనపు గోరువంకను పెంచితిని. ఒకదినమున ఆగోరువంకను పంజరమందుంచి దానితో భగ వంతుని యొక్క నామము చెప్పుచుంటిని. ఇంతలో నాభర్త యింటికి రాగా నేను లేచుటనైనను మరచి గోరువంకతో మాట్లాడు చుంటిని. అంత నాభర్త కోపించి నన్ను మైనపు గోరువంకగా శపించెను. వెంటనే నేను గోరువంకనై అచ్చట నుంచి ఎగిరి ఎగిరి ఒకఋషి ఆశ్రమము చెంతకు బోతిని. అంత నాముని నన్ను ఆదరముతో చేరదీసి పంజర మం దుంచి పెంచు చుండెను. ఆఋషి ప్రతిదినము గీతా 10 వ అధ్యాయమును పఠించు చుండగా దాని నంతయును నేను వినుచుండెడి దానను. యిట్లు కొంతకాలమైన పిమ్మట విధిప్రేరణచేత నాజన్మను వదలి పద్మావతి యనెడి అప్సరసనై జనించితిని. యిట్లు కొంతకాలమైన పిమ్మట నేను మానస సరస్సునకు స్నానమునకు వచ్చి జలక్రీడ లాడు చుంటిని. ఇంతలో దూర్వాస మహర్షి వచ్చి జలక్రీడ లాడుచున్న నన్నుంగనెను. నేనును మునిని చూచుట తోడనే భయము చేత జలమునందే మరుగు పడి యుంటిని. అంత నామహర్షి కోపించి నన్ను 100 సంవత్సరములు ఈ సరస్సునందు పద్మముగా నిమ్మని శాపం బిచ్చెను. గనుక నోహంస

చంద్రిమా ! నేనా దూర్వాసుని శాపంబనుభ వించుచు కాలమును గడపు చుంటిని. నాకు ఈమనుష్యవాక్కులు వచ్చుటకు కారణము గీతా 10 వ అధ్యాయమును వినిన ప్రభావము చేతనే. నేను 100 సం॥ రములు ఈ శాప మనుభవించి స్వర్గమునకు బోవు చుంటినని చెప్పుచూ వెంటనే అప్సరస రూపముదాల్చి స్వర్గమునకు బోవుచూ ఓహంసా ! నీవు గీతా 10 వ అధ్యాయమును ఎప్పుడు వినెదవో అప్పుడు నీపూర్వ రూపము పొందగలవని చెప్పెను.

గనుక నోపరమేశ్వరా ! నాశరీరము నల్లనగుటకు ముఖ్యకారణ మిదియే. తమదర్శనముచేత నాపాపము లన్నియు పోయి పవిత్రతను పొందితి ననిచెప్పి యాహంస ఎగురుచూ బోయి ఒక వనమందు బ్రహ్మ జ్ఞాని యగు బ్రాహ్మణుని వలన గీతా 10 వ అధ్యాయమును వినెను. ఆప్రభావముచేత ఆహంస ఆజన్మను వదలి బ్రాహ్మణుడై జనించెను. ఓభృంగీశ్వరుడా! ఈచచ్చిపడియున్న బ్రాహ్మణుడే ఆహంస. పూర్వ జన్మమందు గీతా 10 వ అధ్యాయము వినిన ప్రభావముచేత నే ఏకాదశి యందు నాసమీపమున మృత్యువు గలిగినది. యిప్పుడీతడు స్వర్గమును గూర్చి పోగలడు.

---

## ఏకాదశోధ్యాయ ఫలస్తుతి.

ఓ లక్ష్మీ ! యింక 11 వ అధ్యాయము యొక్క మాహాత్మ్యమును వినుము. తుంగభద్రియను నగరమును సుఖానందుడను రాజు పాలించు చుండెను. ఆయన మిక్కిలి భగవద్భక్తుడు. ఆనగరము నందే విద్వాంసు డును ధనికుడు నైన బ్రాహ్మణు డొక డుండెను. ఆయన ప్రతిదినము గీతా 11 వ అధ్యాయమును పఠించువాడు. రాజున్ను నిత్యము అచ్చటకు వెళ్ళి వినుచుండు వాడు. యిట్లు కొంత కాలము గడచెను. రాజొకనాడు

గృహమున నుండగా చాలామంది అతిథులు దూరదేశము నుండి ఆయన యింటికి వచ్చిరి. అంత వారు రాజుతో యిట్లనిరి. ఓ రాజా! మేము యిచ్చట కొంతకాల ముండెదము. గాన మాకు నివసించుటకు తగిన స్థలమును యిప్పించ కోరెదము. అంతట రాజు వారి నొక భవనమందు నివశింప చేసెను. తరువాత వారికి తగిన సత్కారము నొనరించెను. దయా పాత్రుడైన నారాజు వారిని దర్శించుటకు కొంత పరివారముతోను కుమారునితో నక్కడకు వెళ్ళెను. రాజు వారిలో పెద్దవానితో మాట్లాడు చుండెను. కుమారు డచ్చట ఆడుకొనుచునే యుండెను. పాప నింతలో అక్కడ నివసించు చున్న దెయ్య మొకటి హఠాత్తుగా నా కుఱ్ఱవానిని చంపివైచెను. అంత నౌకరు లది చూచి గీతా శ్రవణము చేయుచున్న యా రాజునకు తెలిపిరి. రాజీవార్త వినిన వెంటనే పుత్ర మోహము చేత మూర్ఛ్యమును వహించి వారితో నిట్లనియె. మీ దర్శనము వలన నా కుమారున క కస్మాత్తుగా మరణము గలిగిన దనెను. అంత నా బ్రాహ్మణుడు రాజుతో నిట్లనెను. ఓ రాజా! నీకుమారుని చోటు చూపమని వారందరు కలసి అక్కడకు వెళ్లిరి. అప్పుడా బ్రాహ్మణు డిట్లనియె. ఓ ప్రేత స్వరూపా! నీవీ కుర్రవానిని జీవింపజేసితో నేను నీకు గీతా 11 వ అధ్యాయమును వినుపించెదను. అందువల్ల నీకును నీ విదివరకు చంపిన జీవులకును ముక్తి దొరకును. అదియును గాక నీ ప్రేత రూపమెత్తుటకు కారణం బెయ్యది? నేను తప్పక నిన్ను రక్షించెదను. అంత నాభూతము స్వామీ! మొదటి జన్మయందు బ్రాహ్మణుడను. ఒకదినమున నేనుపొలమును దున్ను చుండగా ఒక వృద్ధబ్రాహ్మణుడచ్చటికి వచ్చి పడిపోయెను. వాని కళ్ళ నుండి రక్తమువచ్చు చుండెను. ఒక గద్దవానినుండి మాంసమును తిను చుండెను. నే నిదంతయును చూచుచు నూరకుంటిని. ఈ బ్రాహ్మణుని విడిపించుటకు నాకు కొంచమైనను దయ గలుగలేదు. ఇంతలో మరియొక బ్రాహ్మణు డచ్చటికివచ్చి యిదంతయు చూచి పొలమును దున్నుచున్న

నన్ను చూచి యిట్లనెను. ఓరీ! నీవు ఎత్తినది బ్రాహ్మణ జన్మయే గాని నీ కృత్యము చండాల కృత్యము. నీ పొలము దగ్గర పడిన ఈవిప్రుని పక్షులు బాధించుచుండగా చూస్తూ కండ్లు పొరలు గప్పినట్లున్నావు. యిందువల్ల నీవు బహుపాపివి. అదియునుగాక ఎవడైనా ఒకడు ఎవని సొత్తైనను దొంగిలించి పోవుచుండగా చూచి పారిపోవువాడును దుర్బలరోగి మార్గమున పడియుండుట చూచి వానిసంగతి యింటిదగ్గర చెప్పని వాడును భూతవైద్యమునందు నిపుణుడయ్యును భూతముపట్టిన వానిని చూచి విడిపించని వాడును ఈ ముగ్గురును నరకము బొందుదురు. మరియు ఎవడు అన్నిప్రాణులను దయతో చూచునో వానిసహాయమును చేయునో వానికి అశ్వమేధ యాగము యొక్క ఫలము గలుగును. గనుక నీవు ఈ బ్రాహ్మణుని బాధించుచుండగా చూచుచున్నందున ప్రేతరూపమును బొందుదువని శపించెను. అంత నేను ఆయన పాదములబడి వేడుకొంటిని. మహాత్మా! నాకా ప్రేత రూపమెట్లు వదలును? అంతటాయన ఇట్లు నుడివెను. ఎప్పుడు నీవు గీత 11 వ అధ్యాయమును వినుదువో అప్పుడు నీకు విముక్తి గలుగును. యిట్లా ప్రేత రూపము తన పూర్వకథ చెప్పగానే బ్రాహ్మణుడు గీతా 11 వ అధ్యాయమును వినుపించి ప్రేతరూపమును బోగొట్టి రాజు కొమరుని కూడా బ్రతికించెను. అంతస్వర్గమునుండి విమానమును వచ్చెను. అపుడా వెనుకటి ప్రేతమిట్లనెను. రాజా! నీవు భగవద్భక్తుడవు. అంత రాజు తనకుమారుని మోహముచేత నిట్లనెను. నాయనా! నీవు నాతోనుండుము. అంతపుత్రుడిట్లనెను. రాజా! నేను నీకు కొన్ని సార్లు పుత్రుడను. నీవు కొన్నిసార్లు నాకు పుత్రుడవు. నేను నీకు పుత్రుడుగా పుట్టినందున ఈభూతము ధన్యురాలు. ఏమందురా యిది నన్ను చంపుటచేత మీరు గీతా 11 వ అధ్యాయమును పారాయణ చేయించినందువల్ల వానికి విముక్తి గలుగుటయే గాక నాకును ముక్తి దొరికినది. నేను వైకుంఠమును పొందగా నీకులముయొక్క 21 తరములవారు తరింతురని చెప్పగా, రాజు సంతోషించి వెళ్ళుటకానందించెను. అంత విమానము

నెక్కి స్వర్గమును బొందెను. అది లగాయితు రాజు విరక్తిని జెంది గీతా 11 వ అధ్యాయమును నియమముతో పఠించి అంత్యమందు పరమ పదవిని జెందెను.

---

## ద్వాదశోధ్యాయ ఫలస్తుతి.

శివుడు పండ్రెండవ అధ్యాయమును జెప్ప నారంభించెను. ఓ లక్ష్మీ! దక్షిణ దేశమందు ఖుదావందుడను రాజుండెను. అతని రాజ్య ప్రజలు సుఖవంతులై యుండిరి. దేశమంతయు ధర్మస్థాపితమై యుండెను. రాజు నివాస నగరము నందే అవంతుడను దుర్మార్గుడొకడుండెను. వాడు వ్యభిచరించు వాడును అసత్య వాదియునై యుండెను. వానికొక వేశ్యయు గలదు. వాడా వేశ్యతో ప్రతిదినము తాగుట, మాంసము దినుట, జూదమాడుటయును గలదు. వాడా వేశ్యను వెంట నిడుకొని ఆగ్రామములో నుండు అమ్మ వారి ఆలయమునకు బోయి విలాసవంతులతో క్రీడించుచు దుష్కృత్యముల జేయుచుండెను. ఈకృత్య మంతయు అక్కడ అమ్మవారికి పూజ చేయు బ్రాహ్మణుడు లేకుండుట చూచి చేయుచుండెడివాడు. యిట్లు కొన్ని దినములు గడచినవి. ఒకదినమా యర్చకుడు అమ్మవారిని పూజించి స్తుతిం చగా నాదేవి ప్రసన్నమై వరమును యిచ్చుటకు కోరుకొమ్మనెను. అంత నావిప్రుడు సంతసించి విశేష ధన లాభమును, సంతతిని కోరుకొనగా నాయమ్మవారిట్లు చెప్పెను. ఓ బ్రాహ్మణుడా! నీవు నా మందిరమునకు వచ్చుచున్న దుర్మార్గులైన వేశ్యను బ్రాహ్మణుని ఉద్ధరించిన నేను నీయిష్ట మును పూరించెదను. వారి నుద్ధరించుటకు నీకు సామర్థ్యము గలదనెను. అంత నావిప్రుడంగులకు సమాధానము చెప్పక అమ్మవారికి నమస్కరించి తనగురువు దగ్గరకుపోయి తనవృత్తాంతమంతయు చెప్పెను. గురువామాట లాలకించి శిష్యునితో నిట్లు చెప్పెను. నాయనా! మనమిద్దరము నారా

యణుని గూర్చి తప మొనరించ వలెనని ఒడంబడిచి వారిరువురును భగవంతుని గూర్చి తపమొనరించిరి. కొంతకాలమున కా భగవంతుడు ప్రత్యక్ష్యమై మీ రెందులకు తపము చేయుచుంటిరని ప్రశ్నించెను. అప్పుడు అర్చక బ్రాహ్మణుడిట్లు చెప్పెను. స్వామి! తమకు తెలియని సంగతిలేదు. అడిగితిరి గాన చెప్పెదను. నేను అమ్మవారిని గూర్చి తపసు చేయగా నామె నాకు అమూల్యవరము నిచ్చినది. గాని మొదట దురాచారు లయిన నా వేశ్యను బ్రాహ్మణుని నుద్ధరించు మనియు అందుకు తగిన సామర్ధ్యమునీదగ్గర నున్నదనియు నుడివెను. గాని వారి నుద్ధరించు నుపాయము తోచలేదని తన వృత్తాంత మంతయు చెప్పుకొనగా నా భగవంతుడు, ఓవిప్రుడా! చింతింపకుము. నీవు గీతా 12 వ అధ్యాయమును వారికి వినుపించిన యెడల వారికి సద్గతి గలుగు ననెను. భగవంతుని యొక్క మాటలువిని తనగురువుతో సహితము అమ్మవారి ఆలయమునకు వచ్చి దేవికి నమస్కరించి దేవీ ఆజ్ఞానుసారము దురాచారులైన వేశ్యా, బ్రాహ్మణుల కిద్దరికిని గీతా 12 వ అధ్యాయమును విను పింప మొదలిడెను. వారును శ్రద్ధగా వినుచునే యుండిరి. అట్లు అధ్యాయము సమాప్తి కాగానే వారిరువురును నిర్జీవులై భూమిని బడిరి. స్వర్గమునుండి విమానము వచ్చెను. అంతవారు దివ్య శరీరముల ధరించి విమానమెక్కి స్వర్గమునకు బోయిరి. అటుల వారు స్వర్గమునకు బోవుచుండగా చూచి అమ్మవారికి తనభక్తుడయిన విప్రునియందు విశ్వాసముదయించి ఓవిప్రుడా! నేను ప్రసన్నమయితిని. నేటినుంచి నేను వైష్ణవీదేవినయితిని. నేనీనగరరాజ్యమును నీకిచ్చుచున్నానని చెప్పి అంతర్ధానమును జెందెను. అంతట విప్రుడు తన యింటికి బోయెను. ఓలక్ష్మీ ! ఆనగర రాజునకు సంతానములేని కారణముచేత ఈ బ్రాహ్మణునే తన రాజ్యమునకు పట్టాభిషేకము చేసి తాను అరణ్యమునకు తపస్సుచేయుటకు బోయెను. యిచ్చట పూజారీ బ్రాహ్మణుడు సుఖముగా రాజ్యమును చేయుచుండెను.

———

## త్రయోదశోధ్యాయ ఫలస్తుతి.

ఓలక్ష్మీ! యిక 13 వ అధ్యాయ మాహాత్మ్యమును వినుమని చెప్పమొదలిడెను.

దక్షిణదేశమందలి హారినామ నగరమందు ఒక స్త్రీయుండెను. ఆమె వ్యభిచారిణియు వ్యసనశీలురాలును నైయుండెను. ప్రతిదినము క్రొత్తక్రొత్త పురుషులతో విలాసముగా కాలము గడుపుచుండెడిది. ఒకనాడొక నూతనపురుషునికి ఒక అరణ్య ప్రదేశమందలి సంకేత స్థానమునకు రమ్మనపని తాను అక్కడకుపోయెను. గాని వేరొక పని కారణమున నాపురుషుడచటికి రాకుండెను. అంతట నామె కామబాధ కోర్వలేక అటు నిటు తిరిగి గోదపెట్టి ఏడ్వ దొడగెను. ఆ ఏడుపును విని ఒక సింహమచటికి వచ్చి ఆమెను చంపి తినివైచెను. తదుపరి ఆమెను మరుసటి జన్మయందును వ్యభిచారియై జనించెను. ఆజన్మయందును అనేక దురాచారములు చేయుచుండెడిది. ఆమె నివసించు యింటికి సమీపమున నొకశివాలయ ముండెను. అచట నొక బ్రాహ్మణుడు ప్రతిదినమును గీతా 13 వ అధ్యాయమును పఠించువాడు. అట్లా బ్రాహ్మణుడు పారాయణ చేయుచుండుటగని ఆమెకును పఠన చేయుటకు బుద్ధికలిగెను. ఆమె అటునిటు తిరుగుచు సగము కథమాత్రె మచ్చుటచ్చట వినెను. చివరకామెకు పూర్తిగా వినవలెనని తలంపు కలిగి ఆమందిరములోనికి వెళ్లి కూర్చుండెను. అంత నాబ్రాహ్మణుడు పారాయణ చేయ మొదలిడెను. ఆమె మనస్ఫూర్తితో హృదయము నిలిపి వినుచునే యుండెను. అధ్యాయము పూర్తియగు సరికి ఆమె చేసిన సమస్తపాపములు నశించి శరీరమును వదలి విమానము మీద గూర్చుండి స్వర్గమునకు బోయెను.

---

# చతుర్దశోధ్యాయ ఫలస్తుతి.

మహారాష్ట్రదేశమందు ఒక బ్రాహ్మణు డుండెను. వాని భార్య జగడ మాడునదియు కఠిన హృదయురాలును వ్యభిచారిణియునై యుండెను. కాల కర్మ వశముచేత నొకరోజున ఆమెభర్త పరపురుషునితో నామె గ్రీడించుట గని మిక్కిలి కోపముతో వెనుక ముందు నాలోచించక కత్తితో నామెను ముక్కలు ముక్కలుగా నరికి చంపెను. ఆమె తన పాప కర్మానుసారము నరక మందు అనేక ఇడుముల బడి తిరిగి కుక్కయై జనించెను. ఒకరాజు యొక్క గృహమును కావలి కాయుచునుండును. బ్రాహ్మణుడును స్త్రీని చంపిన పాపము వలన మరుసటి జన్మమున కుందేలుగా జనించి ఒక అడవియందు పెరుగుచుండెను. యిట్లు కొంతకాలమైన వెనుక నొకరోజున రాజు కుక్కను తనవెంట నిడుకొని వేట నిమిత్తము అడవికిపోయి వేటాడుచుండెను. యింతలో హఠాత్తుగా కుందేలు యిటునటు దుముకు చుండుట చూచి పూర్వజన్మ వైరముచేత నాకుందేలును కుక్క చంపుటకు పరుగెత్తుచుండెను. ఆది చూచి రాజభటులును అల్లరిచేయుచు నాకుందేలువెంట పరుగులిడుచుండిరి. యిటుల విశేషముదూరము పరుగిడి ఒకతాపసి యొక్క ఆశ్రమము చెంతకు రాగా విశేషమైన అలసటచేత నాకుందేలు భూమిని పడి మరణించెను. కుక్కయును మిక్కిలి అలసట జెందిన కారణంచేత నదియును గుండె పగిలి చచ్చెను. ఇటుల నారెండు జంతువులు ఒకేస్థానమున మరణించెను. ఆచోటున ఆఋషి ప్రతిదినము తనపాదములను కడుగుకొనుచుండువాడు అందువలన నా రెండు జీవులు స్వర్గమునకు బోవుటకు విమానమురాగా అందున గూరుచుండి స్వర్గమునకు బోయెను. ఇది యంతయు ఆఋషి చెంత వేరొక రాజు గూరుచుండి చూచి ఆశ్చర్యమును జెంది యా ఋషి నడిగెను. ఓ ఋషిచంద్రమా! ఈ రెండు జీవులును స్వర్గమునకు బోవు

టకు కారణము చెప్పుమనగా నా ఋషి చెప్ప దొడగెను. ఓ రాజా! నేను ప్రతిదినము గీతా 14 వ అధ్యాయమును పఠించు చుంటిని. ఆరెండు జంతువులు మరణించిన చోటున నేను ప్రతిదినము కాళ్ళుకడుగు కొను చుండెడి వాడను. ఆకారణంచేత నారెండు జీవులకు స్వర్గఫలము దొరకె ననెను. అంత నారాజు మిక్కిలి ఆనందపడి అప్పుడు ముని దగ్గర గీతా 14 వ అధ్యాయము నుపదేశమును పొంది ప్రతిదినము పారాయణ జేయుచు అంత్యమందు స్వర్గమును బొందెను.

---

## పంచదశోధ్యాయ ఫలస్తుతి.

దక్షిణ దేశమందు పద్మనాభుడను రాజు పాలించు చుండెను. అతని దగ్గర కొందరుమంత్రిలుండిరి. వారిలోనొక మంత్రికి, రాజునుచంపి రాజ్య మపహరించ వలెనని తలంపు గలిగియుండెడిని. కాని ఈశ్వర ప్రేరణచేత ఆ మంత్రియే మరణించెను. వాడు నీచమైన తలంపు గలిగిన హేతువు చేత గుఱ్ఱపు జన్మయందు పుట్టవలసి వచ్చెను. గుఱ్ఱపు వర్తకుని యొద్ద నున్న గుఱ్ఱమునకు పుట్టి పెరుగుచు సుందరముగా నుండెను. అంత నావర్తకుడు దానిని పద్మనాభుని దగ్గరకు తెచ్చి చూపగా నారాజు దాని యందమున కచ్చెరుపడి దానిని పరీక్షకులకు జూపెను. వారు దాని లక్షణములు పరిశీలించి రాజును తీసుకొమ్మనిరి. పద్మనాభుడు ఆ వర్తకునికి విశేష ధనమునిచ్చి దానిని కొనెను. ఒక దినమున రాజు ఆ గుఱ్ఱము నెక్కి వేటకు బోయెను. అరణ్యమందు ఒక లేడిని తరుముకొనుచు బహు దూరము పోగా నాలేడి అడవియందు కనబడక అదృశ్యమయ్యెను. అంత రాజు చాల డస్సియున్నవాడు గావున వేట చాలించి దప్పికచేత నీరుండు తావు వెదకుకొనుచు బోయెను. మార్గమున రాతిపలక ముక్క మీద గీతా అధ్యాయ సగ శ్లోక ముండుట

చూచి రాజు దానిని చదువగా దానిని గుఱ్ఱము విని శంటనే క్రిందబడి మరణించెను. గుఱ్ఱము నిష్కారణముగా మరణించి నందులకు రాజునకు చాలా ఆశ్చర్యము గలిగెను. విచారమును గలిగెను. అంతట నారాజు కేమియు తోచక తిరిగి తిరిగి ఒక ఋష్యాశ్రమమునకు బోయి గుఱ్ఱము యొక్క మరణ హేతు వడిగెను. ఋషి రాజుని జూచి, రాజా! ఈగుఱ్ఱము వెనుకటి జన్మయందు నీయొక్క మంత్రియై యుండి నిన్ను చంపి నీరాజ్య మపహరించు నుద్దేశ్యముతో నుండెను. గాని దైవ ప్రేరణచేత నతడే మరణించి గుఱ్ఱమై పుట్టి నీకు వాహనమై బరగినది. అరణ్యమందు నీవు రాతిముక్క మీద వ్రాసియున్న గీతా 15 వ అధ్యాయములో సగ శ్లోక మును నీవు చదివిన మాత్రమున అది విని దాని పాపమంతయు నశించి స్వర్గమునకు బోయినదని ముని చెప్పగా రాజు మిగుల ఆశ్చర్యమును జెందెను. తదుపరి రాజు గీతా 15 వ అధ్యాయమును ఆ ఋషి వలన నుప దేశమును పొంది నగరమునకు మరలి వచ్చి తన రాజ్యమంతయు తన కుమారునికి నిచ్చి తాను అరణ్యమునకు బోయి ఈశ్వరుని నుపాసించుచు గీతాధ్యాయమును పఠించుచు దేహాంతమున స్వర్గమును జేరెను.

---

## షోడశోధ్యాయ ఫలస్తుతి.

ఓ లక్ష్మీ! మహారాష్ట్ర దేశమందు ఖడ్గ బహాదురుడను రాజు రాజ్యము చేయుచుండెను. ఒకరోజున వాని ఏనుగుల మహాలునుంచి ఒక మదించిన ఏనుగు చెదరి పారిపోవుచుండెను. అప్పుడు మావటి వాండ్లు దానిని పట్టుకొనుటకు ప్రయత్నించిరి. గాని అది మరింత చెదరి చిందర వందరగా పరుగులెత్తుచుండెను. అంత నానగరి జనులుతమ పిల్లల కాపాడు కొనుటకు చింతించు చుండిరి. ఆ సమయమునసే ఒక బ్రాహ్మణుడు స్నాన మాచరించి గీతాపారాయణ చేసుకొనుచు బోవుచుండెను. జనులు

వానిని జూచి ఈ మార్గమున బోవలదనియు, యేనుగు వల్ల నపాయము గలుగుననియు చెప్పిరి. వారి మాటలు పెడచెవిని బెట్టి గీతాధ్యాయమును చదువుచు బోవుచుండెను. అంత నాబ్రాహ్మణుడు ఆ యేనుగుదగ్గరనుంచి తన యింటికి బోయెను. గాని ఏనుగేమియు నతనిని చేయ జాలదయ్యెను. ఏనుగు యొక్క ఈ వింతను జూచి జనులు ఖడ్గబహాదురునితో జెప్పిరి. రాజు వారి మాట లాలకించి పండితులందరును నుండగా ఆ బ్రాహ్మణుని పిలిపించి నిట్లడిగెను. ఓ విప్రుడా! మీదగ్గర మంత్రసిద్ధి గాని లేక ఏదైన మాయ గాని యుండవచ్చును. గనుక నే ఏనుగు దగ్గరనుంచి వెళ్లి నప్పటికి అది మిమ్మేల నేమియు చేయలేదనెను. అప్పుడు బ్రాహ్మణుడు రాజును జూచి యిట్లనెను. రాజా! నాదగ్గర మంత్రసిద్ధి గాని మాయ గాని లేదు. నేను నిత్యము గీతా 16 వ అధ్యాయమును పఠించుచుంటి ననెను. అంతట రాజాబ్రాహ్మణునికి కొన్ని మోహరీల నిచ్చి యింటికి పంపివేసెను. తరువాత రాజును నొక బ్రాహ్మణుని వల్ల గీతా 16 వ అధ్యాయము నుపదేశమును పొంది నిత్యము పఠించుచుండెను. ఒకనాడా రాజు వేటకు బోగా యింటిదగ్గర నాయేనుగు మరల అల్లరి చేయ నారంభించెను. మంత్రిలును ప్రజలును భయపడి ఈవార్త రాజు దగ్గరకు బోయి తెలిపిరి. అప్పుడు రాజుస్వయముగావచ్చి ఏనుగునుపట్టుకొనెను. గాని అది ఏమియు చేయలేను. అంత దానిని మావటి వాళ్లకు నప్పగించి, తన రాజ్యమందు తన కుమారునికి పట్టాభిషేకము చేసి తాను అరణ్యమునకు బోయి గీతా 16 వ అధ్యాయమును పఠించుచు అంత్యమందు అక్షయ లోకమున కేగెను.

---

## సప్తదశోధ్యాయ ఫలస్తుతి.

ఓలక్ష్మీదేవీ! 16వ అధ్యాయమందు చెప్పబడిన ఖడ్గబహాదురుడు స్వర్గమునకు బోగా నతని యొక్క కుమారుడు అనగరమునందు రాజ్యము

చేయుచుండెను. ఒకదినమునమనుశ్యాసనుడను నొకనాకరు అమదించిన ఏనుగు నెక్కి సవారి చేయుటకుప్రయత్నించుచుండెను. ప్రజలు వాని కృత్యమును జూచిఏనుగు నెక్కవలదనియు ఎక్కినకీడువాటిల్లుననియుచెప్పిరి. వారెంత చెప్పినను వినక ఏనుగు దగ్గరకు బోయి ఎక్కుటకు లగాముమీద కాలు పెట్టగానాయేనుగు తనతొండముతోనాతనిని దూరముగా గిరట వైచెను. వాడు వెంటనే నెత్తురులుగ్రక్కి మరణించెను. మరుసటి జన్మయందు సింధు దేశపు రాజునకు కుమారుడై జన్మించెను. సింధుదేశపు రాజునకును ఖడ్గ బహాదురుని కుమారునికిని మైత్రి గలిగియుండెను అందువలన నామదపు టేనుగును సింధుదేశమునకు తోలివైచెను. అక్కడ కొంతకాలమునకు నాయేనుగు ముసలిదై జబ్బుపడగా రాజు అనేక వైద్యములు చేయించెను. గాని కొంచెమైనను గుణము కనుపించలేదు. ఏనుగు మిక్కిలి దుఃస్థితిలో నుండి తన యవసాన సమయమున మనుష్య వాక్కుతో రాజును చూచి యిట్లు పలికెను. ఓరాజా! మందుల వలన నాకు ఈరోగము కుదుర జాలదు గాని మీరు ఏబ్రాహ్మణుని వల్లనైనను గీతాధ్యాయమును విని పించిన యెడల నేను శరీరము విడిచి స్వర్గమును పొందుదునని వేడెను. అంతట రాజు వెంటనే నొక బ్రాహ్మణుని పిలిపించి గీతా 17 వ అధ్యా యమును వినిపించగానే ఏనుగు స్వర్గమునకు వెళ్లెను.

---

## అష్టాదశోధ్యాయ ఫలస్తుతి.

ఓ లక్ష్మీ! యిక 18 వ అధ్యాయ మాహాత్మ్యమును చెప్పెద. నదు లన్నిటికంటె గంగానది ఎటుల పుణ్యమైనదియో నట్లే అన్ని అధ్యాయ ముల కంటె 18 వ అధ్యాయము మిక్కిలి పవిత్రమైనది. మేరువు పర్వ తము నందలి అమరావతీ పురమునందు యింద్రుడు శచీదేవితోడను 33 కోట్ల దేవతలతోడను కొలువు దీర్చియుండగా, 100 నేత్రములు గలిగి

మిక్కిలి తేజోవంతుడైన ఒక పురుషు డాసభ కరుగు దెంచెను. ఆపురుషుని జూచి దేవత లందరు ఆదరిపడిరి. దేవేంద్రుడు సింహాసనము నుండి దిగి దూరముగా పారిపోయి చాటునుండి చూచుచుండెను. అంత దేవతలు ఆనూతన పురుషుని దెచ్చి శచీదేవి యొక్క సరసను గూర్చుండ బెట్టిరి. అప్పుడు దేవతలు పుష్పవర్షమును గురిపించిరి. గాయకులు పాడిరి. రంభాది అప్సరసలు నాట్యమాడిరి. ఇది యంతయును జూచి ఇంద్రుడాశ్చర్యపడి తొట్రుపాటుతో బృహస్పతి యింటికి బోయి జరిగిన దంతయు బృహస్పతితో చెప్పి మరల యిట్లనెను. ఓ గురూత్తమా! నేను 100 అశ్వమేధ యాగములు చేసి ఈ ఇంద్ర పదవిని పొందితిని. గనుక నాకన్న ఆ పురుషున కేపుణ్యముచేత ఇంద్రత్వము ప్రాప్తించె నని యడుగగా నాదేవ గురువిట్లుచెప్పెను. ఓఇంద్రుడా! భియపడకుము. ఆపురుషుడు కడు పుణ్యశీలుడు. ఎట్లందువా ? అతడు నియమముగా శ్రీ గీతా 18 వ అధ్యాయమును ప్రతిదినము పఠించువాడు. గీతా 18 వ అధ్యాయము మిక్కిలి పవిత్రమైనది. యిందువల్ల నతనికి ఇంద్రత్వ మొచ్చె ననియు, నీ పుణ్యము క్షీణమైన దనియు చెప్పెను. వెంటనే ఇంద్రుడు బృహస్పతి వల్ల గీతా 18 వ అధ్యాయము నుపదేశమును పొంది గోదావరీ తీరమందు పఠించు చుండగా నతని పాపసంతతియు నశించి అచిరకాలముననే తన ఇంద్రపదవిని పొందెను.

———



ఓమ్

శ్రీశివాభ్యాం నమః

శ్రీమతే గణాధిపతయే నమః.

శ్రీమచ్ఛ్రీకంఠాచార్యకృత

# శ్రీభగవద్గీతాభాష్యమ్.

—• ప్రారభ్యతే •—

శ్లో॥ ఓంనమో ఒహంపదార్థాయ లోకానాం సిద్ధిహేతవే ।
సచ్చిదానన్దరూపాయ శివాయ పరమాత్మనే॥ ౧

శ్లో॥ నమః శ్వేతాభిధానాయ నానాగమవిధాయినే ।
కైవల్యకల్పతరవే కల్యాణగురవే నమః ౨

శ్లో॥ పార్థాయ ప్రతిబోధితా భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితా పురాణమునినా మధ్యే మహాభారతే।

అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీ ।
మంబ! త్వాంమనసా దధామి భగవద్గీ తే! భవద్వేషిణీమ్॥ 3

—♦ శ్రీకణ్ఠ భాష్య ప్రారంభః ♦—

యత్కృష్ణార్జునతః ఖ్యానం శివమో స్తత్సమీర్యతే సంజయో ధృతరాష్ట్రాయ భాష్యం తత్త్రైకదర్శనమ్॥ గాయత్ర్యర్థో క్తిలో గీతాత్రాఽఽద్యే బంధునాశతః। నమోత్స్యేఽహం విషాదేన త్వర్జునో క్తిర్నిరూప్యతే।అథోపక్రమోపసంహారాది షడ్విధశాస్త్ర సిద్ధాన్తార్థ ప్రత్యాయకలింగై రవధారితం స్వరూపలక్షణం తావద్ధ్యాన విషయత్వే నాహ - పార్థాయేతి తత్రితావ ద్భగవతా నారాయణేన తత్స్వరూపేణ కృష్ణేన స్వయమేవ పార్థాయార్జునాయ ప్రతిబోధితా భగవత శ్శివస్య గీతేయం కథితేత్యర్థః ఏవం మధ్యే మహాభారతే పురాణ మునినా ఽష్టాదశపురాణకర్త్రా మునినా వేదవ్యాసేన గ్రథితా చతుర్విధవేదార్థవత్త్వేన శృంఖలయా రచితేత్యర్థః। ఏవం సజాతీయాది త్రివిధభేదవర్జితం శివమద్వైతం తురీయం మన్యంత ఇత్యాదిశ్రుతివేద్యాఽద్వైతామృతవర్షిణీ మిత్యర్థః। ఏవంభవస్య జన్మమరణాదిలక్షణస్య సంసారస్య ద్వేషిణీం నివర్తనీంచ, హే అంబ! చిదంబరశక్తిరూపే! త్వాం సవితుర్వరేణ్యామివ సదా శివార్థశరీరిణీం మనసా దధామి ధారయామ ఇత్యర్థః॥ ౧

శివాభ్యాంనమః.

—♦ ల ఘు టీ ప్ప ణీ ♦—

గాయత్రీం మనసా ధ్యాత్వా శివశక్తిస్వరూపణీమ్ శ్రీకంఠం చ శమాచార్యం వ్యాసతత్వ విమర్శకమ్॥ మద్గురుం భాష్యకర్తారం తనోమి లఘుటిప్పణీమ్ । విశ్వేశ్వరశివాచార్యస్త చ్ఛిష్యోఽహం సతాంముదే యచ్చకించేతి యత్రోప్తం యో వేదేత్యత్ర దర్శితమ్। యత్రైతమేతి శ్రుత్యుక్తం తత్సర్వం త్విహ దర్శయే॥ నన్విహ గీతామాత్రేణ కిం వర్ణ్యత ఇత్యాహ-శివయోరితి॥ యస్య సా పరమా దేవి శక్తి రాకాశ సంజ్ఞితా । అనన్తైశ్వర్యయోగాత్మా మహేశో దృశ్యతేకిలం॥' ఇతి స్మృత్యంతరా ద్భవనోః ప్రభేవ తత్సాహిత్యదర్శనాదితి భావః॥౧॥ నన్విహ సంజయో ధృతరాష్ట్రాయ యద్గీతామాత్రే ణోక్తవాం స్తత్కిమిత్యాహ॥ గాయత్ర్యర్థే॥ తథా చ గాయన్తం త్రాయతే యా సా గాయత్రీ తత్రి చ శివశక్త్యోః కీర్తనా దిహాఽపి తత్కీర్తన స్యావశ్యకత్వ మిత్యాశయః॥౨॥ షడ్విధేతి॥ తద్యథా॥ ఉపక్రమోపసంహారా వభ్యాసా పూర్వతా ఫలమ్ । అర్థవాదో పపత్తిశ్చ లింగం శాస్త్రార్థనిర్ణయే॥ ఇత్యాద్యర్థవిశేషే ణాష్టాదశే వక్ష్యతే॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఇందుఁ గృష్ణార్జునులని చెప్పుటవలనఁ బార్వతీపరమేశ్వరులనియు సంజయుఁడు ధృతరాష్ట్రుని కొఱకుఁ బార్వతీ పరమేశ్వరుల తత్త్వమును బోధించెననియు నర్థము. అనఁగా గ్రుడ్డివాఁడైన ధృతరాష్ట్రునకునజ్ఞానాంధకారమును దొలగించి జ్ఞానప్రకాశమును గలిగించె ననియునుగ్రాహ్యము. "యచ్చ కించిత్, యోవేదాదౌ యత్రైతమేతి" అను శ్రుతుల యభిప్రాయ మీగీతయందుఁ జూపబడును. గీత యనఁగా గాయత్ర్యర్థమును బోధించునది. అందు మొదటి యధ్యాయమున బంధువులందఱునునశింతురను కారణమున యుద్ధమును జేయ నిచ్చగింపని యర్జుని విషాదము

(అర్జునునివిషాదయోగము ప్ర.అ.) నిరూపింపఁబడుచున్నది. గీతామాత్రము
చే నించెద్ది వర్ణింపఁబడునది యనఁగా, చిదాకాశ రూపమైన యేశక్తి యెవ
నికి నర్ధాంగినిగానుండునో యాశక్తివలనఁ బరమేశ్వరుండద్వితీయ వైభవము
గలవాఁడనియు గాయత్రీవల్లభుండగుటవలన సర్వదేవ శ్రేష్ఠుఁడు
శివుడనియు తెలియఁగవలెను. శ్లో॥ "చితాభస్మాలేపో గరళ మశనందిక్పట
ధరో।జటాధారీ కణ్ఠే భుజగపతిహారే పశుపతిః కపాలీ భూతేశో భజతి
జగదీశైకపదవీం। భవాని! త్వత్పాణిగ్రహణ పరిపాటీఫలమిదమ్॥ ౧॥
వృషో వృద్ధోయానం విషమశన మాశానివసనం శ్మశానం క్రీడాభూ
ర్భుజగనివహో భూషణ విధిః। సమగ్రా సామగ్రీ జగతి విదితైవ స్మరరిపో
ర్యదేవస్యైశ్వరం తవ జనని సౌభాగ్య మహిమా"॥ ౨॥ అని కవులు
వర్ణించుటవలన గాయత్రీరూపపరాశక్తియె జగదంబ యనియు సూర్యు
నకుఁ బ్రభవలె శివశక్తులకు నవినాభావసంబంధము గలదనియు (అనగా
శివుఁడులేకశక్తియు శక్తి లేక శివుఁడును లేడనియు) "శివశ్శక్త్యా యు
క్తో యది భవతి శక్తః ప్రభవితుమ్" అనెడి స్మృతిని బట్టిశక్తిలేని శివుఁడు
సామర్థ్యవిహీనుఁడనియును దెలిసికొనవలెను. "న గాయత్ర్యాః పరం
మంత్రి" మనుటవలన గాయత్రియుత్కృష్టత్వము సూచింపబడును. అట్టి
గాయత్రీశక్తి త్రిగుణాత్మిక యైన మాయాశక్తియై యిరువదియేడు గుణ
ములుగలిగి సర్వప్రపంచ రూపమైన పరాశక్తియై మహాదేవునకు భార్యయై
యున్నందువలన "సకలచిదచిత్ప్రపంచాకారపరాశక్తి విశిష్టాద్వితీయ
వైభవః పరమేశ్వరః" అని విశిష్టాద్వైతము సాధింపఁబడును. కావుననే
"విశిష్టాద్వైతం సాధయామః" అని శ్రీకంఠాచార్యులు సూత్రభాష్య
మున వ్రాసిరి. వీరియభిప్రాయమే కాదు, సూత్రకారులగు, వ్యాసుల
యాశయమును నిదియ. అనగా, విశిష్టాద్వైతమే. ఎట్లనఁగా, సూత్రకారుడు
"జన్మాద్యస్య యతః" అను సూత్రమున బ్రహ్మమునకు సగుణత్వమును
విశిష్టాద్వైతమును వ్యక్తముగా నిరూపించెను. మఱియు గాయంత్రం

త్రాయతే యా సా గాయత్రి' అని గాయత్రీశబ్దవ్యుత్పత్తిని జెప్పి యుపాసనా భాగమందు గాయత్రికంటె గొప్పమంత్రము లేదనియును వచించెను. అట్టి గాయత్రీమంత్రమందు పార్వతీపరమేశ్వరులే చెప్పం బడిన కారణమున గాయత్ర్యర్థమును బోధించెడు గీతయందును వారినే వర్ణించుట యావశ్యకమైనది. నారాయణ స్వరూపుడైన కృష్ణుఁడు అర్జునునికొఱకు భగవంతుఁడైన శివునిగీత నుపదేశించెను. ఇట్టిగీత అష్టాదశ పురాణకర్తయైన వ్యాసునిచేత మహాభారతమునందుఁ జేర్పఁబడియున్నది. అష్టాదశపురాణము లెవ్వియన:—౧ మత్స్యపురాణము. ౨ మార్కండే యము. ౩ భవిష్యత్పురాణము. ౪ భాగవతము. ౫ వామనము. ౬ విష్ణు పురాణము. ౭ వరాహపురాణము. ౮ బ్రహ్మాండపురాణము. ౯ బ్రహ్మ వైవర్తపురాణము. ౧౦ బ్రాహ్మపురాణము. ౧౧ పద్మపురాణము. ౧౨ ఆగ్నేయపురాణము. ౧౩ నారదపురాణము. ౧౪ శైవపురాణము ౧౫ లింగపురాణము. ౧౬ గరుడపురాణము ౧౭ కూర్మపురాణము ౧౮ స్కాందపురాణము. ఉపపురాణములును బదునెనిమిదిగలవు. ఏత త్పురాణకర్తచే నీగీత చతుర్విధవేదార్థ సారముగాఅష్టాదశపురాణముఁతో గొలుసువలె రచింపఁబడినది. సజాతీయాది భేదత్రియమనఁగా ౧ ఒక మనుష్యజాతియందు బ్రహ్మక్షత్రియవైశ్య శూద్రులని భేదములు గల్పించు కొనుట సజాతీయభేదము, ౨ దేవమనుష్య పశుపక్ష్యాది నానాభేదములు దోఁచుట విజాతీయభేదము. ౩ ఒకశరీరమున శిరోబాహు పాదాదిరూప మైన యవయవభేదము దోఁచుట స్వగతభేదము. ఇట్టి భేదత్రియము లేక "శివ మద్వైతం తురీయ" మను శ్రుతినిబట్టి యద్వైత మనఁగా శివుఁడు అట్టి శివుని యమృతమును (శివతత్త్వామృతమును) వర్షించునదియును జననమరణాది లక్షణములుగల సంసారమును బోగొట్టునదియుఁ జిదా కాశశక్తిరూపమైనదియు నైన యో యమ్మా! సూర్యునకుఁ బ్రభవుఁడై సదాశివునకు నర్ధాంగినిఁగా నిన్ను మనస్సున ధరించుచున్నాడను.

శ్లో॥ సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః
పార్థో వత్సస్సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతంమహాత్ ॥౭

—♦ భా ష్య మ్ ♦—

నన్విద మద్వితీయం శివతత్త్వ మమృతాఖ్యం కథం లభ్యమి త్యత స్తన్నిర్మథనప్రకార మప్యాహ ॥సర్వ ఇతి॥ తత్ర తావ త్సర్వోపనిషదో గావో నామ గోసదృశా స్తథాగోపాల నన్దనః కృష్ణో దోగ్ధా తత్సదృశః పార్థస్తు వత్సో వత్ససదృశ ఇత్యర్థః। ఏవం శమదమాది షట్కసంపత్త్యా యమనియమా దినా చ శోభనా నిర్మలా బుద్ధి ర్యస్య స సుధీ ర్భోక్తే త్యేవం సాధనసంఘాతైః పర్యవసితే వేదచతుష్టయార్థాను గృహీతగాయత్ర్యర్థ గర్భితత్వాత్ దుగ్ధం గీతామృతం శివ మద్వైతం మహదితి తత్సర్వైరపి ముముక్షుభిగ పేయ మిత్యర్థః ॥ ౭॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

శివ మద్వైతమితి॥ నన్వేవం శివయో స్తత్త్వం సమీర్యత ఇత్యుక్తం తత్కథంసజాతీయాది త్రివిధభేదవర్జితాద్వైతసిద్ధి రితిచేచ్ఛృణు, తద్యథా న హి విజ్ఞాతు ర్విజ్ఞాతే ర్విపరిలోపో విద్యతేఽ వినాశిత్వాన్న తతో ద్వితీయ మస్తి యతోఽన్యద్విభక్తం విజానీయా దితి బృహదారణ్యకశ్రుతే ర్వహ్నేర్య ద్యుష్ణవ దభేద శక్తి ప్రతీతే రితి భావః॥ ౭॥

—♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఇట్టి యద్వితీయమగు నమృత మనెడి శివతత్వమెట్లు లభ్య మగు ననఁగా దాని మథన ప్రకారమును జెప్పుచున్నాఁడు-ఉపనిషత్తు లన్నియు

గోవులవంటివి. గోపాల నందనుఁ డగు కృష్ణుఁడు పితుకువాని వంటివాఁడు. అర్జునుఁడు లేగవంటివాఁడు. శమదమాదులు అష్టాంగయోగములు లోనగు వానిచేత మోక్షమును సాధించుబుద్ధి గలవాఁడు భోక్త. ఇట్టి సాధనముల చేత నిశ్చయింపఁబడినదికాఁగాఁ జతుర్వేదార్థసారమైనదియు గాయత్రీ గర్భితమైనదియు శివాద్వైత స్వరూపమైనదియునగు గీతామృత మనెడు పాలు ముముక్షువులందఱును ద్రాఁగఁదగినవి. సజాతీయాది త్రివిధభేద రహితుఁడైనశివునకు శక్తివిశిష్టత్వమం దద్వైతసిద్ధి యెట్లనఁగా. యతోఽన్యద్విభక్తం విజానీయా' త్తను బృహదారణ్యకశ్రుతిని బట్టి యగ్నియందలి యుష్ణత్వశక్తి, యగ్నికంటె భిన్నము గాదు. కానన ద్వైతమునకు హానిలేదు. (శివత్వమునకు హానిలేదు.) ౨.

శ్లో॥ వ్యాసోఽ స్యా ఋషి రాఖ్యాతశ్ఛందోఽనుష్టు ప్ప్రకీర్తితః।
పరమాత్మాదేవా తా చాత్రాఽశోచ్య త్వేవినియోజనమ్॥

—◆ భా ష్య మ్ ◆—

న న్వసంకీర్తయ్యయదామనీ త్రిత్యాదిస్మృత్యాఋష్యాదేః కీర్తన స్యావశ్యకత్వా దాహ-వ్యాస ఇతి॥ తత్ర తావదస్య శాస్త్రస్య ప్రవర్తకత్వాత్ ఋషి ర్వేదవ్యాసః తథోక్తాత్యుక్తేత్యాది చతుర్వింశతిచ్ఛందసాం మధ్యేఽనుష్టుభో గరిష్ఠత్వే నానుష్టుప్ఛందః । తథాఽనయా గీతయా ప్రతిపాద్యా కా దేవతా? యయా శివరూపామృతత్వోపలబ్ధి రిత్యస్యావశ్యం వక్తవ్యత్వేన పరమాత్మ చిదంబరశక్తి ర్దేవ తే త్యర్థః ఏవ మిహార్జునస్య తథాఽన్యేషాం చ జన్మమరణాది సంసృతి సంకట నివృత్తిపరియోజకత్వే నాశోచ్యత్వే చ వినియోజనం విని యోగ ఇత్యర్థః॥ ३॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

అసంకీర్త్యేతి॥ తదుక్తం 'అసంకీర్త్య యదా మన్త్రి ఋషి శ్ఛందశ్చ దైవతమ్। న సమ్యక్ఫలద స్తస్యనిగదోఽప్యర్థ పూర్వకః' ఇత్యాద్య వధార్యమ్॥ కా దేవతేతి॥ తత్ర సర్వే వేదా స్సర్వాణి శాస్త్రాణి సమా ప్యన్తే పశ్చాచ్చ తదుపదేశా న్నిష్కళ పరిజ్ఞానమపీతి సర్వ మత్ర తత్ర తతాధ్యాయే నిరూపయిష్యామః॥౩॥

## —♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఉపాసకుఁడు జపించు మన్త్రమునకు 'ఋషి' ఛందస్సు, దేవత నుచ్చరింపకయు, మన్త్రార్థమును తెలిసికొనకయు నున్నచో, నామంత్రము వానికి ననుకూలఫలమీయని కారణమున ఋష్యాదిపరిజ్ఞాన మావశ్యకము గానఁ జెప్పుచున్నాఁడు. ఈ గీతాశాస్త్రమును, రచించినవాఁడు గావున వేదవ్యాసుఁడు ఋషి, ఇరువదినాలుగు ఛందస్సులలో ననుష్టుప్ఛందస్సు గొప్పదగుటచేత నీఛందస్సుచేతనే గీతచెప్పంబడుట వలన ననుష్టుప్ఛందస్సు, దేవత యెద్ది యనఁగా, నేదేవతచే శివరూపమైన యమృతత్వ ప్రాప్తి కలుగునని యవశ్యముగాఁ జెప్పఁ బడుకటతన నాపరమాత్మ స్వరూపురాలగు చిదంబరశక్తియే దేవత; సర్వవేదములు సర్వశాస్త్రములు నే గీతయందు లీనములైయున్నవో యట్టిగీతయందు నక్కడక్కడ నిష్కళ శివజ్ఞానమును నిరూపింపఁగలము. ఇట్లర్జునునకును నితరులకును జననమరణరూప సంసార సంకటము పోవుట ప్రయోజన మగుటవలన దుఃఖము లేకుంటకొరకు దీనిని వినియోగించుటయే వినియోగము. ౩॥

పూర్వపీఠికా సమాప్తా.

---

ఓమ్.

# శ్రీమచ్ఛ్రీకంఠాచార్య కృతే

# శ్రీభగవద్గీతాభాష్యే.

## అర్జున విషాదయోగః.

ధృతరాష్ట్ర ఉవాచ:—

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః॥
మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సంజయ!॥ ౧।

—◆ భాష్యమ్ ◆—

అథ ఖల్వఖిలపరమార్థమూలేషు ధర్మ ఏవ సకలమూల భూత స్తజ్జన్యార్థకామమోక్షాన్తా భవన్తీ త్యభిప్రేత్య గీతా మృతం వక్తుం ప్రతిజానీతే - ధర్మక్షేత్ర ఇతి ॥తథా చ॥ "యదను కురుక్షేత్రం దేవయజనం సర్వేషాం భూతానాంబ్రహ్మ సదన" మిత్యాదిశ్రుత్యా "లంకేశ్వరాత్సమారభ్యసుమేర్వవధి మావహా న్మధ్యే నేమి స్సమాఖ్యాతా కురూణాం యతో చాహావః" ఇత్యాదిస్మృత్యా చ ధర్మక్షేత్రే కురుక్షేత్రే మామకా దుర్యోధనాదయః పాండవా శ్చ సమవేతా ఏకత్రీ

భూతా స్సన్తో యోద్ధు మిచ్ఛవగ కిమకుర్వ తేతి సంజయం పృత్యువాచేత్యర్థః ॥ ౧॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

ధర్మ ఏవేతి॥ తద్యథా, 'ధర్మాత్ప్రవర్తతే లోకో ధర్మాత్స్వర్గః ప్రపద్యతే। ధర్మాత్కైవల్య మాప్నోతి ధర్మమూలా వ్యవస్థితిః' ఇత్యాదిస్మృత్యంతరా దితి భావః ఏవం 'కపూయచిరణాః కపూయాం యోని మాపద్యన్తే । పుణ్యాచరణాః పుణ్యాం యోని మాపద్యన్త' ఇత్యాది శ్రుత్యన్తరాచ్చే త్యవధేయమ్॥ దుర్యోధన ఇతి॥ ఇహ దుఃఖేన జయోదుర్జయస్తేన ధన ముత్కృష్టేణ యస్య స దుర్యోధన ఇత్యర్థః॥ ౧॥

## —♦ ఆ న్వ యి తా త్ప ర్య ము ♦—

శ్రీమ దఖండమహీమండల మండనాయ మానంబగు సీభరతఖండము నకుత్తరభాగమున హస్తినాపుర మమనొక పట్టణము గలదు. ఆయిదువేల సంవత్సరములకుఁ బూర్వము చిత్రాంగదుఁ డని నామాంతరము గల యటలుండను రాజు రాజ్యము బాలించుచుండెను. ధృతరాష్ట్రుఁడును బాండురాజును నాతని కుమారులే. ధృతరాష్ట్రునకు దుర్యోధనాదులు నూర్గురు కుమారులును బాణ్డురాజునకు ధర్మరాజు,భీమసేనుఁడు. అర్జునుఁడు నకులుఁడు, సహదేవుఁడను నేగురుతనయులు జనించిరి. ధృతరాష్ట్రపాండవులకుఁ బూర్వము కురువను నొకప్రసిద్ధ మహారాజుండెను: వానివలన వీరికిఁ గౌరవులని పేరు వచ్చెను. క్రమక్రమముగా ధృతరాష్ట్రపుత్రులకు ధార్త రాష్ట్రులనియు గౌరవులనియుఁ బాండుపుత్రులకుఁ బాండవులని యును పేర్లు వచ్చెను. కౌరవులు పాండవుల సద్గుణములఁజూచి యోర్వ లేక ద్వేషింప మొదలిడిరి. ఈ ద్వేషాంకురము క్రమముగాఁబెరిగి తుదకు మహావృక్షమైనది. అంత వారు కపటోపాయములను బన్ని జూదమాడి పాండవులకాడలఁబుచ్చి వారి సర్వస్వమును, హరించి పంద్రెండువత్సరము

లరణ్యవాసమును నొకయేఁడజ్ఞాతవాసమును జేయునట్లు నియమించిరి. పిదప వారు నియమబద్ధులై ప్రతిజ్ఞా నిర్వాహణమును గావించి యావలదమకు రావలసిన భాగమునొసంగుఁడని యడుగగా దుర్యోధనాదులొడంబడక యుద్ధమును గావించి మమ్ము జయించిమీకు రావలసిన భాగమును గైకొందురేకాని యంతదనుక సూదిమోపినంత భూమినైనను నీయమని వక్కాణించిరి. అనంతరము వీరొండొరులు యుద్ధమును గావింపఁ గురుక్షేత్రమునందుఁ జతురంగసేనా సమేతులై సమావేశ మొనరించిరి. ఇయ్యది గీతాప్రారంభమునకు ముందటి కథాసారము.

సకలపురుషార్థములకును మూలము ధర్మము. దానివలన నర్థకామమోక్షములు గలుగుచున్నవి. ఈసంసారమున మోక్షము పరమపురుషార్థము అట్టి మోక్షమునకు ధర్మమును ముఖ్యసాధనముగా నెంచి గీతామృతమును జెప్పనారంభించుచున్నాడు. ధర్మముంబట్టి ప్రపంచము నడచుచున్నది. దానివలననే ముక్తియుఁ గలుగును. కావున లోకస్థితి యంతేయును ద దాశ్రయమైనది. పుణ్యమును జేసినవారలు బ్రాహ్మణాదిపుణ్యజన్మములను బాపముంగావించినవారలు సూకరాది పాపజన్మములను నెత్తుదురని శ్రుతులవలనఁ దెలియుచుండుటవలన ధర్మమే ప్రధానము. కురుక్షేత్ర మనఁగా దేవతల యజ్ఞభూమి యనియును, సర్వభూతములకు ముక్తి నొసంగునది యనియును శ్రుతియభిప్రాయము. దుర్యోధనుఁడనగాఁ దుర్జయత్వరూపమైన ధనమధికముగాఁ గలవాఁడని వ్యుత్పత్త్యర్థము.

ధృతరాష్ట్రుఁడు సంజయునిం గూర్చి యడుగుచున్నాడు. ఓసంజయా ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున యుద్ధము సేయ నిచ్చగించిన నావారగు దుర్యోధనాదులును బాండవులు నేమిసేసిరి ?

సంజయ ఉవాచ:—

శ్లో॥ దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా।
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్ ॥ ౨

## —♦ భా ష్య మ్ ♦—

ఏవం త్వర్థిం 'సంజయస్తు మహాభాగ స్తపసాజ్ఞానమాప్తవాన్॥తత స్తస్మై సమం వృత్తం ప్రోక్తుంయోగ్యోఽబ్రవీద్వచ' ఇత్యాది స్మృత్యా తు సర్వజ్ఞ స్సంజయోఽప్యాహ దృష్ట్వేతి॥ తత్రి తావ 'చ్చిత్రాంగదస్య పుత్రార్థం ద్వేస్త్రియౌ తత్పరాశరాత్ దృష్ట్యవరోధత శ్చాన్ధ శ్ఛన్దనైః పాండురోహ్యాభూత్' ఇతిస్మృత్యాపాండవానా మనీకం సైన్యం వ్యూఢం వ్యూహరచనయా ధృష్టద్యుమ్నాదిభిః స్థాపితం దుర్యోధనో దృష్ట్వా ధనుర్విద్యాప్రవర్తకం ద్రోణాచార్య ముపసంగమ్యేదానీం నీతికౌశల్యేన రాజాఽబ్రవీదితి పరమార్థః॥ ౨

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నీతకౌశల్యేనేతి॥ ఏతదప్యుక్తమిహైవ భారతే తద్యథా, 'కాలస్య కారణం రాజా రాజ్ఞోవా కాలకారణమ్। తదేతత్ప్రశ్న బాహుళ్యేరాజా కాలస్య కారణమ్'। ఇత్యత్రోలోకరక్షణార్థమపి రాజనీతిరేవరీగరీయసీత్యవధేయమ్ ॥౨॥

## —♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

సంజయుఁడిట్లనియె:—ఈతఁడు తపస్సుచే జ్ఞానము నొందినవాఁడు గావున నెల్లెడ జరిగిన సంగతులవు జెప్పుటకర్హుడు. చిత్రాంగద మహారాజున కిద్దఱుభార్యలుండిరి. అతఁడు మృతినొందిన పిదప వేదవ్యాసుని వలన వారికిఁగలిగిన సుతులలోఁ దృష్ట్యవరోధమువలన (కన్నులు మూసికొనుటవలన) ధృతరాష్ట్రుండును, జందనములచే (తెల్లబోవుట) పాండురాజును బుట్టిరని స్మృతిప్రమాణము. ధృతరాష్ట్రుడంధుఁడు గాన సంజ

యుని ప్రశ్నించెను. దుర్యోధనుఁడు, ధృష్టద్యుమ్నునిచే వ్యూహముగాఁ జేయబడిన పాండవసేనను చూచి ధనుర్విద్యను నేర్పిన ద్రోణాచార్యుని కడకుంజని 'కాలమునకు రాజు కారణము; రాజునకైనను గాలమే కారణము. లోకశిక్షణమే కాక లోకరక్షణమును రాజనీతియే' యను నీతికౌశల్యము నెఱింగినవాఁడై యాతని నిట్లడిగెను॥ ౨॥

శ్లో॥ పశ్యైతాంపాండుపుత్రాణా మాచార్య!మహతీంచమూమ్
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా॥ 3

—♦ భాష్యమ్ ♦—

అథ తదేవ వాక్యవిశేషరూపం వచన ముదాహరతి - పశ్యైతామితి॥ తత్రైవం సతి పాండుపుత్రాణాం చమూం మహతీ మనేకాక్షౌహిణీసహితత్వేన దుర్నివారాం పశ్యాఽఽపరోక్షీకుర్విత్యర్థః । అహం శిష్యత్వాత్ త్వా మాచార్యం ప్రార్థయామీత్యాహ । ఆచార్యేతి॥ హే పాండుపుత్రాణా మాచార్య ద్రుపదపుత్రేణ తవశిష్యేణ త్వద్విద్యాబలేన ధీమతా త్వద్వధార్థముత్పన్నేన త్వయా స్థాపితేన మమాఽర్థకారిత్వ మపి సూచిత మిత్యాశయః॥3॥

—♦ లఘుటిప్పణీ ♦—

ఆచార్యేతి॥ తత్ర త్వమేతత్ సైన్యం పశ్యేత్యుక్త్వా నిగూఢం ద్వేషం ద్యోతయతి । ఏవం తర్హి యస్య ధర్మక్షేత్రం ప్రాప్యాపీదృశీ దుష్టబుద్ధి స్తస్య కాఽనుతాపశంకా సర్వాభిశంకితత్వే నాతిదుష్టాశయత్వా దితిభావః । అక్షౌహిణీతి॥ తత్ర 'శతలక్షహస్తీ నవలక్షయోధా లక్షౌహి యత్ర తురంగమాః పృథ'గిత్యాదినా యాక్షౌహిణీ తత్సహితత్వేనేత్యర్థః॥ 3॥

## ఆ న్ధ్రి తా త్ప ర్య ము

ఓగురువర్యా! పాండుపుత్రుల సేనను దిలకింపుము. ఎంతగొప్పది గా నున్నదో! అక్షౌహిణు లెన్నియో కలవు. కావున నివారింపనలవిగా కున్నది. (నూఱులక్షల యేనుఁగులును, దొమ్మిదిలక్షల యుద్ధభటులును, రెండులక్షల గుఱ్ఱములును గలయది యక్షౌహిణి. ఇదియొక పక్షాంతరము. ఆచార్యా! ఈసేనల నన్నింటిని వ్యూహములనుగాఁ బన్ని ద్రుపదకుమారుఁడు నాయకుఁడై వెలయుచున్నాఁడు. ఈతఁడు నీవధార్థమే జనించినవాఁడు. నీకు శిష్యుఁడు నీవిద్యాబలము గలవాఁడు. ఈతని వలన నీకొకాకనాకును ననర్థకత్వము గలుగుచున్నది. పాండవులకును నీవ యాచార్యుఁడవు, ధర్మక్షేత్రమును జొచ్చియుండు నిట్టినష్టబుద్ధి గలవారికి గురుశిష్యయోపమైన యనుతాప మెక్కడనుండి వచ్చును. శిష్యులు గురుధిక్కారమునకై కడంగుచున్నారు. ఒకమారు చూడుము. అని నిగూఢాభిప్రాయము. 3.

శ్లో. అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః॥ ౪

## భా ష్య మ్

నన్వేకేన ద్రుపదపుత్రేణ కింభవిష్యతీత్యాహ-అత్రేతి అత్ర శూరానేవ విశినష్టి మహేష్వాసాఇతితత్రతావన్మహాన్త ఇషవః క్షిప్యన్తేయైస్తేమహేష్వాసా ధనుర్విశేషవన్త ఇత్యర్థః. ఏవమిహ 'సహస్రాన్యోధయేద్యస్తు యేనచైకేన ధన్వినా మహారథ స్సవిజ్ఞేయ స్తతోఽప్యతిరథోఽధికః॥,ఇత్యాద్యుక్త్యా యుయుధానాద్రయః ప్రత్యేకం మహారథా బోధ్యాః॥ ౪॥

## —◆ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ◆—

ద్రుపదపుత్రుండొక్కరుండే యేమిచేయఁగలడన జెప్పుచున్నాడు:
ఇంక శూరులనే పేర్కొనుచున్నాఁడు-ఈసైన్యంబున మహాధనుర్ధరులును శూరులును, యుద్ధమున భీమార్జునులతో సమానులును నగు యోధులు గలరు. విరాటరాజును ద్రుపదరాజును సాత్యకియును మహారథులు, (ఎవఁడు ధనుర్ధరుఁడై తన్నుఁ గాపాడుకొనుచుఁ వేయిమందితో యుద్ధము సేయునో యాతఁడు మహారథుఁడు. అతిరథుఁడీతనికన్న గొప్పవాఁడు.)

శ్లో॥ ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజ శ్చ వీర్యవాన్॥
పురుజి త్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః॥ ౫

## —* భా ష్య మ్ *—

ఏవ మన్యానపి గణయ న్నాహ - ధృష్టకేతు రితి॥ తత్ర తావత్ ధృష్టః శత్రుభి ర్ధర్షః కేతు పతాకా యస్యేత్యర్థః ఏవ మిహ శబినోఽపత్యం శై బ్య స్స చ నరాణాం మధ్యే పుంగవ శ్శ్రేష్ఠ ఇత్యర్థః॥ ౫॥

## —* ఆ న్ధ్రి తా త్ప ర్య ము *—

మఱియు నింక ధృష్టకేతుండు, చేకితానుఁడు బలవంతుఁడగు కాశిరాజు, పురుజిత్తు, కుంతిభోజుఁడు నరశ్రేష్ఠుఁడైన శైబ్యుఁడుగలరు. (శత్రువులచే ఖండింపరాని పతాకము గలవాఁడు ధృష్టకేతుఁడు.)

శ్లో॥ యుధామన్యు శ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్
సౌభద్రో ద్రౌపదేయా శ్చ సర్వ ఏవ మహారథాః॥

—♦ భా ష్య మ్ ♦—

అథ శుక్లతరోఽపి శుక్లో భవత్యేవేతి న్యాయేనాతిరథా నపి మహారథిత్వే నాహ - యుధామన్యు శ్చేతి॥ ఏవం తర్హి సర్వ ఏవైతే మహారథా ఇత్యనేనాతిరథానా ముపలక్షణం బోధ్యమ్ । తల్లక్షణం తు, 'ఏకో దశసహస్రాణి యోధయే ద్యస్తు ధన్వినామ్ । శస్త్రశాస్త్రప్రవీణ శ్చ మహారథ ఇతి స్మృతః ॥' 'అమితాన్ యోధయే ద్యస్తు స ప్రోక్తోఽతిరథ స్తుసః । రథి త్వేకేన యో యోద్ధా తన్న్యూనోఽర్ధరథః స్మృతః॥' ఇత్యాది ద్రష్టవ్యమ్॥ ౬॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

యుధేతి॥ తత్ర యుధం యోద్ధుమేవాసమన్తా న్మన్యత ఇత్యర్థకో యుధామన్యు శ్చేత్యర్థః॥౬॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

మిక్కిలి తెల్లనివాఁడును తెల్లనివాఁడును తెల్లనివారే యను న్యాయమున నతిరథులను సహితము మహారథులను గానే చెప్పుచున్నాఁడు - మఱియు నిందు పరాక్రమవంతుఁడగు యుధామన్యువు, బలవంతుఁడగు నుత్తమౌజుఁడును, సుభద్రాకుమారుఁడును, ద్రౌపదీకుమారులును ప్రతివింధ్యాదు లుపపాండవులును గలరు. (ఎవఁడు శస్త్రశాస్త్రప్రవీణుఁడై ధనుర్ధరులగు పదివేలమంది యోధులతో యుద్ధము సేయునో యాతఁడు మహారథుఁడు. ఎవఁడు అనేకులతో యుద్ధము సేయునో యాతఁడతిరథుఁడు. ఎవఁడు రథికుఁడై యొకనితో యుద్ధము సేయునో యాతఁ డర్ధరథుఁడు. ౬.

శ్లో॥ అస్మాకం తు విశిష్టా యే తా న్నిబోధ ద్విజోత్తమ! ।
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే॥ ౭॥

—♦ భా ష్య మ్ ♦—

అథాత్మనోఽపి ప్రాబల్యం ద్యోతయ న్నాహ—అస్మాకం త్వితి॥ తత్రైవం సత్యస్మాకం సర్వేషాం మధ్యే యే విశిష్టా విశేషబలవన్త స్తాన్నిబోధ నిశ్చయేన మద్వచనా దవధారయే త్యర్థః। ఏవ మిహ ద్విజోత్తమే త్యనేనాస్య బ్రాహ్మణత్వేన యుద్ధానుకల్పరహితత్వేఽపి మద్దేతవే భక్తవాత్సల్యేన యుద్ధం త్వమపి కుర్వితి ద్యోతయన్ సంజ్ఞార్థన్తాన్బ్రవీమితఇతి స్ఫుటీకృతమ్॥ ౭॥

—♦ ల ఘు టి ప్ప ణీ. ♦—

మద్దేతవఇతి॥ సోఽప్యాచార్య స్స్వధర్మం రక్షయన్ భక్తవాత్సల్యేన స్వవచసైవ శరీరాత్యయం మన్వానో నరో వా కుంజరో వేతి. ఛలోక్త్యై భవిష్యతీతి ద్రష్టవ్యమ్॥ ౭॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

ఓ బ్రాహ్మణోత్తమా! మనబలంబున నెవరు ముఖ్యులో నా సైన్యమునకు నెవరధిపతులో వారిని దెలిసికొనుము. మీకు(జక్క(గా( దెలియుటకై చెప్పెద నాలకింపుము. (దుర్యోధనుడు గురువును 'బ్రాహ్మణోత్తమా' యని పిలుచుటచే యుద్ధము సేయువిధి లేకపోయినను "శరణాగతు(డైనవా(డు క్షుద్రు(డైనను గొప్పవారికి సత్పురుషునంమువలె వానియందును మమత్వముగలదు." అను న్యాయమును బట్టి భక్తవాత్సల్యముచే యుద్ధముసేయ వే(డికొనుచున్నా(డను నభిప్రాయము సూచితము.

2

ఆచార్యుఁడును భక్తవాత్సల్యముచేతను స్వవచనముచేతను శరీరత్యాగము నేయనిశ్చయించి నరుఁడా కుంజరమా? యను ఛలోక్తిచే స్వధర్మరక్షణము నేసికొనగలఁడని యాశయము. ౭.

శ్లో॥ భవాన్ భీష్మ శ్చ కర్ణ శ్చ కృప శ్చ సమితింజయః।
అశ్వత్థామా వికర్ణ శ్చ సౌమదత్తి స్తథైవ చ ॥౮॥

—♦ భాష్యమ్ ♦—

తత్ర తావత్కే తవ్యాస్మదీయా ఇతి తానపి గణయతి భవానితి॥ ఏవ మిహ శత్రుజయం వినా న స్వస్థం చేతో యస్య స చాశ్వత్థామా ద్రోణాచార్యస్య పుత్ర ఇత్యర్థః ॥౮॥

—♦ లఘుటిప్పణీ ♦—

అశ్వత్థామేతి—తత్ర పుత్రసంకటాత్ ద్రోణాచార్యో మరిష్యతీతి కృత్వా యుద్ధారంభ ఏవాశ్వత్థామా బ్రహ్మలోకే గతవానితి తథా ప్యాగత్య వికరిష్యతీతి తతోఽపి భీతిరితి తమపి గణయతీత్యాశయః॥౮॥

—♦ ఆంధ్రతాత్పర్యము ♦—

మఱియును మీరును భీష్ముఁడును గర్ణుండును యుద్ధములందు విజయము నొందిన కృపాచార్యుఁడును నశ్వత్థామయు భూరిశ్రవుఁడును గలరు. (శత్రుజయము లేక స్వస్థము కాని మనస్సుగలవాఁడు. అశ్వత్థామ, వ్యు: యుద్ధారంభసమయమునందె పుత్రుఁడు బ్రహ్మలోకమునొందెనని విని ద్రోణాచార్యుఁడు మరణింప భీతినొందగలడని, భీతినివృత్తికై అశ్వత్థామను గ్రహించినాఁడు).౮.

శ్లో॥ అన్యే చ బహవ శ్శూరా మదర్థే త్యక్త జీవితాః
నానాశస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః॥ ౯

—♦ భాష్యమ్ ♦—

ఏవ మపరానపి స్వవర్గస్థా నాహ—అన్యేచేతి॥ తత్ర తావన్మదర్థే త్యక్తం జీవితం యైస్తే తథాభూతా ఇత్యర్థః। ఏవ మిహ స్వస్య సైన్యస్య ప్రాబల్యం ద్యోతయన్ సర్వే యుద్ధవిశారదా ఇత్యప్యుక్త మవధార్యమ్॥౯॥

—♦ ఆస్థరితాత్పర్యము ♦—

ఇంకను బెక్కండ్రు శూరులు నాకొఱకుఁ బ్రాణముల నర్పింపఁగల వారును, నానావిధములగు శస్త్రము లాయుధములుగాఁ గలవారును, యుద్ధములం దాఱితేఱినవారును గలరు. (ఇట్లు తనసేనాప్రాబల్యమును జూపెనని తలంపవలయును) ౯.

శ్లో॥ అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్।
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్॥ ౧౦

—♦ భాష్యమ్ ♦—

అథ తేభ్య స్స్వసైన్యస్యాల్పత్వేన శైథిల్యం దర్శయన్నాహ—అపర్యాప్త మితి॥ ఏవం సత్యస్మాకం బలం సైన్యం భీష్మేణ వృద్ధేన యతో రక్షిత మతో౽పర్యాప్త మిత్యర్థః॥౧౦॥

—♦ లఘుటిప్పణీ ♦—

ఏవం సతీతి॥ 'యస్య త్వన్యస్త్రియై చిత్తం నీతిం యో నాభినన్దతి। మృషోక్తిశ్చ ఛలోక్తిశ్చ తస్య రాజ్యం ప్రణశ్యతీ' తి ధర్మతత్త్వ మజానతా కేవలసైన్యబలేనైవ జయ ఇత్యేవమేవ జానతా చ దుర్యోధనేన మమ సైన్య మపర్యాప్త మిత్యేవ ముక్త మిత్యర్థః॥ ౧౦॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

ఇపుడు వారికంటె తనసైన్య మల్పముగా నున్నదని శిథిలత్వమును జూపుచున్నాఁడు- ఆచార్యా! ఈపరికారమున్నను మనసైన్యము వృద్ధుఁడైన భీష్మునిచే రక్షింపఁ బడుచున్నందునఁ జాలినదిగాదు. (ఈతేఁడు పాండవ పక్షపాతియగుటచే సంపూర్ణబలముతో యుద్ధము సేయండని యాంతరాభిప్రాయము.) మఱిపాండవసైన్యమా, వయోవంతుఁడగు భీమునిచే రక్షింపఁబడినదై చాలినదిగా నున్నది.

('ఎవఁడు నీతి నెఱుంగక పరస్త్రీని గోరునో, అసత్యమును కపటవాక్యమును బలుకునో, యాతేని రాజ్యము నశించు'ననుధర్మతత్త్వము దుర్యోధనుఁ డెఱుంగనివాఁడై కేవలసైన్యబలముచేతనే జయము కలుగునని తలంచినవాఁడై యిట్లు పలికె ననిభావము.) ౧౦.

శ్లో॥ అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః।
భీష్మ మేవాభిరక్షన్తు భవన్త స్సర్వ ఏవహి॥ ౧౧

—♦ భా ష్య మ్ ♦—

అథ చ తతఃకిం కరణీయ మిత్యాహ-అయనేష్వితి॥ తత్రితావత్సమరసమయే యుద్ధభూమౌ యథాభాగం స్వసైన్యదళం ప్రత్యవస్థితా స్సన్త స్సర్వేఽపి యూయం పృష్ఠతః పార్శ్వతశ్చ భీష్మమేవ స్వసేనాధిపతిం రక్షన్త్విత్యర్థః। తత్రి రక్షితేచసేనాపతౌసర్వంసురక్షితంభవిష్యతీ త్యభిప్రాయః॥౧౧॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

పృష్ఠతః ఇతి॥ తద్యథా, 'కైవర్తేన వినా నౌకా రథస్సారథినావినా సైన్యాధిపం వినా సైన్యం నష్ట మేతన్నసంశయః॥' ఇత్యతోఽపిసైన్యాధిపతిమేవ సర్వతో రక్షన్త్విత్యాశయః॥ ౧౧॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

తరువాతఁ జేయవలసిన కృత్యము నెఱింగించుచున్నాఁడు:—కాబట్టి యుద్ధభూమియందు మీరందఱును వంతులప్రకారము వెనుకను ముందును నంతటను నిలిచి సేనాధిపతియైన భీష్మునిఁ గాపాడుచుండవలయును. (నావికుఁడు లేనినావయును సారథి లేని రథమును సేనాపతి లేని సైన్యమును నిస్సందేహముగా నశించును గాన మీరందఱును భీష్ముని రక్షింపవలెను. భీష్మునకు మేమును బాండవులును మనుమలము గావున నుభయపక్షములును సమానములె. కాన సంపూర్ణబలముతో యుద్ధము సేయుఁడని యనుమానము. ౧౧.

శ్లో॥ తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః।
సింహనాదం వినద్యోచ్చైః శ్శంఖం దధ్మౌప్రతాపవాన్॥౧౨॥

—♦ భా ష్య మ్ ♦—

అథ తద్వాక్యం శ్రుత్వా భీష్మేణ కిం కృత మిత్యాహ తస్యేతి॥ ఏవం సతి తస్య రాజ్ఞో భయనివర్తకం స్వవిజయసూచకం చ హర్షం జనయన్ ఉచ్చై ర్మహాన్తం సింహనాదం వినద్య ప్రతాపవాన్ కురువృద్ధః శంఖం దధ్మావిత్యన్వయః॥౧౨

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

భయనివర్తకమితి॥ తదేతచ్చ।, 'దశద్వయే సమారూఢేయుధ్యమానే రణోత్సుకైః। ప్రథమం వాద్యశస్త్రాదీ న్ప్రహరే త్తస్యనోజయః॥' ఇత్యాది నీతిప్రబంధ మజాన న్దధ్మావిత్యర్థః॥౧౨॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

దుర్యోధనుని వాక్యమును విని భీష్ముఁడేమి సేసినాఁడనఁ జెప్పుచున్నాఁడు-ఇట్లు పలుకుచున్న దుర్యోధనున కానందమును గొల్పుచుఁ

గౌరవులలో వృద్ధుఁడును దాతగారును నైన భీష్ముఁడు పరాక్రమముతో సింహనాదము నొనరించి గట్టిగా శంఖము నొత్తెను. (ఉభయసైన్యములను యుద్ధసంసిద్ధములై యుండఁగా మొదట వాద్యములను వాయించినఁ గాని. శస్త్రములతోఁ గొట్టినఁగాని, జయము గలుగదను నీతిననుసరించినవాఁడై శంఖము నూఁదెనని తా. ౧౨.

శ్లో॥ తత శ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః।
సహసైవాభ్యహన్యన్త స శబ్ద స్తుములోఽభవత్॥ ౧౩

—♦ భాష్యమ్ ♦—

అథాఽనన్తరం కిమభవ దిత్యాహ:—తతఇతి॥తత్రతావ త్పణవా శ్చానకాశ్చ గోముఖాద్యాశ్చ వాద్యవిశేషా స్సహసా తత్క్షణమే వాభ్యహన్యన్త వాదితా ఇత్యర్థః। సచ శబ్ద స్తుములో మహా నాసీ త్తథాపి పాండవానాం క్షోభో నజాతఇత్యర్థః ॥౧౩॥

—♦ ఆన్ధ్రితాత్పర్యము ♦—

తరువాత విషయమును జెప్పుచున్నాఁడు—తరువాత మిగిలినవారు శంఖములు భేరీలు పణవములు నానకములు గోముఖములు మున్నగు వాద్య విశేషములను మోగింపఁగా నాశబ్దము సంకులమయ్యెను పాండవులకుఁ గలఁతను గల్గింపలేదు. ౧౩.

శ్లో॥ తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యందనే స్థితౌ।
మాధవః పాణ్డవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః॥౧౪॥

అథాఽతః పరం కిం వృత్త మిత్యాహ—తత ఇతిఏవం తదాఽగ్నిదత్తే శ్వేతై ర్హయై ర్యుక్తే రథే స్థితౌ యౌ తయో శేకస్య మాధవత్వం తు 'లక్ష్మీనారాయణాఖ్యోఽయం

యోగో౽యం విహితో మయే' త్యాదినా పాద్మే సదాశివేనాభి హితం। తథా తేషాం పాణ్డవత్వం తు శివాజ్ఞయా పరాశరేణాభి హిత మిత్యేతయో ర్ద్వర్దయత్వం స్ఫుటీకృతమ్॥౧౪॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

పాండవత్వమితి॥ తత్ర తావత్ 'పురా చిత్రాంగదస్యేత్థం ద్వే స్త్రియౌ తద్వయో రిహ। నేత్రే పిధాయ చైకా స్త్రీ ద్వితీయా చన్దనాం కితా। గతే సముత్థిత స్తస్మా దన్ధస్త్వేకో౽థపాండురః, ఇత్యాది పురాణోక్త్యా పాండవత్వం త్వేషాం శివాజ్ఞయా పరాశరేణ సంపాదిత మిత్యధిక మన్యత్ర విస్తరః ॥౧౪॥

—◆ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ◆—

ఆవలి వృత్తాంతమును జెప్పుచున్నాఁడు—తరువాత తెల్లనిగుఱ్ఱములతోఁ గూడినదియు నగ్నిదత్తమైనదియు నగు రథమున దివ్యస్వరూపులగు కృష్ణార్జునులు కూరుచుండి శంఖములను బూరించిరి (మాధవునియందు బాద్మమున సదాశివుఁడు చెప్పినప్రకారముఁగా శివ సంబంధమగులక్ష్మీనారాయణయోగమును, బాండవునియందు బరాశరునిచేశివాంశయు, సదాశివాజ్ఞచే నియంబడినందువలన వీర లజేయులని యభిప్రాయము. వేరొకచోటవిస్తరింపఁబడును. ౧౪.

శ్లో॥ పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః॥ ౧౫

—◆ భా ష్య మ్ ◆—

అథ కిం నామ కౌ తౌ శంఖా విత్యాహ - పాంచజన్యమితి॥ తత్ర తావత్ హృషీకాణీంద్రియాణి తేషాం శివజ్ఞానార్చన ధ్యానై రీశో నియంతా శ్రీకృష్ణః పాంచజన్యం, దేవ

వ_స్తుచ తత్ప్రసాదాదే వేహోఽనుత్రి ధనాని జయతీతి ధనం జయోఽపి పరసైన్య జయార్థం దధ్మావిత్యర్థః॥ ౧౫॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

ఆశంఖము లెవ్వియనఁ జెప్పుచున్నాఁడు - హృషీకములనఁగా నింద్రియములు. శివజ్ఞానార్చనధ్యానములచే వానికి నియంతయగు శ్రీకృష్ణుఁడు పాంచజన్యమను శంఖమును నైహికాముష్మికధనములను జయించువాఁడగు నర్జునుఁడు దేవదత్తమను శంఖమును, భయంకరకార్యములను చేయునట్టి భీముఁడు పౌండ్రమను శంఖమును బూరించిరి. ౧౫.

శ్లో॥ అనన్తవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః।
నకుల స్సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ॥ ౧౬॥

ఏవ మపరైరపి కిం కృత మిత్యాహ - అనంతేతి॥ తత్రి తావత్ కుంత్యా మహాతపసా ధర్మమారాధ్య లబ్ధపుత్రేతి తస్యాః పుత్రస్సచ జయభాగిత్వేన యుధ్యన్ స్వయమేవ విశేషతః స్థిరో భవతీతి భావః॥ ౧౬॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

తక్కుంగలవారేమి గావించిరనఁగా - గొప్పతపముచే ధర్మమును (యమధర్మరాజును) ఆరాధించి కుంతీదేవిచేఁ బొందఁబడినవాఁడును, జయప్రాప్తిచే యుద్ధము సేయుచు స్వయముగా స్థిరుఁడుగా నున్న యుధిష్ఠిరుఁడు అనంతవిజయమను శంఖమును, నకులుఁడు సుఘోసమను శంఖమును, సహదేవుఁడు మణిపుష్పకమును గ్రమముగాఁ బూరించిరి. ౧౬.

శ్లో॥ కాశ్యశ్చ పరమేష్వాస శ్శిఖణ్డీ చ మహారథః
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః॥ ౧౭॥

శ్లో॥ ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే!
సౌభద్రశ్చ మహాబాహు శ్శంఖాన్ దధ్ముఃపృథక్ పృథక్॥

—♦ భా ష్య మ్ ♦—

ఏవ మేతత్పక్షాశ్రితా నపరా నప్యాహ-కాశ్యశ్చేతి॥ తత శ్చేహ సంగ్రామయజ్ఞే ష్వపరాజిత స్సాత్యకి శ్చాన్యే చ యే తే సర్వేఽపి శంఖా న్దధ్ముగ పృథక్పృథగితి హేపృథివీపతే! ధృతరాష్ట్ర! స్థిరో భూత్వా శ్రుణ్వితి ద్వయోరర్థః ॥౧౭॥౧౮॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

వీనిపక్షము నాశ్రయించిన యితరులం గూర్చి తెలుపుచున్నాఁడు. గొప్పధనుస్సును దాల్చినకాశిరాజును మహారథుఁడైన శిఖణ్డియును, ధృష్టద్యుమ్నుఁడును, విరాటరాజును, బరాజయ మెఱుంగని సాత్యకియును ద్రుపదరాజును, ద్రౌపదీపుత్రులును మహాబాహుఁడగు సుభద్రాకుమారుఁడును వేఱువేఱుగా శంఖములను బూరించిరి. ౧౭. ౧౮.

శ్లో॥ స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్
నభ శ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్॥ ౧౯

—♦ భా ష్య మ్ ♦—

అథ తతః పరం కి మత్యంతం సద్యః సమరప్రయోజక మభూ దిత్యాహ-సఘోషఇతి॥ ఏవం సతి స శంఖోద్ఘోషో ధార్తరాష్ట్రాణాం ధృతరాష్ట్రసంబంధినాం సర్వేషాం భీష్మద్రోణాదీనామపి హృదయాని వ్యదారయత్ తుల్యాం వ్యథాం జనితవా నిత్యర్థః। యత స్తుముల స్తీవ్రో నభశ్చ పృథి వీంచ అతిధ్వనిభి రాపూరయన్నితి యావదర్థః॥౧౯॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

వ్యదారయదితి॥ ఇద మస్యాగామి పరాజయజనకం లక్షణం యత్తేషాంశబ్దోద్ఘోషో హృదయాని వ్యదారయదితి వేద్యమ్॥ ౧౯॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

ఆ ధ్వని భూమ్యాకాశముల నావరించినదై ప్రతిధ్వనులంగల్గించుచు దుర్యోధనాదులయు, భీష్మద్రోణాదులయు హృదయములను బ్రద్దలగునట్లొనరించెను. (ఇందువలన ముందు రాబోవు పరాజయము సూచితమగుచున్నది.) ౧౯.

శ్లో॥ అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాణ్డవః॥ ౨౦

—♦ భా ష్య మ్ ♦—

అథాఽనన్తరం ధార్తరాష్ట్రాణాం భయం ప్రదర్శ్య పాండవానాం తద్వైపరీత్యం దర్శయితుమాహ—అథేతి॥ తత్రతావదుద్యద్యోద్యోగేన వ్యవస్థితానేవ తాన్ ధార్తరాష్ట్రాన్ దృష్ట్వా కపిధ్వజోఽర్జునో హనుమతా వీరేణధ్వజస్థితే నానుగృహీతః శస్త్రసంపాతేఽపి నిర్భయత్వేన ధనురుద్యమ్య హృషీకేశం ప్రతి సేనయోరిత్యాది వాక్యం మహీపతిం ధృతరాష్ట్రం సంబోధ్యాహేత్యన్వయః।ఏవం తద్వార్యోష్టాపకర్మునేశ్శాపం శ్రుత్వా, విష్ణుః పురా తపద్బదర్యాశ్రమ మాసాద్య తద్వారా దచ్యుతో హ్యభూ,దిత్యాదిస్కాన్దోక్త్యా తస్మిన్రథస్థే మమ కాకుత్థితిద్వయోరర్థః॥౨౦॥

శ్లో॥ హృషీకేశం తదా వాక్య మిద మాహ మహీపతే!।
సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత!౨౧

—♦ లఘుటిప్పణీ ♦—

అచ్యుతేతి॥నను షోడశసహస్రాస్వవలిప్తస్య కృష్ణస్య కథ మచ్యుతత్వం కథంచ తాసాం గోపీమండలానాం చోరైర్వ్యాప్తత్వ మిత్యష్టావక్ర కథయాఽన్యతోఽవధార్యమ్। నను సారథిరూపేణ రథస్థే కృష్ణే, సతి తతోలఘురూపస్య మమ క్షతిరేవేతి చేత్, నైవ మిత్యాహ—కాక్షతిరితి॥ తద్యథా, "సంకటే సమనుప్రాప్తే త్రయ స్తే సహాకాంక్షిణః స్వామిన స్సేవకాశ్చైవ సఖాయశ్చేతి నాన్యథా॥" ఇత్యేవధారితే, మయి కా క్షతి రిత్యాశయః॥౨౦॥౨౧॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

ధార్తరాష్ట్రులకు భయమునుజూపి పాండవులకు నభయమును జూపుచున్నాఁడు—ఓయీ! రాజా, అంతఁ గపిధ్వజుండగు నర్జునుఁడు యుద్ధోద్యోగమున నున్న ధార్తరాష్ట్రుల నవలోకించి శస్త్రప్రహార సమయమున ధనువు నెత్తుకొని శ్రీకృష్ణుని జూచి ఓకృష్ణా! నారథము నీరెండు సేనలనడుమ నుంచుమని పలుకుచున్నాఁడు. హనుమంతుఁ డనుగ్రహపూర్వకముగా నర్జునుని టెక్కెమునను న్నవాఁడుగాన నాతనికిఁ గపిధ్వజుఁడని పేరు. విష్ణువు పూర్వము అష్టావక్రముని శాపమును విని, బదరికాశ్రమమునఁ దపము సేయుచు, శివునివరము వలన నచ్యుతుండయ్యెనని స్కాందపురాణోక్తకథ యిందనుసంధేయము. షోడశసహస్రాంగనా విహారరసికుండును, గోపీవసనాపహరణచణుండగు శ్రీకృష్ణునకుఁ బూర్వోక్తమగు నష్టావక్రముని కథచేతనే యచ్యుతత్వము గలిగినది. కృష్ణుఁడు సారథిగా నున్నను, సామాన్యుఁడగు నర్జుననకు హానిరయే యన:—(సంకటము వచ్చినపుడు లోకమున సహాకా

రులు ముప్పురు. యజమానులు, సేవకులు, స్నేహితులు. అని నిశ్చయించిన యార్జునునకు నేమి హాని.) ౨౦-౨౧.

శ్లో॥ యావ దేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్ |
కై ర్మయా సహ యోద్ధవ్య మస్మి న్రణసముద్యమే॥ ౨౨

—♦ భాష్యమ్. ♦—

నను కిమర్థం స్థాపయసీ త్యాహ--యావదితి॥ ఏవం తర్హి 'నాధమై ర్విషమై ర్వ్యక్తం నాంతరాయేణ వాపునః। బలేన వయసా శస్త్రై ర్ధర్మయుద్ధం ప్రచక్షతే' ఇత్యాదిస్మృత్యా కై ర్మయాసహ యోద్ధవ్యమిత్యాది యోగ్యాయోగ్యం వివేచయితుం మే రథం స్థాపయేతి పూర్వేణాన్వయః॥౨౨॥

—♦ లఘుటిప్పణీ. ♦—

ధర్మయుద్ధమితి॥ తద్యథా 'వేదప్రణిహితో ధర్మో హ్యధర్మ స్తద్విపర్యయః వేదస్య చేశ్వరాత్మత్వాత్ తత్ర ముహ్యతి చేశ్వరః॥' ఇతి స్మృత్యంతరాదపీతి, భావః॥౨౨॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

ఎందులకు నిలుపుచున్నావన:—అంతలోపల నిట యుద్ధ మాడ వచ్చినవారిని జూచుచున్నాను. ఈ యుద్ధారంభమున నే నెవరితోఁ బోర వలయునో! (అధముల తోడిదియు, విషములతోడిదియు, విఘ్నములతోఁ గూడినదియు నగు యుద్ధము ధర్మయుద్ధము గాదనియు సవయస్కులతో బోరునదియె ధర్మయుద్ధమని పల్కుదురు. ధర్మమన వేదచోదితమైనది. తద్విపరీతమైనది, యధర్మము. వేద మీశ్వరస్వరూప మగుటకతన నందు నీశ్వరుఁడు ప్రీతినొందుచున్నాఁడు.) ౨౨.

శ్లో॥ యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః॥ ౨౩

## —◆ భా ష్య మ్ . ◆—

నను ధర్మయుద్ధే ప్రథమతః కిం కరణీయ మస్తీత్యాహ యోత్స్యమానానితి। తత్ర తానద్ధార్తరాష్ట్రస్య దుర్యోధనస్య ప్రియ చికీర్షవః అధర్మతోఽపి యుద్ధాత్ప్రియం కర్తు మిచ్ఛవః యేఽత్ర సమాగతాః తానేతాన్ యోత్స్యమానా నహమవేక్షే తావన్మేరథం స్థాపయేతి పూర్వేణాన్వయః॥ ౨౩॥

## —◆ ల ఘు టి ప్ప ణీ . ◆—

అధర్మతోఽపీతి॥ నను తే శ్రుతి స్మృతివిరుద్ధం ధర్మంజానన్తోఽపి కథమధర్మతోఽపిప్రవృత్తా ఇతి చేత్, శృణు, తద్యథా, యథైధస్స్వసముత్థేన నాశమృచ్ఛతి వహ్నినా। తథాఽకృతాత్మాలోభేన సహజేన వినశ్యతీ తిస్మృత్యంతరాద్విమోహేన తే కుర్వన్తీత్యాశయః॥ ౨౩॥

## —◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము . ◆—

ధర్మయుద్ధమున ముందుఁ జేయఁదగినదెద్ది యన—

ఓకృష్ణా! దుష్టబుద్ధియగు దుర్యోధనునకు యుద్ధమున మేలు సేయ నెంచినవారై యీవచ్చినట్టివారిని జూచునంతవఱకును దేరును నిలుపుము. అని పూర్వాన్వయము. (వారు శృతిస్మృతి విరుద్ధమగు ధర్మము నెఱింగినవారయ్యును నెందులకు నధర్మమునం బ్రవర్తించిరియన: - 'ఎట్లు కాష్ఠము తనయందే జనించిన యగ్నిచేత నాశమొందునో యట్లు దుష్టబుద్ధియుఁ దనకు సహజమగు లోభముచేతనే నశించును. కాన నజ్ఞానముచే వారట్లు సేయుదురని భావము.' ౨౩.

సంజయ ఉవాచ,—

శ్లో॥ ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత!।
సేనయో రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్॥

శ్లో॥ భీష్మద్రోణప్రముఖత స్సర్వేషాం చ మహీక్షితామ్।
ఉవాచ పార్థ! పశ్యైతా న్సమవేతా న్కురూనితి॥ ౨౫॥

—♦ భా ష్య మ్. ♦—

అథ భారతోక్తవృత్తం ధృతరాష్ట్రంప్రతి సంజయేన యదుక్తం తదుపసంహరతి - ఏవముక్తః॥ తత్రైవంసతి హే భారత! భరతవంశోద్భవ! ప్రజ్ఞాచక్షుర్ధృతరాష్ట్రః గుడాకా యా నిద్రా తదీశోఽర్జునో జితేంద్రియ స్తథా హృషీకేశోఽ తత్సమకక్ష ఏవేతి తత్రభీష్మద్రోణ ప్రముఖతో రథం స్థా యిత్వా పశ్యైతా న్యుద్ధే సమవేతా న్కురూ నిత్యర్జున ప్రతి హృషీకేశ ఉవాచేతి ద్వయోరర్థః॥ ౨౪॥ ౨౫॥

—♦ ల ఘు టి ప్ప ణీ. ♦—

తత్సమ కక్ష ఏవేతి॥ తత్ర హృషీకా ణీన్ద్రియాణి తేషా మీశో నియన్తేతి తద్గోపీనా మాలోకే తత్ప్రతిత్వే నేదానమపి తత్త్వేన సపత్నా బ్రహ్మచర్యత్వ మేవే త్యవధార్యమ్—॥ ౨౪॥ ౨౫॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము. ♦—

అర్జునుఁడు ధృతరాష్ట్రునితో దేనిని, వచించెనో, యద్దాని ని డుపసంహరించుచున్నాఁడు-సంజయుఁడు పలికెను.

ఓధృతరాష్ట్రా! అర్జునుండిట్లు పలికిన పిమ్మట శ్రీకృష్ణుఁ రెండుసేనల నడుమ రథమును నిలిపి, భీష్మద్రోణుల యెదుటను, దక్ష యెల్లరాజుల యెదుటను, అర్జునా! ఈవచ్చియున్న కౌరవులం దిలకిం మని వచించెను. (గుడాక యన నిద్ర, దానికీశుఁడు గుడాకేశుఁడు జితేంద్రియుఁడు. హృషీకములన నింద్రియములు వానికీశుఁడు హృ

కేశుఁడు. గోపికల విషయమునఁ గృష్ణుఁడు తత్పతిగా నున్నను, తత్త్వజ్ఞానముచే నాతండింద్రియనిగ్రహము గలిగి బ్రహ్మచర్యముగలవాఁడనియర్థము.) ౨౪. ౨౫.

శ్లో॥ తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్।
ఆచార్యాన్మాతులాన్భ్రాతౄన్పుత్రాన్పౌత్రాన్సఖీంస్తథా॥౨౬

## —◆ భా ష్య మ్. ◆—

అథ తస్మిన్ ధర్మయుద్ధే సోఽర్జునః కి మపశ్య దిత్యాహ తత్రాపశ్యదితి॥ తత్ర తావత్పృథాయాః స్త్రీ స్వభావేన శోక మోహాక్రాన్తతయా తత్సంబంధిన స్తస్యాపి తద్వత్తా సముప స్థితేతి సూచయన్ తాదృశః పార్థః పితౄనథేత్యాద్యపశ్యత్ తథా లక్షణయా పుత్రాన్పౌత్రా నేవమేవ సఖీ నశ్వత్థామ జయద్రథప్రభృతీం శ్చాపశ్య దిత్యర్థః॥౨౬॥

## —◆ ల ఘు టి ప్ప ణీ. ◆—

తాదృశఇతి॥ తత్ర యద్యపి పృథివ్యా ఈశ్వర స్తత్ర విదితో వే త్యర్థే తస్యేశ్వరస్తత్ర విదితఇతిచేత్యనేనాణిక్రృతే, పార్థఇత్యుక్త్యా భూపతి త్వేన శూరత్వమేవ స్ఫుటీకృతం తథా పీదానీం యుద్ధే శైథిల్యం మన్వా నోఽర్థ భేదేనాప్యుక్తమ్॥౨౬॥

## —◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము. ◆—

అధర్మయుద్ధమున నర్జునుఁడేమి యవలోకించెననః— అర్జునుఁడు రెండుసేనలనడుమ నున్నరథమున నున్నవాఁడై యందు దండ్రులను దాతలను, ద్రోణాచార్యులను, మేనమామలను, సోదరులను, గుమారులను, మనుమలను, నశ్వత్థామ జయద్రథాదులగు చెలికాండ్రను జూచెను.

(పార్థః అనుటవలన భూదేవి భారవహనాసమర్థురాలై శోకమోహా క్రాన్తురాలై విష్ణువును సందర్శించె నను పురాణగాథ యుండుటవలన నీయర్జునునకా సమయమున శూరత్వము పోయి భూసంబంధమగు శోక మోహాంధత్వము గలిగెనని సూచితము. కావుననే 'తస్యేశ్వరః,' 'తత్ర విదితః' అనునర్థమున వచ్చు తద్ధితప్రత్యయమును విడిచి యుద్ధశైథిల్యమును దలం చుచు నర్థాంతరమునందలి తద్ధితప్రత్యయము నెఱుంగునది.) ౨౬.

శ్లో॥ శ్వశురా న్సుహృదశ్చైవ సేనయో రుభయోరపి
తా౯ సమీక్ష్య స కౌంతేయ స్సర్వా న్బంధూ నవస్థితా౯॥

—♦ భాష్యమ్ ♦—

అత్రైవ మపరానపి దదర్శే త్యాహ—శ్వశురానితి॥ ఏవ మిహ సుహృదో మిత్రాణి కృతవర్మ భగదత్త ప్రభృతీ౯ సర్వా౯ బంధూ౯ సేనయో రుభయో రప్యవస్థితా న్సమీక్ష్యేత్యన్వయః॥ ౨౭॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

వెండియు నాయర్జునుఁ డుభయసేనల నడుమ నున్నవాఁడై రెండు సేనలను నున్న మామలను, నిష్టులగు స్నేహితులను, గృతవర్మ లోనగు సమస్తబంధువులను జూచెనని తా. ౨౭.

శ్లో॥ కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిద మబ్రవీత్
అర్జున ఉవాచ:—
దృష్ట్వేమం స్వజనం కృష్ణ! యుయుత్సుం సముపస్థితమ్॥౨౮

—♦ భాష్యమ్ ♦—

నను తత స్తా న్సమీక్ష్య కస్మాత్ స్త్రీప్రభవత్వేన కౌంతేయత్వం ప్రాప్త ఇత్యభిప్రేత్యాహ—కృపయేతి॥ ఏవంత ర్హి

'దయాదైన్యం తదేవాస్తి యత్ర ధర్మః ప్రవర్ధతే। తస్మా త్స్వర్గాపవర్గాయ ధర్మయుద్ధే వధో మతః' ఇత్యాది స్మృత్యా కృపయేత్యస్యానావశ్యకత్వేఽప్యుద్య కృష్ణం సంబోధ్య దృష్ట్వే మం స్వజన మిత్యాది దయావాక్యం తం ప్రత్యర్జున ఉవాచే త్యర్థః॥ ౨౮॥

—◆ లఘుటిప్పణీ ◆—

మత ఇ॥ తదుక్తం ధర్మప్రబంధేషు। తద్యథా 'య ఆహవేషు యుద్ధాన్తే భూమ్యర్థ మపరాఙ్ముఖాః। అకూటై రాయుధై ర్యాన్తి తే స్వర్గం యోగినో యథా॥' ఇత్యాద్యవధార్యమ్॥ ౨౮॥

—◆ ఆంధ్ర తాత్పర్యము ◆—

అంత వారిని జూచి యర్జునుఁడు స్త్రీకి జనించినవాఁడగుటవలనఁ గౌంతేయత్వము నెందుకుఁ బొందెనన:—యుద్ధము సేయుటకు వచ్చి, నిలిచియున్న స్వజనముం గాంచి యర్జునుఁడు కృష్ణునితో నిట్లనియె. (ఎక్కడ దయతోఁ గూడినదీనత్వముండునో, ఎక్కడధర్మము పెరుగునో యక్కడ నిమాపరములు గలవు. కావున ధర్మయుద్ధమున మరణించుట మంచిది, భూమ్యర్థమైనయుద్ధములందు నెవరు వెనుక దీయక పోరుదురో, వారు యోగులువోలె స్వర్గము నొందుదురు.) ౨౮

శ్లో॥ సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి।
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే॥ ౨౯

—◆ భాష్యమ్. ◆—

అథ తతః పరం కిమబ్రవీ దిత్యాహ—ఏవం త్వాం స్వజన మాత్మీయబంధువర్గం యుయుత్సుం యుద్ధేచ్ఛుం యుద్ధ

భూమౌ చోపస్థితం దృష్ట్వా మమ గాత్రాణ్యంగాని సీదన్తీ త్యర్థః! ఏవం వేపథుః మమ శరీరే కంపో రోమహర్షో రోమాంచిత వపుష్ట్వం చ జాయత ఇత్యర్థః॥ ౨౯॥

—♦ ల ఘు టి ప్ప ణీ . ♦—

రోమాంచితేతి॥ యద్యప్యయం ధర్మో న శోభన స్తథా ప్యజాత త్వేన శౌర్యాదిధర్మానభిజ్ఞే నేదానీం తథోక్త్వా నీతిభావః॥ ౨౯॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

ఓకృష్ణా! ఈబంధుజనంబులఁ జూచిన యంతనే నాయవయవములు శిథిలములగుచున్నవి. ముఖము వాడుచున్నది. శరీరమున వణఁకు జనించు చున్నది. శెండియుఁ బులకలు వొడముచున్నవి. (ఈధర్మ మిట మంచిది కాకపోయినను నర్జునుఁడు శౌర్యాదిధర్మముల నెఱుంగనికతమున నిట్లు వచించెను.) ౨౯.

శ్లో॥ గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే।
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః॥ ౩౦

—♦ భా ష్య మ్ ♦—

అథ పరం కథ మర్జునోఽవసన్న ఇత్యాహ—గాండీవమితి॥ ఏవం సతీదానీం గుప్తవనవాసే శ్రీసదాశివేన దత్తమక్షయం ధనుః హస్తాత్స్రంసతే తథా బంధుపరితాపాత్త్వగపి పరిదహ్యత ఇత్యవస్థాతుం చ న శక్నోమీత్యాదిరర్థః ॥౩౦॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

వనవాస ఇతి॥ అరణ్యే పాండవైస్తప్తం దృష్ట్వా శంభుః కృపాపరః వారాహం విష్ణు మాకల్ప్య తత్ర వివ్యాధ సోఽర్జునాత్॥ ఇత్యాదినా హి గుప్తవనవాసే దర్శితత్వాదితి బోధ్యమ్॥ ౩౦॥

—— ఆ ధ్రి తా త్ప ర్య ము ——

ఓకృష్ణా! గుప్తవనవాసమున శ్రీసదాశివుని చేతననుగ్రహింపఁబడి నదియును, నజేయమైనదియు నగుధనువు చేతినుండి జాఱుచున్నది. బంధు పరితాపమువలన శరీరమంతయును బరితపించుచున్నది. నిలువఁ జాలను నామనస్సును దిరుగుచున్నది. (వనవాసమునఁ బాండవులు దపమును గావింప సదాశివుఁడు కృపాకరుఁడై విష్ణువును వరాహమునుగాఁజేసి యర్జునుని వలననుండి దానినిగొట్టెను. ఇటధనుర్గ్రహణములోనగు విషయము లెఱుంగఁ దగినవి.) 30.

శ్లో॥ నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ!।
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే॥ 31॥

—— భా ష్య మ్ ——

అథ పునరవ్యవస్థానాసామర్థ్యే కారణ మాహ——నిమిత్తానీతి॥ తత్ర తావత్ కో బ్రహ్మా ఈశో రుద్రః తావస్యేత్యర్థే 'కేశాద్వోఽన్యతరస్యా'మితి వప్రత్యయేన సాధుః ఇతి హే కేశవ! త్వద్బలాత్తయోర్మమాపి బలమస్తి తథాపీదానీం వామాంగ స్ఫురణాదీని విపరీతాన్యేవ నిమిత్తాని పశ్యామీత్యర్థః। అథ చ। 'ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమండలభేదినౌ। పరివ్రాడ్యోగయుక్తశ్చ రణేచాఽభిముఖో హతః॥, ఇత్యాదినా హతస్యైవ శ్రేయో విశేషాభిధానాత్ హంతుస్తు న కించిత్సుకృతమితి యత్ర స్వజనవధానర్థక్యం తత్ర కథం స్వజనం హనిష్యామీత్యాశయః॥ 31॥

—— ల ఘు టి ప్ప ణీ ——

విపరీతాన్యేవే ॥ తతాఽర్జునస్య కాతర్యేణైవ హి వామాంగాని స్ఫురన్తీతి తద్భేద మజానన్నయం ప్రాప్తవానితి గూఢాశయః॥ 31॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

ఓకేశవా! వామాంగస్ఫురణము లోనగు దుశ్శకునము లగుపడు చున్నవి. యుద్ధమునందు బంధుజనులను జంపినయెడల నాకెంతమాత్రమును మేలుగలుగదు. (యుద్ధమునఁ జచ్చిన వీరుఁడును, యోగయుక్తుఁడగు సన్యాసియు నీయిద్దఱు సూర్యమండలమును భేదించుకొని బ్రహ్మలోకము నొందఁగల రను స్మృతిచేఁ జచ్చినవానికి శ్రేయము గలదు గాని చంపిన వానికిఁ గొంచెమైనను బుణ్యము లేదు. అర్జునునకు భయముచేతనే వామాంగస్ఫురణమగు చున్నది. కాని యపశకునములవలనఁ గాదు. క అనఁగ బ్రహ్మ, ఈశుఁడనఁగా రుద్రుఁడు, వీరిద్దఱు గలవాఁడు గానఁ గేశవుఁడు.) ౩౧.

శ్లో॥ న కాంక్షే విజయం కృష్ణ! న చ రాజ్యం సుఖాని చ
కిం నో రాజ్యేన? గోవిన్ద? కిం భోగై? ర్జీవితేన వా? ౩౨

—♦ భా ష్య మ్ ♦—

నను మాఽభూదదృష్టప్రయోజనం విజయో రాజ్యం సుఖాని చ, దృష్టప్రయోజనాని నిర్వివాదానీత్యాహ-నకాంక్ష ఇతి॥ తత్ర తావత్ త్వమపి హేకృష్ణ! కృషవిలేఖన ఇత్యనుశాసనాత్ లోకాన్ రచయస్యేవేతి కృత్వా బంధూన్ సంహృత్య న హి రాజ్యం సుఖాని చాకాంక్షే ఇత్యర్థః। ఏవ మేవ హే గోవిన్ద! 'గోబ్రాహ్మణహితాయ చే' త్యాది పాద్మోక్త్యా 'విప్రాధీనం జగద్భవే' దిత్యాది స్మృత్యా చ తవాపి జగద్రక్షకత్వమేవ యుక్తం। తథాపీదానీం త్వమపి బంధూన్ హత్వా

గా మింద్రియాం రక్షయసీతి తవేశ్వరయోగ్యస్య నైవం యుక్త
మిత్యాశయః॥ ３౨॥

—◆ లఘు టిప్పణీ ◆—

రచయిష్యే వేతి॥ తత్ర యద్యపి జగతాం కర్తా ప్రజాపతి రేవ తథా
ప్యస్య కర్తృత్వసహకారిత్వేన సృష్టికర్తృత్వమప్యవధారిత మితి బోధ్యమ్।
గోబ్రాహ్మణేతి॥ తత్రి గవాం వచన మన్వేతుముక్తమ్ । తద్యథా
'గోచర్మ గోమయం క్షీరం హాలికం ధర్మసాధనమ్ । స్వయం తృణాశనా
గావః కుర్వన్త్యథకి మిచ్ఛసీత్యాదిస్మృత్యాఽపి తాసాం రక్షణకర్తృత్వం
సర్వేషాం యుక్త మిత్యధిక మన్యత్రవిస్తరః॥ ３౨॥

—◆ అర్థ తాత్పర్యము ◆—

పరోక్షములగు ప్రయోజనము లట్లుండునుగాక, ప్రత్యక్షప్రయోజ
నములు విజయరాజ్యసుఖములు నిర్వివాదము లనఁ జెప్పుచున్నాఁడు—
ఓకృష్ణా! నేను విజయమును రాజ్యమును సుఖములను గోరను. ఇట్టి బంధు
వులు మృతినొందిన పిమ్మట నాకు రాజ్యమును భోగములును దుదకుఁ
బ్రతుకైనను నెందులకు? (కృష్ణయనునది కృష-విలేఖనే యను ధాతువు
నుండి పుట్టినది. లోకములను సృజియించువాఁడని యర్థము. లోకసృష్టి
కర్తృత్వము ప్రజాపతి యందున్నను నాతనికి సహకారిత్వముగా నీతని
యం దారోపితము. 'గోబ్రాహ్మణహితాయచ, విప్రాధీనం జగద్భవేత్'
అను స్మృతులవలన గోవిందుఁడన జగత్తును రక్షించువాఁడని యర్థమున్నను
'గా మింద్రియం రక్షయసీ'అనునట్లు, ఈశ్వరశబ్దవాచ్యుండవగు నీకియ్యది
తగినది గాదు.) ３౨.

శ్లో॥ యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖాని చ।
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ॥ ３３

—* భా ష్య మ్ *—

అథ రాజ్యాదీనాం మనాకాంక్షత్వే తు హేతుమప్యాహ—యేషామితి॥ తత్ర తావద్యేషాం తు బంధూనామర్థే నోఽస్మాకం రాజ్యముపేక్షితం భోగాస్సుఖాని చేత్యాది త ఏవైతే ప్రాణాన్ ధనాని చ త్యక్త్వా యుద్ధేఽవస్థితా ఇతి నాఽయం స్వార్థోఽయత్న శ్శోభన ఇత్యర్థః॥ ౩౩॥

—* ల ఘు టి ప్ప ణీ *—

నాయమితి॥ ఇదమపి వాక్యం 'యస్యచ్ఛేదశతంగాత్రంశరముద్గరయష్టిభిః । దేవకన్యా హృతం వీరం హరన్తి రమయన్తిచ' ఇత్యాద్యజానతోక్తమిత్యవధార్యమ్॥ ౩౩॥

—* ఆ న్ధ్రి తా త్ప ర్య ము *—

రాజ్యాదులను గోరకుండుటకుఁ గారణమెద్దియనఁగా—కృష్ణా! రాజ్యమును, భోగములును, సుఖములును నేనెవరికొఱకుఁ గోరుచున్నానో వారే ప్రాణములను ధనములను వదలి యుద్ధమును జేయవచ్చిరి. కాన నాకు రాజ్యాదిక మక్కఱలేదు. (ఎవనిశరీరము యుద్ధమునశస్త్రాదికముచే హతమగునో వానిని దేవతాకన్యకలు దీసికొనివెళ్లి వానితో రమింతురని తెలియక యర్జునుఁడిట్లు పలికెనని తెలియుచున్నది.) ౩౩.

శ్లో॥ ఆచార్యాః పితరః పుత్రాస్తథైవ చ పితామహాః।
మాతులాశ్శ్వశురాః పౌత్రాశ్శ్యాలాస్సంబంధినస్తథా॥ ౩౪॥

—* భా ష్య మ్ *—

నను చ కేషామర్థే రాజ్యాదిక మపేక్షిత మితి తాన ప్యాహ—ఆచార్యా ఇతి॥ ఏవంతర్హి, నాయం యుక్తో బాంధవాదివధ ఇతి తద్వధా దుపరమ్యతే॥ ౩౪॥

—* లఘుటిప్పణీ *—

నాయమితి॥ ఏకో గోత్రే సభవతి పుమాన్ యః కుటుంబం బిభర్తీ త్యాది నీతిధర్మవిరోధా దపీతి బోధ్యమ్॥౩౮॥

—* ఆస్థ్రి తాత్పర్యము *—

ఓకృష్ణా! ఆవచ్చినవారెవరన గురువులును, దండ్రులును, బుత్రులును, తాతలును, మేనమామలును, బావమఱఁదులును, బంధువులును లోనగు వారు ఎవఁడు కుటుంబమును భరించునో, వాఁడొక్కఁడే వంశమున జనించినవాఁడను నీతిధర్మమునకు విరోధముగా నున్నను నీబంధ్వాదివధ నాకిష్టము గాకున్నది. ౩౮.

శ్లో॥ ఏతాన్ న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన!॥
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే॥ ౩౯॥

—* భాష్యమ్ *—

నన్వేవం తర్హి త్వామేవ హత్వైతే రాజ్యం కరిష్యన్తీ త్యేతావ తాహ్యాహ—ఏతాన్నేతి॥ ఏవంసతి హేమధుసూదన త్వమపి తథైవ నతుగురుసూదన! ఇత్యుపదిశన్నపి॥ త్రైలోక్య రాజ్యస్యాపి హేతవే నైతాన్ హనిష్యామి, కిన్నుమహీకృతే మహ్యార్థమిత్యాశయః॥౩౯॥

—* లఘుటిప్పణీ *—

గురుసూదన ఇ॥ తత్ర గురుస్తు స్వపచసైవ మరిష్యతీతి, తద్వాత్త మజానతోక్త మిత్యవధార్యమ్॥౩౯॥

## —* అ న్వ తా త్ప ర్య ము *—

వారు నన్నే చంపి రాజ్యమును జేయుదురన:—ఓమధుసూదనా! నన్ను వారు చంపినను సరియే కాని, లోకత్రయాధిపత్యము లభించినను నేనువారిని జంపనొల్లను. మఱి యీభూమి కొఱకా చంపుదును! నీవు మధుసూదనుడవే కాని గురుసూదనుడవు కావు. (గురువు స్వవచనముచేతనే మరణించునని యీతనికిఁ దెలియదు.) ౩౫.

శ్లో॥ నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యా జ్జనార్దన॥
పాపమేవాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః॥౩౬॥

శ్లో॥ తస్మాన్నార్హావయంహంతుంధార్తరాష్ట్రాన్స్వబాంధవాన్।
స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ!॥౩౭

## —* భా ష్య మ్ *—

నను 'అగ్నిదో గరదశ్చైవ క్షేత్రదారహర స్తథా। బ్రహ్మఘ్నశ్చ కృతఘ్నశ్చ షడేతే ఆతతాయినః॥ ఆతతాయిన మాయాన్తం హన్యా దేవావిచారయన్ ఆతతాయివధే దోషో హంతుర్భవతి కశ్చన ఇత్యాది ధర్మప్రబంధా దవశ్యమేవైతే హంతవ్యా స్తథాపీహ వ్యవహారమాత్ర మవలంబ్యాహ —నిహత్యేతి॥ ఏవంతర్హి ఫలాభావా దనర్థకఫలకత్వాచ్చ నార్హావయం స్వబాంధవాన్ హంతుం యుక్తా ఇత్యర్థః। యత స్త్వమపి లక్ష్మీపతిత్వా న్మాధవఏవేతి నాలక్ష్మీకే లక్ష్మీవినాశకే కర్మణి ప్రవర్తయితు మర్హసీతి స్వజనం హీత్యనేన స్ఫుటీకృత మితి ద్యోతార్థః॥ ౩౬-౩౭॥

## —* లఘుటిప్పణీ *—

వ్యవహారే ॥ తత్ర తావదిదమపి 'యదిదం వేదవచనం లోకవాదే విరుధ్యతే । ప్రమాణే చాప్రమాణే చ విరుద్ధే శాస్త్రతా కుతః' ఇత్యాది స్మృతి విరుద్ధమేవ సహసోక్త మిత్యవధేయమ్॥ అనర్థే॥ ఇహాప్యర్థ ఫల కత్వమేవ యుద్ధస్యేత్య జానతోక్తమ్॥ ౩౬॥ ౩౭॥

## —* ఆన్ధ్రి తాత్పర్యము *—

ఇల్లు తగులఁబెట్టినవాఁడును, విషము వెట్టినవాఁడును, పరగృహమును పరస్త్రీని హరించినవాఁడును, బ్రహ్మహత్య చేసినవాఁడును, చేసిన మేలును మఱచినవాఁడును ననునీయార్గురును నాతతాయులు, ఆతతాయి వచ్చుచుండఁగా విచారింపకయే చంపవచ్చును. ఇట్టివానిని జంపినవానికిఁ బాపము రాదు. అని ధర్మశాస్త్రమును బట్టి తెలియుచున్నను వ్యవహారము నాశ్రయించి యిట్లు చెప్పుచున్నాఁడు—ఓ జనార్దనా! ఈదుర్యోధనాదు లను జంపినచో మనకేమి సంతోషము కాఁగలదు. మహాపాతకులైన వీరిని జంపినయెడల మనకు పాపమే కలుగును. కావున నోమాధవా! స్వబంధువులైన యీధార్తరాష్ట్రులను జంపుట మనకుఁ బాడిగాదు. స్వ జనులను జంపినచో మనమెట్లు సుఖులము కాఁగలుగుదుము.(నీవు లక్ష్మీపతి వగుటవలన మాధవుఁడవు. అలక్ష్మీకమును లక్ష్మీవినాశకమును నైన కార్యమున నన్నుఁ బ్రవర్తింపఁ జేయవచ్చునా?

శ్లో॥ యద్యప్యేతే న పశ్యన్తి లోభోపహత చేతసః।
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్ ॥ ౩౮॥
కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మాన్ని వర్తితుమ్।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన!॥ ౩౯—

—* భా ష్య మ్. *—

నను 'ఫలతోఽపి చ యత్కర్మ నానర్థేనానుబధ్యతే। కేవలప్రీతిహేతుత్వా త్తద్ధర్మ ఇతి కథ్యతే॥' ఇత్యాదిస్మృత్యా శ్యేనయాగాదావివ నాస్మాకం ప్రవృత్తి రుచితేత్యాహ-యద్యపీతి॥ ఏవం త్వా యద్యప్యేతే 'ఆహూతో న నివర్తేత ద్యూతాదపి రణాదపీ' తి మన్యమానా శ్శ్యేనాది వదనర్థం నపశ్యన్తి తథాప్యస్మాభిః తజ్జ్ఞాతృభిః కథం న జ్ఞాతవ్యం తతో నివర్తితుం చ శక్నుమో యత స్త్వమపి జనానర్దయసీతి జనార్దనఏవ నతుహింసక ఇతి ద్వయోరర్థః॥ ౩౮॥ ౩౯॥

—* ల ఘు టి ప్ప ణీ *—

కథ్యత ఇతి॥ యథా లోకే జఘన కండూయనాదీని నదోషాయ నవా పరమార్థతః ఫలాయ చేత్యేవ మపీదం నాస్తి కింత్వనర్థమేవా ఽప్రియుద్ధే పశ్యామ ఇత్యతో నకరిష్యామ ఇత్యాశయః నన్వేతే కుతో నపశ్యన్తీత్యాహ॥ ఏవంత్వే॥ తత్రైవం సత్యేతే దురాగ్రహ మాపన్నా లోభోపహత చేతసశ్చ నపశ్యన్తి కిం తత ఇత్యాశయః॥ ౩౮॥ ౩౯॥

—* ఆ న్ధ్ర తా త్ప ర్య ము *—

కేవలప్రీతినొసంగుచు ననర్థమును గలిగింపక ఫలము నిచ్చునది ధర్మ మనఁబడును. అనర్థావహమగు ధర్మమున మనకుఁ బ్రవృత్తి యుచితము గాదని చెప్పుచున్నాడు—రాజ్యమునందలి పేరాసచే బుద్ధిలేని వీరు స్వకుల నాశనముచే నగు దోషమును మిత్రద్రోహమువలని పాతకమును జూడకున్నారు. ద్యూతమునకుఁగాని యుద్ధమునకుఁగాని పిలిచినప్పుడు క్షత్రియుఁడు వెనుకఁబోరాదను నియమమును బట్టి మున్ను మేము జూదమాడి

రాజ్యభ్రష్టుల మైతిమి. ఓ జనార్దనా! స్వకులనాశనమువలని పాపము నెఱుంగునట్టి మనమీపాపకార్యమునుండి తొలంగుట కుపాయము నేల యెఱుంగరాదు? (జఘన కంటకాయమనాములందుఁ బరమార్గలాభము లే కున్నను దోషావహము గాదు. ఇందనర్థమే కాని ఫలము లేదు. కావున యుద్ధము సేయఁజాలము. దుర్యోధనాదు లెఱుంగ రాయన్న వారదురాగ్రహ గ్రస్తులై రాజ్యలోభముచే మతిలేనివారై యున్నారు. వారెఱుంగు టెట్లు? ३८-३९. జనార్దనుఁడన జనులను రక్షించువాఁడని యర్థము నీకెదితగను).

శ్లో॥ కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాస్సనాతనాః
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మో ఽభిభవత్యుత॥४०॥

—* భాష్యమ్ *—

నన్వస్త్వేవం తథాప్యాహూతో ననివర్తేతే త్యాదినా వశ్యం కర్తవ్య మేవేతి చేత్తత్రాహ—కులక్షయఇతి॥ ఏవంకుల క్షయే సతి కుల ధర్మా నిత్యాగ్నిహోత్రాదయో రాజ సూయాదయశ్చ సనాతనా ధర్మాః ప్రణశ్యన్తి ప్రత్యుతా ధర్మఏవేత్యర్థాంత రాహ త్తిరితిభావః॥४०॥

—* లఘుటిప్పణీ *—

నిత్యాగ్నిహోత్రేతి॥ తద్యథా, 'సంధ్యా స్నానం జపో హోమో దేవతానాంచపూజనమ్, అతిథ్యమగ్నిహోత్రంచ షట్కర్మాణిదినేదినే' ఇత్యాది ద్రష్టవ్యమ్॥४०॥

—* ఆన్ధ్రతాత్పర్యము *—

యుద్ధమునకుఁ బిలువఁబడినవాఁడు మఱలఁ గూడదన్నచోఁ జెప్పు చున్నాఁడు— కులక్షయ మయ్యెనేని కులధర్మములు (స్నానము, సంధ్య,

జపము, హోమము, దేవతార్చనము, ఆతిథ్యము, అగ్నిహోత్రము, ఇవి యాఱు షట్కర్మలు.) నిత్యాగ్నిహోత్రాదులును, రాజసూయాదులును నగు సనాతన ధర్మములు క్షీణించుచున్నవి. ధర్మము క్షీణించిన వెంటనే వంశమంతయును నధర్మములో మునిఁగి పోవును. కావునఁ గులనాశన మధర్మమునకుఁ గారణ మగును.

శ్లో॥ అధర్మాభిభవా త్కృష్ణ! ప్రదుష్యన్తి కులస్త్రియః।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ! జాయతే వర్ణసంకరః॥ ౪౧

—✻ భాష్యమ్ ✻—

ననుచ కీదృశ స్తత్రాఽధర్మ ఇత్యాహ- అధర్మేతి॥ ఏవం సతి 'అశుద్ధే స్నాపరిత్యజ్యో హి మహాపాతకదూషితః నస్త్రీణాం జాయతే శుద్ధి ర్యోనౌ శుక్రాభిషేచనాత్' ।ఇత్యాది స్మృత్యాఽధర్మస్యాఽభిభవా దాధిక్యా త్పురుషాణాం ప్రాయశ్చిత్తా చ్ఛుద్ధిరపి స్త్రీణాంతు సర్వథైవ శుద్ధిరాహిత్య మే వేత్యాశయః॥౪౧॥

—♦ ఆన్ధ్ర తాత్పర్యము ♦—

అధర్మమువలనఁ గలుగునష్టమెద్ది యన?—మాధవా! అయధర్మము వృద్ధి నొందుటవేఁగులకాంతలు చెడుదురు. పురుషులపాతకములు ప్రాయశ్చిత్తముచేత శుద్ధి నొందును. వ్యభిచారముచే స్త్రీలకుఁ గలుగునట్టి యోని యందు శుక్లపాతరూపపాతకమునకు శుద్ధిలేదని శాస్త్రములు నుడువు చున్నవి. స్త్రీలెపుడు చెడుదురో, యపుడు తప్పక వర్ణసంకరము కాఁగలదు. ౪౧.

శ్లో॥ సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ।
పతన్తి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః॥౪౨॥

—* భాష్యమ్ *—

నన్వేవమపి తతః కిం భవిష్యతీత్యాహ—సంకర ఇతి॥ తథాసతి కులఘ్నానాం సంకరో నరకాయైవ భవతీత్యన్వయః తత్ర న కేవలం కులఘ్నానామేవ నరకపాతః కింతు తత్పితౄణామ పీత్యాహ— పతన్తీతి॥ ఏవంతర్హి 'వర్ణధర్మాశ్చ యే మర్త్యా యే చాఽన్యే చ్యుతగోత్రిణః, కాషాయిణస్తథాఽన్యే ఽపి సర్వే నిరయగామినః' ఇత్యాది పాద్మస్మృత్యా ఏవ మగోత్రభిదం గోవిందం వజ్రబాహు మిత్యాదిశ్రుతి మూలకత్వేన। భవిష్యన్తీంద్రశిక్షితా ఇత్యాది స్కాందస్మృత్యాచహి యతో లుప్తపిండోదక క్రియా స్తత స్తేషాంపితరోఽపి పతన్తీత్యాశయః॥ ౪౨॥

—* లఘు టిప్పణీ *—

ఏవమిత్॥ ఏవమిహ నగోత్రాణి యేషాం తే ఽగోత్రిణ శ్చ్యుతి గోత్రిణ స్తాన్ భిన త్తీత్యగోత్రభిత్, తమగోత్రభిదమిత్యర్థః॥ ౪౨॥

—♦ ఆన్ధ్ర తాత్పర్యము ♦—

ఆ వర్ణసంకరము కులనాశన మొనర్చినవారికిని, కులమునకును దుర్గతిని గలిగించును. తరువాత పిండోదకము లేనివారై వారిపితృదేవతలు నరకములపాలయ్యెదరు. (గోత్రములు లేనివారును, గోత్రభ్రష్టులును దాము నరకములఁ బడుటయే గాక తమపితృదేవతలను సయితము నరకములందుఁ బడవేయుదురని తా. ౪౨.

శ్లో॥ దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః॥ ౪౩

—♦ భాష్యమ్ ♦—

నన్వస్త్వేవం ధర్మయుద్ధే ఐహికం పారమార్థికం వా సిద్ధ్యతు । పరంతు, సాంకర్యప్రదః కులఘ్నదోషస్తు వినాసతీ భావం । కథం నిర్వహేత సచ సర్వాసాం న సంభవతీత్యాహ-దోషైరితి॥ ఏవంతర్హి, 'రాజర్షిర్నైవ బ్రహ్మర్షిర్నవావర్ణాశ్రమీ యతః। ఋణత్రయాభావేద్యస్తు కులఘ్నస్సోఽప్యదీక్షితః' ఇత్యాది పాద్మస్మృత్యా వర్ణసంకరకారకైరేతైః కులఘ్నానాం దోషైర్జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతా ఉత్సాద్యన్త ఇత్యర్థః॥ ౪౩

—♦ లఘుటిప్పణీ ♦—

ఋణత్రయేతి॥ తత్ర నహి దైవాదిఋణత్రయవిముక్తింవినా 'స్వతో పరతో వాస్యాపి కైవల్యసిద్ధిరిత్యుర్వారుకమివేత్యాది శ్రుత్యాఽప్యవధార్యమ్ । స్మృతిశ్చ 'దేవోపాసనయా దైవం పైత్రం తు పుత్రతో జయేత్ । వ్రతోపవాసనయార్షం త్రిభిస్తు పరమం జయేత్' ఇత్యవధేయమ్॥ ౪౩॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

వర్ణసాంకర్యము గావించు కులనాశకుల దోషములచేత శాశ్వతము లగు జాతిధర్మములును, వర్ణధర్మములును నశింపఁజేయఁబడుచున్నవి. బ్రహ్మర్షులు, రాజర్షులు, వర్ణాశ్రములును, వీరు ముగ్గురును, దేవఋణము, ఋషిఋణము, పితృఋణమును గలవారై యుందురు. దేవోపాసనచేత దేవఋణమును, పుత్రోత్పాదనచేతఁ బితృఋణమును, వ్రతోపాసనలచేత ఋషిఋణమును, ఈమూఁటిచేతఁ బరమపదమును బొందఁగలరని స్మృతి. ౪౩.

శ్లో॥ ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన!।
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ॥ ౪౪

—◆ భాష్యమ్ ◆—

నను చ తతః పరం కిం భవిష్యతీత్యాహ—ఉత్సన్నేతి॥ తథా సతి। 'అసూర్యా, నామ తే లోకా అంధేన తమసా వృతాః తాగ్‌స్తే ప్రేత్యాభిగచ్ఛన్తీ త్యాదిశ్రుత్యనుశాసన మపీత్యవధార్యమ్॥౪౪॥

—◆ ఆన్ధ్ర తాత్పర్యము ◆—

ఓకృష్ణా! కులధర్మములు లేనిమానవులు స్థిరముగా నరకలోకమున నివసింతురని వినుచున్నారము. అట్టివారు మృతినొందిన సూర్యరశ్మి లేక యంధకారబంధురములైన లోకముల బొందుదురని శ్రుతిప్రమాణము. ౪౪,

శ్లో॥ అహో! బత! మహత్పాపం కర్తుం వ్యవసితావయమ్।
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః॥ ౪౫

—◆ భాష్యమ్ ◆—

నను'యు ఆహవేషు వధ్యన్తే భూమ్యర్థ మపరాఙ్ముఖాః ఆకూటై రాయుధై ర్యాంతి తే స్వర్గం యోగినో యథా॥' ఇత్యాదియాజ్ఞవల్క్యోక్తధర్మస్మృత్యాధర్మయుద్ధ స్యావశ్య కత్వేఽప్యాహ—అహో బతేతి॥ తత్రైవం సతి। 'నాఽహం ధర్మయుద్ధం విస్మరామఃకింతు యద్రాజ్యసుఖలోభేనేత్యాది రీత్యా స్వజనం హంతు ముద్యతాః వయ మిత్యేతావతైవ విస్మరామ ఇత్యాశయః॥౪౫॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

అపరాఙ్ముఖాఇతి॥ తద్యథా, 'లలాటదేశే రుధిరం స్రవద్యదస్య స్యాహవే తు ప్రవిశేచ్ఛవ క్త్రిమ్। తంసోమపానేనకిలాలతుల్యం సంగ్రామయజ్ఞే విధివచ్చ దృష్టమ్॥' ఇత్యాదిధర్మప్రబంధరీత్యా౽నుధార్యమ్॥౪౫॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

అక్కటా! మనము మిక్కిలి పాపమును చేయుటకు బ్రియత్నించినారము. ఎందుకనఁగా రాజ్యమునందలి పేరాసచేత నిపుడు స్వజనమును జంప యత్నించినారము గదా! ఇయ్యది మహాకష్టము. కృష్ణా! ధర్మయుద్ధమును నేను మఱవను యుద్ధమునందు బరాఙ్ముఖుఁడనుగాను కాని, రాజ్యలోభముచే నగు నీస్వజనహననమును మఱచువాఁడను.

శ్లో॥ యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్॥ ౪౬

—♦ భా ష్య మ్ ♦—

ఏవం సతి। యుద్ధేన మరణమేవ శ్రేయ స్స్వర్గ్యాహ-యదీతి॥ తథా సత్యప్రతీకారం వ్యాపార మకుర్వాణం మాం అశస్త్రం శస్త్రపాణయో యది ధార్తరాష్ట్రా హన్యు స్తన్మే క్షేమతరం భవేదితి పరమార్థః॥౪౬॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

శస్త్రధారులైన దుర్యోధనాదులు శస్త్రములు లేక వారిపైఁ గదియక యూరకున్న నన్ను యుద్ధమునఁ జంపుదురేని యదియు నాకు మిగుల క్షేమమునే కల్గించును, ౪౬.

సంజయ ఉవాచ:—

శ్లో॥ ఏవముక్త్వాఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్
విసృజ్యసశరం చాపం శోకసంవిగ్నమానసః॥ ४८

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణాఽర్జున సంవాదే
అర్జున విషాదయోగః.

—* భా ష్య మ్ *—

అథాతః పరం సంజయ స్సర్వం పూర్వోక్తవృత్తం స్మారయన్ భగవత శ్శివస్యగీతేత్యుపసంహరతి-ఏవమితి॥ తత్ర తావత్పూర్వం యుద్ధార్థ ముత్థితః ఇదానీంతు సంఖ్యేసంగ్రామే యుద్ధోపకారిన్నాన్ బంధూ నవలోక్య రథోపస్థే రథస్యోపరి సశరం చాపం విసృజ్య శోకసంవిగ్నమానస స్సన్నుపరరామే త్యాశయః॥ ४८॥

ఇతి శ్రీ శ్వేతాచార్య గురుచరణ శిష్యభావ సమాసాదిత
శైవసిద్ధాన్త ప్రవర్తక శ్రీ శ్రీకంఠ శివాచార్య విరచితే
తత్త్వైక దర్శన నామకే గీతాభాష్యే
అ ర్జు న వి షా ద యో గః.

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

భగవత్త్వఇతి॥ తత్రి తావదేకాఽపి శక్తిః పరమేశ్వరస్య భిన్నా చతుర్ధా వ్యవహారకాలే । భోగ్యే భవానీ పురుషే చ విష్ణుః క్రోధే చ కాళీ సమరే చ దుర్గా' ఇత్యాదిశ్రుత్యా తాత్త్వాన్యద్విగ్రహోదారా ఇతివచ్చ

భోగో విష్ణుః స్త్రీత్వేన విద్యతే యస్యస భగవాన్ శివస్తస్యగీతేత్యర్థ ఇత్యాశయః॥ ౪౭॥

ఇతి శ్రీ శ్రీకణ్ఠశివాచార్య శిష్య విశ్వేశ్వర శివాచార్య
విరచితాయాం లఘుటిప్పణ్యాం అర్జునవిషాదయోగః

## —♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

సంజయుఁడు పూర్వము చెప్పినవృత్తమును స్మరింపజేయుచు భగవంతుఁడగు శివుని గీతయని యుపసంహరించుచున్నాఁడు—

సంజయుఁడిట్లనియె—యుద్ధమును జేయఁజనుదెంచిన యర్జునుఁడా వచ్చిన స్వబంధువులను జూచి దుఃఖాక్రాంతస్వాంతుఁడై యిట్లుశ్రీకృష్ణునితో వచించి బాణసహితమైన ధనువును విడిచి రథముమీఁదనే కూరుచుండెను. (పరమేశ్వరునిశక్తి యొక్కటి యయ్యును వ్యవహారకాలమందు నాలుగువిధములుగా బరిణమించినది. ఎట్లన:—భోగ్యావస్థయందు భవానియనియు, జీవవ్యవహారమున విష్ణువనియుఁ గ్రోధమునఁ గాళియనియు, యుద్ధము సేయునపుడు దుర్గయనియును, వ్యవహరింపఁబడుచున్నది. ఈశ్వరశక్తిచాతుర్విధ్యమీవిధముగా నెఱుంగవలెను. భగమనఁగావిష్ణువువిష్ణుర్యోనిం కల్పయ త్వితి శ్రుతిప్రమాణము. భగముగలవాఁడు శివుఁడు భగవద్గీతయన శివగీత యని తాత్పర్యము, ఇట్లు గీతాప్రథమాధ్యాయమునకు బాహ్యార్థము తెలుపఁబడెను. అంతరార్థమేమనఁగా; అర్జునుండను ముముక్షువు మోహపాశబద్ధుఁడై 'ఇది నాది, వీరు నావాండ్రు' అనెడు వ్యూహమును (పాశమును) భేదింప లేక, కామక్రోధాది శత్రువులను బంధువులనుగా భ్రమసి వారిని జయింపలేక శరీరమను రథంబునఁ గూర్చుండె నని యంతరార్థము.

ఇట్లు తత్త్వైకదర్శనమను శ్రీకణ్ఠీయ గీతాభాష్యమునకు బోధానంద
మహర్షిచే రచియింపబడిన భావబోధ మను నాంధ్ర
తాత్పర్యమున అర్జునవిషాదయోగము.

---

ఓమ్

# శ్రీమచ్ఛ్రీకంఠాచార్యకృతే

# శ్రీ భగవద్గీతా భాష్యే

సాంఖ్యయోగః

సంజయ ఉవాచ:—

శ్లో॥ తం తథా కృపయావిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్
విషీద న్తమిదం వాక్య మువాచ మధుసూదనః॥ ౧

—♦ భాష్యమ్ ♦—

బ్రహ్మాక్షయం మృషా జీవో మాయాత్వేనచ నశ్వరః
యుధ్యస్వేత్యర్జునా యోక్తం ద్వితీయే సాంఖ్యదర్శనమ్। అథ ధృతరాష్ట్రస్య హర్షప్రయోజనకం వృత్తం సంజయేన కిము క్త మిత్యాహ-తం తథేతి॥ ఏవంసతి, తమర్జునం పూర్వోక్తరీత్యా కృపయాఽఽవిష్టం కథమపి యుద్ధం న కరిష్యామీత్యశ్రుపూర్ణాకులేక్షణం విషీద న్తం ప్రతీదం వాక్యం మధుసూదనోఽ ప్యువాచేతి భావః॥ ౧॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నన్విదానీం యుద్ధాంగీకారే తన్నివృత్తౌ చ భిక్షాటన మిత్యనయో ర్మధ్యే తదేకస్య నిశ్చయార్థం ద్వితీయాధ్యాయ మారభతే-బ్రహ్మేతి॥ తత్ర తావత్ 'అవినాశీ అరే ఆత్మా తం విజిజ్ఞాసస్వే' త్యాదిశ్రుతేః। 'శివ మేక మనాద్యన్త మవినాశిన మీశ్వర' మిత్యాదిస్మృతేశ్చ బ్రహ్మేత్యయం వస్తు మాయాత్వేన మృషా నశ్వరశ్చేతి ద్వితీయే సాంఖ్యదర్శనమిత్యర్థః॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

అవతారిక--పరమాత్మ దేహముకంటె భిన్నమై నాశరహితమైనదిం జీవాత్మ మాయ యగుటచే నశ్వరుఁడు. శాస్త్ర విహితధర్మములను ఫలాపేక్ష లేక చేయుటయే. యట్టి యాత్మ సాక్షాత్కారమునకు సాధనమని తెలియక, యర్జునుఁడు దేహమే యాత్మ యనియు, యుద్ధాదికము పాప మనియును భ్రమించి మోహితుఁడై యుద్ధమును మాన నిశ్చయింపగాఁ నాతనిమోహమును పోఁగొట్టుటకు ఆత్మనిత్యత్వమును గుఱించిన సాంఖ్య జ్ఞానమును, అట్టి జ్ఞానముతోఁగూడి ఫలాపేక్షారహితకర్మానుష్ఠానరూపమై యున్న కర్మయోగమును, దాని కుద్దిష్టఫలమైన స్థితప్రజ్ఞత్వమును జ్ఞానయోగమును, అస్థితప్రజ్ఞతచే సాధ్యమగు నాత్మదర్శనయోగమును, స్థితప్రజ్ఞతయొక్క స్వరూపమును, దానిని సాధించుట కింద్రియజయమావశ్యకమగుటయు, నట్టి యింద్రియజయమునకు శ్రవణమననధిధ్యాసలు సాధనములనియు, అన్యోపాయముచేత దానిని సాధించువారికిఁ గలుగు కీడును ఈయధ్యాయమునఁ గృష్ణునిచే వివరింపఁబడుచున్నవి.

పూర్వాధ్యాయమున నర్జునవిషాదయోగమువలన 'అహం బద్ధో విముక్తస్స్యామితి యస్యాస్తి నిశ్చయః నాత్యంతమజ్ఞో నోతజ్ఞస్సోఽస్మిన్ శాస్త్రేఽధికారవాన్' అనునట్లు బంధవిముక్తిద్వారా ఉత్తమగతిని గోరుటయు, విశేషజ్ఞానము లేకుండుటయు, తత్వజ్ఞుఁడు గాకుండుటయు

విద్యావి యధికారిలక్షణములని యోగవాసిష్ఠమునందుఁ జెప్పఁబడిన విధమున నెఱుంగనగును. ఈలక్షణములు గలవాఁడే వేదాంతశాస్త్రమునకు నధికారియని తెలిసికొనవలెను. తర్వాత ధృతరాష్ట్రునకు సంతోషమును గల్గించు వృత్తాంతమును సంజయుఁడేమి చెప్పెననఁగా:—అర్జునుఁడు దయాసమేతుఁడై బంధువర్గమును జంపలేక, కన్నీరు విడుచుచు ధనుర్బాణములను వదలి 'నేను యుద్ధమును జేయను' నని రథముమీదఁ గూర్చుండి విచారించుచుండెను. అట్టివానితో శ్రీకృష్ణుఁడిట్లు పలికెను. 'ఓయర్జునా నీవు యుద్ధమును జేయుదువా? లేక భిక్షాటనమును జేయుదువా? ఈరెంటిలో నేదైన నొకదానిని నిశ్చయించుకొనవలయును. ఎట్లుచేసినను బరమపురుషార్థము లభ్యము. అవినాశియగునాత్మ నెఱింగినచో ముక్తుఁడవు కాఁగలవు. ఆత్మ యనఁగా బరమాత్మ. అదియే శివుఁడు. అట్టి శివునిఁ దెలిసికొనిన యెడనమృతస్వరూపుఁడవు కాఁగలవు. స్వయంప్రకాశజ్యోతియైన పరశివుని దానుగా నెఱింగినవాఁడు సర్వపాశములచే విడువఁబడి పతియైన పరమాత్మలో గలియును॥ ౧॥

శ్రీకృష్ణ ఉవాచ—

శ్లో॥ కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్।
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున!॥ ౨

—• భాష్యమ్ •—

నను తస్మై అర్జునాయ కృష్ణః కి మువాచేత్యాహ— కుతస్త్వేతి॥ కుతస్త్వాంప్రతికశ్మలం శిష్టగర్హితత్వేనమాలిన్యం విషమేఽసమయే సముపస్థిత మిత్యర్థః॥ తత్కథం పునరిత్యాహ— అనార్యేతి। తత్ర తావన్న వేదమర్యాదయా జుష్టం। న వా స్వర్గాయహితంనవాకీర్తి ప్రయోజకమితి సర్వథాతదిద మనర్థక

మిత్యాది మధుసూదనార్జునేత్యాది పదార్థానుసంధానేన
వివదద్భ్యాం దర్శిత మిత్యాశయః ॥౨॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయర్జునా! పామరులకు సహజముగా నుండి వేదమర్యాదాదూర
మైనదియు, స్వర్గమునకు (పరలోకమునకు) విరోధియైనదియు, నపకీర్తికిఁ
గారణమైనదియు నగు నీమోహము సమయము గానియప్పుడు నీకెందులకు
సంభవించెను? మధుసూదనుఁ డనగాఁ దుష్టులను శిక్షించువాడు. అర్జు
నుఁడనగాఁ బరిశుద్ధమైనవాఁడు. దుష్టశిక్షణము మలినత్వము తగదని
యాపదములచే సూచితము)॥ ౨॥

శ్లో॥ క్లైబ్యం మాస్మగమః పార్థ! నైతత్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప!॥ ౩

—♦ భా ష్య మ్ ♦—

ననుకిమత్ర మయి న యుక్త మిత్యాహ-క్లైబ్యమితి।
ఏవం సతి పార్థత్వే నార్జునత్వే నాపి తదయోగ్యత్వ మాహ -
నైతదితి॥ పరం శత్రుం తాపయసీతి హేపరంతప! క్షుద్ర
శౌర్యాది గుణరహితం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ
యుద్ధాయ సంరబ్ధో భవేత్యర్థః॥ ౩॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

నీయందున్న యయుక్త మెద్దియనగా—ఓయర్జునా' భయమును
జెందకుము. ఇది నీకు మంచిది గాదు. శౌర్యాదిగుణములచే శత్రువులను
దపింపఁ జేయువాఁడవు. తుచ్ఛమైన హృదయదౌర్భల్యములు బాఱఁ
ద్రోలి యుద్ధసన్నద్ధుఁడవు కమ్ము.

అర్జున ఉవాచ—

శ్లో॥ కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన!।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరి సూదన!॥ ౪

—♦ భాష్యమ్ ♦—

నను నాఽయం మమ శోకమోహాదివశాత్ స్వధర్మస్య త్యాగః కింతు స్వధర్మత్వాభావా దధర్మత్వాచ్చాస్యయుద్ధస్య త్యాగో మయా క్రియత ఇత్యాహ-కథమితి॥ అత్ర యుద్ధే భీష్మంపితామహం ద్రోణాచార్యం మహా న్తంప్రతి యత్ర వాచాఽపి యోద్ధు మనుచితం తత్ర సంఖ్యే రణే తతాఽపీషుభిః కథం ప్రతియోత్స్యామ ఇత్యర్థః॥ యత స్తౌ పూజార్హౌ కుసుమాదిభి రర్చన యోగ్యా విత్యవధార్యమ్॥౪॥

—♦ లఘుటిప్పణీ ♦—

యత్రవాచాఽపీతి॥ 'గురుం హుంకృత్య తుంకృత్య విప్రాన్నిర్జిత్య వాదతః। అరణ్యే నిర్జలే దేశే సంభవే ద్బ్రహ్మరాక్షసః. ఇత్యాది స్మరణా దితిభావః॥ ౪॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము —

అర్జునుండిట్లనియె— ఓమధుసూదనా! పుష్పములచేఁ బూజింపఁదగిన గురువులైన భీష్మద్రోణులను యుద్ధరంగమున బాణములచే నేనెట్లు కొట్టుదును. ఇది ధర్మము గాదు గాన నేను యుద్ధముచేయను. (గురువుమ హుంకరించి కొట్టినవాఁడును, బ్రాహ్మణుని శబ్దముచే జయించినవాఁడును నరణ్యమునందలి నిర్జలదేశమున బ్రహ్మరక్షస్సగు' నను ప్రమాణముంబట్టి యిట్లు వచించెను॥ ౪॥

శ్లో॥ గురూ నహత్వా హిమహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే।
హత్వాఽర్థకామాం స్తు గురూ నిహైవ
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్॥ ౫

—♦ భాష్యమ్ ♦—

నన్వ స్త్వేవం పరం తు త్వం కిం కరిష్యసీత్యాహ-గురూ నితి॥ మహానుభావాన్ వృద్ధత్వేన భీష్మాదీన్ ఆచార్యత్వేన చ ద్రోణాచార్యాదీన్ గురూ నహత్వా భైక్ష్యమపి భోక్తుం శ్రేయో న తు తద్వధేన రాజ్య మిత్యర్థః నను కి మేతే మరిష్య న్తీత్యత్ర నిశ్చయాభావఇత్యాహ-హత్వార్థేతి॥ ఇహైతా దృశాన్ మృత్యుకామాన్ హత్వా భోగానేవ యది భుంజీయ చేత్తర్హి రుధిరప్రదిగ్ధానే వాతత్యంత జుగుప్సితానేవ తాన్ జానీమ ఇత్యర్థః॥౫॥

—♦ లఘుటిప్పణీ ♦—

భైక్ష్యమితి॥ తత్రి 'తద్య సమూహ' ఇత్యధికారే ష్యఞ్ప్రత్యయే కృతేభిక్షాణాం సమూహో భైక్ష్య మిత్యర్థః । న త్వేకతో బహుధనం భిక్షయిత్వా స్వస్థ స్తిష్ఠామీత్యర్థః॥ ౫॥

—♦ ఆంధ్రతాత్పర్యము ♦—

మహానుభావులును పెద్దలును నైన భీష్మాదులను, నాచార్యులైన ద్రోణాచార్యాదులను జంపుటకన్న లోకంబున బిచ్చమెత్తుకొని జీవించుటయె మంచిది. ఏలయనఁగా వారు, విరక్తులు గారు మనవలెనే.

భోగములందు మిక్కిలి యపేక్ష గలిగియున్న వారు అట్టివారిని జంపి వారనుభవించుచుండిన భోగములనా నేననుభవింపవలెను? అయ్యవి నెత్తుటఁ దడిసినవిగదా! వానికన్న నసహ్యము లేయవి కలవు? వానివలన నిహలోకసుఖ మేమాత్రమును గలుగదు. వారనుభవించుచుండిన భోగములను వారుండిన తావులందే కూర్చుండి యెట్లనుభవింతును? కావున వానికన్న భైక్ష్యమే మిన్నయని నాతలఁపు (భైక్ష్యమనుచోట) సమూహార్థములో వచ్చిన ష్యఞ్ ప్రత్యయ ముండుటవలన నేమర్థమనః—ఒకచోట గొప్పధనమును యాచించి యుండక యందందుఁ దిరుగుచుండువని తా॥ ౫॥

శ్లో॥ నచైతద్విద్మగ కతరన్నో గరీయో
యద్వా జయేమ యదివా నో జయేయుః
యానేవ హత్వాన జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥ ౬

—♦ భాష్యమ్ ♦—

నను ‘గురోరప్యవలిప్తస్య కార్యాకార్యమజానతః ఉత్పథ ప్రతిపన్నస్య పరిత్యాగో విధీయతే’ ఇత్యాదిస్మృత్యా యుద్ధగర్వేణావలిప్తానాం అన్యాయ ఏవ రాజ్యగ్రహణే శిష్యద్రోహేణచ కార్యాకార్య వివేకశూన్యత్వే నోత్పథత్వమపీత్యేషాంవధ ఏవోచిత ఇత్యాహ—న చైతదితి॥నన్వ స్త్వేవం పరంతు భుక్తేఽపి లశునే న వ్యాధేశ్శాన్తి రితిన్యాయేన కతరత్కిం నోఽస్మాకం గరీయః శ్రేష్ఠత్వం భవిష్యతి యద్వై తేషాం గరీయః శ్రేష్ఠత్వం భవిష్యతీతి వయం జయేమో యద్వైత ఏవ జయేయురితి నజానీమ ఇత్యర్థః నను గుప్తవనవాసే శబరరూపిణా

స్సదాశివస్య సర్వస్వవరదానా త్తదైవ జయో భవిష్యతీతి తత్రాప్యాహ—యానేవేతి॥ ఏవంతర్హి యానేవ బంధూన్ హత్వా జీవితుమపి వయం నేచ్ఛామః కిమత్ర విషయాన్ రాజ్యభోగరూపా నుపభోక్తుం తిష్ఠామో యత స్తఏవాత్ర ధార్తరాష్ట్రాః ప్రాణాం స్త్యక్త్వాధనానిచావస్థితయఇత్యాశయః॥

—♦ లఘుటిప్పణీ ♦—

పరిత్యాగ ఇతి॥తదేవ స్కాందేఽప్యుక్తమ్। తద్యథా నారదో హి పురాభ్రాన్త్యా కిరాతం గురు మావహన్ సనత్కుమారతః పశ్చాత్ శైవం దీక్షాం సమాచరత్॥' ఇత్యాది ద్రష్టవ్యమ్॥సర్వస్వేతి॥ తదితం స్కాందే ఽప్యుక్తమ్ తద్యథా'నరో నారాయణశ్చైవ సాంబ మిష్ట్వాపురా ఖలు సర్వస్వవర మాకాంక్ష్య లబ్ధవాం స్తత్ర మాదనః' ఇత్యాద్యవధార్యమ్॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

పూర్వము నారదుఁడు భ్రాన్తిచే నొక కిరాతుని గురువునుగాఁజేసికొని తెలిసికొన్నవాఁడై సనత్కుమారునికడకేగి శైవదీక్షను బొందినట్లుస్కాందమునఁ గలదు. కుమార్గగామియగుగురువు త్యాజ్యుఁడు.ఎట్లన గర్వితుఁడును గార్యాకార్యములు దెలియనివాఁడును ధర్మమార్గమునఁ బ్రవర్తింపనివాఁడు నయిన గురువును బరిత్యజింపవచ్చును. మఱియును దండింప వచ్చును. ఈస్మృతులను బట్టి యీ ద్రోణాదులట్టివారై శిష్య ద్రోహము సేయుతలంపుతో వర్తించు చున్నందున వారిని నవశ్యముగా వధింపవచ్చునందువేమో! కృష్ణా! ఉల్లిపాయ దిన్నను వ్యాధి గుదరక యున్నచోఁ దిన్నదానివలన లాభమేమి? యుద్ధమున కంగీకరించినను వారే జయింతురో లేక మనమే జయింతుమో ? జయాపజయములు నిర్ణయింప నసాధ్యములు గావా ? పూర్వము గుప్తవన వాసమునందు సదాశివుఁడు మనకిచ్చిన సర్వస్వరూపమైన వరప్రదానము వలన మనకే జయము గలుగు

ననియపుకొందువేమో సరి అదియును నాకు నిష్టముగాదు. అయ్యోపాపము! ప్రాణధనాదుల మీద నాస గొనక మన యెదుట నున్న యీ ధార్తరాష్ట్రులను జంపియా మనము బ్రతుకవలయును కావున నేను ముందు జెప్పినట్లు భిక్షావృత్తియే మేలుగాఁ దోఁచుచున్నది. ౬

శ్లో॥ కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢ చేతాః
యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధిమాం త్వా మ్ప్రపన్నమ్॥౭॥

—♦ భాష్యమ్ ♦—

నన్విహాముత్రచ కైవల్యం "త్రిభిర్హీనః పశుర్భవేత్ భస్త్రికేవాధమ స్సోఽచ వృథాయుః కృపణంక్షిపేత్" ఇత్యాదిస్మృత్యాయుద్ధస్యావశ్యకత్వం మన్యమాన ఆహ-॥ కార్పణ్యేతి ఏవం సతీహ జన్మన్యేత ఏవ మదీయా స్తేషు హతేషు కిం జీవి తేనేత్యభినివేశరూపో మమతా లక్షణః కార్పణ్యా దోష స్తేనోప హత స్తిరస్కృతో యుద్ధోద్యోగలక్షణ స్వభావో యస్య సోఽహమిదానీం త్వాం ధర్మసమూఢచేతా స్సంపృచ్ఛామీత్యర్థః। అతో యన్నిశ్చిత మైకాంతికం శ్రేయ స్తన్మే బ్రూహీత్యర్థః॥ నను చత్వం మమ సఖా॥ నతు శిష్యోఽత ఆహ-శిష్య ఇతి॥ ఏవం తర్హి 'సమిత్పాణి శ్శ్రోత్రియం బ్రహ్మనిష్టం గురు ముపసరే' దిత్యాదిశ్రుతి యోగ్యత్వా దహం తవ శిష్యఏవన సఖా। జ్ఞానాల్పత్వా దతస్త్వాంప్రపన్నం శరణాగతం మాం శాధి శిక్షయేత్యాశయః॥౭॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

సఖేతి॥ ఏవంసతి। 'ఏకతా సమతా స్థైర్యం స్వచ్ఛతా ప్రియతా తథా। ఉత్సాహ శ్చైవ వీర్యం చ సప్తైతే సఖ్య హేతవః॥' ఇత్యాది సప్తప్రకారేణాఽపి జ్ఞానాల్పత్వాన్న సఖిత్వం కింతు శిష్యత్వ మేవేత్యాశయః॥ ౭॥

## —♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఇహమును గాని పరమును గాని కైవల్యమును గాని సంపాదింపని వాడు పశువు. అట్టివాడు కృపణుఁడు! వానికిచ్చిన యాయువు త్రోలు త్తికి వలెనే నిష్ప్రయోజన మగును. అనునట్లు యుద్ధమే యవశ్య కర్తవ్యమందువేని :—ఈ జన్మమున వీరు నావారు. అనెడు మమతారూపమగు నభిమానము మెండుగాఁ గలను. ఆ యభిమానమువలన వీరి చావును నే నిచ్చగింపను. ఇట్టి కృపణబుద్ధిచే యుద్ధమును మానవలెనను తలంపుతో నున్నాఁడను. కార్పణ్యదోషముచే నా స్వభావము చెఱుపఁబడినది. కావున ధర్మమెఱుంగని చిత్తముగలవాఁడనై నిన్నడుగుచున్నాను. వీరిని జంపుట యుచితమా? విడుచుట యుచితమా? వీనియందుత్తమం బెద్దియో నిశ్చయించి నుడువుము. నీకు నేను శిష్యుఁడను, శ్రోత్రియుఁడును బ్రహ్మనిష్ఠుఁడును' నగు గురువు నాశ్రయించి సంశయనివృత్తి చేసికొనవలెనని శ్రుతులు నుడువుచున్నవి. నాకు నీవు గురుఁడవు కాని స్నేహితుఁడవు కావు. ఎట్లనగా, స్నేహలక్షణములేదు. అవియేవన:—ఏకత్వము, సమత్వము, స్థైర్యము, స్వచ్ఛత్వము, ప్రియత్వము, ఉత్సాహము, వీర్యము, ఈ యేడును సమముగా నుండిన సఖిత్వము. ఈ యేడింటి యందును నేను నీకన్నఁ దక్కువవాఁడను, కాన నీవే గురుఁడవు. శరణాగతుండనైన నన్ను శిక్షింపవలయును॥ ౭॥

శ్లో॥ న హి ప్రపశ్యామి మమాప నుద్యా
ద్యచ్ఛోకముచ్ఛోషణ మింద్రియాణామ్।
అవాప్య భూమా వసపత్న మృద్ధం।
రాజ్యం సురాణామపి చాధి పత్యమ్॥ ౮॥

—* భాష్యమ్ *—

నను యది శిష్యోఽసి కిం తేఽభిప్రేతం తద్వక్తవ్య మిత్యాహ - నహీతి॥ ఏవం త్వర్హి మమేంద్రియాణా ముచ్ఛోషణ ముత్కృష్టం శోకం యత్కర్మాపనుద్యా త్తన్నహి ప్రప శ్యామీత్యర్థః! నన్వేతావతాఽపి। హతోవా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీ మిత్యాదిస్మృత్యుక్తం ఫల మస్తు కాంక్షితిరితి చేన్నేత్యాహ - అవాప్యేతి॥ భూమౌ భూమ్యవచ్ఛేదేనాసపత్నం శత్రువర్జితం సుఖదమృద్ధ మైశ్వర్యం తథా సురాణా మాధిపత్య మవాప్యాఽపి మమ యచ్ఛోక మపనుద్యా త్తన్నహి ప్రపశ్యామీత్యర్థః॥ ౮॥

—◆ లఘుటిప్పణీ ◆—

తదిదానీం యుద్ధం కర్తుం దురుద్ధర మిత్యమన్వాన ఆహ-ఏవంతర్హీతి తథాసతి। 'లలాటదేశే రుధిరం స్రవద్యద్యస్యాహవే తు ప్రవిశేచ్చ వక్త్రే' మిత్యాది ఫలానభికాంక్షయా స్వసామర్థ్యేణ చేద ముక్తమిత్యవ ధార్యమ్॥ ౮॥

—◆ ఆంధ్రతాత్పర్యము ◆—

శిష్యుఁడనైతివేని. నీయభిమత మెద్ది? తెలియఁజేయుమన,—నిష్కం టకమును సమృద్ధమును నైనట్టి మహీరాజ్యము మాత్రమేకాదు. దేవాది

పత్యము లభించినను బంధువధ ప్రయత్నమున నింద్రియములను శోషింపఁ జేయుచున్న నాశోక మెవ్విధమునఁ దొలఁగునో యట్టివిధము నాకుఁ బొడకట్టకున్నది. (ఇందువలన నర్జునునకు ఫలమందు వాంఛ లేనట్లు తోఁచుచున్నది. అనఁగా నిహమున రాజ్యభోగవాంఛయును, యుద్ధమున మృతి నొందినవారు స్వర్గమున దేవకన్యకా సౌఖ్యమనుభవింతు'రను శాస్త్రమును బట్టి, పరమున స్వర్గభోగవాంఛయును లేనట్లు తెలియుచున్నది.

సంజయ ఉవాచ:—

శ్లో॥ ఏవ ముక్త్వా హృషీ కేశం గుడా కేశః పరంతపః ।
న యోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవహ॥౯॥

—♦ భా ష్య మ్♦—

అథ చ తదనన్తర మర్జునః కిముక్తవానిత్యాహ-ఏవ మితి॥ సదాశివైకతపసా గుడాకేశత్వేన పరంతపో ప్యర్జున స్స్వసమానత్వేన మన్యమానో హృషీకేశంప్రతి గోవింద మితీంద్రియపారవశ్యాభిప్రాయేణ తంప్రత్యుక్త్వాఽహ - ప్రసిద్ధ మేవ తూష్ణీం బభూవేతి తాత్పర్యమ్॥౯॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

తపసేతి॥ తదేతదుక్తం । స్కాందే, తద్యథా, అరణ్యే పాండవైస్తప్తం దృష్ట్వా శంభుః కృపాకరః ఇత్యాద్యుక్త్వాశివ మన్వాశం తురీయం మన్వానో గుడాకా నిద్రా), తదీశత్వం తేనేత్యాశయః॥ ౯॥

సంజయుఁ డిట్లుపలికెను.

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

తరువాత నర్జునుఁడు చెప్పినదేమియనఁగా:—ఈవిధముగా నర్జునుఁడు హృషీకేశుఁడగు శ్రీకృష్ణునితోఁ జెప్పి మీఁదికారణముల వలనఁ

డాను యుద్ధమును జేయనని వచించి యూరకుండెను. (అర్జునుఁడు సదా శివునియందు నిష్ఠగలిగి, ఘోరతపముంగావించి, నిద్రను జయించినవాఁడు గావున గుడాకేశుఁడనఁబడును.) ౯.

శ్లో॥ త మువాచ హృషీ కేశః ప్రహసన్నివ భారత ।
సేనయో రుభయో ర్మధ్యే విషీదం త మిదం వచః॥౧౦॥

—◆ భాష్యమ్ ◆—

ఏవం స్వచ్ఛభావే నోపేక్షితవత్యప్యర్జునే శ్రీకృష్ణస్తు నోపేక్షితవానిత్యాహ-తమువాచేతి। యుద్ధోద్యమేన సేనయో రుభయో ర్మధ్యే సమాగత్య తద్విరోధినం విషాదం ప్రాప్త మర్జునం ప్రతి ప్రహసన్నివే దంపచో హృషీకేశ ఉవాచేతి సంజయోపి ధృతరాష్ట్రం ప్రతి భారతేతి సంబోధ్య స్మారిత వానిత్యాశయః॥ ౧౦॥

—* లఘుటిప్పణీ *—

నోపేక్షితవానితి॥ ఏవంతర్హి 'గురవః పాణిభిర్ఘ్నన్తి సామమైర్నావిశక్షితః అతోఽత్ర కుత్సనం తద్వశ్చ ర్తనం చాప్యభిప్సితమ్॥' ఇత్యాది నీతిప్రబంధరీత్యా నోపేక్షితవానిత్యర్థః॥ ౧౦॥

—◆ ఆన్ధ్రతాత్పర్యము ◆—

ఇట్లు నిర్మలమగు భావముతో నర్జునుఁ డుపేక్షింపఁగా శ్రీకృష్ణుఁ డుపేక్షింపక ప్రోత్సాహవాక్యములను చెప్పెనని చెప్పుచున్నాడు-ఓ రాజా ఇట్లనువుడు దేహము వేఱు. ఆత్మ వేఱని దేహాత్మల యథార్థస్వరూప మును, వాని పరస్పరభేదమును దెలియని కారణమున శోకము నొందెను. మఱిదేహముకంటె నాత్మ వేఱని యా రెంటి స్వరూపములను బరస్పర

భేదమును దెలిసి చెప్పెడు ధర్మములను మాట్లాడెను. ఇవ్విధమునఁ బరస్పర విరుద్ధములైన గుణములతోఁ గూడినవాఁడై తటాలునఁ బ్రయత్నమును మాని యుద్ధమున సుద్యుక్తములైన రెండుసైన్యములనడుమ దుఃఖపడుచున్న యర్జునుని జూచి పరిహాసవాక్యములాడువానివలె శ్రీకృష్ణుఁడు పరమాత్మ యథార్థస్వరూపమును బొందుట కుపాయములైన కర్మయోగజ్ఞానభక్తి యోగములతోఁ గూడిన వాక్యములనుబలికెను. (గురువునకు శిష్యునివిషయమునఁదర్జనభర్జనతాడనసామాది వాక్యములకధికారము గలదు. గాననర్జునుఁ డూరకున్నను గృష్ణుఁడు పురికొల్పునట్టి పలుకులఁ జెప్పుచున్నాడు.) ౧౦.

శ్రీకృష్ణ ఉవాచ॥

శ్లో॥ అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాం శ్చ భాషసే
గతాసూ నగతాసూం శ్చ నానుశోచ న్తి పండితాః॥ ౧౧

—♦ భాష్యమ్. ♦—

అథ, చ, 'వినశ్యేద్వ్యవహారోఽనై సంసిద్ధ్యేచ్చేత్సపేవహి సిద్ధ్యసిద్ధ్యో స్సమత్వేన కర్తవ్యం ధర్మసాధనం' ఇత్యాదిస్మృత్యర్థానుసంధానేన పునరర్జునం ప్రత్యుపదిశన్నాహ-అశోచ్యానితి॥ తత్రైవంసతి॥ భీష్మద్రోణాదీ నాత్మసహితాన్ బంధూన్ శోచితు మయోగ్యానేవ త్వమన్వశోచః, అహో! అయోగ్యమేతత్, యతః, 'కథం భీష్మ మహం సఙ్ఖ్యే' ఇత్యాదిపండితానివ వాదాన్ భాషసే అథచ గతాసూన్ గతప్రాణా నగతాసూ నగతప్రాణాంశ్చ బంధూనన్వశోచః కిమిత్యాశ్చర్యమేతత్; యతః 'శ్మునిచైవ శ్వపాకేత్యాదిలక్షణలక్షితాః పండితా నానుశోచన్తీత్యర్థః॥౧౧॥

—◆ లఘుటిప్పణీ ◆—

పణ్డితా ఇతి॥ ఏదేతత్ స్కాన్దేఽప్యుక్తమ్, తద్యథా, 'గతాగతం నశోచన్తో లాభాలాభౌ జయాజయౌ సదసద్వివేకయుక్తత్వా త్పండిత స్సోఽప్యుదీరితః' ఇత్యాది స్మృతిన్యాయేనాఽపి పండితానానుశోచన్తీత్యాశయః॥ ౧౧॥

—◆ ఆన్ధ్రతాత్పర్యము. ◆—

శ్రీకృష్ణుఁడిట్లనియె,

ధర్మసాధనమైనకర్మము సిద్ధించినను సిద్ధింపక పోయినను రెండును సమానములేయని, చేయవలెనేకాని మానరాదని కృష్ణుఁ డుపదేశించుచున్నాఁడు-ఓయర్జునా! నీవు శోకింపఁదగనివారినింగూర్చి శోకించెదవు. దేహాత్మబుద్ధితోఁ బలుకుచుంటివి. ఆత్మకునాశములేదు. దేహమనిత్యము. ఆత్మవేఱైనదని తెలియక దేహమునే యాత్మనుగాఁ దలఁచి 'నేనుజంపుచున్నానే' యనిశోకించుట తగదు. ఆత్మప్రాప్తికి యుద్ధము (ఇంద్రియజయము) ఆవశ్యకము. భీష్మాదుల నెట్లు చంపఁగలనని పాండిత్యపు మాటలను బలుకుచుంటివి. పండితులు చచ్చినవారిం గుఱించియు, బ్రతికినవారిం గుఱించియును దుఃఖము నొందరు. వారు సమబుద్ధిగలవారు. వారికి బ్రాహ్మణుఁడైనను శునకమైనను సమానమే. (పండితలక్షణమేదియనఁగా పండితుఁడు సదసద్వివేక సంపన్నుండగుటవలన గతాగతములను గూర్చికాని, లాభాలాభములను గూర్చిగాని, జయాజయములను గూర్చికాని దుఃఖింపఁడు. ఇదియ పండిత లక్షణము.) ౧౧.

శ్లో॥ నత్వేవాఽహం జాతు నాసం నత్వం నేమే జనాధిపాః।
న చైవ న భవిష్యామ స్సర్వే వయ మతః పరమ్॥౧౨॥

వచ్చుచున్నవి. పూర్వ మున్నట్లును నిప్పుడు నున్నా మనియు, నిఁక ముందు నుండఁ గల మనియుఁ దెలియును. ధీరుఁ డీ విషయమున మోహమును జెందఁడు. (గర్భోపనిషత్తునఁ జెప్పఁబడిన విధముగా దేహి యెనుబదినాల్గువేల జీవరాసులందును వర్తించుచు, జనన మరణ రూపప్రవాహమునంబడి దొరలుచుండునని యెఱుఁగవలెను. తాను సత్పదార్థమనుట నిశ్చయము. బ్రహ్మవైవర్త పురాణమునందలి మహిమ్న స్తవమునందిట్లుగలదు. 'వపుఃప్రాదుర్భావా దనుమితమిదం జన్మని పురా పురారే! నక్వాఽపిక్షుణమపి భవంతం ప్రణతవాన్ నమన్ముక్తస్సంప్రత్యహ మతినురగేఽ ప్యనతిమా నితీశ! క్షంతవ్యంతదిద మపరాధద్వయమపి, ఓపురారీ! (పురములనఁగా, దేహములు స్థూలము. సూక్ష్మము కారణము. ఒకప్పుడు స్థూలమును, నొకప్పుడు కారణమును,వేఱొకప్పుడు సూక్ష్మమును లేకుండఁ జేయువాఁడని. యంతరార్థము.) పూర్వజన్మమున నీకు నమస్కారము చేయనందున । నాకీజన్మము ప్రాప్తమైనది, ఇదియొక యపరాధము ఉత్తరజన్మమందును నమస్కరింప నేమో! ఇది రెండవ యపరాధము. ఈరెండపరాధములను నీనమస్కారము చేత నే క్షమించి నన్ను ముక్తునిగాఁ జేయుముఅని పుష్పదంతుని ప్రార్థన కాన, తాను. సత్తు. చిత్తు. ఆనందము గనుక నెప్పటికిని నుండువారమని యభిప్రాయము ఈశ్లోకమున దేహాత్మవాదులైన చార్వాకాదిమతములు ఖండింపఁబడినవి.

శ్లో॥ మాత్రాస్పర్శా స్తు కౌంతేయ! శీతోష్ణసుఖదుఃఖదాః।
ఆగమాపాయినోఽనిత్యా స్తాం స్తితిక్షస్వ భారత॥ ౧౪॥

—♦ భాష్యమ్ ♦—

నన్వస్త్వేవం దేహాంతరస్య ప్రాప్తౌ కా క్షతిః పరం త్వణుం హి జీవంప్రతి దేహాభిన్నం శరీరసంయోగ యోగ్యమత్యాచ స్మృత్యాభాసికేనాఽపి జీవేన శరీరస్య సంబంధ

వియోగయో రాత్యంతిక దుఃఖమేవేతి। తదపి జీవబ్రహ్మణో రేకత్వేన పరిహారన్నాహ - మాత్రేతి॥ దుఃఖత్రయాభిఘాతాదిత్యాదిస్మృతిన్యాయే నాధ్యాత్మికాది దుఃఖత్రయస్యాత్యంతనివృత్తే రావశ్యకత్వే స్థితే మీయన్తే విషయా యాభి స్తా మాత్రాః ఇంద్రియాణి తాసాం స్పర్శా విషయైస్సహ సంబంధా స్తేఽప్యాగమాపాయినఉత్పత్తివినాశవన్త ఇతి తఏవ శీతోష్ణాది ద్వారా సుఖదుఃఖదా నతు తేతత్త్వజ్ఞస్య విభో రాత్మన స్తస్య నిర్గుణత్వాన్నిర్వికారత్వా చ్చేత్యస్యజ్ఞానాదన్యగతానర్థనివృత్తి ర్నోచితేతి జీవబ్రహ్మణో రేకత్వమపి స్ఫుటీకృతమ్॥ ౧౪॥

## ఆస్థిరతాత్పర్యము

ఓయీ దేహాంతరప్రాప్తి గలిగిన నేమి? జీవుఁడణువు. ప్రతిశరీరమునకును వేఱుగానుండును. శరీరముతో సంయోగవియోగములు గలవాఁడుగానఁ జిదాభాసుఁడై జీవుఁడు శరీరమును సంబంధించినపుడును దానిని విడుచునపుడును సుఖదుఃఖము లనుభవించుచున్నాఁడు. జనన మరణములు స్వభావములె గదా, అనఁగా జీవబ్రహ్మలయైక్యమున నాత్యంతిక దుఃఖమును బరిహరించుచుఁ జెప్పుచున్నాఁడు—శివజీవైక్యమందు సుఖదుఃఖములు లేవు. పృథివ్యాపస్తేజో వాయురాకాశములనెడి పంచభూతముల నాశ్రయించిన శబ్దస్పర్శరూపరసగంధములనెడు విషయములు తన్మాత్రలచేఁ గలిగినవి. తన్మాత్రయనఁగా భూతసూక్ష్మవస్తు. దాని స్పర్శవలన శీతము, ఉష్ణము, మృదువు, కఠినము మొదలగు రూపములతో సుఖదుఃఖములు దోఁచుచుండును. ఆధ్యాత్మికాధి భౌతికాధి దైవికములనిదుఃఖములు మూడువిధములు. ఆధ్యాత్మిక మనఁగా స్థూలసూక్ష్మశరీరములందు జ్వరము

లోనగు బాధలును, గామక్రోధాదులునుగలుగుట, ఆధిభౌతికమనఁగా దన కంటెనన్యములైన పుత్రమిత్ర కళత్రపశ్వాదులు పడెడు బాధలును, జోరులు ధనమపహరింపఁగాఁ జూచి తాను దుఃఖించుట, ఆధిదైవికమనఁగాఁ బిశాచాదిబాధలును. ఎండ వానగాలి పిడుగులుమొదలగు బాధలును ఈ దుఃఖత్రియమును దీసివేయవలెను. అనఁగా ఓర్చుకొనవలెను. ఈ సుఖదుఃఖములను గలిగించునట్టి మాత్రాస్పర్శలు (ఇంద్రియములకు విషయములతోడి సంబంధములు) రాకపోకలు కలిగినవై యనిత్యము లగుటవలన వానియెడ నోర్పుగలిగి వర్తింప వలెను. ఈవిషయములు తత్త్వజ్ఞానినిబాధింపవు. నిర్గుణ నిర్వికారుఁడైనపరమాత్మను దెలిసికొన్నందువలనఁ బశువగుజీవుని యాపత్తు నశించుట యుచితము గాదందువేని జీవేశ్వరు లిద్దరును నొక్కటియె కనుక జీవుఁడు శివుని నపరోక్షముగాఁ దెలిసికొన్నచో నతని దుఃఖములు నశించుననితా ॥౧౪॥

శ్లో॥ యం హి న వ్యథయ న్త్యేతే పురుషం పురుషర్షభ!
సమదుఃఖ సుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే ॥౧౫॥

—♦ భాష్యమ్ ♦—

నను కిమస్తి తత్త్వజ్ఞానినో లక్షణమిత్యాహ-యంహీతి॥ "ఏతం హ వా నతపతి కి మహంసాధునాకరవం కిమహం పాపమకరవ' మిత్యాదిశ్రుత్యా తత్త్వజ్ఞస్య నిర్వికారిత్వే స్థితే తమేతే మాత్రాస్పర్శానవ్యథయన్తి! యతః సమదుఃఖసుఖోధీరోధ్యానశీలశ్చ తమిత్యర్థః। సఏవ పునరమృతత్వాయ 'వేదైరనేకైరహమే' ఇత్యాదిశ్రుతిన్యాయే నామృతత్వాయ శివత్వాయ కల్ప్యత ఇతిపరమార్థః॥౧౫॥

—♦ లఘుటిప్పణీ ♦—

అహమితి॥ తత్రస్మృతిశ్చ । తద్యథా 'వాఙ్మనఃప్రాణదేహాదేర్భిన్నో హ్యాత్మా పరశ్శివః। క్షేత్రక్షేత్రజ్ఞయో శ్చాపిపరస్సాక్షీ నిరామయః, ఇత్యాద్యన్యత్రవిస్తరః॥౧౫॥

—♦ ఆన్ధ్రితాత్పర్యము. ♦—

తత్త్వజ్ఞానియగువాని లక్షణ మేమనఁగా:—పురుషశ్రేష్ఠుఁడవైన యోయర్జునా! విషయంబులు సుఖదుఃఖములను సమముగాఁ జూచునట్టి ధీరుఁడైనయోగిని జలింపఁ జేయనేరవు. అట్టివాఁ డమృతత్వరూపమగు శివత్వముం బొందును పరశివుఁడు ప్రాణాదులకంటెభిన్నుఁడు, అవస్థాత్రయసాక్షి, పంచకోశవ్యతిరిక్తుఁడు, తత్త్వాతీతుఁడు, అని యెఱుంగవలెను.

శ్లో॥ నాఽసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోఽన్తస్త్వనయోస్తత్త్వదర్శిభిః॥ ౧౬

—♦ భాష్యమ్ ♦—

అథ నదేవేత్యాది, యత్రాతమఇత్యాదిశ్రుత్యా జీవేశ్వర జగద్భేదో జగద్భేదశ్చ పంచధా। తద్యథా, 'భ్రమగపంచవిధో భాతి తదేవేహ సముచ్యతే। జీవేశ్వరా భిన్నరూపా వితిప్రాథమికో భ్రమః। ఆత్మనిష్ఠం కర్తృగుణం వాస్తవం వాద్వితీయకః శరీరత్రయసంయుక్త జీవ స్సంగీ తృతీయకః జగత్కారణరూపస్య వికారిత్వం చతుర్థకః కారణాద్భిన్నజగతప్రతిబిస్సత్యత్వం పంచమోభ్రమః॥భ్రమనివృత్తిశ్చతదాస్ఫురతిచేతసి, బింబప్రతిబింబదర్శనేన భేదభ్రమో నివృత్తః। స్ఫటికలోహితదర్శనేన పారమార్థికకర్తృత్వభ్రమో నివృత్తః। ఘటమఠాకాశ

దర్శనేన సంగీతి భ్రమో నివృత్తః రజ్జుసర్పదర్శనేన కార
ణాద్భిన్నజగత స్సత్యత్వభ్రమో నివృత్తః। కనకరుచికదర్శనేన
వికారిత్వభ్రమో నివృత్తః ఇత్యన్నపూర్ణోపనిషది దర్శ
నాత్, 'ఆద్యంతయో రభావేతు మధ్యేఽపి తన్న చేష్యత'
ఇత్యాదిస్మృత్యా చ సర్వప్రపంచజాతం దర్పణాభాసవన్మృషై
వేతి విద్వదనుభవేనాఽపి తోలయన్నాహ-నాసత ఇతి॥ ఇదం
జగదసదేవ। తర్హి కథం భాసతే। యది చ సదేవ తర్హి కథం
ప్రలయాన్తే శివజ్ఞానాన్తే వా నివృత్తి రిత్యుభయో రన్తస్తత్త్వ
దర్శిభి ర్జ్ఞాయతే నత్వన్యైరితి వివేకః॥ ౧౬॥

## —◆ లఘుటిప్పణీ. ◆—

విద్వదనుభవేనేతి॥ తత్ర తావత్ 'వేదాన్తై ర్వేద్య మద్వైతం శివ మేక మనామయమ్ సాంఖ్యైన శక్తిరిత్యుగ్రా యోగాచార్యై ర్హరిః స్మృతః॥ తర్కైః కర్మహావిరాట్చైవవిరాడాత్మా తదంతికైః। జైమిని ర్వేద మాచష్టే తథాన్యైశ్చ యథామతి' ఇత్యాదిషడ్విధానుభవేషు 'శివ మద్వైతం తురీయం మన్యన్త ఇత్యాదిశ్రుత్యా సిద్ధాన్తవేదాన్తానుభవేనేత్యర్థః॥ ౧౬॥

## —◆ ఆన్ధ్రతాత్పర్యము ◆—

జీవేశ్వరజగత్తులు వేర్వేఱుపదార్థములని యనుకొనుటయు నందు నను నయిదువిధములయిన జగద్భేదభ్రాన్తియు ననువీనికిఁ బరిహారము చెప్పఁబడుచున్నది:— 1 జీవేశ్వరులు భిన్నరూపులని యనుకొట మొదటి భ్రమ. ఈభ్రమని వృత్త్యుపాయము బింబప్రతిబింబ భావము. ఈశ్వరుఁడు బింబము, జీవుఁడు ప్రతిబింబము, ప్రతిబింబమసత్యము, బింబమె సత్యము గనుక జీవేశ్వరులిద్దఱును నొక్కటియె. 2 నాకుఁ గర్తృత్వము గలదను

కొనుట ద్వితీయభ్రమ. ఆకాశమునందు వాయువుచేఁ గొట్టఁబడినవియై మేఘములు పరువులెత్తుచుండఁగాఁ జంద్రుఁడు పరుగెత్తునట్లు గనుపించు రీతిని, ప్రారబ్ధానుసారముగా నింద్రియములు వ్యాపారములు సేయుచుండఁగా నింద్రియాతిరిక్తమైనయాత్మ కర్తగాఁ దోఁచుచున్నది. దీని నివృత్తి స్ఫటికలోహదృష్టాంతముచే నగును. ఏలపీతరక్తవస్తువుల సాన్నిధ్యముచే స్ఫటికము, నలుపు। పసుపు, ఎఱుపు రంగులను గలిగియుండుట యందు, దానికర్తృత్వ మేమియును లేకరంగుల కర్తవ్యమైనట్లు ఇంద్రియ సాన్నిధ్యమున నాత్మ కర్తగాక యింద్రియములే కర్తలని తెలిసికొనవలెను. 3 తాను దేహత్రయము నంటియున్నా ననుకొనుట మూఁడవభ్రమఘటమఠాకాశదృష్టాంతముచే నీభ్రమ తొలఁగును. ఆకాశము ఘటమఠాదుల నంటకయుండినట్లు దేహత్రియము నంటక యాత్మయున్నట్లు తెలుంగవలెను. చైతన్యరూపమైన యాత్మ దేహత్రియము నంటియున్న యెడల దేహమెప్పటికిని నచేతనము గానేరదు. (మరణమెప్పటికినిరాదు) 5 జగత్కారణ రూపుఁడైన శివునికి వికారము గలదనుట నాల్గవభ్రమ. ఈ భ్రాన్తి కనకభూషణ దృష్టాంతముచే నివర్తింపఁబడును. అస్తిమాతృగర్భమునఁ బిండరూపముగా నుండుట) జాయతే (పుట్టుట) వర్ధతే (పెరుగుట) విపరిణమతే (బాల్యయౌవనకౌమార వార్ధకావస్థలచే మాఱుట) అపక్షీయతే (కృశించుట) నశ్యతి (కనఁబడకుండుట) ఈవికారములు దేహమునకుఁ గాని యాత్మకు లేవు. భూషణములే చెడునుగాని బంగారమెప్పటికిని జెడనట్లు బ్రహ్మమున కుత్పత్తినాశనములు లేవు. 5 బ్రహ్మముకంటె భిన్నమయిన జగత్తు సత్యమనుట యయిదవభ్రమ. రజ్జుసర్ప దృష్టాంతముచే నీభ్రాన్తి తొలఁగును. రజ్జువును దెలిసికొనువఱకును సర్పభ్రాన్తి గలదు. దాని నెఱింగినపిదప సర్పము లేనట్లు సర్వవ్యాపకమైన బ్రహ్మమును దెలిసికొనిన పిదప దేహాది ప్రపంచము మిథ్యయగును.సృష్టికి బూర్వముననుు బ్రళయమైనపిదప ను లేని యీజగత్తు

మధ్యయందును లేదనియె చెప్పవలెను. అద్దమునందు గనుపించు ప్రతి బింబ మాభాసమె కాని నిజముగా మన ముఖము దానియందు లేనట్లు నిద్వదనుభవమును జెప్పుచున్నాడు.—ఈ దృశ్యమానమైనజగత్తులేనిదియే ఎల్లప్పుడు నుండునట్టి యాత్మకు నాశములేదు. కాని యసత్తైన శరీరాదు లెందులకుఁ గనుపించుచున్నవో, సత్తైనయాత్మ శివజ్ఞానాంతమందు గాని ప్రళయాంతమందు గాని యెందులకు లేదో యీరెంటియొక్క అంతమును దత్త్వజ్ఞు లెఱుంగుదురు. ఇతరులెఱుంగఁ జాలరు. (వేదాంతవేద్యుడు శివుడని యుండగా, సాంఖ్యులు ప్రకృతి యనియు బౌద్ధయోగాచార్యులు హరియనియు తార్కికులు మహావిరాట్టనియు, పూర్వమీమాంసకులు కర్మయనియు, జైమిని వేదమనియు, మరియునితరులు తమ తమ ఇష్టమువచ్చిన పేర్లు పెట్టుకొనిరి. ఈ ఆఱు విధములైన యనుభవముల యందును శైవసిద్ధాంత వేదాంతమతముల యనుభవముచే శివమద్వైతం తురీయమ్మను శ్రుతిని బట్టి శివుఁడనియే సిద్ధాంతము. ఏమనగా శ్రుతి... యదా తమస్తన్నదివా న రాత్రిర్న సన్నచా సచ్ఛివ ఏవ కేవలః సృష్టికాల పూర్వము దివారాత్రి విభాగములేనప్పుడును సత్ అసత్ లేనప్పుడును శివుడొక్కడే గలడని శ్రుత్యర్థము.)

శ్లో. అవినాశి తుతద్విద్ధి యేన సర్వ మిదం తతం।
వినాశ మవ్యయస్యాస్య న కశ్చిత్కర్తు మర్హతి॥ ౧౭॥

—♦ భాష్యమ్ ♦—

నను కస్తర్హ్యంతత సద్రూపోఽమృతశబ్దాభిధేయ ఇత్యాహ అవినాశీతి: 'ఏతత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః' ఇత్యాది స్మృత్యా సర్గాత్పురా నిరాలోకం యదేకం నిష్కలం పరం చిదానందమయం జ్యోతి స్స ఆద్యః కేవల

శ్శివ ఇత్యాదిస్మృత్యా 'ఆనందాబ్ధేః కమపి చ ఘనీభావ మా
స్థాయ రూపఁ' మిత్యాది స్మృత్యా చ సంహారకర్తుః సదాశివా
దేవామృత శబ్దాభి ధేయాన్నామ యయా జగదుత్పన్న మపీత్యవ
ధార్యమ్। అతఏవ సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాల
నందన ఇత్యాదావప్యవినాశిత్వే నామృతశబ్దాభిధేయత్వం శివ
స్యైవేతి బోధ్యమ్॥ ౧౭॥

—◆ ఆంధ్రతాత్పర్యము ◆—

సదాశివుడును అమృతశబ్దవాచ్యుడును నగు వాడెవ్వడనగా;—

ఈప్రపంచమెల్ల నేపరమాత్మ నిండి యుండునో? అట్టిపరమాత్మ
ఓం తత్ సత్ అను త్రివిధనామములచే బిలువబడు పరమశివుడనియు అట్టి
పరమశివుడే తాననియు నెఱుంగవలయును. అట్టియాత్మకు నాశము గలి
గించున దేదియును లేదు. అమృత శబ్దవాచ్యుడు శివుడే॥ ౧౭॥

శ్లో॥ అంతవంత ఇమే దేహా నిత్య స్యోక్తా శ్శరీరిణః।
అనాశినో ఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత!॥౧౮॥

—✻ భాష్యమ్ ✻—

'అధ కర్మశాస్త్రే కుతో జ్ఞానం తర్కే నైవాస్తి
నిశ్చయః। సాంఖ్యయోగా భిదావస్థా శ్శాబ్దికాశ్శబ్దతత్పరాః॥
అన్యే పాషండిన స్సర్వే జ్ఞానవార్తా సుదుర్లభా॥ ఏకం వేదాంత
విజ్ఞానం స్వానుభూత్యా విరాజతే॥' ఇత్యాదిస్మృత్యా వేదాంత
ప్రామాణ్యస్యావశ్యకత్వే స్థితే తత్ర అ తత్వమసీత్యాది మహా
వాక్యై ర్జీవ బ్రహ్మణో రేకత్వేన దేహాత్మన స్తుచ్ఛత్వే నోపేక్ష

ణీయత్వ మేవేత్యాహ అంతవంతఇతి॥ తథాచశ్రుతిః 'ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా కర్మాధ్యక్షః సర్వభూతాధివాస స్సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ' 'ఏక ఏవ రుద్రో న ద్వితీయాయ తస్థే' ఇత్యాది ద్రష్టవ్యాః

—* లఘుటిప్పణీ *—

కర్మశాస్త్ర ఇతి॥ అత్ర యద్యపి । 'కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః' ఇత్యనేన నిష్కామకర్మణైవ జ్ఞానాదిసిద్ధి రపేక్షితా తథాపీహ కేవలైహికఫలోద్దేశ్యేనైవ క్రియమాణ హేతా నిరీశ్వరవాదత్వేనార్థనాసికే మీమాంసాశాస్త్రే ఇత్యర్థః ఏవం తర్కాప్రతిష్ఠానాదిత్యాది స్మృతివిరుద్ధ న్యాయవైశేషికయోరపి నిశ్చయాభావాత్ · కుతో జ్ఞాన మిత్యాది రర్థః దేహాత్మేతి॥ 'బ్రాహ్మణ్యం కులగోత్రే చ నామ సౌందర్యజాతయః । స్థూలదేహగతా ఏతేస్థూలాద్భిన్నస్య మేనహి ॥ క్షుత్పిపాసాంధ్య బాధిర్య కామక్రోధాదయో ఽఖిలాః । లింగదేహగతావేతే హ్యలింగస్య న సన్తిహి । జడత్వప్రియమోదత్వ ధర్మాః కారణ దేహగాః । న సంతి మనిత్యస్య నిర్వికారస్వ రూపిణః) ఇత్యాద్యమ థార్యమ్॥ ౧౮॥

—* ఆస్థ్రి తాత్పర్యము *—

పూర్వమీమాంసాశాస్త్రమున జ్ఞానము లభింపదు, తర్కశాస్త్రమందు సంశయములుదీఱవు. సాంఖ్యయోగశాస్త్రములు భేదబుద్ధిని కలిగించునవి, శబ్దశాస్త్రము శబ్దములను బోధించునది, తక్కినవన్నియును వేదవిరుద్ధములై పాషండమతములలో జేరునవి, కావున స్వానుభవముచే ప్రకాశించునట్టి వేదాంతశాస్త్రముచే జ్ఞానము లభ్యమగును గాని అన్య శాస్త్రములచే శాస్త్రవాసనయే గాని జ్ఞానము లభింపనేరదు. ఈవిధముగా

స్మృతులయందుఁ జెప్పఁబడుటవేత వేదాన్తశాస్త్ర ప్రామాణ్య మావశ్యక మైనది. ఆశాస్త్రములను 'తత్త్వమసి' మొదలగు మహావాక్యములచే జీవ బ్రహ్మలకు ఏకత్వమును దేహాత్మ నీచమైనదగుటచే ఉపేక్షింపదగినదనియు చెప్పఁబడినవి. వానినే వివరించుచున్నాడు—

నాశమునకనర్హుడు కావుననే నాశము లేనివాడును, దేహమువలె భోగ్యరూపమునఁ దెలియఁనివాఁడును అగుఆత్మ, తనపూర్వకర్మఫల ములను అనుభవించుకొఱకే పంచభూత సంఘాతరూపమైన ఈదేహముల తోడి సంబంధము నొందునని శాస్త్రములు చెప్పుచున్నవి. దేహములు కర్మవశమున బుట్టినవి. కావున ఆ కర్మము ముగియగానే నశించును. ఇట్టి ఆత్మను గూర్చియు దేహములను గూర్చియు శోకింపఁదగదు. కావున సంశయము వదలి యుద్ధముసేయ బ్రారంభింపుము. (భగ వంతుడొక్కఁడే సర్వభూతములయందు వ్యాపించి యదృశ్యరూపుఁడై యుండును. అతఁడు కర్మాధ్యక్షుఁడు పూర్వముఁజనకాదులు కర్మ చేతనే ముక్తి నొందిరి. అది నిష్కామకర్మ. దానిచేత జ్ఞానసిద్ధి అపే క్షితమై యున్నది. అట్టి జ్ఞానముచే నాత్మయొక్క యనశ్వరత్వమును దేహముయొక్క నశ్వరత్వమును దెలిసికొని యుద్ధము సేయఁ గడంగుము. దేహాంతమున నీకు ఈశ్వరత్వము ప్రాప్తింపఁగలదు. దేహమునందభిమాన మును విడువుము. (బ్రాహ్మణ్యమును కులగోత్రములును నామసౌందర్య జా తులును స్థూలదేహము నాశ్రయించినవి గాని తద్భిన్నమైన యాత్మకులేవు. ఆకలి, దప్పి, అంధత్వము, బధిరత్వము, కామక్రోధాదులు లోనగునవి లింగదేహము నాశ్రయించినవి, కాని లింగదేహములేని యాత్మకు లేవు. జడత్వ, ప్రియత్వ, మోదత్వాదులగు ధర్మములు కారణదేహము నాశ్ర యించినవి కాని నిత్యుడై, నిర్వికారుడైన పరమాత్మకులేవు.)॥౧౯॥

శ్లో॥ య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్।
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే॥౧౯॥

## —* భా ష్య మ్ *—

నన్వేవం చేత్ జన్మమరణాదివ్యవస్థాకథముపపద్యత ఇతిచేత్, భ్రాన్తానాం తదిష్యత ఇత్యాహ - యఏనమితి॥ ఏవం తర్హి య ఏనం వేత్తి హన్తారం తార్కికాది రాత్మనః కర్తృత్వాభ్యుపగమాత్ యశ్చైనం మన్యతే హతం చార్వాకాది రాత్మనో వినాశత్వాభ్యుపగమా దితి తావుభౌనవిజానీత ఇత్యర్థః వస్తుతస్తు 'న తత్ర రథా న రథయోగా న చ పన్థానో భవన్తి అథ రథాన్ రథయోగాన్ పాన్థస్సృజతే' ఇత్యాది బృహదారణ్యకశ్రుతేః 'తథా యదిదందృశ్యతే కించి త్తన్నాస్తి కిమపి ధ్రువమ్ యథా గంధర్వ నగరం యథా వారి మరుస్థలే॥' ఇత్యాది స్మృతేశ్చ సర్వం ప్రపంచజాత మధ్యస్తత్వేన మిథ్యై వేతిబోధ్యమ్॥ ౧౯॥

## —♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఆత్మను జంపువానిఁగను, జంపఁబడువానిగను, దలఁచు వారిద్దఱును అజ్ఞానులే. చంపువాఁడు ఆత్మకుకర్తృత్వమును జెప్పుతార్కికుఁడు. చంపబడువాఁడు దేహాత్మభావముగల చార్వాకుఁడు. వీరిద్దఱును స్త్రీలతోడను, బాలురతోడను, జడులతోడను సమానులు. ఆత్మ చంపునది కాని చంపబఁడునది గానికానేరదు. సర్వప్రపంచము, మరుస్థలమందలి జలమువలెను, గంధర్వనగరమువలెను' ఆభాసించుచున్నది. కాని దానినంతయును మిధ్యగాఁ దెలియవలెను. దేహభ్రాంతి వలననే జననమరణములు వచ్చుచున్నవి. దేహాభిమానము వదలినయెడల జన్మరానేరదు. తాను కర్తృత్వము వహించనియెడల పుణ్యపాపములు తన్నంటరావు.

వాస్తవముగాఁ గర్తృత్వము దేహేంద్రియాదులది, తన్ను దేహేంద్రియాతీతుఁడైన సాక్షినిగాఁ దెలియవలెను.

శ్లో॥ నజాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వాభవితా వా న భూయః ।
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥ ౨౦

—♦ భాష్యమ్ ♦—

నన్విహ శరీరసంయోగవియోగరూపేణ ప్రత్యక్షమేవ జన్మ మరణాదికం దృశ్యతఏవేతి చేన్నైవమిత్యాహ:—

నజాయత ఇతి॥ తత్రైవం 'మాయా శరీరే ప్రతిబింబగాత్రేయత్స్వప్న దేహే హృది కంపితాంగే నశ్యద్వినశ్యత్స్వపికా విచారణాకుతో జగచ్చాపి కుతో నుదేహః' ఇత్యాది స్మృత్యా వస్తుగత్యా కదాచిదపి న జాయతే న వా మ్రియతే నవా భూత్వాఽపి పునర్భవితే త్యర్థః యోగవాశిష్ఠేఽపి 'ఆకాశాదపి విస్తీర్ణ శ్శుద్ధ స్సూక్ష్మోఽవ్యయ శ్శివః య ఆత్మా స కథం రామ జాయతే మ్రియతేఽథవా' ఇత్యాది ద్రష్టవ్యమ్, నన్వస్త్వేవం పరన్తు దేహేంద్రియాద్యతీత ఆత్మా కథంరూప ఇత్యాహ। అజఇతి॥ ఏవం తర్హి యథా హి నిర్లయినీ వల్మీకే ప్రత్యస్తామృతా శయీత ఏవ మాత్మవిది నపాపం శ్లిష్యతి ఇత్యాది శ్రుతేశ్శరీరే హన్యమానే హ్యాత్మా నహన్యత ఇత్యాశయః॥ ౨౦॥

—* లఘుటిప్పణీ *—

న జాయత ఇతి॥ నను పూర్వం 'దేహినోఽస్మిన్ యథా దేహ' ఇత్యాది-జన్మాద్యావశ్యకత్వ మురీకృతమిహతు జన్మాద్యభావం వర్ణయసీతి చేత్.శృణుతత్రాసతస్సజ్జాయత ఇత్యాద్యుక్త్యా కార్యసత్యవాదే నాభ్యుపేత్యోక్తమిహతు యత్ర త్వస్య'సర్వ మాత్మైవాభూది'త్యాదిశ్రుతి సిద్ధాన్తాభిప్రాయేణోక్త మిత్యవధార్యమ్ ॥౨౦॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

ఓయీ ! శరీరసంయోగమే జననము, శరీరవియోగమే మరణము, ఈప్రకారము ప్రత్యక్షముగా జననమరణములు గనుపించుట లేదా ! యని యనినచో నట్లుగాదని చెప్పుచున్నాఁడు— స్థూలసూక్ష్మదేహములు నశించిపోవుచుండఁగా జగత్తెక్కడ ? దేహమెక్కడ ! ఆకాశముకంటెను విస్తీర్ణుఁడును, శుద్ధుఁడను,సూక్ష్మస్వరూపుడును, నాశరహితుఁడునైశివుఁడు ప్రకాశించుచుండును. అతఁడే యాత్మ, అట్టివానికి చావును పుట్టుకయును నెక్కడివి? ఆత్మ దేహేంద్రియాతీతమైనది. సాము కుబుసమునందు ప్రేమనుంచనియట్లు ఆత్మవిదుఁడు దేహమునందు ప్రేమనుంచఁడు. వానినిఁ బాపపుణ్యములంటవు. శరీరమునశించినను, నాత్మనశింపక యప్పటికిని నొక్కతీరుగనే యుండును. అది స్థిరమైనది గాను, పురాతనమైనదిగాను- నున్నది. మఱియు గల్పాదియందు బుట్టుకను గాని కల్పాంతమందు నాశమునుగాని పొందనేరదు ॥౨౦॥

శ్లో॥ వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్।
కథం సపురుషః పార్థ ! కం ఘాతయతి హన్తి కమ్ ॥౨౧॥

—♦ భాష్యమ్ ♦—

నన్వీహ. 'చేద వేదీదథ సత్య మస్తి నచేద వేదీ న్మహతీ వినష్టి' రిత్యాది శ్రుత్యా త్మజ్ఞాన స్యావశ్యకత్వే స్థితే తజ్జ్ఞానః

యుద్ధేఽపి కా క్షతి రిత్యాహ । వేదేతి॥ ఏవంసతి, 'ఆత్మానంచే ద్విజానీయా దయమస్మీతి పూరుషః।కి మిచ్ఛన్ కస్యకామాయ శరీర మనుసంచరేత్'॥ ఇత్యాది శ్రుత్యాప్యాత్మనో ఽశరీరత్వాత్ కథం తమాత్మాన మజ మవ్యయం హన్తి కథంచ ఘాతయతీతి హంతు ర్ఘాతయితు శ్చావయోర్నిర్దోషత్వ మావిష్కృతమ్ ॥౨౧॥

—♦ లఘుటిప్పణీ ♦—

వినష్టిరితి॥ తదుక్తం యోగవాసిష్ఠే తద్యథా, 'వరం శరావహస్తస్య చాండాలాగారవీథిషు । భిక్షార్థ మటనం రామ! న సౌఖ్యం హతజీవితమ్॥ ఇత్యాదిద్రష్టవ్యమ్॥౨౧॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

ఆత్మజ్ఞానము గలవారికి యుద్ధమునందు సైత మేమియు గష్టములేదనిచెప్పుచున్నాడు—ఓ పార్థా! ఎవ్వఁడాత్మను నాశరహితమైనదానినిగాను,నిత్యమైనదానినిగాను, పుట్టుచావులులేనిదానినిగాను దెలిసికొనునో, ఆపురుషుఁడెవ్వనిని ఏవిధముగాఁజంపును, జంపించును? ఆత్మ అశరీరి గనుక జంపునట్టినీకును జంపించునట్టినాకును దోషములేదు. (యోగవాసిష్ఠమునందు వసిష్ఠుఁడు రామునికిట్లుపదేశించెను.) 'ఆత్మజ్ఞానము లేక పాడుబ్రతుకులో జీవించుటకంటె మూకుడు చేత బట్టుకొని చండాలవీధికిఁబోయి బిచ్చమెత్తుటయైనను మంచిదే అనగా నాత్మజ్ఞానము లేని బ్రతుకు వ్యర్థమని తా॥).

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ॥                                  ౨౨

## భాష్యమ్.

న హ్యాత్మనో నిత్యత్వేన వినాశిత్వాభావేఽపి దేహాత్మనో వినాశిత్వాత్ యుద్ధస్య చ తన్నాశకత్వాత్ కథం భీష్మాదిదేహానా మనేక సుకృతసాధకానాం వినాశం కరిష్యామ ఇత్యాహ—

వాసాంసీతి॥ జీర్ణాని వస్త్రాణి యథా విహాయ నరోఽపరాణి నవాని గృహ్ణాతి తథా శరీరాణ్యపి దేహీ త్యక్త్వా పునరపరాణ్యపి గృహ్ణాతీతి కా క్షతి రిత్యర్థః॥ ౨౨॥

## లఘుటిప్పణీ

నిత్యత్వేనేతి॥ నను పరమాత్మన శ్శివస్య నిత్యత్వేనా వినాశిత్వేపి చిదంబరాభాస రూపస్య దేహినో జీవస్యాపి జ్ఞానోత్తరం విలయఏవ భవిష్యతీతి చేద స్త్వేవం పరన్తు విజ్ఞానాత్పూర్వం యుద్ధాదికర్మణా తస్య వినాశాదర్శనా దితిభావః॥ ౨౨॥

## ఆన్ధ్రతాత్పర్యము

ఆత్మనిత్యమైనదగుటన నాశము లేకున్నను దేహములు నశించునవి గాన యుద్ధములో నవి నశించిపోవును. అనేక పుణ్యములకు సాధనములైన భీష్మాదులశరీరముల నెట్లు నశింప జేయుదు ననఁగా జెప్పుచున్నాఁడు—

అర్జునా! మానవుఁడు చినిగిన వస్త్రములను విడిచి క్రొత్త వస్త్రములను ధరించురీతిని ఆత్మ జీర్ణశరీరములను వదలి క్రొత్త శరీరములను బొందుచుండును. కావున ఆత్మకు హానిలేదు, చిదంబరాభాసరూపుఁడైన దేహాత్మకు విజ్ఞానము గలిగినపిదప నిత్యుఁడును శివస్వరూపుఁడును నైన పరమాత్మయందు లయమును బొందునేగాని విజ్ఞానము గలుగకముందు దానికి వినాశము గలుగ నేరదని భావము. ॥ ౨౨॥

శ్లో॥ నైనంఛిందన్తి శస్త్రాణి నైనం దహతి పావకః
నచైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః॥౨3॥

—* భాష్యమ్ *—

నను గృహదాహే తదన్తర్వర్తి వస్తునైవ దేహనాశే తదన్తర్వర్త్యాత్మనోఽపివినాశ స్స్యాదిత్యాహ॥ నైనమితి॥ ప్రకృత మాత్మానమవయవవిభాగేన ద్విధాకర్తుం న శక్నువన్తి తథా పావకోఽగ్ని రతిపరిజ్వలితోఽపి నైనం భస్మీకర్తుం శక్నోతి, నచైన మాపోఽప్యార్ద్రీకర్తుం శక్నువన్తి, నవా మారుతో వాయు రతి ప్రబలోఽపి నైనం నీరసం కర్తుం శక్నోతి కా కథా తదవయవశస్త్ర బంధాదేరితి భావః॥౨3॥

—* లఘుటిప్పణీ *—

ప్రకృతేతి॥ తద్యథా, 'య స్త్వయితిష్ఠన్య స్త్వాం నవిజానాసి యస్య త్వమేవ శరీరం య స్త్వదన్తరంయమయతి యఏష త ఆత్మాన్తర్యామ్య మృతః ఇత్యాది శ్రుత్యా సమష్టివ్యష్టిరూపేణ పరికృత మాత్మాన మవ యవవిభాగేన ద్విధా కర్తుం కథంచిదపి నశక్నువన్తి, కుతస్తతః పరం చిదంబరాత్మానం తద్భాసకం విభజే దిత్యవధార్యమ్॥ ౨3॥

—* ఆన్ధ్రతాత్పర్యము *—

ఓయీ! గృహము దగ్ధమైనపుడు గృహములో నుండువస్తువు సహితము దగ్ధమగునట్లు, దేహము నశించినతరువాత దానిలోపలనుండు నాత్మయు నశించుననఁగా చెప్పుచున్నాఁడు—

ఆత్మను ఆయుధములు అవయవవిభాగపూర్వకముగా నరుకఁజాలవు, అగ్ని దానిని భస్మము చేయఁజాలను, ఉదకములు దానినిఁ దడుపనేరవు,

వాయువు దాని నెండింపఁజాలదు. సమష్టివ్యష్టి రూపముగానున్న వశీకృతమైనయాత్మను రెండుగాఁజేయుటకెవరికిని శక్యము గాదు. కావున చిదాభాసుఁడైన జీవుని నెట్లు విభజింపఁగలుగుదువు?॥౨౩॥

శ్లో॥ అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ।
నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః॥ ౨౪॥

—♦ భా ష్య మ్ ♦—

నను శస్త్రాదీనాం నాశకత్వేఽప్యాత్మన స్తదనర్హత్వే హేతు మాహ - అచ్ఛేద్య ఇతి॥ ఇహ తు యతోఽచ్ఛేద్యోఽయ మతో నైనం ఛిన్దన్తీత్యాదిపూర్వేణాన్వయః। అత ఏవ 'ఆకాశవత్సర్వగత శ్చ నిత్యః వృక్షఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేకో యస్మి న్నిదం సంభవిచే తిసర్వ' మిత్యాద్యాః శ్రుతయశ్చ బోధ్యాః॥ ౨౪।

—✻ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ✻—

కావున నోయర్జునా! ఈయాత్మను భేదింపను దహింపను దడుపను నెండింపను శక్యముగాదు. ఇతఁడు సర్వవ్యాపి, నిత్యుఁడు, స్థిరస్వభావము గలవాఁడు, చలింపని వాఁడు పురాతనుఁడు॥ ౨౪॥

శ్లో॥ అవ్యక్తోఽయ మచిన్త్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే।
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి॥ ౨౫

—♦ భా ష్య మ్ ♦—

నను కీదృశోఽయ మాత్మేతి। యత్పరాశ్ఛేత్తై ర్బాహ్యైస్త్రిభి ర్న జానీమ ఇత్యాహ—అవ్యక్త ఇతి॥ ఏవంతర్హి

'యః పృథివ్యాం తిష్ఠన్ యం పృథివీ న విజానాతి యస్య పృథివ్యేవ శరీరం యః పృథివ్యా మంతరోఽయం యమయ త్యేష త ఆత్మా న్తర్యామ్యమృతః' ఇత్యాదిశ్రుత్యా రూపాది హీనత్వా దవ్యక్తోఽయ మిత్యాదిలక్షణలక్షితం జ్ఞానచక్షుసా విదిత్వా దేహాద్యుత్పత్తివినాశే నానుశోచితు మర్హసీత్యర్థః॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

రూపాదులు లేక పోవుటచేత నాత్మ కన్నులు మొదలగు నింద్రియ ములచేఁ గానఁబడదు: చిత్తముచే నాలోచింపఁ దగినదిగాదు. ఆత్మకు షడ్భావవికారములు లేవని జ్ఞానులు వచింతురు. కావన నాత్మ యిట్టిదని జ్ఞానదృష్టిచే నెఱింగి, దేహాదులుత్పత్తి వినాశములు గలవిగాఁ దెలిసి కొనుము. అందువలన నీవు దుఃఖింప వలదు. ౨౫.

శ్లో॥ అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్ ।
తథాపి త్వం మహాబాహో! నైవం శోచితు మర్హసి॥ ౨౬

—♦ భా ష్య మ్ ♦—

ఏవ మాత్మనో నిర్వికారకత్వేనాశోచ్యత్వ ముక్త మిదానీం తు సవికారకత్వే నాప్యాహ—అథచేతి । ఏవం సతి యద్యేన మాత్మానం నిత్యజాతం నిత్యమృతంవా మన్యసే చేత్త థాపి హేమహాబాహో! దురుద్ధర మహాబాహో నైవంశోచితు మర్హసీత్యర్థః॥ ౨౬

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

పరాఞ్చిఖానీతి॥ తత్ర 'పరాఞ్చిఖాని వ్యతృణత్స్వయంభూ' రితిశ్రుతిః। తస్యాశ్చఖానీంద్రియాణి స్వయంభూః ప్రజాపతిఃపరాఞ్చివ్యతృణన్నామ రచి

తవా న్నహి, కింతు పరాగ్వస్తు పశ్య త్యతో హింసితవా నిత్యాశయః రూపాదిహీనత్వాదితి॥ తత్రైవం, సత్యాదత్యవద్వా స్ఫటికోపమం వా, కరాంబువత్ స్వచ్ఛ మిదం విభాతి ఇత్యాదిస్మృతిన్యాయేన నీలపీతాది సప్తవిధరూపాది హీనత్వా దిత్యవధార్యమ్॥ జ్ఞానచక్షుషేతి॥ గుర్వర్క లబ్ధోపనిషత్సు చక్షుషీతి స్మృతిన్యాయేనగురోర్లబ్ధజ్ఞాన చక్షుషీత్యర్థః॥ ఏవం సతీతి॥ ఇహాస తస్మాజ్జాయత ఇతి పూర్వోక్తరీత్యాత్మనో నిత్యత్వా నిత్యత్వరూపయోరపృథగ్భయ పక్షాభ్యుపగమే సతీత్యర్థః ॥౨౫॥౨౬॥

## —♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

ఆత్మ యెట్టిదనఁగా బాహ్యేంద్రియములకుగోచరింపనిది యనిచెప్పు చున్నాఁడు:—

ఓమహాబాహూ! ఒకవేళ ఆత్మసవికారియై యెల్లప్పుడును జనన మరణములను బొందుచునుండెడి ఈశరీరమునే ఆత్మగాఁదలంచితవేని అట్టు లైనను విచారింపఁబనిలేదు. నీవంటి పరాక్రమవంతునకు పరిణామస్వభావము గలిగిన శరీరమునకై దుఃఖించుట తగినది గాదు 'యస్యపృథివీశరీరం' అనుశ్రుతిప్రమాణమునుబట్టి ఆత్మ నిరుపాధికమైనది వ్యక్తముగాని దియు గాన చర్మచక్షువులకు గోచరము గాక జ్ఞానదృష్టికి గోచరించును. అట్టియాత్మకంటె భిన్నమై ఉత్పత్తి వినాశములు గలదేహమును గుఱించి యెందుకు దుఃఖించెదవు! ॥౨౬॥

శ్లో॥ జాతస్య హి ధ్రువోమృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ।
తస్మాదపరిహార్యే ఽ ర్థే న త్వం శోచితు మర్హసి ॥౨౭॥

## —✳ భా ష్య మ్ ✳—

న న్వాత్మనో నిత్యత్వపక్షే దృష్టా దృష్ట దుఃఖభయే నాహంశోచామీత్యాహ।జాతస్యేతి॥ ఏవంత ర్హి।జాతస్య స్వకృత

ధర్మాఽధర్మాదివశాల్లబ్ధ శరీరేంద్రియ సంబంధస్యా వశ్యకస్తద్వియోగలక్షణో మృత్యుః తచ్ఛరీరాది సంయోగలక్షణం జన్మచాపరిహార్యమేవేతి జన్మమరణాది రూపేఽర్థేమృత్యుర్జన్మవతాం ధీరదేహేన సహజాయతే 'అద్య చాబ్దశతాంతేవా మృత్యుర్వై ప్రాణినాంధ్రువః' ఇత్యాదిస్మృతిన్యాయేన నత్వం శోచితుమర్హసీత్యర్థః ॥౨౭॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

మానవ జన్మమందు ధర్మాఽధర్మరూపకర్మలు చేసినందువలన కర్మఫలమనుభవించుటకు దేహేంద్రియసంబంధమవశ్యము. దానివియోగము మృత్యువు. శరీరాది సంయోగము, జన్మము, ఈరెండును తప్పనివే- ఇప్పుడైనను, నూరుసంవత్సరములు గడచిన పిదపనైనను, ప్రాణులకు మృత్యువు ధ్రువమని శ్రుతులు పలుకుచున్నందువలనఁ దొలగింపసాధ్యము కాని మృత్యువును గూర్చి నీవు విచారింపంబనిలేదు. ౨౭॥

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత?
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా॥ ॥౨౮॥

—* భాష్యమ్ *—

నను యది పరబ్రహ్మణ స్సకాశా జ్జీవః పృథగ్భూతః తర్హి కిమతః పరం బ్రహ్మీభూతత్వ మిచ్ఛసి చేత్పునరపి పూర్వవత్ పృథగ్భావాపత్తి రిత్యతఆహ-అవ్యక్తాదీనీతి॥ ఏవం తర్హి! 'తద్ధేదం తర్హ్యవ్యాఽకృత మాసీత్తన్నామ రూపాభ్యామేవ వ్యాక్రియతే ఇత్యాది శ్రుతేః అవ్యక్తోపాదానత్వం జగ

తాం దర్శితం లయస్థానంతు తస్యార్థసిద్ధం మృద్ఘటాదివదితి
శ్రుతి యుక్తిభ్యాం సిద్ధేవస్తుని కా విచారణేత్యాశయః॥ ౨౮॥

## —♦ లఘు టిప్పణీ ♦—

కావిచారణేతి॥ తథాచ, 'యశ్చమూఢతమోలోకేయశ్చ బుద్ధేఃపరం గతః। ద్వావిమౌ సుఖమేధేతేసీదత్యన్తరితోజనః' ఇత్యాదిస్మృత్యా సదేహాశ్చ విదేహాశ్చ భవన్త్యాత్మేచ్ఛయాపునః, ఇత్యాది స్మృత్యాచ ఆద్యంతయో ర్ద్వయో ర్ముక్తత్వే స్థితేఽంతరితానాం జీవన్మృతానాం జీవనే మరణేవా కా విచారణే త్యవధార్యమ్॥ ౨౮॥

## —✳ ఆన్ధ్ర తాత్పర్యము ✳—

సృష్టికి పూర్వము ప్రళయావస్థయందు పృథివ్యప్తేజోవాయు రాకాశములు అవ్యక్త (కారణరూప ప్రకృతి) నామముతోఁ బిలువఁబడు చున్నవి. కార్యరూపజగత్తుగాపరిణమించినప్పుడువ్యక్త మనిపిలువబడుచున్నది. మరల నెప్పుడు కార్యరూపవ్యక్తము కారణరూపమందు గలియునో అప్పుడు అవ్యక్తమని పిలువబడుచున్నది. ప్రళయకాలమందు జీవాత్మయు శరీరత్యాగముజేసి అశరీరియని జెప్పఁబడుచున్నది. ప్రళయావస్థలోకి వెళ్ళి నప్పుడు అశరీరి (అవ్యక్తము) యని చెప్పఁబడును. ఏమనఁగా జీవాత్మకు కర్మగతి అడ్డిపోవును. ఆత్మయొక్క ఇచ్ఛచేత సదేహులును విదేహులును గాఁగలరు. అందుకు విచారణయేల॥ ౨౮॥

శ్లో॥ ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః।
ఆశ్చర్యవచ్చైన మన్యశ్శృణోతి
శ్రుత్వా ప్యేనం వేద నచైవకశ్చిత్॥ ౨౯॥

—◆ భాష్యమ్ ◆—

ననుకథమేన మాత్మానం తత్త్వజ్ఞా స్తదితరేచ పశ్యన్తీత్యాహ- ఆశ్చర్యవదితి। తత్రతావత్ శ్రుతిః, తద్యథా, 'సమాధినిర్ధూతమలస్య చేతసో నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్। నశక్యతే వర్ణయితుంగిరా తదా స్వయం తదన్తః కరణేన గృహ్యత' ఇతి. ఏవంకశ్చి న్మహద్ శ్రోత్రియ స్త్వాశ్చర్యవ ద్వదత్యేవ సతత్త్వతః స్వయం విజానాతీతి తథా తతోఽన్యః కశ్చి న్ముముక్షు ర్గురుశాస్త్రాభ్యా మాశ్చర్యం శృణోతీతి ఏవం కశ్చి త్సర్వథా విమూఢో నాగరిక శ్శ్రుత్వా ప్యేతతత్త్వం కిమపి నో విజానాతీత్యాశ్చర్యోఽస్యవక్తాశ్చర్యోఽస్య శ్రోతాశ్చర్యోఽస్య లబ్ధేత్యాది శ్రుతేరపీత్యవధార్యమ్॥ ౨౯॥

—✻ లఘుటిప్పణీ ✻—

యత్సుఖం భవేదితి॥ తద్యథాఽన సుఖం దేవరాజస్య న సుఖం చక్రవర్తినః। యత్సుఖం వీతరాగస్య మునే రేకాన్తవర్తిన ఇత్యాది స్మృత్యన్తరాదితి భావః॥ ౨౯॥

—◆ ఆన్ధ్రతాత్పర్యము ◆—

ఓయీ! ఆత్మను తత్త్వజ్ఞానులున్నూ ఇతరులున్నూ యేవిధముగా చూచుచున్నారనఁగాఁ జెప్పుచున్నాఁడు-సమాధిచేనిర్మలమైనట్టిదియు, ఆత్మయందు ప్రవేశించినచిత్తమునకు నెట్టిసుఖమున్నదో అంతఃకరణయందు నెంత ఆనందము గ్రహించబడుచున్నదో అది వాక్కులో వర్ణించుటకు శక్యముగాదు. ఇట్టి యాత్మనుఒకానొక మూఢుఁడు ఎన్నఁడును గనుగొనని వస్తువును గాంచినట్లు అబ్బురముగా గనుగొనును. ఒకానొక శ్రోత్రి

యుడు ఆశ్చర్యముతో మరియొకనితో నుడువును. తాను యథార్థముగా నెఱుంగడు. మరియొక ముముక్షువు గురుశాస్త్రముల వల్లనుంచి ఆశ్చర్యముతో నాలకించును. ఈప్రకారము మఱియొక నాగరికుండు ఆల కించియు నాత్మ నెఱుంగఁజాలడు. రాగద్వేషాదులులేక ఏకాంతవాసము సేయు మునికి నెంతసుఖముగలదో అంతసుఖము స్వర్గమునందుండు దేవేంద్రునికిని, ప్రపంచమంతయు నేకచక్రిముగాఁ బాలించు చక్రవర్తికిని లేదు॥ ౨౯॥

శ్లో॥ దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత।
తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి॥ ౩౦॥

—* భాష్యమ్ *—

సన్న స్యైవతత్త్వజ్ఞానినా మజరామరత్వేనకా క్షతిర్జీవస్య తు శరీరసంయోగవియోగయో స్సత్వేన సమరేఽపి దుఃఖ మేవేతితదపి నేత్యాహ— దేహేతి। ఏవంసతి సర్వస్య ప్రాణిజాతస్య దేహేవధ్యమానేఽప్యయం దేహీలింగదేహోపాధిర్జీవాత్మా వధ్యో నభవతీతి న త్వం శోచితుం భీష్మాదీ న్ప్రత్యర్హసీ త్యర్థః॥

—* లఘుటిప్పణీ *—

వధ్యో నేతి॥ కిన్తు శరీరసంయోగవియోగయోరివ జీవన్మరణాదేర్నిర్ణీతత్వాదితిభావః॥ ౩౦॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

ఓయీ! తత్త్వజ్ఞానులకు జరామరణములు లేవుగాన హానిలేదు. జీవునకు శరీరముతో సంయోగవియోగములు గలిగియుండుటచేయుద్ధమందు దుఃఖమేగలదంటే లేదని చెప్పుచున్నాఁడు— సర్వప్రాణులు దేహమును

తెలియుచున్నవి. లింగదేహమే యుపాధిగాఁగల జీవాత్మయైన దేహి యెన్నఁడును జంపఁదగినది గాదు. కావున ఓయర్జునా? ఈభీష్మాదులున్నగు వారికొఱకే గాదు సకలభూతములను గూర్చియు నీవు విచారింపఁగూడదు. శరీరసంయోగముచే జీవించుటయు వియోగముచే మరణించుటయుఁ గన బడుచున్నవి. ‖ ౩౦‖

శ్లో॥ స్వధర్మమపి చావేక్ష్య నవికంపితు మర్హసి।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే॥

—* భాష్యమ్ *—

అథ న కేవలం తత్త్వజ్ఞానినామేవాయంధర్మ ఇత్యేవ సీయతే కిన్తుయుద్ధస్య స్వధర్మత్వ మప్యవేక్ష్య పర్యాలోచ్య వికంపితుం విచలితుం నార్హసీత్యాహ-స్వధర్మేతి॥ తత్త్రైవంసతి 'సంగ్రామేష్వ పలాయిత్వం ప్రజానాంచైవపాలనం। శుశ్రూషా బ్రాహ్మణానాం చ రాజ్ఞ శ్శ్రేయస్కరం పరమిత్యాదిమనూ క్తవాక్యైరపి యుక్తం। క్షత్రియస్యేత్యాహ । ధర్మాద్ధీతి॥తతశ్చ రక్షార్థం యుద్ధరూపా ద్ధర్మాచ్ఛ్రేయః క్షత్రియస్యా న్యన్నవి ద్యతఇత్యాశయః॥ ౩౧॥

—♦ లఘుటిప్పణీ ♦—

రక్షార్థమితి॥ తదుక్తంస్కాందే, తద్యథా, అధర్మనిరతశ్శత్రు, ర్భాగ్యేనైవ తు లభ్యతే। త మతో ధర్మరక్షార్థం నిబధ్నీయా ద్దురా సదమిత్యాదిద్రష్టవ్యమ్॥ ౩౧॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

కేవలము తత్త్వజ్ఞానులకే ఈధర్మము లేకపోదు. యుద్ధము స్వధర్మ మని తెలిసిన నీవును కంపము నొందనక్కఱలేదని చెప్పుచున్నాఁడు—

యుద్ధమునందు వెనుదీయకుండుట, ప్రజలను బాలించుట, బ్రాహ్మణులకు శుశ్రూషచేయుట రాజునకు శ్రేయస్కరములని చెప్పిన మనుధర్మశాస్త్రమును గూడ నాలోచనలోనికిఁ దెచ్చుకొని నీవు నిశ్చలుఁడవు గావలయును. క్షత్రియునకు ధర్మయుద్ధముకన్నను మరియొక శుభముండదు. అధర్మనిరతుఁడైన శత్రువు భాగ్యవశమున లభించును. అందువల్ల నట్టివానిని ధర్మరక్షణకొఱకు (బట్టి బంధించవలయునని స్కాందమునందుఁ గలదు. ౩౧

శ్లో॥ యదృచ్ఛయా చో పపన్నం స్వర్గద్వారమపావృతమ్।
సుఖినః క్షత్రియాః పార్థ! లభన్తే యుద్ధ మీదృశమ్॥ ౩౨

—♦ భా ష్య మ్. ♦—

ననుయుద్ధస్య స్వధర్మత్వేనావశ్యకత్వేఽపి 'బ్రాహ్మణం హన్యాత్' ఇత్యాది శ్రుతివిరోధాత్ కథం తత్రద్రోణాచార్యాదీన్ బ్రాహ్మణానపి హన్యామీత్యాశంక్యాహ—

యదృచ్ఛయేతి।'గురుం బాలకవృద్ధౌవా బ్రాహ్మణంవా బహుశ్రుతమ్। జిఘాంసంతం జిఘాంసీయా,దిత్యేవంమనురబ్రవీత్ ఇత్యాదిస్మృత్యా క్షత్రియాణాం యుద్ధస్యావశ్యకత్వే స్థితే తత్రాపి యదృచ్ఛయా స్వప్రయత్నవ్యతిరేకేణ చోపపన్నం యుద్ధం స్వర్గద్వార మపావృత మప్రతిబద్ధం కీర్త్యాదిసాధకం చేత్ ద్రష్టవ్యమ్ ॥౩౨॥

—* ల ఘు టి ప్ప ణీ *—

క్షత్రియాణామితి॥ తత్ర 'యస్య చ్ఛేదశతం గాత్రం శరముద్గరయష్టిభిః। దేవకన్యాస్తుతం వీరం హరన్తి రమయన్తి చ, ఇత్యాదినా ధర్మనిబంధేష్యుక్తత్వాదితి భావః॥ 'ఆత్మార్థంహన్తుముద్యుక్తం భ్రాతరంపితరం

సుతమ్। గాం వా వృషభమశ్వంనా హన్యాచ్ఛేన్నైవ దోషభాక్॥ ఇతిస్మరణాచ్చ॥ ౩౨॥

## —♦ ఆన్ధ్రితాత్పర్యము ♦—

క్షత్రియునకు యుద్ధము స్వధర్మమగుటచే నావశ్యకమైనప్పటికిని బ్రాహ్మణునిఁజంపఁగూడదను శ్రుతినిబట్టి బ్రాహ్మణులైనద్రోణాచార్యాదులనెట్లుచంపుదునని శంకింపఁగా సమాధానమును జెప్పుచున్నాఁడు.

గురువుగాని వృద్ధుఁడుగాని విద్యావంతుఁడగు బ్రాహ్మణుఁడుగాని తన్నుఁజంపవచ్చినయెడల వానిని జంపవచ్చుననియు మఱియు సోదరుఁడైనను దండ్రియైనను, పుత్రుడైనను గోవృషభాశ్వములైననుదన్నుఁ జంపవచ్చిన యెడలవారినిజంపినచో బాపములేదని మనువుచెప్పుటవలనను క్షత్రియునకు నిష్ప్రయత్నముగా లభించినయుద్ధము తెఱవఁబడిన స్వర్గద్వారములో సమానమైనదగుట వలనను నోపార్థా! నీవుయుద్ధమునువీడకదానికై ప్రయత్నింపుము. దైవికముగాఁ గలిగిన యుద్ధము సుఖవంతులగురాజులకేకాని తక్కుంగలవారికి లభింపదు. ఇందు జయము గల్గెనా మనకు రాజ్యసౌఖ్యములభించును. యుద్ధమరణము సంప్రాప్తమయ్యెనా స్వారాజ్యసౌఖ్యమునుబొందుదుము. కావున నీవవశ్యము యుద్ధమునకై కడఁగుము ౩౨

శ్లో॥ అథ చేత్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి,
తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి॥ ౩౩॥

## —♦ భాష్యమ్ ♦—

నను నాఽహం యుద్ధఫలాకాంక్షీ నవా త్రైలోక్యవిజయాకాంక్షీ చేత్యాహ— అథచేదితి॥'న చ హన్యాత్ స్థలారూఢం నక్లీబం నకృతాంజలిమ్ నముక్తకేశం నాసీనం నతవాస్మీతి వాదినమ్' ఇత్యాది స్మృత్యుక్తలక్షణరహితాన్ భీష్మ

ద్రోణాదీన్ హన్యాదేవేతి కాంక్షితిరిత్యనేక జన్మార్జితం ధర్మాయ హితం ధర్మ్యం సంగ్రామం త్వం నకరిష్యసి చేత్తతస్స్వ ధర్మం కీర్తిం చహిత్వా పాపమేవాప్స్యసీత్యర్థః॥33॥

—♦ లఘుటిప్పణీ ♦—

ధర్మ్యమితి॥ తద్యథా 'యత్రి తత్రిహతశ్శూర శత్రుభిః పరివేష్టితః అక్షయాల్లభతేలోకాన్యది క్లీబం నభాషతే'ఇత్యాదినా క్షత్రియాణాం యుద్ధధర్మత్వాదితి భావః॥33॥

ఓయీ! నేను యుద్ధఫలములను గోరువాఁడను గాను, త్రైలోక్య విజయమునైనను గాంక్షించువాఁడను గాననఁగాఁ జెప్పు చున్నాఁడు— అర్జునా! స్వస్థానమందుఁ గూర్చుండిన వానిని గాని నపుంసకునిగాని దోసి లొగ్గినవానిని గాని తలవిరియఁబోసి కొన్నవానిని గాని కూర్చున్నవానిని గాని, నేను నీవాఁడనని శరణొందినవానిని గాని చంపఁ గూడదని స్మృతు లందుఁ జెప్పబడినది. పైలక్షణములలో నేవియును లేని భీష్మద్రోణాదు లను జంపుటవలన నేదోషమును లేదు అనేకజన్మార్జితపుణ్యములచే సంప్రాప్తమయిన యీధర్మయుద్ధమును నీవు చేయనియెడల, ధర్మమును గీర్తిని వదలి పాపమును బొందఁగలవు. (శూరుఁడు నపుంసకుని జోలికిఁ బోఁగూడదు కాని తనతో సమానులతో డీకొని వారిచేహతుఁడగునేని యక్షయములగు పుణ్యలోకములఁ బొందునని స్మృతియందుంటవలన క్షత్రియునకు యుద్ధము పరమధర్మము.)॥ 33॥

శ్లో॥ అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్ ।
సంభావితస్య చాకీర్తి ర్మరణాదతిరిచ్యతే॥ 34॥

—♦ భాష్యమ్ ♦—

ఏవం కీర్తిధర్మయో రిష్టయో రప్రాప్తి రనిష్టస్యప్రాప్తి రిత్యతో యుద్ధం నపరిత్యజే దిత్యుక్తమేవ పునర్ద్రఢయన్నాహ

అకీర్తిం చాపీతి॥ తథా సతి శిష్టనిందాలక్షణాం త్వనిష్టామాసన్న ఫలదా మసహ్యా మకీర్తిం భూతాని దేవర్షిమనుష్యాదీని తే తవాప్యయాం దీర్ఘకాలం యుద్ధేఽక్షమోఽయ మిత్యేవం లక్షణా మన్యోన్యం కథయిష్యన్తీతి సంభావితస్యానన్య గుణ యుక్తస్యాకీర్తిస్తు మరణాదప్యతిరిచ్యత ఇత్యాశయః ॥౩౪॥

—♦ లఘు టిప్పణీ ♦—

మరణాదపీతి॥ తదుక్తం 'సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే' ఇత్యాదిర్ద్రష్టవ్యమ్ ॥౩౪॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము. ♦—

యుద్ధము చేయకపోయినయెడలఁ బ్రియములైన కీర్తిధర్మములు లభింపవు కాని, యనిష్టము గలుగుననియు యుద్ధమవశ్యకర్తవ్యమనియు, ముందుఁ జెప్పినవిషయమునె దృఢీకరించుచున్నాఁడు—అర్జునా; క్షత్రియున కవశ్యకర్తవ్యమగు యుద్ధమును జేయక మానుదువేని దేవర్షి మనుష్యాదులందఱును 'అర్జునుఁడెంతభయస్వభావము గలవాఁడు. యుద్ధమారంభింపఁ గానె పందయై పాఱిపోయెను' అని సర్వదేశకాలములందును విడువక నీయపకీర్తిని చెప్పుకొనఁగలరు, అపకీర్తిగలవాని కిందును నందును సుఖమున్నయనుమాట వినవా! మిక్కిలి గౌరవముతో జీవించువానికి గలుగునపకీర్తి మరణముకంటె నధికము గదా. ఇదివఱకును నీవుసంపాదించినకీర్తిప్రతిష్ఠ లేటఁ గలసి పోవును. కావున క్షత్రియుఁడు లోకనిందను బొందుటకంటె యుద్ధము సేసి నేను ముందుఁ జెప్పినవిధముగా వీరస్వర్గమును జూఱఁగొనుటయె యుచితము ॥౩౪॥

శ్లో॥ భయాద్రణాదుపరతం మంస్యన్తే త్వాం మహారథాః।
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ ॥౩౫॥

## —♦ భా ష్య మ్ ♦—

ననూ దాసీనా నిందన్తు, భీష్మద్రోణాదయస్తు, మహారథాః కారుణిక త్వేన స్తోష్యన్తీతి నేత్యాహ భయాదితి॥ తతశ్చ యుద్ధోపశాన్తా తేఽపి భయాదేవ రణాదుపరతం త్వాం మన్యన్తే, నతుసతి శౌర్యే కరుణయా త్యక్తయుద్ధోఽయమితి, యేషాం చత్వం బహుమతోఽసి తత్రేదానీం తేషాంమహాతాం నుధ్యేత్వం తథాభూత్వాలాఘవం లఘుత్వం యాస్యసీత్యత్యంత గర్హితమేతదితి తాత్పర్యమ్॥ ౩౫॥

## —♦ ల ఘు టి ప్ప ణీ . ♦—

నిందంత్వితి॥ కింతులద పేక్షయా "ప్రాణైః రర్థైః ర్ధియా వాచా శ్రేయఏవ సదాచరేదితి" స్మృతిన్యాయేన నిందాభయా దప్యవశ్య మేతత్కరణీయ మిత్యవధార్యం-అతఏవ అద్భుతరామాయణె, 'భూపతిభ్యో గతా లజ్జా దిగంతే కీర్తి రీరితా। లఘుత్వా జ్జానకీ యస్మా ద్రామచంద్రేణ చాదృతా' ఇత్యాదినా కీర్తేరేవగరిష్ఠత్వ స్యోక్తత్వాదితి భావః॥ ౩౫॥

## —♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

తటస్థులగువారు నిందింతురుగాక. కాని మహారథులగు భీష్మద్రోణాదులు దయార్ద్ర హృదయులగుట వలన సంతోషింతురనగా నట్లు వారు సంతోషింపరని చెప్పుచున్నాఁడు. అర్జునా. ఎవ్వారికి నీవింతదనుక బహుమతుఁడవై వర్తించుంటివో. అట్టి భీష్మద్రోణాదులు సహితము 'యుద్ధము చేయజాలక నీవు రణరంగమునుండి మరలినావ'ని తలంచుచు వారు నీ విషయమున మిక్కిలి చులకనితనమును జూపుదురు. నిన్ను గొప్పగాఁ దలంచుచుండిన భీష్మద్రోణాదులే లాఘనములో జూతురేని

తెక్కువగల కర్ణదుర్యోధనాదుల విషయమునుం గూర్చి చెప్పవలసిన దేమున్నది ? నీవే యోజించుకొనుము. కావున యుద్ధమునుండి మఱలుట కంటె మఱిక్షత్రియునకు నింద్యమైన కార్యములేదు. (త్రికరణ శుద్ధిగా ప్రాణములర్పించి యైనను మానవుఁడు శ్రేయమునే చేయవలెను. అను స్మృతినిబట్టి నిందాభయమువలన అవశ్యముగా యుద్ధము జేయవలయును.)

శ్లో॥ అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యంతి తవాహితాః
నిందన్త స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్॥ ౩౬

## —♦ భాష్యమ్. ♦—

అథ చ తేషాం మధ్యే లఘుత్వమేవ, న హి కింత్వ పరమపి దుఃఖతర మిత్యాహ। అవాచ్యేతి॥ అవాచ్యాన్ వచనా నర్హాన్ వాదాన్ బహూన్ అనేకశః స్తవాహితా శ్శత్రవో వదిష్యంతీత్యర్థః । తత్రతావత్ వదిష్యంత్వేవ న కేవలం కింతు తవ సామర్థ్యం పరిభుత్వం నిందంతోఽవాచ్యవాదాన్వదిష్య న్తీతి తతో దుఃఖతరం కష్టం కిమ స్తి కిమపి నేత్యర్థః॥ ౩౬॥

## —♦ ఆన్ధ్ర తాత్పర్యము ♦—

లోకమునందు లఘుత్వముకన్న మఱి వేఱుదుఃఖము లేదని చెప్పు చున్నాఁడు. అర్జునా! యుద్ధరంగమునందు నీవు నిలువలేక పాఱిపోవుదు వేని దుర్యోధనాదులగు వచ్చిన యీశత్రువులు 'మాపరాక్రమమునుజూచి అర్జునుఁడు పిరికిపందయై పరుగిడిపోయెనుగదా' అనుచు వచింపరాని యనేకములైన మాటలచే నిన్ను నిందించుచు నీపరాక్రమమును దూఱ వాడుదురు. ఇంతకన్న క్షత్రియునకు దుఃఖము వేఱొకటి కలదా॥ ౩౬॥

శ్లో॥ హతో వా ప్రాప్స్యసిస్వర్గం జిత్వా వా భోక్ష్యసేమహీం।
తస్మా దు త్తిష్ఠ కౌన్తేయ! యుద్ధాయ కృతనిశ్చయః॥ ౩౭॥

—♦ భా ష్య మ్ ♦—

నను తర్హి యుద్ధే గుర్వాదివధ స్తతోనివృత్తౌ తు శత్రుకృతనిందేత్యుభయతః పాశో రజ్జురితి సంకటం మన్వానో యుద్ధార్థమేవోత్థానం యుక్తమిత్యాహ॥ హతోవేతి॥ తస్మా జ్జేష్యామి శత్రూ న్మారయిష్యామివేతి కృతనిశ్చయ స్సన్ యుద్ధాయో త్తిష్ఠేత్యర్థః॥ ౩౭॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

యుద్ధముఁజేసిన గురువులను జంపవలసియున్నది. యుద్ధమును మాని చేసిన శత్రువులవలననిందఁ బడవలసియున్నది. వెనుకకుఁ బోయిన త్రాడు ముందుకు బోయినఉరియన్నట్లు యీసంకటావస్థలో యుద్ధమే మంచిదని చెప్పుచున్నాఁడు. సంగరంబునఁ బ్రాణంబులు విడిచితివేని స్వర్గంబున కరుగుదువు. వైరులను జయించితివేని, రాజ్యము ననుభవింతువు కాన నోపార్థా! లెమ్ము! పోరానర్ప నాయత్తపడుము- ౩౭॥

శ్లో॥ సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయాజయౌ॥
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి॥ ౩౮॥

—♦ భా ష్య మ్ ♦—

నన్వేవం స్వర్గోద్దేశ్యేన యుద్ధే కృతే తు తత్ఫలస్య క్షయాతిశయయుక్తత్వం రాజ్యోద్దేశ్యేన కరణేప్యర్థనాశ స్యావశ్యకత్వా దిత్యసమంజసం మన్వాన ఆహ - సుఖదుఃఖేఇతి॥

తథాచేదానీం సుఖకామత్వం దుఃఖనివృత్తికామత్వం వా।
విహాయ యుద్ధాయ యుజ్యస్వ సన్నద్ధోభవేతి నైవం పాప
మవాప్స్యసీత్యర్థః॥ ౩౮॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

యుద్ధమందు మరణించి స్వర్గమును సంపాదించుకొన్నను బునరా వృత్తి తప్పదు, ఇప్పుడు శత్రుసంహారము చేసి రాజ్యమును సంపాదించెదవా ఇదియును నశించునదే. కాన ఇహాఽముత్రార్థఫలభోగవిరాగమె సమంజసమైనదని తలఁచినఁ జెప్పుచున్నాఁడు. సుఖమును దుఃఖమును, లాభమును, నష్టమును, జయమును, అపజయమును, తుల్యముగా నెంచుకొనిన పిదప యుద్ధమున కాయత్తపడుము. ఆ విధమున నొనర్చితివేని దురితంబును గాంచవు.

శ్లో॥ ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబంధంప్రహాస్యసి॥ ౩౯

—* భా ష్య మ్ *—

నను 'శాస్త్రతత్త్వజ్ఞ సంపర్కో విచారోఽసంగభావనా।
సమతా స్వచ్ఛతా సామ్యాతుర్యగా సప్తభూమికాః।'ఇత్యాది
స్మృత్యా సప్తభూమికాక్రమేణ సమత్వజ్ఞాన స్యౌపనిషద్వేద్య
త్వం తద్విషయకత్వావచ్ఛేదేన చ సాబుద్ధిరభిహితే త్యుప
సంహర న్నాహ—ఏషేతి॥ ఏవంతర్హి 'సమ్యక్ ఖ్యాయతే
ప్రతిపాద్యతే 'యేన తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి'తి
శ్రుతివేద్యత్వం తత్త్వం తద్విషయికా యథోక్తసాంఖ్యనామ్నీ
తే తవాభిహితా కథితా బుద్ధిరిత్యర్థః "అథ యోగే కర్మణా

సహభక్తియోగే త్విమాం వక్ష్యమాణాంబుద్ధిం శృణ్విత్యర్థః । తథా చేహ శుద్ధాన్తః కరణం ప్రతియథోక్తసాంఖ్యోపదేశ స్తద్భిన్నంప్రతితు కర్మణాసహ భక్తియోగోపదేశ ఇతి తయోర్విభిన్న విషయత్వేన కుతస్సముచ్చయాశంకేతి పర్యవసితే 'ధర్మేణపాప మపనుదతీ' త్యాది శ్రుతేశ్చ పశ్చాద్ద్వయో రేకఫలకత్వం స్ఫుటీకృతం భవతీతిభావః ॥౩౯॥

## —♦ ల ఘు టి ప్ప ణీ . ♦—

సంపర్క— ఇతి॥ తత్ర తావత్ సచ్ఛాస్త్రస్యతత్త్వజ్ఞస్య చ సంపర్క స్సంగతిరిత్యర్థః॥ కర్మణాసహేతి॥ తత్రతావదిహాముత్రఫలార్థం క్రియమాణేన తత్త్వజ్ఞానేన చ యద్యపి సముచ్చయో నభవతి, తథాపి నిష్కామేన తత్త్వఫలకేన కర్మణా తు సముచ్చయో భవత్యేవేతి బోధ్యమ్।తద్యథా 'ఉభాభ్యామేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతిః । తథైవ భక్తి కర్మభ్యాం ప్రాప్యతే బ్రహ్మ శాశ్వత' మిత్యాది ద్రష్టవ్యమ్॥ ౩౯॥

## —♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

తత్త్వజ్ఞానిసముక్షమున వేదాంతశాస్త్రాభ్యాసము చేయుచు వైరాగ్యము గలిగియుండుట ప్రథమభూమిక. ఇది ముముక్షుత్వము నిచ్చునది. ఆత్మానాత్మ విచారణచేయుట రెండవభూమిక' దారేషణ పుత్రేషణ ధనేషణల వదలుట మూఁడవభూమిక, లోకవాసన శాస్త్రవాసన, దేహవాసనలు విడుచుట నాల్గవభూమిక శుద్ధసంవిద్రూపానందములో నుండుట అయిదవభూమిక, సగమునిద్ర సగము మెలఁకువ వలెనుండునట్టి స్థితి ఆఱవభూమిక, ఇది జీవన్ముక్తావస్థ, కేవలసుషుప్తితో సమానమైనస్థితి గలిగి అఖండానందము ననుభవించునది యేడవభూమిక, ఇది ముక్తావస్థ. ఈప్రకార మేడుభూమికలను క్రమక్రమముగా ధనుస్సుయొక్క నారికొట్ట

వలె నొకటొకటిగా నెక్కించుచు ఉపనిషద్విచారణసేయునదియె బుద్ధి యని ప్రపంచవ్యాపారమునంతను ఉపసంహరించుచు చెప్పుచున్నాడు॥ ఓయర్జునా! ఇయ్యది ఉపనిషత్తులయందు చెప్పబడినఆత్మతత్త్వమును గూర్చి నుడివినబుద్ధి. ఇంక నేబుద్ధితో గర్మబంధములనుబొందవో యట్టికర్మయోగ భక్తి యోగములను జెప్పెదవినుము. అంతఃకరణశుద్ధిగలవానికి జ్ఞానోప దేశము చెప్పఁబడినది. అంతఃకరణశుద్ధి లేనివానికి కర్మతో గూడినభక్తి యోగము నుపదేశించవలయును. భక్తి కర్మలు భిన్నవిషయములగుటవలనఁ గర్మముగూడ నెందుకు జేయవలయు ననఁగా 'ధర్మముచే పాపముతొలఁగి పోవు' నను శ్రుతులు గలవుగాన ఆఖరునకు భక్తిఫలమును, కర్మఫలము నొక్కటియె యగునని స్ఫుటముగా దెలియనగును॥ (నిష్కామకర్మలు చేయవలసినదే) యేమనగా పక్షులు రెండురెక్కలచేతను ఆకాశమునందు సంచరించునట్లు ముముక్షువు కర్మభక్తులచే శాశ్వతమైన శివపదమును బొందుచున్నాఁడు॥౩౯॥

శ్లో॥ నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో నవిద్యతే।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥

—♦ భాష్యమ్ ♦—

నను 'తమేతమాత్మానం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసా నాశకేన తపసాకల్మషం హన్తి విద్యయామృతమశ్నుత' ఇత్యాది సర్వకర్మణాం వినియోగాత్ తతోఽంతఃకరణశుద్ధిద్వారా స్వతఏవోపరమ్య వివిదిషయా విజ్ఞానార్థే భవతీత్యాహ-॥నేహేతి॥ ఏవంతర్హి 'ముద్రాజటూరచనం మాధ్యనతాం వృథైవ మోఘాశినా మఖిలశౌచనిరాకృతానాం। తోయప్రదాన పితృపిండబహిష్కృతానాం

సంభాషణాదపి నరా నరకం ప్రయాంతీ,త్యాదిస్మృత్యా ముద్రా దిత్రివిధపాఖండి ధర్మాంస్తిరస్కృత్య 'కుటీచకానుగే ధర్మే త్రివిధే సముపార్జితే। ఋణత్రియవినిర్ముక్తే కైవల్యం సులభం భవేది' త్యాదిస్మృత్యా నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ఇత్యాద్యుక్త్యా స్వధర్మత్వేన నవా కించిత్పాతకం నవా కైవల్యే క్షతిరితి స్వల్పమప్యస్య ధర్మస్యానుష్ఠానాదుర్వారుకమివసంసారబంధనాత్ జ్ఞానవిజ్ఞానసంపత్త్యా నివృత్తిర్భవిష్యతీత్యాశయః॥ ౪౦॥

## —◆ లఘుటిప్పణీ. ◆—

ముద్రేతి। తత్రతావత్॥ 'యథా. 'శ్మశానజం కాష్ఠమనర్హం సర్వకర్మసు తథా చక్రాంకితో విప్రః సర్వకర్మసు గర్హిత' ఇత్యాద్యధికం సర్వశాస్త్రార్థదర్పణే ద్రష్టవ్యమ్॥ ౪౦॥

## —◆ ఆంధ్రతాత్పర్యము ◆—

ఆత్మస్వరూపమును వేదచోదితమైన యజ్ఞ దానతపస్సులచే, బ్రాహ్మణులు తెలిసికొనుచున్నారు. తపముచే, పాపపరిహారమై జ్ఞానముచే శివరూపమును దెలియుచున్నారు సర్వకర్మలు చేయవలసినవే. అట్లు చేయుటవలన అంతఃకరణశుద్ధి గలిగి అనుభవజ్ఞానము నొందుచున్నాఁడని చెప్పుచున్నాఁడు.'తప్తముద్రాధారణము కృత్రిమజటారచనము మొదలయిన కార్యములచే ఆచార్యవ్యవహారములు లేక ఉదరపోషణకొఱకు డాంబికములు చేయుచు పితృతర్పణము పిండప్రదానము, చేయని మూఢులతో సంభాషణ నరకకరమనిస్మృతి చోదితమైనందున తప్తముద్రాధారణమును వదలి కుటీచక బహూదకహంస పరమహంసాశ్రమములకు పూర్వమే దేవఋషి పితృఋణముల దీర్చికొని సన్యాసమందు కైవల్యముక్తి సులభసాధ్యమని స్మృతియందు చెప్పఁబడినదిగాన నియభీష్టమునకు హానిలేదు.

సుఖమునకు భయపడినవాఁడు యుద్ధములోనికి వెళ్ళుట సమ్మతమని చెప్పఁ బడినందువలన యుద్ధము నీకు స్వధర్మము గాన పాతకములేదు- కైవల్యమూ నకు హానిలేదు. స్వల్పమైన యీధర్మానుష్ఠానమువలన జ్ఞానవిజ్ఞాన సంపత్తి గలిగి దోసపండువలె సంసారబంధము వదలిపోవునని యభిప్రాయము. (స్మశానకాష్ఠము సర్వకర్మములకు అర్హతలేనట్లు చక్రాంకితవిప్రుడు సర్వ కర్మలకుఁ బనికిరాడు, అనెడిస్మృతినిబట్టి పాఖండిధర్మములు వదలవలెను)

శ్లో॥ వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన!

బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినాం ౪౧

—* భాష్యమ్ *—

నను బుధ్వాద్వైతస్య తత్వస్య యథేచ్ఛాచరణాం యది 'శునా స్తత్వదృశాంచైవకో భేదోఽశుచిభక్షణ' ఇత్యాదిస్మృత్యా బ్రహ్మజ్ఞానినామపి కర్మ కర్తుమావశ్యకమితి 'న కర్మణా మనా రంభాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే' ఇత్యాదిస్మృత్యా తు తజ్జి జ్ఞాసూనాంచ సుతరాం తథాత్వేన కర్మణా సహ భక్తియో గస్యావశ్యకత్వే స్థితే తదేకం నైశ్చిత్యేనైకబుద్ధ్యా కుర్విత్యు పదిశన్నాహ॥ వ్యవసాయాత్మికేతి॥ ఏవం తర్హి 'నేహాలోకోఽ స్తి న పరో న సుఖం సంశయాత్మన' ఇత్యాదిస్మృత్యా 'భిద్యతే హృదయగ్రంధి శ్ఛింధ్యన్తే సర్వసంశయా' ఇత్యాదిశ్రుత్యా చావ్యవసాయి నామనిశ్చితవాదినాం బుద్ధయో బహుశాఖా హ్యనంతాశ్చ సాతిశయఫలకత్వాత్తా నిరస్తవ్యా ఇత్యర్థః॥ ౪౧॥

## — లఘుటిప్పణీ —

ఆవశ్యకమితి। తద్యథా, 'న కర్మాణి త్యజేద్యోగీ కర్మభి స్త్యజ్యతే హ్యసౌ। కర్మప్రబహ్మోభయ భ్రష్టం తం త్యజే దంత్యజం యథే' త్యాది స్మృత్యంతరాదప్యవధార్యమ్। సాతిశయేతి, తద్యథేహ 'కర్మచితో లోకః క్షీయతే ఏవ మేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయత' ఇత్యాది శ్రుత్యా, తత్కృతకం తదనిత్యమితి న్యాయవత్త్వాచ్చ విజ్ఞానాపేక్షయా స్వర్గాదిఫల స్యానిత్యత్వాదితి బోధ్యమ్యం ॥౪౧॥

## — ఆన్ధ్రతాత్పర్యము —

అద్వైతము యొక్క తత్వమును తెలిసికొని స్వేచ్ఛాచారము చేసిన యెడల తత్వదృష్టిగలవారలకును శునకములకును భేదమేమి? అమేధ్య భక్షణమే గాన్పించుచున్నది. కాన బ్రహ్మజ్ఞానులును కర్మ చేయవలసిన వారే; కర్మలఁ జేయక నైష్కర్మ్యము నొందరు. కర్మజిజ్ఞాసులకును కర్మతోఁ గూడా భక్తియోగమావశ్యకమై యుండగా ఆ రెంటిలో ఒక దాని నిశ్చయించి చేయుమని యుపదేశించుచు చెప్పుచున్నాడు. సంశ యము గలవానికి ఇహలోకము గాని పరలోకము గాని బ్రహ్మానంద సుఖము గాని లేదు. ఆత్మసాక్షాత్కారమైనవానికి హృదయగ్రంథులు విడిపోవును. సర్వసంశయములు దీఱిపోవును. అర్జునా! మోక్షేచ్ఛగలవానికి శాస్త్రీయములగు సమస్త కర్మలయందు ఆత్మస్వరూపనిశ్చయపూర్వక మైనబుద్ధి మోక్షము నొకటినే యుద్దేశించుటచే ఒక్కటియే యై యుండును. ఆత్మస్వరూపనిశ్చయము లేక కామ్యకర్మముల నాచరించు వారిబుద్ధులు బహుశాఖలు గలిగి అంతము లేనివై యుండును. (యోగియైన వాడు కర్మల నెప్పటికిని వదలగూడదు. కర్మలే తన్ను వదలిపేయును కర్మలను వదలియెడలన, బ్రహ్మనిష్ఠుడై యుండవలెను. కర్మనిష్ఠుడుబ్రహ్మ నిష్ఠుడు గానివాడు చండాలునునితో సమానుడు, కామ్యకర్మచే సంసా

పింపఁబడిన స్వర్గాదిలోకములు అనిత్యములే గాన కామ్యకర్మలు తీసి వేయఁదగినవే యని యర్థము.)

శ్లో॥ యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్య విపశ్చితః।
వేదవాదరతాః పార్థ! నాన్యద స్తీతి వాదినః॥ ౪౨

—* భాష్యమ్ *—

నను, అనిశ్చితవాదినస్తే కిం వద న్తీత్యాహ—యామి మామితి॥ ఏవం సతి 'యన్న దుఃఖేన సంభిన్నం నచ గ్రస్తమనం తరం। అభిలాషోపనీతంచ తత్సుఖం స్వః పదాస్పద' మిత్యాది వాక్యం తదప్యత్రైవహ 'కర్మచితో లోకః క్షీయత ఇత్యాది' శ్రుతి విరోధాత్తస్య చిరస్థాయిత్వేన తత్త్వేపి వస్తుతస్తు తే వేదవాదర తత్వేనావిపశ్చిత ఏవేతి బోధ్యమ్। ౪౨.

—♦ అర్థతాత్పర్యము ♦—

నిశ్చయజ్ఞానములేనివారేమి చెప్పుదురనగా, స్వర్గమందు దుఃఖము లేదు. మనమెప్పటికి ఆసుఖమందె యుండఁగలమని కామ్యకర్మలుచేసి స్వర్గసుఖమనుభవించి పునరావృత్తి నొందుచున్నారు. వేదములయందు కామ్యకర్మలు నిష్కామకర్మలు చెప్పఁబడినవి. అవిద్వాంసులు స్వర్గమే కాని అంతకంటె నధికమైనది లేదని చెప్పుచున్నారు. కామ్యకర్మలను బోధించెడు శ్రుతులు పుష్పవతీ వాక్యములనిపించుకొనును. వాని నవలం బించి పునరావృత్తి నొందుచుందురు. (అనఁగా ఫలము లేక పూవులు మాత్రమె కలిగి రమణీయములైనవని యర్థము.)

శ్లో॥ కామాత్మాన స్స్వర్గపరా జన్మకర్మఫలప్రదాం ॥
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥౪౩॥

—♦ భా ష్య మ్ ♦—

నను కథంభూతా స్తే వాదిన ఇత్యాహ । కామాత్మాన ఇతి। ఏవంతర్హి భోగైశ్వర్యగతిం ప్రతి కామఏవోర్వశ్యాదిసేవన మాత్మాభీష్టం యేషాం తథా స్వర్గఏవ పరసాధ్యో యేషాం తే తథాభూతా ఇత్యర్థః॥ ౪౩॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

ఆవాదించువా రెటువంటివా రనఁగా కామ్యవిషయముల యందు మనసుగలవారును, స్వర్గమునందాసక్తులును, అయిన అవిద్వాంసులు. (అల్ప జ్ఞానులు) పునర్జన్మకర్మ లనెడిఫలముల నిచ్చునదియు అనేక క్రియలచే నతిశయించినదియు నైన స్వర్గమందు ఊర్వశీసేవనమే తమయభీష్టమని చెప్పుచు స్వర్గముకంటె నెక్కుడైన దేదియు లేదనుచుందురు.

శ్లో॥ భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్ ।
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే॥ ౪౪॥

♦— భా ష్య మ్. ♦—

'ననుసంసారేషుమనస్సక్తంసమాధిస్థం కథంభవే। త్స్ఫురు మర్కటవన్నార్యైన్మత్రీ యథానేష్టావిరోధత' ఇత్యాదిస్మృతిన్యాయేనయుగపజ్జ్ఞానానుత్పత్తిర్మనసో లింగ' మితిసూత్రాచ్చకథం కామాత్మానాం స్వర్గాద్యభికాంక్షిణాం సమాధి రిత్యాహ - భోగైశ్వర్యేతి ॥తత్రైవం సతి భోగైశ్వర్య ప్రసక్త్యా ఉపహృత చేతసాం యా తత్ర వ్యవసాయాత్మికా నామ నిశ్చయాత్మికా బుద్ధి స్సాఽయుక్తోక్త నదేకకాలావచ్ఛేదేన విరుద్ధవిషయాణీతి తయాకథం సమాధి రిత్యర్థః॥ ౪౪॥

—♦ లఘుటిప్పణీ ♦—

కథంభవేదితి॥ ఇతీదంతద్యోగవాసిష్ఠే ప్యుక్తం। తద్యథా 'యత్కించి దపిసంకల్పాన్నరో దుఃఖే నిమజ్జతే। నకించిదపి సంకల్పాత్సుఖ మక్షయ మశ్నుత' ఇత్యాదిద్రష్టవ్యమ్॥ ౪౪॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము. ♦—

'సృగాలమర్కటములకు మైత్రి యేలాగున సంఘటింపనేరదో ఆలాగుననే సంసారమునకు సమీపవర్తియగు మనస్సునకు నేకాగ్రత యెట్లు గలుగును' అనున్యాయమును బట్టియు 'ఒక్కమాఱుననే జ్ఞానముగలుగకుంట మనసునకు లింగము అనుసూత్రమును బట్టియు. స్వర్గమునుగోరు కామాత్ములకు నెట్లుసమాధి గలుగుననం జెప్పుచున్నాఁడు-భోగైశ్వర్యము లయందాసక్తులై పుష్పవతీవాక్యలచే మతిభ్రష్టులగువారలకు సమాధిని గూర్చి నిశ్చయాత్మకమైన బుద్ధి యుండదు. చిత్తమందువిక్షేపమణఁగినఁ గానిసమాధి రాదు చిత్తవిక్షేపము ఉపాసనవలన శాంతించును.

శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వంద్వో నిత్యసత్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥ ౪౫

—♦ భాష్యమ్. ♦—

నను వేదో ద్విధో మంత్రభాగో బ్రాహ్మణభాగశ్చ తత్రతావన్మంత్రభాగేన పూర్వమీమాంసోక్తా। బ్రాహ్మణ భాగేనచ బ్రహ్మమీమాంసోక్తేతి తత్కస్మిన్ భాగే వినిశ్చినో మీతి నిర్ణేతుమాహ—త్రైగుణ్యేతి॥ తత్రతావత్త్రిగుణమర్థ తీతి త్రైగుణ్యః పూర్వమీమాంసాఖ్యో రజోమిశ్రితో భాగ ఇత్యర్థః. ఏవం త్రిగుణాన్నిర్గతం వేద మర్హతీతి నిస్త్రైగుణ్యో బ్రహ్మవిద్యానిరూపణభాగ స్తత్ర ద్వయోర్మధ్యే నిస్త్రై

గుణ్యో నిత్యసత్త్వస్థో భవార్జునేత్యర్థః। తత్రాంతిమేన నిస్త్రైగుణ్యేన భాగేన శివమద్వైతం తురీయం బ్రహ్మతత్త్వం జ్ఞాత్వా నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థస్సన్నాత్మా శివ స్తజ్జ్ఞానవాం స్తథా లభ్యలాభో యోగో లబ్ధస్య ప్రతిపాలనం క్షేమ స్తన్నిర్గత శ్చాప్తకామ ఇత్యర్థః॥౪౫॥

—♦ లఘుటిప్పణీ. ♦—

ద్వయోర్మధ్య ఇతి॥ తత్రాద్యంతయోర్మధ్యే నిస్త్రైగుణ్యో భవార్జున ఇత్యస్య త్రిగుణరహిత వేదవిషయో భవేత్యేవార్థో నతువేదబాహ్యో భవేత్యర్థః అన్యథా నిస్త్రైగుణ్య నిత్య సత్త్వస్థపదాభ్యాం విరోధాపత్తేః। ఏవం తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతీత్యాదిశ్రుతే రపీతి భావః॥ ౪౫॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

వేదము మంత్రభాగమనియు, బ్రాహ్మణభాగమనియు రెండువిధములుగాగలది. మంత్రభాగముచే పూర్వమీమాంసయు బ్రాహ్మణభాగముచే బ్రహ్మమీమాంసయుఁ జెప్పబడినది. వానిలో దేనియందు నిర్ణయమును గావింతు రనగా చెప్పుచున్నాడు. అర్జునా! పూర్వమీమాంస రజోగుణప్రధానముగా త్రిగుణములు గలది. గుణత్రయరహితమైన ఉత్తర మీమాంస బ్రహ్మవిద్యానిరూపణము చేయునది. గనుక నీవు కర్మకాండను వదలక సత్త్వగుణము గలిగి బ్రాహ్మణభాగము చైతన్యరూపుడు అద్వైతస్వరూపుడును అయిన శివుని తెలిసికొని ఆ ఏకాంతవాసమందు అద్వైతభావన లేక ఆత్మలాభముగలిగి ఆప్తకాముడవై యుండుము. (వేదములు త్రిగుణసహితములయి నను నీవుగుణములను వదలవలెనే గాని వేదబాహ్యుడవు గాగూడదు. ఏమనగా బ్రాహ్మణులు వేదములచేతనే పరమాత్మను తెలిసికొనుచున్నారు. కాన బ్రహ్మసాక్షాత్కారము వేదము లేక కాజాలదు ॥౪౫॥

శ్లో॥ యావా నర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే।
తావా న్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥ ౪౬॥

—◆ భాష్యమ్. ◆—

నన్వస్త్వేవం పరన్తు 'శ్రుతయ స్స్మృతయశ్చైవ యుక్తయ శ్చేశ్వరం వదన్తి తద్విరుద్ధం యో వదేత్తస్మాన్నచాధమ' ఇత్యాది స్మృత్యాత్మజ్ఞానస్య సర్వకామపూరకత్వే యుక్తి రప్యపేక్షితేత్యాహ—యావానర్థ ఇతి॥ ఏవంసతి యావానర్థః ప్రయోజనముదపానే క్షుద్రజలాశయే భవతి తావాం స్తదధికశ్చ సర్వత స్సంప్లుతోదకే బృహజ్జలాశయే యథా భవతి తథా సర్వేషు వేదేషు కామ్యకర్మ ప్రయోజకేష్వపి హైరణ్యగర్భానందపర్యన్తేషు తావాం స్తదధికశ్చ బ్రహ్మతత్వం విజానత స్సాక్షాత్కుర్వతో బ్రాహ్మణస్య బ్రహ్మవిదో భవతీత్యస్యైవానందస్య సర్వభూతాని మాత్రాముపజీవన్తీతి శ్రుతే రపీతి భావః ౪౩॥

—✻ లఘుటిప్పణీ ✻—

యుక్తిరపీతి। తద్యథా 'యుక్త్యా యుక్త ముపాదేయం యదుక్తం వార్భకై రపి। నచాయుక్త ముపాదేయం యదుక్తం పద్మయోనినే'త్యాది స్మృత్యంతరాదపి బోధ్యమ్। తదధికశ్చేతి॥'సర్వాంశ్చ కామానవాప్నోతి సర్వాంశ్చ లోకా నవాప్నోతి య స్తమాత్మాన మనువిద్య విజానాతీతిహ ప్రజాపతి రువాచ తదుభయే దేవాసురా అనుబుబుధిర' ఇతి ఛాందోగ్యశ్రుతేరితి భావః॥ ౪౬॥

## —♦ఆన్ధ్ర తా త్ప ర్య ము. ♦—

శ్రుతులు స్మృతులు యుక్తులును నీశ్వరునే చెప్పుచున్నవి. ఈశ్వర విరుద్ధముగా నెవడు చెప్పునో వానికంటె నధముడు లేడు. ఆత్మజ్ఞానము సర్వకామములను పూరించునదనుటయందు యుక్తియు గావలసియున్నది. లోకమున మానవునకు సామాన్యజలము గలిగిన భావియందు నెంత మాత్రము ప్రయోజనమును నానందమును గలుగునో, యంతకన్న నధిక ప్రయోజనమును నధికానందమును నంతటను. జలసమృద్ధమైన తటాకమున గలుగును. అట్లే, కామ్యకర్మ ప్రయోజకములైనను బ్రహ్మానందము నొసంగునవైన వేదములందును బ్రాహ్మణుడైనవానికి నంతమాత్రము ప్రయోజనమును నానందమును గలుగును గాని. యాత్మతత్త్వము నెఱింగిన వానికి నంతకన్న నధిక ప్రయోజనమును నధికానందమును గలుగును. (అనఁగా గర్మఠుడైనవానికిఁ గలుగు దానికన్న జ్ఞానికి నధికానందమనితా) భూతము లన్నియును నాబ్రహ్మానందముయొక్క యంశమునే యాశ్రయించి జీవించుచున్నవని భావము. యుక్తియుక్తముగా బాలకుఁడు వచించినను దానిని గ్రహింపనగును. గాని తద్విహీనముగా బ్రహ్మదేవుడు పలికినను దానిని గ్రహింపఁగూడదని యెఱుంగవలెను. ఎవఁడాత్మతత్త్వము నెఱుంగునో వాఁడు సర్వలోకములను సర్వకామములను బొందునని ఛాందోగ్యమునఁ జెప్పఁబడినది.) ౪౬.

శ్లో॥ కర్మణ్యేవాధికార స్తే మా ఫలే షు కదాచ న।
మా కర్మఫలహేతుర్భూ ర్మాతే సంగో స్త్వకర్మణి॥ ౪౭

## —♦ భా ష్య మ్ ♦—

నను యథోక్తకర్మయోగేన చిత్తశుద్ధిం సంపాద్యాత్మజ్ఞానం సంపాద్యతేచే త్తదా త్మజ్ఞానమేవ కుతోనసంపాద్యతాం కిం బహ్వాయాసై ర్బాహిరంగసాధనైః కర్మభి రిత్యాశంక్య

హ—కర్మణ్యేవేతి। ఏవం తీర్థ్యాభాభ్యామేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతిస్తథైవ భక్తికర్మభ్యాం ప్రాప్యతే బ్రహ్మ శాశ్వతమిత్యాది స్మృతిన్యాయేన తే తవాశుద్ధాన్తః కరణస్య కర్మణ్యేవాంతః కరణ శోధకేఽధికారో న తు యమ నియమాద్యష్టాంగయోగేన వేదాన్తనిష్ఠయావి చారాదావిత్య కరణే కర్మణి ప్రత్యవాయదర్శనాచ్చేత్యాశయః॥ ౪౭॥

—♦ ఆ స్థి తా త్ప ర్య ము ♦—

యథోక్తకర్మయోగముచే జిత్తశుద్ధిని గల్గించుకొనినచో నాత్మజ్ఞానము గలుగునేని, మిక్కిలి ప్రయాససాధ్యములగు కర్మలఁ బరిత్యజించి యాత్మజ్ఞానమునే సంపాదించుకొందమనినఁ జెప్పుచున్నాఁడు—నీకుఁ గర్మ మాత్రమందు నధికారము గలదేకాని, దానికి సంబంధించిన ఫలమునం దెప్పటికిని నధికారములేదు, కర్మము ఫలముతోఁ గూడినయెడల బంధరూప మగుటవలనను, ఫలములేక కేవలకర్మము ననుష్ఠించుటయె మోక్ష హేతువగుటవలనను, కర్మమునకును వానిఫలములకును హేతువు గాకుము, కర్మల ననుష్ఠింపకుండుటయందు నీకు సంబంధము లేకుండునుగాక, అనగా గర్మలయం దాసక్తియుండునుగాక. పక్షియెట్లు రెండుఱెక్కలతో నాకసమున సంచరించునో, యట్లు భక్తికర్మలచే శాశ్వమగు బ్రహ్మమును బొందనగు ననుస్మృతినిబట్టి యశుద్ధాన్తః కరణుడవైన నీకు నంతఃకరణ శోధకమగు కర్మయందే యధికారముగాని యమనియమాది వేదాంత నిష్ఠ యందధికారములేదు. కర్మలు చేయకున్న ప్రత్యవాయము సంభవించును.

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనఞ్జయ!।
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥౪౮

## —♦ భా ష్య మ్ ♦—

నను 'న కర్మాణి త్యజేద్యోగీ కర్మభి స్త్యజ్యతే హ్యసౌ । కర్మబ్రహ్మోభయోర్భ్రష్టం తం త్యజే దంత్యజం యథే'త్యాదిస్మృత్యా యది జ్ఞానినః కర్మ కర్తు మావశ్యకం తర్హ్యజ్ఞానినస్తు సుతరాం తత్కర్తవ్యమేవేతి పూర్వోక్తమేవ పునర్ద్రఢయన్నాహ—యోగస్థ ఇతి॥ ఏవం సత్యన్తఃకరణశుద్ధి ద్వారా యమాదియోగనిష్ఠయా తత్తత్కర్మ కర్తవ్యమేవ తత్ర తావత్ఫలసిద్ధౌ హర్షం ఫలాసిద్ధౌ చ విషాద స్త్యక్త్వా కేవలమీశ్వరార్పణబుద్ధ్యా సిద్ధ్యసిద్ధ్యోస్సమత్వేన తత్కర్తవ్య మేవేత్యాశయః॥౪౮॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

భ్రష్టమితి॥ తథోక్తం ప్రబోధచంద్రోదయే 'జ్ఞానినాజ్ఞానినావాపి యావద్దేహస్య ధారణం. । తావద్వర్ణాశ్రమప్రోక్తం కర్తవ్యం కర్మ శుద్ధయే' ఇత్యాదినా శరీరశుద్ధయేఽపి తదావశ్యక మిత్యవధేయమ్ ॥౪౮

## —♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

(యోగి కర్మలను దానుద్యజింపఁడు, కాని కర్మలచేత నితఁడు విడువఁబడుచున్నాఁడు. కర్మ బ్రహ్మోభయభ్రష్టుఁడైనవానిని జండాలుని వలె విసర్జింపవలెను. మొదలగు స్మృతులచేత జ్ఞానియగువానికి కర్మ యావశ్యకమై యుండఁగా నజ్ఞానికయ్యది మిగుల నవశ్యకర్తవ్యమని ముందుఁ జెప్పినదానిని దృఢీకరించుచున్నాఁడు - ఓయర్జునా ! రాజ్య బంధుప్రభృతులందు సంగమును వదలి సిద్ధ్య సిద్ధులను సమముగా గొను యోగమునందు నిలిచి యుద్ధాదికర్మల నాచరింపుము. వానియందంతర్యా

లేమునైన ఫలములగు జయాపజయాదులు లోనగునవి సిద్ధించినను సిద్ధింపకున్నను సమానమగు మనస్సును గలిగి యాకర్మములను జేయుము. అంతఃకరణశుద్ధిద్వారా యమాదియోగనిష్ఠచేత నాయాయికర్మల ననుష్ఠింపవలసినదే. కాని ఫలసిద్ధియందు సంతోషమును, ఫలాసిద్ధియందు దుఃఖమును విడిచి యీశ్వరార్పణబుద్ధిచే సిద్ధ్యసిద్ధులందు సమభావనతో వర్తింపవలెను. (జ్ఞానియైనను, నజ్ఞానియైనను దేహముండువఱకును శరీరశుద్ధికొఱకు వర్ణాశ్రమ ప్రోక్తకర్మ నాచరింపవలెను.) ౪౮॥

శ్లో॥ దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ!
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః॥ ౪౯

—◆ భాష్యమ్ ◆—

నను 'ప్రయోజన మనుద్దిశ్య మందోఽపి నప్రవర్తతే ఇతిన్యాయేన కింకర్మానుష్ఠానమేవ పురుషార్థో యేన నిష్ఫలమేవ సదాకర్మ కర్తవ్య మిత్యుచ్యతే తస్మాత్తద్వరం ఫలకామనయైవ కర్మానుష్ఠానం యుక్తమితి చేత్తత్రవిశేషమాహ-దూరేణేతి॥ ఏవంతర్హి 'యోవా గార్గ్యేతదక్షర మవిదిత్వా అస్మాల్లోకాత్ప్రైతి స కృపణ' ఇత్యాదిశ్రుత్యా సర్వానర్థనిబర్హణ మాత్మజ్ఞానోత్పాదకం నిష్కామకర్మణాసహ యోగానుష్ఠానమేవ కర్తవ్యమిత్యతో బుద్ధియోగాచ్ఛివమద్వైతం తురీయమితిబ్రహ్మజ్ఞానాద్దూరేణహ్యవరమర్వాక్ఫలాభికాంక్షయాజాగ్రదవస్థాగతం 'తద్యథేహేతి కర్మచోదనే'తి శ్రుత్యాక్షయాతిశయయుక్తత్వాత్తన్నాకాంక్షే సర్వమితితాత్పర్యమ్.

 

## —♦ లఘుటిప్పణీ. ♦—

తద్వరమితి॥ తదుక్తం పురాణసముచ్చయే। తద్యథా 'అప్రాప్య జ్ఞానమార్తండం కర్మజన్యం ఫలం శుభం ఇతో భ్రష్టాస్తతో భ్రష్టాస్తా శ్చైవచ నిష్ఫలా। ఇత్యాద్ద్రష్టవ్యమ్॥ ౪౯॥

## —♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

మూఢుఁడైనను బ్రయోజనము నుద్దేశింపకయే ప్రవర్తింపఁడను న్యాయమునుబట్టి నిష్ఫలమైన కర్మనెప్పుడు నాచరించుటవలన నేమియుం బురుషార్థము లేదు గావున ఫలకాంక్షతోడనే కర్మ నాచరింపవలయు ననఁ జెప్పుచున్నాఁడు - సిద్ధ్యసిద్ధులయందు సమమైయుండు బుద్ధియోగ ముచేఁ జేయఁబడుకర్మముకంటె, నితరమగు కామ్యకర్మము మిక్కిలి నీచమైనది. పూర్వోక్తబుద్ధియోగముతోఁ గూడినకర్మము సాంసారిక దుఃఖములను దొలఁగించి పరమపురుషార్థమగు మోక్షమును గల్గించును. ఇతరము; మిక్కిలిదుఃఖరూపమగు సంసారమును గల్గించును కనుక నో యర్జునా! కర్మలనాచరించునపుడు బుద్ధియందు వర్తింపుము. ఫలాపేక్షతో గర్మముల నాచరించువారు దీనులయిన నిత్యసంసారులగుదురు. 'అక్షర స్వరూపుఁడగు పరమాత్మ నెఱుంగక యీలోకమును విడిచినవాఁడు కృపణుఁడు' అను శ్రుతినిబట్టి సర్వానర్థములను దొలఁగించునదియు జ్ఞానమును గలిగించునట్టి నిష్కామకర్మతోడి యోగానుష్ఠానమే చేయఁదగి నది గావున శివమద్వైతం తురీయమను బుద్ధియోగమునకంటె నితరకర్మము నింద్యమనితా॥(జ్ఞానసూర్యుని బొందువరకును గర్మమువలనిఫలమే మంచిది. జ్ఞానము గలిగినతరువాత గర్మల నాచరింపకపోయినను సరియే కాని జ్ఞానభ్రష్టులును గర్మభ్రష్టులును నిష్ప్రయోజకు లనిభావము.) ౪౯

శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే।
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్॥

—♦ భాష్యమ్ ♦—

ఏవమిహ యథోక్తబుద్ధియోగాభావే కృపణత్వరూపం దోషముక్త్వా తత్సత్త్వేతు గుణాధిక్యమప్యాహ—బుద్ధియుక్తేతి॥ తథాసతీహ 'శాస్త్రతత్త్వజ్ఞ సంపర్క', ఇత్యాది క్రమేణ కర్మ యోగేన శుద్ధాన్తఃకరణస్య సమత్వబుద్ధ్యా యుక్తేచోభే సుకృతదుష్కృతే అపి స జహాతీతి యుజ్యస్వోద్యుక్తో భవేతి యోగఏవ కర్మసుకౌశలం ప్రశస్తమిత్యర్థః॥ ౫౦॥

—♦ లఘుటిప్పణీ .♦

ప్రశస్తమితి॥ తద్యథా శాంతిభారతే॥ యోగాన్నిర్దహతే క్షిప్రమ శేషం పాపపంజరం। తస్మాద్యోగాయ యోక్తవ్యం కర్మశుద్ధ్యుత్తరం బుద్ధ్యేత్యాది ద్రష్టవ్యమ్॥ ౫౦॥

—♦ ఆన్ధ్రితాత్పర్యము ♦—

ఇట్లు శివమద్వైతం తురీయమను బ్రహ్మజ్ఞానముతోఁ గూడిన బుద్ధి యోగము లేకుండెనేని కృపణత్వదోషము గలుగునని చెప్పి, అదియుండిన యెడల గుణాధిక్యమును జెప్పుచున్నాడు-అట్టిబుద్ధియోగముతోఁ గూడిన వాఁడు బంధహేతువులైన సుకృతదుష్కృతరూపకర్మలను రెంటిని సమత్వబుద్ధితోఁ గూడినవానిని ఇహమునందుఁ బరిత్యజించును. కాఁబట్టి సమత్వరూపమైన యట్టిబుద్ధియోగముకొఱకు నుద్యోగింపుము. బుద్ధి యోగముతోఁగర్మముల నాచరించుటయే మిక్కిలి సామర్థ్యము. కాఁబట్టి యట్టి బుద్ధియుక్తుఁడవుకమ్ము. (సమస్తమైన పాపపంజర మంతయును యోగమువలన భస్మమగుచున్నది. కావున యోగముకొఱకు బుధులు కర్మముల నాచరించిన తరువాతఁ బ్రియత్నింపవలెను॥ ౫౦॥

శ్లో॥ కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః।
జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్ ౫౧

—♦ భా ష్య మ్ ♦—

నను దుష్కృతహానమపేక్షితం నతు సుకృతస్య హాన మన్యథా పురుషార్థభ్రంశాపత్తేరిత్యాహ-కర్మజమితి॥ ఏవంతర్హి కర్మజం క్షయిష్ణుఫలం త్యక్త్వా సుబుద్ధియుక్తాః కేవలమీశ్వరార్పణబుద్ధ్యా కర్మకుర్వాణాస్సత్వశుద్ధిద్వారేణ మనీషిణస్తత్వమస్యాదివాక్య జన్మాత్మమనీషావన్తో జన్మబంధవినిర్ముక్తాస్సంతోఽనామయం పదం గచ్ఛన్తీత్యర్థః॥ ౫౧॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

ఈశ్వరార్పణేతి॥ 'తద్వై మనశ్శంభుపదారవిందయోరతి' స్మృతిన్యాయేనాత్మార్పణబుద్ధ్యేత్యర్థః॥ ౫౧॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

పాపక్షయమిష్టమేకాని పురుషార్థము నశించుటవలనఁ బుణ్యక్షయమిష్టము లేదనఁగాఁజెప్పుచున్నాఁడు—పూర్వము చెప్పఁబడిన బుద్ధియోగములోఁగూడి, తత్వమస్యాది మహావాక్యార్థతత్వము నెఱింగినజ్ఞానులు కర్మలవలనఁ గలుగు సాంసారికఫలములను విడిచి, సంసారబంధమునుండి విడుపునొందినవారై దుఃఖరహితమైన శివపదమును బొందుచున్నారు. (ఈశ్వరార్పణబుద్ధిలోఁ గర్మల నాచరించుచుఁ తుదను శివస్థానము నొందుదురని తా.॥ ౫౧॥

శ్లో॥ యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి।
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ॥ ౫౨

## —◆ భాష్యమ్ ◆—

నన్వేవమపి కర్మ కర్తుః కర్మే కదా సత్వశుద్ధిస్స్యా దిత్యత ఆహ—యదేతి॥ తత్రైవంసతి నహ్యేతావతా కాలేన సత్వ శుద్ధి ర్భవిష్యతీతి కాలనియమోఽస్తి కిన్తు 'కస్య చిజ్జాయతే శీఘ్రం చిరకాలేన కస్యచి' దిత్యాదిస్మృత్యా యదాయస్మిన్ కాలే మోహకలిల మహమిదం మమేదమిత్యాద్యజ్ఞానకలిల మనాత్మజాతం తే తవ బుద్ధి ర్వ్యతితరిష్యతి తదా తస్మిన్నేవ కాలే శ్రోతవ్యస్యచ శ్రుతస్యచ కర్మఫలస్య నిర్వేదం త్యాగః ప్రపంచరూపస్య చిదాత్మత్వావలోకనమిత్యాది స్మృతిసిద్ధం వైరాగ్యం ప్రాప్తా మిత్యర్థః 'పరీక్ష్యకర్మచితాన్లోకాన్బ్రాహ్మణో నిర్వేదమాయా' దిత్యాది శ్రుతేరపీతిభావః॥౫౨॥

## —◆ లఘుటిప్పణీ ◆—

వైరాగ్యమితి॥ తద్యథా. త్యాగః ప్రపంచభూతస్య చిదాత్మత్వా వలోకనాత్। త్యాగో హి మహతాం పూజ్యో నగిరి ర్నగుహాంతరం' ఇత్యేవధార్యమ్॥ ౫౨॥

## —◆ ఆన్ధ్ర తాత్పర్యము ◆—

ఇట్లు కర్మల నాచరించు నాకెపుడు సత్వశుద్ధియగు నందువేని చెప్పుచున్నాను- ఇంతకాలములో సత్వశుద్ధియగునని కాలనియమము లేదు. ఒకనికి శీఘ్రముగాఁ గలుగును. వేఱొకనికి జాల కాలమునకు గలుగును' అనుస్మృతనిబట్టి నీయొక్కబుద్ధి మమతారూపమైన మోహకల్మషము నెపుడు దాఁటునో, అపుడు ఆ శ్రుతములగు మాబోఁటుల వలన నింతకుఁ బూర్వము త్యాజ్యములుగా నీవు వినిన ఫలాదులకును, నీఁక వినఁబోవు

వానికిని వైరాగ్యమును జెందెదవు. (తాను చైతన్యస్వరూపుఁడని యెఱింగి ప్రపంచము నుజ్జగించుటయె త్యాగముగాని గిరివాసముకాని గుహావాసముకాని త్యాగమనిపించుకొనదు. మహాత్ములకు త్యాగమే పరమపూజ్యమైనది.

శ్లో॥ శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా।
సమాధావచలా బుద్ధి స్తదా యోగమవాప్స్యసి॥ ౫౩

—♦ భాష్యమ్ ♦—

ఏవంసత్యన్తః కరణశుద్ధ్యైవజాత నిర్వేదస్యవిజ్ఞానప్రాప్తి రపి కదేత్యాహ—శ్రుతీతి॥ ఏవంతర్హి తే తవ బుద్ధి శ్రుతిభి ర్నానావిధపథశ్రవణై రవిచారితతాత్పర్యై ర్విప్రతిపన్నాచేత్తతశ్చ దోషదర్శనేన తం విక్షేపంపరిత్యజ్యసమాధౌపరమాత్మని తురీయే శివే నిశ్చలా స్థాస్యతి తతశ్చ తదా సమత్వలక్షణం యోగమవాప్స్యసీత్యర్థః॥౫౩॥

—♦ లఘుటిప్పణీ ♦—

అవిచారితేతి॥ ఏవంసతి, 'ఇదంమేఽస్తి మతంనేదంపక్షయోర్యత్ర చాగ్రహః। సోఽయం వాదస్సమాఖ్యాతో యుక్తిర్యత్ర నదృశ్యతే' ఇతి స్మృతిన్యాయేన వాదిప్రతివాదిభ్యాం సిద్ధాన్తార్థ ప్రతిపత్తయే అవిచారిత తాత్పర్యైరపి విప్రతిపత్తవ్యమిత్యవధారితే సర్వప్రమాణసిద్ధోఽర్థో ధ్రువోఽయన్నవిచాల్యతే। 'సోఽయం సిద్ధాన్త ఇత్యుక్తో నధ్రువశ్చాల్యతే యతః' ఇత్యాదిశ్రుత్యుక్తరీత్యా సకలవిక్షేపం త్యక్త్వా సమాధిస్థోభవిష్యతీతికాతురితభావః॥౫౩॥

## —♦ ఆంధ్రతాత్పర్యము ♦—

అంతఃకరణశుద్ధిచేతనే వైరాగ్యము గలిగినవానికి విజ్ఞానప్రాప్తి యెప్పుడనగాఁ జెప్పుచున్నాడు. తాత్పర్యము నెఱుంగని నానావిధమార్గ శ్రవణములచేత నీబుద్ధి విరోధమునుఁ (జాంచల్యమును) బొందునేని, దోషముల నెఱింగినతరువాత నాచాంచల్యమును వదలి, పరమాత్మయగు శివస్వరూపసమాధియందెపుడు నిశ్చలమైనదిగా నిలుచునో అపుడే సమత్వలక్షణమైన యోగమును (విజ్ఞానమును) బొందఁ గలవు॥ ౫౩॥

అర్జునఉవాచ—

శ్లో॥ స్థితప్రజ్ఞస్య కాభాషా? సమాధి స్థస్య కేశవ! ।
స్థితధీః కిం ప్రభాషేత? కిమాసీత? వ్రజేతకిమ్?॥ ౫౪॥

## —♦ భాష్యమ్ ♦—

ఏవమిహ లబ్ధావసరాత్ స్థిత ప్రజ్ఞస్యలక్షణమపిశ్రోతు మర్జునఉవాచేత్యాహ—స్థితప్రజ్ఞస్యేతి। తత్రతావత్స్థితప్రజ్ఞస్య నిష్కామకర్మణా శుద్ధచిత్తస్య కాభాషా రీతి ర్లక్షణ మిత్యర్థః ఏవం సమాధిం కుర్వతః కింస్వరూపలక్షణం, ఏవంస ఏవోత్థాన దశాయాం స్థితధీర్మూఢజనాన్ప్రతి కిం ప్రభాషేత? తథా సకి మాసీద్వ్రజేచ్చ కిమితి ప్రశ్నః॥౫౪॥

## —♦ లఘుటిప్పణీ ♦—

ప్రశ్న ఇతి॥ తత్ర ‘శకునీనామివా కాశే మత్స్యానామివ చోదకే తద్వద్జ్ఞానవిదాం లోకే గతి ర్నైవేహ లక్ష్యతే’। ఇత్యతోఽయంప్రశ్నస్త జ్ఞానాగ్ధమిత్యవధేయమ్॥ ౫౪॥

—♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

స్థితప్రజ్ఞుని లక్షణమును వినుటకవకాశము గలిగినందువలన నర్జునుఁ డావిషయము నడుగుచున్నాఁడు - ఓకేశవా! సమాధియందున్నవాఁడైన స్థితప్రజ్ఞుని స్వరూపమెట్టిది? ఆఁతడు సమాధినుండి లేచినపు డెవ్విధమున భాషించును? ఎట్లు కూర్చుండును? ఏచందమున నడచును? (ఆకాశము నందుఁ బక్షులయొక్కవలె నీళ్లయందుఁ జేపలయొక్కవలె తత్త్వజ్ఞానము నెఱింగినవారి గమనము నెఱుంగుట సాధ్యముగాదు). కావున వాని స్వరూపము నెఱుంగుట కీ ప్రశ్న వేయఁబడినది॥ ౫౪॥

శ్రీకృష్ణ ఉవాచ—

శ్లో॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ! మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితః ప్రజ్ఞ స్తదోచ్యతే॥ ౫౫

—♦ భాష్యమ్ ♦—

అథైతేషాం చతుర్విధప్రశ్నానాం క్రమేణోత్తర మాహ—ప్రజహాతీతి॥ ఏవం సతి యదా మనోగతాం స్త ద్వృత్తిప్రవిష్టాన్ కామాన్ ప్రజహాతిపరిత్యజతి సస్థితప్రజ్ఞ స్తదో చ్యత ఇత్యర్థః॥। నను చ కథం ససర్వకామపరిత్యాగే స్యాది త్యాహ, ఆత్మన్యేవేతి। తత్రాత్మన్యేవ స్వప్రకాశ చిద్రూపే శివే జీవాత్మనాసహైకీభూత్వా తుష్టఇత్యర్థః॥౫౫॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

నాలుగు విధములైన పూర్వోక్త ప్రశ్నలకుఁ గృష్ణుఁడు క్రమముగా నుత్తరములను జెప్పుచున్నాడు-స్వప్రకాశుండును చిద్రూపుండును నగు

శివునియందు జీవాత్మతోఁ గూడి యానందించుచుఁ జిత్తమునందలి, కోర్కులనెపుడు వదలునో అపుడు స్థితప్రజ్ఞుఁడని పిలువఁబడుచున్నాఁడు.

శ్లో॥ దుఃఖేష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః ।
వీతరాగభయక్రోధః స్థితధీ ర్ముని రుచ్యతే॥ ౫౬

—◆ భాష్యమ్ ◆—

ఇదానీం సమాధిం కుర్వతః పునర్లక్షణ మాహ-దుఃఖే ష్వితి॥ తత్రైవంసతి దుఃఖే రజస్తమోభ్యాం సంతాపాత్మకచిత్త వృత్తివిశేషేషు ప్రాప్తేష్వపి సమాధే ర్నోద్విగ్నం వ్యాకులం మనో యస్యసః ఏవం సుఖేషు సత్వరజోభ్యాంప్రీత్యాత్మకచిత్త వృత్తివిశేషేషు విషయా ద్విగతస్పృహః । తథా వీత స్త్యక్తో రాగోభయం క్రోధశ్చ యస్యేత్యర్థః॥ ౫౬॥

—◆ లఘుటిప్పణీ ◆—

ఏవంసతీహ॥ సత్వరజస్తమసాం సర్వసాధారణ్యేన జగత్కారణ త్వేఽపి విమలసత్వస్య నిస్త్రైగుణ్యేన యమనియమాదినా సమాధ్యుప యోగిత్వ మే వేతి తథేత్యగ్రిమేణావధార్యమ్॥ ౫౬॥

—◆ ఆన్ధ్రితాత్పర్యము ◆—

ఇపుడు, సమాధిని జేయుచున్న వాని లక్షణమును దెల్పు చున్నాఁడు—రజస్తమోగుణములచేత సంతాపమును గలిగించు దుఃఖములు ప్రాప్తించినను సమాధియందుండి కలఁతనొందని మనస్సుకలవాఁడును, సత్వరజోగుణములచేఁ బ్రీతిని గలిగించు సుఖములయందుఁ గోరికలులేని వాఁడును. అనురాగము భీతి కోపము లోనగునవి లేనివాఁడును మనన స్వభావుండును నగువాఁడు నిశ్చలబుద్ధిగలవాఁడని చెప్పఁబడుచున్నాఁడు.

(సత్వరజస్తమోగుణములు సర్వసాధారణముగా జగత్కారణములయ్యును మలినరహితమైన శుద్ధసత్వము త్రిగుణవిహీనమై యమనియమాదులతో సమాధి నుపయోగించునని భావము.)॥ ౫౬॥

శ్లో॥ య స్సర్వత్రా నభిస్నేహః త త్తత్ప్రాప్య శుభాశుభమ్।
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ ౫౭

—♦ భా ష్య మ్ ♦—

నను స్థితధీ ర్మూఢజనాన్ప్రతి కథంప్రభాషేతేత్యాహ - యస్సర్వత్రేతి॥ ఏవంత త్ప్రాప్తిశుభంసుఖహేతు కమశుభంచ దుఃఖహేతుకం ప్రాప్య 'య స్సర్వత్రా నభిస్నేహఏవ భవతి' కింతు పరాత్మన్యేవ శివే సర్వథా ప్రీతిరిత్యర్థః । తస్మాదేవం సమత్వం ప్రాప్తో మిత్రం నాభినందతి ననా శత్రుం ద్వేష్టీతి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితేత్యర్థః॥ ౫౭॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

మూఢజనానితి॥ ఇహతు న జనపదోక్త్యాసైన మూఢపదేన యశ్చ మూఢతమో లోక ఇత్యత్రోక్తో విదేహస్సదేహో వా గృహ్యతే కింత్వంతరితా ఏవ గృహ్యంత ఇత్యవధార్యం । సుఖహేతుకమితి అత్రతు సుఖశబ్దేన 'యచ్చకామసుఖం లోకేయచ్చదివ్యం మహత్సుఖ' మిత్యత్రోక్తం క్షయిష్ణుసుఖం గృహ్యతే నతు సమాధిగమ్యం బ్రహ్మైక్యసుఖమిత్యాశయః॥ ౫౭॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

నిశ్చలమగు బుద్ధిగలవాఁడితరులతో (మూఢులతో) నెట్లుభాషించునని గాఁ జెప్పుచున్నాఁడు - ఎవఁడు సుఖహేతువగు శుభమును బొంది

యును. దుఃఖహేతువగునశుభమును బొందియును, సంతోషదుఃఖములను బొందక యంతటను నిచ్ఛలేనివాఁడై పరశివ స్వరూపమగు పరమాత్మ యందుఁ బ్రీతి గలవాఁడై మిత్రశత్రువులయెడ ననురాగద్వేషములఁ గాంచఁడో వానిబుద్ధి చలనము లేనిదగును. (ఇట సుఖమనఁగా, 'కామ సంబంధమగు సుఖమును దివ్యమగు గొప్పసుఖమును' అనునట్టినశ్వరసుఖము గాని సమాధిచేఁబొందఁదగిన బ్రహ్మైక్యసుఖముగాదని భావము.)

శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవసర్వశః ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞాప్రతిష్ఠితా॥ ౫౮

—♦ భాష్యమ్ ♦—

నను స్థితప్రజ్ఞస్య కథమాసన గమనాదిక మిత్యాహ—యదేతి ఏవం సత్యవ్యక్తం వ్యక్తమాధత్తే వ్యక్తం సర్వం గ్రసత్యల' మిత్యాదిశ్రుతిన్యాయే నేన్ద్రియార్థేభ్యః కూర్మాఙ్గానీవ యదా సంహరతే తదా తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితేత్యర్థః

—♦ లఘుటిప్పణీ ♦—

గ్రిసతీ॥ 'యది దన్దృశ్యతే కించిత్తన్నాస్తి కిమపి ధ్రువం। యథా గన్ధర్వనగరం యథా వారిమరుస్థలే' ఇత్యాది స్మృత్యర్థానుసన్ధానేనాపి ద్రష్టవ్యమ్. ౫౮

—* ఆన్ధ్రితాత్పర్యము *—

స్థితప్రజ్ఞుఁడైన వానియొక్క కూర్చుండుట నడచుట లోనగునవి యెట్లనఁగాఁ జెప్పుచున్నాఁడు - ఇట్టినిశ్చలమైన బుద్ధిగలవాఁడు(అనఁగా స్థితప్రజ్ఞుఁడు) కూర్మము తనకగపడు వస్తువులనుండి తన యవయవములను లోపలికి నేవిధముగాఁ దీసికొనునో, యావిధముగా నింద్రియవిషయముల నుండి యింద్రియముల నెపుడణచుకొనునో యపుడు వానిబుద్ధి నిశ్చల

మైన దగును. (స్థితప్రజ్ఞుఁడు అవ్యక్తమైన ప్రకృతిని వ్యక్తమైనప్రపంచము గాను, వ్యక్తమగు ప్రపంచమును అవ్యక్తమును గాను గ్రహించును. ఆకాశ హర్మ్యమువలెను మరుస్థలమున నీరువలెను నీయగపడు నదియంతయును మిథ్యయనిభావము.) ౫౮.

శ్లో॥ విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥ ౫౯

—♦ భా ష్య మ్ ♦—

నను మూఢస్యాపి జ్వరాదివశాద్విషయేభ్య ఇంద్రియాణాం నివృత్తిరితి తత్కథం న తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితేత్యాహ విషయాఇతి తత్త్రైవం సతి జ్వరాదినా నిరాహారస్య దేహినో మర్త్యస్య విషయా శ్శబ్దాదయో నివర్తంతే తథాపి తస్య రసవర్జంనామ జ్వరాదినివృత్త్యుత్తర మహం భోక్ష్యే ఇతి స్పృహాతు తస్య ననివర్తతే 'రసం హ్యేవ లబ్ధ్వానందో భవతీ' త్యాది శ్రుతివేద్యంపరమాత్మానం శివం లబ్ధ్వాతురసోఽప్యస్య లౌకికో నివర్తత ఇత్యర్థః॥౫౯॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

శివంలబ్ధ్వేతి. సరసాత్మా హర స్సాక్షా త్సచ్చిదానంద విగ్రహః। లబ్ధ్వాతం నైరసం ధీరో బ్రహ్మభూయాయ కల్పతే' ఇత్యాది స్మృత్యంతరాదప్యవధార్యమ్॥ ౫౯॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

మూఢునకు జ్వరాది వశముచేతను విషయములనుండి యింద్రియ నివృత్తి కలుగఁగావాని బుద్ధినిశ్చల మైనది గాదా యనినచోఁ

చున్నాఁడు—జ్వరాదులచే నాహారములేని దేహికి శబ్దాదులగు విషయములు నశించుచున్నవి. కాని జ్వరాదులు నశించిన తరువాతి 'నేను భుజింపఁగలను' అను నిచ్ఛమాత్రము వానిని వదలదు. పరమాత్మ స్వరూపుఁడగు శివుని బొందినచో వానికి నాయిచ్ఛయు నశించును. (సచ్చిదానంద విగ్రహుండగు శివుండు సాక్షాత్తుగా రసస్వరూపుండు. వాని నెఱింగిన విద్వాంసుఁడు బ్రహ్మత్వము నొందునని భావము.)॥ ౫౯॥

శ్లో॥ యతతోహ్యపికౌన్తేయ! పురుషస్య విపశ్చితః।
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥ ౬౦॥

—◆ భాష్యమ్ ◆—

నను మనోజయేనైవ స్థితప్రజ్ఞత్వం భవిష్యతి కిమింద్రియజయేనేతి నైవమిత్యాహ—యతతఇతి।తత్రైవం సతి'పరాంచిఖాని వ్యతృణత్స్వయంభూ' రిత్యాదిశ్రుతే రిన్ద్రియాణాం ప్రాబల్యేన యతోఽష్టాంగయోగాదినా యతమానస్యాపి విపశ్చితః పండితస్యాపి పురుషస్య ప్రమాథీనీన్ద్రియాణి మనః ప్రసభం బలాత్కారేణ హరంతీత్యర్థః । 'సమాధౌ క్రియమాణేతు విఘ్నాఆయాంతి వైబలా'దితి స్మృత్యంతరాద్యదేతన్మనుష్యాశ్శివం నవిద్యురితి దేవాః కుర్వంతీతి శ్రుత్యంతరాచ్చేతి భావః॥ ౬౦॥

—◆ లఘుటిప్పణీ ◆—

నవిద్యురితి॥ తస్మాత్తద్విరోధం పరిహృత్యైవ శివం విచిన్తయేదితి పర్యవసితే 'దేవాన్పితౄన్ సమభ్యర్చ్య నత్వాథ భూతపంచకాన్ ఇహాముత్ర విరోధేన శివం గచ్ఛేత్సనాతన' మితి మహోపదేశేన॰ వగన్తవ్యమ్॥ ౬౦॥

## —♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

ఆవిషయమునఁ బ్రతిక్రియ యెద్ది యనఁగా నుపసంహరించుచుఁ జెప్పుచున్నాఁడు - స్వస్వవర్ణాశ్రమధర్మములచేతను. తపస్సుచేతను, శివుని సంతోషింపఁజేయుటచేతను, బురుషునకు వైరాగ్యాదిచతుష్టయము గలుగునను స్మృతినిబట్టి, యాయింద్రియములను మున్నుఁజెప్పినట్లుగా, జక్కఁగా జయించి గురురూపముగా నేనే గొప్పసాధనము గలవాఁడవుగా నయి (అనఁగా సమాహితమనస్కుండవై శివధ్యానతత్పరుండవుగా నయి) యోగివై వర్తింపవలెను. ఇంద్రియములెవనిస్వాధీనమున నుండునో వానియొక్క చిత్తము నిశ్చలముగా నుండును. (సాధనచతుష్టయ మెద్ది యనఁగా 1 ఇహాముత్రఫలభోగమునందిచ్ఛలేమి. 2 నిత్యానిత్యవస్తువివేకము శమదమాది షట్కసంపత్తి 4 ముముక్షుత్వము, అనియెఱుంగవలెను. నిత్యానిత్యవస్తువులందు నిశ్చయరూపమగు వివేకము గలిగియుండుట నిత్యానిత్య వస్తువివేకము. ఐహికాముష్మికములగు సమస్తభోగములందును బెడమోగమునుంచి వైరాగ్యముతో నుండుట యిహాముత్రఫలభోగవిరాగము (1అంతరంగికములగు రాగద్వేష, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, ఈర్ష్యా, అసూయా, దంభ, దర్ప, అహంకారములు పుట్టకుండుట శమమనఁబడును 2 సమస్తేంద్రియముల నయుక్త వ్యాపారములనుండి తొలఁగించుట దమమనఁబడును. 3 నిషేధింపఁబడిన కామ్యకర్మలను వదలుట యుపరతి. 4 సుఖదుఃఖాది ద్వంద్వముల నోర్చుకొనుట తితిక్ష. 5 పురుషార్థములు గాని సమస్తములైన యితరశాస్త్రములందుఁ బెడమోము పెట్టునట్టి పరవిద్యాస్వరూపములును బరమాత్మ బోధకములగు వేదాంతములగోష్ఠియందలి యాత్యాసక్తి రూపమైన సత్వికల శ్రద్ధ 'ఆలస్యాది విక్షేపములు లేని చిత్తమును బరతత్వమున కభిముఖముగాఁ జేసికొనుట సమాధానము. పరమానందావేశవికారమైన మోక్షలక్ష్మిని బొందుటయందలి త్వర ముముక్షు॥ ౬౧॥

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంస స్సంగ స్తేషూపజాయతే ।
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥ ౬౨
క్రోధాద్భవతి సమ్మోహ స్సమ్మోహాత్ స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతే॥ ౬౩

—* భాష్యమ్ *—

నన్వస్త్వేవం పరంతు సమాధిప్రతిబంధకత్వేన జన్మమరణాద్యనర్థమూలం కిమస్తీత్యాహ—ధ్యాయతఇతి। తథాసతి శబ్దాదీన్ విషయాన్ ధ్యాయతః పుంసో యత్సంగ స్తస్మాత్సంగాత్సంజాయతే కామ స్తృష్ణావిశేష స్తస్మాత్కామాత్క్రోధో భిజ్వలనాత్మా భిజాయతే తస్మాత్కార్యాకార్యవివేకాభావరూప స్సమ్మోహ స్తస్మాచ్ఛాస్త్రాచార్యోపదేశస్య విభ్రమ స్స్మృతివిభ్రమ స్తతశ్చైకాత్మ్యాకారత్వబుద్ధేర్వినాశ స్తస్మాచ్చ పురుషార్థాయోగ్యత్వాత్ప్రణశ్యతీతి ద్వయోరర్థః॥ ౬౨-౬౩॥

—♦ లఘుటిప్పణీ ♦—

ఏకాత్మ్యాకారత్వేతి॥ తత్ర శివమద్వైతం తురీయమిత్యేకాత్మభావ స్సదాకారత్వం నైరంతర్యేణ తదుపలబ్ధి స్తద్బుద్ధే ర్వ్యామాఖ్యేనవిక్షేపేణ వినాశఇత్యర్థః॥ ౬౨-౬౩॥

—♦ ఆంధ్రతాత్పర్యము ♦—

సమాధికిఁ బ్రతిబంధకముగా జన్మమరణాద్యనర్థమునకు మూలము గలదా యనినఁ జెప్పుచున్నాఁడు:—విషయములను దలంచువానికిఁ గమ

ముగా వానియందు సంగము గలుగును. ఆసంగమువలనఁ దృష్ణావిశేష రూపమగు కామము జనించును. ఆకామమువలనఁ గ్రోధము పుట్టును. దానివలనఁ గార్యాకార్యవివేకాభావరూపమగు సమ్మోహము ద్భవించును. దానివలన శాస్త్రాచార్యోపదేశములమఱపును గలిగించుస్మృతివిభ్రమ ముత్పన్నమగు. అస్మృతిభ్రంశమువలన 'శివమద్వైతంతురీయ'మను నేకాత్మ్యకారత్వరూపమగు బుద్ధి నశించును. ఆబుద్ధినాశమువలన మానవుఁడు పురుషార్థమునుబడయుటకయోగ్యుఁడగుటవలన నశించుచున్నాఁడు.

శ్లో॥ రాగద్వేషవియుక్తైస్తు విషయా నింద్రియై శ్చరన్।
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి॥ ౬౪

—* భా ష్య మ్ *—

అథయథోక్తసాధనచతుష్టయేన నిగృహీతే తు మనసి న కించి ద్బాధకమిత్యాహ—రాగద్వేషేతి। ఏవంతర్హి రాగద్వేషాభ్యాం వియుక్తై ర్విరహితై రాత్మవశ్యై స్స్వాధీనై రింద్రియై శ్శబ్దాదీన్ విషయాం శ్చరన్నపితై స్సర్వభావేన విధేయః ప్రాప్య ఆత్మా యస్య స ప్రసాద మాత్మప్రసన్నతా మధిగచ్ఛతీత్యర్థః॥౬౪॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

ప్రసన్నతామితి॥ 'రసం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతీ' త్యాదిశ్రుతేః 'న సుఖం దేవరాజస్య న సుఖం చక్రవర్తినః। యత్సుఖం వీతరాగస్య మునే రేకాంతవాసిన' ఇత్యాది స్మృతే శ్చేత్యాశయః॥ ౬౪॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ముందుఁ జెప్పబడినసాధనచతుష్టయముచే మనస్సును నిగ్రహించిన యెడల నేమియు బాధకము లేదని చెప్పుచున్నాఁడు - రాగద్వేషాదులు

లేక తనకు లోఁబడిన యింద్రియములచేత నిషిద్ధకర్మములను మాని శబ్దము మొదలగు విషయములను బొందుచునాత్మప్రాప్తిని గోరువాఁడు (అనఁగా సచ్చిదానంద స్వరూపుండగు శివునిసాయుజ్యముం గోరువాఁడు) ప్రసన్నత్వము నొందును (వీతరాగుఁడై మునియై యేకాంతవాసియగు యోగికున్న సుఖము దేవరాజైన యింద్రునకుఁ గాని చక్రవర్తికిఁ గాని లేదు.) ౬౪॥

శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే।
ప్రసన్నచేతసోఽహ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి॥ ౬౫

—* భాష్యమ్ *—

నన్వాత్మనః పరమశివస్య ప్రసాదేసతి కింస్యాదిత్యాహ— ప్రసాదఇతి॥ ఏవంసతి "ధారయిష్యతి తే వేగం రుద్రస్త్వాత్మా శరీరిణాం। యస్మిన్నోతమిదం ప్రోతం సూత్రం శాటీవ తంతుష్వి"త్యాదిజాన్హవ్యుద్ధరణస్మృత్యాఽఽత్మశబ్దేనేహ పరమశివఏవ గృహ్యత ఇత్యాత్మనో మహాద్భయం 'వజ్రముద్యత' మిత్యాది శ్రుతే 'ర్భీషాస్మాద్వాతః పవత' ఇత్యాదిశ్రుతేశ్చసంసారరుద్ద్రావకత్వా ద్రుద్రశబ్దవాచ్యం బ్రహ్మ, 'తరతి శోక మాత్మవి' దితిశ్రవణాచ్చ, రుద్రశబ్దాభిధేయస్య పరమశివస్య ప్రసాదే సతి సర్వదుఃఖానాం హానిరితి ప్రసన్న చేతసో హ్యస్య శీఘ్రమేవ బుద్ధి స్సమాధౌ పర్యవతిష్ఠత ఇత్యర్థః॥౬౫॥

—♦ లఘుటిప్పణీ. ♦—

శివఏవేతి॥ తత్ర యద్యపి 'దేహేన్ద్రియమనశ్చైవ జీవాత్మా చేతి ముఖ్యత స్సర్వసాక్షీ శివ' శ్చేతి స్మృత్యాషడ్విధ ఏవాత్మే త్యుచ్యతే తథాపీహ శివరుద్రశబ్దాభ్యాం పరబ్రహ్మై వేత్యవధేయమ్॥ రుద్రశబ్దాభి

ధేయస్యేతి॥ తద్యథా 'రోదయత్యేవ య స్సర్వాన్ స్వస్మిన్ భక్తివివర్జితా నతో రుద్రస్య రుద్రత్వంసో௨రోదీదితి దర్శనా' దిత్యాది స్మృత్యాతద్విముఖస్తు దక్షవద్వినశ్యేదేవేతి బోధ్యమ్॥ ౬౫॥

## —✻ ఆన్ధ్రి తాత్పర్యము ✻—

ఆత్మయగు పరమశివుని ప్రసాదము కలిగినతరువాత నేమి గలుగుననఁగా:— 'వస్త్రము తంతువులందెట్లు వర్తించుచున్నదో యట్లు స్థావర జంగమాత్మకమగు నీప్రపంచముమున సమస్తశరీరులకు నాత్మయైన రుద్రుడు నీవేగమును ధరింపఁగలఁడు.' అని గంగోద్ధరణమునందు రుద్రుఁడే యాత్మయని చెప్పఁబడి యున్నందున నాత్మయగు శివునియొక్క యనుగ్రహము గలిగినతోడనే దుఃఖము లన్నియును నశించును. అట్లు దుఃఖములు పోఁగా నిర్మలమైన మనస్సుగలవానిబుద్ధి శీఘ్రముగా సమాధియందుఁ బ్రవర్తించును. (తనయందు భక్తిలేనివారి నేడ్పించువాఁడు కావునను,సంసారరోగమును నశింపఁజేయువాఁడు గావునను, శివుఁడు రుద్రుఁడనఁబడుచున్నాఁడు. ఆత్మనెఱింగినవాఁడు శోకమును దరించునను శ్రుతి రెండవ వ్యుత్పత్తికిం బ్రమాణము. ఆత్మషడ్విధత్వమున దేహేంద్రియ మనస్సులు, జీవాత్మ సర్వసాక్షి శివుఁడనిచెప్పుచున్నారు. శివరుద్రశబ్దములచే నిచటఁ బరబ్రహ్మమని యెఱుంగవలెను.)

శ్లో॥ నాస్తి బుద్ధి రయుక్తస్య నచాయుక్తస్య భావనా।
నచాభావయత శ్శాన్తి రశాన్తస్య కుతస్సుఖమ్॥ ౬౬

## —♦ భాష్యమ్. ♦—

ఇమమేవార్థంవ్యతిరేకముఖేన ద్రఢయన్నాహ-నాస్తీతి ఏవంతర్వ్యాయుక్తస్యాజితేన్ద్రియస్య నాస్తి బుద్ధి రాత్మవిషయిణీ తథానచాయుక్తస్య భావనా నిదిధ్యాసనాత్మికా నచా

భావయత స్సామరస్యైకలక్షణాశాన్తి ర్నచాశాన్త స్యాత్మ సాక్షాత్కారశూన్యస్య సుఖం బ్రహ్మానందాఖ్య మిత్యర్థః॥౬౬॥

—♦ అర్థతాత్పర్యము ♦—

ఈవిషయమునే వ్యతిరేకముఖముగా దృఢీకరించుచున్నాఁడు — ఇంద్రియములను జయింపనివానికి నాత్మవిషయికమగు బుద్ధియు నిధిధ్యాసనాత్మిక మగు భావనయు నుండవు. ఆభావనలేనివానికి సామరస్యైక లక్షణమగు శాన్తియునుండదు. అశాన్తిలేనివానికి (అనఁగా నాత్మసాక్షాత్కారశూన్యునకు) సుఖమెక్కడిది? అనఁగా బ్రహ్మానందాఖ్యమగు సుఖము లేదనుట.

శ్లో॥ ఇన్ద్రియాణాం హిచరతాం యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయు ర్నావ మివాంభసి॥ ౬౭

—♦ భాష్యమ్ ♦—

నన్వయుక్తస్యకస్మాన్నాస్తి బుద్ధిరిత్యాహ—ఇన్ద్రియాణామితి॥ ఏవం సతి స్వస్వవిషయేష్వవశీకృతానా మిన్ద్రియాణాం మధ్యే యదేకం మన స్తత్తద్విషయే ష్వనువిధీయతే ప్రేర్యతే తత్తస్మాదస్య ప్రజ్ఞాం బుద్ధిమపి మనో హరతీత్యర్థః । తత్ర దృష్టాంత మప్యాహ । వాయురితి॥ తత్రాంభస్యేవ వాయో ర్నౌకాహరణ సామర్థ్యం న తు భువీతి సూచయితు మంభసీత్యుక్తమ్, ఏవం దార్ష్టాంతికేఽప్యంభస్థానీయే మనశ్చాంచల్యే సత్యేవ ప్రజ్ఞాహరణ సామర్థ్య మింద్రియస్య న తు భూస్థానీయే మనస్థైర్య ఇతిసూచితమ్॥ ౬౭॥

—✻ ల ఘు టి ప్ప ణీ ✻—

హారతీతి॥ తత్ర న కేవలం భోగైనైవేంద్రియాణా ముపశాన్తిః కిన్తు నిగ్రహేణైవోపశాన్తి రిత్యభిధ్యా తద్యథా 'నాగ్ని స్తృప్యతి కాష్ఠానాం నాపగానాం పయోనిధిః । నాంతక స్సర్వభూతానాం నపుంసాం వామలోచనే' త్యాది సంబంధ షష్ఠ్యేప పాదనీయమ్॥ ౬౭॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

జితేంద్రియుఁడు గాని వాని కెందులకు నాత్మవిషయికమగు బుద్ధి యుండదనఁగాఁ జెప్పుచున్నాఁడు—వశము తప్పి స్వ స్వవిషయములందుఁ బ్రివర్తించుచున్న యింద్రియములలో నొక్కటియగు మనస్సు, ఆయా విషయములందుఁ బ్రివర్తించును. అట్లు ప్రవర్తించిన మనస్సు జితేంద్రియుఁడు గాని వాని ప్రజ్ఞను, వాయువు నీటియందలి నావనువలె నశింపఁ జేయును. (ఇట దృష్టాంతమందలి సారస్యమేమనఁగా) అంభసియని చెప్పుటవలన నీటితో సమానమగు మనశ్చాంచల్య మున్నప్పుడే ప్రిజ్ఞాహరణ మగును గాని భూస్థానీయమైన మనఃస్థైర్యమున్నపుడు గానేరదు.

ఇంద్రియములకు భోగముచేత నుపశాన్తి గలుగదు కాని నిగ్రిహముచేతనే కలుగును. (ఎట్లనఁగా కాష్ఠములవలన నగ్నియు నదులవలనసముద్రుఁడును, ప్రాణులవలన యముఁడును, బురుషులవలన స్త్రీయును, దనివి నొందని యట్లు భోగములవలన నింద్రియములకు (దృప్తి గాదని భావము.)

శ్లో॥ తస్మాద్యస్య మహాబాహో! నిగృహీతాని సర్వశః।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ ౬౮॥

—♦ భా ష్య మ్ ♦—

నను కథం తర్హి ప్రజ్ఞా ప్రతిష్ఠితా భవిష్యతీతి న హి మంతాణాం యోమితాస్తేతి న్యాయేన యథోక్త ముపసంహ-

రన్నాహ—తస్మాదితి॥తస్మాద్ధేమహాబాహో శత్రునిబర్హణేషు మత్వాదిన్ద్రియ శత్రునివారణేఽపి త్వం క్షమోఽసీతి సూచితమితి స్పష్ట మన్యదితి, భావః॥ ౬౮॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

ప్రజ్ఞ యెట్లు నిశ్చలమైనదగు ననఁ జెప్పుచున్నాఁడు—ఓయర్జునా! అందువలన నెవ్వానియింద్రియములు స్వస్వవిషయములనుండి యన్నివిధములుగా నిగ్రహింపఁబడుచున్నవో, వాని ప్రజ్ఞ నిశ్చలత్వముం గాంచును. (సర్వశత్రువులను జయించుసామర్థ్యము గలిగినవానికి నింద్రియశత్రునివారణము ననుసామర్థ్యముండు నని సూచించుటకు (మహాబాహో!) అని సంబోధనము చేసినాఁడు.)

శ్లో॥ యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తిసంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥౬౯

—♦ భాష్యమ్ ♦—

ననువస్తుగత్యా స్థితప్రజ్ఞత్వం కథమనుభూయత ఇత్యాహ—యానిశేతి॥ తత్రైవం యత్రత్వస్య 'సర్వమాత్మైవాభూద్విజానత' ఇత్యాది శ్రుతేర్యా 'తత్వమస్యహంబ్రహ్మాస్మీ'త్యాది వేదాన్తవాక్యజనితా స్థిరా ప్రజ్ఞా యా సర్వభూతానామజ్ఞానాం నిశేవ నిశా తస్యాం సంయమ్యాత్మధ్యాయీ జాగర్తీత్యర్థః। ఏవం యస్యాం త్వవిద్యాయాం ద్వైతదర్శనరూపాయాం సర్వాణి భూతాని జాగ్రతి సా త్వద్వైతాత్మదర్శనశీలస్య మునేర్నిశేవ నిశేతిపరమార్థః॥౬౯॥

—* లఘు టిప్పణీ *—

ఆత్మధ్యాయీతి॥ తద్యథా 'ఆత్మాంబురాశౌ నిఖిలోఽపి లోకో మగ్నోఽపి నాచామతి నేక్షతేచ । ఆశ్చర్య మేత న్మృగతృష్ణికాభే భవాంబురాశౌ మృగతే మృష్వైవ' ఇత్యాదిద్రష్టవ్యమ్॥౬౯॥

—◆ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ◆—

స్థితప్రజ్ఞత్వ మేవిధముగా ననుభవింపఁబడుచున్న దనఁ జెప్పుచున్నాఁడు—అజ్ఞులయిన భూతముల కేరాత్రిగలదో యారాత్రియందు నీప్రపంచమంతయును నాత్మయనియే తలంచి, తత్త్వమస్యహంబ్రహ్మాస్మి లోనగు వేదాన్తవాక్యములచేఁ గలిగిన స్థిరప్రజ్ఞగలవాఁడై జితేంద్రియుఁడగు యోగి మేల్కొనియుండును. భూతములేరాత్రియందు మేల్కొనియుండునో (అనఁగా ద్వైతదర్శన రూపమగు రాత్రియందని యర్థము.) అయ్యది యద్వైతాత్మదర్శన శీలుఁడైన మునికి రాత్రియగును. అనఁగా ద్వైతభావము తొలఁగి యద్వైతభావ ముదయించునని తలంపవలెను. (ఈ ప్రపంచమంతయును నాత్మసముద్రమునందు మునింగినదయ్యును, నందలి యొక బిందువునైనను దాగఁదు. మఱియుఁ జూడదు. కాని యెండమావులతో సమానమగు సంసారసముద్రమున వ్యర్థముగా వెదకుచున్నది. ఇది యెంతయాశ్చర్యము ? అని యాత్మధ్యాయి తలంచుచున్నాఁడు)

శ్లో॥ ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశన్తి యద్వత్,
తద్వ త్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తి మాప్నోతి న కామకామీ॥ ౭౦

—◆ భాష్యమ్. ◆—

అథైతాదృశస్య స్థితప్రజ్ఞస్యాన్తతస్స్వరూపలక్షణం దృష్టాంతేన స్పష్టంపునరాహ।-ఆపూర్యమాణమితి-తత్త్రైవం సతి సర్వాభిర్నదీభిరాపూర్యమాణమచలప్రతిష్ఠమనతిక్రాంతమర్యాదం సముద్రం యద్వదాపః ప్రవిశన్తి, తద్వల్లోకానాం కామా యం తాదృశం తత్త్వజ్ఞానినం ప్రవిశన్తి, పూర్ణా భవంతి, స ఏవ స్థితప్రజ్ఞో భవతి న తు స్వయమే వాశక్తః కామకామీ త్యర్థః॥ ౭౦॥

—◆ లఘుటిప్పణీ. ◆—

ప్రవిశంతీతి॥ తద్యథా, 'సర్వాంశ్చ కామా నాప్నోతి సర్వాంశ్చ లోకా నాప్నోతి య స్తమాత్మాన మను విద్య విజానాతీతి హ ప్రజాపతి రువాచే' త్యాది శ్రుతేః స్వయమాప్తత్వేన లోకానామపి కామాన్పూరయిష్యతీతి కాంక్షతేరిత్యాశయః॥ ౭౦॥

—◆ ఆన్ధ్రతాత్పర్యము. ◆—

ఇట్టి స్థితప్రజ్ఞుని కడపటి స్వరూపలక్షణమును దృష్టాంత పూర్వకముగాఁ జెప్పుచున్నాఁడు—సమస్తములైన నదులచే నింపఁబడుచున్నను మర్యాద నతిక్రమింపని సముద్రము నేవిధముగా నీళ్లు ప్రవేశించుచున్నవో ఆవిధముగాఁ గోర్కులన్నియు నేజ్ఞానవంతుని వికృతిని బొందింపకుండఁ బ్రవేశించునో వాఁడే మనశ్శాంతిని బొందును. కోరికలన్నియుఁ దన్నలమికొనినను నేవిధమగు వికారము నేని పొందనివాఁడే స్థితప్రజ్ఞుఁ డనఁ బడును. కాని విషయములందభిలాష గలిగి యింద్రియములను జయింపని వాఁడు గాంచ నేరడని తా. ఎవఁడాత్మనెఱుంగునో, 'వాఁడు సర్వకామములను సర్వలోకములను బొందుచున్నాఁ' డను శ్రుతివలనఁ దానాప్తుఁ

డగుటవలన లోకుల కోరికలను సయితము నింపుచున్నాఁడని భావము. నదులన్నియుఁ గలసినపుడు సముద్రం డెట్లుహొంగఁడో ? యట్లు భోగములు ప్రాప్తించినపుడు యోగి వికారము నొందఁడని భావము.)

శ్లో॥ విహాయ కామా న్య స్సర్వాన్ పుమాం శ్చరతినిస్పృహః।
నిర్మమో నిరహంకార స్స శా న్తి మధిగచ్ఛతి॥ ౭౧

—♦ భా ష్య మ్ ♦—

అథచ యస్మాదేవం తస్మా త్స్థితప్రజ్ఞత్వసిద్ధయే కింకరణీయ మస్తీత్యాహ—విహాయేతి ఏవం త ర్హ్యాంతస్త్యాగీ బహిస్సంగీతి విద్వత్సన్న్యాస మార్గేణ సర్వా న్కామా న్విహాయ యః పుమాంశ్చరతి జనకాది వత్ప్రారబ్ధకర్మవశేన ప త్తనే వా వనేవాక్వాపి గచ్ఛతి స్థాస్యతి వా స ఏవం భూత శ్శాంతిం సామరస్యైక భావలక్షణా మధిగచ్ఛతీత్యర్థః ౭౧॥

—✻ ల ఘు టి ప్ప ణీ ✻—

ప త్తనేవేతి తద్యథా - 'న ధావతి జనాకీర్ణం నారణ్య ముపశాన్తధీః। యథా తథాయత్ర తత్రస్థిత ఏవోపశామ్య తీ'త్యాదిస్మృతేరితిభావః ౭౧॥

ఇతి శ్రీశ్రీకణ్ఠశివాచార్య శిష్యవిశ్వేశ్వర శివాచార్య
విరచితాయాం లఘుటిప్పణ్యాం సాంఖ్యయోగః.

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము . ♦—

కావున స్థితప్రజ్ఞత్వసిద్ధికేమి సేయవలయుననినఁ జెప్పుచున్నాఁడు- బాహ్యమున సంగిగాఁ దోఁచుచున్నను నంతరంగమునఁ ద్యాగియై విద్వత్సన్న్యాస మార్గముచేత సమస్తములైన కోరికలను విడిచి, యేపురుషుఁడు స్పృహయు మమత్వము నహంకారము ననువీనిని దూరముగాఁ ద్రోసివైచి

జనకాదులువలెఁ బ్రారబ్ధకర్మవశమునఁ బత్తనమునఁగాని వనమునఁగాని శేక మజియొందేని సంచరించుచుండునో వాఁడు సామరస్య భావలక్షణ మగు శాంతిని బొందుచున్నాఁడు. (శాన్తమైనచిత్తముగలవాఁడు జనులచే నిండినప్రదేశముం గూర్చి పరుగెత్తఁడు. అరణ్యమును బొందఁడు. వాని కెందున్నను సమానమే. అతఁడెందుండు నెట్టివిధముల వర్తించుచున్నను శాన్తి నొందియే యుండును.

శ్లో॥ ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి।
స్థిత్వాఽస్యా మన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి॥ ౭౨

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణాఽర్జున సంవాదే
సాంఖ్యయోగః.

—♦ భా ష్య మ్ ♦—

తదేవం చతుర్ణా ముత్తరవ్యాజేన సర్వాణి స్థితప్రజ్ఞలక్ష ణాని దర్శితానీతి కైముతికన్యాయే నోపసంహరన్నాహ।ఏషేతి ఏవంసతి హేపార్థ యైషా బ్రాహ్మీ చిదంబరాఖ్యా సమాధి స్తాం ప్రాప్యాంతకాలేఽపి న విముహ్యతి కిము తత్రి వక్తవ్య మాశరీరాంతేఽప్యస్యాం స్థితశ్చేదితి పరమార్థః॥ ౭౨॥

ఇతి శ్రీశ్వేతాచార్యగురుచరణ శిష్యభావ సమాసాదిత
శైవసిద్ధాన్తప్రవర్తక శ్రీశ్రీకంఠశివాచార్య విరచితే
తత్త్వైకదర్శననామకే గీతాభాష్యే
సాంఖ్యయోగః.

## —* ఆన్ధ్రతాత్పర్యము *—

ఇట్లు కృష్ణుఁడర్జునుఁ డడిగిననాలుగు ప్రశ్నములకు నుత్తరములను జెప్పువ్యాజముచే స్థితప్రజ్ఞుని లక్షణముల నన్నింటిని జెప్పి కైముతిక న్యాయముతో నుపసంహరించుచున్నాఁడు - ఓయర్జునా! ఇయ్యది బ్రహ్మజ్ఞాన సంబంధమగు స్థితి. చిదంబరాఖ్యమగు సమాధి. దీని నెఱింగినవాఁడు మోహము నొందఁడు. అవసానకాలమందైనను నరుఁడు దీనియందుండు నేని బ్రహ్మత్వమునొందును, ఎల్లప్పుడును దీనియందే వర్తించువాని విషయమునుగూర్చి చెప్పవలసినదేమని కైముతికన్యాయము.

ఇట్లు తత్త్వైకదర్శనమను శ్రీకంఠీయగీతాభాష్యమునకు బోధానందమహర్షిచే రచింపఁబడిన భావబోధమను నాంధ్రతాత్పర్యమున సాంఖ్యయోగము.



ఓమ్

# శ్రీమచ్ఛ్రీకంఠాచార్యకృతే

# శ్రీభగవద్గీతాభాష్యే

## కర్మయోగః.

అర్జున ఉవాచ:—

జ్యాయసీ చేత్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన ॥
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ! ౧

—♦ భాష్యమ్ ♦—

నైష్కర్మ్యం కర్మణా ప్రోక్తం కంటకే నేతియుక్తితః ।
నాన్యథా శుద్ధితో జ్ఞానం తృతీయే తు నిగద్యతే॥ నన్విహాముత్రార్థఫలభోగవిరాగ నిత్యానిత్యవస్తువివేక శమదమాదిషట్కసంపత్తి ముముక్షుత్వానీత్యేవసాధనచతుష్టయగతా న్యంతరంగాణి జ్ఞానసాధనానీతి కిం బాహ్యకర్మణే త్యభిప్రేత్యాహ—జ్యాయసీచేదితి॥ ఏవంతర్హి నిష్కామకర్మణా శుద్ధచిత్తస్య నిష్కామాదప్యాత్మతత్వవిషయికా బుద్ధిరేవ యది జ్యాయసీ చేత్తే తవ మతా తదా కింకర్మణి ఘోరే హింసాద్యనేకాయాసబహులే మాం నియోజయసి, 'కర్మణ్యేవాధికార స్తే' ఇత్యాదినేతి భావః॥౧॥

—* లఘుటిప్పణీ *—

విజ్ఞానరూపస్య పరబ్రహ్మణ స్సర్వథా వర్తమానత్వా త్కథం తేన తదుపలబ్ధి రిత్యతః కర్మణైవాంతఃకరణస్య శుద్ధ్యా తత్ప్రాప్తి రిత్యభి ప్రేతం యథా కంటకేనైవ కంటకోద్ధార ఇతిన్యాయేన కర్మణైవాంతః కరణశుద్ధ్యుత్తరం విజ్ఞానసిద్ధిరితి। 'కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయ' ఇత్యతో ప్యవధార్యమ్ సాధనచతుష్టయాద ప్యంతరంగసాధనాని యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధారణ ధ్యానసమాధిరూపాణీత్యవధేయం। హింసాకర్మ, 'యాజ్ఞీయం పశు మాలభే'దిత్యాదిశ్రుతిసిద్ధత్వేఽపి క్షయిష్ణుఫలకత్వే నానిత్యత్వాదితి భావః॥౧॥

—* ఆన్ధ్రతాత్పర్యము *—

అర్జునుండిట్లనియె, ఓజనార్దనా! నిష్కామకర్మమునకన్న జ్ఞానమే గొప్పదియనినీయభిప్రాయ మేని,ఘోరకర్మముననన్నేలపురికొల్పుచుంటివి? 'కంటకేనైవ కంటకోద్ధారః' (ముల్లుచేతనే ముల్లు తీసివేయవలెను) అను న్యాయముచేతఁ గర్మలచేతనే నైష్కర్మ్యసిద్ధి గల్గును గాని యన్యసాధనములచే నంతఃకరణశుద్ధి గల్గదంటివేని ఇహాముత్రార్థఫలభోగవిరాగము, నిత్యానిత్యవస్తువివేకము, శమాదిషట్కసంపత్తి, ముముక్షుత్వము, యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహారధారణ ధ్యానసమాధి రూపమైన యాంతరంగికజ్ఞాన సాధనము లుండఁగా బాహ్యకర్మ లేల చేయవలెననఁగా? విజ్ఞానరూపమైన నిష్కళంక శివతత్వప్రాప్తి, కర్మాచరణముచే శుద్ధమైనయంతఃకరణకుఁ గల్గును. (కర్మలచే నంతఃకరణశుద్ధి, అనంతరము జ్ఞానసిద్ధియుఁ గల్గును) కర్మచేతనే జనకాదులు ముక్తి నొందిరని కృష్ణుని యభిప్రాయము. పశువధరూపమైనయజ్ఞాదులు శ్రుతిచోదితములైనప్పటికిని నందుఁ బునరావృత్తి గలదు గాన నన్నుఁ గర్మల నేలచేయమంటివి ? యని యర్జునుని వాక్యము ॥౧॥

శ్లో॥ వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్

—♦ భాష్యమ్. ♦—

నను స్వర్గాద్యభికాంక్షయా కదాచిద్రాజ్యయశోభి కాంక్షయా కదాచిచ్చాంతః కరణశుద్ధ్యర్థం చేత్యాద్యనేక వికల్పవార్తయా కథం మాం విమోహయసీవేత్యాహ-వ్యామి శ్రేణైవేతి॥ వస్తుతస్తు త్వం మాం న విమోహయసి కిం త్వనేక వికల్పాన్గురుత్వే నోపదిశస్యేవేతి తత్వం తస్మా న్మను భ్రాంతి నివృత్త్యర్థం తదేకం నిశ్చిత్య వద హేగురో యేనాహంశ్రేయః పదవీ మవాప్నుయా మిత్యభిప్రాయః॥ ౨॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

ఓకృష్ణా! ఒకప్పుడు స్వర్గాదిలోకకాంక్షచేతను, మరియొకప్పుడు రాజ్యమును కీర్తిని బొందవలయునను కోరికచేతను, ఇంకొక సమయ మందు, అంతఃకరణశుద్ధినిమిత్తమనియు నిట్లనేకవిధములుగాఁ బలికించ వార్తలతో నాబుద్ధికి మోహమును బుట్టించువానివలెఁ గనుబడుచుంటివి. యథార్థముగా నన్ను మోహపెట్టవు. గురువగుటవలన ననేకవిధములుగా నుపదేశించుచుంటివని తాత్పర్యము.అందువలన నోగురూ! కర్మజ్ఞానముల రెంటిలో వేనిచేత నేను శ్రేయస్సును బొందఁగలనో దానిని నిశ్చయించి వచింపుమని యర్జునుని ప్రశ్న॥ ౨॥

శ్రీకృష్ణఉవాచ॥

శ్లో॥ లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ!
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్॥ ౩॥

—♦ భాష్యమ్ ♦—

ఏవం అధికారిభేదేన పృచ్ఛంత మర్జునంప్రతి తథైవోత్తర మస్యాహలోకేఽస్మిన్నితి॥ ఏవంసతి పురా పూర్వాధ్యాయే యా ద్వివిధా నిష్ఠా మయా ప్రోక్తా సా తావద్జ్ఞానయోగేన యమనియ మాద్యష్టాంగయోగేన సాంఖ్యానాం నిష్కామ కర్మణా శుద్ధాన్తః కరణానాం 'యస్మిన్కృతే న కించి త్కర్మ క్రియతే తన్మేమన శ్శివసంకల్ప మస్త్విత్యాదిశ్రుతేః' ఏవం యాచోపాసనయాసహ కర్మయోగినాం యజ్ఞేనదానేనతపసే త్యాది' శ్రుత్యన్తరాచోక్తా సాత్వంతః కరణశుద్ధ్యర్థ మిహా ముత్రఫలసిద్ధ్యర్థంచేతినమయావిమిశ్రితము క్తమిత్యాశయః ॥3॥

—♦ లఘుటిప్పణీ ♦—

అధికారిభేదేనేతి॥ ఇహాముత్రకైవల్య ఫలభేదే నాధికారిభేద స్తేనేత్యర్థః బుద్ధింమోహయసీవ మఇత్యత్ర పూర్వమేవభ వద్యచసైవేవార్థేన ధ్వననాదితిభావః ॥3॥

—♦ ఆన్ధ్రితాత్పర్యము ♦—

కర్మల కెవ్వఁ డధికారి, జ్ఞానమున కెవ్వఁ డధికారి, యని యడిగిన యర్జునుని గూర్చి కృష్ణుం డిట్లనియె॥ పార్థా ? నే నిదివఱకుఁ గర్మజ్ఞాన నిష్ఠ లను నిరు తెఱంగుల నిష్ఠలం జెప్పితి. అత్మానాత్మజ్ఞానము గలిగి యమనియమాద్యష్టాంగయోగులయిన సాంఖ్యులు (సన్యాసులు) నిష్కామ కర్మలచే శుద్ధాంతఃకరణగలవారు గాన జ్ఞానమునందధికారులు. గృహస్థు లయిన కర్మయోగులు యజ్ఞదానతపస్సులయందధికారులు. 3.

శ్లో॥ న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే।
న చ సన్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి॥౪॥

—♦ భా ష్య మ్ ♦—

నన్వంతఃకరణశుద్ధ్యర్థ మకృత్వైవ యదివిజ్ఞానసిద్ధి స్తర్హి బహూనాంబ్రహ్మవిద్యాకాంక్షిణాం విజ్ఞానోత్పత్తిః కుతో నస్యాదితి నేత్యాహ—న కర్మణేతి॥ ఏవంతర్హి 'తమేతంవేదాను వచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసే'త్యాది యథోక్తశు్రిత్యా తత్తత్కర్మానుష్ఠానేనైవ చిత్తశుద్ధ్యుత్తర మాత్మోపలబ్ధిరిత్యాహ। నచేతి। ఏవంసతిప్రత్యుతసర్వధర్మ త్యాగినాం తేషాం నిరయగామిత్వమేవేతి॥ ముద్రాజటారచన మాంద్యవతాం వృథైవేత్యాదినా పూర్వోక్తం నవిస్మరణీయమ్

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

కుతో నస్యాదిః॥ 'లబ్ధ్వా శాంతింజనోఽప్యాహ సర్వదుఃఖం హాని ష్యతి। తపోవినా వినాయోగంధన్యఃకోఽత్ర భవేద్ధ్రువ'మిత్యాదిద్రష్టవ్యమ్

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

అంతఃకరణశుద్ధి లేకున్నను అనుభవము గలిగినయెడల బ్రహ్మజ్ఞాన మును గోరువారందఱికి విజ్ఞానమెందు కుదయించదంటివా? ఉదయించదు. యజ్ఞములు, దానములు, కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతతపస్సులు చేయక అంతఃకరణశుద్ధి గలుగదు. అంతఃకరణశుద్ధి లేక ఆత్మసాక్షాత్కారము గలుగదు. కావునఁ గర్మానుష్ఠానముచేతనే చిత్తశుద్ధియును దరువాత నాత్మప్రాప్తియుఁ గలుగును. సన్యసించిన మాత్రముననే యాత్మోపలబ్ధికిఁ

గారణమగు చిత్తశుద్ధి రాఁజాలదు. సర్వధర్మములను విడిచిన వారికి నరకమేకాని పుణ్యలోకములేదు. ౪.

శ్లో॥ న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః॥ ౫

—♦ భా ష్య మ్ ♦—

నను సర్వథా యది కిమపి కర్మ నకర్తవ్యం తర్హ్యయమ ఇందో్రివా కిం విలిఖిష్యతీతి చే 'జ్జీవన్నేవ హి కర్మాణి జిజీవిషే చ్ఛతగం సమాః' ఇత్యాది శ్రుత్యుల్లంఘన ప్రయుక్తపాపా న్నిరయగామిత్వమపి తేషాం స్యాదిత్యాహ-నహికశ్చిదితి॥ తత్రై్రివంసతి స్వధర్మాదరణా ద్బహిర్ముఖాహిం యస్మాత్ క్షణమపిజాతు నామ కదాచిత్ కశ్చిదప్య కర్మకృ న్నతిష్ఠతి। అపితు లౌకికం వైదికం వా యత్కర్మానుష్ఠానం తత్స్వప్రకృతిజై ర్గుణై రవశస్సన్ కరోతి కార్యతే వే త్యవశ్యమితిభావః ౫

—* ల ఘు టి ప్ప ణీ *—

కింవిలిఖిష్యతీతి॥ ఇత్యత్ర కోశరక్షకేణ పదాతినానరక్షితశ్చే దకృత్వైవ స దండ్యతాం గత ఇత్యత్ర స్తదేవ తస్య కృత్యం యమోఽపి విలిఖిష్యతీతి తదేతచ్ఛ్రుతి రప్యాహ - జీవన్నేవేత్యత్ర 'నకృతం చేత్కృతం తేనశ్రుతే ర్వాక్యోపలంభనాత్'। తస్మాత్ క్షణంవినా కశ్చిన్నైవతిష్ఠత్య కర్మ కృదిత్యా దిదర్శిష్టవ్యమ్॥ ౫॥

—* ఆ న్ధ్ర తా త్ప ర్య ము *—

క్షణకాలమైనను గర్మలను జేయనివాఁడు గా నొకా నొకఁడును నొకా నొకప్పుడు నుండఁడు. కర్మలను జేయని యెడలఁ పాప పుణ్యము

లుండవు. పుణ్యమును వ్రాయుటకు నింద్రుడును, పాపమును వ్రాయుటకు యముఁడును నవసరములేదు. ఇంద్రలోక యమలోకములు లేకుండఁ గలవు. కాన స్వధర్మాచరణము లేక నొకఁడును నుండజాలఁడు. లౌకిక కర్మను గాని, వైదిక కర్మను గాని చేయుచునే యుండును. కర్మలను మానఁగూడదని శ్రుతులు ఘోషించుచున్నవి. శ్రుతుల నుల్లంఘించిన పాపమువలన నరకప్రాప్తి గలుగును. ప్రకృతివలనఁ గలిగిన సత్వరజస్తమో గుణములచేఁ బరాధీనుఁడై ప్రతి ప్రాణియుఁ గర్మ మొనర్చుచునే యుండును॥ ౫॥

శ్లో॥ కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్।
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే॥

—◆ భాష్యమ్ ◆—

నను 'దేవోపాసనయా దైవం పైత్రం తు పుత్రతో జయేత్। వ్రతోపాసనయా త్వార్షం త్రిభిస్తు పరమాజ యే'దితి క్రమం త్యక్త్వా యథా కథంచిత్ ఔత్సుక్య మాత్రేణ కృత సన్యాస స్త్వశుద్ధచిత్తో న తత్ఫలభా గ్భవతీత్యాహ ॥ కర్మేం ద్రియాణీతి తత్రైవంసతి। కర్మేంద్రియాణి వాక్పాణ్యాదీని బాహ్యత స్సంయమ్య మనసా శబ్దా దీ న్విషయాన్ స్మర న్య ఆస్తే నత్వాత్మతత్వం కింతు కృతకర్మసన్యాసోఽహ మిత్య భిమానేన త్యక్తధ్యాన స్తిష్ఠతి స చ నిరర్థకత్వా న్మిథ్యాచారో యస్మా'త్త్యాగే నైకేన ప్రకృతిషు విలయ' ఇత్యాది శ్రుతి విరోధా 'త్కర్మ బ్రహ్మోత్మ భయభ్రష్ట' మిత్యాది యథోక్త స్మృతేశ్చ స త్యాగీ పతితో భవే దిత్యవ ధేయమ్॥ ౬॥

—♦ లఘు టిప్పణీ ♦—

పరమమితి॥ ఉపాసనాత్రయేణ పరమం కైవల్య ముర్వారుకమివేతి శ్రుతిన్యాయేన జయేదితి తాత్పర్యమ్ ॥౬॥

—♦ ఆన్ధ్ర తాత్పర్యము ♦—

పరమపదమును జయించువాఁడు దేవపితృఋషులను జయించవలెను. దేవోపాసనచే దైవమును, పుత్రోత్పాదనచేఁ బితరులను వ్రతోపవాసనాదులచే ఋషులను జయించవలెను, అట్లుగాక వేదుకకొఱకుఁ గర్మలను వదలి సన్యసించినవాఁడు మలినాంతః కరణుఁడై వాగింద్రియముతో మాట్లాడక పాణిచే దానప్రతిగ్రహములు చేయక పాదములచే గమనాగమనములు చేయక గుహ్యేంద్రియముచే సంభోగానందమనుభవించక గుదముచే మలవిసర్జనముఁజేయక మనస్సుచే శబ్దాదివిషయముల స్మరించుచు నాత్మతత్వము నెఱుంగక నేను సన్యాసినని యభిమానముతో ధ్యానమును వదలినవాఁడు కర్మబ్రహ్మ భ్రష్టుడైనపతితుఁడు నరకమును బొందును. గానఁ బైనఁజెప్పిన యుపాసనత్రయముచేఁ గ్రమముగా దోసపండును తొడిమి వదలినట్లుబంధమును వీడి కైవల్యమును జయించును ॥౬॥

శ్లో॥ య స్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున!।
కర్మేంద్రియైః కర్మయోగ మసక్త స్స విశిష్యతే॥ ౭॥

—* భాష్యమ్ *—

నన్వంత స్త్యాగీ బహిస్సంగీతిన్యాయేన య స్తిష్ఠతి స కీదృశ ఇత్యాహ - య స్త్వితి॥ ఏవంసతి య స్త్వింద్రియాణి జ్ఞానేంద్రియాణి శ్రోత్రాదీని మనసావివేకయుక్తేన సహ నియమ్య పాపహేతువిషయాసక్తే ర్వినివర్త్య కర్మేంద్రియై ర్వాక్పాణ్యాదిభి రంతఃకరణశుద్ధి హేతుతయా విహితంకర్మ

యోగ మసక్తః ఫలాభిసంధిరహిత స్సన్నారభతే సచేతరస్మా న్మిథ్యాచారా ద్విశిష్యత ఇత్యర్థః॥ ౭॥

—* లఘుటిప్పణీ *—

మిథ్యాచారాదితి॥ ఇహాముత్రవిరోధినా ముద్రాజపేత్యుక్తేన వేదబాహ్యానకర్మణా యుక్తో మిథ్యాచార స్తస్మాదిత్యర్థః। బుద్ధ్వా ద్వైతస్య తత్త్వస్యయథేచ్ఛాచరణం యది 'శునాం తత్త్వదృశాంచైవ కోభేదోఽశుచిభక్షణ' ఇత్యాదిద్రష్టవ్యమ్॥ ౭॥

—♦ ఆస్ధ్రితాత్పర్యము ♦—

అంతస్త్యాగమును బహిస్సంగమును గలవానిలక్షణమును జెప్పు చున్నాఁడు - ఎవఁడు జ్ఞానేంద్రియములయిన శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణములను వివేకముగల మనస్సుచే నిగ్రహించి, అనఁగా, పాప హేతువులైన విషయములనుండి మరలించి కర్మేంద్రియములైన వాక్పాణి పాదపాయూపస్థలచేత అంతఃకరణశుద్ధిగా విహితమైన కర్మయోగమును ఫలాభిసంధిని వదలి ఆరంభించునో అట్టివాఁడు బాహ్యాడంబరము గలిగి మిథ్యాచారుఁడగువానికన్న మిక్కిలి గొప్పవాఁడు. శివాద్వైతతత్త్వము నెఱింగియును స్వచ్ఛందముగా విహరించినవార లమేధ్యమును భక్షించు నట్టి కుక్కలతో సమానులు.

శ్లో॥ నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః।
శరీరయాత్రాఽపిచ తే న ప్రసిద్ధ్యే దకర్మణః॥ ౮॥

—♦ భాష్యమ్ ♦—

అథ యస్మాదేవం తస్మాన్మనసా జ్ఞానేంద్రియాణి నిగృహ్య కర్మేంద్రియాణితు సత్కర్మసు వ్యాపారయన్

పరమపురుషార్థ భాగ్భవతీత్యాహ - నియతమితి॥ ఏవం తర్హి శుద్ధాన్తఃకరణస్యాపి తే హి యతోఽకర్మణ స్సకాశాత్ కర్మ కర్తుం జ్యాయ ఇత్యర్థః। ఏవమిహ కర్మణో యుద్ధాదికర్మ రహితస్యాపి తవ శరీరయాత్రా శరీరస్థితిరపి తే ప్రసిద్ధ్యేదిత్యర్థః.

## —◆ లఘుటిప్పణీ. ◆—

పరమపురుషార్థఇతి॥ 'పురుషార్థ స్స ఏవ స్యా ద్యచ్ఛివత్వం వ్రజే ద్ధ్రువం। తం వినా జన్మరాహిత్యం న భవే జ్జన్మకోటిభి' రిత్యాది పాద్మేఽపి దర్శనాదితి భావః। 'అకర్మణా హ్యధర్మేణ కథంపారం గమిష్యతి। తస్మా త్కర్మ తు కుర్వన్తి యతయః పారదర్శిన' ఇత్యాది స్కాందే ద్రష్టవ్యమ్॥ ౮॥

## —◆ ఆన్ధ్రతాత్పర్యము ◆—

అట్టి యంతఃకరణశుద్ధి గల మనస్సుచే శ్రోత్రత్వక్ చక్షుజిహ్వా ఘ్రాణములను నిగ్రహించి, అనఁగా, శ్రోత్రంబుచే శబ్దమును వినక, త్వగింద్రియముచే స్పర్శంబుఁ దెలియక, చక్షురింద్రియముచే రూపమును గ్రహించక, జిహ్వచే రుచి నెఱుంగక, ఘ్రాణముచే గంధము నరయక, కర్మేంద్రియములైన వాగాదులను సత్కర్మలయం దలవాటుచేయుచున్న యెడలఁ బరమపురుషార్థమును బొందును. పరమపురుషార్థ మనఁగా శివత్వ ప్రాప్తి, అందులకు 'శివోఽహం' భావనచేయక కోటిజన్మములకైనను జన్మరాహిత్యము నొందలేరు. అంతఃకరణశుద్ధి గల్గినను గర్మ చేయకపోవుటకంటెఁ గర్మచేయుటమంచిది. అధర్మమైనయకర్మచేఁ బారంగతులు గానేరనందువలనఁ బారంగతులయినయతులును గర్మలఁ జేయుచుండిరి. కాన సర్వకర్మలను వదలి నీవు జ్ఞాననిష్ఠను మానితివేని నీదేహయాత్ర గడచుట కష్టతరము. యుద్ధరూపమైనయజ్ఞకర్మను జేయక దేహమును గడుపఁజాలవని భావము॥ ౮॥

శ్లో॥ యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః।
తదర్థం కర్మ కౌంతేయ! ముక్తసంగ స్సమాచర॥ ౯

—* భాష్యమ్ *—

నను కర్మణా బధ్యతే జంతురిత్యాద్యుక్త్వా సర్వంకర్మ బంధనాత్మకత్వాన్ముముక్షుణా నకర్తవ్యమితిమత్వా సమాధత్తే యజ్ఞార్థాదితి॥ తత్రైవంసతి 'క్వ కర్మ ప్రధ్వ స్తం ఫలతిపురుషారాధ నమృత' ఇత్యాది స్మృత్యా యజ్ఞేనార్థ్యతే ప్రార్థ్యతే స యజ్ఞార్థ స్సర్వకర్మఫలప్రదాతా సదాశివ స్తతోఽన్యస్మై య త్కర్మ తస్మాత్రి-యమాణా త్కర్మణ స్సకాశాల్లోకోఽయం బధ్యత ఇతికర్మబంధన ఇత్యర్థః 'యస్మి న్కృతేనకించి త్కర్మ క్రియత' ఇత్యాదిశ్రుతేః అతఏవ దక్షయజ్ఞ ప్రమథనే సముత్థాయ మహావిష్ణుం భ్రామయిత్వాతిత్రిధా పునశ్శూలం వక్షస్యధో హస్తౌ ఛిత్వా యజ్ఞాద్బహి ష్కృత ఇత్యాదినామహావిష్ణోరిదం, వృత్త మన్యస్య కానార్థేత్యాశయః॥ ౯॥

—* ఆంధ్ర తాత్పర్యము *—

కర్మచేత జంతువు బంధింపఁబడునని చెప్పఁబడుటవలన, ముముక్షువునకుఁగర్మలుబంధకరములుగానఁగ ర్తవ్యములు గాదనఁగాసమాధానముఁ జెప్పుచున్నాఁడు - కౌంతేయా! యజ్ఞమందు ఫలమిచ్చువాఁడు సదాశివుఁడు. అట్టి సదాశివునికొఱకుఁ గాక యన్యులకొఱకై చేయుకర్మవలన బద్ధుఁడగుచున్నాడు. ఈశ్వరారాధన లేక చేసిన దక్షయజ్ఞము బంధనమును గలిగించినది. అందు శివుఁడు, దక్షునకు సహాయమువచ్చినవిష్ణుని శూలమునఁగ్రుచ్చి చేతులు దెగఁగొట్టిమూఁడుమార్లు గిరగిరత్రిప్పి యజ్ఞవాటి

కను దూరముగాఁ బాఱవైచెను. విష్ణునే యట్లు చేసినప్పుడు ఇతరుల లెక్క యేమి? కాన ఈశ్వరారాధన వ్యతిరిక్త కర్మలు బంధకరములు గాన విడువ వలయును॥ ౯॥

శ్లో॥ సహ యజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽ స్త్విష్టకామధుక్॥ ౧౦॥

—♦ భాష్యమ్ ♦—

నను ఫలాభిసంధిరహితస్యాపి శ్రద్ధామాత్రేణ కర్మకర్తృ మావశ్యకత్వే స్థితే తత్రిపురాతనం సేతిహాసం సంవాద మప్యాహ - సహయజ్ఞా ఇతి॥ ఏవంత్వగ్నిర్వ్రా 'యజ్ఞమూలం త్రయః ప్రోక్తా వేదోఽగ్ని ర్బ్రాహ్మణః పురే'త్యాదిపాదోక్త్యాఽపి యజ్ఞైస్సహ ప్రజా స్సృష్ట్వా ప్రజాపతి ర్బ్రహ్మ ప్రజాదళం పురస్కృత్య తాః ప్రత్యువాచేత్యన్వయః। అథ తాః ప్రతి కిమువాచేత్యాహ। అనేనేతి॥ అత్రానేన యజ్ఞేనభవన్త్యః ప్రజాః ప్రసవిష్యధ్వం వర్ధిష్యధ్వం యత ఏష యజ్ఞఏవ వోయుష్మాకం కామధుగస్తు కామానాం పూరక ఇత్యర్థః॥ ౧౦॥

—♦ లఘుటిప్పణీ ♦—

రహితస్యాపీతి॥ 'నకుర్యా న్నిష్ఫలం కర్మ జలఘాతాదివత్ ఖల్వి'తి న్యాయేన ఫలాభిసంధిరహితేన కర్మణా కింస్యాదితిచేచ్ఛృణు 'యత్ఫలావాప్తిత శ్చోర్ధ్వంఫలంనాకాంక్ష తేపరం।అతశ్చాకామకామత్వం కైవల్యస్య చకథ్యత' ఇత్యవధార్యమ్॥ సాక్షిణ స్త్రివిధాః ప్రోక్తా శ్శాస్త్రం వేద స్స్వయంఖలు। తత్రియుక్తిశ్చసంవాద స్సత్యం తస్మన్యతేఽఖిల' మిస్మృత్వా న్తరాదప్యవగన్తవ్యమ్॥ ౧౦॥

## —♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

ఫలాపేక్షను వదలినను శ్రద్ధచేఁ గర్మల నావశ్యకముగాఁ జేయ వలయునని ఇతిహాసముతోఁడఁ బురాతన సంవాదమును జెప్పుచున్నాఁడు జ్ఞానఫలము దొరకినతర్వాత మఱొక ఫలమునుగోరక యకామకాముఁడై కైవల్యమును బడయుచున్నాఁడు. పద్మపురాణమందు యజ్ఞమునకు మూల కారణములు వేదము అగ్ని బ్రాహ్మణుఁడు, అనిచెప్పఁబడినందున సృష్టి కర్త యజ్ఞములతోఁగూడఁ బ్రజలను సృష్టించి మీరీయజ్ఞముచే నుత్పత్తి సేయుఁడు, మీకీయజ్ఞము కామధేనువువలెఁ గోరిన కోర్కెల నొసంగునని వచించెను. (జలఘాతాదికమువోలె వ్యర్థమైనకర్మను జేయఁగూడ'దను న్యాయమునుబట్టి, ఫలకాంక్షలేని కర్మతో నేమిలాభమన, 'ఏఫలమును బొందినతరునాత నరుఁడు వేఱొకఫలమును గాంక్షింపఁడో, కైవల్యము నకుఁ గోరికలను గోరకుండుటయను నాఫలము చెప్పఁబడుచున్నది? అని యెఱుంగవలెను. సాక్షులు శాస్త్రము, వేదము నాత్మానుభవమునిమువ్వురు. శాస్త్రమున యుక్తియు వేదమున సంవాదమును, నాత్మానుభవమున సత్యమును బ్రమాణములు.)॥ ౧౦॥

శ్లో॥ దేవాన్ భావయతానేన తే దేవా భావయన్తు వః।
పరస్పరం భావయన్త శ్శ్రేయః పర మవాప్స్యథ॥ ౧౧॥

## —♦ భాష్యమ్ ♦—

నను కథ మిష్టకామపూరకత్వం యజ్ఞస్యేతి తత్రాహ। దేవానితి। తత్రైవం సత్యనేన యజ్ఞేన యూయం యజమానా హవిర్భాగై ర్దేవా నిన్ద్రాదీన్ భావయత తే చ దేవా యుష్మాభి ర్భావితా స్సన్తో వో యుష్మాన్ భావయ న్త్వి త్యర్థః । ఏవం వృష్ట్యాదినాన్నోపపత్తిద్వారేణాన్యోన్యం

సంవర్థయన్తో దేవా యూయం చ పరం శ్రేయః ప్రాప్స్యథేత్యర్థః॥ ౧౧॥

—♦ ఆన్ధ్ర తాత్పర్యము ♦—

యజ్ఞముచే నిష్టకామసిద్ధి యెట్లనఁగా? యజ్ఞముచే యజమానులయిన మీరు హవిర్భాగములచే నింద్రాది దేవతలను బెంపొందింపుఁడు. మిమ్మా దేవతలు వర్షములు కురిపించి అన్నోత్పత్తిని గలిగించి పెంపొందింతురు. ఇట్లొకరి నొకరు పెంపొందించుకొనుచు శ్రేయము నొందఁగలరు॥ ౧౧॥

శ్లో॥ ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః।
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః॥ ౧౨॥

—✻ భాష్యమ్ ✻—

తత్ర న కేవలం పారమార్థికమేవ ఫలం యజ్ఞైః కిన్త్వైహికమపీత్యాహ—ఇష్టానీతి॥ ఏవం తర్హ్యైహికానపి పశ్వన్నహిరణ్యాదీన్ భోగాన్ వో యుష్మభ్యం యథోక్తయజ్ఞభావితా దేవా హి యతో దాస్యన్తే అత స్తైర్దత్తాన్ భోగానేభ్యో దేవేభ్యోఽప్రదాయ యో భుఙ్క్తే స్తేన ఏవ తస్కర ఏవేత్యర్థః॥ ౧౨॥

—♦ ఆన్ధ్ర తాత్పర్యము ♦—

యజ్ఞములచేఁ గేవల పారమార్థిక ఫలమే గాదు. ఐహిక ఫలమును గలదని చెప్పుచున్నాఁడు. యజ్ఞములు మున్నగు వానిచేత దేవతలను మీరానందపెట్టినచో మీకు వారు పశువులు, అన్నము, హిరణ్యము మొదలయిన భోగముల నొసంగుదురు. వారొసఁగిన భోగములను ఆ దేవతల కర్పణ చేయక తామే భుజించినచోఁ జోరులు గాక మానరు. అట్టి

చౌర్యము గలవారు పరమ పురుషార్థమునకుఁ దగనివారగుటె కాక నరకమును గూడఁ బొందఁగలరని యభిప్రాయము. ॥ ౧౨॥

శ్లో॥ యజ్ఞ శిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః।
భుంజతే తే త్వఘం పాపా యే పచన్త్యాత్మకారణాత్ ॥౧౩॥

—◆ భా ష్య మ్ . ◆—

అథ స్వస్య ధర్మనిష్ఠయా యజ్ఞకర్తు ర్బహుతరఫల మస్తీత్యాహ—యజ్ఞ శిష్టేతి॥ ఏవంసతి యే తు వైశ్వదేవాది యజ్ఞావశిష్ట మమృత మశ్నంతితఏవ సంతో వేదోక్త కర్మ కారిత్వేన మహాన్త స్తే చ పూర్వకృతైః పంచ సూనాది నిమిత్తైశ్చ కిల్బిషై ర్ముచ్యంత ఇత్యర్థః । తత్ర యేత్వా త్మ కారణాదేవ పచంతి తేషాం వ్యతిరేకేణ దోషమప్యాహ । భుంజత ఇతి। తథా చ స్మృతిః। 'కండిసీ పేషణీ చుల్లీ ఉదకుంభీ చ మార్జనీ। పంచ సూనా గృహస్థస్య తాభి స్స్వ ర్గం న విందంతి॥' ఏవం పంచసూనాకృత మన్య చ్చాఘం యజ్ఞైర్వ్య పోహతీతి శ్రుతిశ్చే త్యవధార్యమ్। ౧౩॥

—◆ ల ఘు టి ప్ప ణీ . ◆—

పంచసూనేతి॥ మశకార్థో ధూమ ఇతివత్పంచభిస్సూనా జన్మమరణాదినివృత్తి ర్గృహస్థాశ్చాత్ర కృతాభిస్తాభి స్స్వర్గమేవనవిందంతికుతఃపునః కైవల్యం గమిష్య స్తీతి భావః స్మృత్యంతరంచ॥ 'తపసాం వర్ధకో యస్మాత్కామానాం చ ప్రపూరణాత్।సర్వధర్మాశ్రయో యస్మా ద్ధర్మమూలో గృహాశ్రమీ'తి శ్రుతిశ్చ॥ 'అత్యాశ్రమిభ్యః పరమం పవిత్రం ప్రోవాచ

సర్వం ఋషిసంఘపుష్ట' మిత్యస్మిన్నేవాశ్రమే కుటీచకాదీనా మంతర్భావ ఇత్యధికం వర్ణాశ్రమధర్మనిరూపణే ద్రష్టవ్యమ్॥ ౧౩॥

—◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము. ◆—

స్వస్వవర్ణాశ్రమధర్మ నిష్ఠచే యజ్ఞము చేయువానికి మిక్కిలి ఫలము గలదనిచెప్పుచున్నాఁడు- ఆశ్రమములలో నెల్లను త్తమమైనదిగృహస్థాశ్రమము. అది ధర్మమూలము. తపముల వృద్ధిచేయునది. కోరికలఁ బూర్తిచేయునది. అంత్యాశ్రమముకన్నను బరమపవిత్రమైనది. సమస్తఋషిసంఘములను బోషించుచున్నది. కనుకనే 'ధన్యో గృహస్థాశ్రమః, అనిస్మృతులు చెప్పినవి. అట్టి గృహస్థుఁడు స్వధర్మమును బాటించి విధిప్రకారముతో యజ్ఞముజేసినచో వాఁడు గొప్పఫలమును బొందఁగలడు. ఎవరు వైశ్వదేవ యాగమును చేసి, శేషించిన యమృతమును భుజించుచున్నారో వారే సత్పురుషులు. వేదోక్తకర్మల నాచరించి నందువలన వారే మహాత్ములు. పూర్వమందుఁ జేసిన పంచసూనముల నెడిపాపములచే విముక్తులయి స్వర్గము నే కాక మోక్షమును సయితము, బొందఁగలరు. పంచసూనములనఁగా! సమ్మార్జనముచేసి నందువలనను, కూరలు తరిగినందువలనను, పచ్చళ్ళురుబ్బి నందువలనను, ప్రొయ్యిమంటచేసినందువలనను, వంటచేసినందువలనను పచ్చెడిపాతకములు. ఇవి స్వర్గమును బొందనీయవు. యజ్ఞములచేఁ బంచ సూనములేగాక యితరమైన పాతకములును, హరింపఁబడును. వంట చేయుట దేవతలకొఱకుఁగాని తమనిమిత్తము గాదు. ఎవరు తమనిమిత్తమై వంటచేసి కొందురో యట్టిపాపాత్ములుమతికొంతపాపమును బొందుదురు.

శ్లో॥ అన్నాద్భవన్తి భూతాని పర్జన్యా దన్నసంభవః।
యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః॥ ౧౪

—◆ భా ష్య మ్ ◆—

నను కథం యజ్ఞస్య సర్వజగన్మూలత్వమితి స్పష్టమేవ దర్శయతి-అన్నాదితి। ఏవంతర్హి 'అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్య

గాదిత్య ముపతిష్ఠతే ఆదిత్యా జ్జాయతే వృష్టి ర్వృష్టే రన్నం తతః ప్రజాః' ఇత్యాదిమనువాక్యాద పృన్నాద్భుక్తా ద్రేతోలోహితరూపేణ పరిణతాద్భూతాని భవన్తీ త్యర్థః ఏవంపర్జన్యా ద్వృష్టేరన్నం యజ్ఞాచ్చాగ్నిహోత్రాదేః పర్జన్య మృత్విగ్యజమానవ్యాపారసాధ్యో యజ్ఞశ్చ కర్మసముద్భవఇతి పరమార్థః॥ ౧౪॥

## ఆన్ధ్రి తాత్పర్యము.

యజ్ఞము సర్వజగన్మూలమనిస్పష్టముచేయుచున్నాఁడు. 'యజ్ఞమున నగ్నియందుఁజేయు హోమము సూర్యునిఁబ్రాప్తించును. సూర్యునివలన వర్షముగలుగుచున్నది. వర్షమువలన అన్నము, అన్నమువలన ప్రజలు పుట్టుదు'రని మనుస్మృతి.భుజించిన యన్నము శుక్లశోణితముగాఁ బరిణమించును. దానివలన భూతములు పుట్టుచున్నవి. పర్జన్యునివలన నన్నము, యజ్ఞసంబంధమగు యగ్నివలన పర్జన్యుఁడు. ఋత్విగ్యజమానసాధ్యమైన యట్టి యజ్ఞము కర్మసాధ్యమైనది. భూతంబులన్నంబువలనను; అన్నంబు మేఘునివలనను మేఘుఁడు యజ్ఞమువలనను, యజ్ఞము కర్మంబువలనను బొడముచున్నదని తాత్పర్యము॥౧౪॥

శ్లో॥ కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవం ।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥ ౧౫.

## భాష్యమ్

ననుకర్మాపి కస్మాదుత్పన్న మిత్యాహ—కర్మేతి॥ ఏవంసతి । 'అస్య మహతో భూతస్య నిశ్వసిత మేత' దిత్యాది శ్రుత్యైహాముత్ర సాధకం సకలం కర్మబ్రహ్మ వేద స్తత్ప్రయో

జకో హిరణ్యగర్భశ్చ తయో రుద్భవం తదుద్భవం భవతీత్యర్థః
ఏవం హిరణ్యగర్భాభిఖ్యో యో బ్రహ్మా ప్రజాపతి రపి విశ్వా
ధికో రుద్రో మహర్షి ర్హిరణ్యగర్భం జనయామాస పూర్వ
మిత్యాది శ్రుత్యా చ 'నక్షీయతే న వా క్షరతీ' త్యక్షరాత్
సదాశివా త్పరబ్రహ్మణ స్సముద్భూతమితి 'రుద్రస్త్వాత్మా శరీ
రిణా'మితి స్మృతిన్యాయేన సర్వత్ర యజ్ఞే ప్రతిష్ఠితమ్ । తదేవ
రుద్రాఖ్యంబ్రహ్మ న తు దక్షవదన్యప్రతిష్ఠిత మిత్యవధార్యమ్॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

కర్మయెవరివలనఁ బుట్టినదనఁగా— పరబ్రహ్మమైన సదాశివుని
నిట్టూర్పువలన వేదము పుట్టినది. అందువలన ఇహపరలోకసాధకమైన
సకల కర్మలు పుట్టెను. పరమేశ్వరుఁడు వేదముచేత ముందుగా హిరణ్య
గర్భుని సృజించి వేదములుపదేశించెను. అట్టి పరమాత్మయైన రుద్రుఁడే
సర్వజీవులకు నాత్మరూపముగానుండి యంతటను వ్యాపించి యజ్ఞమందు
నుబ్రతిష్ఠించియుండెను. దక్షునివలె యజ్ఞమందు రుద్రేతరదైవమున్నదని
తలపఁగూడదు. 'అవో రాజాన మధ్వరస్య' ఇత్యాది శ్రుతులవలనఁ దెలియ
నగును. ౧౫.

శ్లో॥ ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీ హ యః।
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ! స జీవతి॥౧౬

—♦ భా ష్య మ్. ♦—

నన్వేవం చేత్తతో ధర్మశీలైః కిం కరణీయ మస్తీత్యా
హ—ఏవమితి । తత్రైవం సత్యాదావథ 'యోఽయమాత్మా
సర్వేషాం సాక్షీ తతః ప్రజాపతి రభూ త్తతశ్చ ధర్మోత్పాదకో

వేదో ధర్మాచ్చ పర్జన్య' మిత్యాది శ్రుత్యా పరమాత్మనా ప్రవర్తితం చక్రం యో నానువర్తయతి స చాఘాయుః పాప జీవనమేవ మోఘం వ్యర్థమేవ స జీవతి యతఇంద్రియారామో హేపార్థ! తస్య జీవాన్మరణమేవ న్యాయ్యం యతో జన్మాంతర త్వావచ్ఛేదేన కదా చిద్ధర్మానుష్ఠాన సంభవాదితి భావః॥ ౧౬॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

తతః ప్రజాపతిరితి॥ 'విశ్వాధికో రుద్రో మహర్షిః హిరణ్యగర్భం జనయామాస పూర్వ'మితి సమనన్తరమేవోక్త మిత్యపి న విస్మర్తవ్యమ్॥

—◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము . ◆—

ధర్మశీలురేమి చేయవలయుననఁగా - పరమాత్మచే నడిపింపఁబడిన యీజగచ్చక్రము ననుష్ఠించవలయును. ముందుగా సదాశివునివలన ప్రజాపతి సృష్టింపఁబడెను. అతనివలన ధర్మోత్పాదకమైన వేదము, వేదమువలన యజ్ఞము, యజ్ఞమువలన వర్షము, వర్షమువలన నన్నము, ఈప్రకారము సాధనమైన ఈచక్రము నెవఁడనుష్ఠింపఁడో అనఁగా, యజ్ఞశేషాన్నము చేదేహధారణముచేయఁడో, వాఁడు పాపాయువు గలవాఁడగును. కావుననే వాఁడు ఆత్మారాముఁడుగాక ఇంద్రియారాముఁడగుచున్నాఁడు. యజ్ఞదేహముచే దేహమును బోషింపమిచే సత్వవృద్ధిలేక రజస్తమము లుద్రేకింపఁగా నాత్మదర్శన విముఖుఁడై విషయభోగములందే యాసక్తుఁడగుచున్నాఁడు. కాన వానిబ్రతుకు వ్యర్థము. ఓయర్జునా! ధర్మానుష్ఠానమును జేయని వాఁడు జీవించుటకన్న మరణించుటయే మంచిది.॥ ౧౬॥

శ్లో॥ యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః।
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే॥ ౧౭॥

—* భాష్యమ్ *—

నను అభ్యుదయార్థం నిశ్శ్రేయసార్థం ప్రత్యవాయ పరిహారార్థం వాత్మవిద శ్శరీరాధ్యాస రహితస్య జడభరతాదేరివ నాపేక్షితం కర్మతదాత్వాహ - య స్త్వితి॥ ఏవంత ర్హి ఆత్మన్యేవ రతిః ప్రీతి ర్యస్య స తథా భూత స్తథా తజ్జ న్యైవ తస్మిం స్తృప్తి స్సతథా భూత ఆత్మన్యేవ పరమానందసందోహే దేహాదిభావం పరిహృత్య దూరాదితి స్మృతి న్యాయేన సంతుష్ట స్తస్య దేహాధ్యాస రహితస్యాధికార హేత్వభావాత్కిమపి కార్యం లౌకికం వైదికం వా న విద్యత ఇత్యర్థః॥ ౧౭॥

—♦ లఘు టిప్పణీ ♦—

శరీరాధ్యాసేతి॥ తత్రైవం సతి న హి సుషుప్తౌ విస్మృతశరీరస్య కించిత్కర్మాధికారఇతి కుతః పునర్ధ్యానేన విస్మృత శరీరస్య సమీక త్సర్వాద్యాలంభనప్రీతిఃరిత్యవధార్యమ్॥ పున రుత్థాన దశాయాం శరీరాధ్యాసే తు శరీరం తదధికంవా కర్మకర్తుః కా క్షతిః 'నకర్మాణి త్యజేద్యోగీ కర్మభి స్త్యజ్యతే హ్యసౌ' ఇతిస్మృత్యం తరాదితి బోధ్యమ్॥ ౧౭॥

—♦ ఆ న్వ్ధ్రి తాత్ప ర్య ము ♦—

అభివృద్ధికొఱకుఁ గాని ముక్తికొఱకుఁగాని ప్రత్యవాయ పరిహారార్థముగాని జడభరతాదులవలె శరీరభావము లేక ఆత్మనిష్ఠయందున్నవానికిఁజేయవలసిన కర్మ యేమియు లేదనఁగాఁ జెప్పుచున్నాఁడు—సుషుప్తియందు శరీరము మఱచినవానికిఁ గర్మాధికారము లేనప్పుడు ధ్యానమెందుకుఁ జేయవలయుననఁగా జాగ్రదవస్థయందు శరీరాధ్యాస గలిగినప్పుడు అందుఱకుఁ దగిన ధ్యానము గాని శరీరమునకు మించిన సమాధిగాని చేసినందున

పొనిలేదు. ఎవ్వండాత్మ యందభిలాష గలవాఁడై ఆత్మచేతనే తృప్తుఁడై దేహభావము వదలి యాత్మానందమనుభవించునో వానికి లౌకికవైదిక కర్మలతోఁ బనిలేదు॥ ౧౭॥

శ్లో॥ నైవ తస్య కృతే నార్థో నాకృతే నే హకశ్చన।
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థ వ్యపాశ్రయః॥ ౧౮॥

—♦ భాష్యమ్. ♦—

అథ తస్యాప్తకామస్య సర్వథా నిరపేక్షస్యాపి వృత్తి మాహ—నైవ తస్యేతి॥ ఏవం సతి లోకసంగ్రహార్థం కుర్వన్నపి తస్య కృతేన కర్మణార్థః ప్రయోజనం నాస్తి యతో న చాస్యేత్యాది రర్థః। తదుక్తం భాగవతే॥ 'దేహంచ నశ్వర మవస్థిత ముత్థితంవా సిద్ధో న పశ్యతి యతో ధ్యగమత్స్వరూప' మిత్యాది ద్రష్టవ్యమ్ ॥౧౮॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

నిరపేక్షుఁడైన జ్ఞానియొక్క వ్యాపారమును జెప్పుచున్నాఁడు—జ్ఞాని లోకసంగ్రహార్థమైన కర్మలు చేసినను ఫలములేదు. చేయకున్నను నష్టముండదు. జ్ఞానికిఁ జీమమొదలు బ్రహ్మవఱకు నున్న ప్రాణులలో నెవరినైనను నాశ్రయింపవలసిన పనియుండదు. ౧౮

శ్లో॥ తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర।
అసక్తో హ్యాచర న్కర్మ పర మాప్నోతి పూరుషః॥ ౧౯

—♦ భాష్యమ్ ♦—

నను నాహం దేహాధ్యాసరహితో న వా మే కించిత్ప్రయోజన మస్తీ త్యాహ—తస్మాదితి॥ తత్రైవం సత్య సక్తః

ఫలాభిసంధిరహిత స్సన్కార్య మవశ్యం శ్రుతిచోదితం కర్మ సతతం యావజ్జీవం సమాచరేత్యర్థః । అసక్తోహి యస్మా దీశ్వరార్థ మాచరన్కర్మ పరమమోక్ష మవాప్నోతీతి సఏవ సత్పురుషో నాన్య ఇత్యభిప్రాయః॥౧౯

—♦ లఘుటిప్పణీ ♦—

నాన్యఇతి॥ అన్యథాకుర్వన్నేవేహ కర్మాణీత్యాది శ్రుత్యుల్లంఘన ప్రయుక్తాసత్పురుషార్థతా పత్తేరిత్యవధార్యమ్॥ ౧౯॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

ఓయీ! నేను దేహాభిమానరహితుడఁగాను. నాకేమియు గొంచెమైనను బ్రయోజనము లేదనఁగాఁ జెప్పుచున్నాఁడు-ఫలాభిసంధి రహితుఁడవగుచు వేదవిహిత కర్మను యావజ్జీవము చేయుము. అనాసక్తుఁడై ఈశ్వరార్పణ ముగాఁగర్మజేయువాఁడు మోక్షము నొందగలఁడు. వాఁడే సత్పురుషుడు కానియితరుఁడుగాఁడు. అట్లు చేయనివానికి వేదమును ధిక్కరించిన పాపముచేమోక్షము రాకపోవుటయే కాక నరకమువచ్చును॥ ౧౯॥

శ్లో॥ కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః।
లోకసంగ్రహమేవాపి సంపశ్య న్కర్తు మర్హసి॥ ౨౦

—* భాష్యమ్ *—

నను తత్త్వజ్ఞానవత స్తథైవాజ్ఞానిన శ్చావశ్యం కర్మ కర్తవ్యమేవేతి కిమర్థమాగ్రహ ఇత్యాహ-కర్మణైవేతి తత్రైవం సతి 'మలినే భూతలే యద్వన్ముఖం నైవావభాసతే కర్మణా కామత శ్చాంత స్తద్వదాత్మా న భాసత' ఇతి స్మృతి న్యాయేన కర్మణైవేహాముత్ర కైవల్యాంతస్య సిద్ధిర్యుక్తేతి తద

వశ్యం జనకా జాతశత్రుప్రభృతయోఽపి యథోక్త కర్మణైవ సిద్ధిం ప్రాప్తా ఇత్యాశయః॥ ౨౦॥

—◆ లఘుటిప్పణీ ◆—

కామతశ్చేతి॥ తత్రైవంసతి కామతస్స కామరూపేణ బాహ్యావృత్తిత్వేన కర్మణా మలినాంతఃకరణస్య తత్వమస్యాదివాక్యజ జ్ఞానినా ప్యాత్మా శివో హృదయేన భాసత ఇత్యర్థః ॥౨౦॥

—◆ ఆన్ధ్రతాత్పర్యము ◆—

ఓయీ? అజ్ఞానియుఁ తత్వజ్ఞానియు నవశ్యమైన వేదోక్తకర్మలు చేయవలసినదనఁగా నాగ్రహ మెందులకో చెప్పుచున్నాఁడు-మలినమైన భూమియందుఁ బ్రతిబింబము గాన్పింపక స్వచ్ఛమైన దర్పణమందుఁ గనుపించినట్లుకామ్యకర్మలచే మలినమైన యంతఃకరణయందు ఆత్మప్రకాశము గనఁబడక నిష్కామకర్మచే శుద్ధాంతఃకరణయందుఆత్మభాసించును. కర్మచేతనేఇహమందష్టసిద్ధులు. (అణిమాదులు)పరమందుకైవల్యము సిద్ధించునని జనకుడు మొదలగు వారలు వేదవిహిత కర్మలాచరించి సిద్ధిని బొందిరి. అట్లుగాకున్న లోకసంగ్రహార్థమైనను గర్మల నొనర్ప నర్హుఁడవు. (సకామ కర్మలచే మలినాంతఃకరణుఁడైనవానియొక్కయుఁ దత్వమస్యాది మహావాక్యములచే నిర్మలాంతఃకరణుఁడైన వానియొక్కయు హృదయము నందు నాత్మస్వరూపుఁడగు శివుఁడు ప్రకాశించును. ౨౦.

శ్లో॥ యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥ ౨౧

—◆ భాష్యమ్ ◆—

నను కర్మణి క్రియమాణేఽపి కథం లోకోప్యవశ్యం కరిష్యతీతి జానీమ ఇత్యాహ—యద్యదితి॥ ఏవంతర్హి 'సర్వే

రాజాశ్రితా ధర్మా లోకధర్మస్యసాధకాః' । ఇత్యాదిస్మృతాః స యల్లౌకికం వైదికం వా ప్రమాణం కురుతే లోకోపి తదేవానువర్తతే । నతు స్వాతంత్ర్యేణేతి త్వయాపితదర్థం తత్కర్తవ్యమేవేత్యవధార్యమ్॥ ౨౧॥

—♦ లఘుటిప్పణీ. ♦—

ధర్మస్యేతి॥ 'రాజర్షిశ్చైవ బ్రహ్మర్షి ర్ధర్మమూలం ద్వయంమతమ్ తయో ర్ద్వైవిధ్యమాపన్నే కథం ధర్మశ్చరిష్యతీ' త్యాది ద్రష్టవ్యమ్॥ ౨౧॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

ఓయీ నీవు చేసిన పనిని లోకమెల్లఁ దప్పక చేయునని యెట్లు తెలిసికొందువనఁగాఁ జెప్పుచున్నాఁడు—రాజావలంబితధర్మములే ప్రజావలంబన ధర్మములు. అతఁడు, 'యథా రాజా తథా ప్రజాః' అన్నట్లు లౌకిక కర్మను గాని వైదిక కర్మను గాని దేనిని ప్రమాణముగాఁ జేసికొనునో లోకమును దానినే యనువర్తించుచున్నది స్వాతంత్ర్యముగా నెప్పుడు నడువదు. లోకమందు ధర్మమును నడిపించువారలు రాజర్షి బ్రహ్మర్షి యనువారిద్దరు. వీరు భిన్నమార్గములో నడచిరేని లోకమున ధర్మము ప్రవర్తింపఁజాలదు. కావున నీవు ప్రజలకొఱకై కర్మచేయవలయును, ౨౧.

శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం వర్తఏవ చ కర్మణి॥ ౨౨

—♦ భాష్యమ్ ♦—

అత్రత్వహమేవ ప్రథమతో దృష్టాంత ఇత్యాహ— నమఇతిత త్రైవంసతి హేపార్థ! త్రిష్వపిలోకేషుమమకర్తవ్యంకిమపి

నాస్తి యతోఽనవక్లుప్తం ఫలం కించిన్మయా వాప్తవ్యం నాస్తి తథాపి కర్మణ్యహ మిహాముత్ర శ్రేయస్కామాయ యశోర్థం లోకానుగ్రహాయ చ వర్త ఏవే త్యర్థః॥౨౨॥

—◆ ల ఘు టి ప్ప ణీ. ◆—

కిమపీనాస్తీతి॥ సదాశివస్య వరప్రసాదేన త్రిషు లోకేషు మమ కర్తవ్యం నాస్తీత్యర్థః। తదన్యథా 'మత్ప్రసాదా న్మనుష్యేషు దేవగంధర్వ యోనిషు। అప్రమేయబలాత్మా త్వంనారాయణ! భవిష్యసీ' త్యాదినా ద్రోణపర్వణి సదాశివేనో క్తత్వాదితిభావః॥౨౨॥

—◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ◆—

ఇందులకు నేనే ముందుగా దృష్టాంతమని చెప్పుచున్నాఁడు - ఓ యర్జునా! సదాశివునియొక్క వరప్రసాదముచేత మూఁడులోకముల యందు నాకు చేయవలసిన పని కొంచెమైనను లేదు. పొందరానిది గాని, పొందదగినది గాని లేదు. అయినప్పటికి ఇహపరములయందు శ్రేయస్సును గోరి కీర్తికొఱకు లోకానుగ్రహముకొఱకు నేనే కర్మముల యాచరించుచుంటిని. (సదాశివుని వరమేమనఁగా ద్రోణపర్వమందు, ఓ నారాయణా! నీవు దేవగంధర్వయోనులయందుఁ బుట్టి యమితమైన బలము గలవాఁడవగుదువని సదాశివుని వరము.)॥౨౨

శ్లో॥ యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః।
మమ వర్త్మా నువర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః॥౨౩॥

—◆ భా ష్య మ్ ◆—

నను చ లోకసంగ్రహోఽపి త్వయా నకర్తవ్యో నిష్ఫలత్వా దితిచే త్తత్రాహ - యదీతి। ఏవంసతి యది పునరహ

మతంద్రితోఽనల స్సన్కర్మణి జాతునామ కదాచి న్నవర్తేయం । తదా మమ సతో వర్త్మ మార్గం హేపార్థ! మనుష్యాః కర్మాధికారిణ స్సర్వశ స్సర్వప్రకారై ర్వర్తంతే తే చ నానువర్తేర న్నిత్యర్థః ।౨౩॥

—* లఘు టి ప్ప ణీ *—

మమవర్త్మేతి॥ నను తవ కింవర్త్మేతిచే చ్ఛృణు । 'దేవతాసార్వభౌమస్తు మహాదేవ శ్శ్రుతిస్మృతః । తతో వయం తు సర్వేవై మహాదేవస్య సేవకాః' । ఇత్యాదినా స్కాందే మయై వోక్తత్వాదితి భావః॥౨౩॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ లోకసంగ్రహాకర్మచేత ఫలములేనందునఁజేయవలదంటివా! చెప్పెద వినుము-నేను మందుఁడను గాక ఒకానొకప్పుడైనను కర్మ చేయకుంటినా అప్పుడు నాయొక్క మార్గమును గర్మాధికారులైన మనుజులు చేయక నన్ననుసరించిచెడిపోవుదురు. కర్మలలోకెల్లముఖ్యమైనది, ఈశ్వరారాధన. అదిచేయక జ్ఞానమురాదు. 'ఈశ్వరానుగ్రహా దేవ పుంసా మద్వైత వాసనా' అని శుకమహర్షి వచించి నట్లు భాగవతమునందుఁ గలదు. శుకుడు ఈశ్వరానుగ్రహామువల్లనే ముక్తి నొందినాఁడు. శివారాధన చేయక యనుగ్రహాము సంపాదింపలేము. దేవతల కందఱకును సార్వభౌముఁడు మహాదేవుఁడని శ్రుతులందుఁ జెప్పఁబడినది. మే మందఱమును నాతని సేవకులము. కాన లింగరూపుఁడైన మహాదేవుని నర్చింపవలెను. ఆలింగములు చరస్థిర భేదముచే రెండు విధములు. అందు స్థిరలింగమందు చరముకన్న దశగుణాధికమైన ఫలము గలదు. వైదిక శైవ సిద్ధాంతప్రకారము పూర్వశైవదీక్షచే సమయాది దీక్షలనొంది స్థావర లింగార్చన చేయువాఁడు ఆ జన్మమునందే ముక్తినొందును 'త్ర్యంబకం యజామహే' యను శ్రుతి దోసపండు తొడిమను నదలినట్లు శివారాధకుఁడు సంసార బంధమునుండి ముక్తుఁడగును॥ ౨౩॥

శ్లో॥ ఉత్సీదేయు రిమేలోకా నకుర్యాం కర్మచే దహం।
సంకరస్య చ కర్తాస్యా ముపహన్యా మిమాః ప్రజాః॥ ౨౪॥

—♦ భా ష్య మ్ ♦—

నన్వేవమపి నకుర్యా చ్చేతర్హి కింస్యాదిత్యాహ—ఉత్సీదేయురితి॥ ఏవంతర్హి 'అనుమంతాఽనుద్రష్టాచ సాక్షీ చై వాను మోదకః। కర్తా కారయితా చైతేషడ్వై కర్మానుగా స్మృతా' ఇత్యాదిస్మృత్యా యద్యయం యథోచితం వేదానుగం పీతాంబరం త్రిపుండ్రం చేత్యాది పుత్రాద్యర్థం కర్మ నకుర్యాం తదా లోకస్థితిహేతోః కర్మణో లోపేన మేస ర్వేలోకాః మమ వర్త్మానువర్తినో వినశ్యేయు రిత్యర్థః। తతశ్చ వర్ణసంకరస్య చ కర్తాహమేవ తస్యాం తేన చేమా స్సర్వాః ప్రజా అహమేవోపహన్యామిదానీం తవ సాక్షిత్వాదితిభావః॥ ౨౪॥

—✱ ల ఘు టి ప్ప ణీ ✱—

పుత్రాద్యమితి॥ "భగవన్ దేవకీ పుత్రో బ్రహ్మణ్యో భక్తవత్సలః సదాశివప్రసాదేన లేభే పుత్రాన్స హస్రశః॥" ఇత్యాది భవిష్యోత్తరే ద్రష్టవ్యమ్॥ ౨౪॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ లోకము చెడిపోయినను నేను కర్మలు చేయకపోవుచునేని యేమగునంటివా? చెప్పెద వినుము-సుకర్మ దుష్కర్మలను జేయువాఁడును చేయించువాఁడును ప్రేరకుఁడును ఆమోదించువాఁడును చూచువాఁడును, సాక్షియు నీయా ర్గురును సమానఫలభాక్కులు. నేను వేదచోదితమై

పుత్రోత్పత్తి నిమిత్తమైన కర్మను జేయకుండినచో లోకవృద్ధి హేతువైన కర్మలు లోపింప లోకులు నాయాచారము ననుసరించి నశించిపోఁగలరు. అప్పుడు వర్ణసంకరమును జేసినవాఁడను నే నగుదును. దానిచే నిప్పుడు నీకు సాక్షినగుటవలన నీప్రజల నందఱిని జెడఁగొట్టిన వాఁడనగుదును! నేను ఈశ్వరారాధనచేసి సదాశివ వరప్రసాదముచే సాంబుఁడు మొదలైన వేలకొలంది పుత్రులంగంటి ననిచెప్పెను. (భక్తవత్సలుఁడు బ్రహ్మణ్యుఁడును నయిన కృష్ణుఁడు సదాశివుని యనుగ్రహముచేవేలకొలఁది పుత్రులం గనెనని భవిష్యోత్తర పురాణము 'శౌరేః కైలాసయాత్రావ్రతముదిత తయాభీష్ట సంతాన దానాత్' అను స్మృతివలనను 'మహేశాన్నాపరో దేవః' అను స్మృతివలనను విష్ణువునకు ననేక పర్యాయములు వరములనిచ్చుట చేతను మహేశ్వరునికంటె నుత్కృష్టదైవము లేదు గాన నతని యారాధించినవారు ధర్మార్థకామమోక్షములను బడయఁగలరు.)॥ ౨౪॥

శ్లో॥ శక్తాః కర్మణ్య విద్వాంసో యథా కుర్వంతి భారత ?
కుర్యా ద్విద్వాం స్తథాసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్॥౨౫॥

—♦ భా ష్య మ్ ♦—

నన్వజ్ఞవత్ జ్ఞానవానపి యది కర్మకుర్యాత్తర్హి తయోః కో విశేష ఇత్యాహ శక్తాఇతి॥ తత్రైవంసతి హేభారత? ఫలాభిసంధియుక్తా యథాఽజ్ఞాః కర్మకుర్వంతి తథైవ బ్రహ్మవేత్తా విద్వానపి లోకోఽప్యేవం కుర్యాదితి లోకసంగ్రహం చికీర్షుః కుర్యాదేవేత్యర్థః॥ ౨౫॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

భారతేతి॥ అత్రభారతేతి సంబోధనేన భరతవంశోద్భవత్వేవ భాజ్ఞానాఖ్యా చిదంబరదీప్తి స్తస్యాం రతత్వేన వా త్వం యథోక్త శాస్త్రబోధయోగ్యోఽసీ త్యుక్తం భవతీతిభావః॥ ౨౫॥

## —♦ అన్వితార్థము ♦—

ఓయీ అజ్ఞానివలెనే జ్ఞానవంతుఁడును గర్మచేసినయెడలవారిద్దరిలో విశేషమేమంటివా? చెప్పెదవినుము. ఓభారతా? అనుసంబోధన భరతవంశమందు పుట్టినవాఁడనియు, 'భా' అనఁగా, చిదంబర ప్రకాశము నందాసక్తిగలవాఁడనియునర్థము. కర్మఫలమునందిచ్ఛగల యజ్ఞాను లెట్లు కర్మములనొనర్చుచుందురో అట్లు జ్ఞానులు కర్మఫలమునం దిచ్ఛలేని వారగుచు లోకులందఱు నిట్లాచరించవలయునను బుద్ధితోఁ గర్మలను జేయుదురు.॥ ౨౫॥

శ్లో॥ న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినాం
యోజయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్॥

## —♦ భాష్యమ్ ♦—

నను కర్మానుష్ఠానేనైవ లోకసంగ్రహః కర్తవ్యోనతు తత్త్వజ్ఞానినేత్యత్ర కో హేతు రిత్యాహ - నబుద్ధీతి॥ తస్మా దుర్వారుకమివేతి న్యాయేన చాదౌ చిత్తశుద్ధ్యర్థం కామన యాపి కర్తవ్యమేవేత్యజ్ఞానాం కర్మసంగినాం బుద్ధిభేదం నజ నయే త్కింతు విద్వానపి యుక్తస్స న్కర్మ కుర్యాదేవేత్యర్థః॥ అన్యథా. "ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే" ఇత్యాది స్మృత్యుక్తమార్గేణ చ కర్మణోఽకారణాత్॥ "అప్రాప్యజ్ఞానమార్తాండం కర్మజన్యఫలం శుభం, ఇతో భ్రష్టా స్తతో భ్రష్టా ఘాతశ్చైవ చ నిష్ఫలా" ఇత్యాదిస్మృత్యుక్త న్యాయేనో భయతోఽపి భ్రష్టత్వమాపద్యేతే త్యవధార్యమ్.। ౨౬।

## —♦ లఘుటిప్పణీ ♦—

న్యాయేనచే॥ తద్యథా "ఉర్వారుకం యథా ముక్తం స్వయమేవాభిపక్వతః। తద్వద్భృశై ర్వాముక్తస్సన్ బ్రహ్మభూయాయ కల్ప్యతే" ఇతి ఏవంసతియస్తు గార్హస్థధర్మంతరస్ప్రృత్యముదాశ్రిజహేత్యాది పాఖండయుక్తస్సతూభయతోఽపిభ్రష్టఇతి సమనన్తరం వక్ష్యతే। కుర్యాదేవేతి॥ తదేతత్త్వ నిర్ణయేఽప్యుక్తమ్। ప్రవృత్తిరపి విజ్ఞస్య నివృత్తి ముపజాయతే। ఇత్యతో విద్వానపియుక్తంక ర్మకుర్యా దేవేతిభావః॥౨౬॥

## —♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

ఓయీ కర్మానుష్ఠానము చేతనే లోకసంగ్రహము చేయవలయునని తత్త్వజ్ఞానముచేఁ జేయఁగూడదన్నంచులకు హేతువును జెప్పుచున్నాఁడు - దోసపండు దృష్టాంతముచే అజ్ఞులగువారలు చిత్తశుద్ధి నిమిత్తము కామ్య కర్మలను జేయవలసినవారే. అట్టి కర్మయందాశగల యజ్ఞానిని ఆత్మజ్ఞానముగలవాఁడు చలింపఁజేయఁగూడదు. ఆరురుక్షువైన మునియు యోగాభ్యాసరూపమైన కర్మ చేయవలయును. జ్ఞానప్రాప్తి పర్యంతము కర్మలనాచరింపవలయును. ఉభయభ్రష్టులు ఎప్పటికిఁగాఁ గూడదు. తనకు ఫలమున నిచ్చులేకుండినను దాను కర్మలఁజేయుచు మూఢుని చేత గూడ ఎల్ల కర్మలను నాచరింపించు చుండవలయును॥౨౬॥

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః।
అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే॥౨౭॥

నన్వేవ మపి విదుషా మవిదుషాం చ కర్మ కర్తృత్వే కోవిశేష ఇత్యాహ। ప్రకృతేరితి, తత్రైవంసతి॥ "మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినంతు మహేశ్వర" మిత్యాదిశ్రుత్యా యా ప్రకృతి ర్మాయా సత్వరజస్తమోమయీ పార

మేశ్వరీ శక్తి స్తస్యాః ప్రకృతే ర్గుణై ర్వికారైః కార్యకారణ రూపైః క్రియమాణాని లౌకికాని వైదికాని చ కర్మాణి సర్వశ స్సర్వప్రకారై రహంకార విమూఢాత్మా యతః పంచకోశాది వివేకరహితో౽హ మేవ కరోమీతి మన్యతే భృత్యగృంజన భక్షణన్యాయే నాకర్తాపి జీవో దుష్యత ఇతి తాత్పర్యమ్ ॥౨౭॥

—* ల ఘు టి ప్ప ణీ *—

మాయినఇతి 'శివస్యార్ధం స్థితా గౌరీ తదర్ధో హరిరిష్యత' ఇత్యాదిస్మృత్యా తథా ఏకాపి శక్తిః పరమేశ్వరస్యాభిన్నా చతుర్ధావ్యవహార కాలే 'భోగే భవానీ పురుషేచ విష్ణు' రిత్యాది శ్రుత్యుక్తరీత్యా చ మాయినం సదాశివం మహేశ్వరం విద్యాదిత్యర్థః । భృత్యగృంజన భక్షణ న్యాయస్తు॥ ధర్మనిబంధ॥ భక్షితంచేద్యతో యేన గృంజనం లశునం తథా। ప్రాయశ్చిత్త మహోరాత్రం అభుక్తిః స్వామినఃఖల్వి'తి స్మృతి న్యాయే నేత్యర్థః॥ ౨౭॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ! పండితులును నపండితులును గర్మచేయుటలో విశేష మేమంటివా ? చెప్పెదను. మాయను బ్రకృతిగాఁ దెలిసికొనుము. మాయ గలవానినిమహేశ్వరునిఁగా నెఱుఁగుము అప్రకృతి సత్వరజస్తమోగుణాత్మ కమైన పరమేశ్వరునియొక్క శక్తి, అట్టి ప్రకృతియొక్క కార్యకారణ రూపమైన సూక్ష్మచిదచిద్విశిష్టమైన బ్రహ్మకారణము. చిత్ అనఁగా? చేతనము (పశువు) జీవుడు, అచిత్ అనఁగా జడము (పాశము) జగత్తు ఇట్టి పశుపాశములతోఁగూడిన బ్రహ్మమే శివుఁడు కారణము స్థూలచిదచిద్విశిష్ట మైన బ్రహ్మకార్యము ఒకజీవునివల్ల ననేక జీవులుపుట్టెను. ఒకజగత్తువలన ననేకజగత్తులుపుట్టెను: ఇదికార్యము ఇట్టి గుణవికారములచేత అనగా

షడ్భావ వికారముల (అస్తి-జాయతే - వర్ధతే - విపరిణమతే - అపక్షీయతే - నశ్యతి అస్తి పిండరూపముతో గర్భమందుండుట జాయతే జననమగుట వర్ధతే = పెరుగుట విపరిణమతె = బాల్యయౌవన కౌమార వార్ధక్యములుగా మాఱుట అపక్షీయతే=కృశించుట నశ్యతి = కనఁబడక పోవుట) చేత (దేహేంద్రియాదులచేత) చేయఁబడునట్టి లౌకిక, వైదిక, కర్మల నన్నిటిని బంచకోశాది వివేకములేనివాఁడు (అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయా నందమయ, కోశముల వివేకము నెఱుఁగనివాఁడు) నేనేచేయుచున్నానని తలంచును.

1. అన్నమయ కోశమనఁగా అన్నరసమువలనఁ బుట్టి అన్నరసము వలన వృద్ధినొంది, అన్నమయ పృథివియందు లయమగుటంబట్టి యన్నమయ కోశమని జెప్పఁబడును. ఈ కోశమం దాత్మయున్నప్పుడు భ్రిమ గల్గి నేను, మనుష్యుఁడను. స్థూలశరీరిని, ప్రిభువును నని ప్రతీతి యగుచుండును.

2. పా్రిణమయ కోశమనఁగా? పంచ కర్మేంది్రియములు, పంచ పా్రిణములును గలసి ప్రాణమయకోశము, ఇందాత్మయున్నపుడు, భ్రిమ గల్గి, క్షుత్పిపాసలు ప్రతీతి యగుచుండును.

3. మనోమయకోశము. జ్ఞానేంది్రియములతో మనసుగలిగిన, మనోమయకోశము దీనియం దాత్మయున్నపుడు, కోశముతో నేకత్ర భ్రిమగల్గి. దేహము నాది, గృహము నాది, పుతు్రిలు నావారు అని ప్రతీతి యగుచుండును.

4. విజ్ఞానమయకోశమనగా? జ్ఞానేంది్రియములతో బుద్ధికలసిన యగును. ఇందాత్మయున్నప్పుడు, భ్రిమగల్గి నేను జ్ఞానిని, మూఢుండను, అని ప్రతీతి యగుచుండును.

5- ఆనందమయ కోశమనగా? కారణ శరీరమయిన, యవిద్య యందలి, మలినసత్వము, ప్రియమోద వృత్తులతోఁగూడినది. ఇందాత్మ యున్నప్పుడు నేను సుఖవంతుఁడనని ప్రితీతియగుచుండును.

ఈ పంచకోశములే, పంచభూతములు. వీని కధిదేవతలు బ్రహ్మవిష్ణు రుద్రేశ్వర సదాశివులు. వీరి కతీతుఁడైన పరశివుఁడే పరబ్రహ్మము. అట్టి పరశివుఁడు తానసే వివేకము లేక దేహాత్మభ్రాంతిచే (స్థూల దేహము, సూక్ష్మదేహము, కారణదేహము. 1 స్థూలదేహమనగా? కర చరణాద్యవయవములు గలిగి సప్తధాతు (చర్మము, మాంసము, రక్తము, మెదడు- క్రొవ్వు, శుక్లము, యెముకలు) మయమై షడూర్మి (క్షుత్పి పాసలు, జరామరణములు, భయభ్రాంతులున్ను) షడ్భావ (పిండరూప ముగానుండుట, పుట్టుట, వృద్ధినొందుట, అవస్థలుమాఱుట, క్షీణించుట, నశిం చుట) వికారమై జీవుడు బహిర్ముఖమగు మనసుతోగూడి ఇంద్రియమూల కముగా విషయములగ్రహించు స్థితిరూపంబై నవరంధ్రములు (నేత్ర ములు ౨, శ్రోత్రములు ౨, నాసికలు ౨, నోరు. గుదము. గుహ్యము) గలిగి క్రిమికీటక మూత్రపురీషంబుల కునికిపట్టై పంచీకృత పంచమహా భూతములవలనఁ బ్రారబ్ధకర్మానుసారముగా నిర్మింపఁబడిన స్థూలశరీరము జీవుఁడు సుఖదుఃఖముల ననుభవించుటకు నిల్లువంటిది.

2. సూక్ష్మశరీర మనఁగా శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణము లనెడు జ్ఞానేంద్రియము లైదును వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ లనెడి కర్మేంద్రియము లైదును, ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములనెడు వాయువు లైదును మనోబుద్ధులు రెండును, నీపదునేడవ యవములతోఁ గూడిన యపంచీకృత సూక్ష్మభూతములైన శబ్దాదులచే రచింపఁబడిన సూక్ష్మశరీరము జీవుఁడు సుఖదుఃఖముల ననుభవించుటకు సాధనమైనది.

3. కారణ శరీర మనఁగా? అ విద్య. ఇది అనాది. సత్తునుగాదు. అసత్తునుగాదు. సత్తని చెప్పిన యెడల జ్ఞానమువలన నాశము గానేరదు. అసత్తని చెప్పిన యెడల మాయవలన జగదుత్పత్తి గానేరదు. కనుక అనిర్వాచ్య మందురు. ఇదియే కారణశరీరము. స్థూల, సూక్ష్మ, శరీరము

లకు బీజము, అజ్ఞాన మనఁబడును. ఇట్టి దేహత్రియము తా ననుకొనుటయే దేహాత్మ భ్రాంతి. అట్టి భ్రాంతిచే సకల కర్మలు నేనే చేయుచున్నానని అహంకార మూఢుఁడైన జీవుఁ డనుకొనుచుండును. దేహేంద్రియాదులే కర్మచేయునవి గాని ఆత్మయైన తాను సాక్షియై యుండి కర్తృత్వము తనపై వేసికొన్నందునఁ గర్మానుభవము కొఱకు జన్మల నెత్తవలసి వచ్చె. ఇదియే భృత్యగృంజన భక్షణ న్యాయము. జ్ఞానియైనవాఁడు కర్మలఁ జేసినను నేను జేయలేదు. దేహేంద్రియములే జేసినవని భావించును. అజ్ఞాని యైనవాఁడు దేహేంద్రియములు, కర్మచేయఁగా నేను చేసితినని తనపై వేసికొని పరితాపము నొందును. ఇదియే జ్ఞానికిని నజ్ఞానికిని నున్న విశేషము. ॥౨౭॥

శ్లో॥ తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మ విభాగయోః ।
గుణాగుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే. ॥౨౮॥

—♦ భాష్యమ్ ♦—

నను ఏవం తత్త్వవిదపి బాహ్యావృత్త్యా తథైవ క్రియమాణః కుతో న బాధ్యత ఇత్యాహ । తత్త్వవిదితి॥ ఏవం సత్యా 'త్మానం రథినం ప్రాహు శ్శరీరం రథమేవ తు । ఇంద్రియాణిహయా నాహు ర్మనః ప్రగ్రహ మేవచ । బుద్ధిం తు సారథిం విద్ధి విషయా స్తేషు గోచరా' ఇత్యాది స్మృత్యా తత్తద్వివేకా దాత్మసాక్షా త్కారేణ గుణకర్మవిభాగయో ర్జ్ఞాతా న సజ్జత ఇత్యర్థః ॥౨౮॥

—♦ లఘుటిప్పణీ ♦—

జ్ఞాతేతి - యది దేహం పృథక్కృత్వా చితి విశ్రామ్య తిష్ఠతీతి స్మృత్యుక్త ప్రకారేణ గుణకర్మవిభాగయో ర్జ్ఞాతా న సజ్జతే జన్మమర

ణాదినే తి భావః। "పుంఖానుపుంఖ విషయేక్షణ తత్పరోపి బ్రహ్మావలోకన ధియం న జహాతి యోగీ సంగీత తాళ లయ వాద్య వశం గతాపి మౌళిస్థ కుంభ పరిరక్షణ ధీ ర్నటీవ" ॥౨౮॥

## —♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ తత్వవేత్తయు బ్యాహ్యావృత్తితోఁ గర్మలఁజేసి యెందులకు బాధనొందఁడంటివా చెప్పెదను. తాను రథికుఁడు. శరీరము రథము. ఇంద్రియములే గుఱ్ఱములు. మనసే కళ్లెము. బుద్ధియే సారథి. శబ్దాది విషయములే సంచారమార్గములుగా నెఱింగి యాత్మసాక్షాత్కారముచే గుణ కర్మ విభాగములఁ దెలిసినవాఁడు కర్మసంగుఁడుఁగాడు. దేహేంద్రియాదులను వేఱుచేసి 'నాఽహం దేహో నేంద్రియాణ్యంతరంగం నాహంకారః ప్రాణ వర్గో న బుద్ధిః। దారాపత్య క్షేత్రవిత్తాది దూర స్సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోఽహం' దేహము నేను గాదు. ఇంద్రియములు నేను గాను, అహంకారము నేను గాదు, పంచప్రాణములు నేను గాదుబుద్ధినేనుగాదుదారాపుత్రగృహారామక్షేత్రపశుధనధాన్యాదులకునాకు సంబంధములేదు. నేను సాక్షిని, నిత్యుఁడను, ప్రత్యగాత్మయైన శివుండను' స్మృతిప్రకారము చిత్తమును శివుని యందు లయముచేసినయోగి అనేకవిషయములను జూచుచున్నవాఁడైనను బాహ్యకార్యములఁజేసినను బ్రహ్మావలోకనమును సంగీతతాళలయవాద్యములయందు బ్రవృత్తిగలిగి శిరమున కుంభముంచి నాట్యముచేయు నటి శిరస్థకుంభరక్షణను వలె వదలడని తాత్పర్యము॥౨౮॥

శ్లో॥ ప్రకృతే ర్గుణ సమ్మూఢాః స్సజ్జంతే గుణకర్మసు
తాన కృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్న విచాలయేత్॥

## —♦ భా ష్య మ్ ♦—

అథ పూర్వోక్త మేవోపసంహరన్నాహ। ప్రకృతేరితి। ఏవం తర్హి ప్రకృతేర్యే సత్వాదయో గుణా స్తైర్యే

సమ్మూఢా బద్ధా స్స ఏవ గుణకర్మసు సజ్జంతే । తథా సతి తానకృత్స్నవిదో యస్మిన్విజ్ఞాతే సర్వం విజ్ఞాతం భవతీత్యాదిశ్రుతిత్యభిహిత జ్ఞానహీనాం స్తద్జ్ఞానవాన్నవిచాలయేదిత్యర్థః॥ ౨౯॥

—♦ లఘు టిప్పణీ ♦—

సత్వాదయ ఇతి - 'సత్వం సుఖేన బధ్నాతీ' త్యాదినాఽపి యద్యపి సత్వాదీనాం ప్రకృతి జత్వేన సమ్మోహకత్వ మేవోక్తం। తథాపి విమల సత్వస్య నిస్త్రైగుణ్య సాధకత్వమేవేతి పూర్వోక్తం న విస్మర్తవ్యం। యస్మిన్నితి। తత్రైవం సతి యస్మిన్ సదాశివే సర్వసాక్షిణి విజ్ఞాతే సర్వమిదం ప్రపంచజాతం విజ్ఞాతం భవతీత్యర్థః - అత ఏవైతత్ సర్వజ్ఞత్వ సిద్ధ్యర్థం పృథివ్యాదయోఽప్య హర్నిశం హరహరేత్యాది శబ్దమర్యాదయా భజంతీతి స్కాందే సర్శితం। తద్యథా 'సదాశివం పృథివ్యాద్యా హరేత్యేత ద్ధరేతిచ। ప్రవదంతి తథైవాగ్ని ర్భంబమిత్యాహ భక్తిత ఇత్యాది ద్రష్టవ్యం॥ ౨౯॥

—✻ ఆన్ధ్ర తాత్పర్యము ✻—

ముందుఁజెప్పిన దానినే యుపసంహరించుచున్నాఁడు - (ఆత్మజ్ఞాని కర్మలిప్తుడనే వాక్యమును) ప్రకృతి సంబంధమైన సత్వాదిగుణములచే నెవరు మోహితులై కర్మలనాచరించుచుండిరో (మృత్తును దెలిసినమాత్రాన ఘటశరావికము తెలియఁబడినట్లు సర్వసాక్షియైన సదాశివుని దెలిసిన జగత్తంతయుఁ దెలియఁబడునను జ్ఞానములేక కార్మికులైన యజ్ఞానులు వారికి ఆత్మజ్ఞానముకలవాఁడు భేదబుద్ధిని గలిగింపరాదు సత్వగుణము సుఖముకలిగించునని స్మృతులు చెప్పుచున్నప్పటికిని ప్రకృతిజన్యములగుటచే మోహమేకలుగును శుద్ధ సత్వముమాత్రముత్రిగుణములులేనిది

అట్టి శుద్ధసత్వమార్గమందు సంచరించుజ్ఞానులకు విధినిషేధములు లేవని యున్నది. 'నిస్త్రైగుణ్యే పథి విచరతాంకో విధిః కోనిషేధః' అట్టిజ్ఞానము గాలకుఁ బృథివ్యాది భూతములును అహర్నిశము హర హరాయను శబ్ద మర్యాదచే పరమాత్మను భజనచేయుచున్నట్లును, అగ్ని బంబంమహాదేవ యని భజనచేయుచున్నట్లును స్కాందమునందు గలదు. ॥౨౯॥

శ్లో॥ మయి సర్వాణి కర్మాణి సన్యస్యాధ్యాత్మ చేతసా।
నిరాశీ నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః॥౩౦॥

—◆ భాష్యమ్ ◆—

సన్యస్యైవం పరం తు ముముక్షు శ్చేత్సకథం కర్మ కుర్యా దిత్యాహ। మయీతి తత్రైవం సతి 'సోఽహం స చత్వం సచ సర్వమేతదాత్మ స్వరూపం త్యజ భేదమోహ మిత్యాధ్యాత్మ చేతసా 'వేదై రనేకై రహ మేవ వేద్య' ఇత్యాది శ్రుత్యుక్తాహం గిరో పాసనయా మయి సదాశివే తురీయే సర్వసాక్షిణి సర్వాణి కర్మాణి 'యస్మిన్ కృతే న కించిత్కర్మ క్రియత' ఇతి శ్రుతిన్యాయేన సన్యస్య సమర్ప్య నిరాశీః ఫలాభిసంధి రహితోఽహం మ మేత్య సద్భావం దేహాదా మోహజం త్యక్త్వా విగతజ్వర స్సన్యుధ్యస్వేతి శ్లోకార్థః। బ్రహ్మోపాసనాక్రమస్తు' యథా, అహం బ్రహ్మా స్మీతి తదుపాశీత యతః పూర్వేప్యుపాసితారః త్వంవా అహమస్మి భగవో దేవతే అహం వై త్వమసీత్యా ద్యైక్య మేవ గచ్ఛంతి ఉపాసితు రర్థాంతరత్వేపి తానుపాసితృా ననుగృహ్ణాతి స్వస్వ

రూపతయా పరం బ్రహ్మ తేచ పున స్స్వాత్మతయా గ్రాహ యంతి చ పరానపి శిష్యాన్ తత్వమసీత్యాదినా । నిరవధిక పరమానందమయ నిష్కళంక శివత్వప్రాప్తి ర్హి ముక్తిః । శివత్వప్రాప్తి రాత్మనః పశుత్వ నివృత్తి మంతరేణ నసంభవతి। పశుత్వనివృత్తిశ్చ నతద్ధ్యాన భావనాం వినా అతో నిరంతరం శివోహ మితి భావనా ప్రవాహేణ శిథిలితపాశతయాఽపగత పశుభావ ఉపాసక శ్శివఏవ భవతి । నిరస్త సమస్తదోషకళంక నిరతిశయ మంగళాస్పదత్వం హి శివత్వం బరబ్రహ్మచ తాదృగేవ । తత్తద్ధ్యానవశేనోపాసకశ్చ తథైవ భవతి అతఏవ తద న్యస్య ముముక్షు ధ్యేయత్వం నిషిధ్యతే। 'శివ ఏకో ధ్యేయ శ్శివంకర స్సర్వ మన్యత్పరిత్యజ్యే'త్యాది శ్రుతిషు । నివృత్త బ్రాహ్మణాది దేహాభిమానాది మయ పశుభావనస్య నిరతిశయ స్వరూపానందసాక్షి స్వప్రకాశ శివరూప పరమాహం భావా పత్తి ర్ముక్తి రితి సర్వశ్రుతి తాత్పర్యాత్ బ్రహ్మభావేనో పాసన ముపాసకస్య ముక్తికరమిత్యథాతోథం సంసారాన్నివృత్తి రిత్యాద్యస్మాభి స్సూత్రభాష్యే సప్రపంచం నిరూపితమ్॥ ౩౦॥

## ఆ న్ధ్ర తా త్ప ర్య ము

ఓయీ, ముముక్షులైనవారు కర్మ మెట్లు చేయుననఁగా జెప్పు చున్నాఁడు. సజాతి విజాతి స్వగత భేదములను దేహాదులయందు మోహ మును వదలి సర్వవ్యాపకమైన పరమాత్మయే నేను. అదియే నీవును నీకనుపించునదంతయు నేనే యని అధ్యాత్మబుద్ధితో 'అసుప్తే రామృతేః

కాలం నయేద్వేదాంత చింతయా? నిద్రలేచినది మొదలు మరణపర్యం తము వేదాంతచింతనచేతనే కాలమును గడపవలెనేకాని కామాదుల కవకాశమివ్వకదన్ను తాను తెలిసికొనవలయును. నాలుగు వేదములు నాఱు శాస్త్రములు పదునెనిమిది పురాణములును దానెవరో తెలిసికొనుట కొఱకే పుట్టినవి. కాన సర్వసాక్షి తుర్యస్వరూపుడునయిన సదాశివుని యందు సర్వకర్మలను సమర్పణచేసి ఫలాభిసంధిని వదలి దేహమందును దారాపుత్రాదులయందును నేను నావారను మోహమును వదలి అంతరంగ శత్రువులను సంహరించి 'అహం బ్రహ్మాస్మి' యనియుపాసన చేయు చుండుము, శిష్యుల ననుగ్రహించి 'తత్త్వమసి' యని ఉపదేశింపుము. ఇట్లు అహంగ్రహోపాసనచే అఖండానందరూపమైన నిర్మల శివత్వము ప్రాప్తించును. అదియే ముక్తి. వర్ణాశ్రమ రూపమైన పశుత్వము వదలకరాదు. పశుపతిని భావించక పశుత్వము పోదు. అందువలన నిరంతరము 'శివోహం' అను భావనాప్రవాహముచే బంధనివృత్తి గలిగి బ్రాహ్మణాద్యభిమానములు తొలఁగిన యుపాసకుండు శివుండగును. శివత్వమనఁగా రాగాది దోషములు లేక యఖండానందరూపముతోనుండునది. పరబ్రహ్మ మన అదియే కీటము భ్రమరధ్యానముచే తాను భ్రమరమైనట్లు ఉపాసకుఁడా యా భావనలచే ఉపాస్యరూపము నొందును. జీవుఁడు శివుండగును. కనుకనే ముముక్షువు శివుని గాక యితర దైవమును ధ్యానింపఁ గూడదని నిషేధము చెప్పఁబడినది. దేహజాత్యాద్యభిమానరూపమైన పశు భావము తొలఁగిన వానికి తన్నుఁదాఁజూచుకొని మితిలేని యానంద మను భవించుచు సాక్షియై స్వయంప్రకాశరూపుఁడైన శివుడే నేనను దృఢభావ నయే ముక్తి నిచ్చునది. అట్లుగాకున్న అనాది సంసారమెట్లు తొలగునని తాత్పర్యము.

'మహాపాపవతాం పుంసాం పూర్వజన్మసు సువ్రతాః॥ విష్ణుస్సర్వాధికో భాతి నసాక్షాత్పరమేశ్వరః। విష్ణుస్సర్వాధికో నాన్య ఇ

చింతయతాం నృణాం నాస్తి సంసారవిచ్ఛిత్తిః కల్పకోటి శతైరపి॥' సూతసంహిత। యజ్ఞవైభవ ఖండము—

'శివప్రసాదేనహి భుక్తిరుత్తమా శివప్రసాదేనహి ముక్తిరుత్తమా। శివప్రసాదేన వినా న భుక్తయ శివప్రసాదేన వినా న ముక్తయః॥'—

పూర్వజన్మమునందు మహాపాపములం జేసిన పురుషులకు విష్ణువు సర్వాధికుఁడని తోఁచును. 'విశ్వాధికో రుద్రో మహర్షిః' అని శ్రుతు లున్నను వారికి సాక్షాత్పరమేశ్వరుఁడు సర్వాధికుఁడని తోఁచదు. విష్ణువే సర్వాధికుఁడు గాని యితర దైవము గాదని తలంచు నరులకుఁ గోటి కల్పములకైనను సంసారము తొలఁగదు. శివప్రసాదము వల్లనే అఖండ భోగములు గల్గును. 'యద్ద్వారే మత్తమాతంగా వాయువేగా స్తురంగమాః। పూర్ణేందువదనా నారీ శివపూజా విధేః ఫలం'॥ ఎవనియొక్క ద్వారమందు మదపుటేనుఁగులును వాయువేగము గల గుఱ్ఱములును, నుండునో, యేభవన మందు చంద్రునివంటి ముఖము గల స్త్రీ యుండునో వాని దది శివపూజా ఫలము. శివానుగ్రహముచే శుకుండు ముక్తినొందె. 'ఈశ్వరానుగ్రహాదేవ పుంసా మద్వైతవాసనా? అని భాగవతము.

శివప్రసాదములేక భుక్తి దొరకదు. ఉపమన్యునకు మొదట పాలు దొరకలేదు. శివానుగ్రహముచే సప్తసముద్రములు లంభించెను. శివప్రసా దములేక ముక్తులు దొరకవు. 'గోవిందా దధికం న దైవత'మనునీవ్యాసునికి భుజస్తంభన రూపబంధము గల్గెను, వ్యాసునకు సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్య విదేహ కైవల్య ముక్తులు గలుగలేదు. జన్మమెత్తుటయే గల్గెను,—సార్షిత్వమునిచ్చిరి. అనఁగా జన్మలయందుఁ బురాణములు రచించుట—॥౩౦॥

శ్లో॥ యే మే మత మిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః।
శ్రద్ధా వన్తో ఽనసూయంతో ముచ్యన్తే తే ఽపి కర్మభిః॥౩౧

## —♦ భా ష్య మ్ ♦—

నను యదుక్త మధ్యాత్మచేతసే త్యాది తదేవ పున ర్విభజయతి, యేమఇతి। ఏవంతహ్ం యే మానావా మమ మదీయం మతం॥ 'భూమానం తం సదానందం శివమేక మనామయం విద్ధి త్వం శ్రుతిభి ర్మృగ్యం దర్శయిష్యే పరం పద' మిత్యాది స్మృతివేద్యత్వే నే దమిష్టం నిత్య మనుతిష్ఠన్తి। శ్రద్ధావన్తః పున శ్చానసూయంతో గుణేషు దోషాఽదర్శిన స్తేయథోక్తరీత్యా కర్మభిః కృత్వాయద్బంధనం తస్మాద్విముచ్యంత ఇత్యర్థః। ౩౧

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

భూమానమితి। ఏవంసతి నుమేవ భూమానం పురుషం భోపదేశోక్తే భాగవతే హ్యర్జునాయ శ్రీకృష్ణేన భగవతా దర్శిత మిత్యవధేయం। శ్రీకృష్ణోహి యోగప్రవాహేనపరమేశ్వరమేకరూపంపార్థాయప్రాదర్శయత్, అతఏవ అగ్రే 'దివ్యం దదామి తే చక్షుః పశ్యమే యోగ మైశ్వర' తాదాత్మ్యసాధక ప్రయోగదర్శనం కృష్ణ ఉపన్యస్య 'ఏవముక్త్వా తతో రాజన్। మహాయోగేశ్వరో హరిః దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వర' మితి అసాధారణేశ్వర శబ్దిత పరశివరూపమేవ యోగీ కృష్ణః ప్రదర్శయామాసేతి స్పష్టమేవోక్తం। అంతేచ 'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ర్జున తిష్ఠతీ' త్యాదినా 'తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత' ఇత్యంతేనో పసంహృతమ్ మదీయం మతం కిమితిచేత్' శ్రుణు, తద్యథా, నిరస్త సమస్త దోషకళంకం నిఖిల మంగళా ధారభూతం బ్రహ్మ, తదేవ జగతో అభిన్న నిమిత్తోపాదానకారణం సూక్ష్మచిద చిద్విశిష్టం బ్రహ్మకారణం స్థూలచిదచిద్వి శిష్టం బ్రహ్మ కార్యం ఇదం హి జగత్ పరమేశితు శ్శరీరం। సకల చి దచిత్ప్రపంచాకార పర

శక్తి విశిష్టాద్వితీయవైభవః పరమేశ్వరః, పరమకారుణికస్య సర్వానుగ్రాహకస్య తస్య ప్రసాదాతిశయేనా ధికారిణః ప్రధ్వస్త పాశపటలా కైవల్య లక్ష్మీ స్సిద్ధ్యతీతి నిఖిల నిగమ శివాగమానా మాశయో వ్యయమేవేతి శివాద్వైతంమతం॥ ౩౧॥

## —◆ ఆంధ్ర తాత్పర్యము. ◆—

ఆధ్యాత్మికబుద్ధిచే నిదివఱకుఁజెప్పినదానినే దృఢపరుచుచున్నాఁడు. అట్లైనచో మానవులు 'శివుఁడు దుఃఖరహితుఁడు. సదా ఆనందరూపుఁడు అద్వితీయుఁడు వేదవేద్యుఁడు అట్టివానిని జూపించెదను. తెలిసికొనుము. అదియే పరమపదము' అను నాయీ మతమునందు ననూయలేక శ్రద్ధగలవారై నిత్యమాచరించినవారు గుణములయందు దోషముల నెంచక యథోక్త కర్మలనాచరించి బంధవిముక్తులగుచున్నారు. కృష్ణుఁడర్జునుని కొఱకు నీశ్వరరూపమును యోగప్రభావముచేఁ జూపెను. కనుకనే ముందు నీగీతయందే 'ఓఅర్జునా! నీకు దివ్యదృష్టినిచ్చి యీశ్వరరూపమును జూపెదను. చూడుమనెను. ఇట్లు చెప్పి మహాయోగీశ్వరుఁడైన హరి పార్థుని కొఱకు నీశ్వరరూపమును (అసాధారణమైన యీశ్వరశబ్దముగల పరశివుని రూపమున్నే) చూపెను. గీతాంతమందు 'ఈశ్వరుఁడే సర్వభూతముల యొక్క హృదయములయందున్నాఁడు. అతనిని సర్వవిధముల శరణు పొందుము. నేనును అతనినే శరణుబొందితిని. నాది శైవమతము. నిర్మలము. నిఖిలమంగళగుణాకరము నైనది బ్రహ్మము. అట్టి బ్రహ్మమే జగత్సృష్టికి సమవాయినిమిత్తకారణము. సూక్ష్మమైన పశుపాశములతోఁ గూడి కారణమైనది. స్థూల పశు పాశములతోఁ గూడి కార్యమైనది. కారణము ఈశ్వరుఁడు. కార్యము జగత్తు. ఇదియే పరమేశ్వరుని శరీరము. సకలజీవులు సకలజగత్తులే ప్రపంచము. ఇట్టి యాకారముగల పరశక్తితో గలసి అద్వితీయమైన వైభవముగల పరమేశ్వరునియొక్క అనుగ్రహముచే శక్తిపాతముగల అధికారికి పాశము పటాపంచలై తెగి కైవల్యలక్ష్మీ

ప్రాప్తింపుమని నాల్గువేదములయొక్కయు యిరువదియెనిమిది యాగముల యొక్కయు అభిప్రాయమిదియే. ఇదియే నేనాచరించిన శివాద్వైత మతము. ఓభారతా! నీవును యీనామతమవలంబించి నీహృదయమందున్న ఈశ్వరుని తెలిసికొనుము. ముక్తినొందగలవు. ౩౧.

శ్లో॥ యే త్వేత దభ్యసూయన్తో నా నుతిష్ఠన్తి మేవతం ।
సర్వజ్ఞానవిమూఢాం స్తా న్విద్ధి నష్టా న చేతసః॥          ౩౨

—* భాష్యమ్ *—

ఏవమత్రాన్వయేన గుణ ముక్త్వావ్యతిరేకేణ దోష మప్యాహ । యేత్వితి॥ ఏవంసతి యేతు 'భవంతం దేవేశం శివ మితరగీర్వాణసదృశం ప్రమాదాద్యః కశ్చి ద్యది వదతి చిత్తేఽపి మనుతే, సుదుఃఖం లబ్ధ్వాంతే నరకమపి యాతి ధ్రువమిదం ధ్రువా దేవారాధ్య స్త్వమపి పరమం ధ్రువమి'తీ త్యాది బ్రహ్మవైవర్తే సదాశివం భూమానం ప్రతి, మద్వాక్య విరోధా దభ్యసూయంతః । 'పీతాంబరం త్రిపుండ్రం చ ధృత్వా రుద్రాక్షమాలికాం జజాప శివసాహస్రం శివైకాహితమానస' ఇత్యాది పాద్మోక్తం మే మతం నానుతిష్ఠంతి పాశుపత్యవ్రతై ర్నానువర్తయంతి తానచేతసో దుష్టచిత్తానేవ విద్ధీత్యర్థః॥ ౩౨॥

—* లఘుటిప్పణీ *—

దేవారాధ్యఇతి...బ్రహ్మాదిభి ర్దేవై రారాధ్య శ్శివ ఏవేత్యర్థః । తదుక్తంబ్రహ్మవైవర్తే॥ 'మన్మాయా మోహితా స్సర్వే మమ మాయా దురత్యయా । బ్రహ్మ విష్ణు ముఖాదేవా మా మారాధ్య పదాధిపాః । మాం నజానంతి తత్త్వేనజ్ఞా తే ముక్తా భవంతితేఽన జ్ఞాతే మయి భోగాంతే

జన్మభాజః పునర్ధ్రువమ్ ఇత్యాద్యవధార్యమ్॥ పాశుపత వ్రతమథర్వశిరసి శ్రూయతే। 'తృష్ణాం ఛిత్వా హేతు జాలస్య మూలం బుద్ధ్వా సంచిన్త్య స్థాపయిత్వా తు రుద్రే । రుద్రఏకత్వమాహుః. రుద్రం శాశ్వతం వై పురాణమిషమూర్జం తపసా నియచ్ఛత' । వ్రత మేత త్పాశుపతం పురాణేషు ప్రసిద్ధమేవ, తన్నిష్ఠానాం విద్యాప్రాప్తి ర్ముక్తిశ్చ. పుత్రాద్యర్థం కృష్ణాదిభి రనుష్ఠితత్వాత్ ।తేషా మత్యన్తవ్రతధారిణాం ముక్తిరేవ ఫలం సంభవతి విద్యాసంపత్తిశ్చ పరబ్రహ్మణో రుద్రస్యా నుసంధానురూపా । ముని ధర్మవ దితరేషామపి భిక్షాచర్యాశమదమాదీనాం పరమధర్మాణాం పాశుపతాఖ్యే వ్రతే వ్యుపదేశాత్, తన్నిష్ఠానాం రుద్రఏకత్వమాహుః । అగ్నిరిత్యాదినా భస్మగృహీత్వా విమృజ్యాంగాని సంస్పృశేత్। తస్మాద్వ్రత మేత త్పాశుపతం । పశు పాశ విమోక్షాయ ఇతి రుద్రధ్యానస్య పాశ విచ్ఛేదరూపస్య మోక్షఫలస్య సంబంధావగమాత్ । అతో యావ దాయుషం పాశుపతవ్రతధారిణాం ముక్తిరేవ ఫలం । పాశుపతాశ్రమో విద్యాసాధన బ్రహ్మచర్యాది యతిధర్మ సమన్వయాద్యత్యాశ్రమసంజ్ఞకో య మాశ్రమ భేదస్స్వతంత్రః పరమశివప్రాప్తిహేతుః । యావచ్ఛరీర పాతం ద్వాదశాబ్ద మథాపివా । అత్యాశ్రమసంజ్ఞక మపవర్గహేతుః । తదన్య ద్భోగహేతు రితివ్యవస్థా । ఏవం భుక్తి ముక్తి హేతుతయోభయాత్మ మిదం వ్రతం శివప్రసాదీకరం శ్రుతిరేవ విదధాతి. ౩౨.

## —♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఇట్లు అన్వయవ్యతిరేక భావములచే అన్వయమందు గుణమును, వ్యతిరేకమందు దోషమును జెప్పెను. ఎవరు దేవదేవుండైన శివుని, నందర దేవతలతో సమానునిగాం బ్రమాదమువలన బలుకుదురో లేక చిత్తమందనుకొనె దరో, వారి హామందు దుఃఖముల ననుభవించి పరమందు నరకమును బొందుదురు. అందువలన 'పశుపతిస్సర్వ దేవప్రకృష్టః. దేవతలందరికంటె శివుడధికుడు గావున బ్రహ్మాదిదేవతలచే నారాధింపంబడి వరములనొసంగి

నట్లు బ్రహ్మవైవర్తపురాణము చెప్పుచున్నది. అందే మఱియు శివునివా క్యము 'అందఱును నాయొక్క మాయచే మోహితులైరి. కాన నన్నారా ధింపక నామాయను విప్పుకొనఁజాలరు. బ్రహ్మవిష్ణ్వాదులు నన్నారాధింప గానేను వారికి బ్రహ్మలోకమును విష్ణులోకమును నిచ్చితిని వాస్తవముగా నన్ను దెలసికొనఁజాలరు. తెలిసినవారు ముక్తులగుదురు. తెలియనివారు భోగాంతమునందుఁ బునర్జన్మను బొందుదురు. ధ్రువ'మని బ్రహ్మవైవర్త పురాణము కాన కృష్ణుడు 'నేను శైవుడను. ఇట్టినామతమున మాయచే నిందించువారలు పీతాంబరమును సర్వాంగ భస్మోద్ధూళన త్రిపుండ్ర ధారణ రుద్రాక్షజప మాలలచే పంచాక్షరీజపము శివ సహస్రనామజపమును ఏకాగ్రచిత్తముతోఁ జేయవలయున ననదియే నామ తము. దీనినాచరింపనివారు దుష్టస్వభావముగలవారై పోడగుదురని చెప్పి నట్లు పద్మపురాణమందుఁగలదు. పాశుపత వ్రతము పురాణములయందు ప్రసిద్ధమైయున్నది. తద్వ్రతనిష్ఠులకు జ్ఞానము ముక్తియుఁగలుగును. కామ్య సిద్ధిని జెప్పనవసరములేదు. కృష్ణుడు గురువైన అంగిరసోపదేశముచే సం తానము కొఱకు పాశుపతవ్రతమును సలిపి సాంబుడనే పుత్రునిగనెను. దీనికి భాగవతమే ప్రమాణము. రాముఁడు అగస్త్యోపదేశముచే పాశుపత వ్రతమును నాల్గుమాసములు చేసి రావణసంహారముఁ గావించెనని శివగీత, అట్లు నిష్కాములై జేసినవారికి ముక్తియే ఫలము. ఈవ్రతము రుద్రాను సంధానరూపమైనది. మునిధర్మములవలె భిక్షాటనము శమదమాది పరమ ధర్మములు. పాశుపతవ్రతమందు చెప్పుటవలన నిట్లనుష్ఠించినవారలకు రుద్రునిలో నైక్యమును జెప్పిరి. అగ్నిరితి భస్మేతిమంత్రముచే భస్మను గ్రహించి శిరాది పాదపర్యంతము ఉద్ధూళనచేసి బహిరాత్మకొన్నా సముచే నంగస్పర్శముచేయవలయును. శిరోలలాట వక్షస్కంధప్రదేశముల యందుఁ ద్రిపుండ్రధారణమును జేయవలయును. రుద్రాధ్యాయమును శత రుద్రియమును జపించవలెను. ఇట్లుచేసిన పాశుపతవ్రతమువలన బంధము దొలఁగి మోక్షముప్రాప్తించును, దీనినామరణాంతము లేక పదిరెండుసం

వత్సరము లాచరించినవారలకు ముక్తియే ఫలము॥ ఇందు బ్రహ్మచర్యము విద్యాసాధనము మొదలయిన యతిధర్మములున్నవి. పరమశివ ప్రాప్తి హేతువైన అత్యాశ్రమమను పేరుగల స్వతంత్రమైన యాశ్రమ మొకటే గలదు అత్యాశ్రమము అపవర్గహేతువు. తదన్యాశ్రమములు భోగహేతువులు.ఇట్లు భోగమోక్షములకు హేతువై యుభయాత్మకమైన యీ వ్రతము శివప్రసాదమును గలిగించుననుటకుఁ శ్రుతియే ప్రమాణము.॥ ౩౨॥

శ్లో॥ సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి।
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి॥ 33॥

—♦ భాష్యమ్ ♦—

నను మమైవానువర్తినో యది మనుష్యా స్తర్హి కథ మనర్థేష్వేతే ప్రవర్తంత ఇతిచే త్తత్రాహ । సదృశమితి।తత్రై వంసతి 'పూర్వజన్మార్జితాత్పాపా త్సంసర్గాద్వాథ పాప్మనాం వైదికేష్వపథ మార్గేషు రుచి ర్నైవ స్వభావత' ఇత్యాది స్మృత్యా ధర్మాధర్మ వివేకేన జ్ఞానవానపి స్వస్యాః ప్రకృతేః పూర్వోపార్జితస్వభావత స్సదృశం చేష్టతే అతఏవ తాని ప్రాణినః ప్రకృతిం స్వ స్వభావమేవ యాంతీతి నిగ్రహో విషయేభ్యో వినివృత్తిరూపో యత్నః కిం కరిష్యతీతిభావః॥ 33॥

—♦ లఘుటిప్పణీ ♦—

సంసర్గాదితి॥ సంసర్గస్యా ప్యర్థానర్థకారిత్వమాఖ్యానకేఽప్యుక్తం, 'అహం మునీనాం వచనం శ్రుణోమి శ్రుణోతి రాజన్యగవాశినాం వచః, నైవాస్య దోషో నచ మద్గుణోవా సంసర్గజాదోషగుణాభవంతీ' త్యాది ద్రష్టవ్యమ్॥ చోరోపి చయథాచార్యే। సన్నిరీక్ష్య ప్యత స్తతః ధర్మశీలః సుతో నైవ జాసియా ద్ధర్మశోభన' మిత్యాది స్మృతిన్యాయేన యథోక్త

మన్యాదయా జ్ఞానవానపి స్వస్యాః ప్రకృతేః స్వభావా ద్విముహ్యా తీత్యర్థః॥ ౩౩॥

## —♦ ఆన్ధ్ర తాత్పర్యము ♦—

మనుజులు నన్నను వర్తించినయెడల ననర్థకార్యములయందు నెందుకు బ్రవర్తించెదరనఁగాఁ జెప్పుచున్నాడు. మానవులకు బూర్వజన్మమందుఁ జేసినపాపమువలన నీ జన్మమందుఁ బాపాత్ముల సంగతిచే బాపస్వభావము వలన వైదిక ధర్మములయందు రుచి గలుగదు. కనుకనే జ్ఞానవంతుఁడునుఁ బూర్వార్జిత కర్మరూపమైన సంచితములో నుండి వచ్చిన ప్రారబ్ధాను సారము నడుచుచుండును. కనుకనే ప్రాణులకాగామి సంచితప్రారబ్దము లననుభవింపక తీఱదు. ఇంద్రియ నిగ్రహ ప్రయత్నమేమి చేయగలదు. జన్మాంతర కర్మగాక ఇప్పటి సంసర్గము ననర్థమునే చేయునని ఉపాఖ్యానములుఁ గలవు. దృష్టాంతము నేను మునులయొక్క వాక్యమును వినెదను. రాజుల వాక్యమును వినెదను. గోమాంసము తినెడి చండాలుని వాక్యమును వినెదను. వీనిలో వారల దోషముగాని నా గుణముగాని లేదు. సంసర్గమువలన దోషగుణములు పుట్టును. 'చోరుఁడు నలువైపులఁ బరికించియే చోరత్వమును జేయును.' ధర్మశీలుఁడు ధర్మమును విచారించకుండునా? విచారించును. విచారించినను బ్రకృతి స్వభావము వలన 'బలవానింద్రియగ్రామోవిద్వాంస మపికర్షతి' అను న్యాయ ప్రకారము మోహము నొందును. ప్రారబ్ధ మనుభవించును. పూర్వ జన్మ కర్మ సంచితము, ప్రారబ్ధము, ఆగామి, అని మూడు విధములు.

సంచితమనగా బ్రహ్మసృష్టి మొదలుకొని మానవదేహములయందు గతజన్మాంతములవఱకుఁ జేయఁబడిన పుణ్యాపాపరూపమైన కర్మ. ఈసంచితమే ప్రారబ్ధమై వచ్చును. ఈదేహమునకు వెనుకటి యేడవజన్మమందలి యొక కర్మయొక్క ఫలమనుభవించుటకే యీజన్మవచ్చినది. ఇదియే ప్రారబ్ధము. ఈజన్మయందుఁజేయఁబడినకర్మ ముందుజన్మకు సిద్ధమై వచ్చు

చున్నందున ఆగామి యను పేరు. సంచితము నశించువఱకు జన్మలుతప్పవు సంచిత మెన్నియుగములకైనను తరిగిపోదు. యామము (ఝామము)లో జేయఁబడినకర్మలు అనేక జన్మలెత్తించును. జ్ఞానము వచ్చినది మొదలు మరణపర్యంతము చేసిన కర్మల కెన్నిలక్షలజన్మలెత్తవలెనో తెలియదు. ఇట్లనేక జన్మలయందుఁ జేసిన కర్మల కనేక కోట్ల జన్మలెత్తవలెను. కను కనే బ్రహ్మసృష్టి మొదలుకొని నేటివఱకు జన్మలెత్తుచునేయుంటిమి. ముముక్షువునకుఁ తత్వజ్ఞానముచే, సంచితము (తత్వజ్ఞానేనసంచితం) అగ్ని కణముచేఁ దూలరాసులు దగ్ధమగుచున్నట్లు నశించును.

'ఆగామిద్వివిధం నశ్యేత్తద్వేష్య ప్రియవాదినోః॥ ఆగామికర్మ శత్రుమిత్రులదూషణ భూషణద్వారా నశించును. శత్రులు దూషించి పాపమును, మిత్రులు స్తుతించి పుణ్యమును బట్టుకొని వెళ్ళుదురు. పుణ్య పాపములు నశించినందున ఉత్తరమందు జన్మలేదు.

ఇక ప్రారబ్ధమును విచారింతము ప్రారబ్ధ మనుభవించకతీరదు. 'ప్రారబ్ధంభోగతోనశ్యేత్'ఇచ్ఛాప్రారబ్ధము,అనిచ్ఛాప్రారబ్ధముపరేచ్ఛా ప్రారబ్ధము అనిప్రారబ్ధము మూఁడువిధములుఇచ్ఛాప్రారబ్ధము అపథ్య దోషమువలన వచ్చునది.అనిచ్ఛా ప్రారబ్ధమురాజదండనాదులవలనఁగల్గును, పరేచ్ఛా ప్రారబ్ధము పరదాక్షిణ్యమువలనఁ బ్రాప్తించును. ఈమూఁడు విధములైనప్రారబ్ధములనుభవింపక దేవతలకైనను దీఱదు. దేహభావమున్నంతె వఱఁకుబ్రారబ్ధమున్నది. దేహభావములేనప్పుడు ప్రతిభాసమాత్రముగా నుండును.ఈ ప్రారబ్ధ ప్రతిభాసనాలుగువిధములు. తీవ్రప్రతిభాసము మధ్య ప్రతిభాసము మందప్రతిభాసము సుప్తి ప్రతిభాసము అని సంస్కార ములునాలుగు తీవ్రప్రతిభాసమనగా జీవన్ముక్తుఁడు. భోగాసక్తుడైనను ఆత్మ ప్రతీతిమాత్రముండుట తీవ్రసంస్కారము. తానాత్మపరుండై బాలునివలె వినోదంబుగానుండుటే మధ్యసంస్కారము. సకలభోగంబులు విడిచి పరమాత్మయందే తత్పరుడై నిజానందంబుచేనుండుటమందసంస్కారము.

స్వ్యాపారంబుల విడిచి నిరుపాధి కాత్మయందే తత్పరుఁడై పరమ ముక్తియందట్లు పరమసుఖంబుతో నుండుట సుషుప్తి సంస్కారమనఁబడును, ఇట్లు చతుర్విధ సంస్కార ప్రారబ్ధవశంబుచేత నానావస్థలం గూడి యుండియు బుజుకుటిల గతులుగల నదులు సముద్రంబు చేరుపగిది బ్రహ్మస్వరూపమైయుండు ముక్తి ఏక రూపంబై యుండును. కాబట్టి ఎంతజ్ఞానికైనను ప్రారబ్ధము ప్రతిభాసమాత్రముగా నుండును. మూఢుల సంగతి నుడువనేల॥ ౩౩॥

శ్లో॥ ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।
తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపంథినౌ ॥౩౪॥

—♦ భాష్యమ్ ♦—

నన్వస్త్వేవం పరన్తు పూర్వోపార్జిత స్వభావజన్యాం ప్రకృతిం కథం నిగృహ్ణీయాదిత్యత ఆహ—ఇంద్రియస్యేతి। తథాచేహ వీప్సోక్తి స్సర్వేషా మింద్రియాణాం విషయే శబ్ద స్పర్శాదౌ వచనాదానాదౌ చ శాస్త్రానుకూలే ప్రవృత్తిస్తత్ప్రతికూలేచౌ వశౌ రాగ ద్వేషౌ వ్యవస్థితా విత్యర్థః. తత శ్చాస్య పురుషస్య తౌ పరిపంథినావత స్తయోర్వశం న గచ్ఛే దిత్యర్థః। ౩౪॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

పూర్వజన్మకర్మ వాసనాస్వభావజన్యమైన ప్రకృతిని నిగ్రహించుట యెట్లనఁగాఁ జెప్పుచున్నాఁడు. శ్రోత్ర, త్వక్-చక్షు జిహ్వా; ఘ్రాణము లకు శబ్దస్పర్శరూపరస గంధములు విషయములు. వాక్, పాణి, పాద, గుద, గుహ్యములకు, వచనాదాన, గమన, విసర్గా,నందములువిషయములు. వీనికిఁగర్మయోగమందు నలవాటుగలదు. కానినివి ప్రవృత్తి గలిగియుండు

జ్ఞానయోగమందునిదివఱకు నలవాటులేను గావున స్వాధీనముకాంజాలవు రాగద్వేషములు జ్ఞానమార్గమునకు శత్రువులని తెలిసికొనుము. అన్నివిషయములయందు రాగద్వేషములు పుట్టుచుండును.

1. రాగమనఁగాఁ బ్రపంచసుఖము ననుసరించుట. పరస్త్రీవిషయకమగు చిత్తవృత్తి ఇందువలన మహాబలశాలియైన రావణుఁడుసీతాదేవిని జెఱబెట్టిపుత్రమిత్ర భ్రాతృపరివారములతో మడిసెను,

2. ద్వేషమనగా దుఃఖము ననుసరించి యుండునది. ఒకఁడపకారముచేయఁగా వానికిఁ దిరిగి యపకారము చేయవలయునను చిత్తవృత్తి, ఇందువలన హిరణ్యకశిపుండు దురాచారుఁడైన తనతమ్ముని హరించెనని ద్వేషించి, ఆమాధవుని వధింపశపథముఁజేసి నరసింహరూపుఁడైన యానారాయణునిచే దానునుసీవళ్లెను.

3. కామమనగాఇండ్లు,తోటలు,మాన్యములు, ధనములు,ధాన్యములు పశువులు, స్త్రీలు మొదలగువానినిమిక్కిలిగా సంపాదింపవలెనసెడి చిత్తవృత్తి, దీనివలన నరకాసురుఁడు అనేకమంది స్త్రీలను చెరబట్టి శ్రీకృష్ణమూర్తిచేఁ జచ్చెను.

4. క్రోధమనగా తానుజేయునట్టి పనులకు విఘ్నముజేయువానిని శిక్షింపవలెనను చిత్తవృత్తి, ఇందువలన బకాసురుఁడు ఏకచక్రపురవాసులగు బ్రాహ్మణులను బాధించుచుండి వారిప్రేరణమునవచ్చిన భీమునితో బోరి నశించిపోయెను.

5. లోభమనఁగాఁ తనకు లభించిన పదార్థమును ఇతరులకివ్వరాదను చిత్తవృత్తి. ఇందువలన రారాజైన దుర్యోధనుఁడు తనజ్ఞాతులైన పాండవులకు రాజ్యమున సగభాగమియ్యక వారిచేతఁ బుత్రమిత్రసహోదరబంధువులతోడ సంహరింపఁబడియె.

6. మోహమనఁగా పుత్రమిత్రకళత్రధనాదులయందు మిక్కుటమగు ప్రేమగలిగి యుక్తాయుక్తములనెఱుఁగని చిత్తవృత్తి. ఇందువలన

దశరథమహారాజు తనభార్యయగు కైకయందలి ప్రీతిచేత సత్యశీలాదిసద్గుణ శ్రేష్ఠుఁడైన శ్రీరాముని యడవులకుఁ బంపి యందువలనఁ దాను మృతిఁ జెందెను.

7. మదమనఁగా సకలసంపదలు గలిగి గర్వాంధుఁడై నేనేమిచేసి నను జెల్లునసెడి చిత్తవృత్తి. ఇందువలన జమదగ్నిమహర్షి యొక్క హోమ ధేనువును కార్తవీర్యార్జునుని పుత్రులు గొనిపోవుచే నపహరించి పరశురాము నెదిరించి యుద్ధమందతనిచేతఁ దాను దమతండ్రియగు కార్తవీర్యార్జు నుఁడును నీల్గిరి.

8. మాత్సర్యమనఁగా ఇతరులు తనకంటె నెక్కువయైన విద్యను; ఐశ్వర్యమును, శరీరబలమును, జక్కఁదనమును. భోగమును, వర్చస్సును, పరాక్రమమును గలిగియుండఁగాఁ జూచి యోర్వఁజాలక మండిపడు చిత్త వృత్తి. ఇందువలన శిశుపాలుఁడు ధర్మరాజుచేయు రాజసూయయాగ మందు కృష్ణుని వైభవముఁజూచి యోర్వఁజాలక తిట్టి చక్రముచేఁ జంపఁ బడియె.

9. ఈర్ష్యయనఁగా. నాకువచ్చిన కష్టములితరులకురావలయునసెడి చిత్తవృత్తి. ఇందువలన అరుణాక్షుఁడనువాఁడు తనతోసమానుఁడైన బాణు నకు దుఃఖములురాఁగోరి అతనిచేఁ బ్రాణములు గోలుపోయెను.

10. అసూయయనఁగా, తనకుగలిగిన సుఖములితరులకుఁ గలుగరా దను చిత్తవృత్తి. ఇందువలన పుండ్రకదేశపురాజైన వాసుదేవుఁడు 'వాసు దేవుఁడ'ను పేరునాకుఁదగును గాని ఇతరులకుఁ దగునా యనెడి విరోధము చేత వాసుదేవుఁడైన శ్రీకృష్ణమూర్తితో మచ్చరించి చచ్చెను.

11. దంభమనఁగా, తానుజేసిన పనులు పరులెరిగి హెచ్చుగా మెచ్చుకొనవలయు ననెడి చిత్తవృత్తి. ఇందువల్ల అపూర్వుఁడు తన యోగము జూడుమని దూర్వాసునితోఁబలికిన నతఁడు ఇదిదంభమనఁగా

వాఁడురోషించి దూర్వాసుని దూషించి తన్నుభూషించుకొని విఫలత్వము నొందెను.

12. అహంకారమనఁగా, 'ఓరీ నేను నిన్ను శిక్షించువాఁడనని యెరుఁగవా! నేను పట్టిన పట్టు తుదముట్టింపక నట్టనడుమ విడిచి పెట్టు నట్టివాడను గాన'ని యితరుల నదలించు చిత్తవృత్తి, ఇందువలన మధు కైటభులనెడి టక్కరిరక్కసులు అహంకరించి విష్ణువులోఁ గలహించి కాలధర్మము నొందిరి.

13, దర్పమనఁగా నేను సర్వవిషయములయందు సమర్థుఁడను, నాకు సాటియైన, మేటి ఎచ్చోటను లేడను చిత్తవృత్తి. ఇందువలన లోక కంటకుండైన దశకంఠుఁడు క్రొవ్వి, రామునిచే జచ్చెను.

ఈ పదుమూఁడింటిలోను రాగద్వేషములు ప్రసిద్ధములు. ఈరెంటి లోని వన్నియు నంతర్భూతములై యుండును. క్రమముగా నివన్నియు వచ్చును గాన నీ దుర్గుణములను జేరనీయఁగూడదు. అనఁగా వానికి దాసు స్వాధీనముగాక యుండవలయును.॥ ౩౪॥

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥ ౩౫॥

—♦ భాష్యమ్. ♦—

నను 'శ్రద్ధాహాని స్తథాసూయా దుష్టచిత్తత్వమాఢతే। ప్రికృతే ర్వశవర్తిత్వం రాగద్వేషౌ చ పుష్కలౌ' ఇత్యాది స్మృత్యుక్తాన్ ధర్మప్రతిబంధకాన్ కేన ధర్మేణ జయంకుర్యా దిత్యాహ॥ శ్రేయానితి॥ తస్త్రైవంసతి పరధర్మాత్స్వనుష్ఠితా దపి స్వధర్మో విగుణ స్స్వల్పోఽపి శ్రేయా నిత్యర్థః। ఏవంసతి స్వధర్మే నిధనం న్యూనమపి కృతం చే చ్ఛ్రేయః। పరధర్మస్తు

సావధానేన కృతోఽపి ముదాఽజటారచన మాధ్యవతాం వృథైవేతి వద్భయావహో భయ ప్రద ఇత్యర్థః । ఇత్యధికం వర్ణాశ్రమ ధర్మనిరూపణే ద్రష్టవ్యమ్॥ ౩౫॥

## — లఘుటిప్పణీ. —

స్వల్పోపీతి । తద్యథా । 'అకరణా త్కరణం శ్రేయః స్వల్పాద్విస్తర సంయుతః । యేన కేన ప్రకారేణ స్వధర్మం రక్షయే ద్బుధః" ఇతి స్మృత్యా స్వల్పోఽప్య కరణాద్ధర్మా చ్ఛ్రేయా నిత్యాశయః॥ ౩౫॥

## — ఆన్ధ్రతాత్పర్యము —

శ్రద్ధలేకుండుట, అసూయ, దుష్టస్వభావము, మూఢత్వము, ప్రకృతి స్వాధీనమై యుండుట, రాగద్వేషములు. ఇవి ప్రబలమైన విజ్ఞానమునకు ప్రతిబంధకములు గాన వీని నేదర్మముచే జయింప వచ్చునంటివా చెప్పెదను. జ్ఞానమార్గమును గొంత కాలము బాగుగా నాచరించి విచ్ఛేదమునొందుటకంటె స్వధర్మమైన కర్మయోగము స్వల్పమైనను మంచిదే. కర్మాచరణము కొంచెమైనను ప్రమాదములేనిది, జ్ఞానాభ్యాసునకు మూడువిధములైన పాతిత్యములు వచ్చును. అర్ధప్రబుద్ధత్వము, ఆరూఢపాతిత్వము, వాచావివేకము అనునవి. అర్ధప్రబుద్ధత్వమనగా వేదాంతశ్రవణంబుచేసినపుడు 'చిదానందరూప శ్శివోఽహం శివోఽహం' అనిజ్ఞానము గలిగి ఇతర వేళల నావివేకములేకుండుట. దృష్టాంతము. ఒకబ్రాహ్మణుండు స్వప్నమందు తానుచండాలుడైనట్లు భ్రమించి మేలుకవయందు భ్రమనివృత్తిగలవాడై బ్రాహ్మణుండను దృఢత్వముగలిగియు స్వప్నవాసనచేత మరలచండాలత్వ మారోపించుకొనిన నెట్లుపాతిత్యము వచ్చునో యట్లు మొదట శివుండైన తాను దేహేంద్రియాదులుగా భ్రమసి యంతట గురూపదేశముచే 'శివోఽహ'మనియెఱిగి తిరుగ దేహమేతానని

భ్రాంతివచ్చిన నాదోషమువలన వచ్చునది పాతిత్యము మాత్రమేగాదు బ్రహ్మఘ్నతయు ప్రాప్తించుచున్నది. ఆరూఢపాతిత్యమనఁగా జ్ఞాననిష్ఠ గలిగి తానుకర్తగానని తెలసి అసంగోదాసీనుడై యుండి విధినిషేధములు మాని కేవలాత్మ నిష్ఠనుండి మఱికొంతకాలమునకు అవిద్యావరణచే వర్ణాశ్రమాభిమానియై కర్తృత్వంబు వహించి ప్రపంచంబు, సత్యంబుగా నెంచి విధినిషేధంబులు తెలియుచుండునది ఆరూఢపాతిత్యము. ఇందుకు దృష్టాంతము, లోకంబున నొక్కడు పాపియై గంగాసమీపంబున నుండియు తెలివిలేక పాపక్షయంబుగోరి కూపస్నానంబు జేయుచుఁ బెద్దల యుపదేశంబున గంగాస్నానఫలంబు విని కొంతకాలము గంగాస్నాన మాచరించి తిరుగ వచ్చి కూపస్నానమే విశేషంబుగా నెంచి గంగను విడిచి కూపస్నానమే చేయుచుండిన గంగాస్నాన ఫలంబు లేకుండుటయే కాక మరల పాపమధికమైనట్లు దృష్టాంతమందు జ్ఞాననదీస్నాననిష్ఠుండు కర్మకూప స్నానంబుఁ జేసినట్లు అవెనుక దీనికెన్నటికి విమోచనంబు లేదు. కాబట్టి ఇది యారూఢపాతిత్యము.

వాచావివేకమనఁగా వేదాంతార్థంబయిన పరతత్వతము యొక్క నిష్కర్ష లెస్సగా తెలియనేర్చి అనుభవంబులేక లోకవంచకుఁడై మాటల చేత నందఱిని భ్రమింపఁజేయుచు శిష్యులయొక్క విత్తమపహరించుచు నందఱికిని బోధించుచుండుట. దృష్టాంతము. లోకంబున నొకబ్రాహ్మణుండు అందఱికిని బ్రాహ్మణకృత్యములుదెలిపి తాను శూద్రకృత్యుండై యుండిన నెట్లు పతితుడగునో యట్లే కనుక నిది వాచావివేకిత్వము.

ఇట్లు జ్ఞానమార్గమందు పతితుడగుటకన్న కర్మయోగము క్రమాభివృద్ధిగాఁజేసినవామదేవమతప్రకారము[!] క్రిమముక్తి నొందఁగలడు. పరధర్మమైన జ్ఞానమార్గమందుండి తప్తముద్రాధారణము కృత్రిమజటాలంకారము ముండిత్వము మొదలగు ఆడంబరములతో మఠాధిపత్యము వ్యర్థమై ప్రమాదమును గలిగించునని తెలియుము.॥ ౩౫॥

అర్జున ఉవాచ:—

శ్లో॥ అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః ॥౩౬॥

—♦ భాష్యమ్ ♦—

నను చోరోఽపీత స్తతో నిరీక్ష్య గృహ్ణాత్యత సోఽప్య ధర్మం ధర్మం చ విజానాతీతి కుతో నాధర్మాన్మనుజో నివర్తత ఇత్యభిప్రేత్యాహ । అథేతి, ఏవంతర్హి కేన పాప్మనా ప్రయుక్తః ప్రేరితోఽయం పురుషోఽనిచ్ఛన్నపి బలాదివనియోజిత స్సన్పాపం చరతీతి తమనర్థమార్గప్రవర్తకం మాం ప్రతి బ్రూహీత్యర్థః ॥౩౬॥

—♦ లఘుటిప్పణీ ♦—

విజానాతీతి, తద్యథా 'జ్ఞాత్వా ప్యత్యంతవైరస్య యః పదార్థేషు కర్మభిః, బధ్నాతి భావనాం భూయో నరో నాఽసౌ సగర్ధభ' ఇత్యాది స్మృత్యా జానన్నపి స్వచిత్తం నబధ్నాతీ త్యత్ర కింకారణ మితి ప్రశ్నాశయః॥౩౬॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

ఓయీ చోరుఁడిటునటు పరికించి గ్రహించునుగదా ? జ్ఞానియైనవాఁడు ధర్మాధర్మములు తెలిసియు అధర్మము నెందులకు వదలక యుండునని చెప్పుచున్నాఁడు. ఓకృష్ణా ! జ్ఞానయోగమునఁబ్రవర్తించిన పురుషుఁడు విషయానుభవమునందిచ్ఛ లేనివాఁడైనను బలాత్కారముగా నియోగింపఁబడినవానివలె దేనిచేతఁ బ్రేరితుఁడైనను విషయానుభవ రూపమైన పాపము నాచరించుచున్నాఁడో తెలుపుము. ఏనరుఁడు తనచిత్తమే తనకు శత్రువని

తెలిసియుఁ బదార్థములయందుఁ జిత్తమును బోనిచ్చునోవాఁడు నరుఁడు గాఁడు గర్దభమని స్మృతులందుగలదు. కానఁతనచిత్తము నెందులకువాఁడు. నిరోధింపఁడో కారణమును జెప్పుమని ప్రశ్న ॥౩౬॥

శ్రీకృష్ణ ఉవాచ,

శ్లో॥ కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ ॥౩౭॥

—♦ భాష్యమ్ ♦—

నను 'ఇహైవాధోముఖం నాళదండే పద్మం వ్యవస్థితం। కదళీపుష్పసంకాశ మత్యతిష్ఠదశాంగుళం తత్పద్మే కర్ణికామధ్యే యథా విశ్రామ్యతే మనః। తదా సర్వగుణజ్ఞానే చైతన్యేఽపి మతిర్భవేత్, పూర్వేశానే కృపాజ్ఞానే ఉత్తరే భోగవర్ధినీ। నైరుత్యే తు దళే మోహాదక్షిణే క్రోధమత్సరా నిద్రాలస్యే తదా చాగ్నౌ సంధౌ జాడ్యం త్రిదోషదమి"త్యాది స్మృత్యా ప్రసిద్ధా అపి కామమూలా రాగద్వేషాదయః కుతః పురుషం ప్రతి బధ్నంతీత్యాహ, కామఇతి। ఏవంసతి యథోచిత వేదమర్యాదయా సేవితాః కామక్రోధ లోభమదమాత్సర్యేర్ష్యాఽసూయదంభ దర్పాహంకారా స్తూర్వారుకమివే తిన్యాయేన సాధకా అపి తద్భిన్నమర్యాదయా ధర్మ ప్రతిబంధకా ఏవేతి తేషాం తమోవిమిశ్రితరజోఽంశత్వేనమహాశనత్వమతో మహాపాప్మత్వం చేతీహసంసారే వైరిణమేనం సర్వానర్థమూలం కామం విద్ధీత్యర్థః॥౩౭॥

## —◆ లఘుటిప్పణీ ◆—

యథా విశ్రామ్యత ఇతి । 'ధౌతి ర్వస్తి స్తథా నేతి స్త్రాటనం నాలికా తథా । కపాలభాతి రేతాని షట్కర్మాణి ప్రచక్షత' ఇత్యాది స్మృత్యా షట్కర్మయుక్తస్యైవ యోగినో మనో విశ్రామ్యత ఇత్యధికం యోగశాస్త్రతోఽవధార్యమ్ 'కామా ద్ధర్మ స్తథా లోభా న్మదమాత్స ర్యతోఽపివా । కుర్వాణః స్వేష్ట మాసాద్య మోక్షం సాధనతః పర' మిత్యాది స్మృతిన్యాయేనాపి తే కామా స్సాధకా ఏవే త్యభిప్రాయేణైవ తే స్వాయంభువా రచితా దద్భిన్నవిషయత్వేనతు ప్రతిబంధకా ఇతి శ్రుతేః హార్ధ స్మృతిరన్వాగచ్ఛదితిరీత్యా వధేయమ్॥ ౩౭॥

## —◆ ఆన్ధ్రి తాత్పర్యము ◆—

ఓయీ ఈశరీరమందే దండాకృతియైననాళము గల్గి అరటిపువ్వు వలె నధోముఖమైనపద్మము 10 యంగుళములకు మించి యుండెను. ఆపద్మముయొక్క కర్ణికయందు మనస్సెప్పుడు విశ్రాంతిఁజెందునో అప్పుడు సర్వజ్ఞత్వము గల్గి చైతన్యమే నేనని బుద్ధి గల్గియుండును. పూర్వదళమం దున్నప్పుడు భూతదయగల్గి యుండును. ఈశాన్యదళమందున్నప్పుడు బ్రహ్మజ్ఞానములో నుండును. ఉత్తరదళమందున్నప్పుడు భోగవృద్ధిగలిగి యుండును. నైరుతిదళమందున్నప్పుడు మోహమునొందును. దక్షిణదళ మందున్నప్పుడు క్రోధము మాత్సర్యముఁ గలుగును. ఆగ్నేయదళమందున్న ప్పుడు అలసట నిద్ర గల్గును. దళసంధులయందున్నప్పుడు జడత్వము త్రిదోషములు గల్గునని స్మృతియుండఁగా కామమే మూలముగాఁగల రాగ ద్వేషాదులు పురుషుని బంధించునని ఎందులకుఁ జెప్పవలెననఁగా వేదోక్త ప్రకారము కామాదులను సేవించినయెడల దోసపందుకు బంధమువదలి నట్లు కామాదులు జ్ఞానసాధకములగును. వేదమర్యాదను మీఱినయెడల జ్ఞానప్రతిబంధకములే యగును. యేమనఁగా కామాదులు తమోగుణముతో

గూడిన రజోంశమైనందున మహాపాపులు, అసంతృప్తు లయినందున ఈ సంసారమందు సర్వాపదలకు మూలమైన కామము వైరియని తెలియుము, మనస్సు సంచలించినంతవఱకు సుఖము లేదు. విశ్రాంతియనునదే బ్రహ్మానందము. 'ధౌతి వస్తి, నీతి, త్రాటనము, నౌలికా, కపాలభాతి' ఈ ఆఱు యోగసాధనములవల్ల మనసు విశ్రాంతినొందును. కామాదులవలన నిష్టసిద్ధి నొందినపిమ్మట మోక్షము సాధించుట మంచిదని బ్రహ్మవానిని సృష్టించినాఁడు. భిన్నపరివర్తనము లైనచో ప్రతిబంధకము లగుచున్నవి.॥ ౩౭॥

శ్లో॥ ధూమే నాప్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేనచ।
యథోల్బే నావృతో గర్భ స్తథా తేనేద మావృతమ్॥౩౮॥

—◆ భాష్యమ్. ◆—

నను తే కథం పురుషం విపశ్చిద్రూప మప్యాచ్ఛాదయంతీ త్యావహ । ధూమే నేతి। తత్రైవం సతి యథా ధూమేన సహజేన ప్రకాశాత్మకో వహ్ని రాప్రియతె యథాచాదర్శో మలేన యథావోల్బేన జరాయుణా చావృతో గర్భ స్తథా తేన కామాదినేదం పురుషస్య జ్ఞాన మావృతమిత్యర్థః॥ ౩౮॥

—◆ ఆన్ధ్రి తాత్పర్యము. ◆—

ఆ కామాదులు జ్ఞానముగల పురుషునిఁగూడ నావరించుచున్నవే, యనఁ జెప్పుచున్నాఁడు. ఏపరికారము సహజమైన పొగచేఁ బ్రకాశమానమైన యగ్ని ఆవరింపఁబడినదో, దర్పణము మాలిన్యముచే నెట్లు గప్పబడినదో, మావిచే (జరాయువుచే) గర్భము (పిండము) ఎట్లాచ్ఛాదితమైనదో ఆప్రకారము కామాదులచేఁ బురుషుని జ్ఞాన మావరింపఁబడినది.॥ ౩౮॥

శ్లో॥ ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా
కామరూపేణ కౌంతేయ! దుష్పూరేణానలేనచ॥ ౩౯॥

—* భా ష్య మ్ *—

ఏవం పూర్వోక్త మేవోపసంహరన్నాహ॥ ఆవృతమితి॥ ఏవంతర్హి 'న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి। హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధత' ఇత్యాది స్మృత్యా చైతేన నిత్యవైరిణా కామరూపేణ దుష్పూరేణానలసదృశేనజ్ఞానినోఽపిజ్ఞానంసద్విచారలక్షణమావృతమిత్యర్థః। ౩౯॥

—♦ ల ఘు టి ప్ప ణీ. ♦—

కామః కామానామితి॥ నను పూర్వముక్త ముర్వారుకమివేత్యాది, ఇహతు న జాతు కామః కామానా మిత్యాది విప్రతిషిద్ధ మేతదితిచేత్ శృణు, 'అభుక్తభోగో యః కశ్చిద్భుక్తభోగోఽపి తంద్రితః। వర్ణాశ్రమవిపన్నో యః కామాద్యైః ప్రతిబధ్యత' ఇతిస్మృతిన్యాయేనా విరుద్ధత్వం బోధ్యంజ్ఞానినోఽపీత్యత్ర శాస్త్రజన్య సంస్కారవత్త్వేన జ్ఞానినోఽపీత్యర్థః॥ తద్యథా 'జ్ఞానం ద్వివిధ మాఖ్యాతం శాస్త్రీయం చార్థబోధజం। బోధా న్నిర్దహతే క్షిప్ర మశేషం పాపపంజరమిత్యాది ద్రష్టవ్యమ్ ॥౩౯॥

—♦ అ న్వ తా త్ప ర్య ము ♦—

పూర్వోక్తమైనదానినే యుపసంహరించు చున్నాడు—అగ్ని నాజ్యముచేఁ జల్లార్పలేనట్లు, కామము భోగముచేఁ దనివి నొందదు. కామము నిత్యవైరి, అగ్నిసదృశము, ఎంత పూజించినను నిండదు. ప్రతికూలము భోగానుభవములేని వానికెట్లు తొందఱ గలుగునో, అట్లేభోగములను భవించిన వానికిని దొందఱ గలుగును, కనుక వీరిరువురును సమానులే. వర్ణాశ్రమ విపత్తులో నున్నవాఁడు బద్ధుఁడుగాక మానఁడు కనుక మనస్సు

తునకు విరోధియగు కామము, సద్విచారముగల జ్ఞానియొక్కయు జ్ఞానము నావరించియున్నది. అనఁగా జ్ఞానము రెండు విధములు ప్రవృత్తి జ్ఞానము నివృత్తిజ్ఞానము.

ప్రవృత్తి జ్ఞాన మనఁగా విషయజ్ఞానమనియు శాస్త్రజ్ఞానమనియుఁ జెప్పఁబడును. నివృత్తి జ్ఞానమనఁగా అనుభవజ్ఞానమనియు నిర్విష యజ్ఞాన మనియు స్వప్రకాశజ్ఞానమనియుఁ జెప్పఁబడును. జ్ఞానమొక్కటేగదా దానిని ప్రవృత్తి యనియు, నివృత్తి యనియుఁ జెప్పఁదగునా యన జ్ఞానము స్వానుభవమైనయెడల నివృత్తి జ్ఞాన మనఁదగును. ఆజ్ఞానము వాచాజ్ఞాన మైనయెడలఁ బ్రవృత్తి జ్ఞాన మనఁదగును. ప్రవృత్తి జ్ఞానమువలన సభారంజన మాత్రమే ప్రయోజనము. అనుభవమైన నివృత్తి జ్ఞానము మోక్షప్రదము. ఇట్టి యనుభవజ్ఞానిని గామమావరింపదు. శాస్త్రజ్ఞానినే యావరించును. ౩౯

శ్లో॥ ఇంద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే ।
ఏతై ర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్॥ ౪౦

—♦ భాష్యమ్ ♦—

నను జ్ఞాతే హి శత్రో రధిష్ఠానే సులభేన స జేతుం శక్యత ఇతి తదిష్ఠాన మప్యాహ । ఇంద్రియాణీతి, తథా చేంద్రియాణి శబ్దస్పర్శరూపరసగంధగ్రాహకాణి శ్రోత్రాదీని ఏవంచ వచనాదానగమనవిసర్గమోహనగ్రాహకాని కర్మేంద్రియాణి । మనోబుద్ధిభ్యాం సహితాన్యస్య కామాదే రధిష్ఠానముచ్యత ఇత్యర్థః । ఏవంసత్యేతై రేవాధిష్ఠానభూతై ర్దేహినం జీవం తద్జ్ఞాన మావృత్య విమోహయతీత్యర్థః॥౪౦॥

—♦ లఘుటిప్పణీ ♦—

శ్రోత్రాదీనీతి॥ శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణాఖ్యాని త్యర్థః।
కర్మేంద్రియాణీతి॥ వాక్పాణిపాదపాయూపస్థాఖ్యాని త్యర్థః॥ ౪౦॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

శత్రువైన కామముయొక్క నివాసము దొరకినయెడల సులభముగా దానిని జయింపవచ్చునని యధిష్ఠానమును జెప్పుచున్నాఁడు. శబ్దస్పర్శ రూపరసగంధములను గ్రహించునవి శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములు. వచనాదానగమనవిసర్గమోహములను గ్రహించునవి వాక్పాణిపాదపాయూపస్థులు, మనోబుద్ధులు గలిసిన యీదశేంద్రియములు కామాదులకు నివాసము. కామాదులీస్థానముల వర్తించునవియై, జ్ఞానము నావరించుకొని దేహిని మోహింపఁజేయుచున్నవని యర్థము. ౪౦.

శ్లో॥ తస్మా త్త్వ మింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ!
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్॥ ౪౧

—♦ భాష్యమ్ ♦—

నను తస్మాత్కింకరణీయ మస్తీత్యాహ—తస్మాదితి॥ తత్రత్వా త్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య వశీకృత్య జ్ఞానవిజ్ఞాన నాశన మేవం పాప్మానం, సర్వమూలం కామం జహీత్యర్థః॥ ౪౧

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

అధిష్ఠానము దొరకినంత నేనేమి చేయవలె ననఁగా జెప్పుచున్నాఁడు- ఓయర్జునా! నీవు ముందుగా నింద్రియములను వశపఱచుకొని, అంతకును మూలమై జ్ఞానవిజ్ఞానముల నశింపఁజేయుపాపియైన కామమును విడువుము. (జయింపుము.) దృఢతర మపిథాయ ద్వార మారాత్కథంచి త్స్మరణ

విపరివృత్తా దర్శనే యోషితాం వా। పరిణతి విరసత్వం దేహభీభత్స తాం వా పరితముహు రనుచింత్యోన్మూలయే త్కామ శత్రుమ్' కామ నివాసమైన దశేంద్రియద్వారములను బిగించి స్త్రీలయొక్క స్మరణ దర్శన, స్పర్శనాదుల విడిచి వృద్ధావస్థయందును, దేహము బీభత్సమైనప్పుడును గల విరసత్వమును మాటిమాటికిఁ జింతించి కామము నున్మూలన చేసివేయుము.॥ ౪౧॥

శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః।
మనస స్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరత స్తు సః॥ ౪౨

—♦ భా ష్య మ్ ♦—

నను కథంచి ద్బాహ్యేంద్రియజయేనైవ కథం కామాదే ర్జయ ఇత్యాహ - ఇంద్రియాణీ తి॥ తథాచ శబ్దాది విషయేభ్య ఇంద్రియాణి పరాణి సూక్ష్మాణి ప్రబలానిచేత్యర్థః ఏవం తేభ్యో మనః పరం మనసస్తు బుద్ధిః పరా తతో బుద్ధేః పరతర స్తచ్ఛబ్దేనలక్ష్యోఽఖండః పరాత్మా తురీయ శ్శివ ఇత్యర్థః॥౪౨

—* ల ఘు టి ప్ప ణీ *—

న 'న్యన్న పారిణమనో విజ్ఞానే' త్యవచ్ఛిన్నవాదే కోశచతుష్టయాతీతత్వేన కామాదేర్జ యాత్కథమాత్మో పలబ్ధిరిత్యు పసంహరతి। తథాచేతి ఏవంసతి। లక్ష్యలక్షణ విశేష్య విశేణసామానాధి కరణ్యంచేతి త్రితయత్వా వచ్ఛేదేన సంబంధేన భాగత్యాగలక్షణయాపరాత్మా శివోఽసంగోపగమ్యత ఇతిభావః॥ ౪౨॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఎట్లైనను గష్టపడి బహిరింద్రియంబులు నిగ్రహించిన మాత్రానఁ గామాదుల జయంచుట యెట్లనఁగాఁ జెప్పెద వినుము - శబ్దాది విషయ

ములకంటె సూక్ష్మేంద్రియములుబలమైనవి. వానికంటె మనస్సుబలమైనది; దానికంటె బుద్ధి ఉత్కృష్టమైనది, బుద్ధికంటెఁ బరమైనది, తచ్ఛబ్దవాచ్య లక్ష్యమై అఖండమై తురీయమైన పరమాత్మ శివుండని యర్థము. ఓయీ! అన్నమయప్రాణమయ మనోమయ విజ్ఞానమయకోశముల కతీతములైనం దునఁ గామాదుల జయించినను ఆత్మస్వరూపమెట్లు దొరుకునని యుప సంహరించు చున్నాఁడు. జీవుఁడనగా! అవిద్యోపాధి (కార్యోపాధి) కించిద్జ్ఞత్వము, కర్తృత్వము, భోక్తృత్వము. మొదలయిన గుణములు గలవాఁడు. విశ్వుడని, తైజసుఁడని, ప్రాజ్ఞుడనియు చెప్పఁబడును. విశ్వుఁ డనగా స్థూలశరీరాభిమాని, తైజసుఁడనగాఁ సూక్ష్మశరీరాభిమాని, ప్రాజ్ఞు డనఁగాఁ గారణశరీరాభిమాని, ఇది జీవలక్షణము. ఈశ్వరుఁడనగా! (కారణోపాధి) మాయోపాధి, సర్వజ్ఞత్వము, సర్వనియంతృత్వము, సర్వకర్తృత్వము, సర్వభోక్తృత్వము, మొదలయిన గుణములు గల వాఁడు. విరాట్టు (హిరణ్యగర్భుఁడు) సూత్రాత్మయనియు, (అంతర్యామి) ఈశ్వరుఁడనియుఁ జెప్పుదురు. విరాట్టనఁగా స్థూలశరీరాభిమాని; అనఁగా? సకలజీవులయొక్క స్థూలశరీరములు విరాట్టనిపించుకొనును. సూత్రాత్మ యనఁగా (సకల జీవులయొక్క సూక్ష్మశరీరములు) సమష్టిసూక్ష్మ శరీరాభిమాని. అంతర్యామి యనఁగా సమష్టి కారణ శరీరాభిమాని (సర్వజీవుల కారణశరీరములు) ఇది ఈశ్వర లక్షణంబు. ఇట్లు విరుద్ధధర్మ ములుగల జీవేశ్వరులకు ఐక్యమెట్లు సిద్ధించుననఁగా? పతి, పశు, పాశము, అని మూఁడు పదార్థములు. పాశమనఁగా మాయ, పశువనఁగా జీవుఁడు, పతి, యనఁగా నీశ్వరుఁడు. పాశము వదలినపశువు పతియగును. అనఁగా బంధముక్తుఁడైనజీవుఁడు, ఈశ్వరుఁడగును. జీవధర్మములైన అవిద్యోపాధి కించిత్ జ్ఞాత్వాది గుణములను ఈశ్వరధర్మములైన మాయోపాధి సర్వజ్ఞ త్వాదిగుణములను దీసివేయఁగా జైతన్యమొకటే కావున 'సోఽయం దేవదత్తః' అనునట్లు భాగత్యాగ లక్షణలచే జీవుఁడు శివుండగును. ఇట్టి యాత్మోపలబ్ధిచేఁ గామాదులు నశించి పోవును. 'యల్లాభా న్నాపరో

లాభః' ఆత్మానంద మనుభవించిన వాఁడు, విషయానంద మనుభవించఁడు. కాన, కామాదులు నశించినవి. ౪౨.

శ్లో॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా ।
జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్॥

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
కర్మయోగః.

—♦ భా ష్య మ్ ♦—

నన్వేతతః కిం ఫలితమిత్యాహ - ఏవంసతి । శివమద్వైతం పూర్ణ మాత్మానం బుద్ధేఃపరం బుద్ధ్వాసాక్షాత్కృత్యాత్మనాంతఃకరణే నాత్మానం సంస్తభ్య స్థిరీకృత్య కామరూపందురాసదం । దుర్ధరం శత్రుం జహీతి పరమార్థః॥౪౩॥

ఇతి శ్రీశ్వేతాచార్యగురుచరణ శిష్యభావ సమాసాదిత
శైవసిద్ధాన్తప్రవర్తక శ్రీశ్రీకంఠశివాచార్య విరచితే
తత్త్వైకదర్శననామకే గీతాభాష్యే
క ర్మ యో గః.

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నన్వేతావతాపి కథం దుర్ధర్షః । కామోజేతవ్య ఇత్యాహ—స్థిరీకృత్య యమనియమాసనప్రాణాయామప్రత్యాహార ధారణధ్యానసమాధినాధిష్ఠానం సమస్తస్యేతరీత్యాఽవశ్యం శివైకత్వం స్థిరీకృత్య కామోజేతవ్యఇత్యభిధేయమ్॥ ౪౩॥

ఇతి శ్రీశ్రీకంఠ శివాచార్యశిష్య విశ్వేశ్వర శివాచార్య
విరచితాయాం లఘుటిప్పణ్యాం కర్మయోగః.

## —♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

ఓయీ! కడపటకు ఫలితమేమనఁగాఁ గామజయోపాయమును జెప్పుచున్నాఁడు - శివుండొక్కఁడే జగత్తంతయు నిండి యాత్మగా బుద్ధికిఁ బరమైయుండెనని తెలిసి సాక్షాత్కరించికొని, యమము నియమము ఆసనము ప్రాణాయామము ప్రత్యాహారము ధారణము ధ్యానము సమాధి యనెడి అష్టాంగయోగములచే సమస్తమునకు నాధారమైనట్టి శివైకత్వమును స్థిరపఱచుకొని జయింపరాని శత్రులైన కాముని జయించుమని పరమార్థము॥ ౪౩॥

ఇట్లు శివాద్వైతదర్శనమను శ్రీకణ్ఠీయ గీతాభాష్యమునకు బోధానంద మహర్షిచే రచియింపఁబడిన భావబోధమను నాంధ్రి తాత్పర్యమున గర్మయోగము.

---

ఓ మ్.

# శ్రీమచ్ఛ్రీకంఠాచార్యకృతే

# శ్రీ భగవద్గీతా భాష్యే

## బ్రహ్మార్పణయోగః.

శ్రీకృష్ణ ఉవాచః—

శ్లో॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్।
వివస్వా న్మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్ ॥ ౧॥

—♦ భాష్యమ్ ♦—

'సబాహ్యాభ్యాంతరైః కర్మ యత్కర్తవ్యం త్వయార్జున బ్రహ్మార్పణం చతుర్థేతు సోఽర్జునా యాబ్రవీద్ధరిః॥' నన్వయం జ్ఞానయోగః కర్మయోగశ్చ కస్మాత్పరం పరాతః ప్రాప్త ఇత్యాహ—ఇమమితి॥ తథాచాదౌ 'శివాజ్ఞయా తప స్తప్త్వా జ్ఞానవిజ్ఞానసంయుతః।కృత కృత్యోహ్య భూత్పూర్వ మర్జునాయ యథోక్తవా ని'త్యాది పాద్మోక్త్యా సదాశివాత్స్వయం విజ్ఞాత తత్వోఽహ మధ్యాయద్వయే నోక్తం పరంపరాప్రాప్తత్వేనా వ్యయం యోగం వివస్వతే సూర్యాయ ప్రోక్తవాని త్యర్థః। ఏవం వివస్వా న్మనవే వైవస్వతాయ మను శ్చేక్ష్వాకవే క్షత్రియ వర్యా యాబ్రవీదిత్యర్థః ౧॥

—* లఘుటిప్పణీ *—

నను యది మాం గురుత్వేన వృణోషి చేత్తర్హి త్వమనళ్యంభు పదారవిందయో' రిత్యాది స్మృతిన్యాయేన 'యస్య దేవేపరా భక్తి' రితిశ్రుతిన్యాయేనచ తద్భావేనైవ సర్వం శివార్పణం కుర్వి త్యాహ। సబాహ్యేతి। తద్యథా, 'పరమాద్వైతనిష్ఠాయ పరయోగినే శరీరమర్ధం ప్రాణంచ ప్రదద్యా చ్ఛ్రద్ధయా సహే'త్యాది స్మృత్యంతరాదపి ద్రష్టవ్యమ్ నను ప్రత్యక్షానుమానోపమాన శబ్దార్థా పత్త్యనుపలబ్ధిభ్యో శిష్టాచారతుష్టి సంభవభేదా ద్దశవిధప్రమాణం మతభేదే నోక్తం। తత్ర శ్రుతి స్మృతిసిద్ధమైతిహ్యమపి యథోక్తం ప్రమాణయన్నాహ। పరంపరా ప్రాప్తత్వేనేతి, 'ఇతి శుశ్రుమ ధీరాణాం యేన తద్వ్యాచచక్షిరే' ఇత్యాదిశ్రుత్యంతరాదపీత్య వధార్యమ్॥ ౧॥

—◆ ఆన్ధ్రతాత్పర్యము. ◆—

శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు-కృష్ణుఁడు, శివాద్వైతనిష్ఠగల శివయోగికొఱకు శరీరార్ధప్రాణములచేఁ జేయబడుకర్మను బ్రహ్మార్పణముఁ జేయుమని ఈనాలుగవ యధ్యాయమునందుఁ జెప్పుచున్నాడు-ఓయర్జునా! ఈ జ్ఞానయోగ కర్మయోగములు పరంపరగా నెట్లువచ్చినవందువా! చెప్పెదవినుము. ఆదియందు నేను దపముఁజేసి సదాశివాజ్ఞచే జ్ఞానవిజ్ఞానములుగలిగి కృతకృత్యుఁడనైతిని. ఆజ్ఞానమునే నీకుఁజెప్పితిని. రెండధ్యాయములుగాఁ బరంపరా ప్రాప్తమైనదిగాన నీయోగమును సూర్యునకుఁ జెప్పితిని. సూర్యుఁడు వైవస్వతమనువుకొఱకును, వైవస్వతమనువు క్షత్రియుఁడైన యిక్ష్వాకునికొఱకు నుపదేశించెను. ఓయర్జునా? నీవు నన్ను గురువునుగాఁజేసికొంటివా? సదాశివ చరణములయందు మనస్సునుంచుము. నీవుచేసిన కర్మను ఈశ్వరార్పణముచేయుము. ॥౧॥

శ్లో॥ ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః।
సకాలేనేహ మహతా యోగో నష్టః పరంతప! ॥౨॥

—♦ భా ష్య మ్. ♦ —

ఏవ మిహాదిత్యమారభ్య గురుశిష్యపరంపరాం పున రవ ధారయ న్నాహ-ఏనమితి॥ తత శ్చైవం పరంపరయా సూర్యాదివంశోద్భవా రాజర్షయో ప్యేనం యోగం విదురిత్యర్థః। సచ యోగః కాలేన మహతా దీర్ఘేణేదానీ మావయో ర్వ్యవహారకాలే ద్వాపరాంతే దుష్టవాసనయా భిభూయమానత్వేన నష్టస్త మవధారయే పరంతప ఇత్యనేన దర్శితమ్॥౨॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

దర్శితమితి॥ ఇహ పరం శత్రుం తాపయసీతి పరంతప స్తత స్త్వం బోధనే హేపరంతప ఇత్యనేన దర్శితమిత్యర్థః ॥౨॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

శత్రువును తపింపఁజేయునో యర్జునా! సూర్యుఁడు మొదలుకొని గురుశిష్యపరంపరా ప్రాప్తించిన ఈ యోగమును రాజర్షులెఱుంగుదురు. అట్టియోగము చాలాకాలమునుండి నష్టమైనది. ద్వాపరాంతమందు దుష్టవాసనచే నష్టమైనదానిని తిరిగి గ్రహించవలెను. ॥౨॥

శ్లో॥ స ఏవా యం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్ ॥ 3॥

—* భా ష్య మ్ *—

నను కథం భూతోఽయం యోగ ఇత్యాహ స ఏవేతి॥ త్రైవంసతి సదాశివోపలబ్ధ పరంపరయా పురాతనోఽయంయోగోయతో భక్తోసి సఖా చేతి తత స్తుభ్యం రహస్యం హేత దుత్తమం బ్రవీమీత్యర్థః॥ 3॥

—◆ లఘుటిప్పణీ ◆—

ఏవంసతి ధర్మాత్మజ స్సబభూవ పితేతి ప్రత్యభాషతేతి భారతోక్త్యభిప్రాయేణ 'ధర్మస్య దక్షదుహితరీ' త్యత్రభాగవతే ప్యుక్తమితి వివేక్తవ్యమ్॥ ౩॥

—◆ ఆన్వితాత్పర్యము ◆—

ఈ యోగమెట్టిదనఁగాఁ జెప్పెదను - సదాశివ గురుపరంపరగా వచ్చిన ఈయోగము పురాతనమైనది. నీవు భక్తుఁడవు, స్నేహితుఁడవు. కాన రహస్యమైనదియును ఉత్తమమైనదియునైన ఈ యోగమును నీకుపదేశించితిని.॥ ౩॥

అర్జున ఉవాచ—

శ్లో॥ అపరం భవతో జన్మ పరంజన్మ వివస్వతః
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవానితి॥ ౪॥

—✻ భాష్యమ్ ✻—

నన్వేవమో రాజన్మసాహిత్యస్య సత్వే త్కథం భగవత స్సర్వజ్ఞత్వ మిత్యాశంక్యాహ - అపరమితి। ఏవం తర్హ్యపరం మతాసహిత్యేన భవతోజన్మని వివస్వతశ్చ పరం పూర్వం సృష్ట్యాదౌ జన్మాభూదితి కథం త్వమాదౌ వివస్వతేప్రోక్తవానితి నజానీమ ఇతిప్రశ్నః॥ ౪॥

—◆ లఘుటిప్పణీ ◆—

నజానీమఇతి॥ ఏవంస 'త్యే తన్నానావతారాణాం నిదానం, బీజమవ్యయం యస్యాంశాంశేన సృజ్యంతే దేవతిర్యఙ్నరాదయః' ఇత్యేతద్వృత్త మజానతోక్తం నజానీమ ఇత్యాశయః॥ ౪॥

—* ఆ న్ధ్ర తా త్ప ర్య ము *—

అర్జునునివాక్యము. ఓయీ మనమిద్దఱమును సృష్టిమొదల్కొని యుంటిమంటివా! ఈశ్వరునకు సర్వజ్ఞత్వ మెట్లుండును! అనఁగా జెప్పు చున్నాఁడు. కృష్ణా! నీజన్మయు నాజన్మయు నొక్కమాఱయినది. సూర్యుఁడు జన్మించి యిరువది యెనిమిది చతుర్యుగములయినది, నీవు సూర్యునకుపదేశించినమాటను నేనెట్లు తెలిసికొనఁగలుగుదును! నాకు సమ కాలికుఁడవైననీవుపూర్వమున నేసూర్యునకుపదేశించుటయెట్లుసంభవమగును. (ఎవనియంశచేత దేవతిర్యఙ్మనుష్యాదులు సృజింపఁబడుదురో, యవ్య యుండగు నాసదాశివుఁడే శ్రీకృష్ణుని నానావతారములకును నాదికార ణమను విషయ మర్జునునకుఁ దెలియక యడిగెనని యెఱుంగవలెను).॥ ౪॥

శ్రీకృష్ణఉవాచ—

శ్లో॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున!
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప!॥ ౫॥

—* భా ష్య మ్ *—

తతోఽర్జునస్య విస్మయం నిరాకర్తుం పూర్వవృత్త మాహ - బహూనీతి ఏవంసత్యావయో ర్జన్మాని బహూని వ్యతీతాని తాన్యహం సర్వాణ్యపి 'పీతాంబరం త్రిపుండ్రం చే' త్యాది పాశుపతవ్రతోపాసనయా 'యస్మిన్ విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం భవతీతి' పరబ్రహ్మణ శ్శివైక భావనయా చ వేద్మి కింతు హే అర్జున! కిం వృక్షత్వ మాపన్నోఽసీత్యా శయః॥ ౫॥

## —♦ లఘుటిప్పణీ ♦—

వృక్షత్వమి॥ 'అర్జునోఽస్తి వనే వృక్షః పాండవే ష్వస్తి సోఽర్జున' ఇత్యాది కోశోక్త్యా కింత్వం జడత్వేన వృక్షత్వ మాపన్నోఽసీతి నబుధ్య సఇత్యాశంక్యోక్తిరితి భావః॥ ౫॥

## —♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

శ్రీకృష్ణుండిట్లనియె॥ ఈశ్లోకమంచు నర్జునుని యాశ్చర్యమును బోఁగొట్టుట కొఱకుఁ బూర్వవృత్తాంతమును జెప్పుచున్నాఁడు ఓ యర్జునా? నీకును నాకును బెక్కుజన్మములుగతించినవి, సృష్టిమొదలుకొని నీవును నేనును జన్మపరంపరలలో నే యుంటిమి. పీతాంబర త్రిపుండ్రధారణాది పాశుపత వ్రతోపాసనచే, 'నేయది తెలిసినచో నీసర్వప్రపంచమంతేయును దెలియునో అట్టి పరబ్రహ్మమును శివోఽహం భావనచేత నే వెనుకటి నీ నా జన్మలను నేనెఱుఁగుదును, ఓయర్జునా? నీవు వృక్షమవయి జడత్వముతో నుంటివా? అరణ్యమంచు నర్జునవృక్ష (మద్దిచెట్టు) మున్నది. అది పాండవులలో నున్నదని యనుకొనవలయునా? ఏమియును నెఱుంగక నీవుండుటచే నావిధమునఁ దలంపవలసినది గానున్నది. (అర్జునమనఁగా మద్దిచెట్టునకు బేరు.)॥ ౫॥

శ్లో॥ అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరో పి సన్
ప్రకృతిం స్వామధిష్ఠిత్య సంభవా మ్యాత్మమాయయా ॥ ౬

## —♦ భాష్యమ్ ♦—

నను యది పరమాత్మ తాదాత్మ్యేన బ్రహ్మీభూతస్త్వర్హి కథం తే పునరావృత్తిలక్షణం జన్మేత్యాహ—అజోఽపీతి॥ ఏవంతర్హి పరమశివోపాసనయా బ్రహ్మీభావేనాజోఽపి సన్నవ్యయాత్మా తథా తదిచ్ఛయైవ భూతానా మీశ్వరో

నియంతాపి, సన్నాత్మన శ్శివస్య మాయయా ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవామీత్యర్థః॥౬॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

పరమాత్మరూపము, దర్శించి బ్రహ్మభావమునొందిన నేను బున ర్జన్మమెందులకు గలుగవలెననఁగాఁ జెప్పుచున్నాఁడు.—పరమ శివోపాస నచే బ్రహ్మమై జననమరణములులేని వాఁడనైనప్పటికిని శివత్వము బ్రాప్తించినవాఁడనైనప్పటికినిఈశ్వరమాయచేనాప్రకృతియందు నేనుబుట్టు చున్నాను॥౬॥

శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్॥౭॥

—* భా ష్య మ్ *—

ననుదేవదేవేచ్ఛయా కదా తే ప్రాదుర్భావఇత్యాహ— యదాయదేతి॥ తత్రైవ్రవసతి॥ స్తువంతం తం సమాలోక్య తప సా కర్శితం హరిం, యుగే యుగే చ మద్భక్త్యా లోకానాం కార్యమావహే త్యాది కూర్మస్మృత్యా యదాయదా వేదా విహితస్య ధర్మస్య గ్లానిర్భవతి, ఏవం యదాయదా వేదవిరుద్ధ స్య అభ్యుత్థానం భవతి తదాత్మానం పరేచ్ఛయా నానా విధావతారరూపేణ సృజామీ త్యర్థః॥౭॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

తపసేతి॥ తత్రనారాయణో దేవః స్వాత్మనః పరమేశ్వరం ఆశ్రిత్య శేషశయనః పూజయన్ యోగనిద్రయేత్యాది క్రమేణ కూర్మపురాణే

కేపసా కర్శితం స్తువంతం చ హరిం సమాలోక్య సదాశివేనోక్త మిత్యాశయః॥౭॥

—◆ ఆన్ధ్రి తాత్పర్యము ◆—

ఓయీ! దేవదేవుఁడయిన మహాదేవునియొక్క ఆజ్ఞచే నీ వెప్పుడెప్పుడు పుట్టుచుందువని యడిగెదవా? చెప్పెదను. నారాయణుండు తన కధిపతియైన సదాశివుని నాశ్రయించి పూజించి యోగనిద్ర (సమాధి) లో నుండఁగా సదాశివుండు సాక్షాత్కరించినతఱి దపముచేఁ గృశించి తన్ను స్తుతించుచున్న హరినిఁజూచి; 'ఎప్పుడెప్పుడు వేదవిహితమైన ధర్మము శిలమగునో, యెప్పుడెప్పుడు వేదవిరుద్ధధర్మములు లేచునో అప్పుడప్పుడు ప్రతియుగమందును నానావిధావతార రూపములచే నవతరించి నాభక్తిని విడువక లోకకార్యములు జేయు' మని సదాశివుం డాజ్ఞాపించినందునఁ బరమేశ్వరుని యాజ్ఞాప్రకారమవతరించి లోకకార్యములు జేయుచుందు నని వచించెను. (కూర్మపురాణముఁజూడుడు.) ౭.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥౮॥

—◆ భాష్యమ్ ◆—

నను కస్మై ప్రయోజనాయైతావతా క్లేశం ధారయసి చేత్తత్రాహ - పరిత్రాణాయేతి।తత్రైతావ ద్వేదమార్గస్థానాం సాధూనాంపుణ్యకర్మణాం పరిత్రాణాయఏవం దుష్కృతాంపాప కారిణాం వేదబ్రాహ్మణ శివనిందకానాం కంసాదీనాం రాక్షసానాంచ వినాశాయే త్యర్థః। తదేతదప్యుక్తం కూర్మపురాణోక్తతో లబ్ధవరః కృష్ణో జనయిత్వాసుపుత్రకాన్ హత్వా చ కంసం నరక మన్యాంశ్చ బహవోఽసురా'నిత్యాదిద్రష్టవ్యమ్॥౮॥

—♦ లఘుటిప్పణీ ♦—

బ్రాహ్మణేతి॥ తదిదం స్కాందే దుర్వాససం ప్రతి ద్రౌపదీవచనం। తద్యథా । 'భగవన్ దేవకీపుత్రోఽపి బ్రహ్మణ్యో భక్తవత్సలః । సదాశివ ప్రసాదేన లేభే పుత్రాన్ సహస్రశః, ఇత్యాద్యన్యత్ర బహుశః॥౭॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

ఇన్ని యవతారములెత్తి యే ప్రయోజనము కొఱకు నింతకష్టపడు చుంటివని యడిగెదవా? చెప్పెదను. 'సదాశివునియొక్క యనుగ్రహము నకుఁ బాత్రుఁడైన కృష్ణుఁడనేకవరములనుబొంది భక్తవాత్సల్యము గలిగి, అనేకవేల పుత్రులను గనెను.' అని స్కాందపురాణమునందుఁ దూర్వా సునిగుఱించి ద్రౌపది యిట్లు చెప్పినట్లున్నది. కూర్మపురాణమునందు, 'సదాశివునివలన వరమునుపొంది పుత్రులను గని కంసుని నరకుని జంపి యన్యులయిన రాక్షసులనేకులఁ జంపినట్లున్నది. కాన వేదమార్గస్థులయి పుణ్యకర్మల నాచరించు సాధుల రక్షించుకొఱకును, వేదమును, బ్రాహ్మ ణులను, శివుని నిందించుపాపులను, గంసాదిరాక్షసులను వధించుకొఱ కును ననేకకష్టములపడి శివాజ్ఞాపరిపాలనము చేయుచు ధర్మమునుద్ధరించు టకునై యుగయుగమునను బుట్టుచున్నాఁడను.॥౭॥

శ్లో॥ జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున!॥౯॥

—♦ భాష్యమ్ ♦—

నన్వస్మదాదివ జన్మకర్మాదే స్తవాపి సత్త్వాత్కో విశేష ఇత్యాశంక్యాహ - జన్మేతి॥ ఏవంతర్హి శివైకతాదాత్మ్యేన తత్త్వతో నిత్యసిద్ధస్య జన్మకర్మాదికం లీలయా యో వేత్తి సత్యక్త్వా దేహం పునర్జన్మ నైతి నప్రాప్నోతి। కింతుమాం

శివమద్వైతం తురీయ మహాంగిరోపాసనయైతి ప్రాప్నోతీత్యర్థః। సహ్యాన్యజ్ఞానా దన్యగతా నర్థనివృత్తి రిత్యథాతో బ్రహ్మజిజ్ఞాసే త్యనేనవివేక్తవ్యమ్॥౯॥

—◆ లఘుటిప్పణీ ◆—

అహాంగిరోపాసనయేతి॥ తథాచ । 'యస్యదేవే పరాభక్తి ర్యథాప దేవేతథా గురావి' త్యా ది శ్రుతిన్యాయేన వేద్యై రనేకై రహమేవవేద్య ఇత్యాది శ్రుత్యుక్తరీత్యా చ మామేతీ త్యర్థః॥౯॥

—◆ అర్థి తాత్పర్యము ◆—

ఓకృష్ణా! నీకునుమావలె జన్మ కర్మలున్నందువలన విశేషమేమం దువేమో, చెప్పెదను. శివతాదాత్మ్యముచే నిత్యసిద్ధుడనైననాయొక్క జన్మ కర్మాదికమును లీలగా నెవఁడు తెలిసికొనుచున్నాఁడో, వాఁడు దేహ మును వదలి పునర్జన్మనొందఁడు. దేవునియందు, గురువునందు సమభావన నుంచి తానెవరో తెలిసికొనుట కొఱకే వేదములన్నియుఁ బుట్టినందున, అహాంగిరోపాసనచే 'నద్వైతము తురీయము నైన శివుండు నేన'ని యుపా సించిన నన్నుఁ బొందుదురు. తన్ను జీవునిఁగాఁ దెలిసినచో జననమరణములు వదలవు. కనుక నే 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' అని ప్రారంభించి బ్రహ్మ మీమాంసలో జీవబ్రహ్మైక్యము ప్రతిపాదింపబడినందునన హాంగిరోపాసనచే శివత్వ ప్రాప్తి గలుగును॥౯॥

శ్లో॥ వీతరాగ భయక్రోధా మన్మనామా ముపాశ్రితాః।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః॥౧౦॥

—◆ భాష్యమ్ ◆—

తస్మా ద్వస్తుతః కింకరణీయ మస్తీ త్యాహ - వీతేతి। ఏవంసతి వీతా స్త్యక్తా రాగాదయో యేషాం తే మయ్యే

హంకారసాక్షిణి సదాశివే మనో యేషాం తే తత్త్వతో మాం జ్ఞాత్వా జ్ఞానతపసా పూతాః సన్తో మద్భావం మదీయం పరం పదం యథోక్తం భూమాఖ్యమాగతాః ప్రాప్తా భవంతీత్యర్థః

—* లఘుటిప్పణీ *—

జ్ఞానతపసేతి॥ 'కి ముగ్రైశ్చ తపోభిః స్యా ద్యస్య జ్ఞానమయం తపః। ఇత్యాది శ్రుతేరితిభావః। పరంపదమితి। తదేతత్ స్కాందేఽప్యుక్తమ్। తద్యథా। పదం యత్పరమం విష్ణో స్తదేవాఖిలదేహినాం పదం పరమమద్వైతం సశివ స్సాంబవిగ్రహ ఇత్యాదిద్రష్టవ్యమ్॥ ౧౦॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

అందువలన ముఖ్యముగాఁ జేయవలసిన దేమనఁగాఁ జెప్పుచున్నాఁడు- రాగము, ద్వేషము, కామము, క్రోధము, లోభము. మదము: మాత్సర్యము, ఈర్ష్యా, అసూయ, దంభము. దర్పము, అహంకారము, ఈపదుమూఁడు గుణములనువదలి; అహంకారసాక్షినిగానున్న సదాశివుండైన నాయందు మనసునిలిపి, అనుభవముచే నన్నుఁ దెలిసికొని జ్ఞానతపముచేఁ బవిత్రులైనవారు భూమయను పేరుగల నాయొక్క పరమపదమును బొందుదురు. జ్ఞానతపముఁజేయువారుగ్రమైన తపములఁ జేయనక్కఱలేదు, "జ్ఞానతపోవిధానము। స్థూలదేహమునుజూచి చూచునది నేత్రముగదాయని నేత్రంబుగానిచ్చి తాను నేత్రమనుకొనుచు, నేత్రంబును జూచునది మనస్సుగదాయని తాను మనస్సనుకొని, మనస్సును జూచునది బుద్ధిగదాయని తాను బుద్ధియై యుండి, ఆబుద్ధిని యెరుగునది చిత్తంబుగదా యని తాను చిత్తమై యుండి చిత్తమనఁగా నెరుక గదా యని తెలిసి తానెఱుకగానుండి, ఆయెఱుకచేత దేహమును బాహ్యేంద్రియములను, అంతఃకరణవృత్తులను, ప్రాణములను, అన్నిటిని, దెలిసి దానుగానని, యొకటొకటిత్రోసివేసి, యన్నిటిని యెఱిగెడు యెఱుక

తౌనుగానిల్చి యానిలకడకు హానిలేదనికని, యెఱుకకు నిద్రియందు మఱపుగలుగుచుండఁగా యెందుకుహానిలేదందువేమో ఇది యెఱుక ఇది మఱపు అని యెఱిగినదియు నెఱుకయేగాన హానిలేదు. ఎఱుకయనఁగా జ్ఞానముగదా? అట్టిజ్ఞానమె వరిదియనిన నాదే అయియుండెను గాన అహంకారసాక్షిగానున్న సదాశివుండ నేనను నిరూఢజ్ఞానమే జ్ఞానతపస్సు, ఇట్టి తపముచే 'నేను గర్తను, భోక్తను' అను యజ్ఞానము నశించి పరమపదము ప్రాప్తించును। తద్విష్ణోః పరమం పదం = ర్యత్పరమంపదం। విష్ణువునకును, అఖిలజీవులకును యేది పరమపదముగలదో, అదియే ఉత్కృష్టమైనఅద్వతీయమైనసాంబశివుడనిశ్రుతిస్మృతిపురాణతాత్పర్యము॥

శ్లో॥ యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహం
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః॥౧౧॥

—♦ భాష్యమ్ ♦—

నను త్వనన్యభావేన త్వద్భావేనవా కథం సదాశివం భజే దిత్యహంగిరో పాసనామైవాహ యేయథేతి॥ ఏవంతత్ర్హి॥ 'స్థాణుం వా పురుషం వా పి దేవం వాయక్షమం త్యజం। యో యద్భావేన సంచిత్య భజే ద్దేవ మనామయ'మిత్యాదిస్మృత్యా యే యథా సదాశివైకతాదాత్మ్య త్పరబ్రహ్మభావేన పృథగ్భావేన దశావతార భావేన వా యథామాం సదాశివం ప్రపద్యంతే తాం స్తథైవ ఫలదానాయ భజామీ త్యర్థః। అథ నర నారాయణయో శ్శివాత్మజత్వేన తన్మార్గానుసరణత్వాంజగతా మపి యుక్త మిత్యాహ।మమేతి। తదుక్తం భాగవతే॥'ధర్మస్య దక్షదుహిత్యజనిష్టమూర్త్యా నారాయణో నరఋషిః

ప్రబలః ప్రశాంతః నైష్కర్మ్యలక్షణ మువాచ చకార కర్మ యోగాద్యపిచాస్త ఋషివర్య నిషేవితాంఘ్రి రిత్యాదిద్రష్టవ్యమ్॥౧౧॥

—♦ లఘుటిప్పణీ ♦—

వన్యమాత్యే రాజ బుద్ధిస్తునదోషాయఫలాయతెది' తిస్మృతి న్యాయేన సర్వత్ర సదాశివనిష్ఠయైవ కిం నభజే త్క్వంతు భజేదేవేత్యాహ— ఏవం తర్హీతి, తద్యథా 'నాశివం కశ్చిదాధత్తే శివ మేవా ఖిలోజనః తిస్తాచ్ఛివేన రూపేణ సర్వమేతదిచింతయే' దిత్యాది ద్రష్టవ్యమ్॥ ధర్మస్యేతి॥ తత్రైవంసతి మూర్త్యాం సగుణమూర్తౌ ధర్మస్య ధర్మమూలస్య సదాశివస్య పత్న్యాం సతీరూపాయాం దక్షదుహితరి నారాయణో విష్ణు ర్నరఋషిః శ్చార్జునో వస్తుతో౽జనిష్ట జాతఇత్యర్థః తథా నైష్కర్మ్యం భస్మరుద్రాక్షధారణరూపం యత్సమంత్రికం పాశుపతవ్రతం తచ్చకార స్వప్రియేభ్య శ్చోపవాచేత్యాశయః॥౧౧॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

ఓయీ నీకంటె నన్యునిఁగాని నన్నుఁగాని భావించి సదాశివుని నెట్లుపొందఁగలననఁగా నవాంగిరోపాసనచేత నే యని చెప్పుచున్నాఁడు. శిలామూర్తినిగాని దారుమూర్తినిగాని పురుషునిఁగాని గురువునుతాని, తల్లిదండ్రులఁగాని, దేవునిఁగాని, యక్షునిఁగాని, చండాలునిఁగాని, యెవ్వఁడైనను శివభావముతో నాలోచించి సేవించునో, వాఁడు శివతాదాత్మ్యమును బొందునని స్మృతినిబట్టి; యెవరు శివతాదాత్మ్యవవలన బ్రహ్మభావముతోఁగాని దశావతారభావముతోఁగాని సదాశివుఁడనైన నన్నుఁబొందుచున్నారో నేనును గర్మఫలము నొసంగుటకు వరల ననువర్తించుచున్నాను. మూర్తులయందును, దశావతారములయందును, పురుషులయందును సదాశివబుద్ధి నెట్లు జేయుదురనఁగా చేయవచ్చును ఆమాత్యుని

యందు రాజబుద్ధిచేయవచ్చును. గాని రాజునందమాత్యబుద్ధి చేయరాదు. అటులు శివునే భజించి ప్రపంచమంతయు శివరూపముగాఁ దెలియ వలెను. నరనారాయణు లిద్దరును శివుని పుత్రులుగాన శివధర్మముల నాచ రించిరి. ఎట్లు శివపుత్రులయి రనగా సగుణమూర్తియు ధర్మమూర్తియు నగు సదాశివునియొక్క భార్యయు దక్షపుత్రియునైన సతీదేవియందు ప్రబలుఁడైన నారాయణుండును ప్రశాంతుఁడైన నరఋషియును జనిం చిరి. నారాయణుఁడు విష్ణువు. నరుండర్జునుడును నయి భస్మరుద్రాక్ష ధారణరూపమైన వైదిక పాశుపత వ్రతమును జేసి యితరులచేతఁ జేయిం చిరని భాగవతమునందుఁగలదు॥ ౧౧॥

శ్లో॥ కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా॥ ౧౨॥

## —♦ భాష్యమ్ ♦—

ఏవంతర్హి సంప్రదాయానుసారేణ శివశక్తిపూజన పూర్వకమేవ సకలదేవపూజన మపి యుక్తమిత్యాహ - కాం క్షంత ఇతి। ఏవంసత్యస్య లోకస్య కర్మభూమిత్వేన క్షిప్రం యథాస్యాత్తథేహ కర్మజా సిద్ధిర్భవత్యన్యథాతు దక్షవద్విన శ్యేదేవేతిభావః॥ ౧౨॥

## —♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

సంప్రదాయాను సారముగా శివారాధనము, దేవ్యారాధనము, అయినపిమ్మట సమస్త దేవతలను పూజించుట కూడామంచిదే యని చెప్పు చున్నాఁడు - ఈలోకము కర్మభూమియగుటచేఁ గర్మలవలనఁ గలుగు ఫలసిద్ధినిగోరువారై దేవతలను బూజింతురు. ఆకర్మజమైన ఫలసిద్ధి త్వరిత ముగా సంభవించును, ఆకర్మలు శివారాధనపూర్వకముగా జరుగవలెను. అట్లుగాకున్న దక్షునివలె నశింతురని భావము॥ ౧౨॥

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః॥
తస్య కర్తార మపి మాం విద్ధ్య కర్తార మవ్యయమ్॥ ౧౩॥

—◆ భా ష్య మ్ ◆—

నను తవ కర్తృత్వేఽసీశ్వరత్వాపత్తి రకర్తృత్వం తు పశ్యామ్యేవ నేత్యాహ - చాతుర్వర్ణ్యమితి॥ ఏవంతర్హి తత్త ద్గుణకర్మ విభాగశో యద్యపి చాతుర్వర్ణ్యం మయైవ హిరణ్య గర్భాదిరూపేణ శివైక్య తాదాత్మ్యేన వా పూర్వవత్సృష్టం తథాపి॥ 'జానామి ధర్మం న చ మే ప్రవృత్తి ర్జానామ్యధర్మం న చ మే నివృత్తిః॥ కేనా పి దేవేన హృది స్థితేన యథా నియుక్తోఽస్మి తథా కరోమి॥' అకర్తార మపి మాం విద్ధీతి పర మార్థః॥ ౧౩॥

—✻ ల ఘు టి ప్ప ణీ ✻—

నను సృజత్యేత జ్జగత్సర్వం విష్ణు స్తత్పశ్యతీశ్వర ఇత్యాది కూర్మ స్మృత్యా విష్ణోః కర్తృత్వే కా హానిరి త్యాశంకతే । నన్వితి । తథాచ స్వీయభావేన కర్తృత్వం శివైక్యతాదాత్మ్యేనతు సాక్షిత్వం చేత్యుభయ మపీశ్వరాధీనమితి జానామీ త్యాది నా వధార్యమ్ । గుణవిభాగః । 'మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరం । తాభ్యా మిదం సముత్పన్నం జగత్ స్థావరజంగమం । సత్వంరజ స్తమశ్చైవ గుణాః ప్రకృతిసంభవాః ।సత్వాచ్చతుర్ముఖ బ్రహ్మప్రముఖా స్సర్వదేవతాః రజోగుణాన్మనుష్యాద్యా స్తమసో భూమిపర్వతాః । ఏతే త్రయో గుణా స్తేఽక స్త్వన్యేన సహ మేళనాత్ । సత్వసత్వో సత్వరజ స్తథాసత్వతమ స్మృతః , రజస్సత్వ స్తద్రజశ్చ తత్తమశ్చ తథైవచ తమస్సత్వ స్తద్రజశ్చ

తేత్తమో నవధాగుణాః । సత్వసత్వాత్సముత్పన్నా విరాట్ సూత్రేశ్వ రాదయః । దేవర్షయోవాలఖిల్యా జాతాస్సత్వరజోగుణాత్ । యక్షరక్షో గణా విద్యాధరా స్సత్వతమోగుణాత్। రజస్సత్వగుణా జ్జాతానరాస్త్రీ ప్రనపుంసకాః । రజోరజస్సముద్భూతాపశవోహి చతుష్పదాః । రజస్త మోగుణా త్స్వేదజాండజాజలజోద్భవః తమస్సత్వోద్భవా స్సస్యాస్తృణ కౌష్యాస్తృణా స్తథా।తమోరజస్సముద్భూతాస్తరుగుల్మలతాదయః। తమస్త మోగుణా జ్జాతా భూమయః పర్వతాశ్శిలాః । ఏతే నవగుణా స్సప్తవింశ దన్యోన్యమేళనాత్॥ సత్వే తమస్తమ స్సత్వ తమోరాజస ఏవచ సత్వే తమస్సత్వే, మితిసత్వే రాజసతామసః। సత్వేరజోరజ, స్సత్వే రజస్సత్వం, తథైవచ। సత్వసత్వతమశ్చైవ సత్వసత్వ రజస్తథా । సత్వసత్వే సత్వమితి, రజస్తామసతామసః।రజస్తమో రజశ్చైవ రజస్తామ ససాత్వికః । రజోరజ స్తమశ్చైవ రజోరజసి రాజసః రజోరజ స్సత్వమితి రజస్సత్వతమ స్తథా రజస్సత్వరజశ్చైవ రజస్సత్వే తురసత్వకః తమస్తమ స్తమశ్చైవ తమస్తామస రాజసః తమస్తమ స్సత్వమితి తమోరాజసతామసః । తమోరజోరజశ్చైవ తమోరజసి సత్వకః తమ స్సత్వతమశ్చైవసత్వస్సత్వ రజస్తథా తమస్సత్వే సత్వమితి సప్తవింశతిధా గుణాః॥,

౧ సత్వే తమస్తమోజాతా నాగగంధర్వకిన్నరాః । కామరూపాః కింపురుషా యక్షాదైతా శ్చరాక్షసాః॥

౨ సత్వే తమోరజోత్పన్నా దేవతాః పితరస్తథా ।

౩ సత్వే తమస్సత్వ గుణాత్కర్మదేవా నవగ్రహాః । తేషాం సపరి వారాణాం నివాసాశ్చ సముద్భవాః ।

౪ సత్వే రజస్తమోయోగా త్సనకాద్యా మహర్షయః। సిద్ధా స్సా ధ్యాశ్చ సంభూతా విష్ణునారాయణాదయః॥

౫ సత్వే రజసి రజస శ్శుకాదిమునయ స్తథా । వసిష్ఠాద్యా శ్చ ఋషయో భక్తాః ప్రహ్లాదనారదాః॥

౬ సత్త్వే రజస్సత్త్వగుణా ద్దిక్పాలా దేవతా స్తథా బ్రహ్మ విష్ణు శ్చ రుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివః। బృహస్పతి ర్విశ్వకర్మా నందిస్కంద గణాధిపాః। దూర్వాస దత్తాత్రేయాద్యా ఋషయో హాటకేశ్వరాః॥

౭ సత్త్వసత్త్వసత్త్వయోగా ద్విరాట్ సూత్రేశ్వరాదయః। స్థూలో గణేశ్వర శ్చాపి సవికల్ప సమాధినః॥

౮ సత్త్వసత్త్వరజోయోగా త్సూత్రాత్మాచ తథైవచ సూక్ష్మోవినా యక శ్చైవ నిర్వికల్పసమాధినః। బ్రహ్మవిత్ద్వర శ్చైవ తద్వరీయో వరిష్ట కః జీవన్ముక్తా ఇతిఖ్యాతా స్సంభూతా బ్రహ్మరూపిణః॥

౯ సత్త్వసత్త్వేసత్త్వగుణా త్సర్వజ్ఞత్వాదిసంయుతః। సృష్ట్యాదిపంచ కృత్యానాం కారణః పరమేశ్వరః॥

౧౦ రజస్తమస్తమోయోగా న్మత్కీకామశకాదయః। సర్పాశ్చవృశ్చి కాశ్చైవ మత్కుణా శ్శలభాదయః॥

౧౧ రజస్తమో రజోయోగా న్మకరాః కర్కటా స్తథా। వరా టకా శ్శుక్తికాశ్చ మండూకాది జలోద్భవాః॥

౧౨ రజస్తమస్సత్త్వయోగా న్మయూరా శ్శుకశారికాః। కాకా హంసాబకాగృధ్రా శ్శ్వేన కుక్కుటకాదయః॥

౧౩ రజోరజస్తమోయోగా త్సింహవ్యాఘ్రవరాహకాః। మూషకా శ్శునకాశ్చైవ మార్జాలా గర్ధభాదయః॥

౧౪ రజోరజోరజోయోగా న్మర్కటాశ్వ గజాస్తథా। అజాః ఖడ్గమృగాశ్చైవ కస్తూర్యాదిమృగా స్తథా॥

౧౫ రజోరజస్సత్త్వయోగా త్కామధేనుకులోద్భవాః। కపిలాధేన వః కృష్ణమృగాశ్చచమరీమృగాః॥

౧౬ రజస్సత్త్వతమోయోగా న్నాపితా రజకా స్తథా। మ్లేచ్ఛ చండాలహూణాశ్చ ఘాతుకా మాంసభక్షకాః॥

౧౭ రజస్సత్వరజోయోగా ద్రాజానో ధర్మతత్పరాః । కృషిగో రక్షవాణిజ్య వృత్తితో వైశ్యజాతయః॥

౧౮ రజస్సత్వే సత్వయోగా ద్బ్రాహ్మణా బ్రహ్మవాదినః । ద్రావిడా పంచధాజాతా స్తథాగౌడా శ్చ పంచధా॥

౧౯ తమస్తమస్తమోయోగా న్మార్గాఽగమ్యాశ్చ పర్వతాః । దేవబ్రాహ్మణహీనా శ్చ దేశా నిర్జలభూమయః॥

౨౦ తమస్తమరజోయోగా జ్జనసంచారభూమయః । దేవబ్రాహ్మణ వాసార్థం గ్రామదేశా శ్చపర్వతాః॥

౨౧ తమ స్తమస్సత్వయోగా త్పుణ్యక్షేత్రాణి భూమయః।గంగాది పుణ్యానద్యశ్చ లింగానినిధయో నవ॥

౨౨ తమోరజస్తమోయోగా న్నికృష్టా వృక్షజాతయః । దుర్గంధ సహితా నద్యఃపిశాచానాం చ భూమయః॥

౨౩ తమోరజోరజోయోగా ద్వృక్షాః పుష్పఫలాన్వితాః।మనుష్యై స్సేవితుం యోగ్యా స్తరుగుల్మలతాదయః॥

౨౪ తమోరజస్సత్వయోగా త్కల్పవృక్షా శ్చ యాజ్ఞికాః । దర్భాశ్చ పద్మకల్హారపుష్పాణి ఫలభూరుహాః॥

౨౫ తమస్సత్వతమోయోగాత్ క్షుద్రధాన్యా స్తథైవచ । మరీచి సర్షపాదీనా మనుకూలాశ్చ భూమయః॥

౨౬ తమస్సత్వరజోయోగా త్తిలమాషాఢకా స్తథా। ఏలాలవంగ జాజీనా మనుకూలాశ్చ భూమయః॥

౨౭ తమస్సత్వే సత్వయోగా ద్యవనీవారముద్గకాః। ఇక్షు గోధుమ శాల్యానా మనుకూలా శ్చభూమయః॥

## —♦ ఆన్ధ్రితాత్పర్యము ♦—

ఓయీ ? నీకుఁగర్తృత్వము గలిగినయెడల నీశ్వరత్వముభంగము వాటిల్లుచున్నది. నీయందుఁ గర్తృత్వాభావమునే చూచుచున్నామనఁగాఁ

గాదని చెప్పుచున్నాఁడు - బ్రాహ్మణాది జాతులును గుణకర్మముల విభాగ ప్రకారముగా శివతాదాత్మ్యముచేతఁగాని, హిరణ్యగర్భరూపముచేఁ గాని, నేనే సృష్టించితిని. 'ధర్మముఁదెలిసి యాచరించుటయు అధర్మమును తెలిసి మానివేయుటయును లేదు, హృద్గతమైన పరమాత్మ యెట్లు ప్రేరణచేయునో, అట్లు చేయుచున్నా'నని, కూర్మపురాణముననున్నది కనుక, నేనుగర్తనైనను నకర్తనుగాఁ దెలియుమని, పరమార్థము. (జగత్తునంతను విష్ణువే సృష్టిఁజేయుచున్నాఁడు. అట్టిజగత్తు నీశ్వరుఁడు చూచుచున్నాఁడన్నందువలన హానియేమనఁగా శివైకతాదాత్మ్యముచేఁ గర్తృత్వసాక్షిత్వములు రెండునూ నీశ్వరాధీనములేయని కనుకఁజెప్పిన కూర్మస్మృతిచేతనే యని తెలియవలెను॥ 'మాయాంతు ప్రకృతిం విద్యా న్మాయినంతు మహేశ్వరం। తాభ్యామేవసముత్పన్నంజగత్ స్థావరజంగమమ్' కేవలమాయవలన సృష్టియయినదని జెప్పఁగూడదు. మాయజడముగాన, జడమువలన జగత్సృష్టి గానేరదు. ఈశ్వరునివలనసృష్టియయినదనినచో నీశ్వరుఁడు సాక్షియగుటచేస్సృష్టిఁ జేయఁడు మాయగలవాఁడుగాననీశ్వరాత్మికమయినప్రకృతివలనస్థావరజంగమాత్మికమైనజగత్తంతయుబుట్టెనన్నందున బాధలేదు.) ౧౩.

## —♦ గు ణ వి భా గ ము. ♦—

మాయ త్రిగుణాత్మకము. సత్వగుణము, రజోగుణము, తమోగుణము సత్వగుణమువలన ముప్పదిమూడుకోట్ల దేవతలు పుట్టిరి. రజోగుణమువలన మనుష్యులు, మృగములు, పక్షులు, పురుగులు, జలచరములు లోనగునవి పుట్టెను. తమోగుణమువలన భూమి, పర్వత, వృక్షపాషాణములు మొదలయిన స్థావరములు పుట్టెను. ఈత్రిగుణములును నొకటొకటిగలసి తొమ్మిది విధములాయెను. సత్వసత్వము. సత్వరాజసము, సత్వతామసము, రజస్సత్వము: రజోరజస్సు, రజస్తమస్సు, తమస్సత్వము, తమోరజస్సు, తమస్తమస్సు, సత్వసత్వమువలన విరాట్సూత్రేశ్వరులు మొదలగువారు పుట్టిరి. సత్వరజస్సువలవ దేవఋషులును- అఱువది నాల్గు

కోట్ల వాలఖిల్యులును, పుట్టిరి. సత్వతమస్సువలన యక్షులు, రాక్షసులు, విద్యాధరులు లోనగువారు పుట్టిరి. రజస్సత్వమువలన జనసంఘము లుదయించెను. రజోరజస్సువలన చతుష్పాత్తులు, పశువులు, మృగములు లోనగునవి పుట్టెను. రజస్తమస్సువలన స్వేదజములు, అండజములు, జలచరములును బుట్టెను. తమస్సత్వమువలన పైరులు కసవులు గడ్డిపంటలు లోనగునవి పుట్టెను. తమోరజస్సులవలన చెట్లు పొదలు తీగలు లోనగునవి పుట్టెను. తమస్తమస్సువలన భూములు, కొండలు, రాళ్ళు మొదలయినవి పుట్టెను. సత్వసత్వము మొదలయిన ఈతొమ్మిదియును ఒకటొకటితోఁ గలసి యిరువదియేఁడు భేదములయ్యెను.

సత్వతమస్తమస్సు ౧. సత్వతమోరజస్సు ౨. సత్వతమస్సత్వము ౩. సత్వరజస్తమస్సు ౪. సత్వరజోరజస్సు ౫. సత్వరజస్సత్వము ౬. సత్వసత్వతమస్సు ౭. సత్వసత్వరజస్సు ౮. సత్వసత్వసత్వము ౯. రజస్తమస్తమస్సు ౧౦. రజస్తమోరజస్సు ౧౧. రజస్తమస్సత్వము ౧౨. రజోరజస్తమస్సు ౧౩. రజోరజోరజస్సు ౧౪. రజోరజస్సత్వము ౧౫. రజస్సత్వతమస్సు ౧౬. రజస్సత్వరజస్సు ౧౭. రజస్సత్వసత్వము ౧౮. తమస్తమస్తమస్సు ౧౯. తమస్తమోరజస్సు ౨౦. తమస్తమస్సత్వము ౨౧. తమోరజస్తమస్సు ౨౨. తమోరజోరజస్సు ౨౩. తమోరజస్సత్వము ౨౪. తమస్సత్వతమస్సు ౨౫. తమస్సత్వరజస్సు ౨౬. తమస్సత్వసత్వము ౨౭.

౧ సత్వతమస్తమస్సువలన నాగులు గంధర్వులు కిన్నరులు యక్షరాక్షసాదులు పుట్టిరి.

౨ సత్వతమోరజస్సున దేవతలును పితృదేవతలును బుట్టిరి.

౩ సత్వతమస్సత్వమున కర్మదేవతలు నవగ్రహములు వారిలోకములును బుట్టెను.

౪ సత్వరజస్తమస్సున సనకాదులు సిద్ధులు సాధ్యులు విష్ణునారాయణాదులును బుట్టిరి.

౫ సత్వరజోరజస్సున శుకాదిమునులు వసిష్ఠాది ఋషులు ప్రహ్లాద నారదాది భక్తులును బుట్టిరి.

౬ సత్వరజస్సత్వమున ౫కపాలకులు, దేవతలు. బ్రహ్మవిష్ణు రుద్రేశ్వరసదాశివులును; బృహస్పతి, విశ్వకర్మ, నంది, కుమారగణపతి దూర్వాసులు దత్తాత్రేయులు రుద్రాదిపాలకేశ్వరులును పుట్టిరి.

౭ సత్వసత్వతమస్సువలన విరాడ్ఢిరణ్య గర్భావ్యాకృతులు. సవి కల్పకసమాధినిష్ఠులు, స్థూలగణేశ్వరుడును బుట్టెను.

౮ సత్వసత్వరజస్సున సూత్రాత్ముడు, సూక్ష్మవినాయకుడు. నిర్వికల్పజ్ఞాననిష్ఠులు, బ్రహ్మవిదుడు, బ్రహ్మవిద్వర్యుడు బ్రహ్మవిద్వరీయుడు, బ్రహ్మవిద్వరిష్ఠుడు, లోనగుజీవన్ముక్తులు పుట్టిరి.

౯ సత్వసత్వసత్వమున సృష్ట్యాదిపంచకృత్యములు గల్గిన సర్వజ్ఞత్వాది లక్షణములుగల పరమేశ్వరుడు పుట్టెను.

౧౦ రజస్తమస్తమస్సున ఈగలు, దోమలు, సర్పములు, తేళ్లు, నల్లులు, మిడుతలు మొదలగునవి పుట్టెను.

౧౧ రజస్తమోరజస్సున మొసళ్ళు, ఎండ్రకాయలు, కప్పలు, ముత్తెపుఁజిప్పలు,గవ్వలును బుట్టెను.

౧౨ రజస్తమస్సత్వమున సెమళ్ళు, చిలుకలు, గోరువంకలు, కాకులు, హంసలు, కొంగలు, గ్రద్దలు, డేగలు, కోళ్ళు పుట్టెను.

౧౩ రజోరజస్తమస్సున సింహములు, పులులు, పందులు, ఎలుకలు, పిల్లులు, కుక్కలు, గాడిదెలు పుట్టెను.

౧౪ రజోరజోరజస్సున కోఁతులు, ఏనుఁగులు, గుఱ్ఱములు, మేఁకలు, లేళ్ళు, కస్తూరీమృగములు పుట్టెను.

౧౫ రజోరజస్సత్వమున కామధేనువు కులమందుపుట్టిన కపిల గోవులు, చమరీమృగములు, ఇఱులు పుట్టెను.

౧౬ రజస్సత్వతమస్సున మంగలి, చాకలి, మ్లేచ్ఛ, హూణ, కిరాతాదులగు మాంసభక్షక శూద్రులు పుట్టిరి.

౧౭ రజస్సత్వరజస్సున నిగ్రహానుగ్రహసమర్థులగు రాజులు, కృషిగోరక్షణవాణిజ్యవృత్తులుగల వైశ్యులునుబుట్టిరి.

౧౮ రజస్సత్వసత్వమున పంచద్రావిడ, పంచగౌడభేదములుగల బ్రహ్మవేత్తలయిన బ్రాహ్మణులు పుట్టిరి.

౧౯ తమస్తమస్తమస్సున సంచారానర్హ మార్గములును, గొండలును, దేవబ్రాహ్మణులులేని దేశములును, నిర్జలభూములును, దామసులు వసించు దేశములును బుట్టెను.

౨౦ తమస్తమోరజస్సున జనసంచారభూములును, దేవబ్రాహ్మణవాసార్హమైన దేశములు పర్వతములును బుట్టెను.

౨౧ తమస్తమస్సత్వమున బుణ్యక్షేత్రములు.ణ్యభూములు, గంగాది పుణ్యనదులు, సాలగ్రామములు, బాణలింగములు మొదలయిన శిలలు, కాశి మొదలయినదేశములు పుట్టెను.

౨౨ తమోరజస్తమస్సున నికృష్టవృక్షములు. దుర్గంధనదులు, పిశాచదుష్టజన సంచారభూములు పుట్టెను.

౨౩ తమోరజోరజస్సున మనుష్యసంచారభూములు, నానాజాతి ఫలవృక్షములు, లతలు, పొదలుపుట్టెను.

౨౪ తమోరజస్సత్వమున కల్పవృక్షములు; యజ్ఞవృక్షములు, దర్భలు, బిల్వములు, పద్మములు మొదలయినవి పుట్టెను.

౨౫ తమస్సత్వతమస్సున తమిదెలు మొదలయిన క్షుద్రధాన్యములు, ఆవాలు మొదలగునవి పండెడుభూములు మొదలగునవి పుట్టెను.

౨౬ తమస్సత్వ రజస్సున నువ్వులు మొదలయిన అపరదినుసులును ఏలకులు మొదలయినవి ఫలించుటకనుకూలమైన భూములునుపుట్టినవి.

౨౭ తమస్సత్త్వసత్త్వమున యవలు, పెసలు, గోధుమలు, చెఱకు, సన్న ధాన్యములు వీనికి ననుకూలమయిన భూములును పుట్టినవి.

ఈ జగత్సృష్టి క్రమము క్లుప్తముగా వర్ణింపఁబడినది.

శ్లో॥ నమాం కర్మాణి లింపంతి నమే కర్మ ఫలే స్పృహా ।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్నస బధ్యతే॥ ౧౪

—* భా ష్య మ్ *—

ఏవం త్వమప్యేవ మాత్మానం విజానీహీత్యాహ— నమామితి । ఏవం విశ్వసర్గాదీని కర్మాణి నమాం లింపంతి ననా 'సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్' స్మృతిన్యాయేనాప్త కామత్వాత్కర్మణాం ఫలస్పృహాఽపి మమాస్తీతి భావః । ఏవం మామివాత్మానం యోఽభిజానాతి సోఽపి కర్మభి ర్న లిప్యత ఇది తథాత్వేన త్వమప్యాత్మానం విజానీహీత్యర్థః। నహ్యాన్య జ్ఞానా దన్యగతా నర్థనివృత్తి రిత్యయమేవార్థో న్యాయ్య ఇత్య వధార్యమ్॥౧౪॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

ఆత్మానమితి॥'ధారయిష్యామి తే వేగం రుద్రస్త్వాత్మాశరీరిణా' మిత్యాద్యుక్తే రాత్మశబ్దేన పరం బ్రహ్మైవగృహ్యతే తద్రూపేణైవాత్మాన మపివిజానాహీత్యర్థః। కథమన్యథా మా మన్యం వా శివరూపం విజానం స్త్వం ముక్తిమాప్స్యసీ త్యస్ఫుట మన్యదిత్యాశయః॥౧౪॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము♦—

'శరీరధారులకు రుద్రుఁడాత్మ'యను వచనముంబట్టియురుజందావయ'తీతిరుద్రః' అనువ్యుత్పత్తినింబట్టియు సంసారరోగమును బోఁగొట్టు

స్తి పరబ్రహ్మమును దానుగాఁ దెలియుము. అట్లుగాకున్న ముక్తి దొరకదను సముద్రినితో నదులన్నియుఁ గలిసినను నాతఁడు నిష్కామియగు నట్లు నేను జగత్సృష్టిచేసినను గర్మఫలాపేక్ష లేనందున కర్మలునన్నంటవు. నా కెరుకుద్రిని నెవరు తెలియుచున్నారో వారిని కర్మలంటవు. జీవునిగాఁ దెలిసి ననర్థవృత్తి గాదు. ముక్తి దొరకదని భావము॥౧౪॥

శ్లో॥ ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః।
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్॥

## —◆ భాష్యమ్. ◆—

ఇహ తు శాస్త్రీయ మర్యాదాయాం పూర్వోక్తం సత్సంప్రదాయమపి దర్శయన్నుప సంహరతి। ఏవమితి। తత్త్రైవం సతి యతో 'నాహం కర్తా న మే కర్మ ఫలస్పృహేతి' వస్తుతశ్శివజ్ఞానాత్కర్మభి ర్నవధ్యోఽహ మతఏవం త్వమప్యాత్మాన మకర్తారం జ్ఞాత్వా యదుయయాతి ప్రభృతిభి ర్యదుభిః పూర్వై రప్యతికాలైః కృతం తత్కురు నతు తూష్ణీమాసనం నాపి కర్మణా సన్న్యాసం వేత్యర్థః॥౧౫॥

## —◆ లఘుటిప్పణీ ◆—

సత్సంప్రదాయమితి॥ ఏసంసతి॥ 'పారంపర్యేణచాన్యేషాం పాఖండ మతయోఽ పర' ఇత్యాదిస్మృత్యాసంప్రదాయేష్వపి సత్సంప్రదాయ ఏవ వక్తుం శక్య ఇత్యవధేయమ్। అకర్తారమితి। తత్త్రైవంసతి॥ దేహేంద్రియాది సంఘాతై ర్జీవః కర్తేతి శ్రుతం తస్మాచ్ఛివైక్య తాదాత్మ్యాద కర్తృత్వం శ్రుతి ర్జగావిత్యాది స్మృత్యా పరబ్రహ్మైక్య తాదాత్మ్యేప్యన్నాయ 'యస్మిన్కృతే నకించిత్కర్మ క్రియత' ఇత్యాది శ్రుతి న్యాయేన కర్మాణి కుర్విత్యాశయః॥ ౧౫॥

## —◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము. ◆—

శాస్త్రమర్యాద ననుసరించిన సత్సంప్రదాయమును జూపించి యుపసంహరించుచున్నాడు - పాషండ సంప్రదాయములు వదలి వైదిక సంప్రదాయములే చెప్పఁదగినవి. కర్మఫలాపేక్షలేక కర్మచేసినవాఁడు కర్తయని చెప్పినందున వస్తుతః శివజ్ఞాని కర్మబద్ధుఁడుగాఁడు. కాన నేను శివునిఁదెలుసుకొన్నందున, నేనును గర్మబద్ధుఁడఁగాను, నీవును, పూర్వులయినయయాతి మొదలగు ముముక్షులైన యాదవ వంశరాజులాచరించిన కర్మలుచేసి యకర్తనుగాఁ దెలిసికొనుము. ఊరకే కూర్చుండఁగూడదు. కర్మలను వదలఁగూడదు, జీవునకు కర్తృత్వము దేహేంద్రియాదులతోఁ గూడినందున వచ్చినది. శివైక్యతాదాత్మ్యమువలన నకర్తృత్వ మాపాదింపఁబడినది. దేహాభిమానముచేఁ గర్మలు చేయఁబడును. దేహాభిమానము వదలినంగాని శివైక్యతాదాత్మ్యమురాదు. కానదేహాభిమానమున్నపుడు చేసిన కర్మలు దేహాభిమానము వదలిన పిమ్మట వెనుకటికర్మలంటవు. కాన శివునిఁదెలిసికొని కర్మలనుజేయుము.॥ ౧౫॥

శ్లో॥ కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః
తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥

## —◆ భా ష్య మ్ ◆—

నన్వేతావ తాపి ఋషాద్యాదిభి ర్బహుతరం కృతమపి విపరీతమాపన్న మితి కృత్వా కర్మణస్సూక్ష్మగతిత్వేన దురుద్ధరిత్వం మన్యమానః పృచ్ఛతి। కిం కర్మేతి। ఏవంసతి యదత్ర కర్మణి దురుద్ధరత్వంత త్సర్వమత్ర స్ఫుటం వక్ష్యామి యద్జ్ఞాత్వాఽశుభాత్సంసారబంధనాన్మోక్ష్యస ఇత్యర్థః. ౧౬-

—◆ లఘుటిప్పణీ ◆—

సూక్ష్మగతిత్వేనేతి॥ ఇహ యద్యపి 'ఉత్క్షేపణాపక్షేపణాకుంచన ప్రసారణగమనాని పంచైవ కర్మాణీ'తి నియతం తథాపి తదవాంతరభేదేన ఫలాఫలప్రదత్వేనానేక విధమితి దురుద్ధరత్వం బోధ్యమ్॥ ౧౬॥

—◆ ఆంధ్రతాత్పర్యము ◆—

ఓయీ ఋష్యాదులనేకకర్మలు చేసియుఁ జేయనట్లుండిరి. సూక్ష్మగతితో 'హస్తపాదములను పైకిఁజాపుట, క్రిందికిఁజాపుట, ముడుచుట, అడ్డముగాఁజాపుట, నడచుట' ఈకర్మలయిదయినప్పటికిని నిందులో నవాంతరభేదమునఁ గర్మలు గొన్నియు, ఫలములేనివి గొన్నియు, ఫలములుగలవి కొన్నియునిట్లనేక విధములుగాన సూక్ష్మగతితో గర్మచేయక యెవరునుండఁజాలరని యడుగుచున్నాఁడు. ఎట్టిది కర్మము? ఎట్టిదకర్మము? ఈరెంటివిషయములో పండితులుగూడ మోసపోవుచున్నారు. ఏకర్మ విషయమును దెలిసికొని సంసారబంధమునుండి విముక్తులగుదురో, అట్టిదానిని జెప్పుచున్నాను॥౧౬॥

శ్లో॥ కర్మణోహ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః॥        ౧౭

—◆ భాష్యమ్ ◆—

నను దేహేంద్రియాది వ్యాపారః కర్మేత్యహామేవలోక ప్రసిద్ధత్వా జ్జానామీతి కిమత్ర కాఠిన్య మిత్యతో విభాగేన తదవధారయ న్నాహ- కర్మణోహీతి॥ తథాచేహ యతః కర్మణః శాస్త్రవిహితస్య తత్వం బోద్ధవ్యమస్తి ఏవం వికర్మణ స్తత్ప్రతిషిద్ధస్య తథాఽకర్మణ స్తూష్ణీంభావస్య చ తత్వం

బోద్ధవ్య మిత్యత్ర త్రివిధేష్వపి తత్వతో గహనా కర్మాకర్మ వికర్మణాం గతి రిత్యర్థః॥ ౧౭॥

—* ల ఘు టి ప్ప ణీ *—

తత్వం బోద్ధవ్యమితి॥ తత్రతావత్తూష్ణీంభావస్యాపి తత్వం కుర్వన్నే వేహకర్మాణి శ్రుతిత్యుల్లంఘన ప్రయుక్త ప్రాయశ్చిత్తేనాప్య స్తబ్ధస్యాదితి బోద్ధ్యమ్॥ ౧౭॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము . ♦—

ఓయీ కర్మను దెలిసికొనుటలోఁ గాఠిన్యమేమి? దేహేంద్రియాది వ్యాపారమే కర్మయని లోకప్రసిద్ధియే కాన నేనును నట్లే తెలియుదు ననుటలో విభాగించి చెప్పుచున్నాఁడు,'' ప్రాయశ్చిత్తములేకుండగ వేదోక్త కర్మానుష్ఠానము. కర్మ యనఁబడును. అందలి తత్వముఁదెలియఁదగినది. వేదవిరుద్ధ కర్మాచరణము వికర్మ యనఁబడును. అందలి తత్వముఁ దెలియవలెను. అకర్మయనగా తూష్ణీంభావము. అందలి తత్వముఁ దెలియదగినది. కర్మవికర్మా కర్మలయొక్క గతి తెలియరానిది॥ ౧౭॥

శ్లో॥ కర్మణ్యకర్మయః పశ్యేదకర్మణి చ కర్మ యః ।
సబుద్ధిమాన్మనుష్యేషు సంయుక్తః కృత్స్నకర్మవిత్॥ ౧౮

—♦ భా ష్య మ్ ♦—

నను కీదృశం త్వాహి కర్మాదీనాం తత్వమిత్యాహ— కర్మణీతి॥ తత్రైవంసతి వేదవిహితే కర్మణి ఫలాభిసంధిరహితత్వేనా కర్మయః పశ్యేదిత్యర్థః ఏవం వేదవిరుద్ధానిష్టసాధనతాకే కర్మణి తస్య బంధహేతుత్వా త్కర్మ యః పశ్యేత్। యద్వా కుర్వన్నేవేతి శ్రుత్యా ప్రాణినాం కర్మ కర్తృత్వ

స్యావశ్యకత్వే స్థితే తన్నకృతం చేన్నిషేధోల్లంఘనాత్ ప్రత్యవాయః స్యాదితి తత్పరిహారార్థం కర్మాపి బంధహేతుత్వాత్తదపి కర్మైవేతి యః పశ్యతి సఏవ మనుష్యేషు బుద్ధిమాంచ్ఛివైకతాదాత్మ్యేన యుక్తో'యస్మిన్ కృతే నకించిత్కర్మ క్రియత' ఇత్యాది శ్రుతేః కృత్స్నకర్మకృచ్చే త్యవధేయమ్॥౧౮॥

—◆ లఘుటిప్పణీ ◆—

ఫలాభిసంధీతి॥ నన్వస్యాపి కైవల్యఫలకత్వాత్కథం ఫలాభిసంధిరహితత్వమితి చేత్ శృణు 'యస్మిన్ కృతే నకించిత్కర్మ క్రియత' ఇతి శ్రుతిన్యాయేనాస్మిన్ కృతే తదుత్తరం నహి కించిత్కర్తవ్యమస్తి । సకామనయా కృతే తు కర్మణి పునః కర్మ కర్తవ్యమేవాస్తీత్యేతావతైవ ఫలాభిసంధిరహితత్వమిత్యవధార్యమ్॥ ౧౮॥

—◆ ఆన్ధ్రితాత్పర్యము. ◆—

ఓయీ కర్మ వికర్మాకర్మలయొక్క తత్త్వమేమనఁగా చెప్పుచున్నాఁడు. ఫలాభిసంధిరహితమైన వేదోక్తకర్మయందు నకర్మజ్ఞానమును, ఫలాపేక్షతో వేదవిరుద్ధమై దుఃఖదాయకమైనవికర్మను బంధమును గాను,కర్మచేయనందున ప్రత్యవాయము వచ్చునను శ్రుతినుల్లంఘనచేసి,సర్వసామాన్యముగా సర్వప్రాణులకుఁ గర్మాచరణ మవశ్యకర్తవ్యమై యుండఁగాఁగర్మనునిషేధించిన జ్ఞానమును,బంధహేతువైన కర్మాంతరాభావమేయనియెవఁడు చూచుచున్నాఁడో, వాఁడే బుద్ధిమంతుఁడు. వాఁడే యన్నికర్మలను జేసినవాఁడు వాఁడే శివైక్యతాదాత్మ్యము గలవాఁడు. ఫలాభిసంధిలేని కర్మయేలేదు. కైవల్యముగూడ ఫలమేగదా? ఫలాభిసంధిరాహిత్యమెట్లు కలుగునన్నచో? 'ఏకర్మచేసి మఱియొకకర్మను జేయఁడో, అట్టికర్మనుజేయవలయు'ననుశివసంకల్పోపనిషత్తుప్రకారముగా, నిష్కామ

కర్మ చేసినను మఱియొకకర్మ చేయనక్కఱలేదు. కామ్యకర్మఁజేసిన మఱియొకకర్మ చేయవలసియేయుండును. కైవల్యఫలమున్నను నిష్కామకర్మ ఫలాభిసంధి రహితమేయగును, జ్ఞానమందు గర్మయుఁ గర్మయందు జ్ఞానమును నున్నదానిని గాఁ జూడవలయునని భావము. అనఁగాఁగర్మమును జేయుచుండఁగానే దానియందాత్మజ్ఞానమును, ఆత్మజ్ఞానము వర్తించు చుండఁగాఁ దానియందుఁగర్మమును వేదవిరుద్ధకామ్యకర్మయందు బంధమును జూచువాఁడు ధన్యుఁడు, కర్మచేయునపుడాత్మానుభవమును, ఆత్మానుభవమందుగర్మచేయుటయుసంభవించునాయనఁగా? సంభవించునుపాముకాటు వలనవిషమును దీయుమాంత్రికుఁడు ధ్యానము సేయుచునే చేతితో దిగదుడుచుట మొదలగుచేష్టలను, జపములును, సేయుటగలదుగదా? అట్లే సంభవించును ॥౧౮॥

శ్లో॥ యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః ।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః॥ ౧౯

—♦ భాష్యమ్ . ♦—

నను ప్రాక్తనానాం ప్రారబ్ధకర్మణాం జ్ఞానాగ్నినా నాశస్తథాగామినాం త్వసంకల్పాదేవానుత్పత్తిః పరం తు జ్ఞానోత్పత్త్యనంతరమపి క్రియమాణానాం కర్మణాం నివృత్తిరిష్టైవేత్యాహ । యస్యేతి॥ తథాచ యస్య తత్వవిద స్సర్వే సమారంభాః కర్మాణి కామసంకల్పవర్జితాః క్రియంత ఇతి తమేవం జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం బుధాశ్శుష్కశాస్త్రవాదినః పండితం ప్రాహు రిత్యర్థః॥ ౧౯॥

—⁕ లఘుటిప్పణీ ⁕—

పండితమితి॥ తద్యథా। 'పరాత్మని శివే రక్తోయోఽరక్తోఽపర మాత్మని। ముగ్ధత్రోత్రియనిర్ముక్త స్తమాహుః పండితం బుధా' ఇత్యాది ద్రష్టవ్యమ్॥ ౧౯॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

ఆగామిసంచిత ప్రారబ్ధకర్మలలోఁ బ్రాక్తనసంచితకర్మలు జ్ఞానాగ్నిచే నాశమును ఆగామికర్మలకు సంకల్పమే లేకుండినందున యనుత్పత్తియు, జ్ఞానోత్పత్తియయిన తరువాతఁ జేయబడుకర్మలకు నివృత్తియు నిష్టమేయని చెప్పుచున్నాఁడు. ఏతత్త్వవేత్తచే సర్వకర్మలు కామసంకల్పము లేకయే చేయఁబడుచున్నవో వానిని జ్ఞానాగ్నిలో నాగామిసంచిత ప్రారబ్ధములు దహించిన పండితునిగా శుష్కశాస్త్రవేత్తలు పలికిరి॥ ఎవఁడు పరమాత్మయైన శివునియందనురక్తుఁడై జీవాత్మయందు విరక్తుఁడో వాఁడు మూఢుండుఁగాడు. శాస్త్రజ్ఞుఁడు గాడు, పండితుఁడని శుష్కశాస్త్రజ్ఞులు పిలిచిరి॥ ఈయాగామిసంచిత ప్రారబ్ధములయొక్క వివరము తృతీయాధ్యాయము 33 వ శ్లోకమందు విస్తరించివ్రాయఁబడినది॥ ౧౯॥

శ్లో॥ త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవం కించి త్కరోతిసః॥ ౨౦

—♦ భాష్యమ్ ♦—

అథ 'ఛాయాశరీరే ప్రతిబింబగాత్రే' ఇతి స్మృతిన్యాయేన 'అంతస్త్యాగీ బహిస్సంగీతి' న్యాయేనచ। శాస్త్రసజ్జనసంపర్కేత్యాది శ్రుత్యుక్త సప్తమభూమికాశ్రితస్య సౌమ్యదర్శినో న కించి ద్బాధకమ స్తీ త్యాహ॥ "ఇమాం సప్తపదాం జ్ఞాన భూమి మకర్ణయానఘ!। నానయా జ్ఞాతయా భూయో

మోహపంకే నిమజ్జతి । జ్ఞాన భూమిస్సుఖేచ్ఛాఖ్యా ప్రథమా సముదాహృతా। విచారణ ద్వితీయాఖ్యా తృతీయా తనుమానసీ । సత్వాపత్తి శ్చతుర్థీ స్యా త్త్వ సంసక్తిస్తు పంచమీ పదార్థా భావనా షష్ఠీ సప్తమీ తుర్యగా స్మృతా । ఆసా మంతః స్థితాముక్తి ర్యస్యాం భూయో న శోచతి । ఏతాసాం భూమికానాం త్వ మిదం నిర్వచనం శ్రుణు॥

౧. స్థితిః కింమూఢఏవాస్మి ప్రేక్షేఽహం శాస్త్రసజ్జనైః వైరాగ్య పూర్వమిచ్ఛేతి సుఖేచ్ఛే త్యుచ్యతే బుధైః॥

౨. శాస్త్రసజ్జన సంపర్క వైరాగ్యాభ్యాస పూర్వకం సదాచార ప్రవృత్తి ర్యా ప్రోచ్యతే సా విచారణా॥

3. విచారణా సుఖేచ్ఛాభ్యా మింద్రియార్థేషు రక్తతా యత్ర సా తనుతా మేతి ప్రోచ్యతే తనుమానసీ జాగ్రదేత త్రియం ప్రోక్త మేతావ జ్జన్మభాగ్భవేత్ ॥

౪. భూమికా త్రితయాభ్యాసా చ్చిత్తేతు విరతే ర్వశాత్ సత్వాత్మని స్థితే శుద్ధే సత్వాపత్తిరుదాహృతా । స్వప్నావస్థేయ మాఖ్యాతా హ్యయం బ్రహ్మవిదుచ్యతే॥

౫. దశా చతుష్టయాభ్యాసా దసంసర్గఫలా తు యా । రూఢసత్వ చమత్కారా ప్రోక్తాఽసంసక్తి నామికా । ఇయం సుషుప్తి రాఖ్యాతా హ్యత్రస్థో బ్రహ్మవిద్వరః॥

౬. భూమికా పంచకా భ్యాసా త్స్వాత్మారామతయా దృఢమ్ ఆభ్యంతరాణాం బాహ్యానాం పదార్థానా

మఖానానాత్। చిర ముద్బోధనా దన్యప్రయత్నేనైవ బుధ్యతి। పదార్థా భావనానామ షష్ఠీభవతిభూమికా । జీవన్ముక్తి స్తుర్య దశావరీ యోబ్రహ్మవి_త్తరః॥

౭. భూమిషట్క-చిరాభ్యాసా ద్భేదస్యానుపలంభనాత్ యత్స్వభావైకనిష్ఠత్వంసా జ్ఞేయా తుర్యగాగతిః । విదేహముక్తి రాఖ్యాతా తుర్యాతీత దశాస్మృతా । కథితోయం బ్రహ్మ విద్వరిష్ఠో దుర్లభోనృణాం ఏతా బుద్ధి మతామేవ గోచరా జ్ఞాన భూమయః॥

భూమికా త్రితయం త్యక్త్వా భూమికా త్రితయంపునః। స_ప్తమీం భూమిమాసాద్యయ స్తిష్ఠే త్సహిపండిత" ఇత్యాది స్మృత్యా 'సమాధి నిర్ధూతమలస్య, చేతస'ఇత్యాదిస్మృత్యాచ పరమానంద సందోహ లాభేన నిత్యతృప్తో దేహేంద్రియాది ద్వైతాదర్శనేన నిరాశ్రియ స్సన్నేవం భూతో జీవన్ముక్తో యోగీ లౌకికే వైదికే వా కర్మణి సాంగోపాంగానుష్ఠానేన పరేచ్ఛయా ప్రవృత్తోఽపి స్వేచ్ఛయా నైవ కించిత్కరోతీతి పరమార్థః॥

—♦ లఘుటిప్పణీ. ♦—

సౌమ్యదర్శనఇతి॥ తద్యథా, బహుధా శ్రుతయః ప్రవదన్తి యతోవిపదాదిరియం మృగతోయసమం. యదిచైకనిరంతరసర్వశివ' మి త్యాదిరీత్యా సౌమ్యదర్శనః ప్రత్యక్షాత్మదర్శన ఇత్యర్థః పరేచ్ఛయేతి 'జానామిధర్మం నచ మేప్రవృత్తి' రిత్యాది స్మృతిన్యాయేన పరస్య స్వేష్ట దేవస్య సర్వసాక్షిణ స్సదాశివస్యేచ్ఛయే త్యర్థః॥

## —♦ ఆ ధ్ని తా త్ప ర్య ము ♦—

ప్రతిబింబమైన 'ఫొటోగ్రాఫ్' వంటి ఈ సంసారమందు బాహ్యమునను సంగుఁడై అంతఃకరణయందు త్యాగియై 'ఇది దుఃఖరూపము ఎండమావుల జలము దీనియందు సత్యమైనది శివరూపము' అనితలంచిఅట్టి శివైక్య తాదాత్మ్యముకొఱకు నభ్యాసకాలమందు సర్వసాక్షియైనట్టి నాకు ఇష్టదైవమైన సదాశివుని ప్రేరణచేత ధర్మాధర్మకర్మలచేయుచుంటినని తాను కర్తృత్వమును వహింపకయాత్మదర్శనోపాయము వెదకుచు జ్ఞానభూమిక లేడింటిని క్రమక్రమంబుగా నారికొల్లవలె నొకటొకటి హెచ్చించుచు మోహమును వదలవలయు. సుఖేచ్ఛా విచారణ తనుమానసి సత్వాపత్తి అసంసక్తి పదార్థాభావన తురీయము యని జ్ఞానభూమికలు యేడు.

౧ సుఖేచ్ఛయనగా: నేనేమియుఁదెలియని మూఢుండనై యున్నాను. శాస్త్రములచేతసజ్జనులద్వారాతత్వార్థమును దెలియఁగలనని వైరాగ్యపూర్వకమైన యిచ్ఛయే సుఖేచ్ఛయని జ్ఞానులచే జెప్పబడుచున్నది,

౨ విచారణ యనఁగా శాస్త్రములయొక్కయు సత్పురుషుల యొక్కయు సాంగత్యమును, వైరాగ్యాభ్యాస పూర్వకముగాఁగల్గిన సదాచారప్రవృత్తియును విచారణయని చెప్పబడుచున్నది.

౩ తనుమానసి యనఁగా సుఖేచ్ఛావిచారణలను రెండు భూమికల చేత విషయాభిలాషలెప్పుడు తగ్గునో అప్పుడ ది తనుమానసియని చెప్పఁబడును. ఈమూడుభూమికలు జగద్వ్యాపారముగలవి కాన జాగ్రదవస్థ యనఁదగును. ఇంతవఱకుఁ జన్మగలదు. తక్కిన భూమికలయందు జన్మలేదు.

౪ సత్వాపత్తి యనఁగా సుఖేచ్ఛావిచారణ. తనుమానసి భూమికల యొక్క యభ్యాసమువలన విషయములయందు వైరాగ్యముగలిగి, అందు

వలన చిత్తము శుద్ధమై సచ్చిదానందరూపమైన యాత్మసాక్షాత్కార మగుచుండుటయే సత్త్వాపత్తి. ఈభూమికయందు జగత్తు స్వప్నము వలె దోఁచునుగాన ఇదిస్వప్నావస్థ. ఇతఁడుబ్రహ్మవిదుఁడు.

౫ అసంసక్తియనఁగా సుఖేచ్ఛావిచారణ తనుమానసి, సత్త్వాపత్తి భూమికల యభ్యాసముచేత ఫలాపేక్షలే నిరూఢమైన (బలముగా నాటుకొనిన) సత్త్వగుణ ప్రకాశము. అసంశక్తియని చెప్పఁబడుచున్నది. ఇది సుషుప్త్యవస్థ ఇతఁడు బ్రహ్మవిద్వర్యుఁడు.

౬ పదార్థాభావనయనఁగా శుభేచ్ఛావిచారణతనుమానసి సత్త్వాపత్తియసంసక్తి భూమికలచేత నాత్మయందు మిగులరమించువాఁడై (ఆత్మారాముఁడై) అంతర్బహిః పదార్థములయొక్క భావనగోచరము లేనట్టియు ఇతరులచే బోధింపఁబడినప్పుడు మాత్రము కార్యములయందుఁ బ్రవర్తించుటయు నగునట్టి స్థితియే పదార్థాభావనయగుచున్నది. ఇది తురీయావస్థ. ఇతఁడు బ్రహ్మవిద్వరీయుఁడు.

౭ తురీయమనగా వెనుకటి యాఱుభూమికలను చిరకాలమభ్యసించుట వలన ప్రపంచాదిభేదములు నశించి యాత్మభావనయందే నెలకొనియుండునట్టి స్థితియేదియో అదియే తురీయమనెడి యేఁడవ భూమిక. ఇదియే తుర్యాతీతావస్థ. ఇతఁడుబ్రహ్మవిద్వరిష్ఠుఁడు. ఈజ్ఞానభూమిక లేఁడును బుద్ధిమంతులకు మాత్రమే గోచరించును. దేహముతోఁ గూడినను గూడకున్నను జ్ఞాన భూమికలను బొందినవారు మూఁడు భూమికలకుఁ బైన ముక్తులగుటకు సంశయములేదు. నాల్గవ భూమికలోనికి గృహస్థుఁడును రాగలఁడు. సన్న్యాసి యేఁడవ భూమిక వఱకును రాగలఁడు. ముక్తి సమానమే.

ఈ ప్రకారము ఆఱు భూమికలదాఁటి యేఁడవభూమిక యందున్న వాఁడు పండితుఁడు. ఈతని సమాధ్యానందము చెప్పుట కలవిగాదు. ఇట్టి పరమానంద సందోహముచేత నిత్యతృప్తుఁడై దేహేంద్రియాది ద్వైత

ప్రపంచము గోచరింపక నిరాశ్రయుఁడై సదాశివా పరోక్షజ్ఞానముచే సర్వజ్ఞత్వాది గుణములు గల శివత్వము నొందును.॥ ౨౦॥

శ్లో॥ నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్త స్సర్వ పరిగ్రహః ।
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్॥ ౨౧

## —♦ భా ష్య మ్ ♦—

నను మహాత్యంత విక్షేపహేతో ర్జ్యోతిష్టోమాదే ర్యది తస్య న బాధకత్వం తర్హి శరీరస్థితిహేతోః కర్మణః కిం బాధకత్వం నేత్యాహ । నిరాశీరితి॥ తత్రైవంసతి నిరాశీ ర్యతతృష్ణ స్సచ పునర్యత స్సంయమితశ్చిత్తాత్మా యేన సః ఏవం త్యక్తాని సర్వపరిగ్రహోపకరణాని యేన సః ఏవం తర్హి యద్యేతాదృశో యోగీ ప్రారబ్ధ కర్మవశా త్కదాచిచ్ఛరీర స్థితి మాత్రప్రయోజనం కేవలం కర్తృత్వాభిమానశూన్యం కర్మ కుర్వన్నపి పరమార్థతో నైవ కించిత్కరోతీతి నైవ తస్య కించిత్కిల్బిష మిత్యవధార్యమ్॥ ౨౧॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నిరాశీరితి॥ తత్రాశాప్రత్యాశయో నిర్గతోఽతఏవ గతతృష్ణోపీత్యర్థః. నైవకించిదితి॥ తత్రైవంసతి। నిత్యతృప్తస్య యోగిన స్సకామేనాపి కర్మణా నైవ కించిత్కిల్బిష మిత్యర్థః॥ ౨౧॥

## —♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ గొప్పదియైన విక్షేపమునకు హేతువైన జ్యోతిష్టోమాదికర్మ వలన జ్ఞానమునకు బాధలేనియెడల శరీరస్థితికి హేతువైన కర్మవలన బాధయేమియనఁగా లేదనిచెప్పుచున్నాఁడు. ఫలాభిసంధిలేనివాఁడై మనోబుద్ధి

చిత్తాహంకారముల వృత్తుల నిగ్రహించి, (మనోవృత్తులే బుద్ధిచిత్తాహంకారములు మూఁడు. మనసుఅనునది తలంపుఅయినయెడల బుద్ధినిశ్చయించునది. చిత్తమువిచారించునది. అహంకార మభిమానించునది.) అనఁగా విషయాంతరములయందు జింతలేని మనసుగలవాఁడై ఆత్మయే ముఖ్యప్రయోజనముగా గలవాడగుటవలన భోగ్యభోగోపకరణములగు (ప్రకృతి వస్తువులు భోగ్యములగు శబ్దాదివిషయములు, ప్రాకృతవస్తువులు భోగోపకరణములగు నిందిృయములు.) తక్కినసమస్తప్రకృతి (ప్రాకృతవస్తువులందు మమతలేనివాఁడగుచుఁ గర్తృత్వాభిమానశూన్యుఁడైన యోగి ప్రారబ్ధవశమున శరీరస్థితిమాత్రకర్మనాచరించినప్పటికిని జ్ఞానశూన్యుఁడైనను నిత్యతృప్తిగలిగినయెడల సంసారబంధరూపమగు పాపమునొందఁడు॥౨౧॥

శ్లో॥ యదృచ్ఛా లాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః ।
సమస్సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి ననిబధ్యతే॥                    ౨౨

—♦ భాష్యమ్ ♦—

నను సవీతరాగో నిత్యతృప్తో యోగీ జగత్యాం కథం విచరేదిత్యాహ॥ యదృచ్ఛయేతి॥ తథాసతి యదృచ్ఛయా ప్రారబ్ధేశ్వరేచ్ఛయా యథాలాభేనసంతుష్టః పునశ్చ ద్వంద్వాని శీతోష్ణాని తేభ్యోఽతీతో యతో నిత్యానందే రసాత్మని శివే తేషా మభావా త్తథా జగద్భోగస్య క్షుద్రత్వేన విమత్సరశ్చ స భవతి ॥ అతఏవ చ సిద్ధాసిద్ధౌ సమావిత్యతః కృత్వాపి కర్మభి ర్ననిబధ్యత ఇత్యర్థః । తదుక్తం స్మృతిసారోక్త నిత్యాహ్నికే తద్యథా 'న గృహై రనుబధ్యేత నిర్మమో నిరహంగతః । పుత్రదారా ప్తబంధూనాం సంగమః పాంథసంగమ' ఇత్యాది బహుశోద్రష్టవ్యమ్॥౨౨॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

అభావాదితి॥ తద్యథా 'సజ్జాసనస్థోథ పరి వ్రిజన్వా ముక్తఃపరిక్షీణ వితర్కజాలః। సంసారబీజ క్షయమీక్ష్యమాణ స్స్యన్నిత్యముక్తోఽమృత భాగభోగీతి స్మృతిన్యాయేన తేషాం ద్వంద్వాదీనా మభావాదితి భావః। బహుశఇతి॥ తద్యథా। భావహీనాస్తు యే లోకే పుత్రదారాప్త వర్జితాః నపుంసకాశ్చ వృక్షాద్యా నైవతే ముక్తిభాగిన' ఇత్యాదినా నిత్యాహ్నికే దిగ్విజయేచ బహుశో దర్శితవ్య మిత్యర్థః॥ ౨౨॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ రాగాదులు నశించి నిత్యతృప్తుఁడైన యోగి జగత్తునందు నెట్లు సంచరించుననఁగాఁ జెప్పుచున్నాఁడు. ప్రాప్తమయిన దానితో నానందించుచు సుఖదుఃఖాది ద్వంద్వంబుల లెక్కసెట్టక విరోధబుద్ధి వదలి నిత్యానందమయి రస స్వరూపమైన శివుని యందు శీతోష్ణములు తోచకపోవుటవలన జగత్తునందలి భోగములు నీచములగుటంబట్టిమత్సరము లేనివాఁడై యుండుచున్నాడు. కనుక నే యాత్మశత్రువుల జయము సిద్ధించినను సిద్ధింపకపోయినను సమత్వముతోనుండినవాఁడు కర్మలుచేసియు బద్ధుడుగాఁడు. ముముక్షువు పరుపుమీఁద గూర్చుండినను పరివ్రాజ్యముఁ జేయుచున్నను సరే. ఇతరులతో గుతర్కములు మాని సంసారబీజమును గాల్చివేయుటకు బ్రయత్నముఁజేయుచు నమృతపానము చేయువాఁడు నిత్యము క్తుఁడని స్మృతివాక్యము. లోకమందు భావవర్జితులును బత్నీపుత్ర బంధువులచే విడువఁబడినవారును నపుంసకులును వృక్షములు మొదలగునవి యును ముక్తికి నధికారులుగారని యాహ్నికదిగ్విజయమందుఁ జెప్పఁ బడినది ॥౨౨॥

శ్లో॥ గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః।
యజ్ఞయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే॥ ౨౩

—♦ భాష్యమ్ ♦—

నను కేన తత్త్వవివేకేన జ్ఞానవాన్ కర్మభి ర్నానిబధ్యత ఇత్యాహ। గతసంగస్యేతి॥ ఏవంసతి 'మూ ర్తిరేవేశ్వరః కశ్చి న్మూర్తౌ తిష్ఠతి కశ్చన అమూ ర్తం మూ ర్తిమత్స్వేకం జ్ఞాత్వా పూజ్యో వివేకిభి' రిత్యాది స్మృత్యా త్రివిధేష్వధికారిషు తత్త్వ వివేకినోగతసంగస్య జీవన్ముక్తస్య జ్ఞానావస్థితచేతస స్తృతీయస్య 'యజ్ఞాద్భవతిపర్జన్య' ఇత్య త్రోక్తాయ యజ్ఞాయాచరతః కర్మ సమగ్రింప ర్రేబ్రహ్మణి పరమశివే తురీయే ప్రవిలీయతే సమర్ప్యత ఇత్యర్థః॥ ౨౩

—♦ లఘుటిప్పణీ ♦—

తృతీయస్యేతి। తత్రామూ ర్తం మూ ర్తిమత్స్వేకం పశ్యతో జ్ఞానిన శ్చేత్యర్థః। ॥౨౩॥

—✻ ఆన్ధ్రితాత్పర్యము ✻—

ఏతత్త్వము తెలియుటచే జ్ఞానవంతుఁడై కర్మలచే బద్ధుడుగాఁడనినఁ జెప్పుచున్నాఁడు: ఈశ్వరారాధనయందుఁ ను త్తమమధ్యమాధమాధికారు లిట్లు వచింతురు. అధమాధికారి యీమూ ర్తియే ఈశ్వరుండనును. మధ్య మాధికారి యీశిలామూ ర్తిగాదు. ఇందు శివుఁడున్నాడనును. ఉత్తమాధి కారి నిరాకారమైన శివుని సాకారముగ పూజించుటయనును. ఇట్లు 'శివుని తెలిసికొని పూజింపవలయు'నను స్మృతిచేత మూఁడువిధ ములయిన యధికారులలో నుత్తమాధికారి తత్త్వజ్ఞానముగలవాఁడు. సంగరహితుఁడు జ్ఞానాకారమైన చిత్తముగలవాఁడు గృహస్థుఁడు నిత్యముఁజేయు పచనాదికర్మ యజ్ఞముకొఱకని తలంచి 'యజ్ఞమువలన

మేఘము లుత్పన్నమగును. ఆందువలన వర్షముకలుగును' అని యెంచి, తాను జేయు కర్మయంతయుఁ మరియరూపుఁడైన పరశివునకు సమర్పించును. అట్టి వాఁడు కర్మలనంటఁడు॥౨౩॥

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మ కర్మ సమాధినా॥ ౨౪

—♦ భాష్యమ్ ♦—

నన్వేవమపి యజ్ఞ మేవ వివేకిభిః కర్తవ్యం తత్కథమితి స్పష్టం కుతో నోచ్యత ఇత్యాహ। బ్రహ్మార్పణమితి। తత్రైవం సతి ప్రణామాంజలి ముద్దిశ్య 'తదైవమనః శంభుపదారవిందయో రిత్యాదిస్మృతిన్యాయేన కుర్వాణో 'యస్మిన్ కృతేసకించి త్కర్మ క్రియత' ఇత్యాది శ్రుత్యర్థసారేణ క్రియమాణేన కర్మణా బ్రహ్మైవాప్యత ఇతి బ్రహ్మకర్మసమాధిరపీత్థమనేన వివేక్తవ్య ఇతిభావః॥౨౪

—✻ లఘుటిప్పణీ ✻—

వివేకిభిరితి। వివేకత్వంచ 'బ్రహ్మ తం పరాదాద్యోన్యత్రాత్మనో వేదక్షత్రం తం పరాదాద్యోన్యత్రాత్మనో వేదే' త్యాదిశ్రుతిన్యాయేన సర్వాత్మ దర్శిభి ర్వివేకిభిరపి యథోచితం కర్మ వక్ష్యమాణ రీత్యా కర్తవ్య మేవేతి భావః॥౨౪॥

—♦ ఆంధ్రతాత్పర్యము ♦—

ఓయీ వివేకులు యజ్ఞమును జేయవలెను. దాని నెట్లు చేయవల యునో స్పష్టముగా నెందులకుఁ జెప్పరనినఁ జెప్పుచున్నాఁడు. బ్రహ్మ మైన స్రుగాది హోమపాత్రలచేత బ్రహ్మమైన హవిస్సు బ్రహ్మమైన యగ్ని

యందు బ్రహ్మమైన యజమానునిచేత హోమము చేయఁబడి కర్మబ్రహ్మాల
నను సంధానముచేయుటచేత బ్రహ్మరూపమగు ఫలమునుబొందుచున్నాఁడు

శ్లో॥ దేవ మేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే।
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి॥ ౨౫

—♦ భాష్యమ్ ♦—

నను కతివిధా యజ్ఞాయే స్సదాశివ స్సర్వత్రాగ్రి భోక్తృ
త్వేన పూజ్యత ఇత్యాహ॥ దైవమితి॥ ఏవం తర్హి త్యక్తాశ్ర
మోఽవిధేయాత్మా త్రిదండముపజీవతి, సురానాత్మానమాత్మ
స్థమీశ్వరం హంతి ధర్మహేత్వాది స్మృత్యా యజ్ఞస్యావశ్య
కత్వేఽస్థితేఽత్రత్రితావత్. ‘రుచీనాం వైచిత్ర్యాదృజుకుటిల నానా
పథజుషా’ మితిస్మృతిన్యాయేన కేచిద్యోగినో దైవంయజ్ఞం పర్యు
పాసతే కేచిత్తు బ్రహ్మాగ్నౌ జ్ఞానాగ్నౌ శివే బ్రహ్మార్పణం
బ్రహ్మహవి రితి యథోక్తరీత్యా యజ్ఞం యజ్ఞాధిష్ఠాతారం
శివం యజ్ఞేనైవోపజుహ్వతీత్యర్థః॥ ౨౫॥

—♦ లఘుటిప్పణీ ♦—

అగ్రభోక్తృత్వేనేతి ‘దధ్యక్షతం శివాయోక్తం సిందూరం శక్తి
తుష్టయే అర్ధనారీశ్వరస్యేయం పూజోక్తా కలశాగ్రత, ఇత్యాద్యవధార్యమ్

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

సదాశివుడగ్రిభోక్తగా బూజింపఁబడు యజ్ఞము లెన్నివిధము
లనగా జెప్పుచున్నాఁడు. కొందరు కర్మయోగులు దేవతార్చనరూప
మగుయజ్ఞమునందే నిష్ఠగలిగియుందురు. ఈదేవతార్చన సామాన్యమని
విశేషమని రెండువిధములు. సామాన్యముగృహదేవతార్చన, చరము, విశేష

మాలయాసులయందు బూజించుట, ఇదిస్థిరము. మన్వాదులచే 'దేవతాభ్యర్చనం చైవ సమిదాధానమేవచ' కర్మయోగులకు దేవతార్చన నిత్యకర్మగాఁ జెప్పఁబడినది, రుజుకుటులగతులు గలనదులు సముద్రమును జేరుపగిది నెవ రెట్టిరూపముగాఁబూజించినను నందఱికిని గమ్యస్థానము (ముక్తినిచ్చువాడు) శివుడుగాన శివుని నారాధించు వారలీజన్మమునంచె ముక్తినొందెదరు. విష్ణ్వారాధనచే మూఁడుజన్మలలో ముక్తినొందెదరు. కొందరు స్రుగాది సాధనముచేత హవిస్సునగ్నియందు హోమము జేయుదురు. అహోరాజానమధ్వరస్య రుద్రం అనుశ్రుతిని బట్టియందును నీశ్వరుఁడేయగ్రభోక్త. కొందరు జ్ఞానయోగులాశ్రమత్యాగమును జేసి జ్ఞానాగ్నియైన శివునియందు నాత్మరూపహవిస్సును హోమము జేయుచున్నారు. ౨౫

శ్లో॥ శ్రోత్రాదీనీంద్రియాన్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి।
శబ్దాదీన్విషయానన్యే ఇంద్రియాగ్నిషు జుహ్వతి॥ ౨౬

—♦ భాష్యమ్ ♦—

అథాపరానపి యోగిన ఆహ॥ శ్రోత్రాదీనీతి ఏవం సత్యన్యే యోగిన శ్రోత్రాదీనీంద్రియాణి తపశ్చరణాదినా సంయమాగ్నిషు జుహ్వతీత్యర్థః॥ ఏవమన్యేతు 'ముఖేనామాస్తి రూపం వై చక్షుషీదం ద్వయం మత' మితి స్మృతిన్యాయేన శబ్దాదీన్విషయానింద్రియాగ్నిషు జుహ్వతీత్యర్థః

—♦ లఘుటిప్పణీ ♦—

న్యాయేనేతి యథైకేన మృణ్మయేన సర్వమృణ్మయం విజ్ఞాతం భవతి. వికారోనామధేయం మృత్తికేత్యేవ సత్యమిత్యాది శ్రుతిన్యాయేనా పీత్థమేవ వివేక్తవ్యమిత్యర్థః॥

## —♦ ఆన్ధ్రితాత్పర్యము ♦—

ఇతరమైనయోగులను జెప్పుచున్నాఁడు- కొందరుశ్రో|తాదీంద్రియములనెడు హవిస్సును సంయమాగ్నియందు హోమముసేయుదురు. (అనగా కొందఱు కర్మయోగులు తపశ్చరణాదికముచేత శ్రోత్రాదీంద్రియముల నిగ్రహమునందే ప్రయత్నింతురు. మఱికొందఱు యోగులు శబ్దాది విషయరూపమగు హవిస్సును ఇంద్రియవర్గమనునట్టి యగ్నియందు వేల్తురు. (అనఁగా మఱికొందఱు కర్మయోగు లిన్ద్రియములకు శబ్దాదివిషయములందుఁ గలయాసక్తిని నివారించువిషయమున బ్రయత్నింతురు. ౨౬.

శ్లో॥ సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।
ఆత్మసంయమ యోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే॥ ౨౭

## —♦ భాష్యమ్ ♦—

ఏవం పరానపి యోగిన ఆహ । సర్వాణీతి॥ ఏవంతర్వాల్యే పరే యోగిన ఆత్మనా బుద్ధిమనోభ్యాంసహితానిసర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చ సప్తదశతత్వాని యమాద్యష్టాంగసంయమేన జ్ఞానదీపితేఽగ్నౌ జుహ్వతీత్యర్థః।

## —♦ లఘుటిప్పణీ. ♦—

సంయమేనేతి॥ తత్రతావత్ పంచజ్ఞానేంద్రియాణి పంచకర్మేంద్రియాణి పంచప్రాణా మనోబుద్ధిశ్చ సప్తదశతత్వాని యమాద్యష్టాంగసంయమేనేత్యర్థః॥ తత్రితావద్యమోనామ సంసారాన్మనసో నివృత్తిః । నియమోనామ ప్రయోగానుష్ఠానం అసనంనామ స్వస్తికాది ప్రాణాయామస్తు పూరకకుంభక రేచక భేదేన త్రివిధః ప్రత్యాహారస్తు తత్తద్విషయేభ్యో మనసో నిగ్రహః॥ ధారణాతుపరాత్మనితురీయే శివే మనసస్థాపనం ధ్యానం

ణామ పరే(బహ్మణి శివే సర్వాత్మనావస్థానం సమాధిర్నామ సంప్రజ్ఞాతోఽసంప్రజ్ఞాతశ్చేతి ద్వివిధమత్యధికమన్యత్ర విస్తరః॥

## —♦ ఆంధ్రతాత్పర్యము ♦—

అష్టాంగయోగములు. 1. యమమనఁగా హింసావర్జితుఁడై బాహ్యేంద్రియవ్యాపారములు చాలించి శబ్దాది విషయంబులఁ బాసియుండుట.

2. నియమమనఁగా సంసారక్రియాసక్తిని దొలఁగఁజేసి దారేషణ పుత్రేషణ, ధనేషణల విడిచి ఏకాంతప్రదేశంబున శుచియై మఠాంతరంబునైనను గుహాంతరంబునైనను వసింపుచు నితరభాషణములకు బోక యోగాభ్యాసాసక్తి గలిగియుండుట.

3. ఆసనమనఁగాఁ బీఁటమీఁద దర్భాసనము అందుపైని వ్యాఘ్రాసనము లేక కృష్ణాజినముదానిపైని పలుచని వస్త్రాసనము అందు సుఖాసనమునఁ గూరుచుండి శిరమును గళమును భుజములును శరీరమును జక్కఁగా నిక్కించి యోగాభ్యాసమును జేయుట.

౪. ప్రాణాయామమనఁగా ప్రాణవాయు వూర్ధ్వసంచారము గలది. అపానవాయు వధస్సంచారము గలది. ప్రాణమును అపానమందును, అపానమును బ్రాణమందును జేర్చుట ప్రాణాయామము - ప్రాణాయామము మూఁడువిధములు: ప్రాకృతప్రాణాయామము 2 వైకృత ప్రాణాయామము 3 కేవలకుంభక ప్రాణాయామము.

### ౧. ప్రాకృత ప్రాణాయామము.

ఇది అజపామంత్రానుష్ఠాన రూపమైనది. నేటి సూర్యోదయ మొదలు రేపటి సూర్యోదయమువఱకు నిరువదియొక్క వేయియు నాఱు నూఱుల హంసలను మూలాధారచక్రము మొదలుకొని సహస్రారచక్రము వఱకునున్న తత్తదధిష్ఠానదేవతలకు నాయా సంఖ్యలప్రకారము హంసల

సర్పించుచు జేయింబగళ్ళొక్కరీతిగా నుండుట: అదియెట్లనఁగా అద్య దినసూర్యోదయ మారభ్య శ్వస్సూర్యోదయపర్యంతం మయాకృతో చ్ఛ్వాసనిశ్వాసాభ్యాం షట్శతాధిక మేకవింశతి సహస్రసంఖ్యాక మజపాజపం యథాభాగం నివేదయామి. మూలాధారమండపస్థితాయ సిద్ధలక్ష్మీసమేతాయ గంగణపతయేనమః. షట్శతం నివేదయామి ఆఱునూఱుహంసలను గణపతికి సర్పణచేయవలయును. హంసలను లెక్క పెట్టలేనియెడల గడియారమును చూచుకొనవలెను. నిమిషమునకు 15 హంసలచొప్పున 600 హంసలకు 40 నిమిషములుపట్టును. 6 గంటలకు సూర్యోదయమైనయెడల గం 6-40 లకు గణపతికి పైనజెప్పిన ప్రకారం అర్పణచేయవలెను. గం 6-40 ల మొదలు గం 1-20 ల వఱకు 6000 హంసలగును. స్వాధిష్ఠానమంటపస్థితాయ సరస్వతీసమేతాయ అంబ్రహ్మణే నమః షట్సహస్రం నివేదయామి గం 1-20ల లగాయితు రాత్రి 8 గంట లకు 6000 హంసలగును. మణిపూరకమంటపస్థితాయ లక్ష్మీసమేతాయ ఉం విష్ణవేనమః. షట్సహస్రం నివేదయామి 8 గంటలలగాయతు 2-40 లకు 6000 హంసలగును. అనాహతమండపస్థితాయ గౌరీసమే తాయ మం రుద్రాయనమః - షట్సహస్రం నివేదయామి. గం 2-40 ల లగాయతు గం 3-46 ల వరకు 1000 హంసలగును. విశుద్ధమండపస్థి తాయ అవిద్యాసమేతాయ జీంజీవాత్మనేనమః సహస్రంనివేదయామి, గం 3-46ల లగాయతు గం 5-53 వఱకు 1000 హంసలగును. ఆజ్ఞా చక్రమండపస్థితాయ విద్యాసమేతాయ పంపరమాత్మనేనమః. సహస్రం నివేదయామి. గం 4-53 లలగాయతు 6 గంటలవఱకు 1000 హంస లగును. సహస్రదళకమల కర్ణికాపీఠమధ్యస్థితాయ చిచ్ఛక్తి సహితాయ గుం గురవేనమః - సహస్రం నివేదయామి. అని అర్పణచేయవలయును.

మూలాధారచక్రము గుదస్థానమందున్నది. 4 దళములును, వ-శ-ష-స-యను నక్షరములును గలిగియున్నది. స్వాధిష్ఠానచక్రము గుహ్యస్థాన మందున్నది. 6 దళములును, బ-భ-మ-య-ర-ల యను నక్షరములును

గల్గియున్నది. మణిపూరకచక్రము నాభిస్థానమందున్నది. 10 దళములును డ-ఢ-ణ-త-థ-ద-ధ-న-ప-ఫ-యను నక్షరములును గలిగినది. అనాహత చక్రము హృదయ స్థానమందున్నది. 12 దళములును క-ఖ-గ-ఘ-ఙ-చ-ఛ-జ-ఝ-ఞ-ట-ఠ యను నక్షరములును గలిగినది. విశుద్ధచక్రము కంఠస్థానమందున్నది. 16 దళములును అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ-ఏ-ఐ-ఓ-ఔ-అం-అః-యను నక్షరములును గల్గియున్నది. ఆజ్ఞా చక్రము భ్రూమధ్యయందున్నది. 2 దళములును హ-క్ష-యను నక్షరములును గల్గినది. సహస్రారచక్రము బ్రహ్మరంధ్ర స్థానమందున్నది. వేయి దళములు గలయది. ఇందుఁ జిచ్ఛక్తితోఁ గూడిన గురుఁడుండును.

౨ వైకృతప్రాణాయామము.

ఇది లయయోగము. ఎడమ ముక్కుగుండా, ఇడయను చంద్ర నాడీమార్గంబున వాయువును ౧౬ మాత్రల కాలమున బ్రణవాను సంధాన ముతోఁ బూరించి కుంభకమందు ౬౪ మాత్రలవఱకుఁ బ్రణవస్మరణ చేయుచు కుడిముక్కుగుండా పింగళయను సూర్య నాడీమార్గంబున ౩౨ మాత్రల కాలములో బ్రణవస్మరణతో రేచించవలెను. రెండవమాఱు సూర్యనాడితో ౧౬ మాత్రలు కాలమునఁ పూరించి కుంభకమందు ౬౪ మాత్రలుంచిచంద్రనాడితో ౩౨ మాత్రలు రేచించవలెను. మూడవమాఱు ఇడాపింగళతో ౧౬ మాత్రలు పూరించి కుంభకమందు ౬౪ మాత్రలుండి రెంటితోను ౩౨ మాత్రలు విడువవలెను. మాత్రా కాలమనఁగా మోఁకాలు చుట్టును గుడిచేతిని తొందఱగాను గాక నెమ్మదిగాను గాక సమముగాఁ ద్రిప్పి చిటికివేసిన నెంతకాలముపట్టునో నది మాత్ర యనఁ బడును. ఇట్లు రోజుకు నాలుగు మాఱులనఁగా బాల్య యౌవన కౌమార వార్ధకములు నాల్గు గనుక ప్రాతఃకాల మధ్యాహ్నకాల సాయంకాలార్ధ రాత్రములయందుఁ దడవునకు 20 ప్రాణాయామముల చొప్పున నాచరించి శని ౬ మాసముల పిమ్మట వాయువు స్థిరపడును.

### 3. కేవల కుంభక ప్రాణాయామము.

రెండు ముక్కులు గుండా సుషుమ్నామార్గంబున వాయువును పూరించి మూలాధారాది బ్రహ్మరంధ్రాంతస్థానములయందు నచ్చటచ్చట వాయువు నరికట్టియుండలి నీశక్తిని నిద్రనుండి మేల్కొలిపి మూలబంధోడ్యాణ బంధజాలంధర బంధములనతిక్రమింపఁజేసి (మూలబంధమనఁగా గుదగుహ్యములయందపానవాయు సంచారము గనుక యెడమకాలి మడమచే గుదస్థానమును బంధించుట. ఉడ్యాణబంధమనగా కుడికాలి మడమచే నాభిని బంధించుట. జాలంధరబంధమనగా గడ్డమును ఱొమ్మునందుంచుట రేచకపూరకంబుల నిలిపి ప్రాణాపానముల రెంటిని ఱెయియుపగ లొక్కపక్కిగఁ గలుపుట కేవల కుంభక ప్రాణాయామము. ఇదియే హఠ యోగమనఁబడును.

5. ప్రత్యాహారమనఁగా ఉప్పు పులుసు మొదలయిన రాజసతామసాహారముల వర్జించి క్షీరాజ్యశర్కరాఫలంబులైన సాత్వికాహారంబుల భుజించుచు నింద్రియములను విషయములయందుఁ బోనీక వశపఱచుకొనుట.

6. ధారణయనగాఁ దురీయరూపుఁడును బరమాత్మయునైన శివుని యందు మనసునిలుపుట.

7. ధ్యానమనగా పరబ్రహ్మమైన శివునియందు సర్వాత్మనా ఉండుట.

8. సమాధియనగా ఉప్పు నీటియందు కరిగి జలమయమైనట్లు మనసును ఆత్మయును నేకమగుట. సమాధి రెండువిధములు. సవికల్పకసమాధి నిర్వికల్పకసమాధి సవికల్పకసమాధియనఁగా త్రిపుటిరహితముగాక యేచిత్తవృత్తిని బ్రహ్మాకారముగాఁ జేసి కేవలపరబ్రహ్మమందు నిల్పుట, (త్రిపుట యనగా జ్ఞాత-జ్ఞానము, జ్ఞేయము.) నిర్వికల్పసమాధియనఁగా త్రిపుటిరహితముఁజేసి పరబ్రహ్మమునందు జిత్తమును జెలింపక నిలుపుట. అందు సవి

కల్పకసమాధి దృశ్యానువిద్ధసవికల్పకసమాధి యనియు శబ్దానువిద్ధ సవి కల్పక సమాధియనియు రెండువిధములు. నిర్వికల్పసమాధి తోఁగలసి మూఁడు విధములు. ఈమూఁడువిధములు బాహ్యాభ్యంతర భేదములచే నాఱు విధములు.

1. బాహ్యదృశ్యానువిద్ధసవికల్పకసమాధి 2 ఆంతరదృశ్యాను విద్ధసవికల్పకసమాధి, 3 బాహ్యశబ్దానువిద్ధసవికల్పకసమాధి, 4 ఆంతర శబ్దానువిద్ధసవికల్పకసమాధి, 5 బాహ్యనిర్వికల్పకసమాధి, 6 ఆంతరనిర్వి కల్పకసమాధి.

1. బాహ్యదృశ్యానువిద్ధసవికల్పకసమాధి, బ్రహ్మాదిసకలదేవతలును సకలచేతనాచేతనజగత్తును బాహ్యము దృశ్యమనెడి సమస్తమును దన తెలివియందే పుట్టి నశించునని యెంచిసకలదృశ్యములకు దాను విలక్షణుఁ డైన పరమాత్మస్వరూపుఁడని దలంచుటయగును.

2 ఆంతరదృశ్యానువిద్ధసవికల్పకసమాధి తనయందు స్వభావముగా బుట్టు నాంతిరదృశ్యములనంబడు నంతఃకరణవృత్తులకుఁ దానువిలక్షణుడై పరశివస్వరూపుఁడని తలంచుటయగును.

3 బాహ్యశబ్దానువిద్ధసవికల్పసమాధి, బాహ్యశబ్దములగు దేవదత్తాది శబ్దములకును నామములకును దానువిలక్షణుఁడననియు నామరూపక్రియా రహితుడగు పరమాత్మయేతానని తలంచియుండుట యగును.

4 ఆంతరశబ్దానువిద్ధసవికల్పకసమాధి, ఆంతరశబ్దములనెడి కామ క్రోధాదిషడ్వర్గమునకును మఱియుఁ బ్రణవనాదమందలి చిణీనాదము ఘంటానాదము శంఖనాదము వీణానాదము వేణునాదము తాళనాద ము భేరీనాదము మృదంగనాదము మేఘనాదము అను దశవిధనాదముల కును దాను విలక్షణుడనని దలంచుటయగును.

5. బాహ్యనిర్వికల్పకసమాధి. పైనఁజెప్పిన నాల్గు విధములైన సమాధులయందును దనకంటె వేఱైన దేదియుఁ దోఁపక పరశివస్వరూపముగనె గనంబడుట యగును.

6. అంతరనిర్వికల్పకసమాధి. తాను పైనఁజెప్పిన వానికంటె విలక్షణుఁడనను నెద్ధివృత్తిలేక కేవలపరమాత్మస్వరూపమే నేనని తలంచుట యగును.

ఈసమాధులయందు సర్వసమరస భావముదయించును. ఏవిధమగు భేదభావమును దోఁచదు. ఈఅంతరనిర్వికల్పకసమాధికి అతద్వ్యావృత్తిరూపసమాధియనియు, అసంప్రజ్ఞాతసమాధియనియు నామాంతరములు. శ్లో॥ 'ప్రజ్ఞాశూన్యం మనశ్శూన్యం బుద్ధిశూన్యం తథైవచ' అతద్వ్యావృత్తిరూపోయం సమాధి ర్యోగినాం ప్రియః॥ ౨౭॥

శ్లో॥ ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథా పరే।
స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞా శ్చ యతయ స్సంశితవ్రతాః॥ ౨౮

—♦ భాష్యమ్. ♦—

ఏవంత్రిభిశ్లోకైః పంచయజ్ఞానుక్త్వా అధునైకేన శ్లోకేన షడ్యజ్ఞానహ్యాహ। ద్రవ్యయజ్ఞాఇతి, తత్రైవం సతి ద్రవ్యత్యాగ ఏవ యథాశాస్త్రం యేషాం తే ద్రవ్యయజ్ఞాః ఏవం కృచ్ఛ్రచాంద్రాయణాది తపఏవ యజ్ఞో యేషాం తే తపోయజ్ఞాః। తథా యోగ శ్చిత్తవృత్తినిరోధ ఏవ యజ్ఞో యేషాం తే యోగయజ్ఞాః। ఇహ స్వాధ్యాయో మోక్షశాస్త్రాణా మధ్యాపనం ఏవం వేదార్థనిశ్చయ పరాజ్ఞానయజ్ఞా ఇత్యేవం షడ్విధా యజ్ఞేషు యతయో యత్నశీలా స్సంశితవ్రతా స్సమ్యక్ శితాని తీక్ష్ణీకృతాన్యతిదృఢాని వ్రతాని యేషాం తే తథైవేత్యర్థః॥ ౨౮

## —◆ ల ఘు టి ప్ప ణీ ◆—

పంచయజ్ఞానితి । శ్రోత్రాదీని పంచజ్ఞానేంద్రియాణి శబ్దాది పంచవిషయేషు ధర్మశాస్త్రేణ సంయమాగ్నౌ జుహ్వతీత్యర్థః । తప ఏవేతి త్రతావత్తపసా 'కర్శితాత్మా తు పరమాప్నోతి పూరుష' మిత్యాది స్మృత్యనుకూలయా 'అతప్తతనూ ర్నతదామో ఽశ్నుతే' ఇత్యాది శ్రుత్యా కృచ్ఛ్రచాంద్రాయణాది తప ఏవ యజ్ఞో యేషా మిత్యర్థః । అన్యత్ర 'తపసా చ తనుర్యస్య స తప్తతను రుచ్యతే । వహ్నినా చ తను ర్యస్య స దగ్ధతను రుచ్యత' ఇత్యధికం ముద్రాజటారచనమాధ్యవతాం వృత్తౌ వేత్యత్రోక్తం ద్రష్టవ్యమ్॥ ౨౮॥

## —◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ◆—

ఇది వఱకు మూఁడు శ్లోకములచేఁ బంచేంద్రియయజ్ఞములను జెప్పి యిప్పుడారు యజ్ఞములను జెప్పుచున్నాఁడు. కొందఱు తీర్థాటనమంచు దానయజ్ఞమును జేయుదురు. కొందఱు కృచ్ఛ్రచాంద్రాయణాది తపో యజ్ఞమును జేయుదురు. తపముచేఁ గృశించినవాఁడు పరమపురుషునిలో నైక్యమగునని శ్రుతిస్మృతులుగలవు. కాన తప్తతనువుగాఁ గావలెను. పాషండులవలెఁ దప్తచక్రాంక నాదులు గలవాఁడు దగ్ధతనువుగాని తప్తతనువుగాఁడు. కొందఱు చిత్తనిరోధముచే యోగయజ్ఞమును జేయు దురు. కొందరు యథావిధివ్రతములనే యజ్ఞముగాఁ జేయుదురు. కొందఱు వేదాధ్యయనమును యజ్ఞముగాఁ జేయుదురు. కొందఱు వేదార్థజ్ఞానమునే యజ్ఞముగాఁ జేయుదురు. ౨౮.

శ్లో॥ అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథా పరే ।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః॥ ౨౯

## —◆ భాష్యమ్ ◆—

ఏవం ప్రాణాయామాఖ్యం యజ్ఞాంతర మప్యాహ॥ అపానఇతి॥ తత్రతావత్కేచిదపానే ప్రాణం ప్రాణే చాపానం భస్త్రికయా ముద్రయా జుహ్వతీత్యర్థః । ఏవంతత్ర కేచిద్ద్వైగతీ రుద్ధ్వాస నోత్థాపనార్థం జుహ్వతీత్యర్థ ఇత్యధికం 'కనీయస్యాం భవేత్స్వేదః కంపోభవతి మధ్యమే । ఉత్తిష్ఠత్యుత్తమే ప్రాణో రోధే సిద్ధాసనం ముహు' రిత్యాదినా ద్రష్టవ్యమ్।౨౯।

## —* లఘుటిప్పణీ *—

కేచిదితి॥ ఇహతు'షట్కర్మోత్తరం చైవ ప్రాణాయామోత్తరం క్వచిత్।రాజయోగోత్తరం వాపి సిద్ధోభవతి యోగిరాట్' ఇత్యాది స్మృత్యా యథాధికారమాపన్నానా మస్మత్పూర్వాచార్యయోగాచార్య సంప్రదాయాను సారేణోపపాదితమ్॥ ౨౯॥

## —◆ ఆన్ధ్రి తాత్పర్యము◆—

ఈప్రకారము ప్రాణాయామమను మఱియొకయజ్ఞమును జెప్పుచున్నాఁడు- కర్మయోగులాహారనియమములతోఁబూరకరేచకకుంభకములనుమూడువిధములైన ప్రాణాయామమును జేయుదురు. సిద్ధాసనమందుఁ గూరుచుండి వాయువును కొలిమితిత్తివలె పదినిమిషములవఱకు గొట్టుటయే భస్త్రియనబడును. ఈభస్త్రిచేతఁ బ్రాణము నపానమందుఁ హోమముఁ జేయవలెను. అనఁగా రెండుముక్కులుగుండా ప్రాణవాయువును బూరించియుండుట. ఇది పూర్ణకుంభకము (పూరకము) కొందఱు భస్త్రికానంతరము ప్రాణమునందపానము హోమముజేతురు. (రేచకము) ఇదిశూన్యకుంభకము. మఱికొందఱు ప్రాణవాయువుయొక్క ఊర్ధ్వగతియగు నుచ్ఛ్వాసమును అపానవాయువుయొక్క అధోగతి యగు నిశ్వాసమును

నిలిపి కుంభకమను ప్రాణాయామమును జేతురు. 'అపానే జుహ్వతి ప్రాణం' అనిపూరకము. 'ప్రాణేఽపానం జుహ్వతి' అనిరేచకము 'ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి' అని కుంభకము. ఈ ప్రాణాయామములయందు శరీరముపైకి లేచుట ఉత్తమము. కంపమువచ్చుట మధ్యమము. చెమటపట్టుట యధమము ఇట్లు మాపూర్వాచార్యులగు శ్వేతాచార్యాది (యోగాచార్యుల మతముననుసరించి మేమాచరించిన ప్రకారముపపాదించినారము. కొందఱు ప్రాణాయామమందు సిద్ధులైరి. కొందఱు రాజయోగమందు సిద్ధులయిరి. కొందఱు యజనయాజనాధ్యయ నాధ్యాపనదాన ప్రతిగ్రహములయందే సిద్ధులయిరి.

శ్లో॥ అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి।
సర్వే ఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపిత కల్మషాః॥ ౩౦

—♦ భాష్యమ్. ♦—

తథా తత్రైవ విశేషా నపరానప్యాహ॥ అపర ఇతి॥ ఏవమపరే యోగినో 'యుక్తాహార విహారస్యేత్యాది' రీత్యా నియతాహారాస్తే తావత్ । 'ద్వాత్రింశతా చతుష్షష్ట్యా క్రమాత్ షోడశసంఖ్యయే' తిన్యాయేన నియత ప్రాణాయామ పరాయణా అపి ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతీ త్యర్థః । ఏవంసతి సర్వేఽప్యేతే యజ్ఞవిద స్తత్కర్మ కర్తృశాలిన శ్చ యజ్ఞేన క్షయితం కల్మషం యేషాం తే తథేత్యర్థః। ॥౩౦॥

—♦ లఘుటిప్పణీ ♦—

ద్వాత్రింశతేతి । తత్రతావత్ ద్వ్యధికాత్రింశత్ తేనతత్సంఖ్యాక ప్రణవాదిమంత్రోచ్చారణేన తావత్కుంభకం । ఏవం చతుర్భిరధికా

షష్టిస్తథా చతుష్షష్టిస్తయా చతుష్షష్ట్యాకుంభకం, ఏకంషోడశసంఖ్యో
చ్చారణేన రేచక మిత్యాది వివేకః' నను శివర్థ మేతావంతో యత్నా
యద్యర్జునాయ శ్రీకృష్ణఃప్రాప్త ఏవేత చేన్మైవం। 'మాయామయమిదం
దేవి! వపుర్మే నహితాత్వికం। సృష్టిస్థిత్యుపసంహారం క్రియాజాలోప
బృంహితమ్॥ ఆత్మనోన్యథాత్మనో రూపం ద్వైతాద్వైత వివర్జిత' మిత్యాది
లక్ష్మీంప్రతివిష్ణువాక్యా దాత్మన శ్శివ జ్ఞానార్థం యత్నానా మావశ్య
కత్వాదితి సిద్ధాంతః॥ ౩౦॥

## —◆ ఆన్ధ్ర తాత్పర్యము ◆—

మఱికొన్ని విషయములను జెప్పుచున్నాఁడు. మఱికొందఱు యోగు
లాహారనియమములు గలిగి ప్రాణాయామమును ముప్పదిరెండుమారులుప్రణ
వోచ్చారణలోఁ బూరకమునరువదినాల్గు పర్యాయములు ప్రణవోచ్చా
రణలోఁ గుంభకమును బదునారుమాఱులు ప్రణవోచ్చారణలతో రేచ
కము జేయుదురని తెలియఁదగినది. ఇట్టి యజ్ఞవేత్తలెల్లరు పైయజ్ఞములచేఁ
గలుషముల నశింపఁ జేసికొన్నవారే. ఓయీ! అర్జునునికి శ్రీకృష్ణుఁడే
ప్రాప్తమైనప్పుడు ఇన్ని ప్రయత్నము లెందుకనఁగా నట్లుకాదు. లక్ష్మితో
విష్ణువాక్యము ఓదేవి నాయీశరీరము యథార్థమైనది గాదు. సృష్టిస్థితి
సంహారములుఁగలది. కర్మకలనబుట్టినది. ద్వైతము నద్వైతమును గాకసకల
చిదచిత్ప్రపంచాకారముఁగల పరశక్తితోఁగూడి అద్వితీయమైన శైవముగల
పరమేశ్వరుండే నాకుదైవమని విష్ణువు లక్ష్మితో, జెప్పినందువలన శివ
జ్ఞాన ప్రాప్తికొఱకై ప్రయత్నముఁ జేయవలయునని సిద్ధాంతము॥౩౦॥

శ్లో॥ యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మసనాతనం
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ.

—* భాష్యమ్ *—

తదేతదనేక విధానాం యోగినాం ఫలమప్యాహ— యజ్ఞశిష్టేతి తథాచ యథోక్తాన్యజ్ఞాన్కృత్వాఽవశిష్టేఽమృత ప్రాయమన్నం భుక్త్వా సత్వశుద్ధ్యా జ్ఞానప్రాప్తిద్వారేణబ్రహ్మ సనాతనం సదాశివం ప్రతి యాంతీత్యర్థః యస్తూక్తానాం యజ్ఞానా మన్యతమో యజ్ఞో నకృత స్తస్యాయ మల్పసుఖ ప్రదోపి లోకోనాస్తి కుతోఽన్యోవిశేషసాధనసాధ్యః పరలోక హేతు రుత్తమలోక హేతు రుత్తమలోక ప్రాప్తికైవల్యంతు తస్యదురాపాస్తమితిభావః॥౩౧॥

—• లఘుటిప్పణీ •—

భుక్త్వేతి॥ తదేతత్కూర్మపురాణే బ్రహ్మాణం ప్రతి సదాశివేనోక్తం 'నైవేద్యం పురతోన్యస్తం దర్శనే స్వీకృతం మయా । రసాన్భక్తస్య జిహ్వాగ్రాద్దశ్నామి కమలోద్భవ' ఇత్యాది బహుశోన్యత్ర విస్తరః॥ ౩౧॥

—• అన్వితాత్పర్యము •—

ఆనేక విధములైన యజ్ఞములను జేసిన యోగులకు ఫలమును జెప్పుచున్నాడు. పైనజెప్పిన యజ్ఞములను జేసి మిగిలిన యన్నమును (అమృతమును) భుజించు వారలు సత్వశుద్ధి గలిగి జ్ఞానప్రాప్తి ద్వారాసనాతన బ్రహ్మమైన సదాశివుని బొందుదురు. శ్రుతి 'అహోరాజాన మధ్వరస్య' లనునట్టి శ్రుతిప్రకారము యజ్ఞమునకు రుద్రు డధిపతి. అతని యెదుట నుంచి నైవేద్యమును చేయవలెను. దానిని రుద్రుడు భక్షించునా యనగా కూర్మపురాణమందు బ్రహ్మను గూర్చి సదాశివుని వాక్యమిట్లున్నది.

డీకమలోద్భవా! నాయెదుటనుంచిన నైవేద్యమును దృష్టితో స్వీకరించి
రసములను భుజించు పూజకునియొక్క జిహ్వాగ్రమువలన నేను భుజించు
చున్నాను' అనెడి స్మృతులనేకములు గలవు. ఈ చెప్పిన యజ్ఞమును
జేయనివారలకు నల్పసుఖమిచ్చెడి లోకమే లేదు. విశేష సాధనములు చేసి
సాధింపదగిన పరలోకమెట్లు వచ్చును. ఉత్తములు పొందదగిన కైవ
ల్యము వీరలకు చాల దూరమని యభిప్రాయము॥౩౧॥

శ్లో॥ ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రాహ్మణో ముఖే।
కర్మజాన్విద్ధి తాన్సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే॥ ౩౨

—• భాష్యమ్ •—

అథ కిం త్వయా స్వోత్ప్రేక్షామాత్రేణే దముచ్యతే
నహి వేదయేవాత్ర ప్రమాణ మిత్యాహ॥ ఏవమితి॥ ఏవంసతీహ
యథోక్తా బహువిధా యజ్ఞా బ్రహ్మణో వేదస్య ముఖే వితతా
విస్తృతా ఇత్యర్థః తదేతాన్యజ్ఞాన్కాయిక వాచిక మానస
కర్మోద్భవాన్విద్ధి జానీహీ త్యేవం జ్ఞాత్వా కృత్వా చ విమో
క్ష్యసఇత్యర్థః॥౩౨॥

—• లఘుటిప్పణీ. •—

కాయికేతి। తచ్చ 'గంగాయమునయో ర్మధ్యే తరీమావాహ్య
యత్నతః। అహం బ్రహ్మకదామీతిశ్ర పాపిష్ఠోమమాధిక' ఇతి పృచ్ఛం
తం వాల్మీకం ప్రతి విష్ణునోక్తం। తద్యథా 'వాగ్భిర్దత్తం మనోదత్తం
దత్తం పాణి కుశోదకం। ప్రదత్తం యో వదద్యాద్వై సపాపిష్ఠ స్తతో
ఽధిక' ఇత్యాద్యర్థశాస్త్రర్యమ్॥౩౨॥

## —• ఆన్ధ్రతాత్పర్యము •—

ఓయీ! నీవు చెప్పిన యజ్ఞము లూహించిచెప్పితివి. కాని యివి యన్నియు వేదములోనున్నవా? అనగా జెప్పుచున్నాడు. మీఁదజెప్పిన యజ్ఞములన్నియు వేదమందున్నవే. వాని నన్నిటిని కాయిక వాచిక మానసిక కర్మలవలనఁ బుట్టినవానినిగాఁ దెలిసికొని యాచరించిన ముక్తినొందఁగలవు॥ ౩౨॥

శ్లో॥ శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప!
సర్వం కర్మాఖిలం పార్థ ! జ్ఞానే పరిసమాప్యతే॥ 33

## —• భాష్యమ్ •—

నను సర్వేషాం తుల్యత్వనిర్దేశాత్ కర్మజ్ఞానయో స్సామ్యాపత్తి ర్నేత్యాహ । శ్రేయానితి॥ తత్రైవంసతి ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞస్సాక్షాత్కైవల్యఫలకత్వా చ్ఛ్రేయా న్ప్రశస్తతర ఇత్యర్థః । యస్మా చ్చకారణా త్సర్వం కర్మజాతం జ్ఞానఏన పరిసమాప్యతే 'తమేతం వేదానువచనే'నేత్యాది శ్రుతేరితిభావః॥ 33॥

## —• లఘుటిప్పణీ •—

జ్ఞానఇతి । జ్ఞానస్యై వోత్కృష్టత్వ మాదాయ జ్ఞానమేవ సర్వలోకరిష్ఠంమే దేహీతి బ్రువంతం ప్రహ్లాదం ప్రతి స్తంభాన్నిస్సృతేన నృసింహేనోక్తం జ్ఞానం మహేశ్వరాదిచ్ఛే న్మోక్షమిచ్ఛే జ్జనార్దనాత్ । ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేద్ధనమిచ్ఛేద్ధుతాశనాదిత్యాది ప్రహ్లాదఘట్టేకాశ్యాం ప్రహ్లాదేశ్వర పూజయాచ లోకమోక్షాపేక్షయా శివజ్ఞానం గరిష్ఠం లబ్ధమిత్యవధేయం॥

## —• ఆంధ్రతాత్పర్యము •—

తా॥ యజ్ఞములన్నియు సమానములని చెప్పుటవలన జ్ఞానమును, కర్మయు సమానములేనా యనఁగాఁ గాదని చెప్పుచున్నాఁడు. ద్రవ్య సాధనముచేసి సిద్ధమగు యజ్ఞముకన్న జ్ఞాన యజ్ఞము సాక్షాత్తు కైవల్య మిచ్చునది. గావున శ్రేష్ఠతరము. యెందువల్లననఁగాఁ కర్మలన్నియు జ్ఞానమందు సమాప్తి నొందుచున్నవి. అనఁగా జ్ఞానముకలుగు పర్యంతము కర్మలను జేయవలయునని భావము. (అట్టిజ్ఞాన మీశ్వరానుగ్రహములేక రాదు. ప్రహ్లాదుఁడు నృసింహమూర్తిని జ్ఞానమడిగినప్పు డిట్లు చెప్పెను. 'జ్ఞానము మహేశ్వరునివలనఁ బొందనగును. మోక్షము జనార్దనునివలనఁ బొంద నగును. అనఁగా విష్ణువు మాయాశక్తిగనుక దానివలన గలిగిన వాసనాత్రయము విష్ణువువలన దొలగును. ఆరోగ్యభాగ్యములను సూర్యునివలనఁ బొందనగును.' అని చెప్పిన నృసింహమూర్తి వాక్యమును ప్రహ్లాదుఁడు విని కాశిలోఁ బ్రహ్లాదఘట్టమునందు మహాదేవుని బ్రతిష్ఠించి పూజించి యీశ్వరానుగ్రహమువలన జ్ఞానంబునొందెను. గనుక మోక్షాపేక్షకంటె జ్ఞానమే గొప్పదియని తెలియువలెను. ३३.

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥ ३४

## —• భాష్యమ్ •—

నన్వేతాదృశం జ్ఞానం కస్మాల్లభ్య మిత్యాహ । తద్విద్ధీతి॥ తథాచ తదేతత్ జ్ఞానం ప్రణిపాతో దీర్ఘనమస్కార స్తేన తథాబద్ధోఽహం కే నోపాయేన ముక్తోఽహం స్యామిత్యేవ మాది ప్రశ్నేన ఏవం సేవయా భక్తిశ్రద్ధాతిశయరూపేణ సేవయే త్యర్థః । 'తథాతద్విజ్ఞానార్థం సద్గురు మేవాభిగచ్ఛేత్సమి

మిత్పాణి శ్రోత్రియం బ్రహ్మనిష్ఠ మిత్యాదిశ్రుతేః ఏవంసతి 'పదవాక్యప్రమాణగురవోపి తత్త్వదర్శినః । తస్మై స విద్యామువపన్నాయ ఆత్మతత్త్వం ప్రాహేత్యాదిశ్రుతే ర్వృత్తివ్యాప్యత్వేన జ్ఞానముపదేక్ష్యంతీత్యర్థః॥ ౩౪॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

బద్ధోహమితి తద్యథా। 'అహం బద్ధోవిముక్తః స్యామితియస్య స్థిర నిశ్చయః । నాత్యంతమజ్ఞోనోతజ్ జ్ఞస్సోస్మిన్ శాస్త్రేఽధికారవాన్' ఇత్యాది స్మృత్యా ప్యవధార్యం॥ సేవయేతి॥ తదుక్తం స్మృతిసారే 'ప్రశాంతచిత్తాయ జితేంద్రియాయ ప్రహీణ దోషాయ యథోక్తకారిణే గుణాన్వితాయా నుగతాయ సర్వదా ప్రదేయ మేతత్సతతం ముముక్షవే'॥ ఇత్యాది బోధ్యం॥ వృత్తివ్యాప్యత్వే నేది॥ 'బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తి వ్యాప్తిరపేక్షితా।ఫలవ్యాప్యత్వమేవాస్య శాస్త్రకృద్భిర్నిరాకృత'మిత్యాది స్మృత్యా వివేక్తవ్యం॥ ౩౪॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య మ్ ♦—

ఇట్టి జ్ఞానమెవరివలన లభ్యమగుననఁగా చెప్పుచున్నాడు. ముముక్షువు జ్ఞానముకొఱకు శ్రోత్రియుండు బ్రహ్మనిష్ఠుండునైన సద్గురునాశ్రయించవలెను. గురువులు కార్యగురువు కారణగురువని రెండువిధములు. కార్యగురువనఁగా శిష్యవిత్తాపహారి కారణగురువనఁగా శిష్యహృత్తాపహారి॥ అనఁగా శివైక్యానుసంధానము గలిగించువాఁడు గాన సమిత్పాణియై కార్యగురువును జేరక కారణగురువును జేరి చతుర్విధ శుశ్రూషలు సేయుచు (అనగా స్థానశుశ్రూష, అంగశుశ్రూష, భావశుశ్రూష, ఆత్మశుశ్రూష, స్థానశుశ్రూష. స్థానశుశ్రూష, అనఁగా గురువుయొక్క గృహారామ క్షేత్రపశుధనధాన్యాదుల రక్షించుట. అంగశుశ్రూష యనగా గురువునకు

అభ్యంగస్నానపాదసేవాదులజేయుట. భావశుశ్రూష, యనఁగాగురుఁడే, తల్లి, దండ్రి, చుట్టము, స్నేహితుడు, విద్య, ధనము, దాత, దైవమురక్షకుడు అని తలంచుట. ఆత్మశుశ్రూషయనఁగా గురువునకిష్టమగు పదార్థములదుగక మునుపే యిష్టిగఁదెచ్చియిచ్చుట) సాష్టాంగదీర్ఘనమస్కారముచేతను భక్తిశ్రద్ధాన్వితసేవచేతను మాటిమాటికిఁ బ్రశ్నించుటచేతను శిష్యుఁడుకోపములేక ప్రశాంతముగా నుండవలెను. మఱియు జితేంద్రియుఁడుకావలయును. నిర్దోషిఁగా నుండవలయును. చెప్పిన పని చేయువాఁడుగానుండవలయును. సుగుణ సంపత్తి గలిగి యుండవలయును. సర్వదా గురువువెంట మర్కట మార్జాల న్యాయముగా వదలి యుండనివాఁడుగా నుండవలయును. (మర్కట న్యాయమనగా కోఁతియొక్కపిల్ల తల్లికడుపుగాని వీపునుగాని కఱచిపట్టుకొని యుండును. ఇందు తల్లియొక్క పట్టు కొంచెమైనను లేదు మార్జాలన్యాయమనఁగా బిల్లితనపిల్లలను మరియొకచోటికి నోటితోఁ గఱచిపట్టి తీసుకొనిపోవును. ఇందుఁబిల్ల యొక్కపట్టు కొంచెమైనను లేదు. ఈరీతిగా నుండు ముముక్షువైనఁ(అనగా నేను బద్ధుడనైయున్నాను. ముక్తుఁడను గాఁగలనని) దృఢనిశ్చయము గలిగి యత్యంతము నజ్ఞానియుఁ గాక బ్రహ్మజ్ఞానియుఁ గాక యుండునట్టి శిష్యుని వాని లక్షణములను జూచి గురువు తత్త్వమసీత్యాది మహావాక్యముల నుపదేశించును॥౩౪॥

శ్లో॥ యద్జ్ఞాత్వా నపునర్మోహమేవం యాస్యసి పాండవ!
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి॥౩౫॥

—♦ భాష్యమ్ ♦—

నన్వేవ మతిప్రయాససాధ్యేన తత్త్వజ్ఞానేన కిం స్యాదిత్యాహ। యద్జ్ఞాత్వేతి॥ తదేవం యత్పూర్వోక్తోపదేశం జ్ఞాత్వా బంధువధాదినిమిత్తజగద్బంధనిమిత్తం చైవంమోహం

పునర్నైవ యాస్యసీత్యర్థః॥ హేపాండవ, యేనజ్ఞానాత్మనా పరమశివేన బ్రహ్మాది స్తంబపర్యంతాన్యశేషేణాత్మని స్వస్మిన్మయి చ ద్రక్ష్యసీత్యర్థః॥ ౩౫॥

## —♦ లఘుటిప్పణీ ♦—

పరమశివేనేతి॥ తత్ర తావత్సర్వస్వరూపం వరదానం కృష్ణస్య పరమశివేన దత్తం తదేచ్చ ద్రోణపర్వణి భారతే దర్శితం॥ తద్యథా। 'మత్ప్రసాదాన్మనుష్యేషు దేవగంధర్వయోనిషు । అప్రమేయ బలాత్మా త్వం నారాయణ భవిష్యసీత్యాదినా బహుళ స్తత్రైవ విస్తరః॥ ౩౫॥

## —♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

అతిప్రయాసపడి తత్త్వజ్ఞానమును సాధించిననేమి ఫలము గలుగు వనఁగాఁ జెప్పుచున్నాఁడు. పూర్వమందుఁ జెప్పిన యుపదేశప్రకార మాత్మస్వరూపజ్ఞానము సాక్షాత్కరించిన పిదప నజ్ఞానమువలన దేహమను ష్యాది శరీరములనే యాత్మగా భ్రమించునట్టియు ఆ భ్రమచేతనే యీదేహము నాది గృహము నాది' పుత్రులు నావారు అను నజ్ఞానమును నీవు పొందవు. బంధువధనిమిత్తమైనట్టి సంసారబంధము మరల నిన్నంటదు. ఓయర్జునా! బ్రహ్మాది స్తంబపర్యంతము జ్ఞానరూపమైన పరశివునిచే వ్యాప్తమైనది. ఇట్టి శివస్వరూపమును బ్రపంచమంతటను నీయందును నాయందును జూడఁగలవు. శ్రుతిః॥ తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్యముపైతి' నామరూపములువీడిన యాత్మకు బరమాత్మతోడి సామ్యముండుట తెలియుచున్నది. కృష్ణునికి సర్వభూతాత్మకత్వము వరదానము పరమేశ్వరునిచే నివ్వఁబడినదని భారతములో ద్రోణపర్వమునం దీశ్వరుఁడు నారాయణునికి నిట్లు వరమిచ్చె. ఓనారాయణా! నాయనుగ్ర

కామమువలన నీవు దేవగంధర్వయోనులయందుఁబుట్టిఅపరిమితబలముఁగలవాఁడ వగుదువు అని విస్తరించి యిక్కడనే చెప్పఁబడియున్నది. ౩౫.

శ్లో॥ అపి చేదసి పాపేభ్యస్సర్వేభ్యః పాపకృత్తమః
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి॥ ౩౬

—◆ భాష్యమ్ ◆—

నన్వస్త్వేవం పరంతు సర్వథా బంధువధకృతపాపాద్బిభే మ్యహ మిత్యాహ॥ అపీతి॥ ఏవంసతి సర్వేభ్యః పాపకారిభ్యో ప్యతిశయేన పాపకారీతి పాపకృత్తమోపి చేత్తదా సర్వంవృజి నం శివజ్ఞాన ప్లవేనైవ త్వం తరిష్యసీత్యర్థః । 'శివాశ్రితానాం జంతూనాం కర్మణా నాస్తి సంగమః వాజినాం దినకర్తుశ్చ కథం తిమిరజం భయం' ఇతిశివగీతాయామ్॥ ౩౬॥

—◆ ఆంధ్రతాత్పర్యము ◆—

అయినప్పటికిని బంధువధనిమిత్తమైన పాపమువలన భయపడు చున్నాననఁగాఁ జెప్పుచున్నాఁడు. నీ వందఱపాపులకంటె నధికమైన పాపముచేసినప్పటికిని జ్ఞానరూపనౌకవలనఁ బాపసముద్రమును దాఁటఁ గలవు. సూర్యునియొక్క గుఱ్ఱములకు చీఁకటిభయములేనట్లు శివునియాశ్ర యించినవారలకు కర్మలంటుకొనవు. "అత్యంతపాపకర్మాపి శివభక్త్యా విశుద్ధ్యతి" ఎంతపాపముఁజేసినను శివభక్తిచే శుద్ధుఁడుగాఁగలడని శివగీత యందుగలదు. ౩౬.

శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥ ౩౭

—• భా ష్య మ్ •—

నన్వేవమపి సముద్రవర్తరణే కర్మణాం నాశో నస్యా దిత్యతోఽపరం దృష్టాంత మాహ॥ యథైధాంసీతి॥ తత్రైవంసతి యథైధాంసికాష్ఠానిసమిద్ధః ప్రజ్వలితోఽగ్ని ర్భస్మ సాత్కురుతే తథా హే అర్జునజ్ఞానాగ్నిరపి భూతభవ్యవర్తమాన రూపాణి సర్వాణి కర్మాణ్యపి భస్మసాత్కురుత ఇత్యర్థః॥ ౩౭॥

—• ఆ న్ధ్రి తా త్ప ర్య ము •—

పాపసముద్రమును దాటఁగలవన్నందున. సముద్రమున కంతము లేనట్లు పాపములకును నంతములేకపోవుననఁగా మఱియొక దృష్టాంతమును జెప్పుచున్నాఁడు. అర్జునా! మండుచున్న యగ్నికట్టెలను దహింపఁజేసినట్లు జ్ఞానాగ్ని యన్నికర్మలను భస్మముజేయును. ౩౭.

శ్లో॥ నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।
తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి॥ ౩౮

—• భా ష్య మ్ •—

నను తతః కిమిత్యాహ నహీతి॥ తత్ర యస్మా దేవం తస్మాత్ జ్ఞానేన సదృశం పవిత్రం శుద్ధికారక మిహ వేదేలోకే చ నహివిద్యత ఇత్యర్థః । తదేతత్ జ్ఞానం యోగేన యమాద్యష్టాంగయోగేన సంసిద్ధ శ్శుద్ధచిత్తస్సన్ కాలేన యథాకాల కృతప్రయత్నేన విందతీత్యర్థః॥౩౮॥

## —◆ లఘుటిప్పణీ ◆—

యోగేనేతి॥ యోగాగ్నిర్దహతే క్షిప్ర మశేషం పాపపంజర'మిత్యాది శ్రుతేర్యం తరాదపిలిఖావ॥ కాలేనేతి॥ కస్యచిజ్ఞానుతే శీఘ్రం చిరకాలేన కస్యచిత' స్మృతే రవధేయం॥ ౩౮॥

## —◆ ఆన్ధ్రతాత్పర్యము ◆—

అటుపైన నేమనఁగా జెప్పుచున్నాఁడు క్షేత్రజ్ఞస్యేశ్వరజ్ఞానా ద్విశుద్ధిః పరమామతా' క్షేత్రజ్ఞానకునీశ్వరజ్ఞానమువలన మిక్కిలియుత్కృష్టమైన శుద్ధస్వరూపము గలుగునని యాజ్ఞవల్క్యస్మృతి ౩వ అధ్యాయము ఇట్టి యాత్మజ్ఞానముతో సమానముగా శుద్ధికరమైన వస్తువు వేఱొకటి యీలోకమందు లేదు. కాఁబట్టి యది సర్వపాపములను నశింపఁజేయును. అట్టి జ్ఞానమును యమనియమాసనప్రాణాయామప్రత్యాహార ధారణధ్యాన సమాధులచే శుద్ధాంతఃకరణగలవాఁడై (అనగా యోగాగ్నిచే పాపపంజరము దగ్ధమగును.) సకాలమందు బ్రయత్నించుటచేఁ బొందుచున్నాఁడు. కాలక్రమమున దన యాత్మయందుఁ దనంతట నే బొందుచున్నాఁడు. ఒకనికి శీఘ్రముగా జ్ఞానముగలుగును. మఱియొకనికిఁ జిరకాలమునకుఁగలుగునని తెలియవలెను.॥ ౩౮॥

శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేంద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాంశాంతి మచిరేణాధిగచ్ఛతి॥ ౩౯

## —◆ భాష్యమ్ ◆—

ననుకీదృశ స్తస్య శివజ్ఞానస్యోపలబ్ధౌ ముఖ్యోయత్న ఇత్యాహ॥శ్రద్ధావానితి॥ తత్రతావచ్ఛ్రద్ధావాం స్తత్రాపి తత్పర స్తతోఽపి సంయతేంద్రియస్సన్ జ్ఞానం లభత ఇత్యర్థః ।

ఏవం సవిశేషణత్రయయుక్తో వశ్యం జ్ఞానం లభతే లబ్ధ్వాచ పరాంశాంతి మచిరేణాధిగచ్ఛతి 'తస్య తావదేవ చిరంభవతి యావ న్నవిమోక్ష్యేత' ఇత్యాదిశ్రుతేరితిభావః॥౩౯॥

—* లఘు టిప్పణీ *—

శివజ్ఞానస్యేతి॥ శివజ్ఞానసమం జ్ఞానం యథానాస్తి శ్రుతౌస్మృతౌ తథా వైదికతుల్యంతు నాస్తితంత్రావలంబిష్వి'త్యాది స్కాందేస్మృత్యంతరాదపిబోధ్యం॥ ౩౯॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

అట్టి శివజ్ఞానప్రాప్తివిషయమై యేలాటి ప్రయత్నము చేయవలయుననఁగాఁ జెప్పుచున్నాఁడు-శ్రద్ధాయుక్తుఁడై తదేకనిష్ఠగలిగి జితేంద్రియుఁడైనవాఁడల నవశ్యము జ్ఞానమును బొందగలఁడు. అజ్ఞానమును బొంది శీఘ్రముగా మహాశాంతిని బొందుచున్నాఁడు. అనఁగా ముక్తిని బొందుచున్నాఁడు. శివజ్ఞానముతో సమమైన జ్ఞానము రెండవది యున్నదని శ్రుతియందుఁగాని స్మృతియందుఁగాని చెప్పలేదు తంత్రావలంబులలో వైదికమునకంటె నెక్కుడ తంత్రములేదని స్కాందపురాణమునను మఱికొన్ని స్మృతులయందును గలదు॥ ౩౯॥

శ్లో॥ అజ్ఞశ్చా శ్రద్ధధాన శ్చసంశయాత్మా వినశ్యతి।
నాయం లోకోఽస్తి నపరో నసుఖం సంశయాత్మనః॥ ౪౦

—♦ భాష్యమ్ ♦—

ఇహార్థే సంశయం కృత్వా తు వినశ్యతీ త్యాహ॥ అజ్ఞశ్చేతి। తత్ర తావ దనభ్య స్తమోగత్వే నాత్మజ్ఞానశూన్యోఽజ్ఞః। తథా సద్గురువేదవాక్యాప్రమాణేన నాస్తికబుద్ధిర శ్రద్ధా,

ఏవ మిద మేవ తథ్య మన్యద్వేతి సర్వత్ర సంశయా క్రాంతస్సం శయీ త్వజ్ఞ ఇత్యాదిత్రివిధ ద్వేషయు క్త స్తత్రాపి సంశయాత్మా విశేషేణ వశ్యతీత్యర్థః । తస్మా చ త్రివిధదోషయు క్తస్య నాఽ యం లోకో న పరో నైవ చాత్మసుఖ మపీత్యవధార్యమ్॥ ౪౦

## —• లఘు టిప్పణీ •—

సద్గురుర్నేతి॥ 'జ్ఞానహీనో గురుస్త్యాజ్యో మిథ్యావాదీ విడంబకః । స్వ విశ్రాంతం నజానాతి పరేషాం స కరోతి కిమిత్యాది స్మృత్యా సద్గురు మేవా శ్రియేన్నతు రుద్రాజటేత్యాదా వు క్తం పాఖండిన మాశ్రయేదిత్య వధార్యం । ఏవమిహ సంశయవిపర్యయా సంభవాఖ్యమప్యత్రైవ బోధ్యమ్॥

## —• అన్వితా త్పర్యము •—

అట్టి శివజ్ఞానమందు సంశయించినవాడు నశించును. అనగా జన్మము పొందునని చెప్పుచున్నాడు - యోగాభ్యాసము చేయవలదని వాక్యజ్ఞానశూన్యుడైనవాడు జ్ఞాని సద్గురువులను వేదవాక్యములనవ మానముచేయుటచేత గల్గిన నాస్తికబుద్ధి అశ్రద్ధ అదిగలవాడ శ్రద్ధధా నుండు. (ఇదేసత్యమా మరియొకటా యని యించట సంశయము గల వాడు సంశయాత్మ ఈముగ్గురిలోను సంశయాత్మ విశేషముగా తప్పక నశించును. (జన్మముపొందును) అజ్ఞానము, అశ్రద్ధ సంశయము ఈమూడు విధములైన దోషములుగలవానికి నిహలోకమందు ధర్మార్థకామ ములు లేవు. పరమందు ము క్తిలేదు. బ్రహ్మానందసుఖమును లేదు. (సద్గురుశనగా నబద్ధమాడనట్టి వాడును, విడం బాచారముగ జ్ఞాన హీనుడునునైన గురువును వదలవలయును, అనగా ద త్తముద్రాధారులు కృత్రిమ జటాధారులైన మఠాధిపతులు వీరు పాఖండులు ఇట్టివారుగాక శ్రోత్రియుండు బ్రహ్మనిష్ఠు డనియర్థము. అజ్ఞాని యైన గురువు తనచిత్తవిశ్రాంతినే యెరుగడు. ఇతరుల కెట్లు విశ్రాం

తిగలుగఁజేయును? జ్ఞానమార్గమునకు చిత్తశుద్ధి సంగరాహిత్యము, వృత్తి శూన్యమును గావలయును. అట్లుగాకున్నయెడల సంశయము విపర్యయము విపరీతభావన అసంభావనయుఁ గలుగును. సంశయమనగాఁ దాను దేహేంద్రియాదులలోఁ గూడుకొని సర్వవ్యాపారములకును గర్తనైయున్నాను. నాకు కర్తృత్వము లేకుండిన వ్యాపారము శూన్యము గావలదా? శివే ఆత్మస్వరూపమని శాస్త్రములు పలుకుచున్నవని తెలిసియు ననుభవముచేఁ దన్ను దా నెఱుఁగక శాస్త్రప్రమాణముచే నాత్మగా నెఱుఁగుట సంశయము. శాస్త్రమెంత జెప్పినననుభవమే ప్రమాణముగనుక సంశయముగలవాఁడు చెడును. అనఁగా మృత్యువునొందును. ఇదిసంశయము. విపరీతభావన యనఁగా బ్రాణము లేకుండిన నేమయినసున్నదా? మనము కంటిమాయ నియు, నిద్రయందు బ్రాణమున్నది గదా ప్రాణములేకుండిన బ్రతికి యుందుమా? కనుక ప్రాణమే యాత్మయనియు దేహముండఁగా సకలము దలిసెను. దేహముపడిపోయిన నేమియున్నది కాన దేహమే యాత్మ యనుట విపరీతభావన.

అసంభావనయనఁగా నాత్మజ్ఞానస్వరూపమని శాస్త్రార్థము గనుక జ్ఞానమనఁగా నెఱుకగదా. యెఱుకయే చిత్తముగదా. చిత్తమే యాత్మ యనియు, ఆత్మ నిష్ప్రపంచస్వరూపమును సుఖస్వరూపమునుగనుక నిద్రయందు ప్రపంచము లేదు. అందులకు మించిన సుఖములేదు. కనుక సుషుప్తియే ఆత్మయనియు మనసుండిన నంతయు గలదు. మనసులేకుండిన నేమియుఁగానము. కాఁబట్టి మనసే యాత్మయనుట యసంభావన. కనుక సంశయవిపర్యయాసంభావనలనువిడిచి (ఎట్లనఁగా గురువాక్యమును శాస్త్రమును ననుభవమును నొక్కటిగాఁజేసెడి మననముచేత సంశయమును బాఱఁదోలి, నిదిధ్యాసముచేత విపరీతభావనను బోఁగొట్టి సమాధిచే నసంభావనను దటిమి) అబాధ శివజ్ఞాననిష్ఠ యందుండవలయును.॥ ౪౦॥

శ్లో॥ యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్।
ఆత్మవంతం నకర్మాణి నిబధ్నంతి ధనంజయ!॥ ౪౧

—• భాష్యమ్ •—

ఏవమేతాదృశస్య సర్వానర్థమూలస్య సంశయస్య నిరాకర్తు ముపాయమప్యాహ యోగేతి॥ తత్త్రైవంసతియోగేన యోగభ్యాసాదినా సన్న్యస్తం ఫలాంశత్వేన కర్మ యస్య తత్తథాఙ్ఞానేన సంఛిన్న స్సంశయోయస్యత మాత్మవంత మాత్మనః పరమశివజ్ఞానినం కర్మాణి ననిబధ్నంతీత్యర్థః॥ ౪౧

—• లఘుటిప్పణీ •—

ననిబధ్నంతీతి । 'త్యజ ధర్మ మధర్మంచ తథా సత్యావృతేపిచ ఉభే సత్యావృతేత్యక్త్వా యేన త్యజసి తం త్యజే'దితి స్మృతిన్యాయేన శివ మద్వైతం తురీయం మన్యంత ఇత్యాది శ్రుతివేద్యస్య పరమశివస్య జ్ఞానినం సాక్షాత్కుర్వంతం కర్మాణి లోకవ్యవహారం కుర్వతః పర బ్రహ్మణఇవ ననిబధ్నంతీ త్యాశయః॥ ౪౧॥

—* ఆన్ధ్రితాత్పర్యము *—

ఈ ప్రకారమనేకానర్థములకుఁ గారణమైన సంశయమును నిరాక రించునట్టి మఱియొక యుపాయమును గూడఁ జెప్పుచున్నాఁడు. యోగా భ్యాసాదులచే పరమార్థము నెఱిఁగి కర్మలను వదలి శివజ్ఞానముచే సంశయ ముల ఛేదించిన శివజ్ఞానికిఁ గర్మలు బంధింపఁజాలవు. కర్మలు వదలుట యనఁగా గర్మలు నిన్ను వదలుటగాని నీవు కర్మలను వదలుట గాదు ఎట్లనఁగా ధర్మాధర్మములను సత్యాసత్యములను విధినిషేధములను వదలి అద్వైతతుర్యస్వరూపుఁడైన శివుని ధ్యానములో నేకర్మలు నిన్ను విడిచి పోవునో నీవాకర్మలను వదలుము. అట్టి శివజ్ఞానారూఢుఁడవైన నిన్ను లోకవ్యవహారముచేఁగు పరబ్రహ్మమువలె కర్మలంటనేరవు. ౪౧.

శ్లో॥ తస్మాదజ్ఞాన సంభూతం హృత్ స్థం జ్ఞానాసి నాత్మనః।
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠో త్తిష్ఠ భారత!॥౪౨

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే బ్రహ్మార్పణయోగః.

## —• భా ష్య మ్ •—

అథ ప్రకృతం వక్తు ముపసంహరన్నాహ । తస్మాదితి ఏవంతహ్యా౽జ్ఞాన సంభూత మాత్మనో జీవస్యహృత్ స్థసంశయం జ్ఞానాసినా ఛిత్వా యోగమాతిష్ఠ యుద్ధాయ చో త్తిష్ఠేతి పరమార్థః॥౪౨॥

ఇతి శ్రీశ్వేతాచార్యగురుచరణ శిష్యభావ సమాసాదిత
శైవసిద్ధాన్తప్రవర్తిత శ్రీశ్రీకంఠశివాచార్య విరచితే
తత్త్వైకదర్శననామకే గీయభాష్యే
బ్రహ్మార్పణయోగః.

## —• ల ఘు టీ ప్ప ణీ •—

సంశయమి॥ తస్మాత్ఫలాంశత్వేన కర్మత్యాజ్య మితస్యాభావే నేతి సంశయం పూర్వోక్తోపదేశేన త్యజతో౽బుద్ధ్వాద్వైత స్యతత్వస్యే త్యాదినా జ్ఞానినో౽పి కర్మకర్తుం యుక్తమిత్యవధేయః॥

ఇతి శ్రీ శ్రీకంఠ శివాచార్యశిష్య విశ్వేశ్వర శివాచార్య
విరచితాయాం లఘుటిప్పణ్యాం బ్రహ్మార్పణయోగః.

## —• ఆ న్ధ్ర తా త్ప ర్య ము •—

అనంతరమందుఁ బ్రకృతమును జెప్పుకొఁలకు నుపసంహారము జేయుచు చెప్పుచున్నాఁడు. ఓ భారతా! అజ్ఞానమువలనఁ బుట్టిన యాత్మయైన జీవుని యొక్క హృదయమందున్న సంశయమును జ్ఞానఖడ్గముచే ఛేదించి యోగ ములోనుండి యుద్ధమును జేయుమని శ్రీకృష్ణమూర్తి చెప్పెను.

ఇట్లు తత్త్వైకదర్శనమును శ్రీకణ్ఠీయ గీతాభాష్యమునకు బోధానంద
మహర్షిచే రచింపఁబడిన భావబోధమను నాంధ్ర
తాత్పర్యమున బ్రహ్మార్పణయోగము.

---

ఓ మ్.

# శ్రీమచ్ఛ్రీకంఠాచార్యకృతే

# శ్రీభగవద్గీతాభాష్యే

## సన్న్యాసయోగః.

అర్జున ఉవాచ:—

శ్లో॥ సంన్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి।
యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్॥౧॥

—* భాష్యమ్ *—

'కర్మ కృత్వాఽథసంన్యాసః ఫలానాం నైవకర్మణః
నచ దండాదినాముక్తిః పంచమేతు నిరూప్యతే॥ నను నజానీమః
కిం కర్మణాముపదేశం కరోష్యథ। తత్త్యాగేన జ్ఞానోపదేశం వా
కరోషీతి సందిహాన ఆహ। సంన్యాసమితి। తత్రైవం సతి। 'నక
ర్మణా నప్రజయా ధనేన త్యాగేనైకేనా మృతత్వమానశు'రి
త్యాది శ్రుత్యా తస్య త్యాగం వివక్షిత మేతం 'వేదానువచ
నేన యజ్ఞేన దానేన తపసా నాశకేన బ్రహ్మణా వివిదిషన్తి'
త్యాది శ్రుత్యా చ కర్మకర్తవ్యతా వశ్యకత్వం చేతి కర్మ

తత్త్యాగమో ర్కర్మధ్యే యదేకం శ్రేయః పరిశ స్తతరం మన్యసే
తన్మే సునిశ్చితం బ్రూహీత్యుత్తానాశయః ॥౧॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నన్విహాధ్యాయే సన్యాసయోగేన కింనిరూప్యత ఇత్యాహ-కర్మేతి॥ ఏవంసతి వేదస్య త్రికాండత్వా త్కర్మయోగో పాసనయోశ్చ సాధనత్వా త్తాభ్యామేవ జ్ఞానం ముక్తిరితి పర్యవసితే మైత్రేయీంప్రతి 'సన్యస్తాం త్వథమైత్రేయీం దృష్ట్వా క్రుద్ధాస్తు దండినః స్త్రీణాంక్వాస్తి చ సన్యాస స్స్త్రీకో కోన్యసే మ్యథ' ఇతి కాశ్యాం దండిభి రుక్తం తద నంతరం తు పురుషేణ సమా సంగా త్కన్యాపుత్రా భవిష్యతః। తవ స్త్రీయాంతు సంసర్గా త్కన్యాపుత్రా భవిష్యతః ఇత్యాది మైత్రేయ్యా ప్యుక్తమితి॥ ౧॥

—✻ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ✻—

విధ్యుక్తకర్మల నాచరించి కర్మఫలత్యాగము చేయవలెనే కాని కర్మత్యాగము చేయరాదు. దండ కమండలు కాషాయవస్త్రాదులచే ముక్తి రాదు. ఇట్లు పంచమాధ్యాయమునందు నిరూపింపఁబడుచున్నది. ఓయీ! కర్మవలనఁ బ్రయోజనములేనప్పుడు కర్మలనెందు కుపదేశించెదవో, కర్మ త్యాగముచే జ్ఞానోపదేశమును జేయుచున్నావో, తెలియఁజాలమను సందేహ మునఁ జెప్పుచున్నాడు. కర్మచేతను సంతతిచేతను, ధనముచేతనుముక్తి లేదు. త్యాగముచేతనేముక్తి నొందిరనుశ్రుతియందుఁగర్మత్యాగము చెప్పఁబడియె మఱియొక శ్రుతియందు యజ్ఞదాన తపోరూపకర్మలు చేయవలయునన్నబడి యున్నది. కనుక ఓకృష్ణా! కర్మాచరణ కర్మత్యాగములలో నేది శ్రేయ స్కరమోనిశ్చయించి ఒక్కదానినే తెలుపుమని యర్జునుండడుగుచున్నాఁ డు.(ఈఅధ్యాయమందు సన్యాసయోగముచే నేమి నిరూపింపఁబడుననఁగా జెప్పుచున్నాఁడు. వేదము మంత్రము బ్రాహ్మణము ఉపనిషత్తులు," అని

త్రికాండమగుటవలనఁ గర్మయోగము ఉపాసన,ఈరెండింటివలన జ్ఞానము ముక్తియుగలుగునని నిశ్చయింపఁబడినది. యాజ్ఞవల్క్యుని భార్యయైన మైత్రేయి సన్యసింపఁగా కాశీక్షేత్రమందలి సన్యాసులు గోపముతో మైత్రేయినిగుఱించి యిట్లడిగిరి. స్త్రీలకు సన్యాసమెక్కడనున్నది ? పండితుఁడైనవాఁడు స్త్రీతోడ సన్యసించెనా? అనఁగా మైత్రేయ ప్రత్యుత్తరమిట్లు చెప్పెను. సత్సంగమువలన స్త్రీ పురుషతుల్యయై కన్యాపుత్రుల వలెనుండును. ఏకు స్త్రీసంగతివలన కన్యాపుత్ర సంతానము గలుగును.

శ్రీకృష్ణ ఉవాచ—

శ్లో॥ సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ।
తయోస్తు కర్మసన్న్యాసా త్కర్మయోగోవిశిష్యతే॥ ౨॥

—♦ భా ష్య మ్ ♦—

నను తతః కిం కరణీయమస్తీ త్యుత్తరమాహ—సన్న్యాసఇతి, తత్రతావత్ కషాయశుద్ధిః కర్మభ్యో జ్ఞానేతు పరమాగతిః కషాయేకర్మభిస్త్యక్తే తతో జ్ఞానం ప్రవర్తత, ఇత్యాది స్మృత్యా ఫలోత్పత్త్యనంతరం కర్మణాం సన్న్యాసస్తదుత్పత్తేః పూర్వంతు ఫలోత్పత్త్యర్థం కర్మయోగః కర్తవ్యఏవేదితావుభావపి నిశ్శ్రేయసకరౌ, తథాపి తయోర్మధ్యే ఫలోత్పత్త్యనంతరం కర్మణాం త్యాగాత్కర్మయోగః కర్తవ్యఏవేతి విశిష్యత ఇత్యుత్తర మవధార్యం॥ ౨॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

కర్తవ్యఏవేతి॥ బుద్ధ్వాద్వైత స్య తత్వస్య యథేచ్ఛాచరణం యదీత్యాది స్మృతావపి కర్మయోగో జ్ఞానిన్యాపి కర్తవ్యఏవేత్యాశయః॥ ౨॥

## —♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

అటుమీఁద నేమిచేయవలసి యున్నదనఁగా? నుత్తరమును జెప్పు చున్నాఁడు—కర్మలవలనఁ జిత్తశుద్ధియు జ్ఞానము వలన ముక్తియుఁ గలుగును. కర్మలచే రాగాదులు వదలిన పిమ్మట జ్ఞానము బయలుదేఱును. కర్మలయొక్క ఫలము జ్ఞానమే కనుక ఫలోత్పత్త్యనంతరము కర్మలను వదలవలయును. ఫలోత్పత్తికిఁ బూర్వము (అనగాజ్ఞానము గలుగువఱకు) కర్మలను జేయవలయును. 'యావమత్పద్యతే జ్ఞానంతావత్కర్మాణి కర్తవ్యాని' జ్ఞాన కర్మయోగములు రెండును ముక్తిదాయకములు అయ్యైనను జ్ఞానము గలిగిన పిదపను గర్మలు వదలుటకన్న కర్మ యోగమే విశేషమని జెప్పఁబడినది. (శివాద్వైత తత్వమును దెలిసి స్వేచ్ఛగా సంచరించుటకన్న జ్ఞానియుఁ గర్మలఁ జేయుటయే మంచిది॥ ౨॥

శ్లో॥ జ్ఞేయస్సనిత్యసన్యాసీ యోనద్వేష్టి నకాంక్షతి
నిర్ద్వంద్వోహి మహాబాహో! సుఖం బంధాత్ప్రముచ్యతే॥ 3॥

## —♦ భా ష్య మ్. ♦—

నను కీదృశ స్సన్న్యాసీ తి నామ్నేహ ప్రసిద్ధ దండీ త్రిదం డీతి నే త్యాహ-జ్ఞేయఇతి, తథాచేహ, 'విరక్తో విషయద్వేష్టా రాగీ విషయలోలుపః, గ్రహ, మోక్షవిహీనస్తు నవిరక్తో నరాగవానితి, న్యాయేన యోఽసౌ కర్మణ్యభిప్రవృత్తోఽపి సనిత్యసన్న్యాసీ యతో నద్వేష్టి నవేహాముత్ర కైవల్యే నాధికం ప్రాప్తుం స్వయమాకాంక్షతీ త్యర్థః । అతఏవ రాగద్వేషాది హితత్వేన నిర్ద్వంద్వఏవ సఏవ హేమహాబాహో! సుఖం

యథాస్యా త్తథా బంధా దంతః కరణాశుద్ధికృతా ద్బంధా త్ప్రముచ్యతే ఇత్యర్థః। ॥3॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నను 'తస్మాత్ జ్ఞానప్రదా త్తథ్యం లబ్ధ్వా జ్ఞానంతు దుర్లభమ్। చాతుర్వర్ణ్యే వసే త్క్వాపి వేణుభిః కిం యతిర్భవేత్'। ద్వయో ర్నిరాసే మహాత్మనాం కిం స్వరూపలక్షణమస్తీతి వక్తుమాహ—తథాచేతి। తత్రైవంసతి। తద్యథేహ। 'కర్మచితో లోకః క్షీయతే' ఇత్యాదిశ్రుత్యా శ్వప్రభృత్యాదివత్ జ్ఞానినోఽపి స్వరూపకథనమాత్రం నతత్రద్వేషో నవా రాగఇత్యప్యుక్తమ్। తద్యథాసావధానతయా భక్త్యా జ్ఞానేనా ప్యాప్త సైకేవా,। విరాజంతే విమానస్థాః క్షితిః కా గృహమేధినా' మిత్యాద్యన్యత్ర భారతేఽపి ద్రష్టవ్యమ్॥ 3॥

## —♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

ఓయీ సన్న్యాసియనఁగా త్రిదండి ఏకదండి అనువారాయనఁగా కాదని చెప్పుచున్నాఁడు—విరక్తుఁడై యనురక్తుఁడుగా నుండుట, విషయముల ద్వేషించువాఁడై విషయాభిలాషతో నుండుట పట్టు విడుపు లేకుండుట ఇట్టి లక్షణముగలవాఁడు విరక్తుండును, ననురక్తుఁడును? గాఁడను స్మృతినిబట్టి, ఓయర్జునా। ఏకర్మయోగి కర్మయోగాంతర్గత మగు నాత్మానుభవముచేతఁ దృప్తుఁడై యాత్మదప్పమతిదేనియందును గోరికలేకయు, దేనియందును ద్వేషములేకయుఁ, గర్మలుచేసినను, వాఁడు నిత్యసన్న్యాసి యని యెఱుంగుము. కనుకనే రాగద్వేషములులేక సుఖదుఃఖములు సహించువాఁడై యంతఃకరణశుద్ధి లేమిచేఁగల్గు బంధమునుండి సుఖముగా ముక్తుఁడగును. (అట్టివాఁడు నాల్గుజాతులలో నెక్కడనైనను నుండుఁగాక. వెదురుకఱ్ఱను దండముగాఁ బెట్టుకొన్న మాత్రమున యతి

గాఁజాలడు. ద్వంద్వాతీతునకుఁ గర్మలు రాగమువలనఁగల్గుటలేదు. శబ్ద స్పర్శములవలె వచ్చుచున్నవి. అనఁగా శబ్దమునకు మనయందు రాగ ముండి మనచెవిలో. ప్రవేశింపలేదు, వాయువువలనమనకు స్పర్శగల్గు చున్నది. ఆవాయువునకు మనయందు ప్రేమలేదు. అట్లు గృహస్థులు భక్తి జ్ఞానములచే బొందబడిన వైభవముగలవారై విమానమందుఁ గూర్చుండినను హానిలేదని భారతమందును స్మృత్యంతరములందును జూడనగును.) 3॥

శ్లో॥ సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పండితాః॥
ఏక మప్యాస్థిత స్సమ్యగుభయో ర్విందతే ఫలమ్॥౪॥

—◆ భాష్యమ్. ◆—

ననుయః కర్మణ్యభిప్రవృత్తశ్చేత్సకథం సన్న్యాసీతి జ్ఞాతవ్యః కర్మతత్త్యాగయో స్స్వరూపభేదా దర్థా నర్థయోః ఫలభేదాచ్చేత్యాహ— సాంఖ్యయోగావితి, తథాచేహసాంఖ్య కర్మయోర్మధ్యే స్వాధికారానురోధేన యథాశాస్త్రం సంమ్య గాస్థితశ్చేత్ జ్ఞానోత్పత్తిద్వారే ణోభయోః ఫలం విందత ఇత్యర్థః ॥౪॥

—* లఘుటిప్పణీ *—

కర్మతత్త్యాగయోరితి । తత్ర శ్రుతిశ్చ కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః । ఏవంత్వపి నాన్యథేతో స్తి న కర్మలిప్యతేనర ఇత్యాది ద్రష్టవ్యమ్॥ ౪॥

—◆ ఆన్ధ్రితాత్పర్యము. ◆—

ఎవఁడు కర్మచేయునో వాఁడు సన్న్యాసియెట్లుగాఁగలఁడు. కర్మ తత్త్యాగము వీనియొక్క స్వరూపము భేదముగాన ఫలభేదమును నందు

ననఁగా జెప్పుచున్నాఁడు - సన్న్యాసిగాని గృహస్థుగాని తమయధికార మును బట్టి శాస్త్రప్రకారము నడచినయెడల జ్ఞానము గలిగియుద్ధులును నాత్మసందర్శనఫలము నేపొందుచున్నారు. యావజ్జీవమునుకర్మలనుఁ జేయుచు దానుగర్తృత్వము వహింపనియెడలఁ గర్మలుదన్నంటఁజాలవు. (సాంఖ్యము వేఱు కర్మయోగమువేఱుఅను నట్టివారు బాలురు - అజ్ఞానులు) గాని పండితులుగారు. ఈరెంటిలో నొకదాని నాచరించినను రెండింటి యొక్క ఫలమును (ముక్తిని) బొందుదురు.॥ ౪॥

శ్లో॥ యత్సాంఖ్యైః ప్రాప్యతే జ్ఞానం తద్యోగై రపి గమ్యతే।
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥౫

## —♦ భాష్యమ్ ♦—

నన్వేకస్యానుష్ఠానా త్కథ ముభయోః ఫలం విందత ఇతి స్పష్టం పునరాహ-యత్సాంఖ్యైరితి। తత్రైవంసతి యత్సాంఖ్యైః జ్ఞాననిష్ఠై ర్యమాదియోగాభ్యాసేన స్థానం కైవల్యాఖ్యం ప్రాప్యతే తదేవస్థానం యథాధికారం నిస్సంగత్వేన కుర్వద్భిః కర్మయోగిభి రభిగమ్యత ఇత్యర్థః। ఏవంసతి సాంఖ్యం జ్ఞానం యోగంకర్మయోగంచ కైవల్యఫలాంశత్వేనైకం యస్యతజ్జ్ఞః పశ్యతి సఏవపశ్యతిదూరుద్ధరత్వా న్నైవేతరోజన ఇత్యాశయః॥౫॥

## —♦ లఘుటిప్పణీ ♦—

యథాధికారమితి॥ తపోవృత్త్యాతు విప్రస్యా త్ప్రజాధర్మో నృప స్మృతః। దానధర్మో హి వైశ్యస్యా చ్ఛూద్ర స్త్రీవిధసేవయేత్యాది స్మృత్యా పూర్వ జన్మని నారదాదివచ్చ యథాధికారం నిస్సంగత్వేన కుర్వ ద్భి స్సర్వై రపి కర్మయోగిభిః కైవల్యం లభ్యత ఇత్యవధేయమ్॥ ౫॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ ఒకదానిని అనుష్ఠించిన రెండింటి యొక్క ఫలమును బొందునంటే స్పష్టముగా జెప్పుచున్నాడు. యమనియమాద్యష్టాంగయోగ సాధనములచే జ్ఞానులు పొందెడి కైవల్య స్థానము అధికారమున్నంత వరకు సంగరహితులై కర్మల నాచరించు కర్మయోగుల చేతనున్ను పొంద బడుచున్నది. ఇట్లు జ్ఞానయోగ కర్మయోగములు ఏకఫలప్రదములగుట వలన రెండును ఒక్కటేయగునని (అనగా రెంటిలో నేదియైన నొకటి ఆత్మదర్శన రూప కైవల్యఫలము నిచ్చునని) యెవడు తెలుసుకొనునో వాడే తెలిసిన పండితుడు. పూర్వజన్మమందు నారదాదులు అధికారమునకు దగినట్లు, అనగా బ్రాహ్మణుండు తపస్సును, క్షత్రియుడు ప్రజాపరిపాలనమును వైశ్యుడు దానధర్మములను శూద్రుండు త్రైవర్ణికసేవను సంగరహితులై చేయుకర్మయోగులు కైవల్యము నొందుదురు. ౫.

శ్లో॥ సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తు మయోగతః।
యోగయుక్తో మునిర్బ్రహ్మన చిరేణాఽధిగచ్ఛతి ॥౬॥

—♦ భా ష్య మ్ ♦—

నను జ్ఞాననిష్ఠాయ హేతుత్వేనాశుద్ధాన్తః కరణోఽపి కర్మణాం సన్న్యాస ఏవ కుతోఽనక్రియతఇతి నేత్యాహ-సన్న్యాసస్త్వితి। ఏవంతర్హి యోగతోఽంతః కరణ శోధకో యః కర్మయోగ స్తంవినా సన్న్యాసస్తు దుఃఖమాప్తుమేవ భవతి। అశుద్ధాంతః కరణత్వేన తస్య జ్ఞాననిష్ఠాయా సంభవా దితిభావః। నవేవంసతి కర్మయోగయుక్తస్తు శుద్ధాంతః కరణత్వేన మునిర్మలస్సన్ సత్యజ్ఞానాదిలక్షణం శివమద్వైతం తురీయమచిరేణన

శీఘ్రమేవ గచ్ఛతీత్యర్థః। అన్యథా కర్మబ్రహ్మోభయ భ్రష్ట త్వేన పరమసంకటాపత్తే రిత్యవధేయమ్ ॥౬॥

—* లఘుటిప్పణీ *—

మునిరితి॥ తద్యథా 'నిర్వ్యాజః స్వీయధర్మజ్ఞో వేదజ్ఞ స్తత్త్వపారగః। విరక్తో వేషనిర్ముక్తః షడ్భి ర్యోగీ ముని ర్భవే దిత్యాది బోధ్యమ్। భ్రష్టత్వేనేతి తథాచ స్మృతిః। నకర్మాణి త్యజేద్యోగీ కర్మభి స్త్యజత్యేహ్యసౌ। కర్మబ్రహ్మోభయ భ్రష్టం తం త్యజే దంత్యజం యథా। ఇత్యా ద్యవధార్యమ్॥ ౬॥

—◆ ఆన్ధ్రతాత్పర్యము ◆—

ఓయీ మలినాంతఃకరణుడున్నూ జ్ఞాననిష్ఠను గలిగించెడి కర్మత్యాగము నేలచేయడంటే చెప్పుచున్నాడు. ఓపార్థా!సన్న్యాసము అంతఃకరణశుద్ధిజేయు కర్మయోగము లేక దుఃఖదాయకమగును. అంతఃకరణ శుద్ధిలేక జ్ఞాననిష్ఠ కుదురదు. కర్మాచరణములేక అంతఃకరణశుద్ధి గాదు. కర్మయోగి శుద్ధాన్తఃకరణ గలవాడగుచు మునియై (మననశీలుడై) తురీయ రూపుడును, అద్వైతమును, సచ్చిదానందరూపుడును అయిన శివుని శీఘ్రముగా పొందును. యోగి యైనవాడు కర్మలను వదలగూడదు. కర్మలే దన్ను వదలగలవు. కర్మబ్రహ్మలచే ఉభయభ్రష్టుని అంత్యజునివలె త్యజించవలయునని స్మృతివచనము. మునియనగా మిషలేనివాడును స్వధర్మమును బాగుగా దెలిసినవాడును వేదమును దెలిసినవాడు తత్త్వమును దెలిసినవాడు విరక్తుడు వేషభాషలు లేనివాడు ఇట్టి యారుగుణముల చేతను ముని యనిపించుకొనును.॥ ౬॥

శ్లో॥ యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః।
సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి నలిప్యతే ॥౭॥

—♦ భా ష్య మ్ ♦—

నను తతః కింకరణీయమస్తీ త్యవధార్య వక్తవ్య మిత్యాహ—యోగయుక్తఇతి । తత్రైవంసతీహ శాస్త్రీయం కర్మ యుజ్యతే స్వాభీష్టం ననయోగఇత్యుచ్యతే। తత్ర తేన యోగేన యుక్తః ప్రథమం విశుద్ధాత్మా సన్విజితాత్మా జితేంద్రియశ్చ భవతి తతో నిర్మలాంతః కరణస్స న్విజితాత్మా స్వవశీకృతసర్వబాహ్యేంద్రియశ్చ భవతి, తథాచ తత్కించేదమార్ద్రమిత్యాది బృహదారణ్యక శ్రుతే ర్జడాజడాత్మకం సర్వం పరబ్రహ్మైవేతి పశ్యన్ బ్రహ్మార్పణన్యాయేన కర్మ కుర్వన్నపి పరదృష్ట్యానలిప్యతే స్వదృష్ట్యాపి తదభావాదితి ఛాయాశరీరే ప్రతిబింబగాత్ర ఇత్యాదావివ ద్రష్టవ్యమ్ ॥౭॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నన్విదానీం జ్ఞానం కర్మవే త్యుభయోర్మధ్యే కిమారురుక్షో ర్నాశ్రయ్య మితి నిర్ధారయితుమాహ—తత్రైవంసతి'తద్యథా॥ 'అశుద్ధాత్మాశుచౌలోభాత్ జ్ఞానం తత్రావధారయేత్ । పతత్యేవో భయోర్భ్రష్టశ్శూద్రోఽధ్యయనాదివే' త్యాది దర్శిష్టవ్యమ్ । ఆర్ద్రమితి అవ్యక్తం వ్యక్త మాధత్తే వ్యక్తం సర్వం గ్రసత్యేలమితి స్మృతిన్యాయేన యత్కించిత్సర్వమార్ద్రం దర్శివాత్మకం బ్రహ్మైవేతి పశ్యన్నిత్యర్థః॥ ౭॥

—♦ ఆ న్వ తా త్ప ర్య ము ♦—

ఓయీ అటుపైన యేమిచేయ వలసియున్నదంటే నిశ్చయమును జెప్పుచున్నాడు. కర్మయోగయుక్తుడన్న శాస్త్రీయమైన పరశివారాధన

రూపపరిశుద్ధకర్మమునందు ప్రవర్తించుచుండును. అట్టి కర్మయోగమువలన పరిశుద్ధాంతఃకరణగలవాడై దానివలననే బాహ్యేంద్రియముల జయించినవాడై ఆత్మానుసంధాననిష్ఠుడు గాన సమస్తమైన దేవాది భూతములయందలి యాత్మలవంటిదిగా తన యాత్మనను సంధించుచుండును. ఏలయనగా ఆత్మయాథాత్మ్యమును అనుసంధించువానికే దేహాదుల యాత్మలును తనయాత్మయు నేకాకారమైయుండును గదా? దేవాదిభేదములు ప్రకృతియొక్క పరిణామమే గాని ఆత్మయొక్క ఆకారములుగా నేరవు. అట్టి ప్రకృతి పరిణామబంధము వీడినయెడల ఆత్మలన్నియు దేవాది శరీరములయందును సమానములే జ్ఞానాకారములగును. ఇట్టి యాత్మానుసంధానము జేయుపురుషుడు (మమాత్మా సర్వభూతాత్మా యనునట్టివాడు) జడాజడ ప్రపంచమంతను బ్రహ్మమైన శివస్వరూపముగా జూచుచు కర్మలను బ్రహ్మార్పణము జేయుచున్నయెడల సంసారబంధమున దగులుకొనడు. శరీరమును ఛాయారూపముగా చూచును. ఆరురుక్షువైనవాడు కర్మజ్ఞానముల రెంటిలో దేనినాచరించవలయుననగా అంతఃకరణశుద్ధిలేనివాడు జ్ఞానమందభిమానముంచి యభ్యసించినయెడల శూద్రుండు వేదాభ్యాసముచే పతితుడయిన ట్లుభయభ్రష్టుడై పతితుడగును. సర్వమును బ్రహ్మాకారముగా జూచుచు కర్మజేయవలెను. వ్యక్తావ్యక్తరూపమంతయు శివరూపమేగాని యన్యముగాదు. సృష్టికి పూర్వము ప్రళయమందు పృథివ్యాది భూతములు అవ్యక్త (కారణరూప ప్రకృతి) నామముతో పిలువబడుచున్నవి. కార్యరూపజగత్తుగా పరిణమించినప్పుడు వ్యక్తమని బిలువబడుచున్నవి. తిరిగి యెప్పుడు కార్యమైన వ్యక్తము. కారణమైన ప్రకృతియందు గలియునో అప్పుడవ్యక్తమగుచున్నది. గాన 'మాయాంతు ప్రకృతింవిద్యా న్మాయినంతు మహేశ్వరం । సర్వాజగత్తు శివమయమేయగును.॥ ౭॥

శ్లో॥ నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్।
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్॥౮॥

—♦ భాష్యమ్ ♦—

ఏతదేవ వివృణోతి నైవేతి యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తేన కం పశ్యేత్ కేన కం జిఘ్రేత్తేన క మభివదేదిత్యాది శ్రుతేరపీ తిభావః అత్ర యద్యప్యభ్యుద్ధాన దశాయాం పశ్యతితథాపి 'తచ్ఛుద్ధోసి బుద్ధోసినిరామయోసిసంసారమాయా పరివర్జితోసి సంసారస్వప్నం త్యజ మోహనిద్రాం' మదాలసా వాక్యముపాచ పుత్రమిత్యాదిన దవ ధార్యమ్॥ ౮॥

—♦ లఘుటిప్పణీ ♦—

కేనకంపశ్యేదితి॥ తదిహ సమాధికాలేతు॥ యోగీ సమాధికాలేతు నశృణోతి నపశ్యతి నజిఘ్రతి నజానాతి తత్సిదం కింవిభాయేదిత్యాది ద్రష్టవ్యమ్॥ ౮

శ్లో॥ ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి॥
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్॥౯॥

—♦ భాష్యమ్ ♦—

ఏవం పూర్వోక్త శేషమేవ వివృణోతి। ప్రలపన్నితి॥ తత్రేత్థంసతి। పూర్వంయథాచక్షురాదిజ్ఞానేంద్రియైఃపశ్యన్నిత్యాద్యుక్తమ్తథేహవాగాదికర్మేంద్రియైరపిప్రలపన్నిత్యాద్యంతఃకరణచతుష్టయే

నత త్తచ్చేష్టాసుక్రియమాణాస్వింద్రియాణ్యే వేంద్రియార్థేషు స్వస్వవిషయేషుప్రవర్తంతే నత్వమితిధారయన్నేవ కించిద్వస్తుతః కరోమీతియుక్తోబ్రహ్మైక్యతాదాత్మ్యాపన్నస్సన్మన్యేతతత్వవిత్ విచారయే దిత్యర్థః౯॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

శేషమితి॥జ్ఞాన కర్మయోగయో ర్మధ్యే శేష మవశిష్యమాణం కర్మ వివృణోతీత్యర్థః । తద్యథా॥ 'జ్ఞానోత్తరం తతః పూర్వం నవినాకర్మణః స్థితిః । తస్మాత్కర్మతు కుర్వంతి మునయః పారదర్శిన' ఇతి । ననుజ్ఞానినోపి కర్మకర్తృత్వావశ్యకత్వే స్థితే త్వసీశ్వరత్వాపత్తిః కుతోను బ్రహ్మాత్మైక్యం స్యాదిత్యాహ। నత్వమితి తత్రైవంసతి నాహంప్రాణో నైవశరీరం నమనోహం నాహంబుద్ధి ర్నాహమహంకారధియాచ । యోతస్త్రిజ్ఞాంశస్సోస్మ్యహ మేవేతి విదుర్య మిత్యాది స్మృతిన్యాయేనాకర్తారం స్వాత్మానం శివైక్యతాదాత్మ్యేన విజ్ఞాతవ్యమితిభావః॥ ౯॥

## —♦ ఆ న్వ తా త్ప ర్య ము ♦—

౮-౯ శ్లోకములు కులకమైనందున తాత్పర్యమేకముగా వ్రాయుచున్నాము. ఆత్మతత్వజ్ఞానము గల కర్మయోగి శ్రవణేంద్రియముచేఁ వినుచున్నను, త్వగింద్రియముచే స్పృశించుచున్నను, నేత్రేంద్రియముచే జూచుచున్నను, జిహ్వచే రసాస్వాదనము జేయుచున్నను నాసికచే నాఘ్రాణించుచున్నను, నోటితో మాట్లాడుచున్నను, హస్తములచే గ్రహించుచున్నను, పాదములచే నడచుచున్నను, గుహ్యేంద్రియముచే మూత్రవిసర్జనముఁ చేయుచున్నను పాయురింద్రియముచే మలవిసర్జనము చేయుచున్నను, నిదురించుట, ఊపిరిపుచ్చుట గనులు మూయుట, తెరచుట, మొదలయినవ్యాపారములు ప్రాణములచేజేయుచున్నను తానుకర్తనని భ్రాంతిపడుచున్నాడు. ఈభ్రాంతి సమాధినివిడచిన కాలమందే గాని

న్యోగి సమాధియందు భ్రాంతిరహితుడై యేమియుజేయుటలేదు. మదాలస పుత్రునిగురించి యిట్లుపదేశించినది, నీవు పరిశుద్ధుడవు, జ్ఞానస్వరూపివి, నిరామయుండవు. సంసారమాయనీకులేదు. మోహనిద్రనుండి మేలుకో, సంసారస్వప్నమును విడువుము ఇంద్రియములంతఃకరణతో గలసి ఆయా కార్యములనుజేయుచున్నవి. నీవేమియుజేయుటలేదు. నీవుసాక్షాత్తుబ్రహ్మము ఇట్లుదెలిసినపిదప గర్మలు నిషిద్ధములు, ఆలాఆచరణీయములాయన్నజ్ఞానానంతరమున్నూ జ్ఞానాత్పూర్వమును గర్మలు కర్తవ్యములే గనుక సాకం గతులైన మునులున్నూ గర్మలనాచరించిరి. ఓయీజ్ఞానియు కర్మచేయ వలసియే యున్నయెడల ఈశ్వరత్వమునకు భంగము వాటిల్లినది. బ్రహ్మ త్మాను సంధానమెట్లు వచ్చుననగా? నేనుప్రాణమును, నేను శరీరముగాను మనసునుగాను బుద్ధినిగాను, చిత్తాహంకారములుగాను, యెరుకయే స్వరూపముగలవాడను నేనే. ఇట్లు శివైక్యతాదాత్మ్యముచే దన్నుదా దెలియవలెను.॥ ౯॥

శ్లో॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతియః।
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా ॥౧౦॥

—* భాష్యమ్ *—

నను కథం తత్త్వపిత్తత్త్వైకశరణ స్సన్కర్మకుర్యా దితి పునరవధారయతి। బ్రహ్మణ్యాధాయేతి। తథాచ పరే బ్రహ్మణి నిష్కళే యస్మిన్ కృతే నకించిత్కర్మ క్రియత ఇత్యాది శ్రుతి న్యాయేన కర్మాణ్యాధాయ సమర్ప్య కర్మణాంసంగం లౌకిక ఫలాభిసంధిం త్యక్త్వా॥ 'జానామి ధర్మం న చ మే ప్రవృత్తి' రితిన్యాయేన యః కరోతి స పురుషః। పాపేన జన్మమరణప్ర దేన కర్మణా పద్మపత్ర మివాంభసా నలిప్యత ఇతి పరమార్థః౧౦.

—◆ ఆన్ధ్రి తాత్పర్యము ◆—

ఓయీ తత్వవిదుడు తత్వము నే శరణుబొంది కర్మ లెట్లు జేయునంటే మరల జెప్పుచున్నాడు. నిష్కామ కర్మచేసినవాడు మరియొక కర్మను జేయడనే శ్రుతిని బట్టి నిష్కళపరబ్రహ్మమందు కర్మలను సమర్పించి, లోకవ్యవహారమునకు సంబంధించిన ఫలములను గోరక నేను ధర్మమును దెలిసిచేయుటయు అధర్మమును దెలిసి మానివేయుటయును లేదు. హృద్గతమైన పరమాత్మ ప్రేరేపించినట్లు నడచుకొనుచున్నాను. అను శ్రుతినిబట్టి తాను స్వాతంత్ర్యమును వదలి స్వతంత్రధర్మమును ఈశ్వరుని యందు నిలిపి, (అనగా అనన్యభక్తుడు ఈశ్వరాజ్ఞాపరిపాలనమని గర్మలు జేయుచుండును. అట్లు గర్మలచేయునట్టి పురుషుడు, దామరాకు నీటిలో పుట్టి నీటిలో నుండి నీరునంటనట్లు దాను కర్మవలన బుట్టి గర్మలజేయుచున్నను జనన మరణములు గలిగించెడి పుణ్య పాపకర్మముల నంటడు. పాపమనగా? 'యోన్యథా సంతమాత్మాన మన్యథా ప్రతిపద్యతే । కింతేన నకృతం కర్మచోరేణాత్మాపహారిణా' (భారతం-ఆది-౭౪-౨౮.) ఎవడు దేహేంద్రియాతీతుడును సచ్చిదానందరూపుడున్నూ అయిన ఆత్మను దేహమునుగా మనుష్యునిగా అను సంధించునోవాడు ఆత్మాపహారియైన చోరుడు. బ్రహ్మహత్యచేసిన బ్రహ్మఘ్నుడును గాన, ఈదేహాత్మభ్రాంతి చోరత్వము ఆత్మహత్య బ్రహ్మహత్య యగుచున్నది. ౧౦॥

శ్లో॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలైరిన్ద్రియైరపి।
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాత్మశుద్ధయే ॥౧౧॥

—◆ భాష్యమ్. ◆—

పరిత్యక్త నిస్సంగేన కర్మణా శిథిలమపి జ్ఞానం పుష్టం భవతీత్యాహ-కాయేనేతి॥ తథాచ॥ 'ఆత్మానం రథినం ప్రాహు శ్శరీరం రథమేవతు। బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహ

మేవతు। 'ఇంద్రియాణి హయానాహు ర్విషయాం స్తేషు గోచరన్। జ్ఞాత్వాత్మానం పృథగ్భూతం కుసవిష్టి గృహీతవదితి' స్మృతిన్యాయేన కాయేన మనసేత్యాదినా సంగంత్యక్త్వా ఆత్మ శుద్ధయే యోగినోయుక్తా యుంజానశ్చ కర్మకుర్వంతీ త్యర్థః॥౧౧

## —◆ లఘుటిప్పణీ. ◆

పుష్టంభవతీతి॥ తదుక్త మాత్మోపనిషత్ ప్రదీపే । తద్యథా, బ్రహ్మజ్ఞానే ష్యవశ్యంవై కర్మకర్తుం సయుజ్యతే అన్యథా కర్మమాలిన్యా త్తాప్తజ్ఞానం ప్రణశ్యతి'॥ యుక్తా యుంజానాశ్చేతి , తత్రైతావ ద్యుక్తాస్తుయోగినఃకర్మకుర్వంతి॥ పశ్యన్తస్స్వప్నవ జ్జగదితి స్మృతిన్యాయేన యుంజానాస్తు॥ 'యథా యథాప్రత్యగవస్థితం మనస్తథా తథాముంచతి బాహ్యవాసనే త్యాది స్మృతిన్యాయేన చ కుర్వన్తి త్యాశయః ॥౧౧॥

## —◆ ఆన్ధ్రతాత్పర్యము ◆—

మీదిమిక్కిలి స్వర్గాదిఫలసంగమమును వదలి కర్మల నాచరించిన యెడల శిథిలమైన జ్ఞానము తిరుగవచ్చునని చెప్పుచున్నాఁడు. దేహాధిష్ఠి తాత్మను రథికునిగాను దేహము నే రథమునుగాను, బుద్ధిని సారథిగాను, మనస్సునుగుఱ్ఱపుత్రాటినిగాను, ఇంద్రియములు గుఱ్ఱములుగాను, శబ్దాది విషయములు సంచారమార్గములుగాను తెలియవలెను. కర్తృత్వాదికము లేని యాత్మదేహేంద్రియమనసులతో గూడుకొన్నదై కర్తృత్వ భోక్తృ త్వాదికమును బొందుచున్నది. యెవఁడు ఏకాగ్రతలేని మనస్సుగలవాఁడై యవివేకి యగుచున్నాఁడో వానికి నింద్రియములు సమాహితుడుగాని (యసమర్థుడగు) సారథికి దుష్టరథాశ్వములెట్లు స్వాధీనములు గావో ఆవిధముగానే స్వాధీనములుగావు. ఏకాగ్రచిత్తముగలవానికి మంచిగుఱ్ఱ ములు రథసారథికివలెనే స్వాధీనములగుచున్నవి, జ్ఞానహీనుఁడై మనోనిగ్ర హములేని మనుజుడు పరిశుద్ధతలేనివాఁడై అక్షరస్వరూపమును బొందక

సంసారమును బొందుచున్నాడు. యుక్తమనస్సుగల పరిశుద్ధుడగు జ్ఞాని ఏస్థానమును బొంది మరల పుట్టడో అట్టి స్థానమును బొందుచున్నాడు. తహోవివేకాత్మకమగు బుద్ధిసారధి గల సమాహితచిత్తుడగు విద్వాంసుడు, సంసారగతికి నంతమైన శ్రేష్ఠమగు సర్వవ్యాపక శివతత్వమును బొందును. అట్టి శ్రుతి ప్రమాణములను బట్టిఆత్మను దేహత్రియాతీతమైన దానినిగా దెలిసి ఆత్మశుద్ధికొరకు యుక్తయోగులు యుంజానయోగులును (యుక్తయోగులనగా? జగత్తును స్వప్నముగా జూచుచు కర్మలు జేయువారలు. యుంజానయోగులనగా? వాసనాత్రియము వదలునట్లుగాప్రత్యగాత్మయందు మనసు నిలుప నభ్యసించువారలు) గర్మలను జేయుచుందురు. అట్లు చేయనియెడల, 'గర్భాకృతేదోషమపిశ్రుతిర్జగౌ' అనునట్లు కర్మమాలిన్యమువలన ఉన్నజ్ఞానము ఊడిపోవును. కర్మల జేసినందున మరిచిన జ్ఞానము జ్ఞాపకము వచ్చును॥ ౧౧॥

శ్లో॥ యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీం ।
అయుక్తః కామకారేణ ఫలే సక్తోనిబధ్యతే ॥॥                    ౧౨

—* భాష్యమ్ *—

నను తేనైవ కర్మణా కశ్చిత్తు బధ్యతే తత్ర కర్తృత్వాభిమానసామ్యేపి తయోర్వైషమ్యే కోహేతు రిత్యాహ । యుక్తఇతి, తత్రతావత్, యస్మిన్ కృతే నకించిత్కర్మ క్రియత ఇతి శ్రుత్యుక్తన్యాయేన కర్మఫలాసంగం త్యక్త్వా కుర్వాణో నైష్ఠికీం కైవల్యాఖ్యాం శాంతిమాప్నోతీత్యర్థః। యస్తు పునరయుక్త స్స్వార్థాభికాంక్షీ సతుమమాభీష్టఫలాయేద మైహికం కర్మకరోమీతి ఫలేసక్తో । క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తీతి శ్రుతిన్యాయేన నిబధ్యత ఇత్యర్థః॥౧౨॥

—◆ ఆన్ధ్రి తాత్పర్యము ◆—

ఓయీ ఆకర్మచేత ఒకడు బద్ధుడగుచున్నాడు. ఒకడు ముక్తుడగుచున్నాడు. కర్మచేయుట యందభిమానము సమానమైనప్పటికి హెచ్చు తగ్గులెందుకు రావలెనంటే చెప్పుచున్నాడు. నిష్కామ కర్మచేసినందున మరియొక కర్మ జేయనక్కరలేదనే శ్రుతినిబట్టి యోగియైనవాడు ఫలాపేక్షను వదలి కర్మను జేసినందున స్థితప్రజ్ఞుడగుచున్నాడు. అజ్ఞానుడు స్వార్థమును గోరి నాయభీష్టసిద్ధికొరకు గర్మను చేయుచున్నానని ఫలాపేక్షచే గర్మచేసి స్వర్గభోగానంతరము పునరావృత్తిచే బద్ధుడగుచున్నాడు॥ ౧౨॥

శ్లో॥ సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖంవశీ।
నవద్వారే పురేదేహీ నైవకుర్వన్నకారయేత్॥ ౧౩॥

—◆ భాష్యమ్ ◆—

నన్వశుద్ధచిత్తస్య కర్మకర్తవ్యతావశ్యకత్వముక్తమేవం శుద్ధచిత్తస్యాపి తత్కర్తవ్యమేవేత్యాహ—సర్వేతి, తత్రతావన్నిషిద్ధంతు తత్త్వజ్ఞానీ నకరిష్యత్యేవతస్య తత్త్వతో రాగాభావాత్పరం తు నిత్యం నైమిత్తికం కామ్యంచేతి సర్వాణి కర్మాణి మనసా ఫలానభికాంక్షీసన్కుర్వన్సుఖం వశీనామాత్మసుఖాభిషిక్తశ్చాస్తే తత్రాత్మానం రథినం ప్రాహురితిన్యాయేన నవచ్ఛిద్రాత్మకే ద్వారే దేహీదేహాభిన్నాత్మదర్శీ ప్రవాసీవ పరగృహే యథానైవకుర్వన్నకారయన్నాస్త ఇతి పునరన్వయః॥౧౩॥

## —♦ లఘుటిప్పణీ. ♦—

ప్రవాసీవేతి॥ తద్యథా । 'యథాదర్శే స్థితం బింబం నాదర్శ్యాప్య ప్సేక్షతే బ్రహ్మీభూత స్తథాయోగీ పశ్యత్యన్యశరీరవదిత్యాది' ద్రష్టవ్యమ్॥

## —♦ ఆన్ధ్రితాత్పర్యము. ♦—

ఓయీ! అంతఃకరణశుద్ధి లేనివానికి కర్మాచరణ మావశ్యకమైనట్లు శుద్ధాన్తఃకరణునకును అవశ్యకమేయని చెప్పుచున్నాడు. తత్వజ్ఞాని రాగాదులు లేనివాడు గాన నిషిద్ధ కర్మలను యెప్పుడును జెయ్యడు. నిత్యనైమిత్తిక కామ్య రూపకర్మలను మనసు చే ఫలాభిసంధిని వదలి చేయుచు ఆత్మరాజ్యమందు పట్టాభిషిక్తుడై సుఖముగానున్నాడు. దేహాధిష్ఠితాత్మను రథికునిగాను, దేహమును రథమునుగాను ఇంద్రియములను గుఱ్ఱములనుగాను, బుద్ధినిసారథిగాను, మనసును కళ్లెమును గాను, శబ్దాదివిషయములు సంచారమార్గముగాను పరియాణముగావించి నవద్వారపురము (౨ నేత్రములు, ౨ చెవులు, ౨ ముక్కులు, నోరు, గుదము, గుహ్యము) చేరి అనగా దేహిని దేహభిన్నముగా జూచుచు పరగృహమందున్న పాంథుడు కర్మల జేయించుట చేయుట లేనట్లుండును. (దర్పణమందలి ప్రతిబింబము దర్పణము తీసివేసిన గనపడనట్లు, బ్రహ్మమైన యోగి అన్యశరీరమువలె జూచునని తాత్పర్యము) (ఈశ్లోకమందు దేహమును దేహమని చెప్పక నవద్వారపురమనుట దేహాత్మల వివేకముకొరకని తెలియవలెను. పురమువలె శరీరమును పురజనులవలె నింద్రియములను, సార్వభౌమునివలె పరమాత్మను, భృత్యునివలె స్వాత్మను జూచువానికి గదా స్వస్థతగల్గును. దేహమునే ఆత్మగా భ్రమించినచో తాను దేహమందుండుటను దెలియక పురము మొదలయిన వానియందుండునట్లు దలంచుచున్నాడు. ఆభ్రమ నివర్తించెనేని దేహమునే పురముగా దలచునని భావము.) ॥౧౩॥

శ్లో॥ నకర్తృత్వం నకర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥ ౧౪

—◆ భాష్యమ్ ◆—

నను ప్రథమం సహజం బ్రహ్మ మాయయా శూన్య మాగతం । శూన్యాత్ప్రకృతి రీశశ్చ మహదాద్యా స్తతో జగది త్యాది స్మృత్యా సహజాఖ్యస్య సదాశివస్య సాక్షిత్వే కర్తృత్వంవే తిసందిహాన ఆహ, నకర్తృత్వమితి, ఏవం తర్హి సాక్షిణస్తు పరాత్మత్వం నేశత్వం కర్తురీరితం, యస్మాచ్చ పూజ్యతే సర్వై ర్బ్రహ్మాద్యై రఖిలేశ్వర ఇత్యాది భారతోక్త్యా సదాశివః పరాత్మా లోకస్య న కర్తృత్వం న కర్మాణి న వా కర్మఫలసంయోగం చ సృజతి. కింతు స్వస్యాత్మనో భావఇవ భావశూన్యా జ్జాయమానా ప్రకృతిరేవ తజ్జన్యేశ్వర ఏవాంతరో జగతాం కర్త్రీ కర్తా చే త్యవధార్యమ్ ॥౧౪॥

—◆ లఘుటిప్పణీ ◆—

మాయయేతి । తత్ర తావదిహ మనోబుద్ధిచిత్తాహంకారాది పంచవింశతి తత్త్వాత్మికా మూలప్రకృతి స్తతశ్చ శూన్యముత్పన్నం తతశ్చ కార్యాత్మికా బిందుప్రకృతి స్తతశ్చ ద్వాసుపర్ణేతి శ్రుతివేద్య సమష్టి భావేనేశ్వరో వ్యష్టిభావేనచ జీవ ఇతివ్యవహితా వ్యవహిత సాధారణ్యేన ప్రకృతే ర్మహాన్ మహతో హంకారాది రుత్పద్యత ఇత్యాశయః॥ ౧౪॥

—◆ ఆంధ్రతాత్పర్యము. ◆—

ఓయీ సదాశివుడను బ్రహ్మము మాయతో గూడినందున మనో బుద్ధి చిత్తా హంకార సమాన వ్యానో దాన ప్రాణా పాన శ్రోత్ర

త్వక్చక్షుజిహ్వా ఘ్రాణశబ్ద స్పర్శ రూపరస గంధవాక్ పాణి పాదపాయూ పస్థలను పంచవింశతి తత్వాత్మకయైన మూలప్రకృతి బుట్టెను. దానివలన శూన్యముత్పన్నమైనది. దానివలన కార్యరూపమైన బిందు ప్రకృతి దానివలన సమష్టిభావముచే ఈశ్వరుడును, వ్యష్టిభావముచే జీవుడును పుట్టిరి. వ్యవహిత, అవ్యవహిత, సాధారణ భేదములతో ప్రకృతివలన ఈశ్వరుడు అందువలన మహత్తత్వము, దానివలన జగత్తుబుట్టెను. గాన సహజమును సదాశివుడుసాక్షియా? కర్తయా! అనుసందేహమునుగురించి చెప్పుచున్నాడు. ప్రభువు ప్రజలకంటె భిన్నుడై ప్రజలయొక్క ప్రవృత్తిని జూచుచు సాక్షిమాత్రుండై యున్నట్లు ప్రభువులైన ప్రత్యగాత్మయు దేహేంద్రియములకంటె భిన్నుడై వృద్ధాద్యవస్థలను సంకల్పాది వృత్తులను జూచుచు సాక్షిమాత్రుండును స్వతంత్రుండును నిర్వికారుండును అయిన సదాశివుండు దేహేంద్రియాదులకు కర్తృత్వమును సృజించలేదు దర్శనశ్రవణాదికర్మలను సృజించలేదు. కర్మఫల సంయోగమునంతకంటె సృజించలేదు, మరేమియనగా? ఆత్మయొక్కస్వభావము (వాసన) ప్రవర్తించుచున్నది. శూన్యమువలన బుట్టినది. దానివలన బుట్టిన అవాంతరేశ్వరుడు (అహంకారుడును వాసనయు, కర్తృకర్తలగుచున్నారు.) చేతనుడగు ఆత్మకు కర్తృత్వాదులు లేనియెడల అచేతనమైన వాసనకు కర్తృత్వమెక్కడనుండిరాగలుగును? స్వతస్సిద్ధమైన యాత్మకు గర్తృత్వము లేదేని (అనగాకర్మమునకుదానుకర్తగాడేనివాసనయెక్కడనుండివచ్చినదియెక్కనుండియు రానియెడలవాసన యేఆత్మకుస్వభావమగును. ఆవాసనచేగలుగు కర్తృత్వాదులుగూడ స్వభావసిద్ధములగును, కర్తృత్వాదులు ఉపాధివలన వచ్చునేని మునుపటి దోషమే సిద్ధమైనది. ఇందుకు పరిహారమేమనగా? ప్రకృతివాసనయే కర్తృత్వాదికమును గలిగించుచున్నది. అనాదికాలము నుంచి వచ్చుచున్న కర్మమువలన ఆత్మకు దేవమనుష్యాద్యాకారమైన ప్రకృతితో సంబంధము గలుగుచున్నది. అగ్నిసంసర్గవలన కాలిన ఇనపగుండు అగ్నిగాదలపబడునట్లు ప్రకృతిసంసర్గమువలన ఆత్మయు ప్రకృతి

గా నేదలపబడి ప్రకృతి పరిణామములగు దేవాది శరీరములే ఆత్మయనెడి భ్రమగలుగుచున్నది. ఇట్లు దేహాకారమైన ప్రకృతియే ఆత్మయనెడి యభిమానము గలుగుచుండగా దానివలన బుట్టేవాసన (అనగా సంస్కారము అనుభూతార్థస్మరణము, అనగా ఇంతకుపూర్వమందో లేకపూర్వజన్మమందో చేయుచుగాని, అనుభవించుచుగాని, వచ్చినట్టి విషయములనుగురించి ఇప్పుడుమనకు తెలియకయే; తనంత నేకలుగునట్టి స్మృతి. అందువలనగలుగు అనురక్తి అభిలాష, శక్తి, వీనిని సంబంధించిన వాడుక మొదలయినవి గాని వాసనయనబడును) చేతనప్రకృతి కార్యములయినట్టి కర్తృత్వాదులన్నియు ఆత్మవిగా దోచుచున్నవి గాని అకర్తృత్వాదులు ఆత్మకు స్వరూపసిద్ధములు గావని భావము॥ ౧౪॥

శ్లో॥ నాదత్తే కస్యచిత్పాపం నచైవ సుకృతం విభుః।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః ॥ ౧౫

—◆ భాష్యమ్. ◆—

నన్వజ్ఞోజంతు రనీశోయ మాత్మన స్సుఖదుఃఖయోః ఈశ్వరప్రేరితో గచ్ఛే త్స్వర్గంవా శ్వభ్రమేవవే త్యాదిస్మృత్యేశ్వరః కారయితా జీవస్తు కర్తేతి తత్రాహ। నాదత్తఇతి। తత్రైవంసతి, పరమార్థతః పరమేశ్వర స్సదాశివ స్సహజాఖ్యః కస్యచిత్పాపం సుకృతంవా నైవాదత్త ఇత్యర్థః। నను కథం తత్రార్థ ఏషహ్యేవ కర్మకారయ తీత్యాది శ్రుతి స్మృతి లోక వ్యవహారశ్చేతి, తత్రాప్యాహ। అజ్ఞానేతి। అతఏవోక్తం బృహదారణ్యకే 'యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేనకంపశ్యేది త్యాది శ్రుతితోఽవధార్యమ్ ॥౧౫॥

## —◆ ల ఘు టి ప్ప ణీ ◆—

కారయతీతి॥ నన్వేతావత్వాపి ప్రేరకత్వేనాపి తత్కర్తృత్వ మే వోక్తమితిచేచ్ఛృణు । తత్రైవంసతి ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే । తయోరన్యఃపి ప్పలం స్వాద్వత్తి అన శ్నన్నన్యోఽభిచాకశీతి శ్రుతౌ సుపాంసులు గితిడాదే శేన ద్వాసుపర్ణౌ పక్షిణౌ సయుజౌ సహాయుక్తౌ సఖాయా మిత్రభావాపన్నౌ సమానం వృక్షం సంసారజాతం పరిషస్వజాతే సంసక్తౌ తయోర్జీవేశ్వరయోర్మధ్యే అన్యః ఏకో జీవః పిప్పలం కర్మోపార్జితఫలం స్వాదు యథాస్యాత్తథాత్తి తథాన్యస్త్వీశ్వరో ఽభిచాకశీత్యర్థశ్రవణే నేశ్వరస్య సాక్షిత్వమేవశ్రూయతే నతుకర్తృత్వ మితి తేనైవ కర్తృత్వ మారోపిత మిత్యవధార్యమ్॥౧౫॥

## —◆ ఆ న్వ తా త్ప ర్య ము ◆—

అజ్ఞానజీవుడు ఈశ్వర ప్రేరణచే సుఖదుఃఖములకు కారణములైన స్వర్గనరకములను బొందుచున్నాడు అనునట్టి స్మృతిని బట్టి చేయించువాడు ఈశ్వరుడనిన్ని చేయువాడు జీవుడనే శంకయందు చెప్పుచున్నాడు-ఈశ్లోక మందు పూర్వార్థము ఆత్మకు కర్తృత్వము లేదనిన్ని ఉత్తరార్థము వాసనను నదియే కర్తృత్వమనియు దెలియునది. జీవేశ్వరులను రెండుపక్షులు కూడానే యుండుటూ మిత్రభావముగలిగి సంసారవృక్షము నాశ్రయించినవి. ఆరెం టిలో జీవుడను పక్షి కర్మఫలమును రుచించునట్లు అనుభవించుచున్నాడు. రెండవదైన ఈశ్వరపక్షి కర్మ ఫలానుభవములేకనే తృప్తిబొందుచు న్నాడు. అనునట్టి శ్రుతిని బట్టి ఈశ్వరుడు సాక్షి గాని కర్తగాడని తెలియునది. యథార్థముగా సహజమను పేరుగల సదాశివుడయిన పరమాత్మ యెవనియొక్క సుకృతమునుగాని దుష్కృతమునుగానిబో గొట్టడు. సమస్తజీవరాసులయందును, ఉన్నవాడగుటవలన సర్వవ్యా పకుడై యుండును. ఈశ్వరుడే కర్మనుజేయుచున్నాడని శ్రుతి స్మృతి లోకవ్యవహారములలో గలదంటే సమాధానము. సర్వము నాత్మయే

నగునప్పుడు దేనిచే నెవడు దేనిని చూచును? అనెడు శ్రుతిని బట్టి ఆత్మకు గ ర్తృత్వములేదు. సత్వగుణోత్పన్నమైనబుద్ధినిరజ స్తమోగుణాత్మకమైన యజ్ఞానమావరించుటచే జీవులు దన్ను దా నెరుగక తాను క ర్తనుభో క్తను సుఖిని దుఃఖిని యని మోహము నొందుచున్నారు. అనగా దేహభ్రాంతిలో నుండిరి. సుఖదుఃఖములు బుద్ధి ధర్మములుగాని ఆత్మధర్మములు గానేరవు. యేమనగా? తానుదుఃఖావస్థలో నున్నప్పుడు సుషు ప్తిరాగా దుఃఖమును మరచుచున్నాడు. ఆత్మయైతే సర్వావస్థలయందు ఉన్నది. సుషు ప్తియందు బు ద్ధీంద్రియము లీనమయినది గాన దుఃఖము లేదని దెలియవలెను॥ ౧౫॥

శ్లో॥ జ్ఞానేనతు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః।
తేషా మాదిత్య వత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్॥౧౬॥

—◆ భా ష్య మ్ . ◆—

నను సర్వేషా మనాద్యవిద్యా వృతత్వాత్కథం సంసార బంధనివృ త్తి స్యాదిత్యాహ—జ్ఞానేనేతి । తథాచ తమేతం వేదానువచనేనేత్యాదిశ్రుత్యు క్త సాధనమార్గేణ ప్రశాంత చిత్తాయ జితేంద్రియాయే త్యాదిస్మృత్యాచ గురూపదిష్ట మర్యాదయా జీవస్య రజ్జుసర్పాదివ త్తదజ్ఞానం నాశితం । యేషాం తేషామంతఃకరణేత్యాదిత్యవత్పరం పదాఖ్యం జ్ఞానం యమేవైషవృణుతే తేనలభ్య ఇత్యాదిశ్రుత్యాచ ప్రకాశయతీతి లభ్యత ఇత్యాశయః॥౧౬॥

—◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ◆—

ఓయీ అందరును అవిద్యచే ఆవృతులై యున్నారు గదా? వీరికి సంసారబంధమెట్లు నివ ర్తియగునంటే చెప్పుచున్నాడు. అవిద్యయనగా దేహ

మనుష్య పశు పక్షి భ్రాంతి ఇది అవరణాజ్ఞానము మేఘావరణచే సూర్యుడు గనపడనట్లు అవిద్యావరణచే ఆత్మస్వరూపము మరుగు పడి యున్నందున వేదచోదితములైన యజ్ఞదానతపములను వర్ణాశ్రమోచితరీతిని కర్మానుష్ఠాన సమాధి యోగాభ్యాసాదులచే పరిశాంతచిత్తుడైన శిష్యుండు గురూపదిష్టమార్గముచే రజ్జువును దెలిసి సర్పభ్రాంతిని వదలివేసినట్లు శివోహమని తెలిసి దేహభ్రాంతిని వదలివేయును, మేఘావరణతొలగినపిదప సూర్యుడు ప్రకాశించునట్లు అవిద్యావరణ తొలగినపిదప ఆత్మప్రకాశించును,॥౧౬॥

శ్లో॥ తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః ।
గచ్ఛ న్త్యపునరావృ త్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః॥ ౧౭

—◆ భాష్యమ్ ◆—

నను కథమిదం శివాద్వైతం లభ్యం భవిష్యతీతి తస్యోపలబ్ధ్యర్థ ముపాయమాహ—తద్బుద్ధయఇతి । తథాసతి తస్మిన్నేవ పరమాత్మని శివేఽవినాశిస బుద్ధిర్యేషాంతే తద్బుద్ధయ స్తథా తస్మిన్నేవాంతఃకరణం యేషాంతే తదాత్మాన స్తథాతస్మిన్నేవ పరాత్మని నిష్ఠా మనసస్థితి ర్యేషాంతఏవ జ్ఞానేన నిర్ధూతం కల్మషం యేషాంతే అపునరావృ త్తిఃతుణాం కైవల్యం తురీయం శివం గచ్ఛంతీ త్యర్థః॥౧౭॥

—◆ లఘుటిప్పణీ ◆—

పరాత్మనీతి॥ తత్రయద్యపి । ' అమాత్యే రాజబుద్ధిస్తు నదోషాయ ఫలాయ త' దితి న్యాయేనపరతత్వాత్మనా సర్వస్య పరబ్రహ్మరూపత్వం తథాపి స్వతః పరాత్మత్వం శివస్యైవేతి స్కాందే ప్యుక్తమ్ । తద్యథా 'సాత్వికత్వం తురీయత్వ మవినాశిత్వ మేవచ । సాక్షిత్వం పరదైవత్వం శివత్వంచ శివేస్మృత, మిత్యాద్యవధార్యమ్॥ ౧౭॥

—◆ ఆన్ధ్రితాత్పర్యము ◆—

ఓయీ యిట్టి శివాద్వైతము యెట్లులభించుననగా ఉపాయమును జెప్పుచున్నాడు. తాను నాశరహితుడును, పరమాత్మయునైన శివుడని బుద్ధిగలిగియుండుటయు, తానుశివుడని భావించవచ్చునాయనగా! మంత్రియందు రాజబుద్ధి దోషములేదు. ఫలమేయున్నది. రాజునందమాత్యబుద్ధి గూడదు. ఆత్మయందే మనసు నిలుపుటయు, ఆత్మదర్శనమందే నిశ్చయము గలుగుటయు, ఆత్మజ్ఞాన మభ్యసించుటయం దాసక్తి గలుగుటయు ఇట్టి జ్ఞానముచేత సమస్తప్రాచీన పాపములను నశింపచేయుటయు పునరావృత్తి రహితమైన శివత్వమును బొందుటకు ఉపాయములు. శివత్వమనగా సాత్వికముగల్గుట తుర్యావస్థలో నుండుట నాశములేకుండుట సాక్షిగా నుండుట పరమాత్మగానుండుట సుఖముగానుండుట. ఈధర్మములు శివునియందు గలవని స్కాందమునందు గలదు. ఏయవస్థగలయాత్మకు పునరావృత్తిలేదో అది స్వస్వరూపముతో నుండునని భావము. పునః దేహాత్మభ్రాంతిలోకి రాదు.॥ ౧౭॥

శ్లో॥ విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
శునిచైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః॥ ॥౧౮॥

—◆ భాష్యమ్. ◆—

నన్వేతాదృశం జ్ఞానం లబ్ధ్వా కీదృశీ జీవన్ముక్తి స్సిద్ధ్యతీత్యాహ । విద్యేతి। తత్ర తావద్విద్యాః। 'పురాణ న్యాయ మీమాంసా ధర్మశాస్త్రాంగమిశ్రితైః। వేదైశ్చతుర్దశే త్యుక్తముపవేదా స్తథాష్టాదశేతి' స్మృత్యాఽష్టాదశరూపా తథేహ వినయోఽనహంకారత్వం తత్సంపన్నే పురుషే. తథాబ్రాహ్మణే బ్రాహ్మత్వేజాతి విశిష్టే. గవి నామ సంస్కార హీనాయాం। శుని.

శ్వపాకే చాత్యంతపాతకేఽ థమేపి సమాత్మ దర్శినః పండితా భవన్తి, నతుతఏవ సమాభవన్తీత్యర్థః। అన్యథా బుద్ధ్వాద్వైత స్యతత్వస్యేతి స్మృతిన్యాయేన తత్తద్ధర్మవిలోపాపత్తే రిత్యవ ధార్యమ్ ॥౧౮॥

—* లఘు టిప్పణీ *—

పురాణేత్యాది। తత్రతావత్ । అష్టాదశ పురాణాని ఏవమిహ శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిష మితిషడంగాని। తథా ఋగ్వేదో యజుర్వేద స్సామవేదోఽథర్వవేద శ్చేతిచతుర్వేదైః ఏవ మాయుర్వేదో ధనుర్వేదో గాంధర్వవేదోఽథర్వవేదశ్చే త్యుపవేదై శ్చతుర్భి స్సహాష్టాదశ విధేత్యవధేయం॥ ౧౮॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ ఈలాటి జ్ఞానములు బొందినవానికి యేలాటి జీవన్ముక్తి లభించునంటే చెప్పుచున్నాడు. ౧ అష్టావింశత్యాగమములు ౨ శిక్షా, ౩ వ్యాకరణము ౪ నిరుక్తము, ౫ ఛందస్సు, ౬ జ్యోతిషము, ౭ ఋగ్వేదము, ౮ యజుర్వేదము, ౯ సామవేదము, ౧౦ అధర్వణము, ౧౧ న్యాయము, ౧౨ మీమాంస, ౧౩ ధర్మశాస్త్రము, ౧౪ కల్పములు ౧౫ ఆయుర్వేదము, ౧౬ ధనుర్వేదము ౧౭ గాంధర్వవేదము, ౧౮ పురాణములు ఈ అష్టాదశవిద్యలును వినయముగలవానియందును కేవలబ్రాహ్మణుని యందును, గోవుయందును, యేనుగునందును, శునకమునందును. చండాలునియందును, నుండు ఆత్మలన్నియు జ్ఞానైకస్వరూపములగుటను బట్టి అంతటను వానిని సమానముగా (అనగాఏకాకారములైనవానినిగా) జూచువారు పండితులు. దృశ్యములగు బ్రాహ్మణ గోగజాది విషమాకారములు ప్రకృతి వియే గాని ఆత్మవి గావు ఆత్మయే సర్వత్ర జ్ఞానైకాకారమున సముడని గనుగొందురు.॥ ౧౮॥

శ్లో॥ ఇహైవ తై ర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాత్ బ్రహ్మణి తే స్థితాః॥౧౯

—* భా ష్య మ్ *—

నన్వేవం స్వరూపస్య యోగినో జీవన్ముక్తస్య కిం లక్షణమస్తీతి పున రవధారయతి, ఇహైవేతి, తథాచ యేషాం సామ్యే సమత్వభూమికాయాం స్థితంమన స్తైస్త్విహైవ సర్గః సృష్టిక్రమః సముద్రమాపః ప్రవిశ న్తీ తిన్యాయేన జితఇత్యర్థః। యతోఽహ్యాసంగో యం పురుష ఇత్యాది శ్రుతే ర్నిర్దోషం దోషగంధేనాపి శూన్యం యతశ్చ వ్యోమవత్సమం వ్యాపకం బ్రహ్మ యస్మా త్తస్మిన్నైక్యరూపేణ బ్రహ్మణి స్థితా స్తస్మా త్తేపి జీవా భేదేన తథేత్యా శయః ॥౧౯॥

—♦ ల ఘు టి ప్ప ణీ. ♦—

సమత్వమితి॥ 'శాస్త్రసజ్జన సంపర్క విచారోఽసంగ భావనా సమతా స్వచ్ఛతా సౌమ్యా సప్తధా భూమికా మతే,' త్యత్ర సప్తభూమికాగతత్వంసమత్వమిత్యర్థః। వ్యోమపదితి। ఇహ నిరవయవత్వేన భేదఘటితమేవ సాదృశ్య మన్యథా బహుధా శ్రుతయః ప్రవద న్తి। యతో విపదాది రియం మృగతోయ సమ మిత్యాది స్మృత్యా వ్యోమ్నా మిథ్యాభూతే న సాదృశ్యంనఘటేతేత్యవధేయమ్॥ ౧౯॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ జీవన్ముక్తుడైన యోగికి మరేమి లక్షణ మనగా? చెప్పుచున్నాడు. యెవరియొక్క మనసు సప్తభూమికలను బొంది సమత్వమైనదో (సప్తభూమికలనగా ! శాస్త్ర సజ్జన సంపర్కము . విచారణ,

అసంగము, భావన, సమత, స్వచ్ఛత, సౌమ్య) వారు ఈ జన్మమందే సంసారమును జయింతురు. నదీజలము సముద్రమున గలసి సర్వాత్మనా లయించినట్లు వాసనారహితులై ప్రపంచమును జయింతురు. రాగాది దోషములులేని దిన్ని సర్వత్ర సమము గానుండెడి దేగదా బ్రహ్మము, ఆత్మ సామ్య మందున్నవారు బ్రహ్మమందున్నవారే। యని తాత్పర్యము॥ ౧౯॥

శ్లో॥ నప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్,
స్థిరబుద్ధి రసంమూఢో బ్రహ్మవిత్ బ్రహ్మణి స్థితః॥ ౨౦

—♦ భాష్యమ్ ♦—

నన్వేవమప్యత్ర సజీవన్ముక్త శ్శరీర చేష్టయా కథం లక్షణీయ ఇత్యాహ—నప్రహృష్యేదితి, ఏవంతర్హి ప్రియంవస్తు స్త్ర్యన్నపానస్రక్ చందనాది ప్రాప్య నప్రహృష్యేత। నవాస్వాభీష్ట విపరీత మప్రియం ప్రాప్యోద్విజే దిత్యర్థః। యతః పరాత్మని శివే స్థిరబుద్ధిర్యతశ్చ తత్రాసమ్మూఢో జ్ఞానవాన్ బ్రహ్మవిత్సమాధినా బ్రహ్మణి స్థితశ్చే త్యర్థః ॥౨౦॥

—* లఘుటిప్పణీ *—

నప్రహృష్యేదితి, తద్యథా 'అహౌవా హారేవా బలవతి రిపౌవా సుహృదివా మణౌవా లోష్ఠేవా కుసుమశయనేవా దృషదివా। తృణేవా స్త్రైణేవా మమసమదృశో యాంతు దివసాః క్వచిత్పుణ్యారణ్యే శివశివశివేతి ప్రలపత' ఇత్యాదిద్రష్టవ్యమ్ ॥౨౦॥

—♦ ఆన్ధ్ర తాత్పర్యము ♦—

ఓయీ జీవన్ముక్తుడు అంగచేష్టలచే నెట్లుజూడదగినవాడంటే చెప్పుచున్నాడు. బ్రహ్మవేత్త, స్త్రీలు, అన్నము, పానీయము. పుష్పమాలలు,

చందనము, మొదలయినవి ప్రాప్తించినపుడు సంతసించడు. తనకిష్టము లేని వస్తువుప్రాప్తించినప్పుడు దుఃఖించడు. పరమాత్మయైన శివునియందు స్థిరబుద్ధిగలవాడై బ్రహ్మమందు నెలకొని మోహమును (దేహాత్మాభిమానమును) జెందక యుండును. మెడలో హారము వైచినను, సర్పము వైచినను, సమానముగా జూచును. ప్రబలశత్రువైనను, మిత్రుడైనను సమానముగాదలచును. మణులనైనను, బెడ్డనైనను, సమానముగా నంగీకరించును. పుష్పశయ్యయందైనను రాతియందైనను; సమముగాపరుండును. తృణము నైనను, స్త్రీలనైనను సమానముగా జూచును ఒకానొక దేవమందిరములో గూర్చుని శివ, శివ, శివ, యనుచు దినములు వెళ్లించువానిని జీవన్ముక్తునిగా దెలియవలెను ॥౨०॥

శ్లో॥ బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖం
స బ్రహ్మయోగ యుక్తాత్మా సుఖమక్షయ మశ్నుతే॥ ౨౧

—♦ భాష్యమ్ ♦—

నన్వేవమపి తస్య కింత్యాగమాత్రేణైవ జ్ఞాతృత్వం తర్హి త్యాగేనైకేన ప్రకృతిషువిలయ ఇత్యాదిశ్రుతివిరోధా దుపేక్ష్యం స్యా దిత్యాహ-బాహ్యేతి॥ ఏవంసతి, 'యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖం। బ్రహ్మాక్షయ సుఖస్యాప్తేః కలాం నార్హంతిషోడశీం।ఇత్యాది స్మృత్యా బాహ్య స్పర్శేషు శబ్దస్పర్శాదిష్వసక్తాత్మాసన్ సమాధినా యావత్సుఖ మాత్మన్యంతః కరణావచ్ఛేదేన విందతి సఏవ బ్రహ్మయోగయుక్తాత్మనానామ రాజయోగయుక్తాత్మాస న్నక్షయం బ్రహ్మసుఖ మశ్నుత ఇత్యర్థః ॥౨౧॥

## —♦ లఘుటిప్పణీ ♦—

రాజయోగేతి॥ తత్రతావత్॥ 'ధౌతి ర్వస్తి స్తథా నేతి' రిత్యాది హాఠయోగో దర్శితో రాజయోగస్య పరత్వంతు స్కాందే తత్వసంహితాయా ముక్తం। తద్యథా। 'యోగో హి ద్వివిధః ప్రోక్తో హఠయోగో పర స్తయోః। తీవ్రాధికారమాపన్నో రాజయోగై స్సమభ్యసే।' దిత్యాద్య వధార్యమ్॥ శమాదినేతి॥ శమ దమో పరతి తితిక్షా శ్రద్ధా సమాధానాఖ్య షట్సంపత్తి రూపయేత్యర్థః। అంతరాణాం రాగాదీనా మనావిర్భూతి శ్శమః। సర్వేషా మింద్రియాణా మవిహితవ్యాపారేభ్యో నివర్తనం దమః। నిషిద్ధ కామ్య కర్మో పరమ ఉపరతిః, ద్వంద్వ సహిష్ణుత్వం తితిక్షా। అపురుషార్థ సకలేతరశాస్త్ర పరాఙ్ముఖీ పరవిద్యామయ పరమాత్మ తంత్రోపనిషద్గోష్ఠి సముత్కంఠా రూపా సత్వకలా శ్రద్ధా। చిత్తస్య పరతత్వాభిముఖ్యం సమాధానం॥

## —♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

ఓయీ శబ్దాదులను వదలిన మాత్రముచే బ్రహ్మత్వము ప్రాప్తించునట్లయితే ఒకత్యాగముచే శబ్దాదులు ప్రకృతియందు లయించును గాన శ్రుతినిషేధించినదంటే చెప్పుచున్నాడు—ఇహలోకమందు కామసౌఖ్యమెంతయో, స్వర్గమందు దేవసౌఖ్యమెంతయో. అది బ్రహ్మానందములో పదునారవభాగమునకైన సామ్యములేదు. శబ్దాదులయందు విరాగముగలిగి శమదమాదిషట్క సంపత్తిచే ప్రత్యగాత్మ యెంత సుఖమును గాంచునో అక్షయమైన అట్టి సౌఖ్యమునే రాజయోగియును బొందును. యోగములు ధౌతి, వస్తి నేతి మొదలయినవి. హఠయోగము వీటికంటె రాజయోగము శ్రేష్ఠమైనదని స్కాందమునందు గలదు. అభ్యాసులలో తీవ్రాధికారి రాజయోగము నభ్యసించవలయుననిన్ని, మధ్యమాధికారి, వస్తి, మొదలయిన సాధనములు చేయవలసినదనిన్ని, చెప్పబడియున్నది. రాజ

యోగమనగా? సంప్రజ్ఞాత సమాధి. ఈ యోగము నభ్యసించువారలు పురుషులుగాని, స్త్రీలుగాని, సోహం మంత్రానుష్ఠానమును జేయుచు రావలయును. అనగా శ్వాసముయొక్క రాకపోకలయందు శ్వాసము లోపల ప్రవేశించునప్పుడు. సో అనుఅక్షరమును మనస్సులోనే భావించి శ్వాసమును బైటికివదలినప్పుడు, హం, అనుఅక్షరమును భావించవలెను. దీనినిమనో మారుత సంధానమనిరి. ప్రణవానుసంధానముమా యైయున్నది. యెట్లనగా సకారమందలి ఓకారమును, హకారోపరిబిందువును, గలసి ఓంకారమైనది. ఇట్టియభ్యాసమును సర్వదా అఖండితముగా జేసినయెడల పరిపక్వావస్థలో అసంప్రజ్ఞాత సమాధిగాగలదు. 'జీవాత్మ పరమాత్మైక్యావస్థా త్రిపుటిరహితా పరమానన్దస్వరూపా శుద్ధచైతన్యాత్మికా సమాధిః ధ్యాతృ ధ్యానే విహాయ నివాతస్థిత దీపవ ద్ధ్యేయైకగోచరం। చిత్తం సమాధిః మనఃప్రచారశూన్యం పరమాత్మని లీనం భవతి॥'' అని సమాధి లక్షణము చెప్పఁబడినది. ధ్యానధ్యాతృధ్యేయములను త్రిపుటిచేరహితమై యానందస్వరూపమై; శుద్ధచైతన్యస్వరూపమైజీవాత్మపరమాత్మలయొక్క యైక్యావస్థ సమాధియనఁబడును. ఇందుఁజిత్తము ధ్యాతృధ్యానములను వదలి. గాలిలేనిస్థలము నందలి దీపమువలె ధ్యేయమునకు మాత్రము గోచరమైయుండును. మనస్సెందును బ్రచరింపక పరమాత్మయందు లీనమగుచున్నది.

శ్లో॥ యేహి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే।
అద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః॥ ౨౨

—◆ భా ష్య మ్ ◆—

నన్వేతావతాపి బాహ్యసుఖనివృత్తా వాత్మసుఖస్యాప్తి స్తథాత్మసుఖస్యాప్తౌ బాహ్యసుఖనివృత్తి రిత్యన్యోన్యాశ్రయ స్తత్పరిహారన్నాహ—యేహీతి। తథాసతి! యావన్తః కురుతే

జంతుసంబంధా న్మనసః ప్రియాన్ తావంతో స్య నిఖన్యంతే హృదయే శోకశంకవ ఇత్యాది స్మృత్యాపి హి యస్మాద్యే సంస్పర్శజా విషయేంద్రియసంబంధజా భోగా స్తే సర్వేప్యాద్యం తవత్త్వనే హాముత్రగా రాగద్వేషాదివ్యాప్తత్వేన చ దుఃఖ యోనయ ఏవ త ఇతి తత్ర బుధో నాసక్త్యా రమత ఇత్యర్థః॥

## —◆ ల ఘు టి ప్ప ణీ ◆—

శోకశంకవఇతి॥ తద్యథా । తత్త్రైవోక్తం । 'గ్రంథిర్హి ద్వివిధా జంతో ర్విద్యాఽవిద్యా ప్రభేదతః । తత్రాఽవిద్యాంతుశంకాఖ్యాం ఛిద్యా ద్యోగై ర్దృఢవ్రతై, రిత్యాది బహుళః॥ ౨౨॥

## —◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ◆—

అనాదికాలమునుండి చవిగొన్న బాహ్య స్పర్శములను త్యజించుట యెట్లనగా ఆత్మసుఖావాప్తిచే ద్యజింపవచ్చును. ఆత్మసుఖప్రాప్తి యెట్లు వచ్చుననగా బాహ్యస్పర్శములు ద్యజించుటవలన వచ్చును. ఇట్లన్యోన్యా శ్రయదోషమును పరిహరించుచు చెప్పుచున్నాడు. లోకమందు జనుడు యెన్నిసంబంధములను ప్రియముగా జేయునో అవియన్నియు వానిహృదయ మందు నాటుకొన్న దుఃఖశల్యములనే స్మృతినిబట్టి విషయభోగములు మేకుదెబ్బలవంటివి. వాటి నివృత్తి యెట్లనగా జనునకు విద్యా అవిద్యా అని రెండు భేదములు గల గ్రంధులు. అందులో అవిద్యయనునది హృదయ మందు నాటుకొనిన దుఃఖకరమైన మేకు. దానిని యోగములచే దృఢ వ్రతులు భేదించివేతురు. విషయభోగములయందు పండితులు ఆస క్తులుగారు. ఆభోగములు అద్యంతములు గలవి యగుటచే భోగాంత మందు దుఃఖకరములే గాన విడువవలెను. పోని భోగమునందు తృప్తి స్నిలేదు. తృప్తికరముగా భోగించినయెడల విషయములు విడచి

పోవునని యోచించుట, అగ్నిహోత్రమును ఆజ్యముతో చల్లార్పిన నట్లే. గాన పండితుడు. ఆసక్తితో రమించడు. విధిశ్రేక చెయ్యవలసి వచ్చినదని ఆత్మానుసంధానమును వీడక విషయాదుల ననుభవించుచుండును శ్లో॥ పుంఖానుపుంఖ విషయైక్షణ తత్పరోపి బ్రహ్మావలోకనధియం నజహాతి యోగీ। సంగీత తాళ లయ వాద్య వశంగతాపి మౌళిస్థ కుంభ పరిరక్షణధీ ర్నటీవ॥ దృష్టాంతమందు నటీ, శిరమున కుంభము నిడుకొని నోటితో సంగీతమును బాడుచు చేతులతో తాళము వేయుచు పాదములతో నృత్యము సలుపుచున్నను, దానిచిత్తము శిరముననున్న కుంభమును పడిపోకుండా చూచుచున్నట్లు, యోగియైనవాడు విషయముల ననుభవించుచున్నను నతని చిత్తము బ్రహ్మావలోకనమును వదలియుండలేదు ॥౨౨॥

శ్లో॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ శరీర విమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం సయుక్త స్ససుఖీ నరః॥ ౨౩

## —◆ భాష్యమ్ ◆—

ననుకస్తర్హి జీవన్ముక్త ఇతి స్పష్టం కుతో నోచ్యత ఇత్యాహ—శక్నోతీతి । తత్రైవంసతి । యథా మరణాదూర్ధ్వం విలపస్త్రీభి ర్యువతీభి రాలింగ్యమానోపి ప్రాణశూన్యత్వా త్తద్వేగం సహతే తథా ప్రాణాత్ప్రాగపి జీవన్నేవ య స్సహతే సఏవ పరేపరబ్రహ్మణి యుక్త ఇత్యర్థః । తదుక్తం యోగవాసిష్ఠే । తద్యథా । 'ప్రాణే గతే యథా దేహ స్సుఖం దుఃఖం నవిందతి । తథాచే త్ప్రాణయుక్తోపి కైవల్యా దాశ్రమో భవే దిత్యాది ద్రష్టవ్యమ్॥ కామక్రోధాభ్యా ముత్పన్నం చిత్తక్షోభరూపం వేగం సోఢుం శక్నోతి సఏవ సుఖీ చేత్యుచ్యతే॥ ౨౩

## —◆ లఘుటిప్పణీ ◆—

మరణాదిః॥ తత్రైవం సత్యేఋంపి జీవం ప్రతిదేహాభిన్నం శరీర సంయోగ వియోగ యోగ్య మిత్యేవం లక్షణా స్మరణా మార్థ్వమిత్యర్థః ఏవం తతఃపరంచ అంతరమాహు రీశ్వరం తతోప్యనంతం జగదీశ్వరం శివమిత్యాది। శేషేణావధార్యమ్ ॥౨3॥

## —* ఆన్ధ్రి తాత్పర్యము *—

ఓయీ జీవన్ముక్తుడెవఁడో స్పష్టముగా నేలచెప్పవంటేఁ? చెప్పు చున్నాను. ఒకపురుషుడు మరణించినతర్వాత విలపించుచున్న భార్యచే ఆలింగితుడైనను ప్రాణములేనందున కామవేగమును సహించునట్లు బ్రతికి యున్నప్పుడును కామక్రోధములయొక్క వేగమునుసహించినవాడే సుఖవం తుడు. కామ క్రోధ వేగసహనోపాయ మెట్లనగా 'దృఢతరమపిధాయ ద్వారామారా త్కథంచి త్స్మరణ విపరివృత్తా దర్శనే యోషితాంవా, పరిణతివిరసత్వం దేహాభీభత్సతాం వాప్రతిముహు రనుచింత్యో న్మూలయి ష్యామి కామం'॥ శబ్దాదివిషయములకుద్వారములైన శ్రోత్రాదులనుబంధించి (అనగా విషయగ్రహణము చేయకుండుట) స్త్రీలను దర్శించుట స్మరించు టయు విడువవలయును. ఏమనగా సర్వదా వీరలయందు సరసముండదు. 'వృద్ధస్య తరుణీ విషం' అనునట్లు పరిపక్వదశలో విరసమున్నది. దేహము భీభత్సమైనప్పుడు విరసము 'ముక్తో దైత్యగురుః ప్రియేణ సహసా పశ్చా త్కృతస్సంగమః।' అనునట్లు శుక్లము పతనమైనప్పుడు స్త్రీ విరసయగును. ఇట్లు మాటిమాటికి ఆలోచించుచు కామమును జయించగలనన్నట్లు ఈయుపాయముచే జయించవచ్చును. ఇది కామజయోపాయము. క్రోధ జయోపాయమును జెప్పెదను. 'క్రుద్ధే స్మేరముఖావధారణ మథావిష్టే ప్రసాదక్రమో వ్యాక్రోశే కుశలోక్తి రాత్మదురిత చ్ఛేదోత్సవ స్తాడనే ధిగ్జంతో రజితాత్మనోఽస్య మహతీ దైవాదుపేతా విపద్దుర్వారేతి దయార సార్ద్రమనసాం క్రోధస్య కుతోదయః'॥ క్రోధమనువానికిని

శాంతమనువానికిని యుద్ధము. క్రోధముదగ్గరకురాగా జూచి చిరునగవు నవ్వుచుండెను. పిమ్మట క్రోధమునకు ఆవేశమై కండ్లు మొగము ఎఱ్ఱబడెను. అప్పుడు శాంతము దీర్ఘాయుష్మాన్ భవ, వంశాభివృద్ధిరస్తు, అని దీవించెను. పిమ్మట క్రోధము పరుషోక్తులను పరివారములో ముట్టడించెను (అనగా తిట్టుచుండెను) తరువాత శాంతము (కుశలప్రశ్న) యింటివద్ద అందరు క్షేమమా యని యడిగెను. అనంతరం క్రోధము తాడన జేయ సాగెను. శాంతము నాపాపమంతయు నశించినదని యానందోత్సవము సాగించెను. అంతలో క్రోధము ఇంద్రియపరివారమును నిగ్రహించలేక పరాజయము నొందెను. అనగాయిట్లు శాంతయుద్ధమందు మృతినొంది వీరస్వర్గముజెందిన క్రోధమునకు పునరావృత్తిలేదు.॥ ౨3॥

శ్లో॥ యోఽంతస్సుఖోఽంతరారామ స్తథాంతర్జ్యోతిరేవయః।
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి॥ ౨౪

— భా ష్య మ్ —

ననుకింవృత్తాదివ త్సహిష్ణుతా మాత్రమేవాపేక్షిత మపితు బ్రహ్మసుఖస్యావ్యాప్తిరపీ త్యాహ "యోంతరితి" తథాసత్యంతః కరణావచ్ఛేదేన సుఖం యస్య సతాదృశ 'సమాధినిర్ధూతమలస్య చేతసో నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్, నశక్యతే వర్ణయితుంగిరా తదా యదేత దంతః కరణేన గృహ్యతే' ఇత్యాదిశ్రుత్యా ప్రమాణీభూతో యోంతస్సుఖ స్తథాంతరారామ స్థితి ర్యస్య స తథాంతర్జ్యోతి రేవ యః సయోగీ యమనియమాద్యష్టాంగ యోగశీలో బ్రహ్మనిర్వాణం బ్రహ్మీభూతస్సన్నచిరేణ స్వల్పకాలేనైవా భ్యాసపాటవా ద్గచ్ఛతీత్యర్థః ॥౨౪॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

అచిరేణేతి, 'కస్యచిజ్జాయతేశీఘ్రం చిరకాలేనకస్య చిది'త్యాదినా యథాతీవ్రాద్యభ్యాసబలేనా వధార్యం. ౨౪॥

—✻ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ✻—

ఓయీ! వృక్షపర్వతములవలె శీతోష్ణాది ద్వంద్వమును సహించుట యేగాదు, బ్రహ్మసుఖమును గలదని చెప్పుచున్నాడు. ఈశ్లోకమందు అంతస్సుఖః, అంతరారామః, అంతర్జ్యోతిః' అను పదములచే ఆత్మయే వరుసగా భోగ్య, భోగ్యస్థానము, భోగోపకరణములు గాగలవాడని తెలియనగును. (అనగాజీవన్ముక్తుడనిత్యములైన బాహ్యసుఖముల యందా సక్తిని వదలి ఆత్మసుఖమందు తృప్తుడై ఘటమునందలి దీపమువలె లోలో పల ప్రకాశించుచుండును. ౨౪॥

శ్లో॥ లభన్తే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః।
ఛిన్నద్వైధా యతాత్మాన స్సర్వభూతహితే రతాః ॥౨౫॥

—♦ భా ష్య మ్. ♦—

నను కైవల్యహేతో ర్జ్ఞానస్య సాధనాని పునః స్మారయన్నాహ ॥లభన్తఇతి॥ తత్రితావ ద్యజ్ఞాదిభిః క్షీణకల్మషా స్తతోంతః కరణశుద్ధ్యా ఋషయః సూక్ష్మవస్తు వివేచనసమర్థాస్త ఏవ కర్మణా ఫలాంశత్యాగేన సన్న్యాసినః తతశ్చశ్రవణాది పరిపాకేన చ్ఛిన్నద్వైధా నివృత్తసర్వసంశయా స్తతో నిదిధ్యాసనపరిపాకేన సంయతాత్మాన శ్శివే పరమాత్మన్యే వైకాగ్రచిత్తా ఏతాదృశాశ్చ ద్వైతాదర్శిత్వేన శివైకతాదాత్మ్యాత్సర్వ భూతహితేరతా బ్రహ్మైవసన్ బ్రహ్మనిర్వాణం లభన్త

ఇత్యర్థః॥ యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైవాభూద్విజానత స్తత్ర కో మోహః కశ్శోక ఏకత్వ మనుపశ్యత ఇత్యాదిశ్రుతేరితి భావః॥ ॥౨౫॥

—* లఘుటిప్పణీ *—

సన్యాసిన ఇతి॥ నతు దండధారిణ ఇత్యర్థః। తద్యథా 'నాన్యాపి పురుషో జ్ఞాతః పుంస్త్వం వో నైవ నిశ్చితం ; స్వం స్వయం నైవజానీధ్వం వేషతః కిం యతి ర్భవేదిత్యాది, దండినం ప్రతి మైత్రేయ్యుక్త్యా వధార్యమ్.

—♦ ఆన్ధ్రి తాత్పర్యము. ♦—

ఓయీ! ముక్తికి సాక్షాత్సాధనమైన జ్ఞానమునకు అనుసాధనములను కొన్నిటిని జ్ఞాపకము జేయుచున్నాడు, సమదర్శిత్వమనెడు జ్ఞానము పరిపాకము నొందుటకై దానిని సాధించు ననుష్ఠానప్రకారము 'నప్రహృష్యేత్' ను శ్లోకము మొదలుకొని చెప్పబడుచున్నది. హర్షోద్వేగములనివృత్తి బాహ్యవిషయములయందు నిస్సంగత్వము అందులకై బాహ్యస్పర్శములను దోషములుగాజూచుట కామక్రోధముల వేగము నివారించుట ఆత్మనే సర్వవిధభోగ్యములుగ కల్పించుకొనుట అనునీయయిదు వరుసగా నయిదు శ్లోకములచే చెప్పబడినవి. ఇక పూర్వోక్తములయిన ద్వంద్వసహనాదుల దలపించుచు సమదర్శిత్వమునకు మిక్కిలియు నంతరంగసాధనమైన సర్వభూత హితరతిత్వము నిందు పదేశించుచున్నాడు 'శ్రూయతాం ధర్మసర్వస్వం శ్రుత్వా చాప్యవధార్యతాం ఆత్మనః ప్రతికూలాని పరేషాం నసమాచరేత్' అని భారతము. తనకువలె తక్కినభూతములకును హితమాచరించుచుండుట నశించిన పాపములు గలవారై ద్వైతభావము నశించి ఇంద్రియములను జయించిన వారలగుచు అంతఃకరణశుద్ధిచేత సూక్ష్మవస్తు వివేచనయందు సమర్థులగుచు కర్మఫలత్యాగులైన సన్యాసులు శ్రవణమనననిదిధ్యాసలచే నింద్రియ నిగ్రహము గలిగి పరమాత్మయైన శివునియందు ఏకా

గ్రచిత్తముగలవారలగుచు అఖండానందరూపుడైన పరశివుని గాంతురు. ఇచ్చట సన్న్యాసమనగా దండధారణ మాత్రముచే సన్న్యాసముగా జాలదు. ఇందును గురించి మైత్రేయి దండినిగురించి యిట్లు పలికినది. హేదండిన్ నీవు పురుషుడవు కాజాలవు యేలయనగా నీలోనున్న పురుషుని నీవు దెలుసుకొనలేనందున దన్నుదా నెరిగినవాడు యతిగాగలడు గాని వేషధారణముచే సన్న్యాసిగాజాలడని దెలియవలెను. ౨౫॥

శ్లో॥ కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసాం।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనాం॥ ౨౬

—♦ భాష్యమ్ ♦—

అథ పూర్వం కామక్రోధయో రుత్పన్న యోరపి తయోర్వేగస్సోఢవ్య ఇత్యుక్తమిదానీం తు తయోరుత్పత్తిప్రతిబంధఏవ నర్ణ్యతఇత్యాహ॥ కామేతి॥ తత్త్రైవంసతి కామక్రోధయోర్వియోగ స్తదనుత్పత్తి రేవ యేషాం తేషాం యతీనాం యతనశీలానాం యతచేతసాం సంయతచిత్తానాం విదితాత్మనాం సాక్షాత్కృత తత్త్వానా మభితో బ్రహ్మనిర్వాణం వర్తత ఇత్యర్థః॥ ౨౬॥

—♦ లఘుటిప్పణీ ♦—

అనుత్పత్తి రేవేతి॥ 'యథోత్తమంరసం లబ్ధ్వా సత్సుధైర్నావత్సృ హ్యతే। తద్వద్బ్రహ్మసుఖం లబ్ధ్వా లౌకికై ర్నావసీదతీ'త్యాదివివేక్తవ్యం

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

ఇంతకుపూర్వము కామక్రోధముల వేగము సహింపదగినదని చెప్పి యిప్పుడు కామ క్రోధములు పుట్టకుండుటనుగురించి చెప్పుచున్నాడు॥

కామమును క్రోధమును లేనివారును అంతఃకరణమును జయించినవారును ఆత్మసాక్షాత్కారమైనవారును నైన యతులకు బ్రతికియున్నను మృతి నొందినను బ్రహ్మానందముగలదు. మంచిరుచిగల పదార్థములను భుజించినవాడు రుచితక్కువపదార్థములను తృప్తినొందనట్లు బ్రహ్మానందము ననుభవించినవాడు లోకానందముజోలికి బోడు॥ ౨౬॥

శ్లో॥ స్పర్శాన్కృత్వాబహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాంతరేభ్రువోః
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ॥ ౨౭

—♦ భా ష్య మ్ ♦—

ఏవ మిహ బహుశ స్తత్త్వజ్ఞానస్య బహిరంగసాధనాన్యుక్తానీదానీంతు తస్యాంతరంగసాధనాన్యప్యాహ "స్పర్శానితి" తథాచేహోదా బహిర్బాహ్యా౯ శబ్దాదీన్ బహిర్భవాన్ పునర్బహిరేవ కృత్వా పరం వైరాగ్యేణభ్రువోరంతరే అర్ధనిమీలనేన చక్షుషీ పరమాత్మని చిదాకాశే స్పర్శయోగస్తు నామైషదుర్లభోహి కుయోగినా మిత్యాది స్మృతిగమ్యే స్పర్శంనిధాయ తథా ప్రాణాపానౌ సమౌ నామ తుల్యావూర్ధ్వాఽధోగత్యాదాసీన్యేన నాసాభ్యంతరచారిణౌ కృత్వేత్యర్థః ॥౨౭॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

చారిణావితి॥ 'షట్శతాని దివారాత్రౌ సహస్రాణ్యేకవింశతిః । హంస హంసేహ మిమం మంత్రం జీవోజపతి సర్వదే' త్యప్యనుసంధేయ మితి ధ్యానస్య గూఢాభిసంధిరితిభావః॥ ౨౭॥

## —◆ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ◆—

ఈప్రకారము తత్వజ్ఞానోపయోగమైన బహిరంగసాధనముల జెప్పి యిప్పుడంతరంగ సాధనముల జెప్పుచున్నాడు ముందుగా బాహ్యావిషయ ములైన శబ్దాదులత్యజించి వైరాగ్యముతో భూ్రమధ్యమందు లక్ష్యమును నిలిపి అర్ధనిమీలిత లోచనుడై ఊర్ధ్వ గతిగల ప్రాణవాయువునున్ను అధోగతిగల యపానవాయువునున్ను సమానముగా జేసి అనగా ఇడా పింగళలను సరిజేసి సుషుమ్నను నడిపించుచు నాశికను దాటి వాయువును రానియ్యక (యిరువదియొక్క వెయ్యి ఆరునూరుల హంసలను దివారాత్రము లను జీవుడు జపముజేయును. ఆహంసలను సోహంభావనతో జూచిన నిదిధ్యాసలో వాయువు నాశిక దాటిరాదు.) పరమాత్మయైన చిదాకా శమును జూడవలెను.॥ ౨౭॥

శ్లో॥ యతేంద్రియ మనోబుద్ధి ర్ముని ర్మోక్ష పరాయణః।
విగతేచ్ఛా భయక్రోధో యస్సదా ముక్త ఏవసః॥　　౨౮

## —◆ భా ష్య మ్ ◆—

నన్వతా్రి తః పరం కిం కరణీయమ స్తీ త్యాహ । యతేం ద్రియేతి । తథా చైవం ప్రకారేణ యతాస్సంయతా ఇంద్రియ మనోబుద్ధయో యస్య సో త థామననశీలస్సన్ బ్రహ్మవిద్యా పరాయణ ఏవ మోక్షపరాయణ ఇత్యర్థః । ఏవంసతి తతోప్య భ్యాసపాటవా ద్విగతేచ్ఛా భయక్రోధో యస్సదా స ముక్త ఏవేతిపరమార్థః॥ ఉక్తంహి, "నిమిషార్ధం నతిష్ఠంతి వృత్తిం బ్రహ్మమయీం వినా యథాతిష్ఠంతి బ్రహ్మాద్యాస్సనకాద్యా శ్శుకాదయః।' ఇత్యాద్యన్యత్ర ద్రష్టవ్యమ్॥ ౨౮॥

—◆ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ◆—

ఓయీ! అటుపైని చేయవలసిన దేమున్నదంటే చెప్పుచున్నాడు. ఇంద్రియమనోబుద్ధులను నియమము జేసికొని మననశీలుడై మోక్షాసక్తి గలిగి కోర్కెలువదలి కోపమును వీడినవాడై అర్ధనిమిషమైనను బ్రహ్మాకారవృత్తిని వదలియుండరాదు. సనకాదులు శుకాదులు బ్రహ్మములు బ్రహ్మాకారవృత్తిని అరనిమిషమైనను వదలక యున్నట్లున్నవాడు జీవన్ముక్తుడు॥ ౨౮॥

శ్లో॥ భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరం
సుహృదం సర్వభూతానాంజ్ఞాత్వామాంశాంతిమృచ్ఛతి॥ ౨౯

ఇతిశ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే కర్మసన్యాసయోగః.

—◆ భా ష్య మ్ ◆—

నన్వేవం యోగయుక్తః కథంజ్ఞాత్వా ముచ్యత ఇత్యాహ "భోక్తారమితి" ఏవం తర్హి 'మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరం, తేనవ్యాప్తమిదం సర్వం జగత్ స్థావరజంగమ" మిత్యాదిశ్రుత్యా సర్వజగతాం సాక్షిణం లోకమహేశ్వరం। తథాథర్వరేఽ హ్యగ్రభోక్తారం సర్వేషాం పశ్యతాం ప్రభుమి' త్యాది భారతోక్తస్మృత్యాచ సర్వేషాం యజ్ఞానాం ప్రభోక్తారం తపసాంచ ఫలప్రదం తథా హిరణ్యగర్భాదీనాం సర్వలోకానాం మహేశ్వరం, సదాశివం జ్ఞాత్వా శాంతిం మృచ్ఛతీత్యర్థః ఏవం। 'యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథాగురౌ తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే

మహాత్మన ఇత్యాది' స్మృత్యాచ సర్వభూతానాం హృదయం పాలనకర్తృత్వేనోపకారకం త్వమేవం మాంజ్ఞాత్వాచ శాంతి మృచ్ఛతీతి పరమార్థః ॥౨౯॥

ఇతి శ్రీశ్వేతాచార్య గురుచరణశిష్య భావసమాసాదిత
శైవసిద్ధాన్తప్రవర్తక శ్రీశ్రీకంఠశివాచార్య విరచితే
తత్త్వైకదర్శననామకే గీతాభాష్యే
కర్మసన్న్యాసయోగః.

—* లఘుటిప్పణీ *—

హిరణ్యగర్భాదీనామితి. తత్రైవం సతి 'యో దేవానాం ప్రభవ శ్చోద్భవశ్చ, విశ్వాధికోరుద్రో మహర్షిః హిరణ్యగర్భం జనయామాస పూర్వం సనోబుద్ధ్యా శు భయా యునక్త్వి'త్యాది శ్రుత్యాహిరణ్యగర్భా దీనాం సర్వలోకానాం మహేశ్వరం మాం జ్ఞాత్వేత్యర్థః। పాలనకర్తృ త్వేనేతి। తత్రైవంతు। త్వం పాలనకర్తృత్వేనో పకారకో విష్ణుర్నతు కర్తేతి జఘన్యం మన్యమానోపి 'శివాధిక్య మవిజ్ఞాయ బ్రహ్మనారాయణౌ పురా। అహం బ్రహ్మ త్వహం వేత్తి విశ్రాంత్యాకురుతాం రణం। త్వ ద్భక్తౌ బ్రాహ్మణా నిత్యే త్రిపుండ్రే భస్మకంఠనే। భవేయు ర్విముఖా నిత్యం వేదసిద్ధే విముక్తిద' ఇత్యాదినాశివాధిక్య మజానతో ర్ద్వయో ర్వివాదోప్యభూ దన్యత్రవిస్తరః॥ ౨౯॥

ఇతి శ్రీ శ్రీకంఠ శివాచార్యశిష్య విశ్వేశ్వర శివాచార్య
విరచితాయాం లఘుటిప్పణ్యాం కర్మసన్న్యాసయోగః.

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

ఇట్టి యోగాభ్యాసి యెట్లుగా తెలిసికొని ముక్తుడగుచున్నాడనగా! చెప్పుచున్నాడు. మాయయే ప్రకృతియనియు అట్టి మాయగలవాడే మహేశ్వరుడనియు, అతనిచేతనే యీ స్థావరజంగమాత్మకమైన జగత్తం

తయు వ్యాప్తమైన దనునట్టి శ్రుతినిబట్టిన్ని మహేశ్వరుడు సర్వజగత్తులకు సాక్షియనిన్ని యజ్ఞమందగ్రభోక్తయనిన్ని, ॥శ్రు॥ 'ఆవో రాజానమధ్వరస్య రుద్రం' సర్వయజ్ఞములకు భోక్తయు సర్వలోకములకు ప్రభువున్ను తప సులకు ఫలమిచ్చువాడును హిరణ్యగర్భాది సర్వలోకములకు మహేశ్వరు డైనవాడు సదాశివుడు. 'తమీశ్వరాణాం పరమం మహేశ్వరం తం దైవ తానాం పరమం చ దైవతం పతిం పతీనాం పరమం పరస్తా ద్విదామ దేవం భువనేశ మీడ్యం'॥ సదాశివుడు దేవతలందరికి నధిపతి. అతనికి సాటియైన దైవము లేడు. 'గాయత్రీవల్లభత్వా ద్దశరథతనయ స్థాపితారాధి తత్వా చ్ఛౌరేః కైలాసయాత్రా వ్రతముదితతయా భీష్టసంతానదానాత్ నేత్రేణ స్వేన సాకం దశశతకమలై ర్విష్ణునాఽఽరాధితత్వా త్తస్మై చక్ర ప్రదానా దపిచ పశుపతి స్సర్వదేవ ప్రకృష్టః॥' శివోత్కృష్టత యీచెప్పబోవుకారణములవలన ప్రతిపాదింపబడినది॥ 1 గాయత్రీదేవతకుభర్త. 2 విష్ణువు రామావతారమందు రావణసంహారమువలన ప్రాప్తించిన బ్రహ్మ హత్యానివారణార్థమై రామేశ్వరక్షేత్రమందు రామనాథస్వామిని స్థాపించి పూజించినందునను. 3 కృష్ణావతారమందు సంతానప్రాప్తికొరకు కైలాస యాత్ర జేసి తపమొనరించిన కృష్ణునకు సాంబుడను కొమరుని ప్రసా దించినందునను. 4 మరియొకప్పుడు రాక్షసవధార్థమై శివునారాధించి సహస్రకమలార్చన జేయునపుడు శంకరుడు భక్తుని పరీక్షించు నిమిత్త మొక కమలమును లోపింపజేసినందుకు నేత్రకమలమును పూజించిన విష్ణువునకు ప్రసన్నమై సుదర్శనచక్ర మిచ్చినందునను'ఈశ్వరస్సర్వభూతా నాం హృద్దేశేఽర్జునతిష్ఠతి' యని ఈగీతయందే సర్వభూతములయందు ఈశ్వరుడున్నాడని కృష్ణుడర్జునున కుపదేశించినందునను అట్టి సదాశివుని తెలిసికొని ముక్తినొందగలరు.

'శివఏకో ధ్యేయ శ్శివంకర సర్వమన్యత్పరిత్యజ్యే'త్యాది శ్రుతులను బట్టిన్ని సమస్తక్షుద్రదేవతలను వదలి శివుని ధ్యానించి ముక్తినొందవలెనని శ్రుతులు చాటుచున్నవి. మరియు స్మృతులుగూడ కలవు.

శ్లో॥ ధ్యేయత్వే తవసాక్షిణో మునిగణాః జ్ఞానప్రదత్వే శుకో
వంద్యత్వే నిగమా స్స్వభక్త విమతక్లాంతౌ కృతాంతాదయః।
నిత్యత్వే భవతః పితామహశిరస్స్రగ్బృంద మాద్యంతయో
శ్శూన్యత్వే తు వరాహ హంసవపుషౌ పద్మాక్ష పద్మాసనౌ॥

శివుండు ధ్యానింపదగినవా డనుటయందు మునీశ్వరులందరు శివధ్యానరతులగుటచే సాక్షులయిరి. శివుండే జ్ఞానమునిచ్చువాడనుటయందు వ్యాసుని తపస్సుకు సంతసించి ప్రత్యక్షమైన శంకరుని నాకుమారునికి బ్రహ్మోపదేశము మీచేగావలెనని వరముగోరినందున నట్లు గావించిన తరి శివజ్ఞానముచే ముక్తినొందిన శుకుడు సాక్ష్యము. శివుండే వందనీయుడనుటయందు నమోనమః పదంబులచే నలంకరింపబడినట్టిన్ని నమశ్శివాయ యనుమంత్రరాజముచే పవిత్రమైన రుద్రాధ్యాయము ఋగ్వేద సామవేదముల మధ్య యజుర్వేదముండుటచే పవిత్రములైన వేదములు సాక్ష్యములు శివభక్తిసలుపవలె ననుటయందు శివభక్తిలేనివారిని శిక్షించుటకొరకుసృష్టింపబడిన యముడు యమలోకము యమభటులు సాక్షులు. నిత్యమైన ముక్తినిచ్చుటకు జననమరణములు లేని శివుండే యధికారియనుటయందు నూటయిరవై యనమండ్రు బ్రహ్మలయొక్క కపాలములచే గ్రథితమై శివుని మెడలోనుండు కపాలమాల సాక్ష్యము, శివుండాద్యంతములు లేనివాడనుటకు వరాహహంస రూపధారులై శివునిపాదశిరంబులు గనుగొనలేని యీహరిబ్రహ్మలే సాక్షులుగాన సర్వదేవాదిదేవుడైన శివునియందును యథాదేవే తథాగురౌ? అనుటవలన గురువులయందును సమబుద్ధి గలవారు సిద్ధులు. ముక్తులుగాగలరనునట్లు అర్జునా? గురుడవైన నన్నుగూడ శివునితోనభేదమునుగాజూడుమని యుపదేశించెను. ౨౯॥

ఇట్లు తత్త్వైకదర్శనమను శ్రీకణ్ఠీయ గీతాభాష్యమునకు బోధానంద
మహర్షి చే రచియింపఁబడిన భావబోధమను నాంధ్ర
తాత్పరమున కర్మసన్న్యాసయోగము.

---

ఓ మ్.

# శ్రీమచ్ఛ్రీకంఠాచార్యకృతే

# శ్రీభగవద్గీతాభాష్యే

---

## ఆత్మసంయమయోగః.

శ్రీకృష్ణఉవాచ

శ్లో॥ అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః।
స సంన్యాసీ చ యోగీ చ ననిరగ్ని ర్నచాక్రియః॥ ౧।

— భాష్యమ్ —

'ఆత్మజ్ఞానాద్భవేన్ముక్తి స్తథాపీంద్రియ సంయమాత్। ముక్తిరేవాత్మ నిష్ఠస్య షష్ఠే త్వేతన్నిరూప్యతే'॥ నను। 'జపాచ్ఛ్రాంతః పునర్ధ్యాయేత్ ధ్యానాచ్ఛ్రాంతః పున ర్జపేత్। జపధ్యానాభియోగేన పశ్యేదాత్మాన మాత్మనే' త్యాది స్మృత్యాత్మత్వే లబ్ధే కిమిహసంన్యాసశబ్దేనోచ్యతఇత్యాశంక్యాహ - అనాశ్రితఇతి తత్రైవంసతి। 'కుటీచకో గృహస్థస్యాద్బ్రహ్మచారీ బహూదకః। వానప్రస్థోఽథ హంస స్స్యాత్పరహంసస్తు జ్ఞానవానిత్యాది' స్మృత్యా గృహాశ్రమఏవ వస్తుతస్త్రివిధాశ్రమాణా మంతర్భూతత్వా త్సర్వకర్మణాం ఫలమనాశ్రిత స్సన్యః కార్యం శాస్త్రేణ కర్తవ్యతయా విహితం నిత్యా

గ్నిహోత్రాదికం కర్మ కరోతి స సంన్యాసీ త్యుచ్యతే। సంన్యాసోహి త్యాగయోగశ్చ చిత్తవృత్తినిరోధస్తౌచ యస్య విద్యేతే స సన్న్యాసీ త్యభిధీయతే। నతు నిరగ్నిస్స్వాహా స్వధే త్యాది ధర్మవివర్జితో నవా స్నానసంధ్యాది షట్కర్మశూన్యో ఽపీతి॥౧॥

## —* లఘుటిప్పణీ *—

నను 'ఆత్మాజీవశ్శివశ్చేతి మనోదేహేంద్రియాణి చేత్యాత్మశబ్ద స్యానేకార్థత్వేఽపీహ "ధారయిష్యతి తే వేగం రుద్ర స్త్వాత్మా శరీరిణాం। యస్మిన్నోతమిదం ప్రోతం విశ్వం శాటీవ తంతు"ష్వితా త్యుక్త్యా త్మశబ్దేన సదాశివస్యైవా భిధానాదితి భావః। బహూదక ఇతి। శిలా బహూని జలాన్నవిద్యాదీ న్యుపలభ్యంతే యేన స బహూదక ఇత్యర్థః। ఏవం బాణవత్ప్రస్థా బుద్ధి స్థితిర్యస్య క్షీరనీరయో ర్వివేకవ ద్వాబుద్ధి ర్యస్యేత్యర్థః॥ ౧॥

## —♦ అన్వితార్థము. ♦—

ఈయాఱవ యధ్యాయమందు ఆత్మజ్ఞానమును, ఇంద్రియసంయమ మును, జెప్పుచు వీనివలననే ముక్తిగలుగుచున్నదని చెప్పినందున ఈఅధ్యా యమునకు ఆత్మసంయమయోగమని పేరు. ఓయీ! జపము (మంత్రానుస్మ నము) వలన, శాంతుఁడై ధ్యానము (మనోనిర్విషయము) చేయవలెను, ధ్యానముచేఁ శాంతుఁడై జపమును జేయవలయును. ఈజపధ్యానములచే దన్నుఁదాను జూడఁగలఁడు. అప్పుడు జననమరణ పరివాహము శాతించును. జపశబ్దార్థము జన్మము లేకుండుట. 'శ్లో॥ జకారో జన్మవిచ్ఛేదః పకారః పాపనాశనః జన్మచ్ఛేదకరో యస్మా జ్జప ఇత్యభి ధీయతే'॥ పాపముల నశింపఁజేసి జన్మములఁ బాపునది, జపము. ఇత్యాది

స్మృతులచే ఆత్మతత్వము లక్ష్యమగుచుండఁగా సన్న్యాసశబ్దముచే నేమి చెప్పుదురనఁగా! జెప్పుచున్నాఁడు. సన్యాసము, కుటీచక, బహూదక, హంస, పరమహంసములని నాలుభేదములు. కుటీరమందున్న వాడు కుటీచకుఁడు. గృహస్థుడు కుటీచకుఁడే. బ్రహ్మచారి బహూదకుఁడు. అన్న జల విద్యలను విస్తారముగా సంపాదించువాఁడు. వానప్రస్థుఁడనగా బాణము వలె తీవ్రమైన బుద్ధిగలవాఁడు, హంసయనఁగాఁ బాలను నీటిని విడఁదీసినట్లు, దేహిని, దేహమును, విడఁదీసి దేహిని గ్రహించి దేహమును వదలివేయువాఁడు: జ్ఞానముగలవాఁడే పరమహంస. కాన గృహస్థాశ్రమము బ్రహ్మచారి వానప్రస్థ యతుల కాధారమయినట్లు, గృహస్థాశ్రమమందు నీయాశ్రమము లంతర్భాగములై యున్నవి. కనుక నే'ధన్యోగృహస్థాశ్రమః గృహస్థాశ్రమమే మంచిదనిరి. కర్మఫలములను గోరక విధ్యుక్తములయిన నిత్యాగ్నిహోత్రాదుల నెవడు చేయుచుండునో వాఁడే సన్యాసి, వాఁడే యోగి, స్నాన సంధ్యాది షట్కర్మలను వదలుట వలనను దేవ పిత్రు కర్మలను వదలుట వలనను అగ్నిహోత్రము వదలుట వలనను సన్యాసి గాజాలఁడు. (ఆత్మయనఁగా జీవుఁడు, శివుఁడు, మనసు, దేహము, ఇంద్రియములు. ఇట్లనేకార్థములున్నను శైవమతమందు ఆత్మయనఁగా సదాశివుఁడు. 'రుద్రః పశూనా మధిపతిః। ఓతం యేన జగచ్చరాచరమిదం ప్రోతంచ సర్వం సదా। చ్యోతంతే పశవో౽పి పాశనికరా ద్యస్య ప్రసాదేన తత్। ఓమిత్యాది మనూచ్చర ధ్వనిగతం జ్యోతిష్మతాం ద్యోతకం। వ్యోమవ్యాపి పరం శివాఖ్య కమలం జ్యోతిః ప్రపద్యే ధియా' ఏనిష్కళ శివుఁడను జ్యోతిచేతఁ జరాచరమైన యీప్రపంచమెల్లపుడు పడుగుపేకలవలె నూర్ధ్వాధోరూపముగాను, అడ్డముగాను, సృజించఁబడినదో। విజ్ఞాన కళలు, ప్రళయాకళలు. సకళులు, అను మూఁడువిధములయిన పశువులను నేశివానుగ్రముచేత మల మాయా కర్మ బిందు తిరోధాన రూపమైన పాశమువలన విముక్తులగుచుర్నోరో ఓంకారము,

పంచాక్షరి, (ప్రాసాదము మొదలయిన మంత్రోచ్చారణ వలన నాద నాదాంత ధ్వనియందుఁ బుట్టిన ప్రకాశము ద్యోతకమగుచున్నదో యెవడు సదాశివ, మహేశ్వర రుద్ర, విష్ణు, బ్రహ్మలకంటె పరుఁడై యుండెనో యట్టినిష్కళంకమైన స్వయంప్రకాశజ్యోతిని సోఽహం భావనా బుద్ధిలో ధ్యానించుచున్నాను.) ౧॥

శ్లో॥ యం సన్న్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ!॥
న హ్యసన్న్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన॥ ౨

—◆ భా ష్య మ్ . ◆—

అథ సన్న్యాసయోగయోః కోఽవిశేషఇత్యాశంక్యాహ-యమితి । తత్ర తావత్ 'ఉర్వారుకమివబంధనాది'తి శ్రుతిన్యాయేన ఋణత్రయా విమోకా దూర్ధ్వంసర్వకర్మణాం ఫలత్యాగం సన్యాసమితి శ్రుతయః ప్రాహు రిత్యన్వయః । యత స్తత్పూర్వకమేవ చిత్తవృత్తి నిరోధాఖ్యం యోగమపి తమేవవిద్ధి ॥ హేపాండవ! హి యస్మా దసన్యస్త సంకల్పః కశ్చన కశ్చిదపి యోగీ న భవత్యపి నిస్సంకల్ప ఏవేతి యత్కించిదపి సంకల్పాన్నరో దుఃఖే నిమజ్జతీ త్యాదిస్మృత్యంతరాదపి ద్రష్టవ్యమ్. దేహాదీనాత్మత్వే నాభిమన్యతే సో భిమాన ఆత్మనోబంధః । కర్తృత్వా ద్యహంకార సంకల్పో బంధః । దేవమనుష్యాద్యుపాసనా కామసంకల్పోబంధః । అణిమాద్యష్టైశ్వర్యాశాసిద్ధి సంకల్పోబంధః । యమాద్యష్టాంగయోగ సంకల్పోబంధః । కేవల మోక్షాపేక్షాసంకల్పోబంధః । సంకల్పమాత్రసంభవోబంధః॥ ౨

 

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

ఋణత్రయేతి॥ 'దేవోపాసనయా దైవం పైత్రింతు పుత్రతో జయేత్ । ఋషితోపాసనయా త్వార్షం త్రిభిస్తు పరమం జయేదిత్యాది' స్మృత్యుక్త క్రమేణే త్యాశయః॥ ౨॥

—◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము. ◆—

సన్న్యాసయోగములలో శ్రేష్ఠమైనదేదనఁగాఁ జెప్పుచున్నాడు - శ్రీ పాండవా । దోసపండు బంధమును విడిచినట్లు దేవ ఋషి పితృ ఋణములను తీర్చుకొన్న పిదపఁ జేయుకర్మలన్నింటికిని ఫలాభిసంధిని వదలుటయే సన్న్యాసమని శ్రుతులు చెప్పినవి. అట్టిఫలత్యాగమునకుఁ బూర్వము చిత్తవృత్తిని నిరోధించుటయే యోగము. సంకల్పమును వదలక యోగి గాజాలఁడు. సన్న్యాసమని దేనిని నుడువుదురో యదియేయోగమని యెఱుంగుము ఫలవిషయ సంకల్పమును వదలని వాఁడెవ్వఁడును యోగి గాఁజాలఁడు సంకల్పరహితుఁడే యోగియగును. ఏమాత్రము సంకల్పమున్నను బంధమై దుఃఖసాగరమందు ముంచివైచును. బంధమనఁగా దేహేంద్రియాదులు తానుగా నభిమానించుట బంధము. నేను కర్తను భోక్తను అనునట్టి యభిమానము సంకల్పమాత్రమైనను బంధమే. దేవ మనుష్యాదుల నుపాసించు కోరికను సంకల్పించుట బంధము. అణిమాద్యష్టైశ్వర్యములయం దాశపడి యవి నాకు సిద్ధించవలెనని సంకల్పించుట బంధము. యమ నియమాదులయిన యష్టాంగయోగములను సాధించవలయునను సంకల్పము బంధము. నాకేమియు నక్కఱలేదు. మోక్షమొకటియే గావలయునను సంకల్పమున్నను బంధమే. సంకల్పము పుట్టుటయే బంధము. 'మనఏవమనుష్యాణాంకారణంబంధమోక్షయోః।బంధాయవిషయాసక్తంముక్త్యై నిర్విషయం స్మృతః' అనునట్లు బంధమోక్షములకు కారణమైనది మనసొక్కటియే. విషయములయందుఁ దగులుకొనిన మనసు బంధకారణము. విషయ వాస

నలకు చిక్కని మనసు మోక్షకారణమగును. 'మమేతిబధ్యతే జంతుర్నిర్మమేతి విముచ్యతే' బంధమోక్షములు ఒక్కమాటలో నిమిడియున్నవి ఎట్లనఁగా నాది, యనిన బంధము వచ్చుచున్నది. కాది గాదనిన మోక్షము వచ్చుచున్నది. 'మమత్వేన భవే జ్జీవో నిర్మమత్వేన కేవలః' మమకారము గలవాఁడు జీవుఁడగుచున్నాఁడు. మమతలేనివాఁ డీశ్వరుఁడగుచున్నాఁడు (దేవతోపాసనచే దేవఋణమును దీర్చి పుత్రోత్పత్తిచేఁ బితృఋణమును దీర్చి వ్రతోపవాసాదులచే ఋషిఋణమును దీర్చి పరమపదమునుబొందఁగలరు.) ॥౨॥

శ్లో॥ ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణముచ్యతే।
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే॥ 3॥

—♦ భాష్యమ్ ♦—

నన్వస్త్వేవం పరం త్వారురుక్షో ర్మునేః ప్రథమతః కిం కరణీయ మస్తీత్యాహ - ఆరురుక్షోరితి । తత్రైవంసతి। పూర్వోక్త రీత్యా సన్యాస యోగయో రేకఫలకత్వేనాదౌ యోగమారురుక్షో ర్మునే ర్మననశీలస్య శాస్త్రవిహితం కర్మైవ యోగప్రాప్తిసాధకత్వేన కర్తవ్యమితి యుక్తం తథా తస్యైవ యోగారూఢస్య 'శాస్త్రసజ్జనసంపర్క' ఇత్యాదిక్రమేణ పంచమ్యాం భూమికాయాం శమత్వం ప్రాప్య షష్ఠ్యాం భూమికాయాం ప్రాప్స్యతీతి తత్ర శమః కారణ ముచ్యత ఇత్యవధార్యమ్॥ 3॥

—♦ లఘుటిప్పణీ ♦—

శాస్త్రసజ్జనఇతి॥ తథాచేహ । 'శాస్త్రసజ్జనసంపర్కో విచారోఽసంగభావనా । శమతా స్వచ్ఛతా సామ్యా సప్తధా భూమికామతే,

త్యస్య సద్గురుణా శాస్త్రసంపర్క స్తత స్సజ్జనస్య విజ్ఞానప్రదస్య గురో
శ్చ సంపర్క ఇత్యాదిరర్థః॥ క్రమేణేతి । ‘ యదాయదా ప్రత్యగవస్థితం
మన స్తదాతదా ముంచతి బాహ్యావాసనే ’ త్యాదిరీత్యా గురూపదిష్టమార్గేణ
చిత్తవృత్తిం వర్ధయతీ త్యాశయః॥౩॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

ఓయీ ! ఈసన్న్యాసము యోగ మొక్కటే కానిమ్ము, ఆరురుక్షు
వైన ముని చేయవలసినదేదనినఁ జెప్పుచున్నాఁడు. మును జెప్పిన ప్రకా
రము సన్న్యాసమునకును యోగమునకును ఫలమొక్కటియగుటచే ఆత్మావ
లోకనరూపమగు యోగమును బొందనిచ్ఛగించినమునికి శాస్త్రవిహిత కర్మ
యోగమే సాధనము. అట్టి యోగారూఢుఁడు జ్ఞానభూమికలలో అయిద
వదియయిన శమమును బొంది ఆఱవ భూమికయందు జీవన్ముక్తి రూప
మైన కర్మనివృత్తిని బొందుచున్నాఁడు. సద్గురువునొద్ద శాస్త్రసంపర్కము౧
అనుభవజ్ఞానిదగ్గఱజ్ఞానాభ్యాసము. ౨. విచారణ ౩. ఆసంగభావన ౪. శమము
౫ స్వచ్ఛత్వము ౬. సౌమ్యము ౭. ఇవియే సప్తభూమికలు. గురూపదేశ
ప్రకారము ప్రత్యగాత్మానుసంధానమైన కొలది బాహ్యావాసనలు వదలు
నని భావము.

శ్లో॥ యదా హి నేంద్రియార్థేషు న కర్మ స్వను సజ్జతే।
సర్వసంకల్ప సన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే॥౪॥

—♦ భాష్యమ్ ♦—

నన్వేవం కదా స యోగారూఢో భవిష్యతీ త్యాహ -
యదేతి । ఏవంతర్హి యదా యస్మింశ్చిత్త సమాధానకాలే
నిత్య నైమిత్తిక కామ్య లౌకిక ప్రతిషిద్ధే ష్వింద్రియార్థేషు
శైథిల్యే నాత్మధ్యాయీ నానుషజ్జతే। తత స్సర్వసంకల్ప

స్సన్యాసీసన్॥ 'పూజాకోటిసమం స్తోత్రం స్తోత్రకోటి సమో జపః। జపకోటి సమం ధ్యానం ధ్యానకోటి సమోలయః' ఇతి న్యాయేన వృత్తిం వర్ధయతీతి తదా యోగారూఢ ఇత్యుచ్యత ఇత్యర్థః॥ ४॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

ఓయీ ఇట్లుగా యోగారూఢుం డెప్పుడు గాగలండనంగాం జెప్పు చున్నాండు. ఆత్మానుసంధాన పరుడైన యోగి చిత్తైకాగ్ర్యము కలిగి నప్పుడెల్ల నిత్య నైమిత్తిక కామ్య లౌకిక నిషిద్ధ కర్మలయందలవాటును వదలుచు ఆత్మధ్యాన మలవాటుచేయుచు ఇంద్రియములను, విషయముల యందు ప్రవర్తింపజేయక, సర్వ సంకల్పములను, వదలినవాండై, యోగా రూఢుండు గాగలండు. ఏమనంగా? కోటిశివపూజలకు సమమైనది ఒక స్తోత్రము. కోటిస్తోత్రములకు సరియైనది ఒక జపము. కోటి జపములతో సాటియైనది ఒకధ్యానము. కోటి ధ్యానములతో తుల్యమైన దొక మనో లయము. చిత్తవృత్తిని గురూపదేశ ప్రకారము నడిపించుచు, నాత్మాను సంధానము, నెప్పుడెప్పుడు చేయుచుండునో అప్పుడెల్ల లోకవాసన శాస్త్రవాసన దేహవాసనలు తొలంగి యోగి యగును. లోకవాసనయనగా లోకమందెల్లరును, దన్ను నిందింపకుండ వలయుననియు. సదాస్తుతి చేయు చుండవలయు ననియునను, నభినివేశమునకు లోకవాసనయని పేరు. దీని నివృత్తికి మార్గమేదనగా? లోక నిందవలన దనకేమియు హానిగాని స్తుతి వలన ఫలమునుగాని లేదని యెఱుగుటవలన లోకవాసన నశించును. శాస్త్ర వాసన యనంగా? శాస్త్రపఠనమునందును, శాస్త్రార్థజ్ఞానమునందును, శాస్త్రా నుష్ఠానమందును, గల వ్యసన మేదియో యది శాస్త్రవాసన యనంబడును. ఈ శాస్త్రవాసన వలన మోక్షమునకు భంగము గలుగుచున్నది. కాన ముముక్షు వితర శాస్త్రములను వదలి వేదాంత శాస్త్రమునే చదువవల

యును. శాస్త్రవాసనావృత్తి యెట్లనఁగా శాస్త్రోపరతిఁగల్గెనేని శాస్త్ర వాసన నశించును. దేహవాసన యనఁగా? జీవించియుండెడి తన దేహము దీర్ఘకాలముండ వలయు ననియు, దృఢముగాను, సుందరముగాను, ఉండవలయుననియుఁ దలంచి దాని కనువగు, ప్రయత్నములు చేయుట దేహవాసన యనఁబడును. దేహవాసనానివృత్త్యుపాయ మెట్లనఁగా! దేహమునకుఁ గారణము కర్మము. ఆకర్మమున కధీనమైనది దేహము కర్మాధీనమైన దేహము కర్మముండునంతకాల ముండును. ఆకర్మ నశించిన, దేహము కూడా నశించును. దానికిఁ పురుష ప్రయత్నమే మాత్రము సాధనముగాదు. ఈతత్త్వము నెఱింగి దేహమునందుపేక్షవహింపవలయును. ఆయుపేక్షయే దేహవాసనానివృత్తికి మార్గము. ఇట్టివాసనాత్రయ మెప్పుడు దూరమగునో అప్పుడు మనసు పరిత్యాగాత్మను జూచి అందు లయ మగును॥ ४॥

శ్లో॥ ఉద్ధరే దాత్మ నాత్మానం నాత్మాన మవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః॥५॥

—✻ భాష్యమ్ ✻—

అథ మో యద్యైవం యోగారూఢో భవతి తదాత్మనై వాత్మనో ధృతో భవతీ త్యాహ—ఉద్ధరేదితి॥ తత్రైవం సత్యా త్మనా వివేకయుక్తేన మనసా ఆత్మానం జీవం సంసార ముదే పతితం యథోక్త కర్మణో ద్ధరేన్నత్వనవధాన చేతసా త్మాన మవసాదయే దిత్యర్థః। హి, యస్మా త్సంసారబంధనా న్మోచన హేతుర్యథోక్త న్యాయేనాత్మైవ బంధుస్త్రాతా సఏవ చ వైపరీత్యేన జగద్బంధు హేతు రిత్యర్థః॥५॥

## —◆ లఘుటిప్పణీ ◆—

ఉద్ధరేదితి॥ ఏవంసతి। తిష్ఠత్యయం కథం దేహఇతి శంకావతో జడాన్ సమాధాతుం బాహ్యదృష్ట్యా ప్రారబ్ధం వదతి శ్రుతిరిత్యాది స్మృత్యా ప్రారబ్ధం విసృజ్యో 'ద్య మస్సాహసం ధైర్యం బలం బుద్ధిః పరాక్రమః। షడిమే యస్యతిష్ఠంతి ససర్వం ప్రాప్నుయా త్పుమాని'త్యాది స్మృత్యుక్తరీత్యా నిదిధ్యాసనా ప్రాబల్యేన సద్గురూపదిష్టమార్గేణోద్ధరే దేవ నాత్మాన మనవధానచేతసా వసాదయే దిత్యర్థః॥ ౫॥

## —◆ ఆన్ధ్రి తాత్పర్యము ◆—

ఎవ్వఁడీ ప్రకార మెప్పుడుయోగారూఢుండగునో అప్పుడు సాత్విక మనసుచేత ఆత్మ నుద్ధరించినవాఁడని చెప్పుచున్నాడు - ఆత్మానాత్మ వివేకముగల మనసుచే, సంసార సముద్రమందుఁబడిన యాత్మను, వేదోక్త కర్మలచే లేవఁదీయవలెను. (అనఁగా విషయములయందు తగులుకొని యున్నఁ దానెఱుఁగక దేహభ్రాంతి నొందుచున్న జీవుని శివోఽహమని రూఢిచేయుట) కాని యవివేకమయినదియు, విషయపూరితమైన మనసుచే ఆత్మనుద్ధరించలేరు. గురూపదిష్టప్రకారముగా నిదిధ్యాసనా ప్రాబల్యముచేఁ దన్నుఁ దాఁదెలియవలెను. ఇట్లు ఆత్మకుపకారముచేసినందున మనసు ఆత్మకు బంధువు. ఆత్మకుపకారముచేసిన మనసు దేహమునకు విరోధి. దేహమునకుపకారముచేసిన ఆత్మ విరోధి. ఇట్లు దేహాత్మలలో నెవరి కుపకారముజేసినచో వారికి బంధువు రెండవవారికి విరోధియగుట లోకస్వభావమే గదా. దేహ మెందులకు వచ్చినదని యడిగిన మూఢుల శంకకు ప్రారబ్ధ మనుభవించు కొరకనెడి సమాధానము జెప్పిరి. అట్టి ప్రారబ్ధమును త్రోసిపుచ్చి, ఆత్మసాక్షాత్కారము నిమిత్తమై ఉద్యమము సలుపవలెను. ప్రారబ్ధ మనుభవించుటకొరకు దేహయోగము గలిగినందున ఉద్యమము ప్రారబ్ధ ప్రతికూలమై యెంచుకువచ్చుననగా. మూఢులకు

ప్రారబ్ధమున్నదని చెప్పవలెనేకాని, ప్రారబ్ధములేదు. ఉన్నను పురుష ప్రయత్నమందు నశించిపోవును. ఉపమన్యుచరితముదృష్టాంతము. పాలెడు పాలకు గతిలేని యుపమన్యువనెడి పిల్లవాడు, శివునిగురించి తపమొనరించి నందున, ప్రసన్నుడై శివుండు సప్తసముద్రంబుల నిచ్చెనుగదా. ప్రారబ్ధము కన్న పురుషార్ధము గొప్పదిగాన ఉద్యమము సలిపి యాత్మసాక్షాత్కారము నొందవలెను. ఉద్యమము, సాహసము ధైర్యము, బలము, బుద్ధి, పరాక్రమము, ఈ ఆరును యెవరికి గలిగియుండునో అట్టివాడు సర్వమును బొందగలడు. గాన నిర్విషయమగు మనస్సుచే నాత్మనుద్ధరించవలెను గాని, విషయాసక్తమగు మనస్సుచే నధోగతిని బొందింపరాదు. మనస్సు సవిషయము, నిర్విషయము. అని రెండు గతులు. రాగాదులున్నప్పుడు సవిషయము. రాగాదులులేక, వివేకాదులున్నప్పుడు నిర్విషయము. రాగాదులతో గూడిన మనసు, ఆత్మను ఖడించి ముక్కలు ముక్కలుగా జేసి సంసారసముద్రమందు ముంచి వేసినది. (అనగా నేను మానవుడను దేహము అని చెప్పుట) ఇట్టి మనస్సును మనసుచేత నే జయించి, అనగా మనసును మనసే జయించవలెను. "వజ్రం వజ్రేణ భిద్యతాం' అనునట్లు నిర్విషయమనసుచే సవిషయమనసును జయించి సంసార సముద్రమునుండి ఆత్మను ఉద్ధరించవలెను. అనగా శివోహం అని చెప్పుటయే ఆత్మోద్ధారణ. ౫॥

శ్లో॥ బంధురాత్మాఽఽత్మనస్తస్య యేనాత్మైవాత్మనాజితః।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥౬॥

—◆ భాష్యమ్ ◆—

ఇదానీం కింలక్షణ ఆత్మనో బంధుః కిం లక్షణశ్చ రిపురిత్యాహ—బంధురితి, ఏవంతర్హి తస్య జీవస్య బంధురాత్మైవ మనఏవ యతో నర్థేన మనసా ప్రేరితో విమం భుంక్తే కూపే

పతతి యతశ్చ సౌహార్ద్రేన మనసా యథోక్తసాధనేన కైవల్యం గచ్ఛతీత్యాత్మనైవ మనసా జీనాత్మాజిత ఇత్యాత్మ శబ్దస్య హన్యాది వదనేకార్థత్వ మవధార్యమ్, ఏవం దేహ్యంతరస్యా నాత్మనస్తు శతృత్వే త్వాత్మైవ శతృవద్భవేదిత్యత ఆత్మౌప మ్యేన సర్వత్ర సమంపశ్యతి యోర్జున సుఖంవా యదివా దుఃఖ మిత్యాది వద్వివేక్తవ్యమ్ ॥౬॥

## —◆ ల ఘు టి ప్ప ణీ ◆—

అనేకార్థత్వే నేతి॥ ఇహ। ఆత్మా జీవ శ్శివశ్చేతి సమనంతర మేవో క్తత్వాదితి నవిస్మర్తవ్యమ్॥ వివేక్తవ్యమితి। "కైవర్త్యాయథనందత్వా తత్పాపా ద్భూపతర్వాత' ఇత్యాది రాజధర్మా, విరుద్ధ ధర్మావివేకేనైవ ఆ త్మౌపమ్యే నేత్యాది వివేక్తవ్యమిత్యాశయః॥ ౬ ॥

## —◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ◆—

ఇప్పుడు నేను చెప్పిన బంధుత్వ శతృత్వములనే జెప్పుచున్నాడు. మనసు అనర్థమును సంకల్పించి విషమును భక్షించును. (విషయ సౌఖ్యమా అనుభవించును) కూపమందుండును. (సంసారమందు మునుగును) ప్రేమతో గలసి నిది ధ్యాసను జేసి కైవల్యమును బొందును. "శ్లో॥ మనఏవ మను ష్యాణాం కారణం బంధమోక్షయోః బంధాయవిషయాసంగి ము క్త్యై నిర్విషయం మనః మనస్సు విషయము అనుభవింపఁజేసిన జీవునకు బంధువైనది. మనసు శ్రవణ మనన నిది ధ్యాసన సాధనములు వలన శివోహం భావనచే జీవుని జయించినందున శతృవగు మన్నది. ఓయర్జునా! అందఱిని తనతో సమానముగా జూచుకొనవలయును. అన్యుల సుఖదుఃఖ ములు తనవిగా భావించువానికి, "మహాత్మా సర్వభూతాత్మా" అను న్యాయమును బట్టి ముక్తిగలుగును. దేహియే దేహమునకు శతృవు గాన

నీకు శత్రువు నీమనసే గాని దుర్యోధనాదులు గారు. దేహాత్మలను విడదీసి జూడుము. (పల్లెవానికి ధనమిచ్చిన రాజునకు పాతకము సంభవించినట్లు జీవున కుపకారముజేసిన మనసు అధోగతి నొందును.)

శ్లో॥ జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః
శీతోష్ణ సుఖదుఃఖేషు తథా మానావమానయోః॥ 2

—♦ భాష్యమ్ ♦—

నన్వస్త్వేవం పరంతు జితాత్మత్వే కిం ఫలమిత్యాహ— జితాత్మనఇతి॥ ఏవంసతి 'జితాత్మనః ప్రశాంతస్యైవ పరం కేవల మిహాత్మామహద్భయం వజ్రముద్యత మిత్యాది'శ్రుతేః రుద్రశబ్దాభిధేయో ధారయిష్యతి తే వేగ మిత్యాదిస్మృతేశ్చ సదాశివ స్సమాహితో భవతి నాన్యస్యాజితాత్మన ఇత్యత శ్శీతోష్ణ సుఖోనా జితాత్మా ప్రశాంతశ్చ భవేదిత్యర్థః। 2॥

—♦ లఘుటిప్పణీ ♦

మహద్భయమితి॥ భీషాస్మా ద్వాతః పవతే భీషోదేతి సూర్యః భీషాస్మా దగ్నిశ్చేంద్రశ్చ మృత్యుర్ధావతి పంచమ ఇత్యాదిస్మృతిప్రబంధేన రుద్రశబ్దాభిధేయస్య శివస్యైవ సాక్షాత్పరబ్రహ్మరూపత్వం స్ఫుటీకృతమ్॥ 2॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

ఓయీ మనోనిగ్రహము జేయుటయందు ఫలమేమనిన॥ జెప్పుచున్నాఁడు. శీతోష్ణములు సుఖదుఃఖములు మానావమానములు మొదలగు ద్వంద్వములయందు వికారము నొందని పురుషునికి ఆత్మరూపుడైన సదాశివుండు సాక్షాత్కరించును (వాయువు, సూర్యుఁడు, ఇంద్రుడు, అగ్ని

మృత్యువు మొదలయినవారలు, రుద్రుడనునట్టి శివునికి భయపడి, తమతమ పనులు నెరవేర్చుచున్నందున, శివుండే పరబ్రహ్మమని, సర్వశ్రుతి తాత్పర్యము.) ౭॥

శ్లో॥ జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః॥ ౮

—♦ భాష్యమ్ ♦—

నను కీదృశో జ్ఞానవిజ్ఞానయోః జ్ఞాతో యోగీత్యుచ్యతే తదాహ—జ్ఞానేతి తత్త్రివంసతి॥ యచ్ఛాస్త్రీయమాపదేశికం తత్ జ్ఞానమిత్యుచ్యతే విజ్ఞానంతు గుర్వర్కలబ్ధోపనిషత్సుచక్షుషేతిన్యాయే నానుభావికంతువిజ్ఞానమిత్యుచ్యతే। తథాచ తయోర్జ్ఞాతృత్వేన పరే బ్రహ్మణి శివే తృప్తాత్మా సచ పునః కూటస్థో విషయసన్నిధానేపి వికారశూన్య స్తథాజితేంద్రియశ్చ సయుక్త ఇత్యుచ్యతే అతఏవ హేయోపాదేయబుద్ధి శూన్యత్వేన సమానాని మృత్పిండపాషాణకాంచనాని యస్య స యోగీ పరహంసఇత్యాఖ్యాయతే జనకాదివదిత్యవధార్యమ్॥౮

—♦ లఘుటిప్పణీ ♦—

జనకాదివదితి॥ తద్యథా॥ రాజాతు వైదికా న్సర్వాం స్త్రాం త్రికాన్ఖిలానపి అసంకీర్ణతయా నిత్యం స్థాపయే న్మతిమత్తమాః అన్నపానాదిభిర్వస్త్రైస్సర్వాన్రాజాభిరక్షయేత్ వైదికస్తు విశేషణ జ్ఞానినస్తు విశేషత ఇత్యాదిద్రష్టవ్యమ్॥౮॥

## —♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

ఓయీ , జ్ఞానవిజ్ఞానములుగల యోగి యెట్టివాఁడనగా? చెప్పు చున్నాఁడు- ఇచ్చట దేహముకంటె వేరైన ఆత్మయొకటి కలదను బుద్ధియే జ్ఞానము దృగ్దీక్షా, స్పర్శదీక్షా, వాగ్దీక్షలచే గురూపదేశము శాస్త్రమందు పఠించిన ప్రకారము, తాను, అనుభవించినది, ఏకమగునట్లు చూచుట విజ్ఞానము. అట్టివిజ్ఞానము తెలియుటచేత పరబ్రహ్మమైన శివునియందు సంతృప్తుడై, కూటస్థు డనిపించుకొనును. కూటమనగా ? సమ్మెట. కూట మునకు ఇనుము మొదలయినవాటితోడి సంయోగవియోగములు గలిగి నను, ఆయినుము మొదలయినవియే చెడుచు మారుచునుండును గాని, తాను జెడకయు ఏవికారమును జెందకయు. ఎట్లుండునో అట్లే ఆత్మకు దేహాది శరీరములతో సంయోగవియోగములు కలుగుచుండినను ఆశరీర ములే చెడుచు మారుచుండును గాని, తాను తన జ్ఞానైకస్వరూపమును జెడక యనువర్తించు చుండుటచే వికారమును బొందకయుండును కావున ఆత్మకూటముగా జెప్పబడినది. కూటస్థుడనగా ఆత్మయందు నెలకొన్న వాడు విషయములు ప్రాప్తించినను వికారము నొందనివాడు జితేంద్రి యుఁడు, మృత్పిండమందును, రాయియందును. బంగారునందును, సమ బుద్ధిగలవాడు. గనుకనే ఇతనికి స్వీకరించునది, పరిహరించునదిన్నీ లేను గాన ఇతడు యుక్తయోగియనిపించుకొనును. యోగులు, యుక్తయోగులు, యుంజానయోగులు నని రెండు విధములు. శంకరుడు యుక్తయోగి తదిత రులందరును యుంజానయోగులు. శివత్వము నొందిన వారలున్నూ యుక్తయోగులే; గాన ఇతడు యుక్తయోగియని చెప్పబడును. (రాజు వైదికులను తాంత్రికులను వేర్వేరుగా నుంచి అన్నపానవస్త్రాదులచే బూజించవలయును. వైదికుని విశేషముగాను. అంతకంటె విశేషముగా జ్ఞానినిన్నీ బూజించవలయును.

శ్లో॥ సుహృన్మిత్రా ర్యుదాసీన ద్వేష్యమధ్యస్థ బంధుషు
సాధుష్వపిచ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే॥ ౯

—◆ భాష్యమ్ ◆—

నను తస్య యోగినః కింస్వరూపలక్షణ మస్తీ త్యాహ సుహృదితి। తత్రతావత్ ప్రత్యుపకారక సుహృది త్యుచ్యతే। మిత్రే స్నేహవతి అతితాటస్థ్యేన స్వస్వమానవృత్తిః। తత్రా రిస్స్వభావ క్రౌర్యేణా పకర్తా ఉదాసీనో వివదమానయో రుభయో రప్యుపేక్షకః। మధ్యస్థోపి వివదమానయోరపి తయో ర్హితైషీ। తత్ర ద్వేష్యస్తు కృతాపకారకః। తథా బంధు స్సంబంధే నోపకారకః। ఏవం చైతే ష్వష్టవిధేషు తథా సాధుషు శాస్త్రవిహితకారిషు పాపేషు తత్ప్రతిషిద్ధకారిషు చ కారాద న్యేషు చ సర్వేషు సమబుద్ధి ర్విశిష్యత ఇత్యర్థః॥౯॥

—◆ లఘుటిప్పణీ ◆—

సమబుద్ధిరితి॥ సాచ పాశాష్టకం త్యక్త్వైవ భవతీతి పురాణసము చ్చయే। తద్యథా 'ఘృణా శంకా భయం లజ్జా జుగుప్సా చే తి పంచమం కులం శీలం చ విత్తం చేత్యష్టౌ పాశాః ప్రకీర్తితా' ఇత్యాది ద్రష్టవ్యమ్॥౯

—◆ ఆన్ధ్ర తాత్పర్యము ◆—

ఓయీ? అట్టియోగి యొక్క స్వరూపలక్షణమేమనగా చెప్పు చున్నాడు—వయస్సును పాటింపక తనహితమును గోరునట్టి సుహృదుల యందును, సమానవయస్కులై తన హితవును గోరు మిత్రులయందును, నేదేని నొకకారణమునుబట్టి అనర్థమును గలిగింపగోరు శత్రువులయందును హితమును గాని అనర్థమునుగాని కలిగించుటకు హేతువులేమిచే నారెంటిని

జేయనివారగు ఉదాసీనులయందును, జన్మసిద్ధముగా అరెంటిని జేయని వారగు మధ్యస్థులయందును, జన్మసిద్ధముగా అనర్ధమునుజేయగోరు ద్వేష్యులయందును, సంబంధమునుగోరు బంధువులందును, ధర్మశీలురయందును, పాపశీలురయందును, సమానబుద్ధిగలవాడు, అధికుడగుచున్నాడు (సమబుద్ధియనగా అష్టపాశములను వదలినవాడని పురాణసముచ్చయమందు గలదు. అష్టపాశములనగా? దయ,శంక భయము, లజ్జ, నింద; కులము శీలము, విత్తము, ఈయెనిమిదిన్ని గలవాడు బద్ధుడు)॥౯॥

శ్లో॥ యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః ॥౧౦

—♦ భా ష్య మ్. ♦—

అథ యోగారూఢస్య లక్షణముక్త్వా తత్ప్రకార మప్యాహ—యోగీతి॥ తత్రైతావ ద్రహసి స్థితస్సన్ సతత మాత్మానం శివం యుజీతే త్యర్థః సచ పునరేకాకీ నిరాశీ రపరిగ్రహశ్చ యతచిత్తాత్మా భవతీత్యర్థః ॥౧౦॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

రహసిస్థితఇతి॥ "ఏకాకినా సముపగమ్య వివిక్తదేశం ప్రాణాత్మరూప మమలం పరమార్థతత్వం। లభ్యాశినా ధృతిమతా హృదిభావితవ్యం సంసారరోగ హరమౌషధ మద్వితీయమ్॥ ఇత్యాది రీత్యా యోగమభ్యసేత్-అజ్ఞస్తు శుభ్రశివస్థానేఽస్మిన్ స్థితోపి స్వాత్మమాయయా దుఃఖాదిసాగరే ముహ్యామానశ్చ శోచతి 'అధిష్ఠానం సమస్తస్య జగత స్సత్యచిద్ఘనం। సోహమస్మీతి నిశ్చిత్య వీతశోకో భవత్యయ మిత్యధిక మన్యత్ర విస్తరః॥ ౧౦॥

## —♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

ఇంతవరకు యోగారూఢుని లక్షణమును జెప్పి యోగముచేయు ప్రకారము చెప్పుచున్నాడు. యోగాభ్యాసము చేయువాడు రహస్య స్థల మందు గూర్చుని దన్ను శివునిగా సర్వదా భావించుచుండవలయును. (స్వబ్రహ్మచారులను తనవద్ద నుండనీయక లఘ్వాహారమును భుజించుచు దారేషణ పుత్రేషణ ధనేషణల విడచి దేహేంద్రియ మనః ప్రాణముల నియమించిన యోగికి జనన మరణ రూపసంసారరోగము నివృత్తియగును. అజ్ఞాని ఉత్తమమైన మానవజన్మమెత్తిన్ని, స్వాత్మమాయచే దుఃఖాది సాగరమందు మునుగుచున్నాడు. ఈసమస్త జగత్తునకు అధిష్ఠానము సచ్చి దానందము. అట్టి సచ్చిదానందరూపుడైన శివుడే నేనని నిశ్చయించి దుఃఖరహితుడగుచున్నాడు.)॥ ౧౦॥

శ్లో॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః
　నాత్యుచ్ఛ్రితం నాతి నీచం చేలాజిన కుశోత్తరమ్ ॥౧౧॥

## —✻ భాష్యమ్ ✻—

అధ తత్ర యోగాభ్యాసేత్వాసనాదేర్నియమందర్శయతి శుచావితి॥ తత్రాదా జనసముదాయరహితే నిర్భయేశుచౌ దేశే ఆత్మన శ్శరీరాత్మన ఆసనం స్థిరం నిశ్చలం ప్రతిష్ఠాప్యాత్మవిశుద్ధ యే యోగం యుఞ్జ్యాదితి పరేణాన్వయః। తత్రాసనంతు నా త్యుచ్ఛ్రితం నాత్యుచ్చం నాప్యతినీచం చేలాజినం చ వ్యుత్క్రమేణ కుశోత్తరం బోధ్య మిత్యర్థః॥ ౧౧॥

## —♦ లఘుటిప్పణీ ♦—

శుచౌదేశఇతి॥ సురాజ్యే ధార్మికే దేశే సుభిక్షే నిరుపద్రవే । ధనుః ప్రమాణ పర్యంతే శిలాగ్ని జలవర్జితే" । ఇత్యేవం రూపే శుచౌదేశ

ఇత్యర్థః । వ్యుత్క్రమేణేతి । కుశోత్తర మజినం చేలంచేత్యర్థః॥"పాషాణే మృత్యు మాప్నోతి । కాష్ఠే నానావిధాన్ గదాన్, కృష్ణాజినే జ్ఞాన సిద్ధి ర్మోక్షశ్రీ ర్వ్యాఘ్రచర్మణి వంశాసనేతు దారిద్ర్యం ధరణ్యాం దుఃఖ సంభవః । తృణాసనే యశోహానిః పల్లవే చిత్తవిభ్రమః శ్వేతవస్త్రే యశోవృద్ధి స్సర్వార్థీ చిత్రకంబళే॥ ఇత్యాదిద్రష్టవ్యం॥ ౧౧॥

## —◆ ఆన్ధ్రతాత్పర్యము. ◆—

యోగాభ్యాసమందు ఆసనములనియమమును చెప్పుచున్నాడు- సుభిక్షమై ధర్మభూయిష్ఠమైన మంచిరాజ్యమందు జనసముదాయంలేని ప్రదేశ మందు దుష్టమృగాద్యుపద్రవములు లేనట్టిది గాను. రాళ్లు, అగ్ని, జలము లేనట్టిదియునగు ధనుః ప్రమాణభూమిని గోమయాదులచే శుభ్రపరచి, విస్తారమెత్తునుగాక పల్లమునుగాని పీఠమును స్థాపించి బెణకకుండగా చేసి (విస్తారమెత్తైన ఎడల అభ్యాసయోగి ప్రాణాయామమందు పైకిలేచి క్రిందపడునుగాన దెబ్బతగలకుండా నుండుటకు యెత్తుగానుండరాదు. మిక్కిలి పల్లముగా భూమితోసమముగానున్నయెడల చీమలు మొద లయిన జంతువులు శరీరమందుప్రాకిన యోగభంగమగును) దానిపై దర్భా సనము, దానిపైన వ్యాఘ్రాజినము (మోక్షప్రదము) లేక కృష్ణాజినము (జ్ఞానప్రదము) వైచి (రాతియందు యెపుడును గూర్చుండరాదు. మరణము సంభవించును. దార్వాసనమందు రోగముపుట్టును, వెదురుఆసనము దారిద్ర్యము భూమియందు దుఃఖము గడ్డియందు కీర్తి నశించును. చిగురుటాకుల యందు చిత్తభ్రాంతి తెల్లవస్త్రమందు కీర్తి, చిత్రాసనమందు సర్వకామ్యములు సిద్ధించును. తనకనుకూలమైన యాసనము సిద్ధపరచుకొనవలయును.

శ్లో॥ తత్రైకాగ్రం మనఃకృత్వా యతచిత్తేంద్రియక్రియః
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగమాత్మ విశుద్ధయే ॥౧౨॥

—• భా ష్య మ్ •—

ఏవ మాసనంకృత్వా కింకుర్యా దిత్యాహ—త త్రేతి। తథాచ। తత్రైవాసనే ఉపవిశ్య మనశ్చ యతచిత్తేంద్రియ క్రియస్సన్నైకాగ్రం కృత్వాయోగం యుంజ్యాదితి పునరన్వయః॥

—• ఆం ధ్ర తా త్ప ర్య ము •—

ఇట్లా సనమును సిద్ధపరచుకొని యేమిచెయ్యవలెననగా చెప్పుచున్నాడు. అట్టియాసనముపై కూర్చుండి నిశ్చలచిత్తుడై జితేంద్రియములయొక్క పనులను నియమించి ఆత్మశుద్ధికై యోగమును ప్రారంభింపవలయును.౧౨.

శ్లో॥ సమం కాయ శిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః
సంప్రేక్ష్య నాశికాగ్రం స్వం దిశశ్చా నవలోకయన్ ॥౧౩॥

—• భా ష్య మ్ •—

అథ తదర్థ మాంతర మాసన ముక్త్వాబాహ్యం శరీర ధారణ మప్యాహ । సమమితి। తత్రతావ త్కాయ శిరో గ్రీవ మచలం యథా స్యాత్త థాసమం ధారయన్ స్థిరశ్చసన్స్వం నాసికాగ్రం సంప్రేక్ష్య దిశశ్చానవలోకయన్ కాష్ఠవ ద్వ్యష్టివ చ్చాసీ తే త్యుత్తరేణ సంబంధః॥౧౩॥

—• ల ఘు టి ప్ప ణీ •—

నాసికాగ్రమితి॥ ఏతదుక్తం॥ చిదాకాశమయం లక్ష్యం కృత్వా చిన్మాత్రి మవ్యయమ్ దృష్టి స్తత్రైవకర్తవ్యా ననాసాగ్ర విలోకనే ఇత్యేవధార్యమ్॥౧౩॥

## ఆ ధ్రి తా త్ప ర్య ము

ఇట్లు ఆంతరంగికాసనమును జెప్పి బాహ్యశరీరస్థితిని జెప్పు చున్నాడు. దేహమును, శిరస్సును, కంఠమును, సరిగా కదలకుండ నిలిపి స్థిరుడై దిక్కులుపరికింపక ఖేచరీ భూచరీ మధ్యలక్షణముల (నాసికాగ్ర దృష్టి భూచరియును, నాసామూలము ఖేచరియును, నాసామధ్యము మధ్యలక్ష్యము) లో నాసికాగ్రమును వీక్షించుచుండవలయును కణ్బవరె కదలగూడదు. ఇచ్చట యోగికి ప్రారంభదశగనుక బాహ్యలక్ష్యము జెప్పబడినది. ఆంతరంగిక లక్ష్యమును అనగా నాశరహితమైన చిద్రూప మైన చిదాకాశమును జూడవలెను గాని ముక్కుకొన నేమియు నంటుకొని యుండదు. యెందుకు చెప్పెననగా ముందుగా నాసికాగ్రదృష్టిఇటునటు జూడకుండుటకుగాను జెప్పబడినది॥౧౩॥

శ్లో॥ ప్రశాంతాత్మా విగతభీ ర్బ్రహ్మచారి వ్రతేస్థితః।
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీతమత్పరః ॥౧౪॥

## భా ష్య మ్

నను పునః కథంభూతస్సన్ పరాత్మానం శివం ధ్యాయే దిత్యాహ—ప్రశాంతేతి॥ తథాచ ప్రకర్షేణ శాంతఆత్మా అంతఃకరణం యస్యసః। ఏవం శాస్త్రీయనిశ్చయదార్ఢ్యా ద్విగతభీః తథా బ్రహ్మచారీ కాంతా నపేక్షితవ్రతే స్థితః ఏవం 'యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథాగురావితి' శ్రుతిన్యాయేన మద్యైన పరమశివతత్త్వేప దేష్టరి గురౌ చిత్తం యస్య సః యతోహమేవ దోర్ధ్రుత్వేన పరం సాధనంయస్య సమత్ప

శస్సన్ గీతార్థామృతే సదాశివే యుక్తస్స న్నాసీ తేతి పరమార్థః ॥౧౪॥

## —◆ లఘు టిప్పణీ ◆—

దోగ్ధృత్వే నేతి॥ 'సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః పార్థో వత్స స్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహ'దిత్యత్ర దోగ్ధృత్వేన పరం సాధన మిత్యర్థః॥౧౪॥

## —◆ ఆన్ధ్ర తాత్పర్యము ◆—

ఓయీ! ఏలాటివాడై పరమాత్మయైన శివుని ధ్యానించవలయుననగా చెప్పుచున్నాడు. కామక్రోధాదులు లేక మిక్కిలి శాంతమైన అంతఃకరణాలో భీతిలేక బ్రహ్మచర్యవ్రతమందుండి, అనగా పెండ్లికాకపోవుటయే గాదు. 'బ్రహ్మచర్యంచ యోషిత్సు భోగ్యతా బుద్ధివర్జనం'। స్త్రీలయెడల భోగ్యతాబుద్ధిలేమి, 'స్మరణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణం। సంకల్పో ధ్యవసాయశ్చ క్రియానిర్వృతి రేవ చ। ఏతన్మైథున మష్టాంగం ప్రవద న్తి మనీషిణః। విపరీతం బ్రహ్మచర్య మేతదేవాష్టలక్షణం'॥ అగ్నిపురాణము। మైథునముయొక్క అష్టాంగములగు సంకల్పాదులు లేకుండుటయే బ్రహ్మచర్యము. దేవునియందు భక్తి ఉంచినట్లు గురువుయందును భక్తి నుంచవలెను. గనుక పరమశివతత్వమైన గీతామృతమును దోగ్ధ (పితికెడు) యైన నాయందును ముఖ్యసాధనముగాన అసక్తుడవైయుండి గీతార్థామృతమైన సదాశివునియందును మనసునుంచి ధ్యానించుచుండుము॥ ౧౪॥

శ్లో॥ యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః।
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి॥ ౧౫

—* భా ష్య మ్ *—

ఏవంసతి॥ పూర్వోక్తం సమాధిమే వోపసంహరన్నా హ—యుంజన్నితి॥ ఏవంతత్వార్త్యభ్యాస వైరాగ్యాభ్యాం పరే బ్రహ్మణి శివే నియతం మానసం యస్య స యోగీ సదాత్మానం శివం యుంజన్ సన్నహమేవ ధ్యానకర్తృత్వేన స్థితో యస్యాం తాం శాంతిం నిర్వాణపరమాం నిర్గుణాఖ్యాంమత్సంస్థామధిగచ్ఛతీ త్యర్థః॥౧౫॥

—* ల ఘు టి ప్ప ణీ *—

ధ్యానకర్తృత్వే నేతి॥ తదుక్తం కూర్మపురాణే॥ 'కృష్ణఏవహి ప్రష్టవ్యో యష్టైశ్చైవ సనాతనః। సర్వరూపం భవం జ్ఞాత్వా లింగం యో ర్చయతిప్రభు మత్యాది పరమేశ్వరో జ్యోతిర్మయో లింగరూపతయో పాసకానాం హృదయమధ్యే తిష్ఠతీతి ప్రమితాధికరణే సూత్రభాష్యే ప్యుక్తం బ్రహ్మాండదేవాలయ మధ్యసంస్థం పిండాండగర్భాలయచిత్తపీఠే విభాసమానం వితతం స్వకీయ చైతన్యలింగం శివ మాశ్రియామః ఇత్యాది బహుశః॥౧౫॥

—♦ అ న్వి తా ర్థ ము ♦—

ఈలాఅయితే వెనుక జెప్పిన సమాధిని ఉపసంహరించుచు చెప్పు చున్నాడు—అభ్యాసముచేతను వైరాగ్యముచేతను పరబ్రహ్మమైన శివుని యందు నిశ్చితమైన మనసుగల యోగి దన్ను శివునిగా భావించుచు అర్జునా! నేను యేనిర్గుణపరమపదమందు శివారాధనయం దున్నప్పుడు గల శాంతస్థితిని బొందితినో అట్టి శాంతస్థితిని బొందుచున్నాడు. సర్వవ్యాపక

డైన శివుని లింగరూపునిగా దెలిసి యేకృష్ణుఁడు బూజించుచున్నాఁడో అట్టి సనాతనుడైన కృష్ణునడిగియే శివజ్ఞానమును తెలుసుకొనవలయునని కూర్మపురాణమునందు గలదు. పరమేశ్వరుఁడు జ్యోతిర్మయుఁడై లింగరూపముతో నుపాసకుల హృదయమధ్యమందు గలడు. బ్రహ్మాండమనునది యొక దేవాలయము అందు పిండాండమనునది గర్భాలయములో చిత్తమను పీఠమందు జ్యోతిర్మయుడై ప్రకాశించుచున్న చైతన్యమును లింగరూపుడైన శివుని మేమాశ్రయింతుమని స్మృతి ప్రమాణముచే శివుడు లింగరూపుడైన పరమాత్మయని తెలియనగును.౧౫

శ్లో॥ నాత్యశ్నతస్తు యోగో స్తి న చైకాంత మనశ్నతః।
న చాతి స్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున !॥ ౧౬

—♦ భా ష్య మ్ ♦—

ఏవం యోగాభ్యాసనిష్ఠస్య ఆహారాది నియమమప్యాహ। నాత్యశ్నత ఇతి। తత్ర తావల్లోభేనాధిక మశ్నతో నచైకాంత మనశ్నతో నాప్యత్యాహారా దప్యల్పాహారాద్వా యోగః। 'అర్థం సవ్యం జనాన్నేన తృతీయ ముదకేనతు॥ వాయో స్సంచరణార్థంతు చతుర్థ। మవశేషయేత్'। ఇత్యాది స్మృత్యుక్తరీత్యా శ్నీయాదిత్యర్థః। ఏవం హేఅర్జున నచాతిస్వప్నశీలస్య నచాతిజాగ్రతశ్చేత్యాది ప్రతిబంధకయుక్తస్య యోగినో యోగో స్తీతిభావః।తదుక్తం మార్కండేయపురాణే॥"నాధ్మాతః। క్షుధితశ్శ్రాంతో నచ వ్యాకులచేతనః।యుంజీతంయోగం రాజేంద్రయోగీ సిధ్యర్థ మాత్మన ఇత్యాది బహుశః॥౧౬॥

## —♦ లఘుటిప్పణీ ♦—

స్మృత్యుక్తేః॥ నతు 'మృతా నారీ దరిద్రైస్తుదూషితాః పాపబిద్ధః స్వాద్వన్న భక్ష్యకామేన వేషం ధృత్వా పరాఙ్ముఖా' ఇత్యేవం స్మృత్యుక్తరీత్యేర్థః॥ సిద్ధ్యర్థమాత్మానమితి॥ ఏవంతర్హి । శమశ్చైవ దమశ్చైతి తితిక్షా శ్రద్ధయాన్వితా । సమాధానం ముముక్షుత్వం షట్సంపత్తిస్తు సిద్ధయే' ఇత్యాది స్మృత్యుక్తప్రకారేణాత్మనో యోగసిద్ధ్యర్థం యోగీ యుంజీతేత్యర్థః॥ ౧౬॥

## —♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

యోగాభ్యాసనిష్ఠునకు ఆహారాదినియమము నున్నా జెప్పుచున్నాడు. అర్జునా! అపరిమితముగా భుజించువానికిని, యెప్పుడును భుజింపకయే యుండువానికిని, అతినిద్రాసక్తునకు నిద్రలేకయే మేలుకొని యుండు వానికిని ఈ యోగము సిద్ధింపజాలదు. మితమైన భోజనము గలిగి యుండవలెను. అనగా! రెండుభాగములు అన్నముచేతను ఒక్కభాగము జలముచేతను నాల్గవభాగమును వాయుసంచారముకొరకు కాళీగా నుంచవలెను. ఊనువాడుగాకయు ఆకలిగొన్నవాడుగాక అలసినవాడుగాక వ్యాకులచిత్తుడునుగాక యోగసిద్ధికొరకు యోగము నభ్యసించవలయును. (భార్య మృతనొందిన పిదప దరిద్రులైన పాపులు రుచిగల పదార్థములు భుజింపనిచ్ఛతో సాధువేషమును ధరించినవారికి యోగము రానేరదు. శమము, దమము, శ్రద్ధతో గూడిన తితీక్షా సమాధానము, ముముక్షుత్వము, యీ ఆఱును గలవారికే యోగము సిద్ధించును.) ౧౬

శ్లో॥ యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా॥ ౧౭

—♦ భాష్యమ్ ♦—

నన్వేవమపి తం కథంకుర్యాదితి స్పష్టం కుతో నోచ్యత ఇత్యాహ—యుక్తేతి। తథాచ యుక్తౌ నియతావాహారవిహారౌ యస్య స తస్య ఏవం యుక్తా నియతా చేష్టా శరీరార్థం కర్మసు ప్రవృత్తి ర్యస్య తథా యుక్తౌ నియతౌ స్వప్నావబోధౌ యస్య సతస్యైవ యుంజతో యోగినో యోగో దుఃఖహా సంసారబంధ నివృత్తిప్రయోజక ఇత్యర్థః॥౧౭॥

—♦ లఘుటిప్పణీ ♦—

అథ తత్ర సాధనాన్యపి కతివిధానీతి వక్తుం వివృణోతి। తథాచేత్యాది। స్పష్టమన్యదితివివేకః॥ ౧౭

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

యుక్తాహారవిహారమును యుక్తకర్మవ్యాపారమును యుక్తనిద్రయును యుక్తజాగరణమును గలిగిన యాతనికి సర్వదుఃఖహారమగు నట్టి యోగములభించును. సంసారబంధమున్ను తొలగును॥ ౧౭॥

శ్లో॥ యదా వినియతం చిత్త మాత్మ న్యేవావతిష్ఠతే,
నిస్పృహ స్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా॥౧౮

—♦ భాష్యమ్ ♦—

ఏవం సంప్రజ్ఞాతసమాధి మభిధాయాసంప్రజ్ఞాతసమాధి మప్యాహ—యదేతి॥ తత్రైవంసతి।యదా యస్మిన్కాలే విశే

షేణ నియతం వృత్తినిరోధేన నిగృహీతం చిత్త మాత్మన్యేవ నిష్కళే శివేఽవతిష్ఠతే తదా తస్మిన్ సర్వవృత్తినిరోధకాలే యుక్తో యోగీ సమాహిత ఇత్యుచ్యతే। తత శ్చైవంభూతో య స్స సర్వకామేభ్యో నిస్పృహోనామ సర్వేభ్యో దృష్టాదృష్టకామేభ్యో దోషదర్శనేన నిస్పృహో యాతృష్ణా సా నిర్గతా యస్య స పరం వైరాగ్య మాశ్రిత ఇత్యర్థః॥౧౮॥

—♦ లఘు టి ప్ప ణీ ♦—

దృష్టాదృష్టేతి॥ తదేతత్సాంఖ్యామృతేఽప్యుక్తమ్। తద్యథా। తద్యథేహేతి శ్రుత్యాపి స్వర్గోపి దృష్టవద్భవేత్ క్షయాతిశయయుక్తత్వాచ్ఛిక్షానం తతో మత మిత్యాది ద్రష్టవ్యమ్। పరం వైరాగ్యమితి। తద్యథా, "త్యాగః ప్రపంచభూతస్య చిదాత్మ త్వావలోకనాత్। త్యాగోహి మహతాం పూజ్యో౽సగిరి ర్నగుహాంతరమితి" అతఏవ పితు రాజ్ఞయా పరీక్షార్థమాగతం శుకంప్రతి మృచ్చర్మణా పరీధానో శివ న స్త్వం కథం త్యజేః। తస్మా న్మనోమయం విశ్వం త్యక్త్వా యాస్యసి తత్పదమిత్యాది జనకేనో క్తమితి వివేక్తవ్యమ్॥ ౧౮॥

—♦ ఆ న్వ్ర తా త్ప ర్య ము ♦—

ఇంతవరకు సంప్రజ్ఞాతసమాధినిజెప్పి ఇప్పుడు అసంప్రజ్ఞాతసమాధిని జెప్పుచున్నాడు—యెప్పుడు చిత్తవృత్తిని నిరోధించి నిష్కళశివుని యం దంటుచున్నాడో ఆట్టివృత్తి నిరోధకాలమంను నెలకొనియున్న యోగి, సమాహితుడనిపించుకుంటున్నాడు. ఐహికాముష్మిక భోగవాంఛ లేనందువలన అన్నికోరికలయందు నిస్పృహుండై శివజ్ఞానమందు నెలకొని దృఢవైరాగ్యముతో నుండును. ఏమనగా కామ్యములన్నియు దృష్టఫల

ము లే అదృష్టఫలమైనము క్తి యందును ఆపేక్ష లేదు॥ కామ్యములయందు దోషముండుటచేత నిస్పృహుడై వైరాగ్యము నొందెను. మనఃప్రపంచము నంతయును మనస్సును బుద్ధిని ప్రజ్ఞను వదలిన యవస్థ యసంప్రజ్ఞాత సమాధియనియు నట్టియోగయుక్తుడు యోగియు నగుచున్నాడు. స్వర్గమున్నాదృష్టఫలమే నాశముగలదేగాన శివజ్ఞానము శ్రేష్ఠమైనది॥ త్యాగమనగా ప్రపంచమును త్యజించవలయును తాను చిన్మాత్రుడైన శివుడని తెలిసి దేహేంద్రియప్రపంచమును నేను గాదని విడువవలయును. మహాత్ములకు త్యాగమే పూజనీయమైనది. పర్వతములయందు నివసించుటయు గుహావాసము జేయుటయు త్యాగము గాజాలదు. తండ్రియైనవ్యాసుని యాజ్ఞచే పరీక్షార్థమువచ్చిన శుకునిగురించి జనకుడిట్లుపదేశించెను. మృత్తికచేతను చర్మముచేతను ఆచ్ఛాదితమైన జీవుడవైన నీవు దేనిని త్యజించగలవు దేనిని వదలలేవుగాన మనఃప్రపంచమును వదలితివేని శివపదమునొందగలవు.౧౮॥

శ్లో॥ యథా దీపో నివాతస్థో నేంగతే సోపమాత్మనః ।
　　యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః౹౧౯

—♦ భా ష్య మ్ ♦—

తత్రాసంప్రజ్ఞాతస్యాస్యసమాధేర్లక్షణం దృష్టాంతేనావధారయతి । యథేతి॥ తత్రతావద్యథా, వాతేన రహితే దేశే దీపో నేంగతేచనకంపతే । తథా యోగం యుంజతో యోగినో యతచిత్తస్యాత్మనో మనస సోపమా స్మృతేత్యన్వయః। తద్యథా । యోగీ సమాధికాలే తు నశ్రుణోతి నపశ్యతి । నజిఘ్రతి నజానాతి తత్పదం కింవిభావయేతి లక్షణఘటితో౽సంప్రజ్ఞాతో బోధ్యః॥౧౯॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

అసంప్రజ్ఞాతలక్షణమును దృష్టాంతముతో జెప్పుచున్నాడు. గాలి లేనిచోట దీపమునిశ్చలమై (పఘత్తో గూడియుండు ప్రకారము మనస్సునకు ఆత్మవ్యాపారముదప్ప దక్కిన చింత మొదలయిన వ్యాపారములెల్ల నివర్తించుటచే ఆత్మసాక్షాత్కారమును చేయుచున్నయోగియొక్క ఆత్మస్వరూపమునకు నివాతదీపము ఉపమగానుండునని (సమాధిదశనుదర్శించు యోగులు) చెప్పుదురు. ఇదిఅసంప్రజ్ఞాతసమాధి సంప్రజ్ఞాతమనగా ప్రపంచమును దెలిసేది (సవికల్పకసమాధి) ఆసంప్రజ్ఞాతమనగా ప్రపంచమును దెలియనిస్థితి ఈయోగి సమాధికాలమందు చెవులతో వినుటలేదు కన్నులతో చూచుటలేదు. తెలియుటలేదు. అఘ్రాణించుటలేదు. గనుక అసంప్రజ్ఞాత సమాధి యని తెలుసుకొనేది॥ ౧౯॥

శ్లో॥ యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి॥ ౨౦

—♦ భా ష్య మ్ ♦—

ఏవం సామాన్యేన సమాధిద్వయముక్త్వా నిరుద్ధసమాధేర్లక్షణమప్యాహ—యత్రేతి । తథాచ యత్రయస్మిన్పరిణామవిశేషే యోగసేవయా యోగాభ్యాసపాటవేన నిరుద్ధం సచ్చిత్త ముపరమతే నిరింధనాగ్నివ దుపశామ్యతి । పునశ్చాంతతో యత్ర చైవాత్మనాంతఃకరణ్ధేనసహ వృత్తివ్యాప్త్యాత్మానంసదాశివం తురీయం పశ్యన్నాత్మన్యేవ యస్మిన్నోతమిదం ప్రోతం విశ్వం శాటీవ తంతుష్వి త్యాది స్మృతిగమ్యే పరశివే। సమాధి

నిర్ధూతమలస్య చేతసో నివేశితస్యాత్మని యత్సుఖంభవేత్ । న శక్యతే వర్ణయితుం గిరా తదా యదేతదంతః కరణేన గృహ్యతే॥ న సుఖం దేవరాజస్య న సుఖం చక్రవర్తినః యత్సుఖం వీతరాగస్య మునే రేకాన్తవర్తినః। ఇత్యాది స్మృతిన్యాయేన చ తత్ర నిరుద్ధాఖ్యే కైవల్యసమాధౌ తుష్యతీతి తాత్పర్యమ్॥

—♦ లఘుటిప్పణీ ♦—

వృత్తివ్యాప్త్యేతి॥ "బ్రహ్మణ్యజ్ఞాన నాశాయవృత్తివ్యాప్తిరపేక్షితా ఫలావ్యాప్యత్వమేవాస్య శాస్త్రకృద్భిరుదాహృత" మితి తథాంతః కరణవృత్తౌ స్వతఏవ స్ఫుటం భాసమానత్వం వృత్తివ్యాప్యత్వం తథాంతఃకరణవృత్తౌ తద్గతచిదాభాసేన భాసమానత్వం ఫలవ్యాప్తమితి వివేకః తాత్పర్యమితి।గజ్ఞానస్థో ధపరివ్రజన్నిత్యాది లక్షణలక్షితే సమాధౌ తిష్ఠతీతి తాత్పర్య మిత్యర్థః॥ ౨౦॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

ఈప్రకారము సామాన్యముగా సంప్రజ్ఞాతాఽసంప్రజ్ఞాతలక్షణములం జెప్పి ఇప్పుడు నిరుద్ధసమాధిలక్షణమును జెప్పుచున్నాడు॥ యేనిరుద్ధ సమాధియందు యోగాభ్యాసమందలి నేర్పుచేత అరికట్టబడిన చిత్తము కట్టెలులేని అగ్నివలె శాంతినొందునో యెక్కడ అతఃకరణతో బ్రహ్మాకారవృత్తి వ్యాపించి తురీయరూపుడైన సదాశివుని యపరోక్షముగా చూచుచు ఈప్రపంచమంతయు ఓతప్రోతము (పడుగుపేకలుగల శాటీ తంతువులయందువలె) తనయందే చూచుచున్నాడో ఆట్టిసమాధిచేత అంతఃకరణమలినమును దీసివేసి చిత్తము నాత్మయందు స్థిరముచేసిన యోగియొక్క సుఖము యెంతయో చెప్పుటకు రాదు. ఆట్టిసుఖము ఇంద్రునికిని

లేదు. చక్రవర్తిని లేదు. సుఖమంతయు ఏకాంతవాసము చేయు యోగి దేయని చెప్పవలయును. యీసమాధిని నిరుద్ధమనిన్ని కైవల్యమనిన్ని చెప్పుదురు. ఇదివరకు చెప్పిన సంప్రజ్ఞాత అసంప్రజ్ఞాత సమాధుల కున్నూ, భేదమేమనగా ఇది చిరకాలసమాధియైనందున నిరుద్ధమనిపేరు. (వృత్తివ్యాప్తి ఫలవ్యక్తము. అని రెండు ప్రకారములు. అనగా అంతః కరణ వృత్తియందు తనంతట తాను స్ఫుటముగా ప్రకాశగలుగుట వృత్తి వ్యాప్తి. అంతఃకరణవృత్తియందు ప్రతి ఫలించిన చిదాభాసునితో ప్రకాశ గలుగుట ఫలవ్యక్తము. అజ్ఞాన నాశముకొరకు గావలసినది బ్రహ్మయందు వృత్తివ్యాప్తియు, ఫలవ్యక్తమున్నూ అని శాస్త్రకారులువచించిరి. గృహస్థా శ్రమములోనున్ననూ, సరే సన్యసించిననూ సరే పూర్వోక్తములైన సమా ధులయందుండవలెనని తాత్పర్యము.॥ ౨౦॥

శ్లో॥ సుఖ మాత్యంతికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్।
వేత్తి యత్ర న చైవాయం స్థిత శ్చలతతి త్త్వతః॥ ౨౧॥

—• భాష్యమ్ •—

ఏతదేవ తత్వం క్రమేణ స్పష్టం దర్శయతి సుఖమితి. తత్ర తానద్యస్మి న్నవస్థావిశేషే సుఖ మాత్యంతికం నిరతిశయం యత్తద్వృత్తివ్యాప్యత్వేన బుద్ధిగ్రాహ్యమ్ ఫలవ్యాప్యత్వేన త్వతీంద్రియం పునశ్చ యత్రచైవాయం యోగీస్థితస్తత్వాతో న చలతీ త్యర్థః। తదుక్తం లీయతేతు సుషుప్తౌతునిగృహీ తం నిలీయతే నాస్వాదయే త్సుఖం తత్ర నిస్సంగః ప్రజ్ఞయా భవేదిత్యాది బోధ్యమ్॥ ౨౧॥

## —• ఆన్ధ్రి తాత్పర్యము •—

ఈ తత్త్వమునే క్రమముగా స్పష్టముగా చెప్పుచున్నాడు—దేని యందు ఇంద్రియములకు గోచరముగానిదై ఆత్మవిషయకమగు బుద్ధిచేతనే గ్రహింపదగినట్టి నిరతిశయసుఖము ననుభవించుచున్నాడో అది నిరుద్ధ సమాధిలో బుద్ధిగ్రాహ్యమైన వృత్తివ్యాప్తి. దేనియందుండువాడు అందలి సుఖాతిశయముచేత ఆస్థితినుండి చలించడో అది నిరుద్ధసమాధిలో ఇంద్రి యాతీతమైన ఫలవ్యాప్తి। సుషుప్తియందు గ్రహించబడినది. లీనమయి నట్లు ప్రజ్ఞాహీనమయిన నిరుద్ధయోగి సుఖమును (ఆనందమును) చవిగొన లేడు. అనగా ఫలవ్యాప్తిలో నుండువానికి అంతఃకరణలేదు గాన ఆనం దానుభవములేదు. వాడు బ్రహ్మమందు లీనమగుచున్నాడు.॥౨౧॥

శ్లో॥ యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం మతం
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ॥౨౨॥

## —• భాష్యమ్ •—

అథ తదేవ తత్త్వం స్థిరముపపాదయతి యం లబ్ధ్వేతి తథాచ 'యం విదిత్వా విని శ్వాసాః కాంక్షంతే మోక్షకాంక్షిణ ఇత్యాది స్మృతిగమ్యం యమాత్యంతికం సుఖం లబ్ధ్వా తతః పరం నాధికం చాపరం లాభం నసుఖం దేవరాజస్యేతి స్మృతి న్యాయేన మన్యతే యస్మింశ్చ చిదంబరసమాధౌ స్థితో యోగీ శీతాతపాదినా విద్యుచ్ఛస్త్రాదినా వా గురుణాపి దుఃఖేన నవి చాల్యత ఇత్యర్థః॥౨౨॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

అవిచాల్యత ఇతి॥ తదుక్తమష్టావక్రసంహితాయాం అంతస్త్యక్తకషాయస్య నిర్ద్వంద్వస్య నిరాశిషః। యదృచ్ఛయా గతో భోగో నదుఃఖాయ నతుష్టయ ఇతి॥ ౨౨॥

—◆ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ◆—

వెనుక చెప్పిన తత్త్వమునే స్థిరముగా నుపపాదించుచున్నాడు—నిద్రానిశ్వాసలను జయించిన మోక్షార్థులు యే సుఖమును గోరుచున్నారో అట్టి యాత్యంతిక సుఖమును బొంది, మరియొకదానిని గాని అంతకంటె నెక్కువదానిని గాని గోరరో అట్టి చిదంబర సమాధిలోనుండు యోగి శీత వాతాతపాదులచేగాని విద్యుచ్ఛస్త్రాదులచేగానిగొప్పదియగు దుఃఖముచేగాని చలించడు. వానికి గల సుఖము దేవేంద్రునికిగాని చక్రవర్తికిగాని లేదు. అంతరంగికమలరహితుడై శీతోష్ణములు లేనట్టిన్ని ఆశీర్వచనములేని యోగికి ప్రారబ్ధముచే భోగములు నశించినపుడు సుఖదుఃఖములు లేకయుండును.॥ ౨౨॥

శ్లో॥ తం విద్యా ద్దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితమ్।
స నిశ్చయేన యోక్తవ్యో యోగో నిర్విణ్ణచేతసా॥ ౨౩

—◆ భా ష్య మ్ ◆—

నన్వస్యాంతిమస్య మహాయోగస్య కిం ఫలమిత్యాహ- తంవిద్యాదితి।తస్మైత్రివంసతి। తంయోగసజ్ఞింతం సమాధిం జన్మమరణాది సంసృతిరూపదుఃఖసంయోగస్య వియోగం విద్యాదిత్యర్థః। ఏవంసతి సఏవానావృత్తిప్రయోజకో యోగో నిశ్చయేన నిర్విణ్ణచేతసా నిరాలస్య చేతసా యోక్తవ్యోఽభ్యాస

నీయో నత్వహహాఁపరతోఽస్మీతి నృత్యోఽపరమేదితి తాత్పర్యమ్॥ ౨౩॥

—• లఘుటిప్పణీ •—

అణుంహి జీవంప్రితి దేహాభిన్నం శరీరసంయోగ వియోగయోగ్యమిత్యేవం జన్మమరణాది సంసృతిరూపదుఃఖసంయోగస్య వియోగమిత్యర్థః నపునరావర్తతే నపునరావర్తతే ఇత్యాగి శ్రుత్యంతరాదితిభావః॥ ౨౩॥

—• ఆన్ధ్రితాత్పర్యము •—

ఓయీ! కడపటిదైన ఈమహాయోగమునకు ఫలమేమనగా చెప్పుచున్నాడు. అట్టి యోగమను పేరుగల సమాధిని జననమరణరూపసంసార దుఃఖములను బోగొట్టునదని తెలియవలెను. ఇట్టి పునరావృత్తి రహితమైన యోగమును నిశ్చయమైన వైరాగ్యబుద్ధితో తీవ్రముగా జేయవలెను. నేనన్నివదలుకొంటినని ఊరకొనగూడదు (జననమరణసంసార దుఃఖమును వదలుటకు యోగ్యుడై ప్రతిదేహమందు భిన్నుడై యణుస్వరూపుడై పునరావృత్తి నొందడు.॥ ౨౩॥

శ్లో॥ సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వాసర్వాన శేషతః।
మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః॥ ౨౪

—• భాష్యమ్ •—

నను కథంకృత్వా స యోగో భ్యసనీయ ఇత్యాహ—సంకల్పేతితథాచ సంకల్పేన ప్రభవాన్ కామాన్ కామక్రోధలోభమోహమదమాత్సర్యాన్ షడ్వర్గాం స్తదరిక్తానప్యశేషతస్సర్వాం స్త్యక్త్వా మనసైవ చేంద్రియగ్రామం సమూహం సమం తతో వినియమ్య ధృతిగృహీతయా బుధ్యా శనైశ్శనై

రుపరమేదిత్యర్థః । ఏవంసతి తతాఌత్మా శివస్తత్రస్థం మనస్సు ఖేన స్తబ్ధీభూతం కృత్వా నకించిదపి చింతయేదితి ధర్మమేఘా ఖ్యస్య సమాధేర్లక్షణ మవధార్యమితి ద్వయోరర్థః॥౨౬॥

## —• ల ఘు టి ప్ప ణీ •—

శనైశ్శనైరితి । తద్యథా । 'యథా యథా ప్రత్యగవస్థితం మన స్తథాతథా ముంచతి బాహ్యవాసనా' మిత్యాది రీత్యా శనైశ్శనై రుపర మేదిత తాత్పర్యమ్ ధర్మమేఘాఖ్యస్యేతి । తద్యథా । 'వర్షత్యేషయతో ధర్మోఽమృతధారాస్సహస్రశః । ధర్మమేఘమిమం ప్రాహు స్సమాధిం యోగవిత్తమా' ఇత్యాది ద్రష్టవ్యమ్॥ ౨౬॥

## —• ఆ న్ధ్ర తా త్ప ర్య ము —

ఏ యుపాయముచే నట్టియోగ మభ్యసింపవలె నంటే చెప్పు చున్నాడు. కామములు స్పర్శజములనియు సంకల్పజములనియు రెండు విధములు. అందు శీతోష్ణాదులు స్పర్శజములు. (ఈషణత్రయ (దారేషణ, పుత్రేషణ, ధనేషణలు) వాసనాత్రయ (లోకవాసన. (శాస్త్రవాసన దేహవాసనలు) ము సంకల్పజములు. అందు సంకల్పజములు సంపూర్ణ ముగా విడువదగినవి. స్పర్శజములు విడువరానివి, గనుక అవి గలిగి నప్పుడుసహనవృత్తి గలిగి సంతోషమును దుఃఖమును మాని కామాద్య రిషడ్వర్గమును తదితరమైన ఈర్ష్యాదులనున్నూ వదలి మనసు చేతనే ఇంద్రియములన్నిటిని విషయములనుండి నిరోధించి స్థైర్యయుతమగు బుద్ధి చేత మెల్లమెల్లగా ఉపశాంతి నొందిన మనసు ఆత్మయనెడు శివునితో గూడి ఆనందపారవశ్యముచే స్తబ్ధమై మరియేతలంపును జేయకుండును. మనస్సు ప్రత్యగాత్మతో స్థితి గుదిరిన కొలది బాహ్యవాసనలు క్రమముగా వదలుచుండును. ఇదిధర్మమేఘమనుసమాధికి లక్షణము. మేఘమువర్షధార

లను గురిపించినట్లు ధర్మము అమృతధారలను గురిపించును. గనుకనే యోగులుదీనిని ధర్మమేఘమనిరి॥ ౨౪॥

శ్లో॥ శనైశ్శనై రుపరమే ద్బుధ్యా ధృతి గృహీతయా।
ఆత్మసంస్థం మనః కృత్వా నకించిదపి చింతయేత్॥ ౨౫॥

—◆ భా ష్య మ్ ◆—

తదేవ దృఢయతి, యోగీ శనైశ్శనైః సహసా ధృతిగృహీతయా ధైర్యేణ వశీకృతయా బుధ్యా వివేకవత్యా ఉపరమేత్। ఉపరతింకుర్యాత్। మనః సంకల్పాత్మకం ఆత్మసంస్థం ఆత్మైవ సర్వం న తతోఽన్యత్కించిదస్తీ త్యేవం నిర్వికల్పం కృత్వా కించిదపి నచింతయేత్॥ ౨౫॥

—◆ ఆం ధ్ర తా త్ప ర్య ము ◆—

ఇదివరకు చెప్పినదానినే మరలదృఢపరచుచున్నాడు ధైర్యముచే మెల్లమెల్లగా స్వాధీనముచేసుకొనబడిన, వివేకముగలబుద్ధిచే ఆత్మయందు చిత్తముండునట్లు జేసి దేనినిన్ని చింతింపక ఉపరతిని గాంచవలెను ॥౨౫॥

శ్లో॥ యతో యతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరమ్।
తత స్తతో నియమ్యై తదాత్మన్యేవ వశం నయేత్॥ ౨౬॥

—◆ భా ష్య మ్ ◆—

నన్వేవమపి సంప్రజ్ఞాత సమాధౌ చేతస శ్చాంచల్యాద్విషయాకారతాపి స్యాదిత్యాహ — యతోయతఇతి। తత్రైవంసతి శబ్దాదీనాం చిత్తవిక్షేపహేతూనాం మధ్యే యతో యతో యస్మాద్యస్మా న్నిమిత్తా చ్ఛబ్దాదే ర్విషయాంశ్చ యతో స్థిర

మతఏవ చంచలం విక్షేపాభిముఖం సన్మనోనిశ్చరతి తత స్తతో విద్రియా లోకవార్తాయా శ్చానవసరం దత్త్వై తన్మనో నియమ్యాత్మన్యేవ యథోక్తే వశం నయేదిత్యర్థః॥ ౨౬॥

—♦ లఘుటిప్పణీ ♦—

సంప్రజ్ఞాతేతి।ఇహ తయోర్లక్షణం ద్వివిధం సంప్రజ్ఞాతో భవేద్యత్ర విషయాకారతా క్వచిత్।తద్భిన్న శ్చేతరః ప్రోక్తో యత్ర బ్రహ్మైవ భాసత ఇత్యేవధేయమ్॥ ౨౬॥

—♦ ఆంధ్రతాత్పర్యము ♦—

ఓయీ? సంప్రజ్ఞాత సమాధియందు చిత్తము చలించిన యెడల విషయాకారము గావచ్చును?సదా అంటే చెప్పుచున్నాడు - మనసు చంచలమైనది గనుకనే ఆత్మయందు స్థిరముగా నుండక నేయేవిషయములకొరకు బయలుకెడలునో ఆయా విషయములనుండి యత్నముచే మనసును మరలించి ఆత్మయే నిరతిశయ సుఖమైనదని భావించి నిద్రకుగాని లోకవార్తకుగాని అవకాశమియ్యక యాత్మయందే వశమై నిలుచునట్లు చేయవలయును, సమాధి - సంప్రజ్ఞాతము - అసంప్రజ్ఞాతము అని రెండు విధములు యెప్పుడైన విషయాకారమగునది సంప్రజ్ఞాతము యెప్పుడును విషయాకారము గాక బ్రహ్మాకారమై యుండునది, అసంప్రజ్ఞాతమని తెలియవలెను.)॥ ౨౬

శ్లో॥ ప్రశాంత మనసం హ్యేనం యోగినం సుఖముత్తమం।
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషమ్॥ ౨౭॥

—♦ భాష్యమ్ ♦—

ఏవం యోగాభ్యాసబలా దాత్మన్యేవ పరే శివే మనః ప్రశామ్యతీ త్యాహ। ప్రశాన్తేతి। ఏవంతర్హి। "ఔదాసీన్య

మృతేనాపి వర్ధమానే దినేదినే ఉన్మూలితే మనోమూలే జగద్వృక్షః పతిష్యతీ" త్యాదిరీత్యా కామాదిభిః ప్రశాంత మనసం హి యత ఏనం యోగిన ముత్తమం సుఖం శాంతరజ సం బ్రహ్మభూత మకల్మషం శివ ముపైతీత్యర్థః। యథా మనః ప్రశమనే శమో మోక్ష ఏవావశిష్యత ఇత్యాది యోగవా సిష్ఠా దపీత్యవధార్యమ్॥ ౨౭॥

—◆ లఘుటిప్పణీ ◆—

మనః ప్రశమనఇతి॥ నను కిం తర్హి మనసః స్వరూపమితి చే చ్ఛృణు తత్రత్వీయం సోహ మిదం తన్మే ఏతావన్మాత్రకం మన ఇత్యు క్త్వా సత్సంగో వాసనాత్యాగో ఽధ్యాత్మవిద్యా విచారణా ప్రాణస్పంద నిరోధశ్చే త్యుపాయా శ్చేతసో జయ ఇత్యాది బహుశ స్తన్నిరాకర ణార్థ మప్యుక్తం ద్రష్టవ్యమ్॥ ౨౭॥

—◆ ఆంధ్రతాత్పర్యము. ◆—

ఈప్రకారము యోగాభ్యాస బలము వలన పరశివుని యందుమనను శాంతిని బొందుచున్నదని చెప్పుచున్నాడు, మనసుయొక్క స్వరూప మేమనగా? శ్లో॥ జాతోహం జనకో మమైష జననీ క్షేత్రం కళత్రం కులం పుత్రా మిత్రమరాతయో వసు ధనం విద్యాసుహృత్ బాంధవాః చిత్తస్పందిత కల్పనా మనుపతన్ విద్వా ననిద్యామయీం। నిద్రా మేత్య విఘూర్ణితో బహువిధాన్ స్వప్నా నిమా న్పశ్యతి॥ పండి తుడును అవిద్యానిద్రయందు పరవశుడై చిత్తము చలించినట్లు తాను ప్రవర్తించుచు అందలి యనేక విధముల ఈశత్క్ష్యమాణ స్వప్నములను జూచుచున్నాడు. అవి యేవనగా నేను జన్మించినాను ఇతను నాతండ్రి ఇదినాతల్లి ఇది నాఇల్లు ఈ పుత్రులు నావాండ్రు వీరలు నామిత్రులు వీరు

శత్రువులు ఇది నాయాస్తి ఇది నాపాండిత్యము, వీరలు బంధువులు ఇదియే త్రిగుణాత్మకమైన మనస్సు ఈమనసు జగత్తనెడు వృక్షమునకు వేరు గనుక వేరునరికిన వృక్షము పడిపోయి తిరిగి చిగురెత్తనట్లు దీనిని ఉన్మూలన (పెకలింప) చేయక పోయిన యెడల దిన దిన వర్ధమానయై కోతి వలె పిచ్చిచేష్టలు చేసును గాన దీనిని జయించుట యెట్లనగా సత్సంగము వాసనాత్యాగము వేదాంతవిచారణ ప్రాణాయామము ఇత్యాదులు మనోజయో పాయములు చేసి మనసును ఆత్మరూపమయిన పరశివుని యందు నిశ్చలముగా నుంచుటచేత సకల కల్మషములు దగ్ధములు కాగా రజోగుణము నశించి నందువలననే శుద్ధాత్మ స్వరూపముతో నుండు నీ యోగనిష్ఠుడు, ఆత్మానుభవ రూపమైన ఉత్తమసుఖమును బొందు చున్నాడు. అదియే పరమశివ సాక్షాత్కారము॥ ౨౭॥

శ్లో॥ యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః।
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యంతం సుఖమశ్నుతే॥ ౨౮॥

—♦ భాష్యమ్ ♦—

తథోక్తబ్రహ్మసుఖమేవ యోగినఃస్ఫుటీకరోతి। యుంజన్నితి ఏవమిహ మనసైవేం ద్రియగ్రామ మిత్యాద్యుక్త క్రమేణ ప్రణవాద్యభ్యాస పూర్వక మాత్మానం శివం యుంజన్ యోగీ విగతకల్మషస్సన్ సుఖేనా నాయాసేన బ్రహ్మసంస్పర్శజం సుఖమత్యంతం వృత్తివ్యాప్త్యా బుద్ధిగ్రాహ్య మతీంద్రియం యదుక్తం తత్సముశ్నుత ఇత్యర్థః॥ ౨౮॥

—♦ లఘుటిప్పణీ. ♦—

బ్రహ్మ సంస్పర్శజ మితి। సమాధినిర్ధూత మలస్య చేతసో నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్ నశక్యతే వర్ణయితుం గిరా తదా యదేత

దంతఃకరణేన గృహ్యతే। స్పర్శయోగస్తు నామైష యోగినామిహ దుర్లభ ఇత్యాది స్మృతే శ్చేత్యర్థః॥ ౨౮॥

—♦ ఆంధ్రతాత్పర్యము ♦—

వెనుక జెప్పిన యోగి యొక్క బ్రహ్మసుఖమును స్ఫుటముగా జెప్పుచున్నాడు—ప్రణవోహి ధను శ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే। అప్రమత్తేన వేద్ధవ్యం శరవ త్తన్మయో భవేత్॥ అనునట్లు ఓంకారమును ధనుస్సును గాను, మనసును బాణమునుగాను చేసి (ఓంకారధనస్సునందు మనోబాణమును సంధించి) జాగరూకుడై బ్రహ్మమను లక్ష్యమును గొట్టగా బాణమువలె మనసు తన్మయమగును. (అనగా బ్రహ్మాకారమగును) యిట్టి యభ్యాసముచే నాత్మను శివునితో గూర్చుచున్న యోగి పాపరహితుడై బ్రహ్మమును స్పృశించి బ్రహ్మానుభవ రూపమగు నపరిమిత సుఖమయిన బుద్ధిగ్రాహ్యము. అతీంద్రియము అనునట్టి నిరుద్ధ సమాధిని అనాయాసముగా అనుభవించుచుండును. మనసు ఆత్మలోగలయుటయే సమాధిగాన ఆదియే బ్రహ్మసంస్పర్శము. (సమాధియందు చిత్తము విక్షేపరహితమై ఆత్మయందు ప్రవేశించును. అప్పుడు గలిగిన సుఖము ఇంతయని వర్ణించుటకు శక్యముగాదుదీనికే స్పర్శయోగమని పేరు. ఇది యోగులకును దుర్లభము) ౨౮॥

శ్లో॥ సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥ ౨౯॥

—♦ భాష్యమ్ ♦—

నను జ్ఞానచక్షుషా ప్రాప్తతత్త్వః కథ మాత్మానం శివం పశ్యతీ త్యాహ-సర్వేతి। తత్త్రైవం సతి సర్వభూతస్థ మాత్మానం పరశివం సర్వభూతాని చాత్మనీతి యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనస్సన్ సమీక్షత ఇత్యర్థః॥ ౨౯॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నను ఘోరం జాగ్రన్మయం చిత్తం మూఢం స్వప్నే వ్యవస్థితమ్ ॥ శాంతం సుషుప్తి మాపన్నం త్రిభిర్హీనం మృతం భవేదితి। త్ర్యవస్థాతీతం శివ మద్వైతం తురీయం జ్ఞానచక్షుషా విజానీయా దిత్యవధార్యమ్॥ ౨౯॥

## —♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

ఓయీ తత్త్వమును తెలిసినవాడు జ్ఞానదృష్టిచే ఆత్మను శివునిగా యేప్రకారము చూచుచున్నాడంటే చెప్పుచున్నాడు - సర్వభూతముల యందూఉన్న ఆత్మను పరమశివుని గాను సర్వ భూతములు తనయందున్న వాటినిగాను సర్వభూతములను సమదృష్టితో నెవడు చూచుచున్నాడో అదియే శివ సందర్శనము (చిత్తమునకు ఘోరవృత్తి, మూఢవృత్తి, శాంత వృత్తి, మృతవృత్తి, యనినాల్గువృత్తులు, ఘోరవృత్తి జాగ్రదవస్థ మూఢ వృత్తి స్వప్నావస్థ శాంవృత్తి సుషుప్త్యవస్థ. మృతవృత్తి తుర్యావస్థ తురీయ రూపుడే శివుడని తెలియవగును. (అనగా జాగ్రత్స్వప్న సుషుప్తి వృత్తు లను వదలి తుర్యావస్థలో పరమశివ సాక్షాత్కారము నొందగలడు.)౨౯

శ్లో॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి।
తస్యా హం న ప్రణశ్యామి సచ మే న ప్రణశ్యతి॥ ౩౦॥

## —♦ భా ష్య మ్ ♦—

అథ 'యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ' ఇ'త్యాది। శ్లోకరూపయా శ్రుత్యా స్వస్యాపి తద్రూపత్వే నాహ- యోమామితి। ఏవంసతి బ్రహ్మాతం పరాదాద్యో న్యత్రా త్మనో వేద క్షత్ర పరాదాద్యో న్యతాత్మనో వేదేత్యాది. బృహదారణ్యా కశ్రుత్యా యస్తు పరమశివ జ్ఞానీ స సర్వం

ప్రపంచజాతం స్వస్మిన్ పశ్య న్మామపి సర్వత్ర పశ్యతి సర్వంచ మయి సర్వత్ర పశ్యతి సర్వంచ మయి స్ఫూర్తి రూపేణ పశ్యతి తథాచ తస్యాహం నప్రణశ్యామి నా దృశ్యో భవామి సచ సోపి మే న ప్రణశ్యతీతి పరమార్థః॥ ३०॥

♦— లఘుటిప్పణీ ♦—

స్వస్యాపీ॥ ఇహాపి నాత్మా మాత్మాన మపి శివం విజానీయా దిత్యుక్తం భవతి। కథ మన్యజ్ఞానా దన్యగతా నర్థస్య నివృత్తి రితిమాధా కూతి మవశ్య మభ్యుపగంతవ్యం బ్రహ్మత్వమితి। తత్ర తావద్బ్రహ్మ శాస్త్రేణా స్తంపురుషం పరాదా త్మైవల్యాసంబంధినం కుర్యా ద్యో స్యతా త్మనో వేదేత్యర్థః। ఏవం తుచ్ఛం నామ తుచ్ఛియ స్తం పరాదా దిత్యాది రనేకశః॥ ३०॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

తరువాత గురువునందును దేవునియందును సమ బుద్ధి నుంచవలయు నన్న శ్రుతిని బట్టి నన్ను నున్నా శివరూపముగా తెలియవలయునని చెప్పుచున్నాడు. పరమశివ జ్ఞానము గలవాడు. సర్వ ప్రపంచమును తన యందున్న దానినిగాను 'విశ్వం దర్పణ దృశ్యమాన నగరీ తుల్యం నిజాం తర్గతమ్' అన్నట్లు ఈ కనబడునట్టి విశ్వమంతయు అద్దమందు భాసించిన ప్రపంచమువలె తనలో నుంచి వచ్చినట్లుగా చూడవలెను. గురువునైన నన్నునున్నా సర్వభూతముల యందున్నవానిని గాను శివస్వరూపునిగాను స్ఫురణరూపముగాను చూచుచున్నాడు. గాన అట్టిగురువు శిష్యునికి పరోక్షము గాడు. శిష్యుడును గురువునకు పరోక్షముగాడు. గురుదేవ తాత్మైక్యమువలన నేసిద్ధి ముక్తులు కలుగును.॥ ३०॥

శ్లో॥ సర్వ భూత స్థితం యోమాం భజ త్యేకత్వ మాస్థితః।
సర్వథా వర్తమానోపి స యోగీ మయి వర్తతే॥ ३१॥

—♦ భాష్యమ్ ♦—

అథ దత్తాత్రేయమయం శాంతం శివం విద్ధి సనాతనం ఇత్యాది స్మృతిన్యాయేన గురుదేవయో రేకత్వే నాప్యాహ సర్వభూతేతి ఏవం తర్హి 'సీతాంచ పార్వతీం పశ్యే ద్రామం చైవ త్రిలోచనమ్। ఇత్యాది రామరహస్యో పనిషద్రీత్యాహపి స్వయమేకత్వ మాస్థితోఽపి యోమాంసర్వ భూతస్థితం శివ రూపం భజతి। సచ సర్వథా వర్తమానో నిత్యముక్తోపి యోగీ మయివర్తతఏవ తథాహం గ్రంథకర్తా తథాన్యోపి తత్వజ్ఞఇతి సోహం సచత్వం సచ సర్వమేత దాత్మ స్వరూపం త్యజ భేద మోహ మిత్యాదిస్మృత్యుక్తరీత్యా వధార్యమ్ ॥ ౩౧॥

—♦ లఘు టిప్పణీ ♦—

అథేతి। 'దేహభావేన । దాసోహం జీవభావే । తదంశకః। ఆత్మభావే తదేవాహ మితి జానిహి సత్తమే'త్యాది రీత్యా పరస్పరం సర్వస్య పరబ్రహ్మరూపత్వే స్థితే సర్వంఖల్విదం బ్రహ్మేత్యవధారితం భవతీ తిభావః॥ ౩౧॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

ఉపాధిరహితమైనటువంటి శాంతుడైన శివుని, గురుదత్తాత్రేయ రూపముగా తెలియవలెనని గురుదేవతలకు ఏకత్వమును చెప్పుచున్నాడు, ఓయర్జునా? రామరహస్యోపనిషత్తునందు చెప్పినట్లు సీతను పార్వతినిగాను రాముని శివునిగాను దెలియవలెనన్నట్లు ఇప్పుడునన్ను శివరూపముగా తెలియుము యెవడుసమాధియందు ఏకత్వమునుపొందినప్పుడు నన్నున్నా సర్వాంత ర్యామినిగా శివునిగా భజించునోవాడును సర్వాన్తర్యామియై

నిత్యముక్తుడైనప్పటికి నాయందు ఉండకపోడు వాడు, నేను, అది, నీవు అనునట్టి భేదమోహములను వదలి సర్వము ఆత్మస్వరూపముగా జూడు మన్నట్లు గ్రంధకర్తనైన నేను మరియొకడున్నూ తత్వమును తెలిసి శివుని యందె ఉంటున్నారు.

గురువునైన నేనును నీవును ఈవిశ్వమంతయు ఆత్మయే భేదమును మోహమును వదలవలెను (గురువు, తాను. ప్రపంచమంతేయు, శివరూపమే యని భావము) (భేదము, దేహ భావములో దాసుడను. జీవభావ ములో పరమాత్మయొక్క అంశము. ఆత్మభావములో నంతయు నొక్కటె సర్వము బ్రహ్మయే గనుక గురుదేవతలకు భేదము లేదు. ౩౧॥

శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోర్జున
సుఖం వా యదివా దుఃఖం స యోగీ పరమో మతః॥ ౩౨.

—◆ భా ష్య మ్ . ◆—

నను గురుశిష్యయోః క్షుద్రాత్క్షుద్రయోశ్చ కథ మే కత్వ మిత్యాహ—ఆత్మౌపమ్యేనేతి। తత్త్రైవం సతి సమాధే ర్వ్యుత్థానకాలే జీవన్ముక్తో యోగీ సుఖ మనుభవన్నపి సర్వత్ర ప్రాణిజాతేషు సుఖంవా యదివా దుఃఖ మాత్మౌపమ్యేన యః పశ్యతి సఏవ యోగీ మమపరమః నతు సామర్థ్యాధిక్యా జ్జగద్విచ్ఛేదకారీ త్యవధేయం॥ ౩౨॥

—◆ ల ఘు టి ప్ప ణీ . ◆—

ఆత్మౌపమ్యేనేతి, 'జ్ఞానాత్పూర్వం యథాస్వస్య సుఖందుఃఖం మ్యథాభూతలుత్సైవా న్యశరీరేపి విజ్ఞాతవ్యం వివేకిభి' రిత్యాది భోధ్యమ్॥ ౩౨

## ఆంధ్ర తాత్పర్యము.

గురువు గొప్పవాడు శిష్యుడు కొద్దివాడు ఈయిద్దరికి ఏకత్వ మెట్లన చెప్పుచున్నాడు. జీవన్ముక్తుడైన యోగి సమాధి వదలినపుడు సుఖము నను భవించుచున్నను సర్వజీవులయొక్క సుఖదుఃఖములను తనవిగా జూచునో అట్టి శిష్యుడు గురువుతో సమానుడే, తన సామర్థ్యము వలన జగత్తును విడదీయ గూడదు. (జ్ఞానము రానప్పుడు తనకు సుఖదుఃఖములున్నవి. గదా? విజ్ఞానమందును ఇతరదుఃఖములు తనవి గా చూడవలయును, అను భవమునకు అన్వయము వ్యతిరేకము అని రెండు మార్గములు అన్వయ మనగా నీదేహంపం దభిమానముంచినట్లు సర్వభూతముల యందభిమాన ముంచుట. వ్యతిరేక భావమనగా ? ఇతర భూతముల యందభిమానము తనకు స్వభావంబుగ లేనట్లు ఈదేహ మందభిమానమును విడుచుట. ఈరెంటిలో అన్వయమార్గమేఉత్కృష్టమని శాస్త్రకారుని యొక్క మతము. దానిని సాధించుట యతికష్టము గాన యది సాధించలేనివాడు వ్యతిరేకమార్గముగా సాధించుట సులభము. యేమనగా; దేహాభిమానము లేకున్న జీవాభిమానముండదు. దేహాభిమాన త్యాగమే జీవేశ్వరైక్యాను సంధానము, కార్యోపాధి జీవుడును కారణోపాధి ఈశ్వరుడును గనుక తనదేహమందభిమానము నిశ్శేషముగా విడిచిన నితరమందును అభిమాన ముండదు గదా? అప్పుడు కార్య కారణోపాధులు రెండును తమంతట తామే పోవును. 'విశ్వంపశ్యతి కార్యకారణతయా స్వస్వామి సంబంధత శ్శిష్యాచార్యతయా తథైవ పితృ పుత్రాద్యాత్మనా భేదతః। స్వప్నే జాగ్రతివా య ఏషపురుషో మాయా పరిభ్రామిత స్తస్మై శ్రీ గురుమూ ర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥ అనునట్లుగురుశిష్యులయైక్యము దెలిసినప్పుడే జీవేశ్వరైక్యమును దెలుసును - ౩౭.

అర్జున ఉవాచ.—

శ్లో॥ యోయం యోగస్త్వయా ప్రోక్తస్సామ్యేన మధుసూదన
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్॥ 33॥

— భాష్యమ్ —

అతోక్తస్యైవార్థ మాక్షిపన్నాహ—యోయమితి
త్రితావ ద్యోయం యోగస్త్వయా సామ్యేన సమత్వేన
ప్రోక్తో హేమధుసూదన తదేతస్య యోగస్య స్థితిం స్థిరాం
నపశ్యామి మనస శ్చంచలత్వాదితి భావః ॥ 33॥

—♦ ఆంధ్రతాత్పర్యము ♦—

అర్జునుండు పలుకుచున్నాడు. ఈ శ్లోకమందు ఇదివరకు చెప్పిన యర్థమును యాక్షేపణ చేయుచున్నాడు. ఓ కృష్ణా సమత్వముగా యే యోగమును నీవు చెప్పితివో అది స్థిరముగానుండదు. ఏమనగా? మనసు చంచలము గాన యట్టి స్థితిని చూడలేకుంటిని. 33

శ్లో॥ చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢం।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥ 34॥

—♦ భాష్యమ్ ♦—

ఏ తదేవ పున స్స్పష్టముపపాదయన్నాహ—చంచలం
హీతి। తత్ర హేకృష్ణ! హీతి ప్రసిద్ధ మేవైతద్యతో మన
శ్చంచలం పునశ్చప్రమాథి। ప్రమథితుంశీలమస్య తత్పునశ్చ
బలవద్దృఢంచేతి తస్యాహం సాధారణో భూత్వా నిగ్రహం

మన్యే నయోగ్య మిత్యర్థః । యత స్తన్మనో వాయోరివ నిగ్రహీతుం సుదుష్కర మిత్యర్థః॥ ౩౪

—◆ లఘుటిప్పణీ ◆—

నిగ్రహంమన్యఇతి। మనస శ్చంచలత్వమేవ కథం బ్రహ్మణా కృత మితిచేచ్ఛృణు సర్వీభూతో యది స్యాద్దైవ లౌకికం వైదికం ద్వివిధం కార్యం నస్యాత్తతో నిత్యం చంచలం హి మనః కృతమితి। తత్రైవంసతి। "సముద్రం శోషయేద్యస్తు టిట్టిభో హి యథాపురా। నిర్దీపం దీపితం కుర్యా జ్జితం తస్య మనో భవే దిత్యాద్యుక్త్యా మనసః నిగ్రహం మన్యే నయోగ్య మిత్యాశయః॥ ౩౪॥

—◆ ఆంధ్రతాత్పర్యము ◆—

ఈ చెప్పిన యర్థమునే స్పష్టముగా మరల ఉపపాదించుచున్నాడు- ఓ కృష్ణా! మనసు చంచలమైనది. అంతేగాక అస్వాధీనమైనది. మరియు బలవత్తరమైనది మరియు రజస్తమోగుణ తంతువులచే ముప్పేటను వెయ్యబడి దృఢమైనది నేను సామాన్యుడనై యుండి వాయువును బంధింపలేనట్లు మనసును నిగ్రహించలేనని తలచెదను. ఇది నావలన గానేరదు. బ్రహ్మదేవుడు మనసును ఇంత చంచలమైన దానినిగా యెందుకు సృష్టించినాడంటె యీ లౌకిక వైదిక కార్యములు జరుగుటకుగాను మనసును చంచలమైన దానినిగా సృజించె. మనోనిగ్రహప్రయత్నము—(లకుముకి పిట్ట) తతువు సముద్రమును యెండించినట్లే, ఇందును గురించి ఒక ఇతిహాసము గలదు. తీతువు పిట్ట సముద్రతీరమున గ్రుడ్లు పెట్టుచుండెడిది. అవి తరంగములచే కొట్టుకొని పోవుచుండెను. తీతువు పిట్ట సముద్రమును యెండింపజేయు ప్రయత్నముగలిగి విష్ణువునకు వాహనమైన గరుత్మంతుడు పక్షిజాతిలోని వాడే గనుక నతనితో తనకష్టమును జెప్పుకొని సముద్రమును యెండింపజేయునట్లు విష్ణువుతో జెప్పుమని వేడగా గరుత్మంతుడు

తనయేలికతో జెప్పెను. విష్ణువు ఇంద్రాదులతో చెప్పెను. దేవతలందరు సముద్రము యెండింప ప్రారంభించి యసమర్థులై మావలన గానేర దని విష్ణువుతో జెప్పుకొనిరి. అప్పుడు విష్ణువు తీతువు పిట్ట నొద్దకు వచ్చి ఆసలు సంగతి యేమని యడిగెను. సముద్రతీరమున గృడ్లు పెట్టుకొను చుంటిని. వాటిని యీ సముద్రుడు మాయము చేయుచున్నాడు. వంశ వృద్ధిగా నివ్వడు. సముద్రము యెండింపజేయుడని వేడెను. అప్పుడు విష్ణువు నీవు సముద్రతీరమందేల గ్రుడ్లు పెట్టెదవు. వేరొకచోట పెట్టుకొనగాదా యని చెప్పిపోయెను, దేవతలందరు శిగ్గుజెంది వెళ్లిపోయిరి. తీతువుపిట్ట సముద్రము నెండింపలేకపోయెను. అంధకారమును ప్రకాశింపజేసినట్లు ఉండును. కోతివంటిదిమనసు చిత్ర విచిత్రమయిన పనులు చేయించును. కపిరపి కాపిశాయిని మదమత్తో వృశ్చికేన సందష్టః అపిచ పిశాచగ్రస్తః కింబ్రూమ స్తస్య వైచిత్ర్యం॥ అసలే కోతి ఈతకల్లు దాగినది. దానిపైన నిషాయెక్కినది. అటుపైన తేలు కుట్టినది. తర్వాతి పిశాచం పట్టినది. ఇన్నిలక్షణములు గల కోతికి యెన్ని దుర్గుణములుండునో మనసున కన్ని దుర్గుణములుండును గాన నిగ్రహించ లేననుచుంటాను॥ ౩౪॥

శ్రీకృష్ణఉవాచ:—

శ్లో. అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహం చలం।
అభ్యాసేన తు కౌన్తేయ! వైరాగ్యేణ చ గృహ్యతే॥ ౩౫॥

—◆ భాష్యమ్. ◆—

అథతమాక్షేపంహారిహారన్నాహ! అసంశయమితి। తత్రైవంసతి సమ్యగ్వదితం చేష్టితం యన్మనో నిగ్రహీతుం శక్యసీతి సంతోష ప్రాబల్యేన సంబోధయతి హే మహాబాహో! ఇతి యత్తో దుర్నిగ్రహం చలమపి మనోభ్యాసేన వైరాగ్యేణచ

గృహ్యత ఇత్యర్థః ఏవమేవాభ్యాసవైరాగ్యాభ్యాంతన్నిరోధ ఇతి యోగసూత్రైర్వ్యక్త మవధార్యం॥ ౩౫॥

—◆ ఆంధ్ర తాత్పర్యము. ◆—

తరువాత వెనుక జెప్పిన యాక్షేపమును పరిహరించుచు జెప్పుచున్నాడు. ఓయర్జునా! మనసును నిగ్రహించలేమని జెప్పుచుంటివి. మనసు చంచలమైన మాట నిజమే నిగ్రహించుట కష్టమేగాని అభ్యాసము చేతను వైరాగ్యము చేతను నిగ్రహింపవచ్చును. ౩౫॥

శ్లో॥ అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మేమతిః
వశ్యాత్మనా తు యతతా శక్యో వాప్తు ముపాయతః॥ ౩౬॥

—◆ భాష్యమ్. ◆—

నన్వయత్న సాధ్యఏవ యోగః కుతో నేతిచే న్నైవ మిత్యాహ। అసంశయతాత్మనేతి॥ ఏవంతహి। 'ఆత్మావారే ద్రష్టవ్య శ్శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్య' ఇత్యాది శ్రుతిభి రాత్మోపలబ్ధ్యర్థం శ్రవణ మనన నిదిధ్యాసనాదే రావశ్యకత్వే స్థితేన సంయతో నిరుద్ధ ఆత్మాంతఃకరణం యస్య తేన తు శక్యోవా వశ్యమాప్తుం తథా గురూపదిష్ట యోగ యుక్తితశ్చే త్యర్థః॥ ౩౬॥

—◆ లఘుటిప్పణీ. ◆—

అయత్న సాధ్యఇతి॥ ఏవేతి॥ తథాచ, స్వతశ్చే దీశ్వరస్యాస్తిశ్చే దిత్యేవం కథంచన నైవ కోపీహ దుఃఖీస్యా న్మామైషా కింకరిష్యతీ త్యాది స్మృత్యా మాయికస్య బంధస్యా వశ్యకత్వే స్థితే తస్య వినిర్ముక్తి ర్యత్నం

విశుద్ధ శరీరేంద్రియో పభోగా భవంతి కదాచిద్విగత దేహేంద్రి యాదయః కేవలేన స్వాభావికేన మనసా అను భూయమాన సకల కామా భవంతి ॥ తథాహి నిరూపితం స ఏకధా భవతి త్రిధా భవతి మనసైతాన్ కామాన్ పశ్యన్ రమతే, ఇత్యాది శృత్యనుసారేణ ద్వాదశాహవ దుభయ విధమితి అతస్తే సదేహా విదేహాశ్చ భవంతి శ్రూయతే చ, విరూపేభ్యో విశ్వరూపే భ్యశ్చ వోనమః । ఇతి శివసాధర్మ్య భాజాం విగత రూపత్వం బహురూపత్వంచ శరీర పరిగ్రహే యాదృశానీశ్వరస్య శరీ రాణి నీలకంఠత్త్వాది లక్షణాని తాదృశాని తత్సాదృశ్య భాజా మితి కేచిత్ నీలగ్రీవా శ్శితికంఠా ఇత్యాది శ్రవణా దితి ఏవం జ్ఞానే వేదాంత జన్యే యోగే యమాది రూపె పరమేశ్వర విషయె యెనిరతా నిష్ణాతా స్తాదృశం పదం పరమశివస్య ప్రాప్తా స్తేషాం పూర్వోక్త గుణానాం శివసదృశానాం ఘోరె నిరతిశయ తాప రూపత్వాత్ దుస్సహె సంసార మండలె న పునరావృత్తిః నపునః సంసార ధర్మాన్వయ ఇతి తస్మాత్ బ్రహ్మలోక మభిసంపద్యతే నచ పునరావర్తత ఇతి శృతేః సర్వజ్ఞస్య సర్వశక్తేః సర్వైశ్వర్య సంపన్నస్య సర్వా నుగ్రాహ కస్య సర్వకర్మ సమారాధ్యస్య నిరస్త సమస్త దోష కళంకస్య నిరతిశయ మంగళ గుణ రత్నాకరస్య విరూపాక్షస్య పర బ్రహ్మణ ఉమాపతే ర్లోకం నిరవధికానంద ప్రకాశం నిత్య మక్షయ మభిసంపన్నాః సర్వజ్ఞత్వాది యోగినోఽనావృత్తి

తయా వర్తంతే తత్రేతి ఏతదుక్తం భవతియత్ర దేవా అమృత మానశానా స్తృతీయే ధామాన్యభ్యైరయంత ఇత్యాదిషు శ్రుతాని నిరతిశయానంద ప్రకాశ ఘనే బ్రహ్మణి శివే సామరస్య ముపగతాః ముక్తాః ప్రకాశవపుషః సర్వజ్ఞాః సర్వ గతాః శాంతా నిత్య పరమైశ్వర్య ధారా నిశ్శేష విగళిత మలావరణాః సర్వత్ర తదర్శన స్తదాత్మాన స్తదీయె పరమా కాశలక్షణే ధామాని స్వాభిమతాని ప్రావిశ్య స్వేచ్ఛోపగత సకల కామా స్తైన సహ సదా విద్యోతంతే సర్వత్రేతి సర్వం సముంజసమేవ ॥౧౩॥

## —◆ ల ఘు టి ప్ప ణీ ◆—

సమాధినేతి తద్యథా యదా సంక్షీయతే ప్రాణో మానసం చప్ర వీయతే తదా సమరసత్వంచ సమాధి రభిధియత ఇత్యాది ద్రష్టవ్యం॥౧౩॥

## —◆ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ◆—

ఓయీ జపమువల్ల శాంతుడై ధ్యానము చేయవలయును ధ్యానము వల్ల శాంతుడై జపము చేయవలయు నని చెప్పియున్నందున ధ్యానజపము లలో యేమిజపించవలయును, దేనిని ధ్యానించవలయు నంటె చెప్పు చున్నాడు. అంతఃకరణ యనె అధరారణి యందు ప్రణవమనె ఊర్ధ్వారణి యుంచి ధ్యానమనె మథన చేయుట వలన జ్ఞానమనె అగ్ని పుట్టి పాశమనె కట్టెదగ్ధమై పోవును. అకార ఉకార మకార రూపమైన ప్రణవార్థ మే మనగా శ్లో॥ అకారవాచ్యో ౽ ఖిల లోకనాథో మకారవాచ్య స్త్వయ మేవ జీవః ఉకార ఐక్యంతు వదేచ్చి తోః ఖల్వేవమర్థ మేవం ప్రవదంతి సంతః॥ అకారమున కర్థము ఈశ్వరుడు, మకారమున కర్థము జీవుడు, ఉకారమున కర్థము ఐక్యము, ప్రణవమునె జపధ్యానములు జేయుచు గురు

నైన నన్ను స్మరించి సమాధియందు దేహ త్యాగమును యెవడు చేయునో వాడు ముక్తుడు. అట్టి ముక్తులకు గమ్యస్థానము శివపదము. అది పరంజ్యోతిస్స్వరూపము. కోటి సూర్యకాంతిగలది. ముక్తులుప రశివునితోగూడ సకలకామముల ననుభవించుచుందురు. అక్కడ రాగ ద్వేషాదు లేమియు నుండవు. సృష్టికి పూర్వమును యీపదము గలదు. యీపదమును బొందిన వారికి పునరావృత్తిలేదు. ఇందున్న ముక్తులకు అవిద్యా। అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము అనునట్టి పంచ క్లేశములు లేవు. ఆవరణ, మలము లేక జ్ఞానశక్తి గలిగి శివభావముతో స్వప్రకాశముచే పరిపూర్ణులైయుందురు. షడ్భావ వికారములులేని శరీరేంద్రియములు గల ఏకశరీరముగాని బహుశరీరములుగాని గలిగియుందురు. సర్వ స్వతంత్రులై యుందురు. ఈశ్వరసంకల్ప మక్కరలేకనే ఒకప్పుడు దేహములు గలిగియుందురు. ఒకప్పుడు దేహేంద్రియములు లేకనే స్వాభావికమనసుతో సకల కామముల ననుభవించుచుందురు. యీ ప్రకారము వేదాంతజన్య జ్ఞానమందును యమ నియమాది యోగమందును నిరతులయిన వారలే యీ శివపదమును బొంది శివసమానులై శాశ్వతముగా నుందురుగాని ఘోర సంసారమున నెప్పటికిని రారు. (సమాధియనగా ప్రాణము లీనమయినప్పుడు మనసును లీనమగును. అప్పుడు సమరస భావముగలుగును. దాని పేరే సమాధి॥) ౧౩॥

శ్లో॥ అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః।
తస్యాహం సులభః పార్థ ! నిత్యయుక్తస్య యోగినః॥ ౧౪॥

— భాష్యమ్ —

నను 'వేదై గనేకై రహమేవ వేద్య' ఇత్యాది శ్రుత్యా, యది జీవబ్రహ్మణో రేకత్వం తర్హి మయాపి పరమశివ భేదే కాక్షతి రిత్యాహ— అనన్యేతి॥ తత్రైవం సతి, యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురా విత్యాది శ్రుత్యా యథా

గురౌ నృబుద్ధింవై మంత్రే చైవార్ణ బుద్ధి కృత్ప్రతిమాసు శిలాబుద్ధిం కుర్వంతో యాంత్య ధస్తము' ఇత్యాది స్మృతాశ్శ మయాపి తవ గురుణా హే కౌన్తేయ! పరమ శివాభేద ఏవ యుక్త ఇత్యతో మాం పరమశివాభిన్న మనన్య చేతా స్సం స్తవమన్యోవా యః స్మరతి తస్యాహం నిత్యయుక్తస్య యోగిన స్సులభ ఇత్యర్థః॥ ౧౪॥

## —♦ లఘు టిప్పణీ ♦—

నను లక్ష్మీవాక్ శచీవీ యత్ర మదోదర్యాః పురాంగణే। శుక్ల దాస్యో భవంత్యద్ధా కిముతాన్యా స్సురాంగనాః। ఇత్యాది స్మృత్యా స్వతో విష్ణురూపేణ భక్తే రనావశ్యకత్వా దాహ। అథస్తమశివా॥ అత ఏవ 'దిగ్భస్మ రహితం ఫాలం ధిగ్గ్రామ మశివాలయం। ధిగనీశా ర్చనం జన్మ ధిగ్విద్యా మశివాశ్రయాం' ఇత్యాది శ్లోకరూపయా శ్రుత్యా ప్రతి మాయాశ్చ పూజన మావశ్యక మిత్యవధేయమ్॥ ౧౪॥

## —♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఓయీ! అన్ని వేదములచేతను నన్నే తెలుసుకొనవలెనన్న శ్రుతి చేతను జీవుడు బ్రహ్మము ఒక్కటేగనుక పరమశివునితో భేదము చెప్పి నందున హాని యేమనగా చెప్పుచున్నాడు. దేవునియందు భక్తి గలిగి యుం డినట్లు గురువునందును భక్తి గలిగి యుండవలయును. గురువునందు మనుష్య బుద్ధిన్ని, మంత్రమందు అక్షరబుద్ధిన్ని, విగ్రహమందు శిలాబుద్ధిన్ని గల వాడు అధోగతినొందును. గనుక ఓ యర్జునా! నీకు గురువునైన నన్ను పరమశివునితో అభేదముగా నెంచుము. ఇట్లు అనన్య బుద్ధిచే నీవుగాని యితరుడుగాని భావించి నట్లైతే అట్టి యోగికి నేను సులభుడను. (ఓయీ మదోదరి యొక్క వాకలిలో లక్ష్మి, సరస్వతి, శచీదేవులు దాసీలై

యుండగా ఇతర దేవతా స్త్రీలమాట చెప్ప నేల? యన్నట్లు తాను స్వయముగా విష్ణువైనప్పుడు భక్తి యావశ్యకము లేదంటెచెప్పుచున్నాడు. త్రిపుండ్రములేని బ్రాహ్మణముఖమును జూడరాదు. శివాలయములేని గ్రామమునందు భుజింపరాదు. శివారాధన చేయనిజన్మ నిరర్థకము. శివ జ్ఞానములేక ముక్తిలేదు. ఈశ్రుతినిబట్టి ప్రతిమారాధన యావశ్యకమని చెప్ప బడినది.

శ్లో॥ మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్।
నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః ॥౧౫॥

## —♦ భా ష్య మ్ ♦—

నను గురుదైవతయో రిహా భేదేనో పాసనాయాః కిం ఫల మిత్యాహ।—మాముపేత్యేతి॥ ఏవం సతి మన్యే త్వాం కాల మీశాన మితి స్మృతిన్యాయా త్పరమశివా భేదేనో పాస నయామాముపేత్యప్రాప్య దుఃఖాలయమశాశ్వతం సంసారగహ నం ప్రతి పున ర్జన్మ నాప్నువంతీ త్యర్థః।ఏవ మేవోపాసనయా బహవోపి మహాత్మానో॥ యో వైష్ణవ స్సోపిచ యోగకాలే శక్తి స్వభావేన విచిన్త్య విష్ణుం। శివాత్మకే ధామని యోజ యే త్స్యాదత శ్చిదానంద మయోహి భక్త। ఇత్యాది శ్రుతి న్యాయేన పరమాం సిద్ధిం గతా ఇత్యర్థః॥ ౧౫॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

విచిన్త్య విష్ణుమితి॥ తత్ర తావత్ 'శివస్యార్ధం స్థితా గౌరీ తదర్ధో హరి రిష్యత। తదర్ధార్ధేన సంయుక్తో హరి రర్ధ శరీరభాక్' ఇత్యేవం రూపేణ విజాన న్నపిబలో భక్తో ఽన్యథా త్వభక్త ఏవేత్యవ ధార్యమ్॥

## —◆ ఆం ధ్ర తా త్ప ర్య ము . ◆—

గురు దేవతలకు భేదము లేనప్పుడు ఉపాసన వలన ఫలమేమంటె చెప్పుచున్నాడు. నిన్ను కాల స్వరూపుడైన రుద్రునిగా తలచు చున్నా నని కుంతీ వాక్యమును బట్టి పరమ శివునితో అభేదముగా నన్నుపాసిం చిన వారు దుఃఖములకు నివాసమైనట్టిన్ని అశాశ్వతమైన సంసారార్ణ మందు పునర్జన్మను బొందరు. ఈప్రకారము అనేకమంది మహాత్ములున్నన్ను శివాభేదముగా నుపాసించి జన్మ రాహిత్యము నొందిరి॥ వైష్ణవుడున్నూ యోగాభ్యాస కాలమందు విష్ణుని శక్తిరూపముగా భావించి శివస్థా మందు సంయోజనచేసి తాను చిదానంద రూపుడగుచున్నాడు. విష్ణు శక్తినిగా ధ్యానించి శివస్థానమందు సంయోజన చేసినవారందరు పరమ సిద్ధినొందిరి॥ (శివునియొక్క అర్ధశరీరము పార్వతియై యుండె. పార్వతి యొక్క అర్ధశరీరము విష్ణువైయుండెను. అర్ధశరీరముతోగూడిన విష్ణు సగమె (అనగా ఈశ్వరునకు పార్వతియు విష్ణువును అర్ధాంగినిశే య యర్ధము. ఈశ్వరునికి శరీరములేనందున నిర్గుణుడని భావము. ఇట్లు తెలిసి వాడు ప్రబలభక్తుడు. అట్లుగాకున్న భక్తుడుగాడని నిశ్చయించు కొనవల యును॥ ౧౫॥

శ్లో॥ ఆబ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోర్జున ,
మాముపేత్యతు కౌన్తేయ ! పునర్జన్మ నవిద్యతే॥ ౧౬

## —◆ భా ష్య మ్ ◆—

నను 'శివలోకాచ్చ గోలోకా దుమాలోకాచ్చ సర్వశః కుమారలోకా ద్వైకుంఠ త్సత్యలోకా త్సమంతతః తపో జన మహర్భ్యశ్చ సర్వే స్వర్లోక వాసినః । స్నాతుం మాఘే సమాయాన్తి ప్రయాగ మరుణోదయ' ఇత్యాది స్మృత్యా

పూర్వోత్తర లోక వ్యవస్థితౌ తేష్వపి కి మావృత్తి లక్షణం కిం చానావృత్తి లక్షణ మితి నిరూపయితు మాహ॥- ఆ బ్రహ్మేతి॥ తత్ర తావ దాబ్రహ్మ భువనా ద్యే లోకాస్తే సర్వే పునరావర్తినో భవన్తి పరంతు మన్యే త్వాం కాల మీశాన మితి స్మృతి న్యాయేనా హంశబ్దేన విఖ్యాత స్త్వేక మేవపరశ్శివ ఇతి స్మృతి న్యాయేన చ మాం పరమశివ ముపేత్యతు లోకా పేక్షయాపి 'దినకృత్కోటి సంకాశం స్థాన మాద్య ముమా పతేః సర్వ కామ సమాయుక్తం విశుద్ధం నిత్య మక్షయం' ఇత్యాది కూర్మోక్త్యా హేకౌన్తేయ ! విష్ణోః పరంపదాఖ్యే శివలోకే గత్వా న పునర్జన్మ విద్యత ఇత్యర్థః అన్యథాతు బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జునే త్యుక్త్యా మమ జన్మాని తదత్యయాని చ సహ యాదవైః ప్రసిద్ధా న్యే వేతి కా తత్ర విచారణే త్యవధేయమ్॥ ౧౬॥

—♦ లఘు టిప్పణీ. ♦—

గోలోకాదితి తత్రతావత్ । 'ఈశ్వరాయతనస్యా గ్రే శ్రీమా న్ధర్మ వృష స్మృతః యత్ర వీరవృష స్తత్ర నిత్యం గోమాతరః స్థితాః' ఇత్యాదినా శివలోకాంతర్గతో గోలోకోఽపి వర్ణితో యత్ర గా స్సంరక్షణార్థం కృష్ణోఽపి తిష్ఠతీ త్యవధార్యమ్ ॥౧౬॥

—♦ ఆంధ్ర తాత్పర్యము. ♦—

మాఘమాసములో అరుణోదయ కాలమందు ప్రయాగలో స్నానం చేయుట కొరకు శివలోకము గోలోకము ఉమాలోకము కుమారలోకము వైకుంఠము సత్యలోకము తపోలోకము జనలోకము మహర్లోకము

స్వర్గలోకము యీ లోకములనుంచి వచ్చెదరని స్మృతి గలదు. యీలోకములలో పునరావృత్తిగల లోకములేవో పునరావృత్తి రహితమైన లోకములెవ్వియో నిరూపించుచున్నాడు. బ్రహ్మలోక పర్యంతము లోకములు పునరావృత్తిగలవె, శివలోకము యిదివరకు చెప్పబడినది. అక్కడకు వెళ్లినవార్లకు పునర్జన్మ లేదు. తతిమ్మా లోకములయందు పునరావృత్తిగలదు. ఓఅర్జునా నీకును నాకును అనేక జన్మలయినవి. యాదవులలో కూడా పుట్టిన సంతతి ప్రసిద్ధమైనదె. దానికి విచారణ అక్కరలేదు. (ఈశ్వరున కెదురుగా ధర్మవృషభమున్నది. అక్కడ గోవులన్నియు ఉండును గనుక గోలోకము శివలోకాంతర్గతమె. కృష్ణుడు గోవులు గాయుట అక్కడనె యని తెలియవలెను॥౧౬॥

శ్లో॥ సహస్ర యుగ పర్యంత మహ ర్యద్బ్రహ్మణో విదుః
రాత్రింయుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదోజనాః॥౧౭

—♦ భాష్యమ్ ♦—

నను బ్రహ్మాది లోకానాం పునరావృత్తిత్వం కాలపరిచ్ఛిన్నత్వాదితి యుక్తం తదాహ—సహస్రేతి॥ తథాచ, చతుర్యుగ సహస్రపర్యంతం యదహో బ్రహ్మణో దినం విదురిత్యర్థః । ఏవం తావత్ప్రమాణేన యుగసహస్రాం తాం రాత్రిమపి తే ఽహోరాత్ర విదో యోగినో విదు రిత్యర్థః । యేతు ప్రసిద్ధత్వేన చంద్రార్క గత్యైవ జానంతి తేతు నాహోరాత్ర విద స్స్వల్ప దర్శిత్వాదితి భావః॥౧౭॥

—♦ లఘుటిప్పణీ. ♦—

పునరావృత్తిత్వమితి॥ అతఏవార్చిరా దిత్వారా విష్ణులోక ప్రాప్తి పూర్వక శివలోక ప్రాప్తి రితి ఉపాసకస్య హృదయ గత పరమేశ్వరాను

గ్రిహేణ ప్రకాశిత ద్వారస్య మూర్ధన్యనాడ్యా దేహా న్నిష్క్రాంతి రశ్మిహితా । ఏవం విధస్య బ్రహ్మప్రాప్తి రర్చిరాదినా మార్గేణైవ॥ తథాచ శ్రుతిః । యత్రాసౌ కేశాంతో వివర్తతె । వ్యపోహ్య శీర్ష కపాలె । భూరిత్యగ్నౌ ప్రతి తిష్ఠతి । భువఇతి వాయౌసువ రిత్యాదిత్యే । మహ ఇతి బ్రహ్మణి ఆప్నోతి స్వారాజ్యం । తతి స్త్రివిధ మఃఖ నివృత్తి రిత్య 'నావృత్తి శ్శబ్దాది'త్యధికరణె 'యదాచర్మవ దాకాశ' మితి శ్రుతిరపి దర్శితే త్యవధేయమ్॥ ౧౭॥

## —◆ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ◆—

బ్రహ్మాది లోకములు కాల నియమమును గలవి గనుక పునరావృత్తి గలదని చెప్పుచున్నాడు॥ కృత - త్రేతా - ద్వాపర - కలియుగములు వెయ్యి పర్యాయములు ఆవృత్తి తిరిగిన యెడల బ్రహ్మకు వక్కపగలు. యీప్రకారమె నాల్గు యుగములు సహస్రావృత్తి తిరిగినయెడల రాత్రి కృతయుగ ప్రమాణము ౧౭౨౮౦౦౦ త్రేతాయుగ ప్రిమాణము ౧౨౯౬౦౦౦ ద్వాపరయుగ ప్రమాణము ౮౬౪౦౦౦ కలియుగ ప్రమాణము ౪౩౨౦౦౦ ఇట్టి యుగములు రెండువేల పర్యాయము తిరిగిన వక దినము యీలాటి ౩౦ దినములు వకమాసము. యీప్రికారము పన్నెండు మాసములు వకసంవత్సరము ఇట్లు నూరుసంవత్సరములు బ్రిహ్మయుర్దాయము. అప్పుడు బ్రిహ్మయు బ్రహ్మలోకమును క్రింది సృష్టియంతయు నశించి పోవును. (పృధివి. అప్పు. తేజము - వాయువు- ఆకాశము.) లయించును యెట్లనగా పృధివి అప్పునందును. అప్పు అగ్నియందును, అగ్ని వాయువునందును, వాయువాకాశము నందును ఆకాశము ప్రకృతి యందును లయించును. బ్రహ్మయుబ్రహ్మసృష్టియు ప్రకృతియందు లయించును. (యిట్లు బ్రహ్మయొక్క అహోరాత్రిములను తెలిసిన వారు) (అనగా పంచభూతముల యొక్క లయమును తెలిసినవారు) యోగులు, ప్రసిద్ధమైన సూర్య చంద్రిగతులను తెలిసిన వారు స్వల్పబుద్ధులు గనుక

అహో రాత్రిషులను దెలిసిన వారు గారు॥ (ఉపాసకుడు అర్చిరాది మార్గముగా ముందు విష్ణులోకముకు వెళ్ళి అంతకంటె శ్రేష్ఠమైన శివ పదమును బొందును. అర్చిరాది మార్గమనగా ఉపాసకుడు హృదయమందున్న పరమేశ్వరానుగ్రహము చేత బ్రహ్మరంధ్రమార్గముగా కపాలము భిన్నమై వెడలిపోవును. పిమ్మట అగ్నిలోకమునకు వెళ్ళును. అటుపైని దేవలోకము. అటుపైని ఆదిత్యలోకము। ఆఖరున శివలోకమునకు వెళ్ళును. అదియె స్వారాజ్యము. అక్కడకు వెళ్ళిన వారికి పునరావృత్తి లేదు. తాపత్రియములేదు. అనావృత్యధికరణమందు సూత్రభాష్యములో ఉదాహరించ బడినది. చర్మమువలె ఆకాశమును చుట్టగలిగినప్పుడు శివుని తెలియక ముక్తినొంద వచ్చును॥ ౧౭॥

శ్లో॥ అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవ న్త్య హారాగమే
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవా వ్యక్త సంజ్ఞకే॥ ౧౮

—♦ భా ష్య మ్ ♦—

నను 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మే'త్యాది శ్రుతి వేద్యస్య సదాశివస్య నిమిత్తత్వేపి కి ముపాదాన కా బ్రహ్మాదయ ఇత్యాహ।-అవ్యక్తాదితి॥ తత్ర తావదిహావ్యక్త శబ్దేన, 'ప్రథమం। సహజం బ్రహ్మ మాయయా శూన్యమాగతం। శూన్యా త్ప్రకృతి రీశ శ్చే త్యత్రోక్తా ప్రకృతి ర్గృహ్యతే తత శ్చాకాశాదయ స్సర్వా వ్యక్తయో అహరాగమే ప్రభవంతీ త్యర్థః। ఏవం తదేవ రాత్ర్యాగమే తత్రైవా వ్యక్త సంజ్ఞకే ప్రలీయత ఇత్యర్థః॥౧౮॥

## —♦ లఘుటిప్పణీ ♦—

నిమిత్తత్వేపీతి॥ తత్ర తావత్ । సహజాఖ్యస్య పరబ్రహ్మణ శ్శివస్య చిదంబర శక్త్యాభాసస్య సమష్టి వ్యష్టి రూపేణ నిమిత్తత్వం మాయా రూపాయా మూలప్రకృతేశ్చ సమష్టి వ్యష్టి రూపేణైవోపాదానత్వ మితి యథోర్ణనాభి స్సృజతే గృహ్ణతే చేత్యాది శృత్యా లూతా తంత్వాత్మక స్వకార్యం ప్రతి స్వజీవ చైతన్యేన నిమిత్తత్వం స్వశరీరత్వేన చోపాదా నత్వ మితి వివేకః॥ ౧౫॥

## —♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

ఓయీ! సచ్చిదానంద రూపుడైన సదాశివుడు నిమిత్త కారణమై యుండగా ఉపాదాన కారణములైన బ్రహ్మను లెందుకంటె చెప్పు చున్నాడు. అవ్యక్త మనగా సదాశివుడయిన బ్రహ్మకు మాయాసంబంధము గలిగినప్పుడు శూన్యమై వచ్చినది. ఆ శూన్యము వలన ప్రకృతి పుట్టెను. దాని వలన ఈశ్వరుడు పుట్టెను. ఇక్కడ ప్రకృతి యనగా పరశివుని వల్ల నుంచి పుట్టిన మూలప్రకృతికి ఉపాదానమైన ఈశ్వరుడని తెలియవలెను. బ్రహ్మలు త్రైలోక్యమున్నూ ఈ ఈశ్వర రూప ప్రకృతి యందు లీనమయి పునః సృష్టికాలమందు ముందుగా బ్రహ్మను సృష్టించి ఉపా దాన కారణమైన బ్రహ్మవలన త్రైలోక్యము సృష్టింప బడుచున్నది. శృతిః యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై॥ బ్రహ్మకు పగలయినప్పుడు ఆకాశాదులయిన వ్యక్తులన్ని పుట్టు చున్నవి. రాత్రి యైనపుడు అవ్యక్తమందు లీనమగుచున్నవి. సహజమైన పరశివునకు చిదంబర శక్తి యందు ఆభాసము సమష్టిచే ఈశ్వరుడును వ్యష్టిచే జీవుడును అయి నిమిత్త కారణముగా నున్నూ, మాయా రూపమైన మూలప్రకృతికి సమష్టి వ్యష్టి రూపమై (అనగా :సమష్టి మాయా వ్యష్టి అవిద్య) ఉపాదాన కారణముగా నున్నూ ఉండెను. గనుక నిమిత్త

కారణమున్నూ ఉపాదన కారణమున్నూ ఊర్ణనాభము (సాలిపురుగు) వలె శివుడే యై యుండెను. సాలిపురుగు తంతువును తనలో నుంచే సృష్టించి మళ్లీ తనలోకే లాగుకొనును. ఇట్టి యూర్ణనాభము నిమిత్త కారణము ఉపాదాన కారణము ఎట్లయినదనగా సాలిపురుగు నందలి జీవ చైతన్యము నిమిత్తకారణము, సాలిపురుగు యొక్క శరీరమే ఉపాదాన కారణము అని తెలియ వలెను॥ ౧౮॥

శ్లో॥ భూతగ్రామ స్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే।
రాత్ర్యాగమే వశః పార్థ ప్రభవ త్యహరాగమే॥ ౧౯

—♦ భాష్యమ్. ♦—

ఏవ మస్య సంసారవర్గస్య స్వరూప ముక్తం తస్య లక్షణ మప్యాహ—భూతగ్రామ ఇతి, తథాచ, 'సూర్యా చంద్రమసౌ ధాతా యథా పూర్వ మకల్పయ ద్దివంచ పృథివీం చాంతరిక్ష మథోస్వ'రిత్యాది శ్రుతే రసత్కార్య వాదా నభ్యు పగమా త్సఏవాయం స్థావర జంగమాత్మకః పూర్వకల్పే స్థితః పున రస్మిన్ కల్పే ప్యవిద్యా కామ కర్మాదిభి రవశస్సన్ జాయ మానో భవతీత్యర్థః। ఏవం సతి 'మహతోఽపి మహా ప్రళయేతు యత్రా తమ స్తన్న దివా రాత్రి ర్నసన్న చా సచ్ఛివ ఏవ కేవలః తదక్షరం తత్సవితు ర్వరేణ్యాం యతః ప్రవృత్తా ప్రసృతా పురాతనీ' త్యాది ద్రష్టవ్యమ్॥ ౧౯॥

—♦ లఘు టిప్పణీ ♦—

యత్రాతమఇతి॥ ఏవంసతి, యత్రాతమ ఇత్యనేన తమాది వా ధ్వాన్త విహీనమేక మిత్యతోఽభిక్తం 'యత్తమసః పరస్తాది'తి యచ్ఛ తన్న

విశుర్వరేణ్య మితి గాయత్ర్యర్థే నిరూపితం తత ఏవేయం ప్రవృతా ప్ర
సృతావిస్తృతాన పురాతన సృష్టి రిత్యవధార్యమ్॥౧౯॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

యీ ప్రకారము సృష్టియంతయు జెప్పి దాని లక్షణమును జెప్పు
చున్నాడు. నూతన బ్రహ్మసృష్టి ప్రారంభమందు మునుపు సృష్టించినట్లు
గానే సూర్య చంద్రులను పృథివ్యాకాశములను స్వర్గమును స్థావర జంగ
మాత్మక మైన ప్రపంచ మంతను పూర్వకల్పమందున్నట్లు గానెసృజించె
ను. అనగా జీవ సముదాయము అవిద్య కామము కర్మ మొదలగు వాటిచే
పరవశమై బ్రహ్మయొక్క పగటిభాగమందు బుట్టి రాత్రి భాగమందు
ప్రళయమొందుచున్నది. యీ ప్రకారమె విష్ణు ప్రళయ మందును ప్ర
పంచ మంతయు లీనమైనపుడు రాత్రిం బగలు లేను. అప్పుడు సత్తు అస
త్తుగాని శివుడొక్కడె యుండెను. అప్పుడు మొట్టమొదట సృష్టి దేనివల
న బయలుదేరినదో అది సూర్యున కంటెను ప్రకాశముగలదిగాన అతమః
అని చెప్పబడిన అక్షరపరబ్రహ్మ మనగా యత్యర్థ ప్రతిపాదక మైన
శివతత్వ మని యెరుగవలెను.౧౯॥

శ్లో॥ పర స్తస్మాత్తు భావోఽన్యోఽ వ్యక్తోఽవ్యక్తా త్సనాతనః ।
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు నవినశ్యతి॥ ౨౦

—♦ భా ష్య మ్ ♦—

నన్విహ సంసారే కతివిధః పదార్థో యస్మా త్సర్వ
పదార్థేభ్య స్సదేత్యాదే శ్శివస్య పరత్వ మవినాశిత్వ మేకత్వం
చేత్యాహ—పర స్తస్మాదితి॥ ఏవం తర్హి పదార్థో ద్వివిధో
భావోఽ భావాశ్చ, తత్ర తావద్భావస్తు దేవ ఏకో విశ్వస్య
కర్తా భువనస్యగోప్తేత్యాది శ్రుతే శ్శివ మద్వైతం తురీయ

మీయ్యాది శ్రుతే శ్శ్చైకవిధ ఏవేతి భోధ్యం । తతోఽభావస్తు ద్రవ్య గుణ కర్మ సామాన్య విశేష సమవాయేతి నామ్నా షడ్విధ ఏవేతి తత్రి జాయతేస్తి విపరిణమతే వర్థతేఽపక్షీయతే వినశ్యతీ త్యేవం క్రమేణ సర్వేషు భూతేషు వినశ్యత్స్వపి నవినశ్యతీతి యం చకిత మభిధత్తే శ్రుతిరపీత్యాది సహస్ర శ్రుతి స్మృతి వేద్య శ్శ్చైక ఏవ ప్రకృతా దవ్యక్తా త్పరో భావ శబ్దాభిధేయో వ్యక్త ఇత్యవధార్యమ్॥ ౨౦॥

—◆ ల ఘు టి ప్ప ణీ . ◆—

నను ద్రివ్యగుణ కర్మ సామాన్య విశేషసమవాయా భావా స్సప్త పదార్థ ఇత్యాద్యర్థ వైనాశికానాం నిరాకర్తు మాశంకతే॥నన్వేతి॥ తదేతదుక్త మాత్మోపనిషత్ప్రదీపే 'కర్మశాస్త్రే కుతో జ్ఞానం తర్కే నైవాస్తి నిశ్చయః సాంఖ్యయోగా భిదాపన్నా శాబ్దికాశ్శబ్ద తత్పరాః అన్యే పాఖండిన స్సర్వే జ్ఞానవార్తా సుదుర్లభా ఏకం వేదాంత విజ్ఞానం స్వానుభూత్యా విరాజిత' ఇత్యధిక మన్యత్రి విస్తరః॥౨౦॥

—◆ ఆ ం ధ్రి తా త్ప ర్య ము ◆—

ఓయీ! ఈసంసారమందు పదార్థము యెన్నివిధములు? అన్నిపదార్థములకంటెను సదాశివునికి పరత్వమును నాశరాహిత్యమును ఏకత్వమును న్నూ చెప్పుచున్నాడు. పదార్థము రెండువిధములు, భావము (ఉన్నది). అభావము (లేనిది) భావపదార్థము పరమాత్మ. అదియే ప్రిపంచమును సృష్టించి పాలించు చున్నది. అదియె శివుడని అద్వైతమని తురీయమని చెప్పదగిన దని శృతులు పలుకుచున్నవి. యిన్ని విధములు జెప్పినను ఒకే విధము (ఒక్కటే) అభావమైతే ఆరు విధములు అవి ద్రవ్యము, గుణము, కర్మము, సామాన్యము, విశేషము, సమవాయము॥ ఈ యారింటిలో

పుట్టుట, ఉండుట, మారుట, వృద్ధినొందుట, క్షీణించుట, నశించుటయను షడ్భావవికారములు గల సర్వప్రాణులు నశించినను సదాశివుడు (ఆత్మ) యెప్పటికిని నశించడని శృతియును భయములో జెప్పుచున్నదని అట్టి శివుడొక్కడె యని సహస్రి శృతులు సహస్రస్మృతులు ఘోషించు చున్నవి. అట్టి శివుడు ప్రకృతమైన అవ్యక్తము కంటె పరుడై వ్యక్తముగాని భావ పదార్థము (ద్రవ్యము, గుణము, కర్మ, సామాన్యము, విశేషము, సమవాయము. అభావము, అనును నట్టి అర్థవైనాశికుల యొక్క మతమును నిరాకరించు చున్నాడు. కర్మశాస్త్రమందు జ్ఞానములేదు. తర్కశాస్త్రమందు నిశ్చయమే లేదు. సాంఖ్య యోగశాస్త్రములు భేదజ్ఞానము గలవి. వ్యాకరణ శాస్త్రము శబ్దమును సాధు చేయునదే. మిగిలిన శాస్త్రజ్ఞులందరు పాఖండులె. ఒక్క వేదాంతశాస్త్రము యొక్క అనుభవజ్ఞానము ముక్తి దాయకమై ప్రకాశించు చున్నది.

శ్లో॥ అవ్యక్తో ఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిం
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ॥ ౨౧

—♦ భాష్యమ్. ♦—

నను తభావ శబ్దేన సదాశివో గృహీత స్తస్యజ్ఞానే కిం ఫలమిత్యాహ- అవ్యక్తఇతి॥- తత్త్రైవంసతి సహస్ర శీర్షేత్యత్ర 'గాన విషయా త్పురుషో హవై రుద్ర' ఇత్యాది శ్రుత్యంతరాత్పురుషా న్నపరం కించి త్సాకాష్ఠా సాపరాగతి రిత్యాది శ్రుత్యంతరాచ్చ పదం యత్పరమం విష్ణో స్తదేవా ఖిలదేహినామిత్యాది స్మృతేశ్చ యత్పరమం మమ ధామ పూర్వోక్త రీత్యా పరంపదాఖ్యం తద్ జ్ఞాత్వా న పునర్జన్మే త్యవధార్యం॥

—◆ ఆంధ్ర తాత్పర్యము ◆—

ఓయీ! భావ మనగా సదాశివుడని శ్రుతి యభిప్రాయము. అట్టి వాని దెలిసిన ఫలమేమనగా జెప్పుచున్నాడు. అవ్యక్త మన నక్షర మని వచింప బడినది. అదియే పురుషుడు. పురుషుడే రుద్రుడు, ఆపురుషుడు వేయి శిరంబులు గలవాడు. అతని కంటె నుత్తమ గతి లేదని శ్రుతి వేద్యము విష్ణువు కంటె నుత్కృష్ట స్థానమైన దే శివపదము గలదో అదియు అఖిల దేహులకు గమ్యస్థానము. అట్టి పదమును బొందిన వారికి పునర్జన్మ లేదని తెలియవలెను॥ ౨౧॥

శ్లో॥ పురుష స్సపరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా।
యస్యాన్తస్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్॥ ౨౨

—◆ భాష్యమ్ ◆—

నను పురుషా న్నపరం కించి త్సాకాష్ఠా సా పరా గతి రిత్యాది శ్రుతివేద్యః పరః పురుషః కథం లభ్యఇత్యాహ పురుష ఇతి॥ ఏవం తర్హి నాన్యో విషయో విద్యతే యస్యాం సా తయా, తద్దైవ మన శ్శంభు పదారవింద యో రిత్యాది నవధా భక్త్యా స మత్తః పరః పురుషో హేపార్థ లభ్య ఇత్యర్థః। ఏవం యస్య పురుషస్యాంతస్థా న్యాంతర్వర్తీని భూతాని యేన చ పురుషేణ సర్వ మిదం కార్య కరణాత్మకం వ్యాప్తం॥ యస్మా త్పరం నాపర మస్తి కించి ద్యస్మా న్నాణీయో నజ్యాయోస్తి కశ్చిత్ వృక్షఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేక స్తేనేదం పూర్ణం పురుషేణసర్వ మిత్యాది శ్రుతే రితి భావః॥ ౨౨

## —♦ లఘు టిప్పణీ ♦—

భక్త్యైతి॥ యస్య ఫాలే విభూతిర్నా సాంగె రుద్రాక్షు ధారణం। న శంభో ర్భవనే పూజా సవిప్ర శ్శ్వపచాధమ ఇత్యాది శ్లోకరూపయా శ్రుత్యా। తథా॥ జాతస్య జాయమానస్య గర్భస్థస్యాపి దేహినః। మాభూన్మమకులే జన్మ యస్య శంభు ర్నదైవత మిత్యాది స్మృత్యా చేత్యాశయః

## —♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

ఓయీ! పురుషునికంటె నుత్కృష్టమైనదిలేదు. అదియె నుత్తమగతియైనంమన యట్టి పురుషుడెట్లు లభ్యమగునంటె చెప్పుచున్నాడు. లోకమందు జనుడు జ్ఞానంబున గాని ముక్తి నొందజాలడు. జ్ఞానము భక్తిలేక సాధ్యపడదు. భక్తి కర్మరూపము లేక నిలువదు. ఆకర్మ నిష్కామ కర్మగావలయును. నిష్కామ కర్మ చేసినంమన భక్తి దృఢమగును. భక్తి మూడు విధములు. బాహ్యభక్తి, అనన్యభక్తి, ఏకాంతభక్తి. బాహ్యభక్తి లేనిదే అనన్యభక్తి కుదరదు. అనన్యభక్తి అలువడక ఏకాంతభక్తి రాదు. యీమూడును ఒక్కొకటి మూడువిధములై తొమ్మిది భేదములు గలదైనవి. శ్రవణము, కీర్తనము, స్మరణము. పాదసేవనము. అర్చనము, వందనము దాస్యము, సఖ్యము, ఆత్మార్పణము. శ్రవణమనగా ఈశ్వరుని పంచవింశతి లీలలను తత్సంబంధమైన కథలను, ఆతని మహత్తును సామర్థ్యమును, పరమ శ్రద్ధాసమేతుడై తృప్తిలేని మనసుతో నిరంతరము వినుచుండుట॥ కీర్తనమనగా, ఈశ్వరుని గుణములను చరిత్రలను నామమును పరాక్రమమును ఆనంద పూర్వకముగా మహోత్సాహముచె చెప్పుచుండుట॥ స్మరణమనగా నిరంతరము అనన్యభావముచే పర్వమేశ్వరుని స్మరించుచు మగ్నుడై యుండుట॥ ఈశ్రవణకీర్తన స్మరణములు మూడును బాహ్యభక్తి పాదసేవన మనగా ఈశ్వర చరణము నాశ్రయించి, ఇదియె నాకాధార మనుకొనుట అర్చన మనగా మనసా వాచా కర్మణా పవిత్రసామ

గ్రిచే శంభు చరణ పూజచేయుట. వందనమనగా. ఈశ్వరమూర్తికి గాని తదంశగల భక్తునకుగాని అచార్యునకుగాని బ్రాహ్మణునికిగాని గురుజనులకుగాని తల్లికిగాని తండ్రికిగాని పవిత్రభావములో ఆదరసత్కార పూర్వకముగా నమస్కరించుట వారిసేవజేయుట, యీమూడును అనన్యభక్తి దాస్యమనగా, ఈశ్వరుడు స్వామి, నేను దాసుడనని పరమశ్రద్ధతో సేవజేయుట, సఖ్యమనగా - ఈశ్వరుడే నాకు సఖుడని తలచి సర్వస్వమును సమర్పించుటయు సద్భావముచె పాపపుణ్యములు సమర్పించుటయున్ను- ఆత్మార్పణమనగా, తాను ఈశ్వర చరణములయందు అన్నివిధముల చేతను యెల్లపుడు మనసును ప్రవేశపెట్టి తన్మయత్వము నొందుట యీమూడును ఏకాంత భక్తియనదగును. బాహ్యభక్తుడు స్వాశ్రిమ విహిత కర్మలను జేసి ఈశ్వరార్పణము జేయుచుండును. అనన్య భక్తుడు స్వాశ్రిమ విహిత కర్మలను ఫలత్యాగియై ఈశ్వరాజ్ఞా పరిపాలన యని జేయుచుండును. ఏకాంతభక్తుడు లోకసంగ్రహంబుగా విహిత కర్మంబుల ననుష్ఠించు చుండును. కర్మంబు ఈశ్వరాజ్ఞ గావున కర్మ వ్యతిరిక్తమైన కేవల భక్తి వృద్ధి నొందదు. ఈశ్వరుడు సంతసింపడు. గనుక నిష్కామన ఫలత్యాగ పురస్సర కర్మ యుక్తంబైన భక్తియే సంప్రదాయ లబ్ధమై యుండును. ఇందు యేభక్తి యేపదంబొసగు ననగా. ఈశ్వరార్పణ కర్మయుక్తంబైన బాహ్యభక్తి సాలోక్యంబొసంగును. సాలోక్యమనగాపరమేశ్వరుడుండెడిలోకంబునసంచరించుట బాహ్యభక్తి దృఢమగునేని సామీప్యంబును యిచ్చును. సామీప్యమనగా పరమేశ్వరుని సన్నిధిని గాచుకొని యుండుట, ఫలత్యాగ కర్మయుక్తంబైన అనన్యభక్తి సారూప్యంబు నిచ్చును. సారూప్య మనగా పరమేశ్వరుని రూపంబుతో నుండుట, లోకసంగ్రహ కర్మయుక్తంబైన ఏకాంత భక్తి సాయుజ్యము నిచ్చును. సాయుజ్య మనగా కోటి సూర్యకాంతి గల ఉమాపతి లోకమును బొంది పునరావృత్తి లేకుండుట, ఉమాపతి

లోకవర్ణనము పూర్వోక్తమై నందు నిక్కడ విరమించినారము. ఓ యర్జునా! ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి యను ప్రమాణముచే (పురిహృదయపుండరీకే శేత ఇతి పురుషః అట్టి పురుషుడే గమ్యస్థానము. అట్టి పురుషుడైన శివుని కంటె గొప్పవాడు అణురూపముతో గాని మహద్రూపముతో గాని యెవరు ఉండలేరు. అట్టి పురుషునిచే జగదంతయు వ్యాప్తమైన దని శ్రుతి తాత్పర్యము॥ (యెవని ఫాలమందు విభూతిస్మరేఖ లేకుండునో యెవనిశరీరమందు రుద్రాక్ష ధారణం లేదో శివాలయమందు పూజయెవనికిలేదో అట్టి శివవిప్రుడు కుక్కమాంసం తిన్నవానికంటె నధముడు॥ పుట్టిన వాడుగాని పుట్టబోవు వాడుగాని గర్భంలోనున్నవాడుగాని దేహి శివదేవోపాసకుడు గానియెడల నా కుల మందు పుట్టరాదని స్మృతి॥ ఆదిత్య పురాణె ఉత్కృష్టాధ్యాయె శివసృష్టి సముద్భూతా జాయంతే బ్రాహ్మణోత్తమాః తేషాం దశ కళా యుక్తాస్త్వ న్యే విప్రాస్తు షట్కళాః షడాధార యుతా విప్రాస్స్వార్థ కృత్యేషు యోగ్యకాః షోడ శాధార సంయుక్తాస్త్వా దిశైవాః పదార్థకే యోగ్యా ఏవ సదాకాలం తేషాం దోషో న విద్యతే ॥స్మృతి॥ షోడశ కలో హ్యై పురుషః యావానేవ పురుషః తస్మిన్ వీర్యం దధాతి॥ ఈ శ్రుతి స్మృతులను బట్టి ఆదిశైవుడు భస్మ రుద్రాక్ష ధారణములు చేసి శివాలయమందు స్థావర లింగార్చన శివ మంత్రోపాసన శివభక్తి తప్పక చేయ వలయుననియు అట్లు శివాలయమందు పూజ చేయనివాడు చండాలుని కంటెను నీచుడని శ్రుతిస్మృతులు శాసించుచున్నవి. యేమనగా వీరలు శివ సృష్టిలోనివారనియు బ్రాహ్మణులలో శ్రేష్ఠులనియు వీరికి షోడశ కళలున్నవనియు ఇతరమైన బ్రహ్మసృష్టిలోని బ్రాహ్మణులకు ఆరుకళలే గలవనియు అందువలన దేవాలయములో పూజించుట కర్హత లేదనియు శైవులకు స్వార్థపరార్థ పూజాధికారము గలదనియు యీధర్మముల ప్రకారము నడిచినవారందరూ ఆజన్మమందే శివలోకమలంకరించ గలరు. మరి జన్మమునకు రారు ॥౨౨॥

శ్లో॥ యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ॥ ౨౩

—♦ భాష్యమ్. ♦—

నను కథం జానీమ స్సగుణ బ్రహ్మోపాసకా స్తత్పదం ప్రాప్య ననివర్తంతే తత్ర తావత్కాలా వధారణాం వక్తుం ప్రతి జానీతే॥ యత్రేతి॥ తత్ర తావత్ప్రాణోత్క్రమణా నంతరం యత్ర యస్మిన్ కాలే కాలాభిమాని దేవతోపలక్షితే మార్గే ప్రయాతా యోగినో ఽనావృత్తిం ప్రవృత్తించ యాంతి తంకాలం హేభరతర్షభ వక్ష్యామీత్యర్థః॥ ౨౩॥

—♦ లఘుటిప్పణీ ♦—

ప్రతిజానీతఇతి॥ యతో యత్రి కుత్రా ప్య వస్థితి స్తత్రి తత్రాపి శివజ్ఞానాదేవ సర్వేషాం ముక్తి రితి స్కాందే ప్యుక్తం తద్యథా 'ఇహా ముత్రేషు లోకేషు యత్రి కుత్రాప్యవస్థితిః వినాజ్ఞానా న్న ముక్తిస్స్యా త్తద్జ్ఞానం భక్తితో భవే దిత్యాద్యవస్య మవధార్యమ్॥ ౨౩॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఓయీ! సగుణ బ్రహ్మో పాసకులు శివపదమును బొంది పునరావృత్తి నొందరని మేమెట్లు తెలియగిలము? అందుకుగాను కాలనిశ్చయమును చెప్పుటను తెలియుచున్నాడు. ప్రాణము లేచిపోయిన తర్వాత ఉపాసనా పరులు కాలాభిమాని దేవతతో గూడిన యేకాలమందు వెళ్ళి తిరిగి రారో ఓ భరత వంశోత్తమా కర్మముల నాచరించిన యే యోగులు యే కాలమందు వెడలి తిరిగి వచ్చెదరో ఆకాలమును జెప్పుమంటిని (యొక్క

డనన్నను శివజ్ఞానము చేతనే ముక్తి గలదు గాని జ్ఞానము లేక ముక్తి లేను అట్టి జ్ఞానము భక్తి సాధ్యమని తెలియునది॥ ౨౩॥

శ్లో॥ అగ్ని ర్జ్యోతి రహ శ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్।
తత్ర ప్రయాగంగచ్ఛంతి బ్రహ్మబ్రహ్మ విదోజనాః॥　౨౪

—♦ భా ష్య మ్ ♦—

ఏవ మిహ పూర్వత్ర ప్రతిజ్ఞాతం వృత్తమేవాహ—అగ్ని రితి। తత్ర తావదగ్ని ర్జ్యోతి రిత్యర్చి రభిమానినీ దేవయానో పలక్షితా దేవతో చ్యతే తత్రాప్య హరిత్యనేన శుక్ల పక్ష శబ్దేన చ షణ్మాసో త్తరాయణం గృహ్యతే తతశ్చ శరీ త్యాగా త్క్రమ ముక్తి మార్గేణ బ్రహ్మవిదో యోగాభ్యాస శీలా స్సూర్యం జ్యోతిః ప్రాప్య యోసావాదిత్యే పురుష సోహ మస్మీతి శ్రుతి న్యాయేన బ్రహ్మలోకం గత్వా తతః జ్ఞానోప దేశేన తేషా మనావృత్తి రిత్యర్థః॥ ౨౪॥

—♦ ల ఘు టి ప్ప ణీ . ♦—

జ్ఞానోపదేశేనేతి॥ తద్యథా ।మర్త్యలోకే జలే బింబం త్వాదర్శే స్వర్గభూమికే। బ్రహ్మలోకేయథా తప్యం త్రిభి ర్భేదై స్త్రిధా మత మిత్యాది స్మృత్యా సర్వత్ర శివజ్ఞానాదేవ ముక్తిరితి యదా చర్మవదా కాశం వేష్టయిష్యంతి మానవాఃత్మదా శివమవిజ్ఞాయ దుఃఖస్యాన్తో భవి ష్యతీ త్యాదిశ్రుత్యా ప్యవధార్యమ్॥ ౨౪॥

—♦ ఆంధ్రతాత్పర్యము ♦—

ఈశ్లోకమందు పూర్వమందుచెప్పిన వృత్తాంతమునె జెప్పుచున్నాడు అగ్నిజ్యోతి యనగా దేవయాన మార్గమందు గనుపించే అర్చి రభిమాని

దేవత అహస్సు, శుక్లపక్షము, అనగా ఆరుమాసముల కాలము గ
ఉత్తరాయణము । అప్పుడు దేహత్యాగమును జేసినట్టి యోగాభ్యాస
గల బ్రహ్మవేత్తలు సూర్యతేజస్సును పొంది, యోసావాదిత్యే పు
స్సోహమస్మి । ఆదిత్యోవా ఏష ఏతన్మండలం = పురుషః । అ
వాదిత్యే బ్రహ్మేతి శృతిన్యాయముచే బ్రహ్మలోకమునకు వె
అక్కడ జ్ఞానోపదేశము నొంది క్రమముక్తిచే పునరావృత్తి రహితు
యుందురు. (మనుష్యలోకమందైనను స్వర్గలోక మందైనను బ్రహ్మలో
మందైనను శివజ్ఞానం వల్లనె ముక్తిశివుని తెలియక ముక్తినొందగో
వారు ఆకాశమును చర్మమువలె చుట్టబెట్టినట్లైయని తెలియవలెను ॥ ౨౪॥

శ్లో॥ ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే॥ ౨౫॥

—♦ భాష్యమ్ ♦—

ఏవమిహ పునరావృత్తి లక్షణం పితృయాన మా
మప్యాహ—ధూమఇతి॥ ఇహాఽపి ధూమ ఇత్యనేన ధూమా
మానినీ మర్త్య యానోపలక్షితా దేవ. తోచ్యతే తతః
రాత్రి రిత్యనేన కృష్ణపక్షః షణ్మాసత్వేన దక్షిణాయను
గృహ్యతే తత్రచ యోగిన సాధనశీల స్య శరీర త్యాగా
త్సయోగీ చాంద్రమసం జ్యోతిః ప్రాప్య నివర్తతే పునరా
వృత్తి భాగ్భవేదితి వివేకః॥ ౨౫॥

—♦ లఘు టిప్పణీ ♦—

పునరావృత్తి భాగితి॥ ఏవంసతీహ శివజ్ఞానంవినా పునరపి జనన
పునరపి మరణం పునరపి గర్భనివాసం పునరపి జననీ జఠరే శయనం। పు
నరపి సృష్టివిలాస ఇత్యాది రీత్యా పునరావృత్తి భాగేవే త్యవ ధేయం॥ ౨౫॥

## —♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ధూమాభిమానదేవత, రాత్ర్యభిమానదేవత, కృష్ణపక్షాభిమానదేవత దక్షిణాయ నాభిమానదేవత వీరలు యేమార్గ మందుండి నడిపించెదరో ఆమార్గంబున బోవు కర్మయోగులు శరీర త్యాగానంతరం పూర్వోక్త ధూమాది మార్గంగా వెడలి చంద్రలోకమునకు వెళ్ళిచంద్ర జ్యోతిని బొంది పునర్జన్మము కొరకు భూలోకమునకు వచ్చుచున్నారు. (శివజ్ఞానము లేక జననము మరణము గర్భవాసము సృష్టి విలాసము నిగ్రహింప జాలరు. అర్ధాంతరము అర్చి అహస్సు. శుక్లపక్షము ఉత్తరాయణము, అనగా సూర్యనాడి యనియు. ధూమము, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనము అనగా చంద్రనాడి యనియు అర్ధము. యీ రెంటిలో సూర్యనాడి పురుషనాడి, చంద్రనాడి స్త్రీనాడి, సూర్య నాడి యందు యెనిమిదంగుళముల శ్వాసము వెడలు చుండును. సర్వదా యీనాడిని నడిపించు వారలకు నాలుగంగుళముల శ్వాసము మిగిలి ఆయు ర్వృద్ధియై అంతమందు (సూర్యమండలము భేదించుకుని బ్రహ్మములో గలియుదురు.) కోటి సూర్య ప్రకాశ మానమైన యాత్మస్వరూపముతో సర్వవ్యాపకులై యుందురు. చంద్రనాడి యందు పది రెండంగుళముల శ్వాసము వెడలు చుండును. ఇది స్త్రీనాడి, సర్వదా యీనాడిని నడిపించు వారలకు ఆయువు తక్కువయై అంతమందు చంద్రమండలమున కేగి పునర్జన్మము కొరకు భూమిమీద కిరణములద్వారా ఓషధులయందు పడి పునరావృత్తి నొందుదురు॥ ౨౫॥

శ్లో॥ శుక్లకృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే
ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽఽవర్తతే పునః॥ ౨౬

దేవత అహస్సు, శుక్లపక్షము, అనగా ఆరుమాసముల కాలము గల ఉత్తరాయణము। అప్పుడు దేహత్యాగమును జేసినట్టి యోగాభ్యాసము గల బ్రహ్మవేత్తలు సూర్యతేజస్సును పొంది, యోసావాదిత్యే పురుష స్సోహమస్మి। ఆదిత్యోవా ఏష ఏతన్మండలం = పురుషః। ఆపా వాదిత్యో బ్రహ్మేతి శృతిన్యాయముచే బ్రహ్మలోకమునకు వెళ్ళి అక్కడ జ్ఞానోపదేశము నొంది క్రమముక్తిచే పునరావృత్తి రహితులై యుందురు. (మనుష్యలోకమందైనను స్వర్గలోక మందైనను బ్రహ్మలోక మందైనను శివజ్ఞానం వల్లనె ముక్తిశివుని తెలియక ముక్తినొందగోరు వారు ఆకాశమును చర్మమువలె చుట్టబెట్టినట్లెయని తెలియవలెను ॥ ౨౪॥

శ్లో॥ ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్।
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే॥ ౨౫॥

—♦ భాష్యమ్ ♦—

ఏవమిహ పునరావృత్తి లక్షణం పితృయాన మార్గమప్యాహ—ధూమఇతి॥ ఇహాఽపి ధూమ ఇత్యనేన ధూమాభిమానినీ మర్త్య యానోపలక్షితా దేవ తోచ్యతే తథాఽపి రాత్రి రిత్యనేన కృష్ణపక్షః షణ్మాసత్వేన దక్షిణాయను గృహ్యాతే తత్రచ యోగిన స్సాధనశీల స్య శరీర త్యాగాత్సయోగీ చాంద్రమసం జ్యోతిః ప్రాప్య నివర్తతే పునరావృత్తి భాగ్భవేదితి వివేకః॥ ౨౫॥

—♦ లఘుటిప్పణీ ♦—

పునరావృత్తి భాగితి॥ ఏవంసతీహ శివజ్ఞానంవినా పునరపి జననం పునరపి మరణం పునరపి గర్భనివాసం పునరపి జననీ జఠరే శయనం। పునరపి సృష్టివిలాస ఇత్యాది రీత్యా పునరావృత్తి భాగేవే త్యవ ధేయం॥ ౨౫॥

## —♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ధూమాభిమానదేవత, రాత్ర్యభిమానదేవత, కృష్ణపక్షాభిమానదేవత దక్షిణాయనాభిమానదేవత వీరలు యేమార్గమందుండి నడిపించెదరో ఆమార్గంబున బోవు కర్మయోగులు శరీర త్యాగానంతరం పూర్వోక్త ధూమాది మార్గంగా వెడలి చంద్రలోకమునకు వెళ్ళిచంద్ర జ్యోతిని బొంది పునర్జన్మము కొరకు భూలోకమునకు వచ్చుచున్నారు. (శివజ్ఞానము లేక జననము మరణము గర్భవాసము సృష్టివిలాసము నిగ్రహింప జాలరు. అర్థాంతరము అర్చి అహస్సు. శుక్లపక్షము ఉత్తరాయణము, అనగా సూర్యనాడి యనియు. ధూమము, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనము అనగా చంద్రనాడి యనియు అర్థము. యీ రెంటిలో సూర్యనాడి పురుషనాడి, చంద్రనాడి స్త్రీనాడి, సూర్యనాడి యందు యెనిమిదంగుళముల శ్వాసము వెడలుచుండును. సర్వదా యీనాడిని నడిపించు వారలకు నాలుగంగుళముల శ్వాసము మిగిలి ఆయుర్వృద్ధియై అంతమందు (సూర్యమండలము భేదించుకుని బ్రహ్మములో గలియుదురు.) కోటి సూర్య ప్రకాశ మానమైన యాత్మస్వరూపముతో సర్వవ్యాపకులై యుందురు. చంద్రనాడి యందు పది రెండంగుళముల శ్వాసము వెడలు చుండును. ఇది స్త్రీనాడి, సర్వదా యీనాడిని నడిపించు వారలకు ఆయువు తక్కువయై అంతమందు చంద్రమండలమునకేగి పునర్జన్మము కొరకు భూమిమీద కిరణములద్వారా ఓషధులయందు పడి పునరావృత్తి నొందుదురు|| ౨౫||

శ్లో|| శుక్లకృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతేమతే
　　ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽఽవర్తతే పునః|| ౨౬

—♦ భా ష్య మ్ ♦—

తత్రానావృత్తి సావృత్తి లక్షణ ద్వయ మేవోప పాదయతి। శుక్లకృష్ణేఇతి॥ ఏవం సతీహ పూర్వం శుక్ల కృష్ణ గతీ ద్వే యతో జగతః పూర్వం ప్రతిపాదితే తేచ శాశ్వతే వినా శివజ్ఞానం ననివర్తేతే తథాప్యేకయా శుక్లగత్యా యోగీధ్యాన శీలో ఽనావృత్తిం యాతి తతోన్యయా తు కృష్ణగత్య పునస్సావృత్తిం యాతీత్యర్థః॥౨౬॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

వినాశివజ్ఞానమితి॥ అతఏవ నారదం ప్రతి కృష్ణే నై వోక్తం। త ద్యథా, వినాశివప్రసాదంహి భ్రాంతిః క్వాపి ననశ్యతి అతఏవ భ్రమం త్యేతే భ్రమ రాశ్శివవర్జితాః అహంతు జగతః కర్తా భూతానా మీశ్వ రోపి సన్ జ్ఞాపయన్ స్వాత్మనో మూలం పూజయామి మహేశ్వర' మి త్యాది స్కాందే వచనైర్ హరిహర క్షేత్రాదినా ప్రత్యక్షతశ్చావధేయం॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

అనావృత్తి లక్షణమును సావృత్తి లక్షణమును జెప్పుచున్నాడు॥ అర్చిరాది మార్గమనియు ధూమాది మార్గమనియు, శుక్లగతి యనియు, కృష్ణగతి యనియు జ్ఞానకర్మాధికారులకు అనాది నుంచి శాశ్వతముగా నున్నవి. జ్ఞానప్రకాశమైనందున శుక్లగతి యనియు అవిద్యావరణ గలిగినందున కృష్ణగతి యనియు నర్థము. జ్ఞానాధికారులకు శుక్లగతి అర్చిరాది మార్గము పునరావృత్తి రహితమైనది. కర్మాధి కారులకు కృష్ణగతిధూమాది మార్గము పునరావృత్తిగలది (శివప్రసాదములేక భ్రాంతియెక్కడను నశించదు గనుకనే శివభక్తిలేని వాళ్ళు భ్రమరముల వలె తిరుగుచున్నారు. నేను

జగత్కర్తనై భూతములకు పాలకుడనైనప్పటికి నాకును మూలమైన మహేశ్వరుని తెలియజేయుచు పూజించుచున్నాను. ఇట్టివచనములు స్కాందమందు హరిహర క్షేత్ర మహత్తులో ప్రత్యక్షముగా చూడగలరు॥౨౮॥

శ్లో॥ నైతేసృతీపార్థ! జానన్ యోగీ ముహ్యతి కశ్చన ।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున!॥ ౨౭

—♦ భాష్యమ్ ♦—

నన్వేతన్మార్గ ద్వయం జ్ఞాత్వా ఫలం కిమ స్తీ త్యాహ । నైతఇతి॥ తథాచ హేపార్థ! యోగీ యోగాభ్యాస శీలో యద్యేతే సృతీ మార్గద్వయం విజానం స్తిష్ఠతి సఏవేహ జన్మనా యత్నతో న విముహ్యతి తస్మాన్మదుపదేశేషు సర్వేషుకాలేషు దృఢాభ్యాసేన యోగయుక్తో భవేతి త్వమపి న విముహ్యాసీత్యర్థః॥౨౭॥

—♦ లఘుటిప్పణీ ♦—

విజానన్నతి॥ తద్యథా । 'శృత్వా ధర్మం విజానాతి శృత్వా త్యజతి దుర్మతిం శృత్వాజ్ఞాన మవాప్నోతి శృత్వా మోక్షంచగచ్ఛతీ' త్యాది బోధ్యమ్॥ ౨౭॥

—♦ ఆంధ్రితాత్పర్యము ♦—

ఓయీ! శుక్ల కృష్ణ గతులను తెలిసినందున ఫలమేమంటె చెప్పుచున్నాను. అర్జునా మోక్షసంసార, ములను బొందించు నీరెండు దారులను తెలుసుకొనిన యే యోగియు మోహమును గాంచడు । అందువలన నా ఉపదేశములయందు సర్వదా దృఢాభ్యాసముజేసి యోగముతో

31

గూడినవాడవగుము. నీవును మోహమునొందవు (విని ధర్మమును తెలియుచున్నాడు. విని దుర్బుద్ధిని వదలుచున్నాడు, విని జ్ఞానమును సంపాదించుచున్నాడు। విని మోక్షమును బొందుచున్నాడు అని తెలియుము)॥౨౭॥-

శ్లో॥ వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ।
దానేషు యత్పుణ్య ఫలం ప్రదిష్టమ్।
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా।
యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్॥ ౨౮

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదేఽక్షర
పరబ్రహ్మ యోగోనామాష్టమోధ్యాయః॥

—◆ భాష్యమ్ ◆—

ఏవమిహ పూర్వార్ధ జ్ఞానవత స్తత్క్రియా కలాపకృతవత శ్చ ఫలమప్యాహ—వేదేష్వితి॥ తత్ర తావద్వేదేషు సమ్యగధీతేషు యజ్ఞేషు సాంగోపాంగ సాహిత్యేన శ్రద్ధయానుష్ఠితేషు। తపస్సు కృచ్ఛ్ర చాంద్రాయణాదినా సుప్తప్తేషు దానేషు దేశే కాలే పాత్రేచ శ్రద్ధయా విత్తశాఠ్య రహితేన దత్తేషు యత్పుణ్యస్య కర్మణ స్స్వర్గ రాజ్యాది ఫలం తత్సర్వం ఫల మతిశయేనైతి ప్రాప్నోతి సర్వోపి జన ఇతిశివమ్॥ ౨౮।

ఇతి శ్రీ శ్వేతాచార్య గురుచరణ శిష్య భావ సమాసాదిత శైవసిద్ధాంత ప్రవర్తక శ్రీ శ్రీకంఠ శివాచార్య విరచితే తత్త్వైక దర్శన నామకే గీతాభాష్యే అక్షర పరబ్రహ్మయోగోనామాష్టమోధ్యాయః॥

## —◆ లఘు టిప్పణీ ◆—

అతఏవోపసంహరన్నాహ । తత్సర్వమితి॥ తత్రైవంసతి । 'కథయా సిద్ధ్యతి ధ్యానంధ్యానా త్కైవల్య ముత్తమం' । ఇత్యాది బ్రహ్మోత్తర ఖండే స్కాందా చ్చే త్యవధార్య మిత్యలం॥ ౨౮॥

ఇతిశ్రీ శ్రీకంఠ శివాచార్య శిష్య విశ్వేశ్వర శివాచార్య
విరచితాయాం లఘుటిప్పణ్యాం అక్షర
పరబ్రహ్మ యోగోష్టమః.

## —◆ ఆంధ్రి తాత్పర్యము ◆—

ఈప్రకారము పూర్వోక్తమైన యర్థమును దెలిసిన వానికిన్ని ఆ ప్రకారము క్రియాకలాపమును జేసిన వానికిన్ని ఫలమును జెప్పుచున్నాడు వేదాధ్యయన ఫలమునున్నూ శ్రద్ధతో చేయబడిన సాంగోపాంగ యజ్ఞముల యొక్క ఫలమునున్నూ, కృచ్ఛ్ర చాంద్రాయణాదులచె తప్తమైన తపస్సుల యొక్క ఫలమునున్నూ, లుబ్ధత్వము లేక దేశ కాల పాత్రముల నెరిగి శ్రద్ధతో జేసిన దాన రూపమైన పుణ్య కర్మకు ఫలమూ, స్వర్గ రాజ్యాధిపత్యము, దానికంటె నతిశయమైన ఫలమునున్నూ అందరు పొందగలరు. (కథవినుటచే ధ్యానము సిద్ధించును, ధ్యానము చేయుట వలన కైవల్యమున్నూ సిద్ధించునని పురాణములయందు గలదు.)

ఇట్లు తత్త్వైక దర్శనమను శ్రీకంఠీయ గీతాభాష్యమునకు బోధానంద మహర్షిచేరచింపబడిన భావబోధమను నాంధ్రి తాత్పర్యమునఅక్షర పరబ్రహ్మయోగమను నష్టమాధ్యాయము సమాప్తము॥ ౨౮॥

---

ఓమ్

# శ్రీమచ్ఛ్రీకంఠాచార్యకృతే

# శ్రీ భగవద్గీతా భాష్యే

## రాజగుహ్య నిరూపణ యోగోనామ-నవమోధ్యాయః

శ్రీ కృష్ణ ఉవాచ—

శ్లో॥ ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే।
జ్ఞానం విజ్ఞాన సహితం యజ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥౧

—భాష్యమ్—

'అష్టాదశానాం విద్యానాం యోగవిద్యా పరా తతః ఆత్మవిద్యా పరా గుహ్యా నవమే సా సమీర్యతే॥ అథ పూర్వోక్తమేవ తత్వం విస్తరేణ వ్యాఖ్యాతం తత్ప్రసంగే నాన్యచ్చ రహస్య మ్వక్తుమాహ—ఇద న్త్వితి। ఏవం సతీ దం ప్రాగ్బహుధోక్తమపి బ్రహ్మ తత్వ విషయకం జ్ఞానం తత్రాప్య ధికం గుహ్యతమం గోపనీయ న్తే తుభ్యం ప్రవక్ష్యామీ త్యర్థః। తదేతజ్ఞానం శాస్త్రీయ మపి విజ్ఞాన సహితం తదపి యజ్ఞాత్వా త్వాశుభా త్సంసారబన్ధనా న్మోక్ష్యసే తత్ప్రవక్ష్యామీ త్యర్థః౧

—◆ ల ఘు టి ప్పణీ ◆—

నను పురాణ న్యాయ మీమాంసే త్యాదినా ష్టాదశ విద్యోక్తాః తత్ర కా సా విద్యా గరీయసీ త్యాహ—ఆత్మపరేతి తదుక్తం స్కాందే బ్రహ్మ గీతాయాం తద్యథా 'ఆత్మవిద్యా విహీనస్య శోకసాగర ఎవహి ముక్తి రేవాత్మ నిష్ఠస్య నాస్తి సంశయ కారణ మిత్యా ద్య వధేయం॥౧॥

—◆ ఆం ధ్రి తా త్ప ర్య ము ◆—

అష్టాదశ విద్యలలో యోగవిద్య గొప్పది. ఆయోగవిద్య కంటె ఆత్మవిద్య శ్రేష్ఠమైనది. గుహ్యమైనది. దానిని యీ తొమ్మిదవ యధ్యాయమందు జెప్పుచున్నాడు. పూర్వమందు చెప్పిన తత్వము విస్తరించి చెప్పబడినది. ప్రసంగ వశమున మరియొక రహస్యమునున్నూ చెప్పుచున్నాడు యీ బ్రహ్మతత్వమును గురించిన జ్ఞానము అనేకవిధములుగా యిదివరకు చెప్పబడినది. అయిననూ ఇంకా యెక్కువగా రహస్యమైన దానిని నీకు చెప్పుచున్నాను. ఇదివరకుచెప్పినది శాస్త్రజ్ఞానముఇప్పుడుఅనుభవజ్ఞానమును చెప్పుచున్నాను. దేనిని తెలుసుకుంటె అశుభమయిన యీ సంసారబంధము నశించిపొవునో దానిని చెప్పుచున్నాను. (ఓయీ పురాణ న్యాయ మీ మాంసాదులు పదునెనిమిది విద్యలు చెప్పబడినవి. వాటిలో యేవిద్య గొప్పదంటె స్కాందపురాణములో బ్రహ్మగీత యందు ఇట్లున్నది. ఆత్మవిద్య నెరుగని వానికి దుఃఖ సముద్రమే శరణ్యము. ఆత్మ నిష్ట గలవాడు ముక్తినొందునని నిశ్చయించ దగినది. ॥౧॥

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమం
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్॥ ౨

—◆ భా ష్య మ్ ◆—

నను యోగో ద్వివిధో రాజయోగో హఠయోగశ్చ త్నత్రా ప్యపక్వ కషాయేభ్యో హఠయోగః సమన్విత ఇత్యుక్త

_న్తథా శను దమాది షట్సంపత్తి యుక్తేభ్య స్తు రాజయోగ ఏవ ప్రశస్యత ఇత్యాహ—రాజవిద్యేతి॥ తథాచా స్య సర్వో త్కృష్టత్వేన సుకరత్వేన చ రాజవిద్యా త్వం పురాణ న్యాయ మీమాంసే త్యాద్యష్టాదశ విద్యాసు గోప్యానా మపి గోప్య త్వా ద్రాజగుహ్యాం సకల సంసార బంధ నివర్తకత్వా త్పవిత్ర ముత్తమంచ బోధ్యమ్। ఏవం యోవా గార్గ్యేతదక్షర మవి దిత్వా అస్మా ల్లోకాత్ప్రైతి స కృపణ ఇత్యాది శ్రుత్యే హ జన్మన్యేవా వగమస్య యుక్తత్వా త్ప్రత్యక్షా వగమం సర్వ భూత మూలత్వా ద్ధర్మ్యాయ హితం ధర్మ్యంచేదం తత్వజ్ఞానం సుసుఖం యథా స్యా త్తథా కర్తు మర్హాసీ త్యర్థః॥౨॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

సమన్వితఇతి॥ "రాజయోగో హి కర్తవ్య స్సర్వయోగేష్వను త్తమః అవిపక్వ కషాయశ్చే ద్ధఠయోగ సమన్వితః" ఇత్యాది స్మృతే రితిభావః॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

యోగము రెండువిధములు. రాజయోగము హఠయోగము మలపరి పాకం లేనివారలకు హఠయోగమున్ను శమదమాది షట్సంపత్తి గలవార లకు రాజయోగమున్ను ప్రశస్తముగానుండునని చెప్పుచున్నాడు. ఇది సు లభమైన దిన్ని అన్నిటికంటె గొప్పదిన్ని గాన రాజవిద్యయనియును, అ ష్టాదశ విద్యలయందును గోప్యమైనందున రాజగుహ్య మనియు సకల పా శములను ఛేదించునదిగాన పవిత్రమనియు ఉత్తమ మనియు అనుభవముచే తెలియదగినది గాన ప్రత్యక్షముగా దగిన దనియును సకలభూతములకు మూలముగా న ధర్మమును తొలగనిదియును నగు యీ తత్వజ్ఞానమును

సుఖమగునట్లుగా జేయ నర్హుడవు (అన్నియోగములలోను గొప్పది యగు రాజయోగమె చెయ్య దగినది. అంతః కరణయందు మాలిన్యమున్న యెడల హఠయోగమున్నూ చేయవలయును॥ ౨॥

శ్లో॥ అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యా స్య పరన్తప
అప్రాప్య మాం ప్రవర్తన్తే మృత్యు సంసార వర్త్మని॥ ౩

—◆ భాష్యమ్ ◆—

తదేవం ప్రతిజ్ఞాతస్య జ్ఞానస్య నివృత్తి రూపేణా నర్థ ఫలత్వ మపి ప్రదర్శయన్నాహ—అశ్రద్ధధాన ఇతి । ఏవంతర్హి । మదుక్తస్యా స్య పూర్వోక్త ధర్మస్య విషయే ౽ శ్రద్ధధానాః పురుషాః మామేవ ప్రథమావ్యక్త రూపమేవా ప్రాప్య మృత్యు సంసార వర్త్మని ప్రవర్తన్తే । కుతః పున ర్ద్వితీయా వ్యక్త రూపం మత్పరం పద మక్షరం తురీయం గమిష్యన్తీ త్యర్థః॥ 3॥

—◆ లఘుటిప్పణీ. ◆—

ఇహా వ్యక్తో ద్వివిధో మూలప్రకృతి రూపః పరబ్రహ్మ రూపశ్చేతి తదాహ—ప్రథమావ్యక్తేతి । తద్యథా । 'అవ్యక్తా ప్రకృతి ర్మూలా త్వపరా త్రిగుణా త్మికా । అవ్యక్తం హి పరబ్రహ్మ యత స్సర్వై ర్నవ్యజ్యత ఇత్యాది స్కాందే తత్వ సంహితాయా ముక్తత్వా దితి భావః॥ 3॥

—◆ ఆన్ధ్రతాత్పర్యము ◆—

ఇదివరలో చెప్పిన ప్రకారము జ్ఞానము తలక్రిందైనచో అనర్థ ఫలమును న్నూ చూపించుచున్నాడు. పూర్వోక్తమైన ధర్మము విషయమై శ్రద్ధ లేనివారై మొదటి యవ్యక్తమైన నన్నె పొందలేక మృత్యుసంసార

మార్గమందు నడుచు చున్నారు. ద్వితీయావ్యక్త రూపమైనటువంటిన్ని అక్షరము తురీయము అయిన నా పరమ పదమైన సదాశివుని యెట్లు పొందగలరు. (అవ్యక్తము రెండు విధములు. మొదటిది మూలప్రకృతి రూపము. రెండవది పరబ్రహ్మ రూపము అని స్కాందము నందు గలదు. పరబ్రహ్మ మవ్యక్త మెందుకయినదనగా అందరికి గనుపించనం (వ్యక్తము గానం)దున అవ్యక్త మైనది॥ ౩॥

శ్లో॥ మయా తత మిదం సర్వం జగదవ్యక్త మూర్తినా।
మత్ స్థాని సర్వభూతాని నచాహం తేష్వ వస్థితః॥ ౪

## —♦ భాష్యమ్ ♦—

నను కిమిదం స్వరూపం త్వత్పరంపదం చేతి ద్వాభ్యాం క్రమేణాహ—మయేతి। తత్రైవం సతీ యద్యపి ప్రపంచ జాతం జగదవ్యక్త మూర్తినా మయైవ యచ్చ కించ జగత్యత్ర దృశ్యతే క్రియతే పివేత్యాది శ్రుత్యా తత స్తథాపి మృది ఘటాదివత్సర్వ భూతాని మత్థ్సాన్యేవ నచాహం తేష్వ వస్థిత ఇత్యర్థః॥౪॥

## —♦ లఘుటిప్పణీ ♦—

నచాహమితి కిన్తు పరిచ్ఛిన్నత్వేన మత్ స్థాన్యేవ భూతాని నతు లేన రూపేణ తేష్వవస్థిత ఇత్యర్థః॥ ౪॥

## —♦ ఆంధ్రతాత్పర్యము ♦—

ఓయీ! ఈ నీస్వరూపమేమిటి? నీ పరంపదమేమిటి? యనగా క్రమముగా రెండు శ్లోకములతో చెప్పుచున్నాడు. ఈ దృశ్యమానమైన జగత్తు అవ్యక్త స్వరూపమైన నాచేతనే వ్యాప్తమై యున్నది. మృత్తు

యందు ఘటాదులున్నట్లు సర్వభూతములు నాయందే ఉన్నవి. నేను వాటియందు ఉండలేదు. (భూతములు చిన్నవి గనుక నేను వాటియందుం డలేదు)॥ ౪॥

శ్లో॥ నచ మత్‌స్థాని భూతాని పశ్యమే యోగమైశ్వరమ్।
భూతభృన్నచ భూతస్థో మమాత్మా భూత భావనః॥ ౫॥

—♦ భా ష్య మ్ ♦—

అథచ 'యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాన్తే చ ప్రతిష్ఠిత' ఇత్యాది శ్రుత్యా తు స్వీయ పరంపద మప్యాహ। నచేతి। ఏవం సతి యది మే మమైశ్వరం యోగ గమ్యం స్వరూపం పశ్యేచ్చే న్మత్‌స్థాన్యపి భూతాన్యపి నహి సన్తీత్యర్థః। ఏవం తర్హి మృద్ఘటాది వత్కారణత్వేన భూతభృన్నచ భూతస్థస్తతో౽పి మమాత్మా పరమశివ స్సర్వ సాక్షీ సర్వభూతైర్ధ్యేయత్వేన లింగార్చాపర ముక్తిదేహ కథితేతి సిద్ధాంత సారావళ్యాం లింగ పూజ్యత్వేన చ భావ్యత ఇతి భూతాభావన ఇత్యర్థః॥ ౫॥

—♦ ల ఘు టి ప్ప ణీ . ♦—

నహిస న్తీతి। 'యతః కోన్వేనం జనయే త్పున రిత్యాది' బృహదారణ్యక శ్రుత్యా యోవేదానిత్యుక్తే పరే సాక్షిణి శివే సర్వథా వ్యక్తౌ నీని భూతాని నహి సన్తి త్యర్థః॥౫॥

—♦ ఆం ధ్రి తా త్ప ర్య ము ♦—

యోవేదాదౌ=యః పర స్సమహేశ్వరః। అను శ్రుతిని బట్టి తన పరంపదమునున్నూ చెప్పుచున్నాడు. నేను యోగాభ్యాస కాలమందు

పొందునట్టి ఈశ్వర స్వరూపమును నీవు చూస్తివట్టాయెనా నాయందుండె భూతములున్నూ లేవు. మృత్తు ఘటమువలె, కార్య కారణ భావముచే కారణమైన మృత్తెగాని కార్యమైన ఘటములేనట్లు భూతములను భరించువాడు, ఫేతరంగ బుద్బుదాదులను భరించునట్టి సముద్రుడు ఫేన తరంగాదుల యందిమిడి యుండనట్లు భూతములయందు లేడు, । అందు లోను నాను ఆత్మయైన పరమశివుడు సర్వసాక్షియై సర్వభూతములచె ధ్యానముచేయ తగినవాడు॥ హృద్వ్యోమాంబుజ కర్ణికార్క శశభృద్బింబాగ్నిశక్త్యూర్ధ్వగం ప్రాణాయామయుతో మృణాళ విలసత్సూత్ర ప్రతీకాశకం । జ్యోతిస్తద్దీత మానసోపి పరతః స్వ ద్వాదశాంత స్థిత స్వచ్ఛాంభ స్సదృశ ప్రభం పరశివం యోగీ చితా పశ్యతి॥ ౫॥

శ్లో॥ యథా కాశస్థితో నిత్యం వాయు స్సర్వత్ర గో మహాన్ ।
తథా సర్వాణి భూతాని మత్ స్థానీ త్యుపధారయ॥ ౬

—♦ భాష్యమ్ ♦—

ఏవ మిహా పూర్వోక్త మేవ దృష్టాన్తేన విశదయతి । యథేతి తథాచ మృది ఘటాదివ త్కార్య కారణ భావేపి వస్తుతః పృథివీం పశ్యామి రూపం తత్తేజస ఇతి న్యాయేనా పృథగ్రూపత్వం తథాపి స్వల్ప విచారస్యా వష్టంభేనా ధారాధేయ భావ కల్పనయా వాద్యాకాశ దృష్టాన్తేన మత్ స్థాన్యపి సర్వాణి భూతానితి వ్యవహారోపీతి బోధ్యమ్॥౬॥

—♦ లఘుటిప్పణీ ♦—

నను వాయ్వాకాశయో రేకప్రకృతికత్వా త్కథం తయో రాధారా ధేయత్వ మిత్యత ఆహవస్తుతఇతి తద్యథా పృథ్వీం పశ్యామి రూపం

తత్తేజసో జల మిత్యహో రసం గృహ్ణామి జిఘ్రామి పశ్యామ్యే తత్కాన మవ్యాద అపి గంధాదికం సర్వం తన్మాత్ర క్రమతో లయం శేషయిత్వా ప్రయత్నేన శివం పూర్ణం విచింతయే దిత్యాది జ్ఞానం గూఢతయా వధార్యమ్॥౬॥

—◆ ఆంధ్ర తాత్పర్యము ◆—

పూర్వోక్తమైన దానినే దృష్టాంతముతో స్పష్టముచేయుచున్నాడు ఘటాదులు పృథ్వియందున్నట్లు గొప్పదియైన వాయువు ఆకాశమందున్నట్లు సమస్తమైన భూతములు నాయందున్నట్లు తెలియుము. ఆధారాధేయభావమందు పృథివికి జలము జలమునకు అగ్ని అగ్నికి వాయువు వాయువునకు ఆకాశము ఆధారమయినందున పంచభూతముల యొక్క లయమున్నూ యీ ప్రకారమే చేసియివియన్నియు నాయందున్నట్లు తెలియవలెను. (ఆకాశాది భూతములె శబ్దాదులయిన పంచతన్మాత్రలు వీటిని లయంచేసి శివుడు సర్వవ్యాపకుడైనవానిగా తెలియుట యె నిగూఢమైన జ్ఞానము॥

శ్లో॥ సర్వ భూతాని కౌన్తేయ! ప్రకృతిం యాన్తి మామికామ్।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహం॥　　　౭

—◆ భాష్యమ్ ◆—

ఏవంతర్హి కింపర్యవసిత మిత్యాహ సర్వభూతానితి । తత్రైవం సతి హే కౌన్తేయ సర్వాణి భూతాన్యవ్యక్తాదీనీతి రీత్యా మామికా మేవ ప్రకృతిం ప్రథమా వ్యక్తలక్షణాం కల్పక్షయే యాన్తి పునశ్చ తాని కల్పాదౌ విసృజామీతి తత్ర కా విచారణా కిన్తు తతః పరం యచ్ఛివ మద్వైతం యత్పరమం పదం తదేవ విచారణీయ మిత్యాశయః॥౭॥

—◆ ల ఘు టి ప్ప ణీ◆ —

మామికామితి॥ ప్రధమావ్యక్తలక్షణాం సత్వం రజ స్తమో విష్ణో జగదండం జనార్దన తస్య కారణ మాహు స్త్వాం సాంఖ్యా స్తత్వవిదో హరే । ఇత్యుక్తో క్తా మిత్యర్థః॥ ౭॥

—◆ ఆ ం ధ్ర తా త్ప ర్య ము . ◆—

పర్యవసాన మేమి యనగా చెప్పుచున్నాడు. ఓ కౌంతేయ, సర్వ భూతములకు అవ్యక్తమే మొదలు గనుక కల్పాంత మందు ప్రధమావ్యక్త మైన నా ప్రకృతిని బొందుచున్నవి. మళ్లీ వాటినే కల్పాది యందు నేను వదలి వేయుచున్నాను. దానికి విచారణ అవసరము లేదు. అద్వైతము పరమపదము నైన శివుని విచారించవలయును. ప్రధమావ్యక్తము, సత్వరజ స్తమో గుణాత్మక మైన జగదండము. అట్టి జగదండమునకు కారణము నీవే యని శివుడు విష్ణువుతో జెప్పి నట్లు పురాణమునందు గలదు॥ ౭॥

శ్లో॥ ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్॥ ౮

—◆ భా ష్య మ్ ◆—

ఏతదేవ పున రుపపాదయతి । ప్రకృతి మితి । తత్రైవం సతి । శూన్యా త్ప్రకృతి రీశ శ్చే త్యత్రో క్తాయా ప్రకృతి స్త్వాం ప్రకృతిం స్వా మవష్టభ్య ద్వా సుపర్ణే త్యుక్త జీవేశ్వరాభ్యాం పూర్వవ ద్భేదాభేద మాశ్రిత్య పునః పునరహం మాయావీ వ విసృజామీ త్యర్థః । అతఏవే దంకృత్స్నం ప్రకృతే ర్వశా దప్య వశమివ భూతగ్రామ మిమం ప్రాహు రిత్యర్థః॥ ౮॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

భేదా భేదేతి తత్రి తావ ద్వ్యష్టి రూపేణ భేద స్సమష్టి రూపేణ చాభేద ఇతి జీవేశ్వరాభ్యాం తయో రుపపత్తి రితి భావః ॥౮॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము . ♦—

దీనినే మళ్ళీ చెప్పుచున్నాడు. శూన్యము వలన ప్రకృతిని యీశ్వరుడున్నూ పుట్టైన నేస్థలమందు చెప్పబడిన ప్రికృతిని ఆధారం చేసుకుని జీవేశ్వరులతో భేదాభేదము నాశ్రయించి మళ్ళీమళ్ళీ నేను ఇంద్రజాలికుని వలె ప్రకృతి వశముచె పరవశమైన భూతసమూహమును సృష్టి జేయుచున్నాను (భేదాభేదమనగా జీవేశ్వరులకు భేదమూలేదు. అభేదమూలేదు భేదాభేదమున్నూ లేదు అయినను భేదాభేదము నాశ్రయించి అనగా వ్యష్టి జీవుడు సమష్టి ఈశ్వరుడు అని ఉపపత్తి చెప్పిరి. మేము బ్రహ్మకును ప్రపంచమునకు అత్యంత భేదమును జెప్పువారముగాము. అత్యంత అభేదమును జెప్పువారమున్నూ గాము భేదాభేదమును జెప్పువారమున్నూ గాము మరేమనగా శరీరము శరీరి గుణము గుణి ఇట్లు విశిష్టాద్వైతమును జెప్పువారము॥౮॥

శ్లో॥ నచ మా న్తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ
ఉదాసీన వదాసీన మస క్త న్తేషు కర్మసు॥ ౯

—♦ భా ష్య మ్ ♦—

నన్వస్త్వేవం పర న్త్వేవం జ్ఞానినం త్వాం కర్మాణి నిబధ్నంతి నవేతి సన్దిహాన ఆహ—నచేతి। ఏవం సత్యుదాసీన వదాసీన మస క్తం చ కర్మాణి తాని కుర్వ న్తం మాం హేధనంజయ శివ ధ్యానా ర్చన జ్ఞానా న్నచ నిబధ్న న్తీ త్యర్థః॥౯॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

నచనిబధ్నంతీతి । తత్రితావ చ్ఛ్రివణ మనన నిధిధ్యాసన సామర్థ్యం వా ల్పం యమ నియమా సన ప్రాణాయామ ధారణయా సమాధిభా క్త్వం పాండిత్యం చలబ్ధ్వే త్యభిప్రాయేణ వా ల్పంచ పాండిత్యం నిర్విద్య సబ్రాహ్మణః కేనస్యా ద్యేన స్యా త్తేన స్యా దీదృశ ఏవ భవతి తశృతే ర్నచ కర్మాణి నిబధ్నంతీత్యర్థః॥ ౯॥

—◆ ఆం ధ్ర తా త్ప ర్య ము . ◆—

అట్లైతే అవుగాక, మరేమంటే జ్ఞానివైన నిన్ను కర్మలు బంధించువా బంధింపవాఅనే సందేహమును చెప్పుచున్నాడు. ఓధనంజయ । భూతసృష్టి మొదలయిన కర్మలను ఉదాసీనుని వలె కర్తృత్వాభి మానమును చేయ నట్టిన్ని అసంగుడవై ఫలాభిసంధిని వదలినటువంటి నన్ను శివ ధ్యానము, శివార్చనము. శివజ్ఞానము గలుగుట వలన కర్మలు నన్నంటనేరవు॥ శివా శ్రితానాం జంతూనాం కర్మణా నాస్తిసంగమః । (శ్రవణ మనన నిః ధ్యాసనల యందు సామర్థ్యము అధికముగా నుండి లేదా శ్రవణమైనను గలిగి, యమ నియమాదుల చే సమాధి ననుభవించి, (పాండిత్యమనగా మననము అల్పమనగా శ్రవణము శ్రవణమును మననమును వదలి నిధి ధ్యాసలో బ్రాహ్మణుడు (బ్రహ్మజ్ఞాని) యేమననంచేత నగునో వే శ్రవణంతో నగునోదానిచేత నే కర్మబద్ధుడు గాకుండును॥ ౯॥

శ్లో॥ మయా ధ్యక్షేణ ప్రకృతి స్సూయతేచ సచరాచరమ్।
హేతునానేన కౌన్తేయ జగద్వి పరివర్తతే॥ ౧౦

—◆ భా ష్య మ్ ◆—

ఏవం తర్హి చిదాభాస రూపేణ మయా ధ్యక్షేణే శ్వరేణ ప్రకృతి స్సచరాచరం సూయత ఇత్యర్థః । ఏవంసతి

'తతో యదు త్తరతరం తదరూప మనామయ మిత్యాది' శ్రుతి వేద్యమ్ । శివ మద్వైతం పృథగేవే త్యవధార్యమ్ । తథాచ. హే కౌన్తేయానేనైవ హేతునా జగజ్జన్మాది వినాశాంతం విపరివర్తతే తదేత దుక్తమ్ । అస్య ద్వైతేన్ద్రజాలస్య యదు పాదాన కరణ మజ్ఞానం తదుపాశ్రిత్య బ్రహ్మ కారణ ముచ్యత ఇత్యాది ద్రష్టవ్యమ్॥ ౧౦॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

సూయతఇతి॥ అన్యథా మూలప్రకృతే రపి జడత్వా ద్వినా చిదం శరా భాసేన కథం స చరాచరం సూయత ఇతి భావః॥ ౧౦॥

—♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

చిదాభాస రూపుడనగు నాతో టెన్ని అధ్యక్షుడైన ఈశ్వరుని చేత నున్న ప్రకృతి, చరాచర ప్రపంచమును కనుచున్నది. మూలప్రకృతి జడముగాన చిదాభాసుడు లేక చరాచరమును పుట్టించలేదు. నాకంటె నీవు వేరుగా నున్నటు తెలియుము. ఓకౌంతేయ ఈ హేతువుచేతనె ఈక్షణాది ప్రవేశాంతా సృష్టి రీశేన కల్పితా అని మహోపనిషత్తు॥ జన నము మొదలు మరణాంత మైన జగత్తు తిరిగి తిరిగి వచ్చుచున్నది. ఇంద్ర జాలికుడు మాయను ఉపాదానముగా జేసుకుని సృష్టించినట్లు కారణమైన బ్రహ్మము అజ్ఞానమును ఉపాదానముగా జేసుకొని సృష్టించు చున్నది॥౧౦॥

శ్లో॥ అవజాన న్తి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్ ।
పరం భావ మజానన్తో మమ భూత మహేశ్వరమ్॥　　౧౧

—♦ భా ష్య మ్ ♦—

నను కేన రూపేణ త్వాం బన్ధనా ద్విము క్తం జానామీ త్యాహ—అవజాన న్తీతి । కిన్తు 'సీతాం చ పార్వతీం పశ్యే

ద్రాఖ్యం చైవ త్రిలోచన మిత్యాది శ్రుత్యుక్త రీత్యా 'మన్యే త్వాం కాల మీశాన మనాది నిధనం విభు మిత్యాది స్మృత్యుక్త మార్గేణ చపరభావేనైవ మాహేశ్వరేణ పరంపద రూపేణ మా ముపాసయే దితి పర్యవసితం । అతఏవై తన్నానావతారాణాం నిధానం బీజ మవ్యయం । యస్యాం శాంశేన సృజ్యన్తే దేవ తిర్య జ్నరాదయః । ఇత్యాదినా ప్రకృత్యాఖ్య మవ్యక్తం విరాడ్రూపం చోక్త్వా 'అమునీ భగవద్రూపే మయా తే అనువర్ణతే । ఉభే అపి న గృహ్ణంతి మాయాసృష్టే విపశ్చిత ఇత్యప్యుక్తమ్ సంగచ్ఛత ఇత్య వధేయమ్॥౧౧॥

## —♦ లఘుటిప్పణీ ♦—

పరంపద రూపేణేతి । పాద్మే గోసాల సహస్రి నామ్న్యప్యుక్తం । 'ధ్యాయే న్నిత్యం సదా విష్ణుం శుక్లాభం శివరూపిణం । నాశివస్యై శివ సాన్నిధ్యే విష్ణుభక్తి మవాప్నుయా దిత్యాది ద్రష్టవ్యం॥ ౧౧॥

## —♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

ఓయీ నిన్ను ఏ రూపముతో బంధ విముక్తుడనై నట్లు తెలుసుకొందు నంటె చెప్పుచున్నాడు. సీతను పార్వతిని గాను రాముని శంకరునిగాను జూడవలె నన్న శ్రుతిని బట్టిన్ని, నిన్ను ఆద్యంతములు లేని శంకరునిగా తెలియుచున్నామనె స్మృతిని బట్టిన్ని, పరభావముచె పరంపదమైన మాహేశ్వర రూపముచె నన్ను పాసించ వలెనని పర్యవసానమైనందున, అన్నియవతారములకు ముఖ్య బీజమై నటువంటిన్ని నాశ రహితమై నట్టిన్ని యేఅవతారము యొక్క భాగములో భాగముచే దేవ

తిర్యఙ్నరాదులు సృష్టింప బడుచున్నారో అట్టి ప్రకృతియనే పేరు గల విరాడ్రూపమనున్నూ చెప్పి యీరెండు రూపములే (మాహేశ్వర రూపము విరాడ్రూపమున్నూ విద్వాంసులచే వర్ణింప బడినవి. గోపాల సహస్ర నామమందు విష్ణుని తెల్లని శివరూపముగా వర్ణించెను. అట్లు శివుడైతేనే శివుని బొందునుగాని లేనియెడల విష్ణుభక్తిని పొందునని తెలియవలెను॥ ౧౧॥

శ్లో॥ మోఘాశా మోఘ కర్మాణో మోఘ జ్ఞానా విచేతసః
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః॥ ౧౨

—♦ భా ష్య మ్ ♦—

అతఏవ' మ్లేచ్ఛే ధ్యానం జినే ఒహింసా వైష్ణవే భక్తి రుత్తమా। త్రీనేతా న్నోద్ధరిష్యామి హింసా ఒశుచి శివే తరా' నిత్యాది బృహన్నారదీయోక్త్యా శైవం యద్భావం తద్విముఖానాం నిరయగామిత్వ మేవే త్యభిప్రేత్యా హ। మోఘాశి నేతితదేతదుక్తం విష్ణుపురాణేపి। తద్యథా। ముద్రా జటారచన మౌంఢ్యవతా మ్వ్రతైవ మోఘాశినా మఖల శౌచ నిరాకృతానాం తోయప్రదాన పితృపిండ బహిష్కృతానాం సంభాషణాదపి నరా నరకం ప్రయాన్తీ' త్యాదిబహుశః॥ ౧౨॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నన్వేవం తర్హి మ్లేచ్ఛా జైనా వైష్ణవా శ్చైకపంక్త్యసారూఢాః కాంగతిం గమిష్యన్తి త్యాహ। అతఏవేతి। తత్ర తావత్ మ్లేచ్ఛే ధ్యానం యుక్తం జినేత్వహింసాదయో యుక్తా వైష్ణవేతు నమ్రీభావేన భక్తిర్యుక్తా పరంతు హింసయా మ్లేచ్ఛ మశుచ్యా వేదబాహ్యాచారేణ జినమేవజైనం

శివేతరత్వేనచ వైష్ణవ మిత్యాది త్రినేతా న్నోద్ధరిష్యామీ తి భగవద్వా క్యలో నుసన్ధేయ మిత్యర్థః॥ ౧౨॥

## —♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

మ్లేచ్ఛుడు ధ్యానంచేసినను హింసకుడు, జైనుడు అహింసా వ్రత ములో నున్నను వేదబాహ్యమతముగాన శుచిలేనివాడు. వైష్ణవుడు ఉత్తమ భక్తిగలవాడైనను శివనిందకుడు గాన యీ ముగ్గురిని నేను ఉద్ధరించనని భగవంతుడు చెప్పినట్లు బృహన్నారదీయ మందు గలదు. శివభావ పరా ఙ్ముఖులకు నరకప్రాప్తి యె నిశ్చిత మని చెప్పుచున్నాడు. నిష్ప్రయోజన మైన కోర్కెగల్గి వ్యర్థ కర్మ వ్యర్థజ్ఞానములు సలుపుచు విక్షేప యుక్త మైన మనసు గల్గి రజ స్తమో గుణప్రధాన మయినట్టి స్త్రీ బుద్ధిని భ్రమింప జేయు ప్రకృతి చేత, తప్తముద్రా ధారణయు కృత్రిమజటాధారణ గలిగి ఆచారవిహీనులై పితృతర్పణ పిండప్రదానములు చేయని మూఢులలో సంభాషణ చేసినయెడల నరకమును బొందుదురు॥ ౧౨॥

శ్లో॥ మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః।
భజన్త్య నన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్॥ ౧౩

## —♦ భాష్యమ్ ♦—

ఏవం వేదబాహ్యానాం వృత్త ముక్త్వా మహతా మపి కర్తవ్య మాహ—మహాత్మాన స్త్వితి। తత్రైవం సతి। దేవస్య పరబ్రహ్మణ స్సదాశివస్య 'తత్సవితు ర్వరేణ్యా' మిత్యత్ర నిర్దిష్టాం చిదంబరాఖ్యాం ప్రకృతిం స్వస్యా త్మన స్సదాశివస్యా ర్థనారీశ్వరత్వేన దైవీం ప్రకృతి భావ మాశ్రితాః పున శ్చాన న్య మనస స్సన్తో భూతాది మవ్యయం పరాత్పరతరం శివం

జ్ఞాత్వా మహాత్మానో మాం గురుత్వేన శివ తత్త్వోపదేష్టారం భజన్తీ త్యర్థః॥ ౧౩॥

—♦ లఘు టిప్పణీ ♦—

తత్సవితురితి తత్ర తావత్ సవితు ర్వరేణ్యా మివ సుపామితి సురాదేశే భర్గశ్య దేవస్య తద్వరేణ్యాం శక్తిం ధీమహి యోనో ఽస్మాకం ధియో న్తఃకరణాని యయా శక్త్యా తపో బ్రహ్మచర్యాది కర్మసు ప్రచోదయేదితి మన్త్రార్థః స్మృతిశ్చ భర్గః సూర్యో హరి శ్చాయా వరేణ్యాం శక్తి రాతపః దీపం శివో హరి ర్ధూమః ప్రభాశక్తి ర్యథా భవే దిత్యాది స్కాన్ద వచనై రవధార్యమ్॥౧౩॥

—♦ ఆంధ్ర తాత్పర్యము. ♦—

శ్లో॥ దరియా నాభాక వీరశ్చ నాన్హక స్సుధర స్తథా శతకోపో భిషక్ చాష్టౌ కర్మచండాల భాగినః॥ దరియులు నాభాకులు వీరుడు నాన్హకుడు సుధరుడు తెంగల వడగల భిషక్॥ శతకోపో ద్వివిధః తింగలో వడగల శ్చేతి తాభ్యా మష్టా విత్యర్థః ఈయెనమండ్రు కర్మచండాలురు వేదబాహ్యులు॥ ఇట్లు వేదబాహ్య మతమును జెప్పి మహాత్ముల యొక్క కర్తవ్యమును జెప్పుచున్నాడు. ఓ పార్థా చిదంబరమనే పేరుగల ప్రకృతి పరబ్రహ్మమైన సదాశివునికి యర్ధాంగి గాన యట్టి దైవప్రకృతిని ఆశ్రయించి అనన్యమనస్కులై భూతములకుఆదికర్తయైనట్టియు నాశరహితమైన పరాత్పరుడగు శివుని తెలిసిన మహాత్ములు శివతత్త్వో పదేశకుడనైన నన్ను గురువునుగా సేవించుచున్నారు. (సూర్యునికి వెలుతురు అవినాభావమయినట్లు సదాశివునికి అర్ధాంగియైన గాయత్రి యనె శక్తిని ధ్యానము చేయుచున్నాము. యెందుకొరకనగా మాయొక్క అంతఃకరణ వృత్తులను తపో బ్రహ్మచర్యాది కర్మల యందు ప్రేరణ చేయుగాక యని గాయత్రీ

మంత్రార్థము శివుడే సూర్యుడు విష్ణువేఛాయ ప్రకాశమె శక్తి దీపమేశివు డు ధూమమేవిష్ణు ప్రకాశమె శక్తి యని స్కాందపురాణము॥౧౩॥

శ్లో॥ సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః
నమస్యన్తశ్చమాంభక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥ ౧౪

—◆ భాష్యమ్ ◆—

ఏవ మపరంచ కిం కుర్వన్త ఇత్యాహ—సతత మితి। ఏవం తర్హి 'మాం పరం శైవభావేనైవ సీతాంచ పార్వతీం పశ్యే'దిత్యాది యథోక్త రీత్యా చింతయే దితి పర్యవసితమ్। తద్యథా, స్కాందే 'తద్వై మన శ్శంభు పదారవిందయో ర్వచాంసి యత్తస్య గుణాను కీర్తనే। కరావహారో మందిర మార్జనాదిషు శ్రుతిశ్చ। కార్యాచ్యుత సత్కథోదయే। పాదౌచ తత్క్షేత్ర పదానుసర్పణే శిరో వృషేశస్య పదాభివం దనే। కామశ్చ తత్రాప్తి మయో నచాన్యత స్సేవేత వర్షైరపి సంవసన్ మునిః'। ఇత్యాదినానవధా భక్త్యా నిత్యయుక్తా స్సంతో। మహాత్మానస్తు, 'వైష్ణవ స్సతు విజ్ఞేయ శ్శివభక్తి పరాయణ' ఇత్యాది రీత్యోపాసత ఇత్యర్థః॥౧౪॥

—◆ లఘుటిప్పణీ. ◆—

నను 'దృష్ట్వా పాతం హరే ర్దేహం కృత్వా కాష్ఠస్య సంచయం। అష్టాభి స్సహ పత్నీభి ర్దాహయామాస పార్థివ' ఇత్యాది రాజ్యోప శాంత్యా గమిష్యమాణే త్వాయి కథం త్వాం సతత ముపాసయామితిచే త్యత్ర దృష్టాంతేనాహ। సీతాంచేతి। ఏసంసతి 'ఆనందాద్ధిః కమపి చ

ఘనీ భావ మాస్థాయ రూపం శక్త్యా సార్ధం పరమ ముమయా శాశ్వతం భోగ మృచ్ఛన్నిత్యాదిస్మృతి న్యాయేన శివయో శ్శరీరస్య కర్మ జన్యత్వా భావేన సతత ముపాస్యత్వం యుక్తమిత్యవధేయమ్॥ ౧౪॥

## —◆ ఆ స్థ్రి తా త్ప ర్య ము ◆—

మహాత్ములు మరేవిధముగా చేయుచున్నారగా చెప్పుచున్నాడు। సీతను। పార్వతిని గాను రాముని శంకరునిగాను చూడవలెనన్న విధిని బట్టి నన్ను పరమశైవునిగా చింతన చేయవలయునని పర్యవసానము॥ శైవ ధర్మములిట్లు స్కాందమునందుగలవు. శంకరుని చరణ కమలమం దున్నదే మనస్సు. శంకరుని గుణములను కీర్తించినదే వాక్కు. దేవమందిర మందు సమ్మార్జనాదులను జేసినవె చేతులు। శివకథలను విన్నవే చెవులు, శివక్షేత్రమును గురించి నడచినవె పాదములు, వృషవాహనునికి వందనం చేసినదే శిరము. కోరికయు ఆతని స్వరూపమును కోరినదె। ఈప్రకా రము ఇంద్రియవర్గములచె మునియైనవాడు సేవించవలెను. మహాత్ములు తొమ్మిది విధ (పూర్వోక్త)ము లైన భక్తులు గలిగి యుందురు. విష్ణువు శివభక్తుడని యు పాసింతురు (హరి మరణించుటను జూచి యెనమండ్రు పట్టపురాణీలు కాష్టసమూహముచె శరీరమును దహనంచేసిరను వచన మును బట్టి నీకు మరణము గలుగుచుండగా నిన్నెట్లుపాసించనవగా సీతను పార్వతినిగాను రాముని శంకరునిగాను ఉపాసించవలెనన్నట్లుపాసించ వలెను. శంకరుని శరీరము కర్మజన్యమైనదిగాదు గాన శాశ్వతమైనది. ఆనంద సముద్రమునుంచి ఘనమైనట్టెన్ని ఉత్కృష్టమైన రూపమును బొంది ఉమాదేవితో శాశ్వత భోగముల ననుభవించుచున్నది గాన ఉపా స్యుడు శంకరుడె గాని అన్యదేవతులు గారు. శంకరుడుగాక తక్కిమ్మా విష్ణు బ్రహ్మ మొదలయిన వాళ్ళకు మరణము గలదు. వారల శరీరములు కర్మజన్యమైనవి. భృగుమహర్షియొక్క శాపమువలన విష్ణువునకు దశావ తారములు ప్రాప్తించినట్లు శివరహస్య ఖండములోనున్నది॥ ౧౪॥

శ్లో॥ జ్ఞాన యజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతో ముఖం॥ ౧౫

—♦ భాష్యమ్. ♦—

నను కీదృశ స్సర్వతో గరిష్ఠో యజ్ఞో యేన రూపేణ త్వాం భజే దిత్యాహ॥ జ్ఞాన యజ్ఞేనేతి తదుక్త మథర్వ శిరసి పాశుపత వ్రతమితి। తృష్ణాం ఛిత్వా హేతుజాలస్య మూలం బుద్ధ్యా సంచింత్య స్థాపయిత్వా చ రుద్రే రుద్ర ఏకత్వ మాహుః। రుద్రం శాశ్వతం వై పురాణ మిష మూర్జం తపసా నియచ్ఛత। వ్రత మేతత్పాశుపతం పశు పాశ విమోక్షాయ। పుత్రాద్యర్థం మయాప్యనుష్ఠితం తన్నిష్ఠానాం విద్యా ప్రాప్తిర్ముక్తిశ్చ। తేషా మత్యంతవ్రత ధారిణాం ముక్తి రేవ ఫలం సంభవతి। విద్యా ప్రాప్తిశ్చ యావదాయుషం పాశుపతవ్రత ధారిణాం ముక్తి రేవ ఫలం పాశుపత వ్రతం పురాణేష్వపి ప్రసిద్ధం। స్కాందే శివవ్రత ఖండే అకృత్వైతద్వ్రతం పుణ్యం నైవ జ్ఞాన మవాప్నుయాత్ పశు పాశ విమోక్షాయాచీర్ణంతు మునిభిః పురా। విష్ణునా బ్రహ్మణా దేవై ర్మార్కండేయ దధీచినా దుర్వాససా గౌతమేన జాబాలాథర్వశాఖినా। శాట్యాయనేన మునినా తథాగస్త్యేన సత్తమ। మయా స్కందేన గణైపై నందినా భృంగినా తథా। గామాయ దత్తవా నేత దగస్త్యో దండకావనే। ఉపమన్యుస్తు కృష్ణాయ దీక్షా మేతాం చకారహ। కృత్వాతు విరజాం దీక్షాం యః పూజయతి

శంకరం । తేనైవ జన్మనా ముక్త శ్శివజ్ఞానీ శివం వ్రజేత్ ॥ ఉద్ధూళనం త్రిపుండ్రం చ శ్రద్ధయా నాచరంతి యె తేషాం నాస్తి వినిర్మోక్ష స్సంసారా జ్జన్మ కోటిభిః।భస్మనో ద్ధూళితం చైవ తద్దైవా పాదమస్తకం । యః కరోతి సదా మర్త్య స్సముక్తో భవతి ధ్రువం । శ్రాద్ధే యజ్ఞే జపె హోమే వైశ్వ దేవే సురార్చనె । భస్మ త్రిపుండ్రైః పూతాత్మా మృత్యుం జయతి మానవః । ఆయుష్కామో యథా రాజన్ భూతి కామో థవానరః . నిత్యం వై ధారయె ద్భస్మ మోక్షకామీ చ వై ద్విజః॥ ఏతాని తాని శివమంత్రి పవిత్రితాని భస్మాని కల్మష హారాణి సుముక్తిదాని । త్రైపుండ్రకాని రచితాని లలాటపట్టె లుంపతి దైవలిఖితాని దురక్షరాణి॥ కిం యజ్ఞైః కి మనేక తీర్థ నివహైః కిం వేద పాఠ శ్రమైః కిం ఘోరై ర్వివిధై స్తపోభి రమనైః కిం మంత్ర తంత్రై ర్జపైః।కిం ధ్యానైః కి మనెక దాన నికరైః కిం సాంఖ్య యోగ భ్రమై ర్మోక్షార్థీ సిత భస్మనా చ నిపుణః కుర్యా త్త్రిపుండ్రం-బుధః జాబాల్యు పనిషది॥ అథహైనం భగవంతం జాబాలిం పైప్పలాదిః పప్రచ్ఛ । భగవన్మె బ్రూహి పరమతత్వ రహస్యం । కిం తత్వం । కో జీవః । కః పశుః । క ఈశానః । కో మోక్షో పాయ ఇతి స తం హోవాచ । సాధు పృష్టం సర్వంనివేద యామి యదా జ్ఞాత మితి పున స్సతము వాచ కుత

త్త్వయా జ్ఞాత మితి, పున స్సతమువాచ షడాననా దితి పున స్సత మువాచ, తేనాథ కుతో జ్ఞాత మితి, పున స్స త మువాచ తేనే శానాదితి । పున స్స త మువాచ అతః కస్మా త్తేన జ్ఞాత మితి, పున స్స త మువాచ, తదుపాసనా దితి, పునస్స త మువాచ, భగవన్ కృపయా మే రహస్యం సర్వం నివేదయేతి స తేన పృష్ట స్సర్వం నివేదయామాస తత్త్వం । పశు పతి రహంకారా విష్ట స్సంసారి జీవ స్స ఏవ పశుః । సర్వజ్ఞ పంచ కృత్య సంపన్న స్సర్వేశ్వర ఈశః పశుపతిః । కేపశవ ఇతి పున స్స త మువాచ, జీవాః పశవ ఉక్తాః । తత్పతిత్వాత్పశు పతి స్స పున స్తం హోవాచ, కథం జీవాః పశవ ఇతి కథంత త్పతి రితి స త మువాచ, యథా తృణాశినో వివేకహీనాః పరప్రేష్యాః కృష్యాది కర్మసు నియుక్తా స్సకల దుఃఖ సహా స్స్వస్వామి బధ్యమానా గవాదయః పశవః ! యథా తత్స్వా మిన ఇవసర్వజ్ఞ ఈశః పశుపతిః తజ్ఞ్జానం కేనోపాయేన జాయతే పున స్స త మువాచ విభూతిధారణా దేవ తత్ప్రకారః కథ మితి కుత్ర కుత్ర ధార్యం । పున స్సత మువాచ, సద్యోజాతా దిపంచ బ్రహ్మ మంత్రై ర్భస్మ సంగృహ్యాగ్ని రితి భస్మే త్యనేనా భిమంత్ర్య మానస్తోక ఇతి సముద్ధృత్య జలేన సంసృజ్య త్రియాయుష మితి శిరో లలాట వక్షః స్కంధేష్వితి తిసృభి స్త్ర్యాయుషై స్త్ర్యంబికై స్తిస్రో రేఖాః ప్రకుర్వీత వ్రత మేత

చ్చాంభవం సర్వేషు వేదేషు వేదవాదిభి రుక్తం భవతి । తత్స మాచరే న్మముక్షు ర్న పునర్భవాయె త్యాది ద్రష్టవ్యం॥౧౫॥

—♦ లఘు టిప్పణీ ♦—

శిరో వ్రతేతి తస్య హి సర్వై శ్శిరసా ధార్యమాణవ్రత ప్రతిపాదక త్వా చ్ఛిరోవ్రత ఖండత్వా వగమాదితి భావః తదృథా సర్వేషామేవ భక్తా నాం శంభో ర్లింగ మనుత్తమం సితేన భస్మనా కార్యం లలాటె పై త్రి పుండ్రక మిత్యాది కూర్మ పురాణోక్త్యా వగంతవ్యమ్॥౧౫॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఓయీ! అన్నిటి కంటె శ్రేష్ఠమైన యజ్ఞమేది యే రూపముతో నిన్ను భజించ వలె నంటె చెప్పుచున్నాడు. ఓ పార్థా అన్ని యజ్ఞము లలో జ్ఞానయజ్ఞమె గొప్పది. జ్ఞానము పాశుపత వ్రతము చేయక ప్రాప్తించదు. యీవ్రతము అధర్వశిర ఉపనిషత్తు నందు జెప్పబడినది. పశువుల యొక్క పాశము వదలి పోవునని యున్నది. పుత్ర సంతానము కొరకు నేనును యీవ్రతము నాచరించి సాంబుడను పుత్రుని బడసితిని. యీవ్రత మందత్యంత నిష్ఠ గల వారలకు జ్ఞాన ప్రాప్తియు ముక్తియు గలుగును. ఇందుకు ఫలము ముక్తియె, ఆమరణాంతము పాశుపత వ్రత మాచరింపవలెను. పన్నెండు సంవత్సరము లయినను జరుపవలెను. మునీశ్వ రులు యీవ్రతము నాచరించిరి. విష్ణువు, బ్రహ్మ, దేవతలు, మార్కండే యులు, దధీచి, దూర్వాసులు, గౌతముడు, జాబాలి, అధర్వశాఖి కాత్యాయనముని, అగస్త్యులు, నేను, కుమారస్వామి, ప్రమథగణంబులు, నందీశ్వరుడు. భృంగీశ్వరుడు, రాముడు. దండకారణ్యములో అగస్త్యుని వలన పాశుపత వ్రతమును ఉపదేశము నొంది యీవ్రత ప్రభావముచే రావణుని సంహరించెను. ఉపమన్యువు కృష్ణునికి శివదీక్ష చేసెను. విరజా దీక్షను బొంది శివారాధన చేసినవాడు శివజ్ఞానము గలిగి అజన్మముతోనె

ముక్తినొందును. పాశుపత వ్రతమనగా సర్వాంగ భస్మోద్ధూళనము త్రిపుండ్ర ధారణము, దీనిని శ్రద్ధతో నాచరింపని వారలకు కోటి జన్మములకైనను ముక్తిలేదు. భస్మోద్ధూళనము శీర్షాది పాదపర్యంతము జేయవలయును. ఇట్లు యే మానవుడు జేయునో వాడు ముక్తుడగును. నిశ్చయము భస్మత్రిపుండ్రములచె పూతాత్ముడై శ్రాద్ధమును, యజ్ఞమును, జపమును! హోమమును, వైశ్యదేవమును, దేవార్చనను జేసిన మానవుడు మృత్యువును జయించును. ఆయుష్కాముడును, ఐశ్వర్యకాముడును, మోక్షకాముడును నిత్యము భస్మను ధరించ వలెను. శివమంత్రములచె పవిత్రములైనందున పాపములను బోగొట్టి ముక్తినిచ్చునట్టి త్రిపుండాంకితములైన ఆ యీ భస్మములు లలాట స్థానమందు దైవముచే వ్రాయబడిన దుష్టలిపిని తుడిచి వేయుచున్నవి. మోక్షార్థి యైన పండితుడు తెల్లని భస్మచె విధ్యుక్తముగ త్రిపుండ్ర ధారణ చేసిన జాలును. యజ్ఞములు జేయనక్కర లేదు. అనేక నదులు యందు మునగ నక్కర లేదు. వేదపాఠము ఆవృత్తిచేసి శ్రమనొంద నక్కర లేదు. అనేక విధములైన ఘోర తపస్సులచే మాలిన్యము పోవునను విచారముచే కష్టపడ నక్కరలేదు. మంత్రములు తంత్రములు జపములచే ప్రయోజనము లేదు. ధ్యానము లక్కరలేదు. దానములక్కరలేదు. సాంఖ్యాది యోగములలో శ్రమజెంద నక్కరలేదు ఒక్క పాశుపతవ్రతమె చాలును. అందుకు బ్రహ్మసూత్రభాష్యమందు శ్రీకంఠ భగవత్పాదులు వానవదధి కరణమునందు పాశుపత వ్రతము మోక్షహేతు వని ప్రతిపాదించిరి. జాబాల్యుపనిషత్తునందు పిప్పలాదుడు జాబాలి మహర్షి ని పరమతత్వ రహస్యమును చెప్పుమని యడిగెను. తత్వమనగా నేమి జీవుడెవడు? పశువెవడు? ఈశ్వరుడెవడు? మోక్షమున కుపాయమేది? ఇట్లు పిప్పలాదుడడిగెను. జాబాలి బాగుగా నడిగితివి నాకు తెలిసినంత వరకు చెప్పెదనని నుడివెను. పి॥ చెప్పెదరుగాని యెవ్వరివలన తెలుసుకుంటివి? జా॥ నేను షణ్ముఖునివలన తెలుసుకుంటిని. పి॥ షణ్ముఖునకెట్లు తెలిసెను? జా॥

ఈశానుని వలన తెలిసెను. పి|| ఈశానునకెట్లు తెలిసెను? జా|| శివోపాసన వలన పి|| నాయందు దయయుంచి రహస్యము నంతను నుపదేశింపుడని వేడగా తీవ్రమునంతను నుపదేశించెను. పశుపతియె అహంకారావిష్టుడై జీవుడయ్యెను. ఆ జీవుడే పశువు సర్వజ్ఞ శక్తి నిత్యతృప్తి శక్తి అనాదిబోధశక్తి స్వతంత్రశక్తి నిత్యమలుప్తశక్తి అనంతశక్తులు గలిగి సృష్టి స్థితి సంహార తిరోధానా నుగ్రహములు చేయువాడున్నూ సర్వేశ్వరుడున్నూ అయిన శివుడే పశుపతి శ్రు|| పశూనాంపతయేనమః రుద్రః పశూనా మధిపతిః అహమేవ జగతా మేకః పతిః. సర్వే దేవాః పశుతా మవాపుః స్వయం తస్మాత్పశుపతి ర్బభూవ । తస్మై రుద్రాయ నమోస్తు|| స్మృతి|| బ్రహ్మాది స్థావరాంతాశ్చ పశవః పరికీర్తితాః । తేషాం పతిత్వా ద్భగవాన్ ఛ్ఛివః పశుపతి స్మృతః|| పి|| పశువులెవరు|| జా|| జీవులే పశువు లనబడిరి. వారలకు పతిగాన పశుపతి|| పి|| జీవులు పశువులెట్లు? వారలకు పతి యెట్లాయెను|| జా|| అణు రాత్మాచ జీవశ్చ పశుః పుద్గల ఏవచ క్షేత్రజ్ఞః పురుష శ్చేతి స ప్తైతే జీవవాచినః|| అణువు, ఆత్మ, జీవుడు, పశువు, పుద్గలుడు, క్షేత్రజ్ఞుడు, పురుషుడు. ఈ యేడునూ సమానార్థములు, తృణభక్షణ చేసి వివేకము లేక పరాధీనములై కృష్యాది కర్మల యందు నియోగించబడి సకల దుఃఖములను సహించి దమ యజమానిచే బంధింపబడు వృషభములు మొదలగు నవి పశువులు యెట్లైనవో-అట్లై జీవులు పశువులు । పశువులకు యజమానుడు యెట్లో జీవులకు పతి పరమేశ్వరుడగుటవలన పశుపతి యయ్యెను. శ్రుతి|| యెషా మీశే పశుపతిః పశూనాం చతుష్పదా ముత చ ద్విపదాం । నిష్క్రీతో యం యజ్ఞియం భాగమేతు రాయస్పోషా యజమానస్య సంతు|| పి|| అట్టి శివజ్ఞానమే యుపాయముచే లభ్యమగును|| జా|| భస్మ ధారణ వలన|| పి|| దాని విధి యెట్లు|| జా|| సద్యోజాతాది పంచబ్రహ్మ మంత్రములచే భస్మను గ్రహించి, అగ్నిరితి భస్మ యను మంత్రముచే నభిమం

త్రించి మానస్తోక మంత్రముచె జలముచె దడిపి మర్దించి త్రియా యుష మంత్రముచె శిరము. లలాటము. వక్షము, స్కంధముల యందు ధరించి, త్రియాయుష త్రియంబక మంత్రముల మూడింటిచేతను త్రిపుండ్ర ధారణము మూడు రేఖలుగా చేయవలెను. ఇది శాంభవ వ్రతము నాల్గు వేదముల యందును గలదని వేద వేత్తలు చెప్పిరి. ఇట్లాచరించిన ముముక్షువు పునరావృత్తి నొందడు. ఇట్లనేక గ్రంథముల యందు గలదు జూచుకొనవలయు. ఈ పాశుపత వ్రతమునకు శిరోవ్రతమనే నామమెందు కొచ్చిన దనగా సర్వులు శిరసావహించ వలసిన వ్రతమని చెప్పినందున శిరోవ్రతము స్కాందములో యీ ఘట్టమునకు శిరోవ్రత ఖండమని పేరున్నూ గలిగెను. భక్తులందరునూ తెల్లని భస్మతో లలాట మందు త్రిపుండ్ర ధారణ చేసి శివలింగమును పూజించ వలయునని కూర్మ పురాణము నందు నూ గలదని తెలుసుకొనవలయును. యీ వ్రతప్రభావముచే జ్ఞానము గల్గి కొంతమంది ఏకత్వ భావనతోనున్నూ కొందరితర భావన తోనున్నూ కొంతమంది సర్వాత్మ భావనతోనున్నూ జ్ఞానయజ్ఞమందు పర మాత్మను భజింతురు, గ్రంథవిస్తర భీతిచె ముగించితి॥ ౧౫॥

శ్లో॥ అహం క్రతు రహం యజ్ఞ స్స్వథా హ మహ మౌషధమ్
మంత్రోహమహ మేవాజ్యమహ మగ్ని రహంహుతమ్॥ ౧౬

—♦ భాష్యమ్ ♦—

నను యదుక్త మేకత్వేనే త్యాది తదేవ విశదయతి । అహంక్రతురితి । ఏవం సత్యహంశబ్దేన విఖ్యాతస్త్వేక ఏవ పరశ్శివ ఇత్యాది స్మృత్యా 'హం బ్రహ్మాస్మీ త్యాది శ్రుత్యా చా హంగిరోపాసనయా సర్వం ఖల్విదం బ్రహ్మేత్యా హం క్రతు రిత్యాదినా బ్రహ్మార్పణ న్యాయేన చిన్తయే దిత్యర్థః॥

## —♦ లఘుటిప్పణీ. ♦—

నను నజానీమః కథ మేకత్వేన పృథక్త్వేన వా స్వాత్మానం విజానీయా దితి వక్తు మాశంకతే నన్వేతి, తథాచ సేవ్యోవా సేవకో వాపి త్వత్తో నాన్యోస్తి కశ్చనేతి స్మృతి న్యాయేన వేదై రనేకై రహమేవ వేద్యః ఇత్యాది శ్రుతి న్యాయేన చాహం శబ్దేన పరాత్మా శివ ఏవ గృహ్యాత ఇత్యర్థః అహం క్రతు రిత్యాది నేతి ఇహ క్రతు క్రియా కలాప స్తస్మాద్యో యజ్ఞః స్వధా స్వాహా తత్సాధక మౌషధం ద్రవ్యం చా హ మేవే త్యాది బ్రహ్మార్పణ న్యాయేనే త్యర్థః॥౧౬॥

## —♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

వెనుక శ్లోకమందు జెప్పిన ఏకత్వ అన్యత్వ సర్వాత్మత్వములను యీ శ్లోకమందు స్పష్టము జేయుచున్నాడు. జ్యోతిష్టోమము మొదలయిన యజ్ఞములు పంచ మహా యజ్ఞములు శ్రార్ధములు ఓషధుల వలన జనించు నన్నము మంత్రములు ఆజ్యము అగ్నులు హోమము మొదలుగాగలవి నేనే యని అహం శబ్దముతో వివరించెను. అహమనగా పరశివుడొక్కడేయని స్మృతులు జెప్పెను. అహం బ్రహ్మాస్మియని శృతితో అహంగ్రహోపాసన చెయ్యవలెను. సర్వంఖల్విదం బ్రహ్మైవేతి శృతిచె యజ్ఞయాగాదులం జేసి బ్రహ్మార్పణజేయుడని యర్థము (ఓయీ ఏకత్వములో గాని పృథగ్భావములో గాని సర్వాత్మ భావనతోగాని స్వస్వరూపమును తెలియవలెనని శంక జేయుచున్నాడు. అదియెట్లో తెలియజాలమనగా చెప్పుచున్నాడు. సేవ్యుడవు గాని సేవకుడవుగాని నీకంటె నాకు మరెవ్వరు లేరు (ఇది పృథగ్భావన)అనేక వేదములచే పరమాత్మయైన పరమశివునె తెలుసుకొన వలయును (ఇది ఏకత్వభావన) క్రియాకలాపముచే దేవ పితృ యజ్ఞాదులను జేసి బ్రహ్మార్పణ జేయవలయు నసెడిది సర్వాత్మ భావనగా తెలియ వలయును ॥౧౬॥

శ్లో॥ పితా హ మస్య జగతో మాతా ధాతా పితామహః
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజు రేవచ॥ ౧౭

—♦ భా ష్య మ్ ♦—

ఏవ మేవ పున రప్యాహ—పితాహమితి । తథాచ సర్వ జగతాం పితా జనకో మాతాచ తయోరపి జనకః పితామహ శ్చాహమేవే త్యర్థః । ఏవం పవిత్ర మోంకార స్తదుపబృంహితాని ఋక్సామ యజూంషి చాథర్వాఖ్యశ్చేతి చత్వారో వేదా అప్యహ మేవే తి వేద్య మిత్యర్థః॥౧౭॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

అప్యహమేవేతి । తద్యథా । 'అహం బ్రహ్మా చ విష్ణుశ్చ వేద శాస్త్రా ద్యనేకశః । మన్మాయయా కల్పితా స్సర్వే శివోహం సర్వరూపతః॥ ఆకాశాదపి విస్తీర్ణ శ్శుద్ధ స్సత్త్వో ఽ-వ్యయ శ్శివః । యఆత్మా సకథం రామ జాయతే మ్రియతే థవే త్యాది యోగవాశిష్ఠా దప్యవధేయమ్॥౧౭॥

—♦ ఆ న్వ రి తా త్ప ర్య ము ♦—

ఇదివరకు చెప్పిన దానినె మళ్లీ చెప్పుచున్నాడు. సర్వ జగత్తులకు తండ్రిని తల్లిని నేనే. వారలకు తండ్రియైన పితామహుడు నేనే. పవిత్రమైన ఓంకారముచే గర్భీకృతములైన ఋగ్యజుస్సామాథర్వణ వేదములున్నూ నేనుగానె తెలియవలెను. (నేనె బ్రహ్మ. విష్ణువు నేనే. అనేకములైన వేదశాస్త్రాదులు నామాయచేత నే కల్పించ బడినవి. నేను సర్వస్వరూపుడగు శివుడను. ఆకాశముకంటెను విస్తీర్ణమై శుద్ధమై సూక్ష్మమై నాశరహితమైన యేశివుడు ఆత్మగా నుండెనో అట్టి యాత్మకు జనన మరణము లెక్కడివి యని యోగవాశిష్ఠమునందు రామునికి వశిష్ఠుడుపదేశించినందున నేననగా శివుడని తెలియవలెను.౧౭.

శ్లో॥ గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ నివాసః శరణం సుహృత్
ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజ మవ్యయమ్॥ ౧౮

—♦ భా ష్య మ్ ♦—

ఏవం బహుశః క్రియాకలాప రూపేణాప్య హమేవే త్యాహ——గతిరితి । తత్ర తావ జ్జగతాం గతి స్తద్భర్తా ప్రభు రీశ్వర స్సాక్షీ చేత్యాది సోహం సచ త్వం సచ సర్వ మేత దాత్మస్వరూపం త్యజ భేద మోహ మి'త్యాది రీత్యా సర్వం ప్రపంచ జాత మప్యహ మేవే త్యర్థః॥౧౮॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

ప్రపంచజాతమితి। ఏతదపి తత్రైవోక్తం "ఏకం బ్రహ్మ చిదాకాశం సర్వాత్మక మఖండితం నిష్కంపం భూరివా శేష మితి భావయ యత్నత" ఇత్యాది ద్రష్టవ్యం॥౧౮॥

—♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

అనేక ప్రకారములుగా నుండు కర్మ సముదాయ రూపమంతయు నేనేయని చెప్పుచున్నాడు. కర్మఫలము నిచ్చువాడునునియమించువాడును మంచిచెడుగుల చూచువాడును భోగ పదము పాలకుడు ఇష్టమొనర్చువాడు పుట్టించువాడు చంపువాడు ఆధార లయస్థానములు నాశరహిత బీజము మగు ఎల్ల నేనే. నీవు నేను యీ కనుపించున దంతయు ఆత్మ స్వరూపమే. భేదమును మోహమునువదలివేయుము. బ్రహ్మయొక్కటియె చిద్రూపమై సర్వవ్యాపకమై అఖండితమై భూమివలె చలనము లేనిదై యున్నదని భావించవలయునని యనేక శృతులున్నవి॥౧౮,

శ్లో॥ తపామ్యహ మహ మ్వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామి చ
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున॥ ౧౯

—♦ భాష్యమ్ ♦—

ఏవం త్వమర్క స్త్వం సోమ స్త్వమసి పవన స్త్వం హుతవహ స్త్వ మాప స్త్వమ్యోమ త్వము ధరణి రాత్మా త్వమితిచే త్యాది స్మృత్యాపి సర్వ మహ మేవే త్యాహ— తపామీతి । తత్ర తావత్సూర్యాది రూపేణా ప్యహ మేవ తపామీ త్యాది సర్వ మహ మేవ సదాశివో హేఅర్జున త్వ మాత్మాన మపి సర్వోపి జనశ్చైవ మేవ విజానాత్వి త్యాది సదసచ్చా ప్యహ మేవ నమత్త స్సదాశివా త్పృథక్కించిదస్య స్తీతి భావః।౧౯॥

—♦ లఘుటిప్పణీ ♦—

నన్వయ మాత్మా బ్రహ్మ విజ్ఞాన మానన్దం బ్రహ్మ తత్వమస్య్హం బ్రహ్మాస్మీ త్యాది వేదచతుష్టయోక్త మహావాక్యే ష్వహం శబ్దేన కిముచ్యత ఇత్యాహ—ఏవమితి । "అహం శబ్దేన విఖ్యాత స్త్వేక ఏవ పరశ్శివ" ఇత్యాది స్మృత్యన్తరాదితి భావః । నన్వహ తత్వమసీ త్యత్ర తస్య త్వమిత్యేవ సమాసేన విశిష్టాద్వైత మేవే త్యవధేయమ్॥౧౯॥

—♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

ఈ ప్రకారము పంచ భూతములున్నూ సూర్య చంద్రాత్మలున్నూ నీవే యని చెప్పిన స్మృతి యొక్క అర్థము (పరశివుడు) నేనని చెప్పు చున్నాడు. ఓ అర్జునా సూర్య రూపముగా తపించువాడను. వర్షమును గురియు నట్లును గురియకుండు నట్లు నొనర్చువాడను. జీవనము మృత్యువు, స్థూలము సూక్ష్మము నగు ప్రకృతియు వికృతియు నేనే. సదాశివుడనైన నాకంటె వేరైన వస్తువు కొంచెమైనను లేదని భావము. (అయమాత్మా

బ్రహ్మ విజ్ఞాన మానందం బ్రహ్మ। తత్వమసి। అహం బ్రహ్మాస్మి) అనెడి నాల్గు వేదముల యందున్న మహావాక్య గతమైన అహం శబ్దమునకు అర్థమేమనగా పరశివుడొక్కడె అహం శబ్దవాచ్యుడు. తత్వమసి యను చోట తస్య త్వం అని సమాసము. (అనగా నీవు ఈశ్వరుని లోనివాడవు) చే విశిష్టాద్వైతము సిద్ధాంతితము. సకల చిదచిద్విశిష్టా ద్వితీయ వైభవః పరమేశ్వరః పశు పాశ విశిష్టమై ప్రపంచా కారమైన పరాశక్తితోగూడి అనుపమాన వైభవము గలవాడు పరమేశ్వరుడు. తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్ అనెడి శృతి ప్రమాణముచె పరమాత్మ జగత్తును సృష్టించి అందు ప్రవేశించి నందువలన విశిష్టాద్వైతమే సర్వవేద పురాణ తాత్పర్యము॥ పాశ బద్ధో భవే జ్జీవః పాశముక్త స్సదాశివః॥ అని యెడు శృతి ప్రమాణముచె పాశ విముక్తి అయె పర్యంతము జీవుడు న్నాడు గాన విశిష్టా ద్వైతమె సిద్ధాంతము॥౧౯॥

శ్లో॥ త్త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా ।
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే ।
తే పుణ్య మాసాద్య సురేన్ద్రి లోకం ।
అశ్నన్తి దివ్యాన్ దివి దేవ భోగాన్॥　　౨౦

—♦ భా ష్య మ్ ♦—

ఏవ 'మిహా స్తి భాతి ప్రియం రూపం నామ చే త్యంశ పంచకం ఆద్యం త్రయం బ్రహ్మరూపం జగద్బీజం ద్వయం మత మి'త్యాదా నామరూపయో ర్జగద్రూపత్వే స్థితే తత్ర పురాణ న్యాయ మీమాంసే త్యాద్యష్టాదశ విద్యా త్మకానాం నామ్నా మపి వృత్తమాహ—త్రైవిద్యా ఇతి। ఏవం

తర్హి । తిస్రో విద్యా యేషాం సన్తి తే త్రైవిద్యా నిష్కామ
నయా బ్రహ్మవిద్యా ప్రాప్త్యనర్హా స్సోమపా స్సోమ యజ్ఞ
కర్తారోపి యజ్ఞై ర్మామేవ సదాశివ మిష్ట్వా పూతపాపా స్సంత
స్స్వర్గతిం చ ప్రార్థయన్తే । ఏవం తే పుణ్య మాసాద్య
సురేంద్ర లోక మశ్నంతి నామ దివి దివ్యా న్దేవ భోగానశ్న
న్తీత్యర్థః॥ ౨౦॥

## —♦ లఘుటిప్పణీ ♦—

నామ రూపయో రితి । తద్యథా, "ముఖే నామా స్తి రూపం త్వై
చక్షుషీ దం విభావయ । నామ రూపే నచైవాస్తా న్తయో రద్యాప్య
నుద్భవా దిత్య విద్యారూపత్వ మేతైతయో రిత్యధిక మన్యత్ర విస్తరః౨౦॥

## —♦ ఆంధ్రితాత్పర్యము ♦—

ఇక్కడ, అస్తి, భాతి, ప్రియం, రూపం, నామ, ఇవి అయిదు
అంశములు. ఇందులో మొదటివి మూడును బ్రహ్మరూపములు మిగిలిన
రెండును జగద్బీజ మని యుండగా అష్టాదశ విద్యల యొక్క వృత్తాంత
మును జెప్పుచున్నాడు. యెవరు వేదత్రయమునందు జెప్పబడిన కర్మల
యందాసక్తి గలిగి బ్రహ్మవిద్యను పొందుటకు అర్హత లేని సోమయాజు
లును యజ్ఞములచె నన్నె సదాశివునిగా భజించి పాపశోధన చేసికొనిన
వారగుచు స్వర్గతిని గోరుచున్నారో, వారు పుణ్యములు జేసి ఇంద్రలోక
మునకు వెళ్ళి శ్రేష్ఠమైన దేవ భోగముల ననుభవించు చుందురు. (ముఖ
మందు నామము గలదు. నేత్రమందు రూపము గలదు. ఇట్లు భావించుము.
యీనామ రూపములు రెండును ఇప్పటికిని పుట్టుక లేని వగుట వలన
యీరెండును ఉండగూడదు. ఇది అవిద్యా రూపమని తెలియుము. దీనిని
మఱియొక చోట విస్తరించ గలము॥ ౨౦॥

శ్లో॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం ।
　　క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి
　　ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా ।
　　గతాగతం కామకామా లభన్తే॥　　　౨౧

—◆ భాష్యమ్ ◆—

విగ్రహం దేవదేవస్య జగదేత చ్చరాచరం । ఏతమర్థం నజానంతి పశవః పాశగౌరవాత్॥ విద్యే చేతనాం ప్రాహు స్తథాఽవిద్యా మచేతనాం విద్యాఽవిద్యాత్మకం సర్వాం విశ్వాం విశ్వగురో ర్విభోః । రూపమస్య ససందేహో విశ్వాం తస్య వశే యతః। సత్యే సాధౌ చ సచ్ఛబ్ద స్సద్భి రేవ ప్రయుజ్యతే విపరీతే త్వసచ్ఛబ్దః కథ్యతే వేదవాదిభిః । సచ్చా సచ్చ జగ ద్విశ్వాం శరీరం పరమేష్ఠినః॥ ఇత్యాది పౌరాణికా ఫణిత్యా చిదచిదాత్మకం విశ్వాం విశ్వగురో శ్శరీర మిత్యాహు॥త ఇతి । తత్ర తావత్తే స్వర్గ లోకం విశాలం భుక్త్వా తద్యదేహ కర్మ చితో లోకః క్షీయత ఇత్యాది శృత్యా క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతే త్యాది సర్వాం మాయా శరీరే ప్రతిబింబ గాత్రే యత్స్వప్నదేహె హృది కల్పితాంగ ఇత్యాది రీత్యా విశ్వాం స్వకీయ చైతన్య భూత పరమశివస్య శరీరం పశ్య న్ సద్గురూ పదిష్ట మార్గేణ గుప్తం విచారయె న్నాన్యత్యంతాజ్ఞై ష్విదం కథయె ద్గోపనా ప్రథమాసిద్ధి ర్గోపనం త్వప్రకాశన మిత్యాది శ్రుతి స్మృతి గమ్యాం గతాగతం సర్వాం స్వప్నవ దవధార్యం॥

## —◆ ఆంధ్రతాత్పర్యము ◆—

చరాచరాత్మక మయిన జగత్తు ఈశ్వరునకు శరీరమని పశువులు పాశబలిమిచే తెలియ జాలకున్నారు. విద్య, చేతనము, అవిద్య అచేతనము విద్యావిద్యాత్మక మయిన విశ్వ మంతయు విశ్వనాథుని రూపము, గనుకనే విశ్వమతని యాధీనములో నున్నది. ఈప్రకారమే సదసద్రూపమైన విశ్వము పరమేశ్వరుని శరీరమని జెప్పుచున్నాడు. అయజ్ఞాములు చేసిన వారలు విశేషమైన స్వర్గభోగముల ననుభవించి, కర్మచే సంపాదించిన లోకములు కర్మ ఫల మయిపోగానె క్షీణించును. పుణ్యమయిపోయి కొంచెము శేషముండగా మనుజ లోకమందు పుట్టుదురు. స్థూల సూక్ష్మ కారణ శరీరములను స్వకీయ చైతన్యమును గురూప దిష్టమార్గముగా శివునకు శరీరముగా విచారించవలెను. ఇది రహస్యము. మిక్కిలి అజ్ఞానులకు చెప్పగూడదు॥ కర్మ ఫలములను గోరువారు తిరిగి యీవిధముగానె వేద విహిత కర్మల జేయుచు జెళ్ళుచు వచ్చుచుందురు॥ ౨౧॥

శ్లో॥ అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం॥

## —◆ భాష్యమ్ ◆—

ఏవంతర్హి । బ్రహ్మా విష్ణు సురేంద్రాద్యా యద్యత్కుర్వన్తి సర్వత స్తత్తచ్ఛివపు స్సర్వం కరోతీత్యేవ చింతయే దిత్యభిప్రేత్యాహ-అనన్యాఇతి । తత్రైవంసతి । నాన్యోవిద్యతే సదాశివాత్పరబ్రహ్మణో న్యో యేషాన్తే ఽనన్యా స్సంతి స్సర్వం సర్వత్ర సర్వదే తినన్యాయేన చిన్తయన్త ఇత్యర్థః । ఏవంసతి। సోహం సచ త్వం సచ సర్వ మేత దిత్యాది శ్రుతి స్మృతి సిద్ధాన్త రీత్యా సర్వాత్మనా చింతనస్యా వశ్యకత్వే స్థితే

తత్ర యే జనా స్సాధన చతుష్టయ సంపన్నా స్త్యాగః ప్రపంచ భావస్య చిదాత్మత్వా వలోకనాదితి రీత్యా కర్మ ఫలాభిసంధి రహితత్వేన న్యాసినస్సన్తః పర్యుపాసతే తేషాం సర్వాత్మత్వో పాసకానా మలభ్యలాభో యోగో లబ్ధస్య పరిపాలనం క్షేమ శ్చాహం బ్రహ్మ సురేంద్రశ్చ వహామీ త్యర్థః॥౨౨॥

—◆ లఘు టిప్పణీ ◆—

న్యాయేనేతి తద్యథా యదస్తి యద్భాతి తదాత్మరూపం యచ్చా న్యత్తో భాతి నచాన్య దస్తిస్వభావ సంవిత్ప్రతిభాతి కేవలో గ్రాహ్యాం గ్రహీతే మృషావికల్ప ఇత్యాధ్యాత్మన స్సదాశివ రూపేణ యోగవాసి ష్టే ద్రష్టవ్యమ్॥౨౨॥

—◆ ఆంధ్రి తాత్పర్యము ◆—

బ్రహ్మ విష్ణు ఇంద్రాదులు యే యే కార్యములను చేయుచుందు రో అదంతయు చిద్రూపుడే చేయుచున్నాడని చింతించ వలయుననె యభిప్రాయముతో చెప్పుచున్నాడు॥ పరబ్రహ్మమైన సదాశివుని కంటె ఇతర మేదియు లేదనెడి యనన్య భక్తిగలవారగుచు సర్వపదార్థములను అంతటను సర్వకాలములయందు సచ్చిదానంద రూపముగా చిన్తనచెయ్య వలయును. నేనునీవు యీ కనుపించున దంతయు ఈశ్వర రూపమనెడిశృతి సిద్ధాంత రీత్యా సర్వాత్మ భావన ఆవశ్యకమై యున్నది.యేజనులు సాధన చతుష్టయ సంపత్తిగలిగి శివోహం భావనచే దేహాత్మ భావనవదలి కర్మ ఫలమును గోరక త్యాగులై యుపాసన చేయుదురో అట్టి సర్వాత్మో పా సకుల యొక్క యోగక్షేమములను నేను బ్రహ్మ ఇంద్రుడు వహించు చున్నాము. (ఇది వరకు లభించని వస్తువు దొరకుట యోగము దొరికినదా నిని పాలించుట క్షేమము) యేది ఉన్నదో యేది ప్రకాశించు చున్నదో

అది ఆత్మ స్వరూపము యేది మరియొకటిగా ప్రకాశించునో అది అధ్యాస ము లేనిదే ఒక్కటైన స్వరూప విజ్ఞానమే గలదు. గ్రాహ్య గ్రాహక రూపమైన ప్రపంచము మిథ్య యని యోగవాశిష్టము॥౨౨॥

శ్లో॥ యే ఒప్యన్య దేవతా భక్తా యజన్తే శ్రద్ధయా న్వితాః।
తే పి మామేవ కౌన్తేయ! యజన్త్య విధిపూర్వకమ్॥ ౨౩

—♦ భా ష్య మ్ ♦—

నను యే స్వాత్మనో భిన్నత్వేనో పాసతే తేషాం కా గతి రిత్యాహ—యేపీతి। తథాచ యో న్యాం దేవతా ముపాస్తే ఒన్యో సా వన్యో హ మస్మీతి న స వేద పశు రేవం స దేవానా మిత్యాది బృహదారణ్యక శ్రుత్యా హం శబ్దేన 'విఖ్యాత స్త్వేకఏవ పరశ్శివ' ఇత్యాది స్మృత్యాచ విరుద్ధత్వేన భేద భావనయో పాసకా అపి మామేవ పరమ శివం సర్వాత్మకత్వా ద్భజన్తి। తథాప్య ఖండ భావనా రహితత్వేనా విధి పూర్వక మేవ భజన్తీతి భావః॥ ౨౩॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

అవిధి పూర్వక మితి। తద్యథా "ఏకో దేవో న ద్వితీయాయ తస్థు శ్శైవం శ్రుత్యా ద్వైతభావం భజస్వ। మూర్ఖ స్త్వన్యో దేవతానాం ప్రియో య స్తస్యై కత్వే ప్రాహ దేవప్రియత్వ" మిత్యాది దేవానాం ప్రియా ఇతి మూర్ఖ ఇతి పాణినీయ స్మృతావప్య ను సంధేయం। మహా పాపవతాం పుంసాం పూర్వజన్మసు సువ్రతాః। విష్ణు స్సర్వాధికో భాతి న సాక్షా త్పరమేశ్వరః। విష్ణు స్సర్వాధికో నాన్య ఇతి చింతయతాం నృణాం నాస్తి సంసార విచ్ఛిత్తిః కల్ప కోటి శతైరపీ త్యాది సూత సంహితాయాం యజ్ఞవైభవఖండే ద్రష్టవ్యం॥ ౨౩॥

## —♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

ఓయీ యెవరు భిన్న బుద్ధితో ఉపాసన చేయుదురో వారికి గతి యేదంటె చెప్పుచున్నాడు. దేవుడు వేరు నేను వేరు అని ఉపాసించు వాడు పశువు అహం శబ్దవాచ్యుడు పరశివుడని చెప్పి యుండగా ఉపాసకులు విరుద్ధమైన భేదభావనతో నన్ను పరశివునిగా భజింతురు గాని అఖండ భావన లేకుండుటచే విధిప్రకారము పూజించుట లేదు. పరమేశ్వరు డొక్కడే గలడు రెండవ పదార్థములేదు. అద్వైతభావమును పొందుము. శివ మద్వైతం తురీయం మన్యంతే అని శృతులు చెప్పుచున్నను మూర్ఖుడు దేవుడు వేరనిన్నీ శివునికంటె విష్ణువధికుడనిన్నీ తలచును. విష్ణువే సర్వాధికుడనియు శివుడు గాడని చింతించు వారలకు కోటి కల్పములకైనా సంసారము తొలగదని సూతసంహిత ప్రమాణమై యున్నది. శ్లో॥ శివప్రసాదేన హి భుక్తి రుత్తమా శివప్రసాదేన హి ముక్తిరుత్తమా శివప్రసాదేన వినా నభుక్తయ శ్శివప్రసాదేన వినా న ముక్తయః॥ శివప్రసాదము లేక భుక్తిముక్తులు రెండును గలుగవని ముఖ్యతాత్పర్యము. ఇట్లు శివరహస్యఖండమున గలదు॥ ౨౩॥

శ్లో॥ అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవచ।
నతు మా మభి జానన్తి తత్త్వేనా త శ్చ్యవన్తితే॥　　౨౪

## —♦ భా ష్య మ్ ♦—

ఏవం సత్యహా మేవ సర్వాత్మా శివ స్సర్వ యజ్ఞానాం భోక్తే త్యాహ—అహం హీతి। నను యది త్వమేవ దేవకీసుతో విష్ణు ర్వా దశావతారీ తర్హి కథం త్వా మేవ విష్ణుం పూజయన్తక్షో వినష్ట ఇత్యాహ—నత్వితి, ఏవం సతో్య్యన్తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధ స్స్మృత ఇత్యాదిస్మృత్యాతతో

మాం తత్వతో జ్ఞాత్వా విశతే తదనంతర మిత్యాది స్మృత్యాచ నతు మామేవ దేవకీ సుతత్వ విదో విజానన్తి కిన్తు యే తత్వ శ్శివ రూపతో విజానన్తిత ఏవ మాం జానన్త్యన్యథా.త్విహ దేవకీ సుతత్వేన జానంతశ్చ్యవన్త్యేవే త్యాశయః॥౨౪॥

## —♦ ల ఘు టి ప్ప ణీ. ♦—

పూజయన్నితి॥ తద్యథా'ఏత న్మఖే శస్య సువర్ణ పాత్రే హవిస్స మగ్రంవిధి మన్త్రపూతం విష్ణో ర్న యామ్య ప్రతిమస్య భాగంప్రభు ర్విభు ర్హ్యావాహనీయ ఏష' ఇత్యేవ మభిప్రాయేణ పూజయన్ని త్యర్థః।తతశ్చ దక్ష ప్రజాపతిం హస్తాభ్యా మాచ్ఛాద్య తిష్ఠతో విష్ణో స్సశిరస్కౌ హస్తా వపి చిత్వా స యజ్ఞా ద్బహిష్కృత ఇత్యప్యుక్తమ్ । తద్యథా.సముత్థాయ మహావిష్ణుం భ్రామయిత్వా త్రిధా పునః । శూలం వక్షస్యథో హస్తా ఛిత్వా యజ్ఞాద్బహి ష్కృతః । శివాజ్ఞయా మహా విష్ణో గచ్ఛత్వం నిధి సన్నిధౌ । జగన్నాథేతి నామ్నా తే పూజ్యం దారుమయం వపురిత్యతః పరమ శివాభేదేనైవ తత్సాహిత్యేన వా సర్వే పూజ్యా నత్వన్యథేత్య వధార్యమ్॥ ౨౪॥

## —♦ ఆం ధ్ర తా త్ప ర్య ము. ♦—

సర్వ స్వరూపమైన శివుడను నేనే గనుక సర్వ యజ్ఞ భోక్తను నేనే అని చెప్పుచున్నాడుఓయీ।నీవు దేవకీపుత్రుడవువిష్ణువుద శావతారివి. అయితే దక్షుడు నిన్ను పూజించి యెందుకు నశించి పోయె నంటె చెప్పుచున్నాడు శివతత్వమును ఓం తత్ సత్ అని మూడు విధములుగా జెప్పబడెను. తత్వమును ముందు తెలుసుకుంటె తర్వాత నన్ను తెలుసుకొనగలరు. నన్ను దేవకీపుత్రునిగా తెలిసినవారలు తెలియజాలరు. యే తత్వ వేత్తలు శివ స్వరూపముగా తెలియుదురో వారునన్ను తెలియగలరు. అట్లు గాకున్న దేవకీసుతునిగా దెలిసినవారలు పునరావృత్తి ంగాంచుదురు. దక్షుడెట్లువిష్ణుని

పూజించె? ననగా 'అవోరాజాన మధ్వరస్య రుద్రమిత్యాది' శృతులవలన యజ్ఞమునకు అధిపతి రుద్రుడై యుండగా రుద్రుని యందు కోపముచే విష్ణువున కాధిపత్య మిచ్చి సువర్ణపాత్రయందు వేద మంత్రములచె పవిత్రమైన రుద్రునికివ్వ వలశిన హ విర్భాగమును విష్ణున కిచ్చు చున్నాను. ఇక్కడ ప్రభువు విభువు ఆహవనీయము విష్ణువే యని పూజించిన దక్షుని సంహరించుటకు రుద్రుడు రాగా విష్ణువు దక్షుని రక్షించుటకు శిరమును రెండు చేతుల తోకప్పి పట్టుకొని యుండగా రుద్రుడు విష్ణుచేతులను దక్ష శిరస్సు విష్ణు పాదములను తెగనరికి విష్ణువక్షమున శూలము గుచ్చి మూడు మార్లు గిరగిరం ద్రిప్పి యజ్ఞశాలకు దూరముగా పార వేశెను. దక్షుని న్ని యజ్ఞ శాలనుంచి బహిష్కరించెను. విష్ణుని సంహరించ బోవుచున్న సమయమందు దేవత లందరువచ్చి ప్రార్థించి చంపవద్దు రక్షించు మనిరి॥ శృతిప్రమాణః॥ హరిగ్ం హరంతమను యంత దేవాః । విశ్వస్యే శానం వృషభం మతీనాం । బ్రహ్మ సరూప మనుమేద మాగాత్ అయన మావివధీ ర్విక్రమస్వ అప్పుడు ఆజ్ఞ యిట్లు చేసెను. నీవు సముద్రతీరమునకు వెళ్ళి జగన్నాథుడను పేరుతో దారుమూర్తియందు కాళ్ళు చేతులు లేని మొండిరూపముతో పూజింపబడుదువు. పొమ్మని యాజ్ఞ యిచ్చెను. కాళ్ళు చేతులునూ ఈశ్వరుడె తెగనరికి నందున ఆ మొండి రూపముతో జగన్నాథం వచ్చి దారుమూర్తి యందు యిప్పటికి పూజింప బడుచుండెను. శిలామూర్తి యందు పూజింపరాదు. ఇట్లుస్కాందమున దక్షయజ్ఞ ఖండమున విస్తారముగా నున్నది.

శ్లో॥ యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః
భూతాని యాన్తి భూతేజ్యాయాన్తి మద్యాజినోఽపిమామ్॥

—♦ భా ష్య మ్ ♦—

ఏవం పృథగ్భావేన తత్తద్రూపేణైవ దేవతాంతర యాజినా మనావృత్తి లక్షణ కైవల్య ఫలాభావేపి తత్తద్వా

గానురూప క్షుద్ర ఫలావాప్తి ర్ధ్రువే త్యాహ—యా న్తీతి త్రైవంసతి । మహేంద్రాది దేవేవ్రతో నియమో యేషాన్తే దేవవ్రతా దేవానేవ తాన్యాన్తి ఏవ మగ్నిష్వాత్తాది పితృషు వ్రతో నియమో యేషాన్తే పితృవ్రతా స్తాన్పితౄనేవ యాన్తి ఏవం భూత ప్రేత యక్షాదిషు వ్రతో నియమో యేషా న్తే తానేవ యాన్తి । ఏవమేవ మద్యాజినో మామేవ సదాశివం యాన్తీత్యర్థః । తద్యథా 'దిగంబరంచ జటిలం బాలకం ధూళి ధూసరం । మన్దభాగ్యా నపశ్యన్తి గోవిన్దం శివరూపిణ మిత్యు మాత్యే రాజబుద్ధిస్తు నదోషాయ ఫలాయనేతి న్యాయేన బోధ్యమ్ । నను దేవకీ సుతత్వేన విష్ణుభావేన కుతో నోచ్యత ఇతిచే చ్ఛృణు । తద్యథా, 'మ్లేచ్ఛే ధ్యానం జినేఽహింసే త్యాదినా దత్తోత్తరత్వాది త్యవధార్యమ్॥౨౫॥

—♦ ల ఘు టి ప్ప ణీ . ♦—

క్షుద్రఫలావాప్తిరితి॥ తద్యథేహ 'కర్మచితో లోకః క్షీయతే ఏవ మేవా ముత్ర పుణ్యచితో లోకః క్షీయత'ఇత్యాది శ్రుతేః । తథాచ ఫలాభిసంధి యుక్తేన కర్మణా సంపాదితో లోకో భోగః క్షీయతే ఏవ మేవా ముత్ర స్వర్గాదిస్థః పుణ్యేన కామాభిసంధి యుక్తేన చిత స్సంపా దితో లోకో భోగః క్షీయత ఇతి హి తదర్థః॥౨౫॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

భిన్న భావముతో నానారూపమున దేవతాంతరములను బూజించు వారలకు పునరావృత్తి రహిత మైన కైవల్య ఫలము ప్రాప్తించక పోయి నను ఆయాగమునకు తగిన నీచఫలము తప్పక దొరుకునని చెప్పుచున్నాడు..

మహేంద్రుడు మొదలయిన దేవతల నారాధించు వారలు దేవతలను బొందుదురు. అగ్ని ష్వాత్తాదులయిన పితరుల బూజించు వారలు పితరులను బొందుదురు. భూత ప్రేత యక్షాదుల యందు వ్రతము గల వారలు భూతాదులను జెందెదరు. ఇటులనె నన్ను బూజించు వారలు నన్నె సదాశివునిగా బొందుచున్నారు. అరూప మెట్టి దనగా దిగంబరత్వముతో జడలు ధరించి, ధూళి ధూసరమైన బాల శరీరముతో నుండునది. ఇట్టి శివరూపుడైన గోవిందుని మంద భాగ్యులు చూడలేరు. అమాత్యునియందు రాజబుద్ధి ఫలము గలిగించునుగాని దోషమును గలిగించదు. దేవకీ సుతునిగా విష్ణు భావముతో నెందుకు పూజింపరాదంటె మ్లేచ్ఛునకు ధాన్యము బౌద్ధునకహింసా। ఉద్ధరింప నేరదని మనుపేఉ త్తరువునిచ్చి యున్నాము. అనగా కృష్ణుడు బౌద్ధావతారము గాన అందు ముక్తిలేదని తాత్పర్యము. (ఫలాభిసంధితో గూడిన కర్మ చే సంపాదింప బడిన లోకము, భోగము. క్షీణించిపోవును. పరమందు కామాభిసంధితో గూడిన పుణ్య కర్మచే సంపాదింప బడిన స్వర్గాదిలోకము భోగము, క్షీణించి పోవును. క్షుద్ర ఫలావాప్తి యనగా నిదేయని తెలియవలెను.౨౫॥

శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః॥ ౨౬

## —♦ భా ష్య మ్. ♦—

నన్వస్త్వేవం పరంతు సర్వభావేన వా కథం సదాశివః పూజ్య ఇత్యాహ॥ పత్రమితి॥ నను సర్వత్ర సర్వథా సదాశివ ఏవైకః పూజ్యో న బ్రహ్మా న విష్ణు రితి చే చ్ఛ్రోణు తత్ర తావత్ 'ఉపమన్యస్తు కష్ణస్య గర్గ స్త్వస్తి పురోహితః। పాదావనేజనై ర్గేహం సించనీయం ప్రయత్నత'। ఇత్యాది పాద్మోక్త

స్మృత్యా 'బ్రాహ్మణైః క్షత్రియై శ్చాపి సమకక్షత్వేన సదా శివా ద్వితీయో నపూజ్యః । పూజ్యశ్చే న్న స్వతో నై వహరిః పూజ్యో నవా బ్రహ్మా పురందరః ' శివేన సహితా స్సర్వే పూజ్యా దేవా నసంశయః ఇత్యాది భారత స్మృత్యా సదా శివేన సహైవ పూజ్యా నత్వేకాకీ తివివేకః॥ ౨౬॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

శివేన సహితా ఇతి॥ తద్యథా, 'నాయం యజ్ఞో నవా ధర్మో యత్ర శంభు ర్న ఇజ్యతే వధకల్పం ప్రపన్నో నై కిన్ను కాలస్య పర్యయా। ఇత్యాది దక్షయజ్ఞ ప్రమథనే సదాశివం వినా సకల కర్మణాం పర్య యస్యో క్తత్వాదితి భావః ౨౬॥

—♦ ఆ ం ధ్రి తా త్ప ర్య ము ♦—

ఓయీ! అట్లైన అవుగాక, మరే మంటె సదాశివుడు సర్వభావముచే నెట్లు పూజనీయుడంటె చెప్పుచున్నాడు. ఓయీ అంతటను అన్నివిధముల చేతను సదాశివు డొక్కడే పూజనీయుడు బ్రహ్మగాని విష్ణుగాని పూజ నీయులు గా రంటివట్టాయెనా వినుము. కృష్ణునకు ఉపమన్యు మహర్షి శివదీక్ష చేసినందున గురువుచే గర్గమహాముని పురోహితుడువీరిద్దరి యొక్క పాదాభిషేక జలముచె కృష్ణుడు తన గృహమును పవిత్రము చేసుకొన వలసి యున్నదని పద్మ పురాణమందు గలదు. బ్రాహ్మణులు క్షత్రియు లునూ సమానులు గాన సదాశివునే గాని యితర దైవమును బూజింప రాదు. ఒకవేళ పూజించిన యెడల విష్ణుని గాని బ్రహ్మను గాని ఇంద్రుని గాని ఒక్కరినె పూజింపరాదు. శివునితో కలసి అందరు దేవతలు పూజనీయులే. ఇట్లు భారతమందు గలదు గాన శివునితో గలిపి పూజించ వలయును. ఒక్కరినె పూజింపరాదని తెలియ వలెను. (యెక్కడ

శివుని పూజించుటలేదో అది యజ్ఞమున్నూ గాదు. ధర్మమున్నూ గాదు గనుకనె కాల వ్యత్యయముచె దక్షుడు వధించ బడెను. సదాశివారాధన లేని కర్మలకు విపర్యయ ఫలమే చెప్పబడినది. గనుక సదాశివ భావనచె పత్రమును గాని పుష్పమును గాని ఫలమును గాని జలమును గాని యెవడు భక్తితో నాకర్పించునో, అట్టి భక్తుడు భక్తితో నర్పించిన దానిని ప్రీతితో నేను స్వీకరింతును॥ ౨౬॥

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్ ।
యత్తపశ్యసి కౌన్తేయ! తత్కురుష్వ మదర్పణమ్॥ ౨౭

—◆ భా ష్య మ్ ◆—

ఏవంసతి। ఫలం పుష్పం తదేవాస్తి జన్మ కర్మా ఖిలం పునః । యచ్ఛివార్థం సమర్ప్యాథ కైవల్యం లభతే ధృవ' మిత్యాది స్మృత్యా పరమ శివాభేదేనైవ పునరప్యాహ— యత్కరోషీతి॥ ఏవం సత్య 'ద్వైత మాంతరం లింగం శీర్షణ్యాం ప్రాణే జీవనం । రసా స్యభక్తస్య జిహ్వాగ్రా దశ్నామి కమ లోద్భవ' ఇత్యాది బ్రహ్మాండ పురాణోక్త రీత్యా యత్కరోషి యదశ్నాసీ త్యాదుక్త్యా జిహ్వోపరి భాగా వచ్ఛేదేన ద్రవ లింగా ధీనత్య మేవ సార్వాంగానామితి ప్రత్యక్షతోపిస్ఫుటీ కృతం॥౨౭॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

స్ఫుటీకృతమితి॥ తద్యథా "బ్రహ్మరంధ్రే శివం ధ్యాయే ద్భ్రూమిష్ఠ ణంతు హృదిస్థితం నాభౌ విష్ణుంసమారాధ్య పరిజసేత్పర దేవతాం సప్తర్షి

స్తదా దేవైః పూజిత శ్చాంతరశ్శివః కర్ణయోర్ద క్షిణస్యాంగే యజ్ఞాంగం ధారయే త్తత'' ఇత్యాది నా శృతి స్మృతియుక్తి సిద్ధమేవ సర్వపూజ్య త్వం సదాశివస్య కోల్పమేధాస్తతో విరమే దిత్యాస్తాం విస్తరః౨౭

—♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

ఫల పుష్పము లనగా జన్మకర్మలు పుష్పములో నుండి ఫలము వచ్చినట్లు కర్మ నుంచి జన్మవచ్చును. యీ జన్మకర్మలను శివునికొరక ర్పించిన యెడల కైవల్యమును బొందుచున్నాడు. నిశ్చయము ఇంతియు గాక తిరిగి పరమ శివునితో అభేదమును జెప్పుచున్నాడు. ప్రాణులకు జీవనాధారమై ప్రసిద్ధమైన ఆంతర శివలింగ మొకటికలదు. అది జిహ్వో పరి భాగమందలి ద్రవలింగము పరమ శివుడు భక్తుల యొక్క జిహ్వాగ్ర ము వల్లను షడ్రసోపేత పదార్థములను భుజించుచున్నానని బ్రహ్మతో చెప్పినట్లు బ్రహ్మాండ పురాణమున గలదు సర్వాంగముల లోను జిహ్వాగ్ర మందు ద్రవలింగము ప్రత్యక్షముగా అందరికి అనుభవమె। ఓ కౌన్తెయా నీ వొనర్చు కర్మలను నీవనుభవించు దానినిహోమమొనర్చు దానినియిచ్చేదానిని తెపస్సును శివార్పణచే యుము బ్రహ్మరంధ్రమందు శివునిధ్యానించ వలెను. బ్రహ్మను హృదయమందున్న వానినిగా ధ్యానించవలయును. నాభియందు విష్ణునారాధించి పరదేవతను జపించ వలయును సప్త మహర్షులు సర్వ దేవతలు ఆంతరశివుని పూజించిరి॥ కర్ణములయందుశరీర దక్షభాగమందు ను యజ్ఞాంగమైన శివుడు గలడని భావన చేయవలయును. సదాశివుడే సర్వలోక పూజ్యుడని శృతి స్మృతి యుక్తులు సిద్ధమైనవి అల్పబుద్ధి గల వాడు చేయక పోవుగాక॥ ౨౭॥

శ్లో॥ శుభాశుభ ఫలై రేవం మోక్షసే కర్మబంధనైః।
సన్యాస యోగ యుక్తాత్మా విముక్తో మాముపైష్యసి॥

—◆ భా ష్య మ్ ◆—

ఏవమేవ చాహం శబ్దేన విఖ్యాత స్త్వేక ఏవ సదాశివ ఇత్యాది స్మృత్యా ప్యహంగిరో పాసనయా హం సదాశివ స్తదర్పణం కుర్వాణః కింఫలం ప్రాప్నోతీ త్యాహ।—శుభా శుభేతి॥ తథా సత్యేవం కుర్వాణ స్త్విహాముత్ర స్థ శుభాశుభ ఫలై స్సుఖదుఃఖాది మిశ్రితః కర్మ బంధనైః క్రియమాణ ఉర్వారుక మివ పశ్చా త్కర్మ బంధ నిర్ముక్త స్సన్న్యాస యోగ యుక్తా త్మా భవతి, సచ పునర్మాం శివ మద్వైతం తురీయం॥ యో వైష్ణవ స్సోపి చ యోగకాలే శక్తి స్వరూ పేణ విచి న్త్య విష్ణుం। శివాత్మకే ధామని యోజయే త్స్వ దత శ్చిదానంద మయోహి భక్త ఇత్యాది స్మృతి న్యాయేన చైవమేవ మా ముపైష్యసీ త్యర్థః॥ ౨౮॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

శుభా శుభ ఫలైరితి॥ శతర్హి తావ చ్ఛివావిరోధేన సర్వభావేన పరమశివ భక్త్యాశుభ మన్యథా తు దక్షువ దశుభ మిత్యాద్యధిక మన్యత్ర ద్రష్టవ్యమ్॥ ౨౮॥

—◆ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ◆—

అహం శబ్దమునకర్థము సదాశివుడు ఇట్లు అహంగిరోపాసనచే (శివోహం) ఈశ్వరార్పణ జేయువాడేమి ఫలమునొందునంటె చెప్పు చున్నాడు। కర్మల నీశ్వరార్పణ జేయువాడు ఇహపరముల యందలి శుభా-శుభ ఫలములయిన సుఖదుఃఖములతో గూడినవాడయ్యు కర్మలు జేయుచున్న వాడయ్యు అంత్యకాలమందు దోసపండును తొడిమి వదలి

నట్లు కర్మ బంధమును వదలినవాడై. సన్యాసయోగ మార్గమందు శివరూపము నొందుచున్నాడు॥ వైష్ణవుడయ్యును యోగముచేయు సమయమున విష్ణుని కుండలీశక్తిగా భావించి సహస్రార మందలి శివునితో నైక్యము జేసి తాను చిదానంద రూపుడై యుంటున్నాడు॥ ఇట్లే నన్ను బొందగలవు (శివునితో విరోధము లేక సర్వత్ర శివభావనచె పరమశివుని యందు భక్తిగలిగిన యెడల శుభమె । లేక శివనింద జేయువైష్ణవునకు దక్షునకు వలె అశుభమె జరుగును. ఇత్యాది క మన్యస్థలమున పెక్కువచనములు గలవు॥ ౨౮

శ్లో॥ సమోఽహం సర్వ భూతేషు నమే ద్వేష్యోఽస్తి నప్రియః।
యే భజంతి తు మాం భక్త్యా మయితే తేషు చాప్యహం॥

—♦ భాష్యమ్ ♦—

నను యది భక్తానేవ ఉద్ధరిష్యసి నాభక్తాన్, తర్హి, వైషమ్య నైర్ఘృణ్యాభ్యా మనీశ్వరత్వ మేవ తే స్యా దితి చేన్నైవ మిత్యాహ—సమ ఇతి॥ తత్త్రైవం సతి కపూయచరణాః కపూయాం యోని మాపద్యన్తే పుణ్యచరణాః పుణ్యాం యోని మాద్యన్త ఇత్యాది శ్రుత్యా తత్తత్ప్రాణి కృత కర్మణాం భోగ ప్రదత్వేన నేశ్వరస్య వైషమ్య నైర్ఘృణ్యే మస్తీతి బోధ్యమ్॥ ౨౯॥

—♦ లఘుటిప్పణీ ♦—

కృతకర్మణామితి॥ నన్వస్త్వేవ మేక ఏవహి భూతాత్మే త్యాద్యుక్తస్య చేశ్వరస్య తథాత్వం తథాపి తతః పరస్య సర్వ సాక్షిణస్తు స్వాతంత్ర్యేణ ఫలాదిక్య దాతృత్వ మపీతిచకిత మభిధత్తే శ్రుతిరపీత్యుక్తం

సంగచ్ఛతే అతఏవ మద్భక్తానాం చ పాపాని సన్తు పుణ్యఫలాని వైఇత్యా స్యుక్తి రపి వృషభోక్త్యా వైద్యనాధోక్త్యా చ తత్కథోక్తితో వధార్యేతి భావః॥ ౨౯॥

—◆ ఆంధ్రి తాత్పర్యము ◆—

ఓయీ నీవు భక్తులనే ఉద్ధరించు చున్నావు గదా। భక్తిలేనివార్లను ఉద్ధరించవు. అయితే , పక్షపాతము నిర్దయ నీయందు గాన్పించు చున్నందున నీవును జీవుడవై యండెు కాదని చెప్పుచున్నాడు. పాపము జేసిన వారలు పాప యోనియందు పుట్టుదురు. పుణ్యమును జేసినవారలు పుణ్యయోని యందు పుట్టుదురు. ఆయా ప్రాణులుచేసిన కర్మాను సారముగా ఫలమును భోగమును ఇచ్చుటచే పక్షపాతము నిర్దయ లేనందున ఈశ్వరత్వమునకు హానిలేదు, నేను భూతములన్నిటియందును సముండను. నాకిష్టుడు గాని విరోధిగాని లేడు, వన్నెవరు భక్తితో భజింతురో ఆట్టి భక్తులు నాయందుండెదరు. నేను।వారియందుండెదను (ఓయీ ఈశ్వరుడు భూతముల సృష్టించి ప్రతి భూతమందును తానే యుండెను. ఆట్టి సదాశివుడొకడె. అంతకంటె సర్వసాక్షి స్వతంత్రముగా అధిక ఫలమునిచ్చువాడు మరియొకడు గలడనుటకు శ్రుతులు భయపడుచున్నవి॥ గాన నాభక్తులయొక్క పాపములు పుణ్యములే అగుగాకయని ఈశ్వరుడు చెప్పినట్లు వృషభ వైద్యనాధ కథాసందర్భమున తెలియవలెను॥౨౯॥

శ్లో॥ అపిచే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్ ।
సాధురేవ సమంతవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః॥ ౩౦

—◆ భా ష్య మ్ . ◆—

నను॥న యస్య లోకే స్వజనః పరోవా నాత్మ్యాదృతో నోత కశ్చి ద్విగర్హ్య ఇత్యాది స్మృత్యా మను సదాశివస్య

సమత్వేపి కర్మణా జాత్యావా విషమోపి శివార్పణం కుర్వాణ స్సాధురేవే త్యాహ-అపిచేదితి। ఏవం తర్హి ధర్మతో జాత్యావా విభిన్నాత్మాపి యో మాం పరమశివాభేదేన తన్నిష్ఠయావా నన్యభక్త్యా భజతే స సాధురేవ సమ్యగ్వ్యవసితో నిశ్చితాత్మాపీ త్యర్థః । తద్యథా వాసుదేవో ధ రామోపి గోవిందే త్యాదయో ష్యమీ । వరదానా చ్ఛివస్యైవ ఫలవన్తో నచాన్యథా । ప్రహ్లాదేశో ధ్రువేశశ్చ వాలమీకేశ్వర స్తథా । లక్ష్మీశో ద్రౌపదీశశ్చ రుక్మిణీశా ద్యనేకశః ఇత్యాది స్మృత్యా శివభక్త్యైవ సర్వేషా మంతతో గత్వా ఫలావాప్తిః కైవల్యసిద్ధిశ్చే త్యవధార్యమ్॥ ౩౦॥

—♦ లఘుటిప్పణీ. ♦—

అంతతో గత్వేతి తద్యథా । శోషిత శ్శంభునా సిరో నచాగస్త్యేవ వస్తుతః । గౌతమాన్నోద్ధృతా ఽహల్యా కింతు శంభోః ప్రభావత ఇత్యాది ప్రహ్లాదేశో ధ్రువేశశ్చే త్యాదినాపి బుద్ధికుశలై రవగన్తవ్యం॥ ౩౦॥

—♦ ఆంధ్రతాత్పర్యము ♦—

యెవనికి స్వజనుడు గాని అన్యుడు గాని లేడో, ఆదరించ తగినవాడు గాని నిందించ తగినవాడు గాని లేడో వాడు సాధువు. నేనును సదాశివుడును సమాన మయినప్పటికి, కర్మచేత గాని జాతిచేత గాని నీచుడై శివార్పణ చేయువాడు సాధువే యని చెప్పుచున్నాడు. ధర్మము చలన గాని జాతి చేతను గాని పరమనీచుడైనను నన్ను పరమశివునితో అభేదముగా గాని పరమశివనిష్ఠతో గాని అనన్యభక్తితో యెవడు భజించునో వాడు సాధువు. వాడే నిశ్చితాత్మయున్నా, అది యేలాగునంటె, వాసు

దేవుడు, రాముడు, గోవిందుడు మొదలయిన వారలు శివుని వరదానము వలన మహిమ గలవారలు ఫలవంతులు అయిరిగాని మరియొక లాగుకాదు. ప్రహ్లాదేశుడు, ధృవేశుడు, వాల్మీకేశ్వరుడు, లక్ష్మీశుడు, ద్రౌపదీశుడు, రుక్మిణీశుడు ఇత్యాది అనేకులు శివలింగ ప్రతిష్ఠలు చేసి తమ నామము నుంచిరి. అందరికిని శివభక్తిచే అంతమందు ఫలప్రాప్తియు కైవల్య సిద్ధియు గలిగినదని తెలియవలెను. (శంకరునిచే సముద్రము యెండించ బడినది గాని వాస్తవముచె అగస్త్యుని వలన గాలేదు. గౌతముని వలన అహల్య ఉద్ధరింప బడలేదు. మరెట్లనగా ఈశ్వర ప్రభావముచే నుద్ధరింప బడెను. ప్రహ్లాదేశ ధృవేశే త్యాది నామములచే బుద్ధి వంతులు ఈశ్వర ప్రభావమును తెలియగలరు.౩౦.

శ్లో॥ క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వ చ్ఛాంతిం నిగచ్ఛతి।
కౌన్తేయ ప్రతిజానీహి నమే భక్తః ప్రణశ్యతి॥ ౩౧

—◆ భాష్యమ్ ◆—

నను కర్మణా జాత్యావా న్యూనోపి కియత్కాలం సేవనా త్సాధుత్వ మవగచ్ఛతీ త్యాహ—క్షిప్రమితి ఏవంసతి హేకౌన్తేయ త్వం ప్రతిజానీహీతి శివాతిరిక్తత్వేన మాం మన్యమానో దక్షో హ్యాహం సర్వేదేవా మునయ శ్శివభక్తిం వినా విదగ్ధా ఇత్యవధార్యం । తద్యథా, పాద్మే, 'ఏవం శివ శ్శైవం కర్తు మన్యథా కర్తు మీశ్వరః దక్షోదక్షతాం ప్రాప్తః పునర్దక్షో హ్యభూ ద్యతః।' ఏవం తద్యజ్ఞ ప్రథమన ఏవ సము త్థాయ మహావిష్ణుం భ్రామయిత్వా త్రిధా పునః శూలం వక్షస్య ధో హస్తా ఛిత్వా యజ్ఞా ద్బహి ష్కృత ఇత్యాది బహుశః ॥౩౧॥

## ——♦ ల ఘు టి ప్ప ణీ ♦——

అతఏవ దక్షయజ్ఞ ప్రమథన ఏవ భాగ శిరసో యోగానంతర మే మిత్యుక్త్యా వమిత్యుక్తం భాష్యేప్యాపి స మహేశ్వరో విద్యాధర్యై యథా చాద్యా కించా న్యశ్చ్రద్ధయా న్వితః. ఇత్యాది ఋదేఽపి స్వాతంత్ర్యేణా నుగ్రహః కృత ఇతి శివయోః క్రియాధారత్వం స్ఫుటీ కృతం। ఇత్యేవ ధార్యమితి। నన్వేవం స్వభక్తాం స్తర్హి కథం స్వత స్తారయసీతి చే న్నైవం 'దర్వీ న్యాయేన సంసారా దుద్ధరామి సురర్షభాః। న స్వతో హై తథా విష్ణు స్తదేందోఽపి కథం చ నే త్యాది నా స్కాందే బ్రహ్మగీతాయా ముక్తత్వా దితిభావః॥ ౩౧॥

## ——♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦——

ఓయీ ! కర్మచేతను గాని జాతిచేతను గాని భ్రష్టుడైన పుతికి కొంతకాలము సేవించుట వలన సాధు వగుచున్నాడని చెప్పుచున్నాడు. ఓ కౌన్తేయా శివుని కంటె వేరుగా నన్ను దలచిన దక్షుడు నేను సర్వ దేవతలు శివభక్తి లేక నష్టమైతిమని తెలుసుకో. శివుడు మంగళము జేయుటకును అమంగళమును జేయుటకును సమర్థుడు. ఆగ్రహముచే దక్షుని దక్షత లేకుండా చేసెను. అనుగ్రహముచె మళ్లీ బతుకునట్లె దక్షత కలిగించెను. దక్షయజ్ఞ భంగ సమయమున విష్ణుని శూలముతో వక్షస్థల మున గుచ్చి మూడు మార్లు గిరగిరం ద్రిప్పి కాళ్ళు చేతులు ఖండించి యజ్ఞమునుంచి బహిష్కరించె నని యనేక గ్రంథములందు గలదు. (ఈశ్వ రుడు దక్షుడు మళ్లీ బ్రతుకుటకు అనుగ్రహించి గొఱ్ఱె శిరస్సును అతక వలె నని యాజ్ఞాపించి పాణిముతో నుండుట కంగీకరించెను. క్షుద్రుడైన ను శరణు పొందిన తర్వాత రక్షించుట గొప్పవారికి ధర్మము గదా ఓయీ నే భక్తులను నే వెట్లుద్ధరింతువనగా నట్లుగాను. ఉద్ధారకుడు శివుడే. పాకము నుండి గరిటెను తీసి వేసినట్లు సంసారమునుండీ నేనే ఉద్ధరించు

మన్నాను. విష్ణువు వలన గాను. ఇంద్రుని వలన గాదని స్కాంద పురాణము నందీశ్వర వచనము గాన నా భక్తుడు త్వరితముగా ధర్మాత్ముడగును. నిత్య శాంతిని జెందును. ఎన్నటికిని నశించు వాడు కాడు. ఏవీవిధమున ప్రతిన జేసి పలుకుము॥ ౩౧॥

శ్లో॥ మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాన్తి పరాం గతిమ్॥ ౩౨

—◆ భాష్యమ్ ◆—

నను కిమనయా స్వీయభక్తిం ప్రతిపాదయస్యథ సదాశివ భక్తిం వేతి। నాద్యోఽయతోఽవ్యక్తం వ్యక్త మాపన్నం మన్యన్తే మా మబుద్ధయః పరం భావ మజానన్తో మమ భూత మహేశ్వర మిత్యాదినా స్వస్య భక్తే ర్నిరాసా దిత్యతోఽర్థాన్తర త్వేనాహ। మాంహీతి। హేపార్థ! మాం సదాశివ ముపాశ్రిత్య శరణ మాగత్య స్త్రియో వైశ్యా ఇత్యాది యేఽపి స్యుః పాప యోనయ స్తేఽపి పరాం గతిం శివసాయుజ్యం యాన్తీతి। వైద్య స్సోమనాథ భీమశ్చ నాగేశ స్త్ర్యంబక స్తథా ధూమ్రేశోంకార కేదారః కాశేశ శ్చ నవే శ్వరా ఇత్యాది నవనాథా దా ప్రసిద్ధం ద్రష్టవ్యమ్॥ ౩౨॥

—◆ లఘుటిప్పణీ ◆—

అర్థాంతరత్వే నేతి ఏవంత ర్హి మన్యే త్వాం కాలమీశాన మనాది నిధనం విభు మిత్యాది స్మృతి న్యాయేన మా మవినాశినం సదాశివ మిత్యర్థః ద్రష్టవ్యమితి తద్యథా సౌరాష్ట్రే సోమనాథంచ శ్రీ శైలే మల్లికార్జు

నం ఇత్యాది పురాణాంతరేషు ద్వాదశ లింగోద్భవే దర్శనాదిశిదక్ష్ట వ్యమ్॥౩౨॥

## —♦ ఆంధ్రతాత్పర్యము ♦—

ఓయీ దీనిచే నీభక్తిని చెప్పుచుంటివా సదాశివభక్తిని చెప్పుచుంటివా యనగా నాభక్తిని చెప్పుటలేదు. యేమనగా అజ్ఞానులు నన్ను అవ్యక్తముగా తెలియుదురు గాన నాయందు భక్తిగాకనన్ను సదాశివునిగా నెంచి శరణు బొందిన స్త్రీలుగాని వైశ్యులుగాని శూద్రులుగాని ఇంకా ఇతరమైన వారు గాని శివసాయుజ్యము నొందెదరు. వైద్య నాథేశ్వర సోమనాథేశ్వర భీమేశ్వర నాగేశ్వర త్రియంబకేశ్వర ఘృశ్మేశ్వర ఓంకారేశ్వర కేదారేశ్వర కాళేశ్వర యీ తొమ్మండ్రు ఈశ్వర క్షేత్రములు, నవనాథసిద్ధులు, ముక్తినొందిన క్షేత్రములు "(కుంతీదేవి కృష్ణునిగూర్చి నిన్ను కాల రూపుడైన ఈశ్వరుని గాను ఆద్యంతములు లేని వానిని గాను తలచెద నని చెప్పినందున నన్ను నాశములేని సదాశివునిగా భావించవలెనని చెప్పెదను. సౌరాష్ట్ర దేశమందు సోమనాథుడు శ్రీశైలమందు మల్లిఖార్జునుడు మొద లయినపండ్రెండు జ్యోతిర్లింగములు ముక్తిదాయకములు. ఆయాస్థలముల యందు యేలాటి పాపులయినను భక్తిని సలిపిన యెడల శివసాయుజ్యము నొందుదురని చెప్పుట హాశ్చర్యము గాదు॥౩౨॥

శ్లో॥ కింపున ర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా।
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మాం॥ ౩౩

## —♦ భాష్యమ్. ♦—

నను కర్మణా జన్మనా చాధమవృత్తయ ఏవ యది సదాశివ భక్త్యాతరంతితర్హి కిముత వక్తవ్యం పుణ్యాచారా దీనాం నైవ గతి రిత్యాహ । కిం పునరితి । ఏవం సతి । సకల

పురుషార్థ సాధనం యోగ్య మతిదుర్లభం చ మనుష్య దేహ మనిత్య మసుఖంచ గర్భవాసా మహద్దుఃఖం మోహశో దుఃఖంచ జన్మసు । బాల్యే దుఃఖం తథా శోకః పారవశ్యంచ మూఢతో హితాకరణ మాలస్య మహితాచరణం తథా । యౌవనే విషయాసక్తి స్తాపత్రయ నిపీడితః । చింతా రోగశ్చ వార్థక్యే మరణేతు మహద్భయం । ఆశయా చా భిమానేన కామ క్రోధాది సంకటై, అత్యుత్కటై మహద్దుఃఖ మస్వతంత్ర శ్చదుఃఖితః । దుఃఖ బీజ మిదం జన్మ దుఃఖ రూపం చ దుస్సహమిత్యాది గర్భోపనిషత్ । గర్భవా సాద్యనేక దుఃఖ బహుళం లోక మిమం లబ్ధ్వా తతోప్యతి దుర్లభం సదాశివ రూపం మాం భజస్వేతి పరమార్థః॥ 33॥

—♦ల ఘు టి ప్ప ణీ . ♦—

ఏవమిహ సర్వేషా 'ము ర్వారుక మివ బంధనా న్మృత్యో ర్ముక్షీయ మా మృతాత్' ఇది శృతిన్యాయేనో చ్చావచాంయదిము క్తి స్సరి త్వా కేవల పుణ్యైషిణాం తు కాకు తిరిత్యుపసంహార న్నాహ । ఏవం సతీతి।తథాచ। మానుష్య మర్థదమిదం బహు సంభవా న్తఇత్యాది స్మృతి న్యాయే నేహ జన్మనో దుర్లభత్వా త్తథా । 'ధిగ్భస్మరహితంఫాలం ధిగ్గ్రామ మశివా లయం ధిగనీశార్చనం జన్మ ధిగ్విద్యా మశివా శ్రయాం । ఇత్యాది శృత్యాచ । మన్యే త్వాం కాలమీశానం ఇత్యాది రీత్యా మాంశివ రూపం భజస్వే త్యర్థః॥ 33॥

—♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ జన్మచేతను కర్మచేతను నీచులయిన వారలే సదాశివ భక్తిచే తరించు చుండగా పుణ్యములు ఆచారములు మొదలగు వాటికి గతి

లేదని చెప్పేదేమిటంటె చెప్పుచున్నాడు। మానవ దేహము సకల పురుషార్థ (ధర్మార్థకామమోక్ష)మును సంపాదించుట కనుకూలమైనది, యెనుబది నాల్గులక్షల జీవరాసులలో మానవజన్మ దుర్లభము.। అందు లోను బ్రాహ్మడై పుట్టుట దుర్లభము। పండితుడగుట మరింత దుర్లభము. బ్రహ్మ జ్ఞాని యగుట అంతకంటె దుర్లభము. ఇట్టి మానవ శరీరము అనిత్య మయినది. దుఃఖ భూయిష్ఠ మైనది. గర్భవాసమందు మల మూత్రములలో పొరలుట, మల మూత్రపానము చేయుట, నరకము కంటెను దుఃఖము. పిమ్మట దారాపుత్రాదులయందు మోహము దుఃఖము. బాల్యమందు దుఃఖము, శోకము, పరాధీనత, మూఢత్వము, మంచి పనులు చేయక చెడు పనులు చేయుట. యౌవన మందు విషయాసక్తి తాపత్రయ పీడ, వార్ధక్యమందు రోగములు విచారము, మరణ మందు గొప్ప భయము, ఆశ, అభిమానము, కామ, క్రోధాదులు, ఇవి అతిశయించి నప్పుడు దుఖము చెప్పతరము గాదు. అస్వతంత్రము చె దుఃఖము, యీ జన్మ యె దుఃఖమునకు కారణము. ఇది సహింప నేరనిది. ఇట్టి లోకమును పొంది అతిదుర్లభ మైన సదాశివ రూపమయిన నన్ను సేవించుము (అందరికి దోసపండు వలె బంధము విడిపోయిన యెడల ప్రగల్భవాక్యములు జెప్పు వారలకె ముక్తి గలిగే యెడల పుణ్యమును గోరువారికి హాని యేమి అని, ఉపసంహరించు చున్నాడు. మానవ జన్మము యెనుబదినాల్గులక్షుల జన్మ లలో కడసారి జన్మము ముక్తి నొందుటకు సాధన మయిన యీ మానవ జన్మ నొంది, శ్లో॥ధిగజ్ఞానం ధిగజ్ఞానం ధిక్కామ క్రోధ సంకటం। సంసార శృంఖలం ఛిత్వా గాచార్యాత్ జ్ఞానమాప్నుయాత్ ఛీ, ఛీ,అజ్ఞానమా, కామ క్రోధ సంకటమా, ఛీ, సంసార సంకెళ్లా, ఛీ, గురూపదేశమున జ్ఞానము నొంది ముక్తినొంద గలవు, భస్మలేని ఫాల ప్రదేశమా ఛీ, శివా లయము లేని గ్రామమా ఛీ, శివారాధన చెయ్యని జన్మమా ఛీ, శివ

సంబంధము లేని జ్ఞానమూ ర్తి, ఇత్యాది ధర్మములను బట్టిన్ని కుంతీదేవి చెప్పిన చొప్పున నన్ను శివ రూపముగా భజింపుము॥ 33॥

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః ౩౪

ఇతి శ్రీ భగవద్గీతాసూ పనిషత్సు బ్రహ్మ విద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే రాజగుహ్య
నిరూపణ యోగో నామ నవమోఽధ్యాయః॥

—◆ భా ష్య మ్ ◆—

నను కథం పున స్సదాశివో మయా భజనీయ ఇత్యుప సంహార న్నాహ-మన్మనా ఇతి । తత్రైవం సతి । యస్య దేవే పరాభక్తిర్యథాదేవేతథాగురౌ ఇతి స్మృతిన్యాయేనమయిసదా శివే మనో యస్య స త్వం భవేత్యర్థః । ఏవం మద్యాజీ మాం సదాశివంచ నమస్కుర్వన్నే భిః ప్రకారై రాత్మానం సదా శివం యుక్త్వాచే త స్సమాధాయ మత్పరాయణ స్సన్మామేవ సదాశివ మేష్యసీతి । సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాల నందనః । పార్థో వత్స స్సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహా దిత్యత్ర గీతామృతం శివ తత్వం తద్దోగ్ధ్రే కృష్ణాయ చ నమ ఇతి శివం। ౩౪॥

ఇతి శ్రీ శ్వేతాచార్య గురుచరణ శిష్య భావ సమాసాదిత శైవసిద్ధాంత ప్రవర్తక శ్రీ శ్రీకంఠ శివాచార్య విరచితే తత్త్వైక దర్శన నామకే గీతాభాష్యే రాజగుహ్యనిరూపణ యోగో నామ నవమోఽధ్యాయః॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

గీతామృత మితి తద్యథా గౌ ర్దోగ్ధా చైవవత్సశ్చ దుగ్ధం చైవామృతం శివఃతద్దుగ్ధశ్చ పరివృత్తశ్చైవ భారతాదావివేకినా మిత్యధిక మస్య: త్రివి స్తరః॥౩౪॥

ఇతిశ్రీ శ్రీకంఠ శివాచార్య శిష్య విశ్వేశ్వర శివాచార్య
విరచితాయాం లఘుటిప్పణ్యాం రాజగుహ్య
నిరూపణ యోగోనామ నవమాధ్యాయః.

## —♦ ఆం ధ్రి తా త్ప ర్య ము ♦—

ఓయీ నేను సదాశివుని యెట్లు భజించవలె ననగా ఉపసంహరించు చున్నాడు. దేవునియందు గురువునందు సమబుద్ధి నుంచవలె ననే న్యాయముచె నాయందు సదా శివబుద్ధి నుంచుము. ఇట్లే నన్ను సదా శివ బుద్ధితో సమస్కరింపుము. యీ ప్రకారములచె ఆత్మను సదాశివునిగా యనుసంధించి నాయందాశ గలవాడవైతే నన్నే సదాశివునిగా పొందగలవు. ఇట్లు గీతామృతమయిన శివతత్వము కొరకు దానిని పితికిన కృష్ణునికొరకు నమస్కారమని మంగళము గోవు పితుకువాడు దూడ పాలు అమృతము ఇవన్నియు శివుడనిపించుకొనును, ఉపనిషత్తులు గోవులు పితుకువాడు కృష్ణుడు అర్జనుడు దూడ మంచిబుద్ధిగలవాడు (జ్ఞాని) భోక్త భోజ్యమయిన శివతత్వమే పాలు ఇట్లు భారతము పురాణములు వేదములు ఉపనిషత్తుల యొక్క యభిప్రాయము శివతత్వమే యని కృష్ణుడు చెప్పెను॥

ఇట్లు తత్త్వైక దర్శనమను శ్రీకంఠీయ గీతాభాష్యమునకు బోధానంద మహర్షిచేరచింపబడిన భావబోధమను నాంధ్రి తాత్పర్యమున రాజగుహ్యనిరూపణయోగమను నవమాధ్యాయము సమాప్తము॥ ౯॥

---

ఓమ్

# శ్రీమచ్ఛ్రీకంఠాచార్యకృతే

# శ్రీ భగవద్గీతాభాష్యే

## విభూతి యోగోనామ దశమోధ్యాయః



శ్రీకృష్ణ ఉవాచ.

శ్లో॥ భూయఏవ మహాబాహో శృణు మే పరమం వచః।
యత్తేహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా॥౧॥

—♦ భాష్యమ్ ♦—

'సంసారే స్మిన్ విభూతిర్వైర్యా యా దివ్యస్వరూపిణీ॥ సా తదేవేశ్వర స్యాంశా దశమే తన్నిరూప్యతే' అథేదానీం పరమ శివ జ్ఞానాయ విస్తరేణ వివేచయతు మారభతే। భూయఏ వేతి।తత్రైవం సతి హే మహా బాహో। దేహాత్మభావేన శృణు మే మమ పరమం ప్రకృష్టం వచో యత్తే తుభ్యం ప్రీయమాణాయ హితకామ్యయా గీతామృతం శివైకతత్వం వక్ష్యామీ త్యర్థః ॥౧॥

—♦ లఘుటిప్పణీ ♦—

నను కిమిహాధ్యాయే దశమే వర్ణ్యత ఇత్యాహ - సంసారయితి॥నను పురం విరాజం చ విరత్య తస్మిన్ స్వాంశేన విష్ విభు రాజతే వేత్యాది

స్మృత్యా సర్వస్య వస్తుజాతస్య తద్రూపత్వే స్థితే కథం తర్హి దివ్య స్వరూపిణో త్యుక్తి రితి చే చ్ఛృణు। తత్ర తావద్యా దివ్య స్వరూపిణీ విభూతి స్సా గ్రభాగతో బోధ్యా యా తు మలినాసాతు పృష్ఠ భాగ రూపే త్యేతావతైవ భేద ఇతి న విరుద్ధ మితి భావః॥ ౧॥

—◆ ఆంధ్ర తాత్పర్యము. ◆—

కృష్ణుండిట్లనియె॥ ఈ సంసార మందు యేదేది దివ్య స్వరూప మయిన విభూతియో అదంతయు ఈశ్వరాంశ యని దశమాధ్యాయ యందు విభూతిని నిరూపించు చున్నాడు. అనంతరమందు ఇప్పుడు పరమ శివజ్ఞానమును విస్తరించి చెప్పుట కారంభించు చున్నాడు.ఓమహాబాహో దేహామే నేనను భావములో వినుము (వినుట, చెప్పుట, దేహభావనలోనే గాని బ్రహ్మభావనలో కుదరదు) నాయొక్క ఉత్కృష్టమైన వాక్య మును (నాయభిప్రాయమును) మేలొనర్చు నూహతో, ఆనందించు చున్న నీకొరకు, గీతామృతమైన ఒక్క శివతత్వమును చెప్పుచున్నాను। వెనుకటి అధ్యాయమందు జెప్పిన శివతత్వమును అనుభవించుచు అర్జునుడు ఆనంద ములో శివోహంభావనలో నున్నాడు గనుక ఇప్పుడు కృష్ణుడు దేహాత్మ భావనలో నుండి యీ ఒక్కమాటను వినుమని చెప్పు చున్నాడు. (యీ అధ్యాయ మందు దేనిని వర్ణించె దరనగా చెప్పుచున్నాడు. శృ॥ ఈశావాస్య మిదగ్ంసర్వం యత్కించ జగత్యాం జగత్। తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్॥ ఈశ్వరుడు పిండాండమును బ్రహ్మాండమును సృష్టించి దానియందు తన యంశతో నుండి ప్రకాశించు చుండెనను శృతి స్మృతులచే సర్వవస్తు జాలము ఈశ్వర స్వరూపమయి యుండగా దివ్య స్వరూపమయ్యు విభూతియే ఈశ్వరాంశ యని చెప్పనేల యనెద వేమో, వినుము, దివ్య విభూతి ఈశ్వరునకు పురోభాగము, మలిన విభూతి పృష్ఠభాగము.ఇంతియె భేదము గాన విరోధము లేదు॥ ౧॥

శ్లో॥ నమే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః ।
అహ మాది ర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః ॥౨॥

—♦ భాష్యమ్ ♦—

నను ప్రాగ్బహుధోక్తమేవ కిం వక్ష్యసీ త్యాహ । నమఇతి॥ ఏవం తర్హి న మే సదాశివస్య తత్త్వం సురగణా మహేంద్రాదయో మహర్షయో భృగ్వాదయశ్చ విదు రిత్యర్థః। యతో యో దేవానాం ప్రభవ శ్చోద్భవశ్చ రుద్రో మహర్షిః హిరణ్యగర్భం జనయామాస పూర్వం సనో బుద్ధ్యా శుభయా యునక్త్విత్యాది శ్రుత్యా దేవానాం మహర్షీణాంచ సర్వ ప్రకారై రుత్పాదకత్వేన బుద్ధ్యాదిప్రవర్తకత్వేన చాదిః కారణమహమేవ సదాశివో ఽతో మత్ప్రభావం నవిదు ర్దేవకీ సుతత్వేన త్వహం విజ్ఞాత ఏవేత్యర్థః ॥౨॥

—♦ లఘుటిప్పణీ ♦—

బుద్ధ్యా శుభయేతి॥ అనేన ధియో యోనః ప్రచోదయా దిత్యేక వాక్యతయా గాయత్ర్యర్థో దర్శితః॥౨॥

—♦ ఆంధ్రతాత్పర్యము ♦—

ఓయీ ఇదివరకు చాలా చెప్పినావు. ఇంకనేమిచెప్పెదవంటె చెప్పుచున్నాడు. సదాశివుడనైన నాయొక్క తత్త్వమును దేవతలుగాని ఇంద్రాది దిక్పాలకులు గాని మహర్షులు గాని భృగ్వాదులయిన్ని దేవర్షులు గాని తెలియరు. రుద్రుడు ముందుగా (సృష్టిప్రారంభమందు) నన్ను సృష్టించెను. తర్వాత నేను దేవతలను ఋషులను సృష్టించి వందువలనను బుద్ధ్యాదీంద్రియములకు ప్రవర్తకుడ నగుట వలనను ఆది కారణ మైన సదాశివుడు

నేనే. నా పరిభావమును తెలియరు. దేవకీ పుత్రుడ నని తెలియుదురు. (ధి యో యోనః పరిచోదయాత్ పరమాత్మ యాయంతః కరణను సత్క ర్మానుష్ఠాన మందు పేరిరణ చేయుగాక గీతయనగా గాయత్రీ మంత్రార్థ మె. తత్సవితు ర్వరేణ్యం సూర్యునికి ప్రభవలె పార్వతీ పరమేశ్వరులు కవి నాభావ సంబంధమును బట్టిన్ని ఈశ్వరుడు దేవుడని యు బ్రహ్మ బ్రాహ్మ ణుడనియు విష్ణు క్షత్రియుడనియు ఇంద్రుడు వైశ్యుడనియు యక్షాదులు శూద్రులనియు పూర్వోక్తమైన భారత వచనమును బట్టిన్ని భగవద్గీత యన గా శివగీత యనియె అందు వర్ణింపబడునది శివతత్వమె యని తెలియ వలెను.

శ్లో॥ యో మా మజ మనాదించ వేత్తి లోక మహేశ్వరమ్।
అసంమూఢ స్సమర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥3॥

—♦ భాష్యమ్ ♦—

ననుబహూని మే వ్యతీతాని జన్మానీ త్యాదినా త్వ మైవ స్వస్య దేవకీ సుతాదే ర్జన్మాన్యుక్తాన్యే వేతి కథమేక దుచ్యత ఇతిచె దహం శబ్దేన విఖ్యాత స్త్వేక ఏవ సదాశివ ఇత్యాది స్మృత్యా శివస్యా వినాశిత్వా త్తద్రూపేణా హం బ్రవీమీ త్యాహ। యోమామితి। తత్రైవంసతి యః పురుషో మాం సదాశివ మజం జన్మాది రహిత మతోఽనాదించ లోక మహేశ్వరం వేత్తి సఏవ మర్త్యేష్వసంమూఢః పండితః స ఏవచ సర్వపాపైర్జన నమరణాది సంకటైః ప్రముచ్యత ఇత్యర్థః॥3

—♦ లఘుటిప్పణీ ♦—

నను కథ మిహ త్వా మశివం విజాన న్వినశ్యతీ త్యాగ్రహ ఇత్యతః పునరుపసంహారతి॥ తత్రైవం సతీతి। 'తత్ర ప్రవృత్తి లక్షణో ధర్మో

వాసుదేవ ఇతీరితః । నివృత్తి లక్షణో ధర్మ స్సదాశివ ఇతీరిత' ఇతి పర్యవసితే ప్రవృత్తి పూర్వికాపి నివృత్తి రుర్వారుక మివేతి శ్రుతి న్యాయేన పరమశివా ధీనైవే త్యవధేయమ్॥ ౧౩॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఓయీ దేవకీ పుత్రుడు మొదలయిన జన్మలు నాకనేకము లయిన వని నీవే చెప్పితివిగదా. ఇప్పుడు సదాశివుడ నని చెప్పనేల నంటె అహం అనగా సదాశివుడు, శివునకు నాశము లేకుండుట వలన శివ రూపముతో నేను పలుకుచున్నానని. చెప్పుచున్నాడు. యే పురుషుడు నన్ను సదా శివునిగాను జన్మములు లేనివానిగాను అనాదియయిన వానిగా నున్నూ లోక మహేశ్వరుని గానున్నూ తెలియు చున్నాడో వాడే మనుష్యులలో పండితుడు. వాడె జనన మరణ సంకటములచె విడువ బడుచున్నాడు. ఓయీ నీవు శివుడవు కావని తెలిసినటులైతె యెందుకు నశించుచున్నాడని యాగ్రహ పడినందున తిరిగి ఉపసంహరించు చున్నాడు. ప్రవృత్తి లక్షణములు గల ధర్మము (సాంసారికధర్మము) వాసుదేవుడని చెప్పబడినది. నివృత్తి లక్షణములుగల ముక్తినిగురించి నధర్మము సదాశివు డని చెప్పబడి నది. ఇట్లు పర్యవసాన మైయుండగా నివృత్తికి మొదలు ప్రవృత్తియే అదియును ఈశ్వరాధీన మని తెలియవలెను॥ ౩॥

శ్లో॥ బుద్ధి ర్జ్ఞాన మసంమోహః క్షమా సత్యం దమ శ్శమః ।
సుఖం దుఃఖం భవో భావో భయంచా భయమేవ చ॥ ౪

—♦ భాష్యమ్ ♦—

ఏవంసత్యాత్మనో లోక మహేశ్వరత్వం సదాశివైక తాదాత్మ్యేన దర్శయన్నాహ—బుద్ధిరితి। తత్ర తావ ద్బుద్ధి రంతఃకరణస్య సూక్ష్మార్థ వివేక సామర్థ్యం తత్ర జ్ఞానం త్వా

త్మానాత్మ సర్వపదార్థావబోధః ఏవ మసంమోహః ప్రత్యుత్ప
న్నేషు కార్యేష్వ వ్యాకులతయా ప్రవృత్తిః క్షమాతు దుష్టై
ర్భత్సితస్యాపి నిర్వికార చిత్తతా,ఏవం సత్యంతు ప్రమాణేనా
వబుద్ధార్థస్య తథైవ ప్రభాషణం తథా త్రదమోనామ
బాహ్యేంద్రియాణాం స్వస్వ విషయేభ్యో నివృత్తిః । ఏవం
శమోనామ మనసో నైశ్చల్యం తథా నుకూల వేదనీయు
సుఖం ప్రతికూల వేదనీయం దుఃఖం । ఏవమిహ భవ ఉత్పత్తి
భావస్తు తత్తత్ప దార్థ సత్తా తదభావశ్చ తథా భయం త్రాస
స్తద్విపరీతం చాభయ మిత్యేతే బుద్ధ్యాదయ స్సర్వలోక
ప్రసిద్ధా మత్తఏవే త్యుత్తరేణా న్వయః॥ ౪॥

—◆ లఘు టిప్పణీ ◆—

నను'న స్వతో వై హరిఃపూజ్యో న బ్రహ్మ న పురందరః కుతో
న్య దేవతా స్సర్వా బ్రహ్మనూన్ఘర్త్యల్పతా బలా' దితి స్కాందే సూత
గీతోక్త సంవాదేన స్వత స్సర్వేషా మపూజ్యత్వే స్థితే సత్యాహ॥ ఏవం
సతీతి తథా చేహాత్మనః శ్రీ కృష్ణస్య మన్యే త్వాం కాలమీశాన మితి
స్మృతి న్యాయేన పరమ శివైక్య తాదాత్మ్య త్పూజ్యత్వే కాఽతిరిత్యా
శయః॥౪॥

—◆ ఆంధ్ర తాత్పర్యము . ◆—

కృష్ణుడు తనయొక్క లోక మహేశ్వరత్వమును సదాశివ తాదా
త్మ్యముతో చూపించుచు చెప్పుచున్నాడు. అంతఃకరణయొక్క సూక్ష్మా
ర్థమును తెలుసుకొను సామర్థ్యముగల బుద్ధిన్ని ఆత్మయెదో అనాత్మయెదో
సర్వ పదార్థములను తెలుసుకొనెడి జ్ఞానమున్ను కార్యభంగమైనప్పుడు

వ్యాకులము లేక ప్రవర్తించునట్టి అసమ్మోహమున్నూ దుష్టులు బెదరించి నను వికారములేకుండు నట్టి క్షమయున్నూ ప్రమాణముచే తెలిసిన దానిని తెలిసినట్లు మాట్లాడునట్టి సత్యమున్నూ బాహ్యేంద్రియ ములు తమతమ విషయములనుండి మరలుట యనెడి దమమున్నూ మనోనిశ్చలత్వ మనెడు శమమున్నూ అనుకూలముగా తోచెడి సుఖమున్నూ ప్రతికూలముగా తోచెడి దుఃఖమున్నూ పదార్థము యొక్క పుట్టుక దానియొక్క సత్తా రూప మైన భవమున్ను అది లేకుండుట యనెడి అభావమున్నూ భయమున్నూ అభయమున్నూ ఇవన్నియు నావలననె కలిగి సర్వలోక ప్రసిద్ధములై యున్నవని తెలియుము (హరి స్వయముగా పూజనీయుడు గాడు బ్రహ్మ యు పూజనీయుడు గాడు ఇంద్రుడును పూజనీయుడుగాడు ఇతర దేవతల మాటచెప్ప నేల? విష్ణ్వాదులకు అల్పమైన బ్రహ్మజ్ఞానము యొక్క బలము వలన పూజ్యత గలిగిన దని స్కాందములో సూత గీతయందు గలదు. కృష్ణునకు పరమశివ తాదాత్మ్యముచె పూజ్యత్వమునకు హానిలేమ॥౪॥

శ్లో॥ అహింసా సమతా తుష్టి స్తపో దానం యశో యశః ।
భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥౫॥

—♦ భా ష్య మ్ ♦—

ఏవమపరమప్యాహ అహింసేతి। తత్ర తావదహింసా ప్రాణినాం పీడన కర్తృత్వ నివృత్తిః । తథా సమతా చిత్తస్య రాగ ద్వేషాది రాహిత్యం । తుష్టిస్తు భోగ్యేష్వేతావతా ఽలమితి బుద్ధిః । తథా తపస్తు శాస్త్రీయ మార్గేణ కాయేం ద్రియ శోషణం తథా త్ర దానంతు దేశే కాలే పాత్రేచ శ్రద్ధ యా సమర్పణం । ఏవం యశో ధర్మతః ప్రవృత్త్యా తద భావశ్చా యశో బోధ్యా ఇత్యేతే బుద్ధ్యాదయో ఽహింసా

దయశ్చ భావా మత్త ఏవ పృథగ్విధా ఇత్యతో లోకమహే
శ్వరత్వం మమాపీతి భావః ॥౫॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

తపస్త్వితి॥ తద్యథా 'తపసా కర్శితాత్మా తు పర మాప్నోతి
పూరుషః । వ్రతాద్యై ర్నియమై స్తచ్చ కృచ్ఛ్ర చాంద్రాయణాదిభి' రితి
సాంతపన స్మృతే రితి భావః । దానంత్వితి॥ తదేతదప్యుక్తం పురా
ణాంతరే వాల్మీకీయే చ । తద్యథా । 'తుందే రేకశరం ధృతేచ దశధా
సంధాన కాలే శతం చాపే త్వస్తి సహస్ర లక్ష మధికం సత్పాత్రే।
దానం యథా । ఇత్థం రామ శరాసనం సముదధ చ్ఛంభు ర్ధరాభీహృతే
పౌలస్త్యాహరణాయ పూర్వ తపసా ఽగస్త్యో దిశత్ స్వాశ్రమ' ఇత్యేవ
ధార్యమ్॥ ౫॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఈ ప్రకారం తపువాయిని చెప్పుచున్నాడు. ప్రాణులకు పీడ
గలుగ చేయని అహింసయున్నూ, రాగ ద్వేషములు లేని సమత్వమున్నూ
భోగ్య వస్తువులు యింతమాత్రము చాలుననే తుష్టిన్నీ శాస్త్ర ప్రకారము
కృచ్ఛ్ర చాంద్రాయణాది ప్రకారము కాయ శోషణ రూపమైన తప
స్సున్నూ, దేశ కాల పాత్రల యందు శ్రద్ధతో సమర్పించెడి దానమున్నూ,
ధర్మ ప్రవృత్తి రూపమైన కీర్తిన్నీ, అధర్మ ప్రవృత్తి రూపమైన అపకీర్తిన్నీ
ఈ బుద్ధ్యాదులు అహింసాదులు అయిన భావములన్నియు వేరువేరుగా
నావల్లనుంచే గలుగు చున్నందున లోక మహేశ్వరత్వము నాకును గలదని
కృష్ణుడు చెప్పెను. వ్రతములు, నియములు, కృచ్ఛ్ర చాంద్రాయణాది
తపస్సులచే కృశించిన వాడు పరమ పదమును పొందుచున్నాడు.
అమ్ముల పొదిలో నున్నప్పుడొకటె బాణము అది చేతిలో నుంటె పది.
సంధాన కాలమందు నూరు ధనస్సు యందు సంధించిన వేలు లక్షలకంటె

సత్పాత్రి దానము వలె నధికము, ఇట్టి ధనస్సును ఓరామా! నీ తపస్సు నకు మెచ్చి శంకరుడు భూలోక భయమును పోగొట్టు నట్టి రావణ సంహా రము చేయు నిమిత్తము యిచ్చినాడని అగస్త్యులు తన యాశ్రమ మందు చేతి కందిచ్చె నని పురాణాంతర మందును వాల్మీక మందును గలదు॥ ౫॥

శ్లో॥ మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా।
మద్భావా మనసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః॥౬॥

—♦ భాష్యమ్ ♦—

ఏవం సోపాధికస్య భగవత స్సదాశివస్య ప్రభావ ముక్త్వా తద్భావనవతాం మునీనాం వృత్తి మప్యాహ - మహ ర్షయ ఇతి॥ తత్రతావద్భృగ్వాద్యా మహర్షయ స్తేభ్యోపి పూర్వే ప్రథమా శ్చత్వార స్సనకాద్యా స్స్వాయంభువాదయో మనవ శ్చతుర్దశేతి మయి పరమేశ్వరే భావో భావనా యే షాంతే మద్భావా మచ్చిన్తనపరాః పాశుపతా ఇత్యర్థః తత్ర మానసాస్తు మనస్సంకల్పాదేవోద్భవో యేషాం తేనతు యోనిజా అత ఏవ సర్గాద్యకాలే హిరణ్య గర్భ ద్వారా పృథగ్భూతాః యేషాం చాయం లోకో బ్రాహ్మణాద్యా ఇమాః ప్రజా శ్చే త్యర్థః॥౬॥

—♦ లఘు టిప్పణీ ♦—

సోపాధికస్యేతి॥ తత్రైవమిహ 'శివస్యా ర్ధస్థితా గౌరీ తదర్ధో హరి రిష్యత ఇత్యాది స్మృతిన్యాయేనాస్య సోపాధికత్వ మవధార్యమ్। మయి పరమేశ్వర ఇతి॥ తదిహ శివస్యార్ధం స్థితా గౌరీ తి యథోక్త

రీత్యా మయి పరమేశ్వరే సదాశివే ఇత్యర్థః॥ అతఏవాహ । పాశుపతా ఇతి॥ తథాచ శివ కేశవయో రంకా చ్ఛూల చక్రాదీన్ ద్విజో నధార యేత్ । మతిమాన్వైదికే వర్త్మని స్థిత ఇత్యాదినా తప్తముద్రాదే ర్నిషే ధేనా గ్నిరితి భస్మేతి మంత్రేణ గృహీత్వా క్రమా త్తత్పురుషా ఘోర సద్యా వామే శ నామభిః ఫాలాంసోదర వక్షస్సు బుద్ధే స్తేషా మధావివే త్యాది క్రమేణ రుద్రాక్షేణ సహ ధారయే దితి పాశుపతవ్రత విధి రిత్యవ ధేయమ్॥ ౬॥

## —♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఈప్రకారము సోపాధికుడై భగవంతుడైన సదాశివుని యొక్క ప్రభావమును జెప్పి అతని యందుగల మునీశ్వరుల యొక్క వృత్తిని చెప్పుచున్నాడు । భృగువు మొదలయిన యేడుగురు మహర్షులును, వారి కంటెను పూర్వులయిన మొదటి సనకాదులు నలుగురును, (అనగా సన కాదులు శివసృష్టి లో నలుగురు మొదటివారు బ్రహ్మసృష్టిలో నలుగురు రెండవ వారని భావము) స్వాయంభువాదు లయిన పదునాల్గురు మనువు లును । వీరలు పరమేశ్వరుడనైన నాయందు భావన గల పాశుపతులు, మనస్సంకల్పము వలన బుట్టిన వారు యోని సంభవులు గారు । గనుకనె హిరణ్యగర్భుని ద్వారా వీరికి సృష్టి సామర్థ్యమును వేరువేరుగా నందరికి నిచ్చిరి, యీలోకమందలి బ్రాహ్మణాది ప్రజలు వీరిచే సృష్టింప బడిన వారలే యని తెలియవలెను. (శివునికి సగము శరీరము పార్వతి పార్వ తిలో సగము విష్ణువు । గనుక సదాశివుడు సోపాధికుడని తెలియ వలెను। శివునిలో శరీరము గనుక నేను పరమేశ్వరుడ నని తెలుసుకొనుము.) బుద్ధి మంతుడును వైదిక మార్గమందున్న వాడును శివ కేశవుల చిహ్నములయిన శూలచక్రములను (శూలాంకణ చక్రాంకణ ములను) ధరించ గూడదని తప్తముద్రా ధారణము నిషేధింప బడినది. అగ్నిరితి భస్మ మంత్రముచె

భస్మను గ్రహించి తత్పురుషా ఘోర సద్యావామే శాన మంత్రములచె ఫాలము భుజములు వక్షము మొదలయిన పరిదేశముల యందు రుద్రాక్షుల తోటి భస్మధారణ చెయ్యకలసిన పాశుపత వ్రత విధియని తెలియ వలెను॥ ౬॥

శ్లో॥ ఏతాం విభూతిం యోగంచ మమ యో వేత్తి తత్త్వంతః।
సోవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః॥ ౭

—◆ భా ష్య మ్ ◆—

ఏవ మేవ యో దేవానాం ప్రభవ శ్చోద్భవశ్చే త్యాది శ్రుతి న్యాయేన సోపాధికస్య భగవత స్సదాశివస్య ప్రభావ ముక్త్వా తత్ప్రాప్తి జ్ఞానస్య ఫల మప్యాహ—ఏతా మితి॥ ఏవంతస్య్వైతాం విభూతింత త్తద్రూపేణా వస్థితిం యోగంచ తన్నిర్మాణ సామర్థ్యం చ మమోపదిష్టం తత్త్వతో ధ్యాన యోగత స్సమాధినా యో వేద సత్వవికంపేన యోగేన పూజ్యతే నాత్ర సంశయ ఇత్యర్థః॥ ౭॥

—◆ ఆం ధ్ర తా త్ప ర్య ము ◆—

ఈ ప్రకారము సోపాధికు డయిన సదాశివుని యొక్క ప్రభావ మును చెప్పి శివప్రాప్తి కరమైన జ్ఞానము యొక్క ఫలమునున్ను చెప్పుచున్నాడు. యీ భృగువు మున్నగు వారి రూపముతో నున్న నా వి భూతినిన్ని వారిని నిర్మించుట రూపమగు సామర్థ్యమునున్ను యీ నా యొక్క ఉపదేశమును యదార్థముగా ధ్యానముచె సమాధిచే యెవడు తెలియు చున్నాడో వాడు నిశ్చల యోగి యనదగును వాడే పూజనీయు డు సంశయములేదు॥౭॥

శ్లో॥ అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే।
ఇతి మత్వా భజంతే మాం బుధా భావ సమన్వితాః॥౮॥

—♦ భాష్యమ్ ♦—

నను కథం తాదృశావికంపయోగ ప్రాప్తి రిత్యాహ—
అహమితి॥ తత్త్రైవం సతి వస్తుతో మత్త ఏవ సదాశివా దిదం జగత్ప్రవర్తతే తదేవా హమేవ సర్వస్య హిరణ్యగర్భాది స్థావరాంతస్య జగతః ప్రభవ ఉత్పత్తి కారణ మితి మత్వా మాం శివ మద్వైతం బుధా భావసమన్వితా నవధా భక్త్యా భజంతే ఇత్యర్థః ॥౮॥

—♦ ఆంధ్రతాత్పర్యము. ♦—

ఓయీ! అట్టి నిశ్చల యోగ మెట్లు లభ్య మగుననగా చెప్పుచున్నాడు. యథార్థముగా సదాశివుడనైన నావల్లనే ఈ జగమంతయు నడచుచున్నది. గనుకనే బ్రహ్మాది స్థావరాంతమైన జగత్తును సృష్టించు వాడను గాన అద్వైత రూపమైన శివుని నన్నుగా పండితులు భావించుచు తొమ్మిది విధములైన భక్తులచె సేవించు చున్నారు॥౮॥

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్।
కథయంతశ్చ మాం నిత్యం తుష్యన్తిరమయంతిచ ॥౯॥

—♦ భాష్యమ్ ♦—

నను కథం సోఽహం భజనీయ ఇతి స్వయమప్యాహ।—
మచ్చిత్తా ఇతి॥ ఏవం తదీహా తచ్చింతనం తత్కథనమన్యోన్యం తత్ప్రబోధన మేతదేకపరత్వంచ బ్రహ్మాభ్యాసం విదుర్బుధా ఇతి

రీత్యా మయ్యేవ సదాశివే చేతో యేషాంతే మచ్చిత్తా స్తథా శరీర మర్థం ప్రాణాంచ ప్రదద్యా చ్ఛ్రద్ధయా. సహేత్యాదినా త్మార్పణేన మద్గత ప్రాణా ఇత్యర్థః ॥ ఏవం హఠయోగేన రాజ యోగేనవా యథాధికారం పరస్పరం బోధయంత స్తథా బాహ్య వృత్త్యాపి మామేవ సదా శివంకథ యంత స్త త్రైవ తుష్యంతి రమయంతి చేత్యాది రర్థః ౮॥

—◆ లఘుటిప్పణీ. ◆—

మయ్యేవేత॥ నను మయ్యేవ దేవకీసుతే కుతో నమనో నిధార్యత ఇతి చే దవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మా మబుద్ధయ ఇత్యాది స్వయమేవ నికరణాత్ । తస్మాత్ । 'యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ' ఇత్యాది శ్రుతి న్యాయేన మయ్యేవ సదాశివే స్వాభేదేన మనో నిధాయ చింతయంత్వి త్యాశయః ౯॥

—◆ ఆన్ధ్రి తాత్పర్యము ◆—

అట్టి నన్ను యెట్లు భజించ వలెనంటె తానున్ను చెప్పుచున్నాడు అట్టి పరమేశ్వరుని చింతన జేయుచు అతనినే చెప్పుకొనుచు, ఒకరి నొకరు బోధించు కొనుచుండవలయును. దీనిని ఒకపక్షమైన బ్రహ్మాభ్యాస మును గా పండితులు తెలియుచున్నారు. సదాశివుడైన నాయందు చిత్తమునుంచి తను మన ధనములను ఆత్మార్పణము చాయవలెను. ఈ ప్రకారము హఠ యోగముచే గాని రాజయోగముచే గాని అధికార మును బట్టి (మందాధికారికి హఠ యోగము ఉత్తమాధికారికి రాజయోగ మున్ను చెప్పబడినది.) పరస్పరము బోధించు కొనుచు బాహ్యావృత్తితో నున్ను నన్నె సదాశివునిగా చెప్పుకొనుచు సంతోషించుచు, రమింప జేయుచు నున్నారు. (దేవకీ సుతుడైన నాయందు మనసు నెందుకుంచ

రంటె, ఆపండితులు అవ్యక్తమె ఇట్లు దేవకీసుత రూపముగా వ్యక్తమై యున్నదని తలచు చున్నారను దానిని స్వయముగా తీసివేసు కొనుట వలన దేవునకు గురువునకు తనకు అభేదముగా మనసు నుంచి చింతన చేయ వలయును॥ ౯॥

శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతి పూర్వకం।
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే।

—♦ భా ష్య మ్ ♦—

నన్వేవం భజతాం త్వం కిం కరోషీత్యాహ—తేషా మితి॥ ఏవంసతి తేషాం భజతాం సతత యుక్తానాం ప్రీతి పూర్వకం యథా స్యాత్తథా భజతాం బుద్ధి యోగ మైశ్వరం బుద్ధియోగం తం సమాధి నిహూత మలస్య చేతస ఇత్యాది లక్షణం దదామి యేన బుద్ధియోగేన మాం పరం పదం తే ఉపయాంతీ త్యర్థః॥ ౧౦॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

మాం పరం పదమితి॥ తత్ర యద్యపి పదం యత్పరమం విష్ణోస్త దేవా ఖిలదేహినామిత్యత స్సాంబస్యైవ పరం పదత్వం నిర్ణీతం తథా పీహ 'హరిరూపీ మహాదేవో లింగ రూపీ జనార్దనః ఈషదప్యంతరం నాస్తి భేదకృన్నరకం వ్రజే దిత్యాది స్మృత్యా మమాపి పరమ శివా భేదేన పరం పదత్వే కాక్షతి రిత్యాస్తాం విస్తరః॥౧౦॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ! ఈలాగు సేవించు వారలకు నేనేమి చేసెదనంటె చెప్పుచున్నాడు. ప్రీతి పూర్వకముగా యెల్లపుడు ఆభజనచేయు వారలకు ఈశ్వర

జ్ఞానమును బుద్ధియోగమును యిచ్చుచున్నాను. చిత్త మందలి విక్షేప మల రాహిత్యముచే సమాధి నిష్ఠ కుదిరి అందు మనసు ఆత్మలో ఏకము కాగా యెంత సుఖమనగా అంతః కరణ యందు యెంత ఆనంద మనుభవము నకు వచ్చినదో అదివాక్యముతో చెప్పుటకు నలవిగాదు. ఇట్టి బుద్ధియోగము చే వారు పరమ పదమైన నన్ను బొందుచున్నారు. (విష్ణుకంటె నుత్కృష్ట మైన పదమె సర్వదేహులకు ముక్తిస్థానము గనుకనె సాంబునకె పరమ పదత్వమునిర్ణీతమైనది. అయినప్పటికి ఇక్కడ మహాదేవుడు విష్ణురూపుడు జనార్దనుడు లింగరూపుడు వీరలకు కొంచెమైనను భేదములేదు. భేదమును చేయువాడు నరకమును బొందునను స్మృతిచె నాకును పరమశివునితో నభేదముచే పరమపద మగుట యందు హానిలేదు. ౧౦

శ్లో॥ తేషా మేవా నుకంపార్థ మహ మజ్ఞానజం తమః ।
నాశయామ్యా త్మ భావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥ ౧౧

—♦ భాష్యమ్ ♦—

నను తేషాం బుద్ధియోగార్థం మద్యే కింకరణీయ మస్తీత్యాహ—తేషామితి॥ తథాచ తేషాం కథం స్యా దిత్యనుగ్రహార్థ మహ మజ్ఞానం తమో నాశయామీ త్యర్థః। తత్రతావ న్మమా త్మా శివ స్తద్భావస్థ స్సంజ్ఞాన దీపేన భాస్వతేత్యాశయః॥ ౧౧॥

—♦ ఆన్ధ్ర తాత్పర్యము ♦—

ఓయీ! వారి బుద్ధియోగము కొరకు మధ్యయందు యేమి చేయ తగియున్నదంటె చెప్పుచున్నాడు. వారిని దయచూచు తలంపుతో నా యొక్క ఆత్మయె శివుడు. ఆ భావమును నేను వారిబుద్ధి వృత్తి యందుండి

ప్రేరణ జేయువాడ నగుచు ప్రకాశమును గాంచు జ్ఞానదీపముచె వారి యొక్క అజ్ఞానమును నశింప జేయుచున్నాను॥౧౧॥

అర్జున ఉవాచః—

శ్లో॥ పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్యమాదిదేవ మజంవిభుమ్॥౧౨॥

—♦ భాష్యమ్. ♦—

అథాస్త్వేవం యత స్త్వత్పరంపదత్వేన కిన్నకర్తుమిచ్ఛసీ త్యాహ—పరమితి॥ తత్రైవం సతి, 'గుణ త్రయేణ భిద్యన్తే బ్రహ్మ విష్ణ్వాదయ స్సమే । వస్తుత స్త్వేక మద్వైతం శివ మిత్యాహ హి శ్రుతి' రిత్యాది స్మృతి న్యాయేన 'పరాత్పర తరం ధామ యద్విష్ణోః పరమం పదం । తత్పవిత్రం పరమం భావేనే వేత్యర్థః । అథచ 'పురుషో హవై రుద్రః పురుషా న్నపరం కించి ది'త్యాది శ్రుత్యా శాశ్వతం పురుషం దివ్య మాదిదేవ మజం విభుం సదాశివం త్వామాహు రితి పరే ణాన్వయః॥౧౨॥

—♦ లఘుటిప్పణీ ♦—

స్వ పరం పదత్వే నేత్॥ తత్రైవం సతి. స్వయంతు నకిమపి కర్తుం శక్త ఇత్యర్థః। అతయేవ సూతాగీతాయాం బ్రహ్మణోక్తం, తద్యథా। దర్వీ న్యాయేన సంసారా దుద్ధరామి జనా నిమా న్నస్వాతంత్ర్యేణ హేదేవా స్సాక్షా ద్విష్ణుస్త థైవ చేత్యాది ద్రష్టవ్యమ్॥ ౧౨॥

## —◆ ఆంధ్ర తాత్పర్యము ◆—

అర్జునుం డిట్లనియె. ఆతరువాయి అట్లుండనిమ్ము. నీవు పరమ పద మగుటవలన అన్నియు చేయుట కిష్టపడుదువంటె చెప్పుచున్నాడు సత్వ రజస్తమో గుణములచె బ్రహ్మ విష్ణు రుద్రులని భేదము వచ్చెను. గాని వస్తుతః అద్వైతమగు ఒక్క శివునె శృతి చెప్పుచున్నది. విష్ణు కంటె ఉత్కృష్టమైన పదము పరాత్పర రూపమైన శివుడు ఉత్కృష్ట భావనచె నదియే పవిత్రమయినట్టిన్ని శాశ్వతమైనట్టి రుద్రరూపమైనట్టిన్ని ప్రకాశమే స్వరూపముగా గలిగి నట్టిన్ని జన్మరహితమైన సనాశివుని నిన్నుగా జెప్పుదురు (విష్ణు. స్వయముగా యేమి యు చేయుటకు సమర్థుడు గాదు నూత గీతయందు ఇట్లు చెప్పబడి నది. పాకమునుండి గరిటెను తీసి వేసి నట్లు సంసారమునుండి నేనే ఉద్ధరించు చున్నాను. యీకార్యమును స్వయముగా విష్ణుగాని దేవతలుగాని చెయ్యజాలరు॥ ౧౨॥

శ్లో॥ ఆహుస్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా।
అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషి మే॥ ౧౩

## —◆ భాష్యమ్ ◆—

నను కే తర్వ్యాహు రిత్యాహ।— ఋషయఇతి॥ ఏవం సతి త్వా మేవ పరం పదరూపం తత్వజ్ఞాన నిష్ఠా ఋషయో నారదాదయశ్చేత్యాది సర్వే వినా శివ ప్రసాదం హి భ్రాన్తిః క్వాపినసశ్యతీ త్యాదినా స్వయంచాపి నారదం ప్రత్యుక్తవాం స్తథా మే మహ్య మపి బ్రవీషీ త్యధిక మన్యత్ర విస్తరః॥ ౧౩॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

స్వయంచాపీతి॥ నరో నారాయణ శ్చైవ కృతాధమని సంతతా, జ్ఞాపయస్స్వాత్మనో మూలం పూజయా వో మహేశ్వరమిత్యాదిస్వయం చాపి నారదం ప్రత్యుక్తవా నిత్యాశయః॥ ౧౩॥

—◆ ఆం ధ్ర తా త్ప ర్య ము ◆—

ఓయీ! యెవరు చెప్పిరంటె చెప్పుచున్నాడు. నిన్నే పరమ పద రూపముగా తత్త్వజ్ఞాన నిష్ఠులైన ఋషులున్ను నారదాదులైన దేవఋషులు శివప్రసాదము లేక భ్రాంతి యెవరికిని నశించ దనిరి॥ శ్లో॥ శివప్రసాదేన హి భుక్తి రుత్తమా శివప్రసేదేన హిముక్తి రుత్తమా శివప్రసాదేన వినా నభుక్తయ శ్శివ ప్రసాదేన వినానముక్తయః॥ శివప్రసాదముచేతనే భుక్తి ముక్తులు గలుగును. గాని శివప్రసాదము లేక భుక్తియు ముక్తియు గలుగ నేరదని సిద్ధాంతము॥ నీవును నారదునకును అట్లె ఉపదేశించితివి. నా కొరకును అపరికారమె పలికితివి॥ ౧౩

శ్లో॥ సర్వ మేత దృతం మన్యే యన్మాం వదసి కేశవ
నహి తే భగవన్! వ్యక్తిం విదు ర్దేవా న దానవాః॥ ౧౪

—◆ భా ష్య మ్ ◆—

అథచ సర్వ మేత దంగీకుర్వ న్నాహ । సర్వమితి॥ ఏవం సతి సర్వ మేత దృషిభి స్త్వయాచ యదుక్తం యచ్చ మాం వదసి హే కేశవ! తత్సర్వ మృతం సత్య మేవాహం మన్యే యత ఏతాదృశీం పరంపదాఖ్యాం చిదంబర రూపాం వ్యక్తిం దేవా దానవా ఋషయశ్చ బహుశో నవిదు రిత్యర్థః॥

## —◆ లఘుటిప్పణీ ◆—

చిదంబరరూపామితి॥పదంయత్పరమంవిష్ణోస్తదేవాఖిలదేహినామిత్య శ్రిసాంబశివోక్త్యా చిదంబరశక్తేరపి దర్శనాదితిభావః॥౧౪॥

## —◆ ఆంధ్రితాత్పర్యము ◆—

దీనినంతను అంగీకరించుచు చెప్పుచున్నాడు॥ ఓ కేశవా! ఋషులు చెప్పిన దంతయు నీవు చెప్పినదంతయు నీవునాకు చెప్పినదిన్ని సత్యమే। పరంపద మనే పేరుగలిగి నట్టిన్ని చిదంబర స్వరూపమైన ఇటువంటి వ్యక్తిని (సాంబశివుని) దేవతలు దానవులు ఋషులు చాలామందియెరుగరు (విష్ణుకంటె నుత్కృష్టమైన పదము అఖిల దేహులకు ముక్తిస్థానమైన సాంబశివుడనిన్ని ఆతనె చిదంబర శక్తియనిన్ని ప్రమాణమై యున్నది. శృ॥ దేవాహవై స్వర్గం లోక మగమం స్తే దేవా రుద్రమపృచ్ఛన్ కోభవా నితి సోబ్రవీ దహమేకః ప్రథమ మాసం వర్తామిచ భవిష్యామిచ నాన్యః కశ్చన మత్తో వ్యతిరిక్త ఇత్యాద్యథర్వ శిర ఉపనిషత్తు ప్రకారము దేవత లందరును కైలాసమునకు వెళ్ళి రుద్రుని నీవెవ్వరవని యడుగగా మొదట నేనొక్కడనే ఉంటిని. నేనే ఇదంతయు సృష్టించితిని నాకంటె వ్యతిరిక్త పదార్థము లేదని చెప్పెను. ౧౪

శ్లో॥ స్వయ మేవా త్మనా త్మానం వేత్థత్వం పురుషోత్తమ।
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే॥ ౧౫

## —◆ భాష్యమ్ ◆—

నస్వహామపి పదం యత్పరమం విష్ణో రిత్యాదినోదీరితం స్వం పరంపదం నవేద్మీతి చేన్నేత్యాహ—స్వయమితి॥ ఏవం తర్హి స్వయం త్వాత్మనా త్మానం సదాశివం హే పురు

షోత్తమ । వేత్థ జానాసీ త్యర్థః । యతో భూతానాం ప్రాణి నాం భావనో హిరణ్యగర్భాది రూపేణోత్పాదకో భూతేశో దేవదేవశ్చ హే జగత్పతే త్వమేవే త్యర్థః॥ ౧౫॥

—♦ లఘుటిప్పణీ ♦—

స్వయమాత్మనేతి॥ తదేత త్కూర్మే ప్యుక్తం । 'వత్స జానే తవా నంతాం నిశ్చలాం సర్వదా చ్యుత, పశ్యాత్వ మాత్మనా త్మాన మమలం పరమంపద' మిత్యాదినా తపశ్చరంతిం కృష్ణం ప్రతి గౌరీ వచనా దవ ధార్యమ్॥ ౧౫॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఓయీ! నేనున్నా నా పరమపదమును యెరుగ నంటి వట్టాయెనా అట్లుగాదని చెప్పుచున్నాడు. ఓ పురుషోత్తమ స్వయముగా ఆత్మచేత ఆత్మయైన సదాశివుని తెలుసుకొంటివి. శ్రు॥ యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ॥ ఆత్మను ఆత్మ యే తెలియవలెను గాని జడమైన ఇంద్రియములు, ఘటాదులు దీపమును ప్రకాశింప జేయజాల నట్లు ఆత్మ యైన సదాశివుని ప్రకాశింప జాలవు. నీవు హిరణ్యగర్భాది భూతములను పుట్టించినావు గనుక భూతనాథుడవు దేవదేవుడవు జగత్పతివి నీవే. (విష్ణు తపము చేయుచుండగా పార్వతి ప్రత్యక్షమై ఓ వత్సా నీయొక్క అనంత మైన నిశ్చలమైన భక్తిని తెలుసు కుంటిని. నీయొక్క పరమ పదమైన ఆత్మను ఆత్మచేతనె చూచుకొనుమని, వరమిచ్చినట్లు కూర్మ పురాణమందు శ్రీకృష్ణుని గూర్చి గౌరీవచన మని తెలియవలెను॥ ౧౫॥

శ్లో॥ వక్తు మర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మ విభూతయః॥
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి॥

—◆ భాష్యమ్ ◆—

నను శంభోః ప్రసాదా త్సర్వం వేత్సిచే త్తదా తావ ద్యచ్ఛ కించ జగత్సర్వ్త్రే త్యాది శ్రుతివేద్యాం స్వాం విభూతిం బ్రవీషీ త్యాహ— వక్తు మర్హ౽సీతి॥ తథాచ యాభి ర్విభూతిభి రిమాంల్లోకా న్వ్యాప్య త్వం తిష్ఠసి తా స్తవా సాధారణా విభూతయః సర్వజ్ఞ రితరై ర్జ్ఞాతు మశక్యా యతోఽతః సర్వా అశేషేణ వక్తు మర్హ౽సీ త్యర్థః॥౧౬॥

—◆ లఘుటిప్పణీ. ◆—

శంభోఃప్రసాదాదితి॥ తదిద మాదౌ శివేన విశ్వరూప దర్శే కృతే కృష్ణేనైవ ద్రోణపర్వణ్యు క్తం తద్యథా, దృష్ట్వా చైనం వాఙ్మనో బుద్ధి దేహై స్సంహృష్టాత్మా ముముదే దేవదేవః। ధన్యోఽస్మీతి వ్యాహరన్ దేవవర్యో యత్తేఽదృశ్యం దృష్టవా న్విశ్వరూపం' ఇత్యాది ద్రష్ట వ్యమ్॥ ౧౬॥

—◆ ఆంధ్ర తాత్పర్యము ◆—

శ్రుతి॥ అహమేక స్సర్వ్వ చ మామేవ మాం యోవేద ససర్వాన్ దేవాన్వేదే త్యథర్వశిరో పనిషత్తురీత్యా ఓయీ! ఈశ్వరానుగ్రహం వలన సర్వమును తెలుసుకుంటి వట్లాయెనా, కనుపించె వినుపించెడి సర్వం జగద్రూపమైన స్వకీయమైన విభూతిని చెప్పగలనని చెప్పు చున్నాడు నీవు యే విభూతులచే ఈలోకములను వ్యాపించి ఉంటున్నావో ఇతరు లైన సర్వజ్ఞుల చేతనున్నూ తెలియస్యాశక్యముగాని అసాధారణమైన నీయొక్క ఆవిభూతుల నన్నిటిని చెప్పుటను తగుచున్నావు। (శివునిచే కృష్ణుని కొరకు విశ్వరూపమును జూపించి నప్పుడు వాక్కు మనసు బుద్ధి

దేహములచె సంతోషించి హేశంకర చూడశక్యముని విశ్వరూపమును జూచి ధన్యుడనైతినని స్తుతించి నట్లు భారతమందలి ద్రోణపర్వమున జూడవలయును॥ ౧౬॥

శ్లో॥ కథం విద్యా మహం యోగిం స్త్వాం సదా పరిచి న్తయన్।
కేషు కేషుచ భావేషు చింత్యోసి భగవన్! మయా॥ ౧౭॥

—♦ భాష్యమ్ ♦—

నను తత్కథనస్య కిం ప్రయోజన మిత్యాహ—కథ మితి॥ తత్రైవం సతి హే యోగిన్ । నిరతిశయైశ్వర్యాది శక్తిమా నహ మతిస్థూల మతి స్త్వాం దేవాదిభి రపి జ్ఞాతు మశక్యం కథం విద్యాం జానీయాం సదా త్వాం గురుత్వేన పరిచింతయ న్నిత్యర్థః॥ తత్ర కేషు కేషుచ భావేషు చేతనా చేతనాత్మకేషు వస్తుషు త్వద్విభూతి రూపేషు మయా చింత్యోసి హేభగవన్! సదాశివ రూప ఇత్యర్థః॥౧౭॥

—♦ లఘు టిప్పణీ ♦—

శివరూపఇతి తద్యదా 'నశివం శివ అథత్తె తస్మా చ్ఛంభుశ్శివ స్మృత' ఇత్యత శ్శివ రూపేణైవా నధారయే దితిభావః॥౧౭

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

ఓయీ! ఆవిభూతిని చెప్పుటకు ప్రయోజన మేమంటె చెప్పుచు న్నాడు. హే యోగిన్ నేను గొప్ప ఐశ్వర్యము మొదలయ్యిన శక్తులు గల వాడను మిక్కిలి స్థూలబుద్ధి గలవాడను. దేవాదుల చేతనున్నూ తెలియ శక్యము గాని నిన్నును జ్ఞానమును యెట్లు తెలియుగలను! నిన్ను గురువుగా చింతన జేయుగలను. ఓసదాశివరూప చేతనా చెతనాత్మకములైె నీవిభూతి

రూపములైన యే యే వస్తువుల యందు నిన్ను నేను చింతన చేయగలను (శివునికంటె యెక్కువ మంగళము లేదు గాన శివుడె మంగళ మని చెప్పబడినందుకు శివరూపముచేతనె ధారణ చెయ్యవలెను.॥౧౭॥

శ్లో॥ విస్తరేణాత్మనో యోగం విభూతించ జనార్దన।
భూయః కథయ తృప్తిర్హి శ్రుణ్వతో నాస్తి మేఽమృతమ్॥

—◆ భాష్యమ్ ◆—

అథ సప్తమే నవమేచ సంక్షేపేణోక్తమపి విస్తరేణ పునశ్శ్రోతు మిచ్ఛాభిమా త్యాహ । విస్తరేణేతి॥ ఏవంసతి, హే జనార్దన! విస్తరేణాత్మన స్సదాశివస్యోపదేశాత్స్వయం కృతాం విభూతించ భూయః కథయే త్యర్థః । యతో మే త్వద్వాక్యామృతం శృణ్వత స్తృప్తి ర్నాస్తీ త్యర్థః ॥౧౮॥

—◆ ఆంధ్రితాత్పర్యము ◆—

యేడు తొమ్మిది అధ్యాయములయందు సంక్షేపముగా చెప్పినప్పటికి పునః దానినె విస్తరించి వినగోరుచున్నానని చెప్పుచున్నాడు. ఓ జనార్దనా! ఆత్మయైనసదాశివుని యుపదేశము వలన స్వయముగాచేసిన విభూతి నిన్ని తిరిగి చెప్పవలెను. అమృతముతో సమానమైన నీపలుకుల నాలకించు నాకు తృప్తి యుండదు సుమా॥౧౮॥

శ్రీకృష్ణఉవాచః—

శ్లో॥ హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మ విభూతయః।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ! నాస్త్యంతో విస్తరస్య మే॥ ౧౯

—◆ భాష్యమ్ ◆—

అత్రోత్తరమపి తస్య వక్తు మాహ-హంతేతి॥ తత్ర తావత్ హే కురుశ్రేష్ఠ! యద్యపి నాస్త్యంతో విస్తరస్య మే

తథాపి యా దివ్యా హ్యాత్మన శ్శివస్య విభూతయ స్తాః ప్రాధా న్యత స్తే కథయిష్యామి హంత తే మావ్యాకులో భూ రిత్యర్థః॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

కథయిష్యమీతి॥ తదిహ యద్ద్రోణపర్వణి శివేన విశ్వదర్శే కృతో దృష్టా యా విభూతి స్తాం కియంతం కథయిష్యామీ త్యర్థః॥ శివస్యేతి॥ "శివస్యార్థం స్థితా గౌరీ తదర్థో హరి రిష్యతే" ఇత్యాది స్మృతి న్యాయేన శివస్య విభూతయ ఇత్యర్థః ౧౯॥

—◆ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ◆—

శ్రీకృష్ణుం డిట్లనియె॥ ఈశ్లోకమందు అర్జునునికి ఉత్తరమును చెప్పే కొరకు పలుకుచున్నాడు. ఓ కురుశ్రేష్ఠ! విస్తరించి చెప్పుటకు అంతము లేదు. ఆత్మయైన శివునియొక్క యే దివ్యమైన విభూతులు గలవో వాటిని ప్రధానముగా చెప్పుచున్నాను. నీవు వ్యాకులము లేకపోవుగాక. (ద్రోణ పర్వమందు శివుడు విశ్వరూపమును జూపించి నప్పుడు యే విభూతిని జూచితనో దానిలో కొంచెము చెప్పుచున్నానని యర్థము. శివుని సగము శరీరము గౌరి యనియు అందులో సగము హరియనియు చెప్పబడిన స్మృతి ప్రకారము శివుని వె విభూతులని యర్థము॥ ౧౯॥

శ్లో॥ అహ మాత్మా గుడాకేశ! సర్వ భూతాశయ స్థితః।
అహ మాదిశ్చ మధ్యంచ భూతానా మంతఏవచ॥౨౦॥

—◆ భా ష్య మ్ ◆—

తత్రైవంసతి సర్వాసు విభూతిషు ముఖ్యత్వేనాహ— అహమితి॥తథాచసర్వభూతానా మాశయేహృద్దేశే సమష్టివ్యష్టి రూపేణ ద్వా సుపర్ణే త్యాది శ్రుతి వేద్యత్వేన చ స్థితఇత్యర్థః

ఏవం సర్వజగతా మాదిసృష్టి ప్రవర్తకత్వేన తథా మధ్యంతు స్థితి ప్రవర్తకత్వేనైవ మంతశ్చ నాశప్రవర్తకత్వేనే త్యర్థః॥ ౨౦

—◆ లఘుటిప్పణీ ◆—

సృష్టి ప్రవర్తక త్వేనేతి॥ గుణత్రయేణ భిద్యంతే బ్రహ్మ విష్ణ్వాదయ స్సమే। వస్తుత స్త్వేక మద్వైతం శివ మిత్యాహ హి శ్రుతి రితి కూర్మస్మృత్యంతరాతిది భావః॥ ౨౦॥

—◆ ఆంధ్రతాత్పర్యము. ◆—

అన్ని విభూతులలో ముఖ్యమైన వాటిని జెప్పుచున్నాడు. సర్వభూతములయొక్క హృదయ ప్రదేశమందు సమష్టి వ్యష్టి రూపముతో జీవేశ్వర నామముతో ఈశ్వరుడున్నాడు. అతను సర్వజగత్తులకు సృష్టి ప్రవర్తకుడును స్థితి ప్రవర్తకుడును, నాశప్రవర్తకుడునై యున్నాడు (గుణత్రియముచె బ్రహ్మవిష్ణు మహేశ్వరులు భేదించుచున్నారు గాని యథార్థముగా అద్వైతమైన ఒక్క శివుడె గలడని శ్రుతి కూర్మస్మృతిన్ని చెప్పుచున్నది॥ ౨౦॥

శ్లో॥ ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్।
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ॥ ౨౧

—◆ భాష్యమ్ ◆—

నను కథంతే సృష్టి ప్రవర్తకత్వ మిత్యాహ—ఆదిత్యానామితి॥ తత్ర తావద్ద్వాదశా దిత్యానాం మధ్యే విష్ణు ర్విష్ణూనా మాదితోఽహ మేవ శివాంశ ఇత్యర్థః। ఏవం జ్యోతిషాం మధ్యేఽంశుమా న్రవి రహమేవే త్యర్థః। ఏవం

మరుతాం మధ్యే మరీచినామా హమేవ తథా నక్షత్రాణా మధిపః శశిశ్చా హమేవే త్యర్థః॥౨౧॥

—◆ లఘుటిప్పణీ. ◆—

అహమేవ శివాంశ ఇతి।తత్రి తావజ్జగద్యోని ర్నారాయణ స్తద్యోని శ్చిద్గౌరీతామధి తిష్ఠతీత్యర్థా భిప్రాయేణ యో యోనిమధితిష్ఠత్యేకో యస్మి న్నిదం సంచ విచేతి సర్వ మితిశ్రుతే రితి భావః॥ ౨౧॥

—◆ ఆన్ధ్రితాత్పర్యము ◆—

నీవు సృష్టిచేయుట యెట్లంటెచెప్పుచున్నాడు. ద్వాదశాదిత్యులలో విష్ణువు, విష్ణువుల లో ఆదిత్యుడునూ, నేనె. శివాంశగలవాడను. పరికాశ వంతముల మధ్యయందు కిరణములు గలరవి నేనె శివాంశ గలవాడనూ దేవతల మధ్యయందు మరిచి నేనే. శివాంశ గలవాడను నక్షత్రముల మధ్య చంద్రుడు నేనె. శివాంశుడను (జగద్యోని నారాయణుడు అతనికి యోని చిద్రూపమైన గౌరి. ఆగౌరి నధిష్టించినవాడు శివుడు. నీవు శివాంశ గనుక సృష్టి నీకు నూ గలదు॥౨౧

శ్లో॥ వేదానాం సామవేదోస్మి దేవానా మస్మి వాసవః॥
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానా మస్మి చేతనా॥ ౨౨

—◆ భాష్యమ్ ◆—

అథ వేదచతుష్టయె సామవేదస్య శివదైవతత్వేన గరిష్టత్వా దాహ।— వేదానామితి॥ అతఏవ రణమన్మహతీం వీణాం సప్తస్వర విరాజితాం గాయ న్స్వగృహ్యద్రథం సామ శివ ధ్యానానుమోదిత ఇత్యపి ద్వారకాయాం నారదాభ్యాగమే దర్శితం। ఏవం సర్వదేవానా మధిపో వాసవ ఇంద్ర స్తథేంద్రి

యాణా మేకా దశానాం ప్రవర్తకం మనో భూతానాం బుద్ధేః ప్రవర్తకత్వేన చేతనా చైతన్యమప్యహ మేవేత్యర్థః॥ ౨౨

—◆ లఘుటిప్పణీ ◆—

సప్తస్వరేః॥ తదేశముక్తం॥ నిషాద ఋషభ గాంధార షడ్జ మధ్యమ ధైవతాః । పంచమశ్చే త్యమీ సప్త తంత్రీ కంఠోత్థితా స్స్వరాః । సప్త స్వరా స్త్రయో గ్రామా మూర్ఛనా స్త్వేకవింశతిః । ద్వా వింశతిస్తు శ్రుతయ స్తానాః పంచాశదూనకా ఇత్యాది గాంధర్వ విద్యా ప్రబంధే ద్రష్టవ్యమ్॥ ౧౨॥

—◆ ఆంధ్రితాత్పర్యము ◆—

వేదములలో సామవేదము శివదేవతాక మయినందున గొప్పది యని చెప్పుచున్నాడు । కృష్ణుడు ద్వారకలో నుండగా నారదుడు సప్తస్వరములతో గూడి గొప్పది యగు వీణెను వాయించుచు బృహద్రథంతర సామను గానము చేయుచు శివధ్యానముచె సంతుష్టుడైనట్లు భారతమందున్నది, గనుక సామవేదము నేను । దేవతలలో నింద్రుడు, ఏకాదశేంద్రియములలో మనస్సు భూతములలో బుద్ధిని ప్రవర్తింపజేయు చేతనయును, నేనె. శివాంశ గల వాడను।(నిషాదము. ఋషభము గాంధారము షడ్జమము. మధ్యమము ధైవతము । పంచమము।ఈయేడును తంత్రుల వలనగాని కంఠము వలన గాని పుట్టు స్వరములు. మూడుగ్రామములు యిరువదియొక మూర్ఛనలు యిరువదిరెండు శృతులు నలభైతొమ్మిది తానములు ఇత్యాది గాంధర్వ శాస్త్రమందు జూడదగును॥ ౨౨॥

శ్లో॥ రుద్రాణాం శంకర శ్చాస్మి విత్తేశో యక్ష రక్షసాం ।
వసూనాం పావక శ్చాస్మి మేరు శ్శిఖరిణా మహమ్। ౨౩

—♦ భా ష్య మ్ ♦—

ఏవమేకాదశ రుద్రాణా మపి గరిష్ఠత్వేన జగతాం శంకరః కళ్యాణకర్తా హమేవే త్యాహ॥ రుద్రాణా మితి॥ తదుక్తం స్కాందే 'నిశ్చలాభిః కథం కింస్యా త్ప్రజాభి శ్చేతి చింతయన్ బ్రహ్మారంధ్రే తత శ్శంభుః ప్రాదుర్భూత్వా బ్రవీద్వచః । ఈశ్వర ఉవాచ - మచ్ఛాయైకాదశా రుద్రా స్త్వత్సృష్టే రుపకారకాః। మనః షష్ఠేంద్రియాణాంవై చైతన్యాం తద్గమిష్యతీత్యాది బోధ్యమ్॥ ఏవం యక్షరక్షసాం మధ్యే విత్తేశో ధనాధ్యక్షః కుబేరః తథా ష్ట విధానాం వసూనాం మధ్యే వాసవో వైశ్వానర స్తథాత్యుచ్ఛ్రితత్వాచ శిఖరిణాం మేరు రహమేవే త్యర్థః॥౨౩॥

—♦ ల ఘు టి ప్ప ణీ . ♦—

బ్రహ్మరంధ్రఇతి॥ తద్యథా, బ్రహ్మరంధ్రే శివం ధ్యాయే ద్బ్రహ్మాణంతుహృదిస్థితం । నాభౌ విష్ణుం సమారాధ్య ప్రజపే త్పరదేవతా మిత్యాదిసంధ్యాదా విశేషతో విహిత మిత్యవధేయమ్॥ ౨౩॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఏకాదశ రుద్రులలో గొప్పవాడగు నట్టిన్ని జగత్తులకు సుఖము గలుగ చేయునట్టి శంకరుడు నేనే యని చెప్పుచున్నాడు. చలనము లేని యీ ప్రజల చే యే మగునని విచారించుచు బ్రహ్మరంధ్రమందు శంకరుడు సాక్షాత్కరించి వాక్యమును పలికెను. ఈశ్వరుడు చెప్పుచున్నాడు. నా యొక్క ఛాయ ఏకాదశ రుద్రులై నీ సృష్టికి ఉపకారము గాగలరు మనసుతో గూడ నారు ఇంద్రియములకు చైతన్యముగా గలరు. శ్లో॥ రుద్రు

స్త్వాత్మా శరీరిణాం॥ శరీరధారులకు రుద్రుడై అత్మ ఆట్టి రుద్రుడు, యక్షరాక్షసులలో కుబేరుడు. అష్ట వసువులలో అగ్నిహోత్రుడు, మిక్కిలి ఉన్నతమైన ఏగుట వలన పర్వతములలో మేరువు. నేనే. శివాంశము బ్రహ్మరంధ్రమందు శివునిన్ని హృదయమందు బ్రహ్మనున్నూ, నాభి యందు విష్ణుని ధ్యానించి పరదేవతను జపించ వలయునని, సంధ్యాదుల యందు విశేషముగా చెప్పబడి యున్నది॥ ౨౩॥

శ్లో॥ పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ! బృహస్పతిమ్।
సేనానీనా మహం స్కంద స్సరసా మస్మిసాగరః॥ ౨౪

## —◆ భాష్యమ్ ◆—

ఏవం రాజ్ఞాం పౌరోహిత్య స్యో త్కృష్టత్వా దాహ పురోధసామితి॥ తథాచ హేపార్థ! పురోధసాం రాజపురోహితానాం మధ్యేముఖ్యం మాం బృహస్పతిం విద్ధీ త్యర్థః । ఏవం సేనానీనాం దేవసైన్యానా మధిపః స్కందః కార్తికేయోఽహమేవ తథా సరసాం జలాశయానా మధిప స్సాగరశ్చాహమేవే త్యర్థః॥ ౨౪॥

## —◆ లఘుటిప్పణీ ◆—

ఉత్కృష్టత్వాదితి । తద్యథా । పితా భ్రాతా చ మాతాచైత్వన్నదాతా పురోహితః । మంత్రి, విద్యా, ప్రదః కన్యా ప్రద శ్చేత్యష్టధా గురుః । ఉపమన్యుస్తు కృష్ణస్య గర్గ స్త్వా స్తి పురోహితః । పాండవానేజనైర్గహం సించనీయం తయోః ఖలు । దేవానాం యో గురుః ప్రోక్త స్తస్యాపి గురు రీశ్వరః సదాశివో నచాన్యోహి గురు శ్శాస్తా పరాత్పర ఇత్యాది పాద్మోక్త్యా ఉత్కృష్టత్వాదిక మవధార్యమ్॥

—◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ◆—

రాజపౌరోహిత్యము గొప్పది యని చెప్పు చున్నాడు. ఓ పార్థ! రాజ పురోహితులలో ముఖ్యమైన బృహస్పతిని నన్నుగా తెలియుము. దేవసైన్యములకు అధిపుడైన కార్తికేయుడు నేను, నదుల కధిపతి యగు సాగరము నేను. తండ్రి, తల్లి, జ్యేష్ఠసోదరుడు, అన్నదాత పురోహితుడు మంత్రోపదేశకుడు, విద్య చెప్పినవాడు, కన్య నిచ్చినవాడు, యీ యెన మండుగ్గురు గురువులు. ఉపమన్యువు కృష్ణునకు గురువు. గర్గమహర్షి పురోహితుడు. కృష్ణుడు, యీ ఇద్దరియొక్క పాదోదకములచే గృహమును తడుప వలయును గదా! దేవతలందరికి యే బృహస్పతి గురువో ఆట్టి బృహస్పతికి ఈశ్వరుడు గురువు. గురువు, శిక్షకుడు, పరాత్పరుడు, సదా శివుడే కాని యితరులెవ్వరు కారని పద్మపురాణమందు గలదు॥ ౨౪॥

శ్లో॥ మహర్షీణాం భృగు రహం గిరా మస్మ్యేక మక్షరం।
యజ్ఞానాం జపయజ్ఞోస్మి స్థావరాణాం హిమాలయః॥ ౨౫

—◆ భా ష్య మ్ ◆—

ఏవం సప్తసు సర్వోత్కృష్టత్వా దేవాహ।—మహర్షీణామితి। తథా చేహ సప్తర్షీణాం మధ్యే సర్వోత్కృష్టత్వాత్ భృగుస్తథా గిరాం పదలక్షణానాం మధ్యే చోంకారస్త్వద్వాచ్య శ్శివ శ్శక్తి శ్చేత్యోం కారస్య మహేశ్వర బీజత్వం గాయత్ర్యర్థత్వంచ స్కాందే ప్యుక్తం తద్యథా, 'శివో బ్రహ్మ శివా శక్తి శ్చంద్ర చంద్రికయో రివ। లాక్షణం తద్ధరి స్తత్ర వాచ్య వాచకయో ర్భిదే త్యాదినా శక్త్యాఖ్యే ప్రణవేతు స్త్రీత్వే టాచితి విశేషః। ఏవ మశుచిర్వా శుచిర్వాపి

గచ్ఛం స్తిష్ఠం స్స్వపన్నపి మంత్రైక సరణో భూత్వా మనసైవ సమభ్యసే దిత్యాది స్మృత్యా సకల యజ్ఞానాం మధ్యే జపయజ్ఞో ప్యహ మేవే త్యర్థః॥ ఏవం స్థావరాణాం స్థితిమతాం మధ్యే హిమాలయో ప్యహ మేవేతి పూర్వత్ర శిఖరవతాం మధ్యే మేరు రహ మేవే త్యుక్త మితి స్థావరత్వేన శిఖరవత్వేన చార్థభేదాన్న పౌనరుక్త్య మితి వివేకః॥౨౫॥

—◊ లఘుటిప్పణీ ◊—

విశేషఇతి॥ తద్యథా స్కాందే ప్యుక్తం 'తదీయః ప్రణవో దేవిమదీయః ప్రణవస్తథా స్త్రీత్వే టాప్ త్వదీయేతు మదీయేతన్న చేష్యతే' ఇత్యాది పార్వతీం ప్రతి సదాశివోక్తితోపి బోధ్యమ్॥౨౫॥

—◊ ఆంధ్రతాత్పర్యము ◊—

సప్త ఋషులలో ఉత్కృష్టత్వమును చెప్పుచున్నాడు. సప్త మహరుషులలో సర్వోత్కృష్టుడగు భృగువు నేను. పద లక్షణములలో ఓంకారము ఓంకారవాచ్యుడైన శివుడు శక్తిస్సి ఓంకారము మహేశ్వర బీజ మగుటయు గాయత్ర్యర్థ మగుటయునున్నా స్కాందమందు ప్రతిపాదింప బడినది॥ శివుడు బ్రహ్మము పార్వతిశక్తియు చంద్ర చంద్రికలవలె అవి నాభావము గా నుండిరి. వాచ్య వాచకముల భేదముతో లక్షణమె హరియని చెప్పబడెను. ఇట్టి ఓంకార మంత్రమును నడచుచు గాని కూర్చునిగాని పరుండిగాని సర్వదా మనసుచే మననము చేయుచుండ వలయును. శుచి అశుచి విచారించ నక్కర లేదనునట్టి స్మృతిచే సకలయజ్ఞములలో జప యజ్ఞము నేను. స్థావరములలో హిమాలయము నేను. శిఖరము గలవాటిలో మేరువు నేను. హిమాలయము మేరువు రెండును పర్వతములేయయినను హిమాలయము స్థావరమనియు, మేరువు శిఖరముగలదియనే భేదముండుటను బట్టి పునరుక్తి లేదు॥౨౫॥

శ్లో॥ అశ్వత్థ స్సర్వ వృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।
గంధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః॥ ౨౬

—♦ భా ష్య మ్ ♦—

ఏవం సర్వవృక్షాణాం వనస్పతీనాం మధ్యే ప్యహ మేవే త్యాహ—అశ్వత్థ ఇతి॥ ఏవమిహ 'దరిద్రాతాపత స్త్రస్తో స్వస్థో ప్యశ్వత్థతాం గతః । పశ్చా చ్ఛివాజ్ఞయా దేవై స్తృప్తో యాతో గరిష్ఠతా' మిత్యాది స్కాందవచనై రార్షత్వా త్పర సవర్ణ త్వాదినా సాధుత్వ మవధార్యమ్।ఏవం దేవర్షీణాం నారద స్యాపి తత్త్వం సామగత్వే నోదీరితం । తథా గంధర్వాణాం సామాన్యతో గాన ధర్మవతాం చిత్రరథో ప్యహ మస్మి ఏవం జన్మనైవ ధర్మ జ్ఞాన వైరాగ్యై శ్వర్యా తిశయ ప్రాప్తానాం సిద్ధానాం కపిలో ముని రహ మేవే త్యర్థః॥౨౬॥

—♦ ల ఘు టి ప్ప ణీ. ♦—

పరస వర్ణత్వాదినేతి॥ ఏవ మిహార్ష త్వా దేవ స్వశబ్ద ఘటకస్య దంతీ యస్య తాలవ్యత్వ మప్యార్ష త్వా దేవ బోధ్యమ్॥౨౬॥

—♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము . ♦—

సర్వ వృక్షముల మధ్యను నేనే అని చెప్పుచున్నాడు॥ దరిద్రతా పము వలన తపించి ఆస్వస్థుడై తర్వాత శివాజ్ఞ చేతను దేవతల చేతను తృప్తుడై గొప్పతనమును బొందెను (అశ్వద్ధ మాయను) అదియు నేను దేవఋషులలో నారదుడు సామగానముచేయువాడు నేను. గంధర్వులలో సామాన్య గాన ధర్మముగలవారిలో చిత్రరథుడు నేను. ధర్మజ్ఞానవైరాగ్య, ఐశ్వర్యాతి శయములను పొందిన సిద్ధుల లోకపిలముని నేను ॥౨౬॥

శ్లో॥ ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్
ఐరావతం గజేంద్రాణాం నరాణాంచ నరాధిపమ్॥ ౨౭

—◆ భాష్యమ్. ◆—

ఏవ మపర రూపేణాప్యుత్కృష్టంమాం విద్ధీ త్యాహ- ఉచ్చైరితి॥ తత్రైవం సత్యశ్వానాం మధ్యే త్వమృతోద్భవ మశ్వం తథా గజేంద్రాణా మమృతోద్భవం గజేంద్రం, నరాణాంచ మధ్యే నరాధిపం। మామేవ విద్ధీతి సర్వత్రా న్వయః.

—◆ లఘుటిప్పణీ ◆—

నరాధిపమితి॥ ఇహాత్రో ప్యాధిక్యేన స్కాందే దర్శితం। 'రాజాధి రాజ స్సర్వేషాం త్ర్యంబకః త్రిపురాంతకః। తస్యైవా నుచరా స్సర్వే బ్రహ్మ విష్ణు సురాదయ' ఇత్యాది ద్రష్టవ్యమ్॥ ౨౭॥

—◆ ఆంధ్రతాత్పర్యము ◆—

యీ ప్రకారము మరియొకరూపముచేత నున్నా నన్నె ఉత్కృష్టునిగా తెలుసు కొను మని చెప్పుచున్నాడు. గుఱ్ఱములలో అమృతములో పుట్టిన ఉచ్చైశ్శ్రవము నేను. ఏనుగులలో అమృతములో పుట్టిన ఐరావతము నేను. నరులలో నరపతిని నేను గా తెలుసుకొనుము. (అందరికి రాజయిన వాడు త్రిపుర సంహారి యైన త్రినేత్రుడే. అట్టి రాజునకు బ్రహ్మ, విష్ణు దేవతలు అనుచరులని స్కాందమున గలదు॥ ౨౭॥

శ్లో॥ ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్ ।
ప్రజన శ్చాస్మి కందర్ప స్సర్పాణా మస్మి వాసుకిః॥ ౨౮

—◆ భా ష్య మ్ ◆—

తథా యుధానా మప్యహ మేవేత్యాహ—ఆయుధానా మితి॥ తథా చాయుధానాం దధీచే రస్థి సంభవం వజ్రాఖ్య మస్త్ర మహమేవే త్యర్థః। ఏవమేవ ధేనూనాం కామ ప్రదానాం మధ్యే కామధుక్ప్రజనయితౄణాం మధ్యే కంద ర్పః। సర్పాణాంచ రాజ వాసుకిశ్చా హమేవే త్యర్థః॥ ౨౮॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

కందర్పఇతి॥ ఏవమిహా ప్యాధిక్యం శివస్య కాశీఖండే ప్యుక్తం యత్కందర్పో విందమాన స్సమానం దేహై ర స్యై ర్మర్మజాత స్వయంహీ త్యాదినా వ్యాస భుజస్తంభోక్త్యా వధార్యం॥ ౨౮

—◆ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ◆—

ఆయుధములలో నున్న నేనే అని చెప్పుచున్నాడు. ఆయుధములలో దధీచి మహాముని యొక్క యెముక వలన తయారు చేయబడిన వజ్రము నేను. కోరికెల నిచ్చే గోవులలో కామధేనువు నేను. ఉత్పత్తి కాములలో కందర్పుడ నేను. సర్పములకు రాజైన వాసుకి నేను॥ ౨౮॥

శ్లో॥ అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్।
పితౄణా మర్యమా చాస్మి యమ స్సంయమతా మహమ్।

—◆ భా ష్య మ్ ◆—

ఏవం తత్ర జాతి ప్రభిన్న మాశ్రిత్యా ప్యాహ—అనంత శ్చేతి॥తథాచనాగానాంమధ్యే శేషాఖ్యోఽహమేవయేవంయాద సానాం జలవతాం వరుణః పితౄణాం త్వర్యమా ధర్మా ధర్మ నియంతౄణాంచ మధ్యే యమశ్చా హమేవే త్యర్థః॥౨౯॥

## —◆ లఘుటిప్పణీ. ◆—

యమశ్చేతి॥ యత్రైవం ప్రబలోపి యమ శ్శైవం పాశుపతం బిభే తీత్యప్యుక్తమ్। యేభస్మధారణం త్యక్త్వా సంధ్యాం కుర్వంతి మానవా స్తానానయంతు నరకేష్వితి ఘోరేషు యత్నత ఇత్యాది స్కాందఏవ ద్రష్టవ్యమ్॥ ౨౯॥

## —◆ ఆంధ్రితాత్పర్యము. ◆—

జాతిభేదమును పొందిన్ని చెప్పుచున్నాడు. నాగులలో శేషనాగము నేనే శివాంశము జలము గలవాటిలో వరుణుడు నేనే. పితృ దేవతలలో అర్యముడు నేనే. ధర్మాధర్మములను వివేచన చేసే వాళ్ళలో యముడు నేనే. యముడు ప్రబలుడై నప్పటికి పాశుపత వ్రతము గల శైవుని జూచి భియపడునని స్మృతిగలదు. యముని శాసనమున్ను ఇట్లున్నది. యెవరు భస్మధారణ చేయక సంధ్యావందన మాచరింతురో ఆమానవులను తీసుకు వచ్చి ఘోర నరకముల యందు పడవేయుడని చెప్పిన వచనములు స్కాందమందు జూడతగినవి॥ ౨౯॥

శ్లో॥ ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్।
మృగాణాంచ మృగేంద్రో హం వైనతేయశ్చ పక్షిణామ్॥

## —◆ భాష్యమ్ ◆—

ఏవ మపర రూపేణా ప్యాహ॥—ప్రహ్లాద శ్చేతి॥ తత్ర తావద్దైత్యానాం మధ్యే మద్భక్త్యా విజృంభితోపి పున శ్శివ నిష్ఠయా ప్రబలత్వా త్ప్రహ్లాద ఇత్యర్థః। అత ఏవ స్కాందే ప్రహ్లాదం ప్రతి నృసింహే నోక్తం, తద్యథా' 'జ్ఞానం మహే శ్వరా దిచ్ఛేత్ మోక్ష మిచ్ఛే జ్జనార్దనాత్ । ఆరోగ్యం

భాస్కరాదిచ్ఛేద్ధన మిచ్ఛే ద్ధుతాశనా ది' త్యాది ద్రష్ట
వ్యమ్॥ ౩౦॥

— లఘుటిప్పణీ —

శివనిష్టమేతి తద్యథా, 'ప్రహ్లాదేశో ధృవేశశ్చవాలమీకేశ్వరస్తథా, లక్ష్మీశో ద్రౌపదీశశ్చ రుక్మిణీశాద్య నేకశ' ఇత్యాది బ్రహ్మాండ పురాణా దప్య వగంతవ్యమ్॥ ౩౦॥

— ఆస్థ్రితాత్పర్యము —

ఈ ప్రకారము మరియొక రూపముతో చెప్పుచున్నాడు. రాక్షసులలో నాభక్తిచే ప్రసిద్ధుడై నప్పటికి పునః శివనిష్టచే ప్రబలుడగుట వలన ప్రహ్లాదునని యర్థము గనుకనె స్కాందమందు ప్రహ్లాదుని గూర్చి నృశింహునిచె జెప్పబడిన దెట్లనగా-జ్ఞానమును గూర్చి ఈశ్వరు నడుగ వలయును. జనార్దనుని వాసనాత్యాగ మడుగ వలయును. సూర్యుని యారోగ్యమడుగ వలయును అగ్నిహోత్రుని ధన మడుగ వలయును. ప్రహ్లాదేశుడు ధృవేశుడు వాలమీకేశ్వరుడు లక్ష్మీశుడు ద్రౌపదీశుడు రుక్మిణీశుడు మొదలగు ననేకములుండుట వలన వీరలు శివనిష్టులని తోచును. ఇట్లు బ్రహ్మాండపురాణమునగలదు గాన ప్రహ్లాదుడు నేనుగణనచేసే వారిలో కాలము నేను. మృగములలో సింగమును పక్షులలో వైనతేయమును నేనే॥

శ్లో॥ పవనః పవతా మస్మి రామ శ్శస్త్రభృతా మహమ్॥
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ॥ ౩౧

— భాష్యమ్. —

ఏవ మపర రూపేణా ప్యాహ—పవనఇతి॥ తథాచేహ పావయితౄణాం వేగవతాం వా మధ్యే పవనః పావయితా

వేగవానాౕహమేవాస్మీత్యర్థః । తథా తుందే ేకశరం ధృతే చ దశధా సంధాన కాలే శతం చాపేత్వాస్తి సహస్రలక్షమధికం సత్పాత్రి దానం యథే త్యాన్యుక్త స్మృత్యా రామాయ త్వజేయం శరాసనం సదాశివేనైవ దత్త మిత్యత శ్శస్త్ర భృతాం మధ్యే రామశ్చాహమేవాస్మీ త్యర్థః ఏవం ఝుషాణాం మత్స్యానాం మధ్యే మకరో రాఘవనామా మత్స్యశ్చాహమేవే త్యర్థః॥ ౩౧॥

—◆ లఘుటిప్పణీ ◆—

సత్పాత్రి దానమితి॥ అతఏవా సత్పాత్రి దాన నిషేధోపి స్కాందే దర్శితః । తద్యథా, 'యస్త్వసంధ్యో దదాతీహ స్వ ద్రివ్యం ధర్మ సాధనం । పూర్వస్మా దధికః పాపీ యత స్తత్పాప భాజన' ఇత్యాది ద్రష్టవ్యమ్॥ ౩౧॥

—◆ ఆన్ధ్రి తాత్పర్యము ◆—

మరిన్ని చెప్పుచున్నాడు. పవిత్రము జేయు నట్టి గాని వేగము గల వారిలో గాని పవనుండు (వాయువు) నేనూ సదాశివుడు రామునకు ఆజేయ ధనస్సు నిచ్చెను. అనగా, పాదిలో ది నొకే బాణము పట్టుకుంటె పది. సంధానకాల మందు నూరు ధనస్సును సంధించిన వేలు లక్షలు కంటె నధికము గా సత్పాత్రిదానము వలె నుండునను స్మృతి చెప్పబడినది. ధనుర్ధరులలో రాముడు నేను, మత్స్యముల మధ్య యందు రాఘవ నామము గల మత్స్యము నేను. సత్పాత్రి దానమని చెప్పినందున అపాత్ర దానము నిషేధమున్నా స్కాందమంటె యిట్లు గలదు. సంధ్యా వందన చేయక యెవడు స్వ ద్రివ్యమును దానమును చేయుచున్నాడో మునుపటి కంటె యెక్కువ పాపి యగుచున్నాడు. గాన యది యపాత్ర మని యెరుంగ వలయును॥ ౩౧॥

శ్లో॥ సర్గాణా మాది ర న్తశ్చ మధ్యం చైవాహ మర్జున।
అధ్యాత్మ విద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్॥

—♦ భా ష్య మ్ ♦—

ఏవమేవ యచ్చ కించ జగత్య స్రే త్యాది శ్రుత్యా సర్వం ప్రపంచ జాత మప్యహ మేవే త్యాహ—సర్గాణామితి। తత్ర తావత్సర్వస్య ప్రపంచ జాతస్యా ద్యంత మధ్య రూప త్వేన విష్ణురూపత్వే స్థితే 'యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతేచ ప్రతిష్ఠిత' ఇత్యాది శ్రుత్యాఽవినాశినః సదాశివస్య విశ్వాధిక తయా పృథగ్రూపత్వం స్ఫుటీ కృతం। ఏవ మధ్యాత్మ విద్యా రూపత్వం విష్ణో స్తద్వేద్యత్వంచ శివస్యై వేతి వేదో నారాయణః సాక్షా చ్ఛివేనే ద్ధః ప్రకాశత ఇత్యాది స్మృత్యా ప్యవధార్యమ్ ఏవం వాదో నామ ఇదం మేఽస్తి మతం నేదం పక్షయో ర్యత్ర చాగ్రహ ఇత్యాది నా సిద్ధాంత పర్యవసాయి త్వేన ప్రమాణ ప్రమేయేత్యాదా విస్తరః॥౩౨॥

—♦ల ఘు టి ప్ప ణీ . ♦—

విశ్వాధికయేతి॥ తథాచశ్రుతిః। యో వేదానాం ప్రభవ శ్చోద్భవశ్చ విశ్వాధికో రుద్రో మహర్షి ర్హిరణ్యగర్భం జనయామాస పూర్వమిత్యాది శ్వేతాశ్వతరో పనిషదాదౌ ద్రష్టవ్యమ్॥ ౩౨॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

సర్వ ప్రపంచము నేనే యని చెప్పుచున్నాడు। సర్వ ప్రపంచమునకు ఆది, మధ్య, అంతములు గలుగుటచే విష్ణురూపమైనందున నాక

రహితమైన సదాశివుడు విశ్వాధికు డగుటచె (దేవత్రి)యా తీతుడగుటచె వేరుగా నుండెను. ఈప్రకారముగానే విష్ణువు అధ్యాత్మ విద్యా స్వరూపము, దానిని తెలియుట శివసంబంధమె, వేదము నారాయణ స్వరూపము శివుని వలన ఉత్పత్తియైనదై ప్రకాశించు చున్నది. వేదములకె గాక అష్టాదశ విద్యలున్నూ శివునివల్లనె ఉత్పత్తియైనట్లు శృతులు గలవు. అష్టదశానాం విద్యానా మేతాసాం భిన్నవర్త్మనాం, ఆదికర్తా కవి స్సాక్షా చ్ఛూలపాణి రితి శృతిః॥ వాదములనగా ఇది నామతమనియు ఇది గాదనియు రెండు పక్షములయందు ఆగ్రిహముచె సిద్ధాంతమైన వాదము నేనే (వేదములకు శివుడు ఉత్పత్తి స్థానమై నట్లున్ను, విశ్వమును సృజించి తాను విశ్వము నంటక అతీతుడై సాక్షియై యున్నవాడు రుద్రుడే । రుద్రస్త్వాత్మా శరీరిణాం। అనియున్నది గాన ఆత్మరూపముతో అవస్థాత్రయాతీతుడై యున్నవాడు హిరణ్యగర్భుని పుట్టించిన వాడని శ్వేతాశ్వతరో పనిషత్తునందు గలదు॥ ౩౨॥

శ్లో॥ అక్షరాణా మకారోఽస్మి ద్వంద్వ స్సామాసికస్యచ।
అహమేవా క్షయః కాలో ధాతా హం విశ్వతో ముఖః॥

—♦ భాష్యమ్ ♦—

ఏవ మపర రూపేణా ప్యాహ।— అక్షరాణామితి॥ తథాచే హాకారో వై సర్వా వాగితి శ్రుతే ర్నామ రూపాత్మకత్వం విష్ణో స్తద్వేద్యంతు శివస్యైవే తి పూర్వస్మా దపి స్ఫుటీ కృతం । ఏవం ప్రకృతి పురుషయోరపి మమైవ ద్వా సుపర్ణేత్యాది శ్రుత్యా ప్రాధాన్య మిత్యతో ద్వంద్వో పృథ యార్థ ప్రాధాన్యేనా హమేవే త్యర్థః । ఏవ మవ్యక్తా దీని భూతాసీ త్యాదా వవ్యక్త శబ్దవాచ్య స్తతః పరం కాలోప్య

హామేవ కాలః కాలకరో హర ఇత్యాది స్మృతేః ఏవం కర్మ ఫలదా తౄణాం మధ్యే విశ్వతో ముఖః సర్వతో ముఖో ధాతా సర్వకర్మ ఫలప్రదాతేశ్వరః క్వకర్మ ప్రథ్వస్తం ఫలతి పురుషారాధన మృత ఇత్యాది వేదో హ్యహామేవేత్యర్థః॥

## —♦ లఘుటిప్పణీ♦ —

స్ఫుటీకృతమితి॥ వాచ్య వాచకయో ర్భిదే త్యాదినా పూర్వ మేవోక్తత్వా దితిభావః॥ । కాలకర ఇతి॥ తద్యథా । కలనా త్సర్వ భూతానాం బ్రహ్మాదీనాం నిమేషతః । కాల శబ్దేన నిర్దిష్టో హ్యఖండః పరమశ్శివ ఇతిజ్ఞానస్వరోదయోక్తె రవధార్యమ్॥ 33॥

## —♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

మరియొక రూపముచేతనున్నా చెప్పుచున్నాడు. అకారము సర్వ వాక్య రూపమనె శృతివలన, నామ రూపాత్మక మంతయు విష్ణు స్వరూపము. దానిని తెలియుట శివస్వరూపము, అక్షరము లన్నిటిలో అకారము నేనే శివాంశము. ప్రకృతి పురుషులు జీవేశ్వరులు అనెడి వాక్యములకు ద్వంద్వ సమాసమందు ఉభయార్థ ప్రాధాన్యము గనుక నేనే. అవ్యక్తము నేను, కాలము నేను, కర్మ ఫలముల నిచ్చెడి వారిలో విశ్వతోముఖ ధాతయైన ఈశ్వరుడు నేను. పురుషుడైన రుద్రుని, శృతి॥ పురుషో వై రుద్రః॥ ఆరాధించక కర్మలు నశించవని పుష్పదంత విరచిత మహిమ్న స్తోత్రమందు గలదు. (వాచ్య వాచకములకు భేదము గల దని మునుపే చెప్ప బడినది. బ్రహ్మాదులయిన సర్వభూతములను రెప్పపాటులో సృష్టించుట వలన కాలమని చెప్పబడు వాడు అఖండమైన పరమశివుడని జ్ఞాన స్వరోదయ మందు గలదు॥ 33॥

శ్లో॥ మృత్యు స్సర్వ హరశ్చాహ ముద్భవశ్చ భవిష్యతాం ।
కీర్తిః శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా॥

—♦ భాష్యమ్ ♦—

ఏవం యమానుయాయీ మృత్యు రప్యహ మేవే త్యాహ—మృత్యురితి॥ తద్యథా, 'మారయత్వం మహా మృత్యో జనాన్ సర్వాన్ గతాయుషః । రుదిత్వా సోఽప్య వాచేత్థం సకలం నావహే భృశ మిత్యేవం యమం ప్రతి బ్రువతే మృత్యవే ప్రవృత్త్యర్థం రోగా నుత్పాదయామాస, తన్నివృత్త్యర్థం చాయుర్వేదో పీత్యవధార్యమ్ । ఏవ మేవ భవి ష్యతాం భావికల్పానాం మధ్యే యత్రతా తమ స్తన్నదివా నరాత్రి రిత్యాది శ్రుతి వేద్యో య ఉద్భవః సచా హమేవే త్యర్థః । ఏవం శ్రీ రిత్యాది నారీణాం మధ్యే సత్కీర్తి గ్గరిష్ఠే త్యాహ । కీర్తిరితి॥ తద్యథా, 'సత్కీర్త్యా విశదా మతి ర్జని మతాం లోకేచ స్వర్గేప్యథ యాం శంసంతి మహాధియో నృప తయో విద్యావతంసా స్తథా, నాసత్కీర్తిం విముల మతయ శ్శాశ్రయంత్యేవ తస్మా ద్దానై ర్ధరైర్మై ర్వివిధ విభవై శ్శాశ్రే యంత్యేవ కీర్తి మిత్యాదినా షడ్వర్గేషు కీర్తే ర్గరిష్ఠత్వ మవ ధార్యమ్॥౩౪॥

—♦ లఘుటిప్పణీ ♦—

ఆయుర్వేదోపీతి॥ తత్రితావత్ 'పురాణ న్యాయ మీమాంసా ధర్మశాస్త్రాంగ మిశ్రితైః వేదైశ్చ తుర్దశే త్యుక్త ముపవేదై స్తథా ష్టా

దశేత్యతాత్రి ష్టాదశ విద్యానూ పవేద త్వేనా యుర్వేదస్యా ప్యుక్తత్వే తత్ర తస్యస్థానాన్య ష్టష్టవిధాన్యుక్తాని తద్యథాసూత్రం త్రిధోక్తం శారీరం త్రైయేంద్రియం వైచికిత్సితం నిదానం వైవిమానంచ వికల్ప స్సిద్ధి రష్టధా ఇత్యధిక మన్యత్రి విస్తరః॥౩౪॥

## —◆ ఆంధ్రతాత్పర్యము ◆—

యముని కూడా నుండు మృత్యువున్ను నేనే యనిచెప్పుచున్నాడు. యముడు మృత్యువుల నిట్లు చెప్పుచున్నాడు. ఓమహామృత్యో ఆయుర్దాయము లేని జనుల నందరిని నీవు చంపుము. ఇట్లు యముడు చెప్పగా మృత్యువు యేడిచి అందరిని నేనావహించ లేననగా నప్పుడు రోగములను పుట్టించెను. ఆరోగ నివృత్తి కొరకు ఆయుర్వేదమును సృష్టించెను. మృత్యువు నేను ముందు పుట్టబోవువారిలో యెవడుపుట్టియున్నాడో సృష్టిగాక పూర్వము దివారాత్రి భేదమును సదస ద్విభాగమును లేక శివుడొక్కడే ఉండెను. అట్టి శివుడు నేను. స్త్రీలయందు కీర్తి నేను. జన్మ యెత్తినవారలకుసత్కీర్తి చే ఇహలోకమందునుపరమందును బుద్ధి నిర్మలముగానుండును. గొప్ప బుద్ధిగల మహారాజులును పండితులును కీర్తి నే గోరుదురు. బుద్ధివంతులు అపకీర్తి నాశ్రయించక దానముల చేతను ధర్మముల చేతను అనేకవైభవముల చేతను కీర్తి నే ఆశ్రయించుచున్నారు. శ్రీ వాక్కు స్మృతి మేధ ధృతి క్షమ ఇవి యెల్ల నారూపములే. (పురాణము, న్యాయము, మీమాంసా, ధర్మశాస్త్రము, శిక్షా, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము, ఉపవేదములు నాలుగు. అందులో ఆయుర్వేదమున్నూ ఉన్నది. అందులో స్థానములు యెనిమిది. త్రివిధసూత్రము శారీరము ఇంద్రియము చికిత్సితము, నిదానము, విమానము, వికల్పము, సిద్ధి॥౩౪॥

శ్లో॥ బృహత్సామ తథాసామ్నాం గాయత్రీ ఛందసా మహమ్।
మాసానాం మార్గశీర్షోహమృతూనాం కుసుమాకరః॥ ౩౫॥

—♦ భాష్యమ్ ♦—

ఏవం వేదానాం సామవేదోఽస్మీత్యుక్తం తత్ర శాఖా విశేషం దర్శయితు మాహా।—బృహదితి॥ తదేతచ్ఛ గాయం బృహద్రథం సామ శివధ్యానా నుమోదిత ఇత్యాద్యుక్త మవ ధేయమ్। ఏవ మేవో క్తా త్యుక్తా తథా మధ్యా ప్రతిష్ఠా న్యాసుపూర్వికా। గాయత్ర్యు ష్ణి గనుష్టుప్చ బృహతీ పంక్తి రేవచే త్యాది చతుర్వింశతి ఛందసాం। మధ్యే గాయత్రీ ఛందశ్ఛ గరిష్ఠత్వా ద్దహ మేవే త్యర్థః ఏవం సకల సుఖ హేతుత్వా న్మాసానాం మార్గశీర్ష స్తథా షడృతూనాం మధ్యే కుసుమాకరశ్చా హమేవేతి బోధ్యమ్॥ ౩౫॥

—♦ లఘుటిప్పణీ ♦—

గాయత్రీతి॥ తత్త్రైవంసతి। గాయత్ర్యా ఏవ శివేన సాహిత్యాత్ సర్వదేవమయత్వం సర్వోపాస్యంచ సర్వే శాక్తా ద్విజాః పోక్తానశైవా నచవైష్ణవా ఆదిదేవీ ముపాసంతే పవిత్రాం వేదమాతర మిత్యాద్యధిక మన్యత్ర ద్రిష్టవ్యమ్॥ ౩౫॥

—♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

వేదములలో సామవేదము నేనని చెప్పినది. శాఖా విశేషమును చూపించు కొరకని చెప్పుచున్నాడు. సామ వేదమున గల బృహద్రథంతర సామమను గానము చేయుచు నారదుడు శివధ్యానముతో। నానందించెను. సామ ములలో రథంతర సామ నేను, ఉక్తా, అత్యుక్తా, మధ్యా, ప్రతిష్ఠా, అన్యా, సుపూర్వికా, గాయత్రీ, ఉష్ణిక్, అనుష్టుప, బృహతీ, పంక్తి. ఇత్యాది యిరువదినాల్గు ఛందస్సులలో గాయత్రి ఛందస్సు గొప్పది యగుట వలన నేనే, మాసములలో మార్గశీర్ష మాసము అందరికి

సుఖహేతు వగుట వలన నేను, ఋతువులలో వసంత ఋతువు నేను గాయత్రీ శక్తి శివునితో గూడిన దగుట వలన సర్వదేవ స్వరూపమగుట వలనను సర్వులచే నుపాసింపబడిన దగుట వలన బ్రాహ్మణులందరు శాక్తులె. శైవులు వేరు వైష్ణవులు వేరు. పవిత్రియు వేదమాతయు నైన ఆ శక్తిని ఉపాసించు చున్నారు॥

శ్లో॥ ద్యూతం ఛలవతా మస్మి తేజ స్తేజస్వినా మహం ।
జయోస్మి వ్యవసాయోస్మి సత్వం సత్వవతా మహమ్॥ ౩౬

—♦ భా ష్య మ్ ♦—

ఏవం ఛలయుతాం పరవంచనకర్తౄణాం మధ్యే దేవనాది లక్షణం ద్యూత మప్య హమేవే త్యాహ॥—ద్యూతమితి॥ ఏవం తేజస్వినాం తేజః పరాజితానాం మధ్యే జయో వ్యవసాయినాం మధ్యేచ వ్యవసాయః। సత్వవతాం మధ్యే సాత్త్వికశ్చాహమేవే త్యర్థః । ఇహ యద్యపి నిద్రా లస్య వసిత్వా చ్చ కృష్ణత్వా త్తామసో హరి రిత్యాది స్మృత్యా హరే స్తామసత్వ ముదీరితం తథాపి బాహ్య సత్వమయో విష్ణుః స్త్రీ సంజ్ఞో లోకభావన ఇత్యాది స్కాంద వచసా తత్వమవధార్యమ్। ౩౬॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

బాహ్య సత్వ మయ ఇతి॥ అతఏవాంత స్సత్వ మయ శ్శంభుః కర్పూ రాభ స్తురీయక ఇత్యాద్యుక్తత్వా న్న విస్మర్తవ్యమ్॥ ౩౬॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

పర వంచన చేయు జూదగాండ్లలో దేవనాది రూపమైన జూదము నేనని చెప్పుచున్నాడు. తేజశ్శాలుర సంబంధమైన తేజస్సున్ను

జయించు వారి సంబంధమైన జయమున్నూ ఉద్యమము గలవారి సంబంధమైన ప్రయత్నమున్ను సత్వవంతుల సత్వగుణమున్నూ నేనే. నిద్రా, మందమతి. వశిత్వము మొదలయిన గుణములు గలిగి వల్లగా నున్నాడు గాన విష్ణు తామసుడని స్మృతిగలదు. తామసు డయినప్పటికి స్త్రీయను పేరు గలిగి ప్రపంచ మను భావన గల విష్ణువు బాహ్యమునకు సత్వ గుణమును జూపెట్టు వాడని స్కాందమున గలదు. (కర్పూరకాంతి గలిగి తుర్య రూపుడైన శివుడు అంత స్సత్వము గలవాడని చెప్పిన స్మృతిని మరువ రాదు॥ ౩౬॥

శ్లో॥ వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః।
మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః॥　౩౭

—♦ భాష్యమ్ ♦—

ఏవం యాదవానాం వాసుదేవ స్త్వహ మేవేత్యాహ—వృష్ణీనామితి॥ తథాచ, వసత్యదాతు సర్వత్రేతి స్మృత్యా వాసుదేవః పాశుపత శ్చాహ మేవేత్యర్థః। ఏవ మేవ ధనం రాజ్యం తజ్జయత్వేన పాండవానాం ధనంజయో ఽర్జునో మునీనాం మననశీలానాం వేదవ్యాసః కవీనాం త్రికాలత్వేన క్రాంతదర్శినా ముశనా కవిశ్చాహమేవే త్యర్థః॥౩౭॥

—♦ ఆంధ్ర తాత్పర్యము. ♦—

ఈ ప్రకారము యాదవులలో వాసుదేవుడు నేనేయనిచెప్పుచున్నాడు. వసధాతువు సర్వత్ర అని యర్థము. వాసు సదా దేవః శివః అనగా సదాశివుడు నేను పాంథవులలో ధనం రాజ్యం జయః రాజ్యమును జయించినవాడు అర్జునుడు నేను మనన స్వభావము గల మునులలో వేదవ్యాసులు నేను. కవులలో త్రికాల జ్ఞానము గలవారిలో శుక్రుడు నేను॥ ౩౭॥

శ్లో॥ దండో దమయతా మస్మి నీతిరస్మి జిగీషతాం ।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహం॥

—◆ భాష్యమ్. ◆—

ఏవ ముత్పథ ప్రసృత్తౌ నిగ్రహో దండః సోపి దమయతా మహ మేవే త్యాహ।—దండఇతి॥ తథైవ జిగీషతాం జేతు మిచ్ఛతాం నీతి ర్న్యాయో జయో పాయస్య ప్రకాశకో౽హ మేవే త్యర్థః। ఏకం గుహ్యానాం గోప్యానాం వాచం యమత్వ మహమేవాస్మి నహి తూష్ణీం స్థితస్యా భిప్రాయో గమ్యతే, ఏవం వాచా మౌనంతు బాలానాం సతాం సహజ సంజ్ఞిత మిత్యాతి స్మృత్యా తల్లభ్యం శివజ్ఞాన మపి జ్ఞానవతా మహ మేవే త్యర్థః॥ ౩౮॥

—◆ లఘుటిప్పణీ ◆—

జ్ఞానవతా మితి॥ 'శివజ్ఞాన సమం జ్ఞానం యథా నాస్తి శ్రుతి స్మృతౌ తథా శైవిక తుల్యంతు నాస్తి తంత్రావలంబిషు' ఇత్యాది స్కాంద వచనై వ్యవస్థాపితత్వా దితి భావః॥ 3౮॥

—◆ ఆంధ్ర తాత్పర్యము. ◆—

అన్యాయ ప్రవర్తకుల యెడల దండన విధించ వలయు. అట్టి విధించు వారి సంబంధమైన దండన నేను, జయింప నెంచువారి నీతి యు, గోప్యము చేయు వారల మౌనమును నేనె, ఊరికె ఉండుట మౌనము గాజాలదు. బాలురకున్ను సత్పురుషులకున్ను వాఙ్మౌనము సహజము. అట్టి మౌనముచె లభ్యమయె జ్ఞానవంతుల యొక్క జ్ఞానమున్ను నేనే శివజ్ఞానముతో సమమైన జ్ఞానము శృతి స్మృతుల యందు లేదు. తంత్రా

వలంబులలో నైదిక తాం(తికునితో సమానుడు లేడు. ఇట్లు స్కాందమందు నిర్ణయమైనది॥ ౩౮॥

శ్లో॥ యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున।
న తద స్తి వినా యత్స్యా న్మయా భూతం చరా చరమ్॥

—♦ భాష్యమ్ ♦—

ఇహో పరం కిం బహువక్తవ్యమ్। సర్వభూతానాం యద్బీజ మవ్యక్తాఖ్యం తదప్యహ మేవే త్యాహ—యచ్చాపీతి తత్రైవం సతి హే అర్జున। యచ్చ కించజగత్యత్ర తే త్యాది (శుత్యా మయా వినా యత్స్యాద్భ వేచ్చ తద్వస్తుతో విజ్ఞాతవ్యం చరాచరం నాస్త్యే వేత్యర్థః॥ ౩౯॥

నాస్త్యేవేతి॥ ఏవంతిహి— యో వేదాదౌస్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠిత' ఇత్యాదా వాధిక్యేన విశ్వాధిక తయా దర్శితమిత్యవధేయమ్॥

—♦ ఆన్ధ్ర తాత్పర్యము ♦—

మరిన్ని చాలా చెప్పతగ్గది లేదు. సర్వభూతములకు బీజమైన యే అవ్యక్తము గలదో అది నేనని చెప్పుచున్నాడు. జగత్తుయందు కనుపించె వినుపించె చరాచర ప్రపంచములో తెలియతగినది నేను లేనిదియేలేదు. (వేదాది యందును వేదాంతమందును. ప్రణవముచెప్పబడినది. ప్రణవము ప్రపంచముగా వర్ణింపబడినది. యః పర స్సమహేశ్వరః అనుటచే ప్రపంచా తీతమైన వాడే సదాశివుడని చెప్పబడినది॥ ౩౯॥

శ్లో॥ నాంతో స్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప!॥
ఏషతూ ద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా॥ ౪౦

—♦ భా ష్య మ్ . ♦—

అథేదం ప్రకరణ ముపసంహర న్నాహ — నాంతఇతి తథా చేహ హే పరంతప ! మమ దివ్యానాం విభూతీనా మంత ఇయత్తా నాస్తీ త్యర్థః॥ ఏషతు త్వాం ప్రత్యు ద్దేశతః ఏకదేశేన విభూతే ర్వి స్తరః ప్రోక్తో మయే్య త్యర్థః॥ ౪౦॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

ఏకాదశో నేతి । ఏవం సత్యర్ధ మాత్రా స్థితా నిత్యా యాను చ్చార్యా విశేషత' ఇత్యాదావర్ధ మాత్రాయాం స్థితా యా బిందు ప్రకృతి స్తదూ్రపైణై కదేశే నే త్యర్థః॥ ౪౦॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

అనంతర మందు ఈప్రకరణమును సమాప్తి చెప్పుచు పలుకు చున్నాడు । ఓపార్థ! నా దివ్య విభూతుల కంతము లేదు. ఇప్పుడు నుడి విన విభూతులెల్ల ఒక్కచోట నె చెప్పబడినవి. (అర్ధమాత్ర యందున్న ట్టిన్నీ విశేషముగా ఉచ్చరింప శక్యము గానట్టి బిందు ప్రకృతిలో నుంచి ఏకదేశముగా చెప్పితిని॥ యః పర స్స మహేశ్వరః॥ అనెడి శృతిని బట్టి అర్థమాత్రా స్వరూపము మహేశ్వరుడు ఈశ్వరుని యొక్క విభూతులు చెప్పబడిన వని తాత్పర్యము॥ ౪౦॥

శ్లో॥ యద్య ద్విభూతి మత్సత్త్వం శ్రీమ దూర్జిత మేవవా
త త్తదేవా వగచ్ఛ త్వం మమ తేజోంశ సంభవమ్॥ ౪౧

—♦ భా ష్య మ్ ♦—

తదేవ స్థాలిక పులాక న్యాయేన సర్వ సంగ్రహీతు మప్యాహ॥ యద్యదితి॥ తద్యదేహ యద్య త్స త్త్వం ప్రాణినాం మధ్యేవిభూతి మదైశ్వర్య యుక్తం తథాశ్రీమన్నా

మ శ్రీర్లక్ష్మీ ర్విద్యా శోభే త్యాది యుక్తం వోర్జితం ప్రవృద్ధ-తత్త దేవ మమ తేజోంశ సముద్భూతం త్వవగచ్ఛ జానీహీత్యర్థః. ౪౧

—♦ లఘుటిప్పణీ ♦—

తత్తదేవేతి॥ తత్ర యద్యపి సర్వ రూపేణా హమేవా తథాపి విశేషతో మోక్షోప యోగిత్వాంశే మమ తేజోంశ సముద్భూత మిత్యర్థః॥ ౪౧॥

—♦ ఆంధ్రితాత్పర్యము ♦—

ఇక్కడస్థాలీ పులాక న్యాయముచే అంతను గ్రహించే కొరకు చెప్పుచున్నాడు. ప్రాణుల మధ్య యందు ఏ యే సత్వము ఐశ్వర్య యుక్తమైనదో లక్ష్మితో గూడినదో, అథవా, విద్యా, శోభాదులతో గూడినదై వృద్ధినొందినదో అదంతయు నా తేజస్సు యొక్క ఒక అంశ వల్ల పుట్టిన దానినిగా తెలుసు కొనుము. (ఆలోచించగా సర్వ స్వరూపము నేనే. అయినప్పటికి విశేషముగా మోక్షము నకుపయుక్తమైన అంశ నాయొక్క తేజోంశ వలన పుట్టినది॥ ౪౧॥

శ్లో॥ అథవా బహునై తేన కింజ్ఞాతేన తవార్జున !
విష్టభ్యా హ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్॥

ఇతి శ్రీమద్భగవద్గీతానూ పనిషత్సు బ్రహ్మ విద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే విభూతి
యోగోనామదశమోధ్యాయః॥

—♦ భాష్యమ్ ♦—

ఏవ మవయవశో విభూతి ముక్త్వా సాకల్యేనాపి తా మాహ। అథవేతి॥ తత్రైవం సతి హే అర్జున ! బహునై తేన

శేషేణ జ్ఞానేన కిం తవ స్యా దిదం కృత్స్నం సకలం జగదే కాంశేన విష్టభ్యా హామేవాస్మి మద్వ్యతిరిక్తం విజ్ఞాతవ్యం కించి న్నాస్తి పాదోస్య విశ్వా భూతాని త్యాది శ్రుతేరితి బోధ్యమ్।

ఇతి శ్రీ శ్వేతాచార్య గురుచరణ శిష్య భావ సమాసాదిత శైవసిద్ధాంత ప్రవర్తక శ్రీ శ్రీకంఠ శివాచార్య విరచితే తత్త్వైక దర్శన నామకే గీతాభాష్యే విభూతి యోగో నామదశమోధ్యాయః॥౪౨॥

—◆ లఘు టిప్పణీ ◆—

కించిన్నాస్తీతి॥ యస్యాంశాంశేన సృజ్యంతే దేవ తిర్య ఙ్నరాదయ ఇత్యా ద్యుక్తత్వా దితి భావః॥౪౨॥

ఇతిశ్రీ శ్రీకంఠ శివాచార్య శిష్య విశ్వేశ్వర శివాచార్య విరచితాయాం లఘుటిప్పణ్యాం విభూతి యోగోనామ దశమాధ్యాయః.

—◆ ఆంధ్రి తాత్పర్యము ◆—

ఈప్రకారము వేర్వేరుగా విభూతిని చెప్పి సమగ్రముగా దానినే చెప్పుచున్నాడు. ఓ అర్జునా! ఇట్లు వేర్వేరు దెలుసు కొనుట వలన నీకేమి లాభము గలదు? ఈ ప్రపంచమంతయు నొక యంశము చే నేను నిండి యుంటి. నా కంటె వేరైనది తెలియతగినది కొంచెమైనను లేదు. నేను శివాంశయని తాత్పర్యము॥౪౨॥

ఇట్లు తత్త్వైక దర్శనమను శ్రీకంఠీయ గీతాభాష్యమునకు బోధా నంద మహర్షిచే రచింపబడిన భావబోధమను నాంధ్రి తాత్పర్యమున విభూతియోగమను దశ మాధ్యాయము సమాప్తము.

ఓమ్

# శ్రీమచ్ఛ్రీకంఠాచార్యకృతే

# శ్రీ భగవద్గీతాభాష్యే

## విశ్వరూప దర్శనం నామ-ఏకాదశో ధ్యాయః.

అర్జున ఉవాచ—

శ్లో॥ మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మ సంజ్ఞితమ్।
యత్త్వయోక్తం వచ స్తేన మోహోఽయం విగతో మమ॥౧

### — భాష్యమ్ —

ఆబ్రహ్మ స్తంబ పర్యన్తం త్వర్జునాయ హృది స్థితమ్
దర్శితం విశ్వతో రూపం ప్రోచే త్వేకాదశే భృశమ్। ఇహో త్కంఠయా పూర్వోక్త మేవా భినందయన్నాహ — మదను గ్రహాయేతి। తథాచే హ సంసృతి శోకస్య నివృత్త్యుపాయం పరమం గుహ్య మధ్యాత్మ సంజ్ఞితం యత్త్వయోక్తం తేనవచసా మోహోఽయం శత్రుపరాజయ కృతో విగత ఇతి పరమార్థః॥౧

### — లఘుటిప్పణీ —

దర్శితమితి యదేత ద్విశ్వరూపం సదాశివ ప్రసాదాచ్ఛ్రీ కృష్ణేన దృష్టం తదేత దర్జునాయాపి హృదిస్థితం విశ్వతో రూపం శ్రీకృష్ణేన దర్శితమితీద మత్రాధ్యాయే ప్రోచే దర్శయామీత్యర్థః॥౧॥

## —♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

అర్జునుండిట్లనియె॥ బ్రహ్మ మొదలు తుంగ గడ్డి వరకు హృదయ మందున్న విశ్వరూపమును అర్జునుని కొరకు చూపించె నని పదునొకండవ అధ్యాయమందు చెప్పుచున్నాడు. యీ అధ్యాయమందు పూర్వోక్తమైన దానిని బహూకరించుచు చెప్పుచున్నాడు. నన్ననుగ్రహించు నిమిత్తము సంసార శోకమును పోగొట్టుటకు నుపాయమైనట్టిన్ని ఉత్కృష్టమైనట్టిన్ని రహస్యమైన ఆధ్యాత్మ మను పేరుగల యే వాక్యమును చెప్పితివో దానిచే శత్రుపరాజయ రూపమైన మోహము నశించినది (సదాశివుం డనుగ్రహము వలన చూపిన దానినె తన హృదయమందున్న విశ్వరూపము అర్జునుని కొరకు శ్రీకృష్ణుడు చూపెట్టెనని యీ అధ్యాయమందుచెప్పుచున్నాడు.

శ్లో॥ భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్య మపి చావ్యయమ్॥ ౨

## —♦ భాష్యమ్ ♦—

నను కిం తద్శ్రుతం యేన తే మోహో విగత ఇత్యాహ—భవాప్యయావితి । తత్ర తావద్భూతానాం భవాప్యయా వుత్పత్తివినాశౌ తథా సర్వాత్మత్వ లక్షణం నిరుపాధికం శివజ్ఞానం చావ్యయం హేకమలపత్రాక్ష । త్వత్త శ్శ్రుత మితి హరిస్తే సాహస్రం కమల బలి మాధాయ పదయో ర్యదేకోనే తస్మి న్నిజ ముదహర న్నేత్రకమల మిత్యత్రో వధారిత మిత్యాశయః॥ ౨॥

## —♦ లఘుటిప్పణీ. ♦—

ఇత్యాశయఇతి । తత్ర తావ దక్ష యజ్ఞ ప్రమథనే । 'యత్రశంభు ర్హవా గౌరీ నైవం యజ్ఞస్య భూతిలే । త్రతాగతః ఖగారూఢధిగ్ధి

రాసభ వాహన ఇత్యేవ ముక్త్వా విష్ణో ర్వక్షసి త్రిశూల భేదనోత్తరం తు దక్ష యజ్ఞా ద్ధరి ర్గత్వా తపసాతోషయ చ్ఛివం కదాచి త్సోఽచ్ఛిన న్నేత్రం సహస్రాణాం సుపూర్తయ ఇతి హరిహరక్షేత్ర కథయా వధార్యమ్॥ ౨॥ ॥3॥ ౪॥

## —♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

ఓయీ! దేనిత్రో మోహము పోయినదో ఆవిన్న దేదంటె చెప్పుచున్నాడు। ఓకృష్ణా। భూతముల యొక్క సృష్టి ప్రళయములున్ను సర్వాత్మ స్వరూపమయి ఉపాధి రహితమైనట్టిన్ని నాశ రహితమైన శివజ్ఞానమును నీవలన వింటిని॥ విష్ణువు ఈశ్వరుని పాదముల యందు సహస్ర కమలార్చన చేసినపుడొక పుష్పము లోపించగా నేత్రకమలమును పూజించినట్లు మహిమ్నస్తుతి యందు గలదు. గాన విష్ణు శివ భక్తుడు గనుక నా అర్జునుని కొరకు శివజ్ఞానమును బోధించెను. శివుడు జూపించిన విశ్వరూపమునె చూపించెను. (దక్షయజ్ఞభంగమందు। భూలోకమున పార్వతీ పరమేశ్వరులు ఇద్దరూ లేకుండగా యజ్ఞము చేయుచున్న తరి శరభ రూపుడైన రుద్రుడు విష్ణునిజూచి ఓగర్ధభ వాహనుడా ఛీ। ఓ పక్షి వాహనా ఛీ, అనిపలికి విష్ణువక్షమున శూలమును గుచ్చి గిరగిర ద్రిప్పి పారవేశిన తరి విష్ణు శివుని గురించి తపమాచరించి శివానుగ్రహమును బడసెను. మరియొకప్పుడు సహస్ర కమలార్చన లో ఒక కమలము లోపించినందున పూర్తికొరకు నేత్రమును పెరికి పూజించినట్లు హరిహర క్షేత్ర కథ యందు వర్ణింప బడినది॥ ౨॥

శ్లో॥ ఏవమేత ద్యథా త్థ త్వ మాత్మానం పరమేశ్వరం।
ద్రష్టు మిచ్ఛామి తేరూప మైశ్వర్యం పురుషోత్తమ॥ 3॥

శ్లో॥ మన్యసే యది తచ్ఛక్యం మయాద్రష్టు మితి ప్రభో।
యోగేశ్వర తతో మేత్వం దర్శయా త్మానమవ్యయమ్॥ ౪॥

—♦ భా ష్య మ్ ♦—

అథయది త్వమేవా హంగి రోపాసనయా సర్వాత్మనా శివ స్తిష్ఠసి త్వర్హిమమాపి తత్సర్వాత్మత్వం దర్శయ యథాహమపి విజానీయామితి పూర్వోక్త మభి ప్రేత్య పునరాహ। ఏవమితి తత్రైవం సతి పురుషాణాం యథావిష్ణు రిత్యాద్యుక్తే శ్రేష్ఠపురుషోత్తమ తే తదైశ్వర్యం యత్పరమ శివేన ద్రోణ పర్వణి భవతే దర్శితం తన్మమాప్యద్భుతం దర్శయ తద్ద్రష్టుమిచ్ఛామి। యదిదర్శయితుం మన్యసే చేత్తతోఽవ్యయ మాత్మానంచ దర్శయేతి ద్వయోరర్థః॥ ౩॥ ౪॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

అహంగిరోపాసనచే నీవే సర్వాత్మనా శివుడవై ఉన్నట్లైతే నాకును ఆసర్వాత్మత్వమును చూపించుము. నేనున్నూ తెలుసు కుందునని పూర్వమందు చెప్పిన దానినె మరల చెప్పుచున్నాడు. పురుషులలో విష్ణు శ్రేష్ఠుడను స్మృతి ప్రకారము, ఓ పురుషోత్తమా, ద్రోణపర్వమందు పరమశివునిచే నీకొరకు చూపించబడిన ఆ అద్భుతమైన నీయైశ్వర్యమును నాకును చూపెట్టుము. నీ పరమేశ్వరుని చూడ నిచ్ఛ గలిగి యుంటిని. ఓ కృష్ణా! నేనారూపమును దిలకించుటకు తగినవాడనని యెంచితివేని, ఓ ప్రభో, నాశరహితమైన యాత్మ స్వరూపమునున్నూ చూపించుము॥౩॥౪॥

శ్లో॥ పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః
నానా విధాని దివ్యాని నానావర్ణాకృతీని చ॥౫॥

—♦ భా ష్య మ్ ♦—

ఏవ మత్యంత భక్తేనార్జునేన ప్రార్థితః సన్కృష్ణోప్యువాచ। పశ్యేతి। తత్రైవం సతి। హేపార్థ శతశోథ సహస్రశో

నానావర్ణాకృతీని దివ్యాని రూపాణి శివాజ్ఞయా దర్శయామి పశ్యే త్యర్థః॥ ౫॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

శివాజ్ఞయేతి । తద్యథా । 'యద్యత్కరోమి తత్సర్వం శివ మేక మనామయమ్ । స్మరం స్తస్యోపదేశేన సర్వస్వ వరదానత' ఇత్యాది స్కాన్దవచ నైరవధేయమ్॥ ౫॥

—◆ ఆం ధ్రి తా త్ప ర్య ము ◆—

శ్రీకృష్ణుం డిట్లనియె:—

ఈప్రకారము అత్యంత భక్తుడైన అర్జునుడు ప్రార్థించగా కృష్ణుండిట్లు పలికెను. ఓ పార్థ! వందలకొలది వేలకొలది పలు తెఱంగులును, వివిధాకారములును, నయిన దివ్యమైన రూపములను శివాజ్ఞచే చూపించు చున్నాను. జూడుమని యర్థము, (యే పనిని జేయుచున్నానో దాని నంతెను అనామయుమగు నొక్క శివునిగా స్మరించుచు ఆట్టిశివుని యుపదేశముచే సర్వస్వ వరదానము వలన చూపించు చున్నానని యర్థము॥ ౫॥

శ్లో॥ పశ్యాదిత్యా న్వసూన్ రుద్రా నశ్వినౌ మరుత స్తథా।
బహూన్య దృష్టపూర్వాణి పశ్యా శ్చర్యాణి భారత!॥౬॥

—◆ భా ష్య మ్ ◆—

ననుకాని తర్హి నానావిధాని దివ్యాని రూపాణీ తిపు నరాహ—పశ్యేతి తత్ర తావద్ద్వాదశాదిత్యా నష్టౌ, వసూ నేకాదశేంద్రియాధీశాన్ రుద్రాం స్తథా ద్వాదశ్వినౌ మరుతః

శ్చైయికోన పంచాశ త్తథా న్యాన్య ప్యాశ్చర్యాణి రూపాణ్య
దృష్టపుర్వాణి బహూని పశ్యే త్యర్థః॥ ౬॥

—• లఘు టిప్పణీ •—

రుద్రానితి' సర్వేంద్రియాధీశా న్మద్రచ్ఛాయయా ప్రభవా నేకాదశ రుద్రా నిత్యర్థః యస్త్వేకోరుద్రో నద్వితీయాయ తస్థురిత్యాది శ్రుతి వేద్యో రౌదయత్యేవ యస్సర్వా నిత్యాది స్మృతి వేద్యశ్చ సపృథగేవ సర్వాత్మా సర్వసాక్షీ త్యాశయః॥ ౬॥

—• ఆంధ్ర తాత్పర్యము •—

ఓయీ! అయితే నానావిధములయిన ఆదివ్యరూపములేవంటే మళ్ళీ చెప్పుచున్నాడు. పన్నెండుగురు సూర్యులు తొమ్మండుగురు వసువులు పదునొకండు ఇంద్రియాధిపతులు పదునొకండు రుద్రులు ఇద్దరు అశ్విని దేవతలు అయిదు వాయువులు మొత్తం నలభైతొమ్మిదిన్ని ఇంకా ఇతరమైన పూర్వము చూడని యాశ్చర్య రూపములనున్నూ అనేకముగా చూడుము. (సర్వేంద్రియాధిపతులు రుద్రచ్ఛాయ వలన పుట్టిన ఏకాదశ రుద్రులని యర్థము, ఏకఏవ రుద్రోనద్వితీయాయ తస్థుః॥ అనెడి శృతియందు చెప్పిన రుద్రుడు వేరె ఈ ఏకాదశ రుద్రులలోని వాడు కాడు. రుద్రుడనగా సంహారకాలమందు అందరిని రోదింపించువాడు. సర్వసాక్షియని యభిప్రాయము॥ ౬॥

శ్లో॥ ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్।
మమ దేహే గుడాకేశ యచ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి॥ ౭

—• భాష్యమ్ •—

తత్ర నపునః ఖల్వేతావదేవ కింతు మద్దేహస్థం శివాజ్ఞయా సర్వం జగదపి ద్రష్టుమర్హసీ త్యాహ-ఇహైకస్థమితి।

తత్రైవంసతి హేగుడాకేశ నామగుడాకా నిద్రాతదీశ శివ మద్వైతం తురీయ మిత్యాదిశ్రుతివేద్య పరమశివ జ్ఞాన యోగ్య మమ శరీరే యచ్చాన్య దనేకవిధంతద్ద్రష్టు మిచ్ఛసీ త్యర్థః॥౭॥

—• లఘు టిప్పణీ •—

శివమద్వైతమితి। యతస్తురీయ ఏవ నిద్రాతీతో భవితు మర్హతీ తిభావః॥ ౭॥

—• ఆంధ్ర తాత్పర్యము •—

ఇంతియేగాదు. నా దేహమందున్న సర్వజగత్తును ఈశ్వరాజ్ఞచే చూడతగుదువని చెప్పుచున్నాడు। ఓగుడాకేశ = గుడాకా = నిద్రను ఈశ=జయించినవాడు, అద్వైతము తురీయము, శివుడు, అనేశ్రుతిచే తెలియ తగిన శివజ్ఞానమునకు యోగ్యుడా। చరా చరములతో గూడిన ప్రపంచమంతయు నాశరీరమందె ఒకచోటనున్న దానిని గాకనుము. ఇంకను అనేక విధముల దేనిని వీక్షింప వేడ్క పడుచుంటివో దానినిన్ని జూపెద గనుము (నిద్రను అతిక్రమించువాడు తురీయరూపుడె అగుటకు తగుచున్నాడు, అనగా శివుడే గాగలడు। అర్జునుడు। శివరూపమని తాత్పర్యము॥ ౭॥

శ్లో॥ నతుమాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్॥ ౮

—• భాష్యమ్ •—

నను త్వామీ దృశం కేన చక్షుషా పశ్యామీ త్యాహ నత్వితి। తస్మాత్తే తవ దివ్యం తృతీయం జ్ఞానాఖ్యం

చక్షు ర్దదామి యేన త్వమేవం యథోక్తలక్షణం వైరాజ్యం స్వరూపం పశ్య సీ త్యర్థః॥౮॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

జ్ఞానచక్షుషేతి । యత శ్శివం వినా కస్యాపి జ్ఞానచక్షుష్ట్వా సంభ వా దిత్యవధార్యమ్॥ ౮॥

—◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ◆—

ఓయీ! ఇటువంటి నిన్ను యేదృష్టితో చూస్తున్నానంటె చెప్తు చున్నాడు. అందువల్ల నీకు దివ్యమైన మూడవదియైన జ్ఞాననేత్రమును యిస్తూన్నాను. దానిచే యథోక్త లక్షణమైన విరాడ్రూపమును జూడ గలవు. (శివుని విడచి జ్ఞానదృష్టి యొకనికిని లేదని తెలిసి కొనవలెను॥ ౮॥

సంజయ ఉవాచ:—

శ్లో॥ ఏవముక్త్వా తతో రాజ న్మహాయోగేశ్వరో హరిః।
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్॥౯॥

—◆ భా ష్య మ్ ◆—

అథైవం పూర్వోక్తవృత్తం సజయో ధృతరాష్ట్రాయ రాజ్ఞేస్మారయ న్నప్యాహ—ఏవమితి। తస్మా ద్యద్రోణపర్వణి పరమశివేన కృష్ణాయ హరయే దర్శితంత దేవ పరమశివరూపం తతో న్యూనంవా విశ్వరూపం హరిరపి పార్థాయ దర్శితవానితి స్పష్టమేవోక్తం అంతేచ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతీ త్యాదినా, తమేవ శరణంగచ్ఛ సర్వభావేన భారత ఇత్యుపసంహృతం॥ ఏవంచ మన్మనాభవ మద్భక్తో మద్యాజీ

మాం నమస్కురు ఇత్యాద్యుక్తిః కృష్ణస్యాన్తర్యామిపరమ శివాభిప్రాయైవ నతు స్వాభిప్రాయ ఇత్యవగంతవ్యమ్॥౯॥

—◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ◆—

సంజయుం డిట్లనియె॥ తరువాత పూర్వోక్తమైన వృత్తాంతమును సంజయుడు రాజైన ధృతరాష్ట్రుని కొరకు జ్ఞాపకముచేయుచున్నా చెప్పు చున్నాడు. ద్రోణ పర్వమందు పరమశివునిచే కృష్ణుడయిన విష్ణునికొరకు యేది చూపబడ్డదో అట్టి పరమశివ రూపమునంతను గాని అంతకంటె తక్కువ గాని విశ్వరూపమును శ్రు॥ విరూపేభ్యో విశ్వరూపేభ్యశ్చ వోనమః । కృష్ణుడున్నా అర్జునుని కొరకు చూపించెనని స్పష్టముగా చెప్పెను. అంతమందున్నా, ఈశ్వరుడే సర్వభూతములయొక్క హృదయ మందున్నాడని చెప్పి అతనె సర్వము యని భావించుము. కృష్ణుడు అర్జు నుని గూర్చి నాయందు మనసుంచి నాకె భక్తుడవై నన్నె పూజించి నాకె నమస్కరింపుమని బోధించిన వాక్యముయొక్క అభిప్రాయము కృష్ణుని హృదయములోనుండు పరమశివా భిప్రాయముతో గాని కేవలము నన్నె పూజింపుమనే యభిప్రాయము గాదని తెలియవలెను॥ ౯॥

శ్లో॥ అనేక వక్త్ర నయన మనేకాద్భుత దర్శనమ్।
అనేక దివ్యాభరణం దివ్యానే కో ద్యతాయుధమ్॥౧౦॥

—◆ భా ష్య మ్ ◆—

ఇహ తదేవ విశ్వరూపం దర్శయితుం విశినష్టి. అనేకేతి॥ తత్రైవం సత్యనే కాని వక్త్రాణినయనాని చ విస్మయహేతూని దృశ్యన్తే యస్మిన్స్వరూపే తథానే కాని దివ్యాభరణాని యస్మిం స్తథా దివ్యాన్య నేకాన్యాయుధానియస్మిం స్తత్తథా స్వరూపమిత్యర్థః॥౧౦॥

—♦ లఘుటిప్పణీ ♦—

తదేవేతి । యద్ద్రోణ పర్వణీ సదాశివే న విశ్వస్వరూపం దర్శితం తదేవ తత్తో న్యూనమ్వా శ్యర్థః॥ ౧౦॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

అదే విశ్వరూపమును చూపించు కొరకు పోల్చిగు చేయుచున్నాడు. అది యెట్టిదంటె అనేక ముఖములు కన్నులు గలదియు అనేక కాద్భుత దర్శనములు గలదియు అనేక దివ్యాభరణములు గలదియు అనేకము లయిన దివ్యాయుధములు గల స్వరూపమును (ద్రోణ పర్వమందు సదా శివుడు చూపించిన దానినంతను గాని కొంతను గాని విశ్వరూపమును చూపించుచున్నాడు॥ ౧౦॥

శ్లో॥ దివ్య మాల్యాంబర ధరం దివ్య గంధానులేపనం।
సర్వాశ్చర్యమయం దేవ మనంతం విశ్వతో ముఖమ్॥ ౧౧॥

—♦ భాష్యమ్ ♦—

తథా పరమస్యాహ। దివ్యమాల్యేతి। తత్ర తావద్ది వ్యాని మాల్యాని స్వర్ణాది మయా న్యాభరణాని వస్త్రాణి చ ధ్రియన్తే యేవ తద్దివ్య మాల్యాంబరధర మిత్యాది విశ్వతో ముఖం యద్యావ ద్విరాడ్రూపం దర్శయామాసే త్యాశయః॥

—♦ లఘుటిప్పణీ ♦—

విరాడ్రూపమితి యద్రూపం జ్ఞాని చక్షుర్వినా నకస్యాపి దృష్టి గోచర భవితుం యోగ్యం భవతీతి భావః॥ ౧౧॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

ఇంకను చెప్పుచున్నాడు. ఆరూపము దివ్యమాల్యా భరణములం దాల్చినదియు దివ్య గంధంబుల నలందుకొన్నదియు అనేకాశ్చర్యములతో

నిండినదియు ప్రకాశించునదియును అంతములేనిదియును నలుదిక్కులా ముఖములు గలదియు నై యుండెను. (ఇట్టిరూపము జ్ఞానదృష్టి లేక యెవనికిని దృష్టిగోచరమగుట కధికారములేదు॥౧౧॥

శ్లో॥ దివిసూర్య సహస్రస్య భవేద్యుగప దుత్థితా।
యది భాః సదృశీ సా స్యాద్భాస స్తస్య మహాత్మనః॥౧౨॥

—◆ భాష్యమ్ ◆—

నను కీదృశం తత్తేజోమయం తత్స్వరూపమిత్యాహ— దివీతి॥తత్రైవం సతి దివ్యన్తరిక్షే సూర్యసహస్రాణామపరిమిత సూర్య సహస్రైః సమూహస్య యుగపదుత్థితస్య యదిభాస్సదృశీ స్యాన్నామ భవేత్తదా సాతస్య మహాత్మనోవిశ్వరూపస్య భాసో దీప్తేః సదృశీ యదిస్యా ద్యదివా నస్యా దిత్యభూతోపమాపరత్వేనో క్తి రిత్య వధార్యమ్॥౧౨॥

—◆ లఘుటిప్పణీ ◆—

అభూతోపమఇతి తద్యథా అభూత పూర్వం మమ భావి కిమ్వాపర్వం సహేమే సహజం హి దుఃఖ మిత్యాది తల్లక్షణస్యాలంకార ప్రబంధేష్వూ దాహృతత్వాదిత్య వధార్యమ్॥౧౨॥

—◆ ఆన్ధ్రి తాత్పర్యము ◆—

తేజోరూపమైన యాస్వరూప మెట్టిదంటె చెప్పుచున్నాడు. ఆకాశమందొక్క పర్యాయము వేయిమంది సూర్యులుదయించిన యెడల నొక్కసారి బయలుదేరిన యాకాంతి యా రూపముతోసరిపోవునో లేదో (అభూతోపమాలంకారము) పూర్వమందు లేనిదుఃఖము నాకు రాబోవునా

అంతను సహించెదను. నాకు దుఃఖము సహజమె యౌని దాని లక్షణములం కార ప్రబంధము నందు చెప్పబడినదని తెలియవలెను॥ ౧౨॥

శ్లో॥ తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా।
అపశ్య ద్దేవ దేవశ్య శరీరే పాండవ స్తదా॥ ౧౩॥

—◆ భా ష్య మ్ ◆—

ననుకథంపునః పోర్జునో దేవదేవస్య విశ్వరూపస్య శరీరేఽపశ్య దిత్యాహ ॥ తత్రేతి । తత్రైతావదేకస్థ మేవ సచరాచరం జగత్సర్వం తచ్ఛరీరే పాండవోఽ పశ్య దిత్యర్థః॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

తచ్ఛరీరఇతి॥ నన్వేవం సగుణ శరీరత్వా వచ్ఛేదేన సదాశివ శరీరా చ్ఛక్తేశ్చ కీదృశీ విశేష ఇతిచే చ్ఛృణు । తద్యథా । పాతనం కాలకూటంవా గావాం క్షీరం సరిత్పతిః । విశేషంత త్తయోర్జ్ఞాత్వా వివాద స్త్యజ్య తాం బుధైః ముఖస్థం విశ్వతో రూపంసఖస్థం చాప్యకర్మయ త్తయో ర్విశేష మాస్తాయ వివాద స్త్యజ్యతాం బుధైః సేవకో ధ సఖా వాపి స్వామిత్వం చేతభక్తితః కాక్షతి ర్ధూత రూపాదా. నూతాదా। చేత్యవర్ణయ దిత్యాది బుద్ధి కుశలై ర్వివేక్తవ్య మిత్యధిక మన్యత్ర విస్తరః॥

—◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ◆—

అర్జునుడు విశ్వరూపుడైన సదాశివుని యొక్క శరీరమందు ఎట్లు చూచెనంటె చెప్పుచున్నాడు. అనేక భాగములుగా నున్న ప్రపంచము అన్నియు దేవదేవుని దేహమందొక తావుననె యుండ నర్జునుం డప్పుడు కాంచెను (సదాశివుడు సగుణ శరీరు డగుటచేతను యితనికిని శక్తికిని విశేష మెట్టిదంటివా? వినుము. అమృత కాలకూటములకు గోక్షీర సము

ద్రిములకు విశేషమును తెలిసిన పెద్దలు వివాదమును వదలుకొనుడు। ముఖమందున్న విశ్వరూపమునకున్నా (గోరుయందున్న విశ్వరూపమునకున్నా విశేషమును చూచి పండితులు వివాదమును విడుతురుగాక! కరాంగుళి నఖోత్పన్న నారాయణ దశాకృతిః॥ శేవకుడుగాని, స్నేహితుడుగాని స్వామియని భక్తివల్లనుంచి దూతరూపమైన నూతాయులయందు హానిలేదని వర్ణించినందున బుద్ధి కుశలులుగావివేచన చేయుతగినది॥ ౧౩॥

శ్లో॥ తతస్సవిస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః ।
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత॥ ౧౪

—• భాష్యమ్ •—

ఏవ మద్భుత స్వరూప దర్శనేనార్జునో బిభయాంచకారే త్యాహ । తతఇతి । తస్మాత్తద్దర్శనానంతరం విస్మయేనా విష్టో యుక్తః సన్ ధనంజయో దేవదేవం శిరసా ప్రణమ్య కృతాంజలిస్సన్, ఉవాచే త్యర్థః॥ ౧౪॥

—• ఆంధ్రి తాత్పర్యము •—

ఈప్రకారము అద్భుత రూపమును చూపించుటచే అర్జునుడు భయపడెనని చెప్పుచున్నాడు. పిదప నాయర్జునుండు ఆశ్చర్యముతో గూడినవాడై యొడలు గగుర్పాటుజెంద కృష్ణునకు నమస్కారము చేసి దోసిలి పట్టుకొని పలికెను॥ ౧౪॥

అర్జున ఉవాచ:—

శ్లో॥ పశ్యామి దేవాం స్తవ దేవదేహే
సర్వాం స్తథా భూతవిశేష సంఘాన్ ।
బ్రహ్మాణ మీశం కమలాసనస్థ
మృషీంశ్చ సర్వా నురగాంశ్చదివ్యాన్॥ ౧౫

—◆ భాష్యమ్ ◆—

నను తర్హి సకిమువాచే త్యాహ పశ్యామీతి । తత్ర తావ త్పరమశివానుగ్రహేణ యద్భగవతా దివ్యచక్షుషా దర్శితం విశ్వరూపం తత్సకలై రదృశ్య మహో పశ్యామి హే దేవ తవ దేహే దేవా న్విశ్వాదీన్ భూతవిశేష సంఘాన్ స్థావర జంగమానవిశేషేణ పశ్యామీ త్యర్థః । ఏవం బ్రహ్మాణ మీశం సృష్టి నియంతారం కమలాసనస్థం తథా సర్వానృషీ నురగాంశ్చ సర్వా న్దివ్యా న్పశ్యామీతి సర్వత్రాన్వయః॥౧౫॥

—◆ ఆంధ్రి తాత్పర్యము ◆—

అర్జునుం డిట్లనియె॥ ఏమని పలికె నంటె చెప్పుచున్నాడు, ఓ దేవా! పరమ శివానుగ్రహము చె పూజ్యమైన దివ్యదృష్టితో చూపించబడిన విశ్వరూప మందరిచె చూడ శక్యము గానిది. అట్టిదానిని నీదేహమంతు చూచితిని, విశ్వేదు మొదలయిన దేవతలను స్థావర జంగమములను పద్మా సన మందున్న సృష్టికర్తయైన బ్రహ్మనున్నూ సమస్తఋషులను నాగులను సమస్త దేవతలను చూచుచున్నాను॥ ౧౫॥

శ్లో॥ అనేక బాహూదర వక్త్రనేత్రం ।
పశ్యామి త్వాం సర్వతో నన్తరూపం।
నాన్తం నమధ్యం నపున స్తవాదిం ।
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప॥ ౧౬

—◆ భాష్యమ్ ◆—

అథచేహ భవద్దేహే యత్సర్వ మేత ద్దృష్టవాం స్తమేవ విశనష్టి । అనే కేతి । తత్రితావ దనేకే బాహవ స్తథోదరాణీ

వక్త్రాణి నేత్రాణి యస్య తమేతాదృశం సర్వతోఽనంత రూపం త్వాం పశ్యామి౹ త్వర్థః । తథాహే విశ్వరూప తవ నాన్తం నావసానం నమధ్యం నాప్యాదిం పశ్యామీ త్యర్థః॥ ౧౬

—♦ లఘు టిప్పణీ ♦—

నాన్తమిత్యాది । ఇహతు యచ్చ కించ జగత్యస్మిన్ దృశ్యతే త్యాది శ్రుతి శేవ్యం యత్స్వరూపం తస్యేత్థం మహత్త్వం యత్తు యోవేదాదౌ స్వరః ప్రోక్తో వేదాన్తేషు ప్రతిష్ఠిత ఇత్యాది శ్రుతివేద్యం తు దురవగాహ మేవే త్యవధార్యమ్॥ ౧౬॥

—♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

తరువాత నీదేహమందు దేని నంతను చూచెనో దానినే చెప్పు చున్నాడు। అనేక చేతులు కడుపులు నోళ్ళు కన్నులు గలవాని గను అటు వీక్షించినను అంతములేని రూపము గలవానిగను। విశ్వేశ్వరుడవు. విశ్వరూపుడవైన నీకు మొదలు మధ్యముచివరయు గాన్పించుట లేదు. (జగత్తునందు వినుపించునది కనుపించునది యగు స్వరూపము దాని మహ త్వమున్నూ ఇట్టిదె అనగా విశ్వరూపము సామాన్యమనుట. యోవేదాదౌ అనునట్టి శృతి యందు ప్రతిపాద్యమైన। యః పర స్సమహేశ్వరః। అనునట్టి విశ్వాతీత మైన రూపము దురవ గాహమని తెలియవలెను॥ ౧౬॥

శ్లో॥ కిరీటినం గదినం చక్రిణంచ ।
తేజోరాశిం సర్వతో దీప్తి మంతమ్ ।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతా ।
ద్దీప్తానలార్క ద్యుతి మప్రమేయమ్॥ ౧౭

—• భా ష్య మ్ •—

ఇహ తమేవ విశ్వరూపం ప్రకారాన్తరేణ విశినష్టి। కిరీటినమితి। తత్ర తావత్కిరీటాదియుక్తత్వాచ్చ తేజోరాశిం స్వతశ్చా నలార్క ద్యుతిమప్రమేయ మతఏవ చ దుర్నిరీక్ష్యం త్వాం విశ్వరూపం పశ్యామీ త్యర్థః॥ ౧౭॥

—• ల ఘు టి ప్ప ణీ •—

దుర్నిరీక్ష్యమితి॥ దుఃఖేన ద్రష్టు మర్హం దుర్నిరీక్ష్య మిత్యర్థః। 'నచ యచ్చ కించ జగత్యస్మిన్' త్యాది శ్రుతి వేద్యం త్వమర్క స్త్వం సోమ ఇత్యాది స్మృతివేద్యంచ విరాడ్రూపం ప్రత్యక్ష మేవ జనః పశ్య తీతి కిమత్ర దుర్నిరీక్ష్యత్వ మితివాచ్యం। యదుక్తం జ్ఞాన చక్షుషా లేన సర్వై రేకత్ర భావేనైకదైవ దుర్నిరీక్ష్య మిత్యాశయః॥ ౧౭॥

—• ఆ ం ధ్రి తా త్ప ర్య ము •—

ఆవిశ్వ రూపమునే మరియొక ప్రకారముగా వర్ణించు చున్నాడు, ఎటుగాంచినను కిరీటములు, గదలు, చక్రములు, గలవానినిగాను, తేజంపుప్రోవుగాను, కాంతి గలవానిని గాను తేరిచూడ నలవికానివానిని గాను ప్రకాశించు అగ్ని యొక్కయు, సూర్యుని యొక్కయు కాంతి బోలిన కాంతిగలవానిని గాను ఇట్టి వాడని నిశ్చయింప నలవిగాని వానిని గాను కాంచుచుంటిని. (దుఃఖము చేతనున్నూ చూడ నర్హము గానిది దుర్నిరీక్ష్యము. జగత్తునందు కనుపించె వినిపించే విన్ని సూర్య సోమాది రూపమైన విరాడ్రూపమును జనుడు ప్రత్యక్షముగానే జూచుచున్నాడు గదా! ఇందులో చూడ నలవి గాని ది యేమున్నదని చెప్పగూడదు. జ్ఞాన దృష్టితో అందరిని ఒక్కచోట చూచుట శక్యము గానిది యని యభి ప్రాయము॥ ౧౭॥

శ్లో॥ త్వ మక్షరం పరమం వేదితవ్యం ।
త్వ మస్య విశ్వస్య పరం నిధానం ।
త్వమవ్యయశ్శాశ్వత ధర్మగోప్తా ।
సనాతన స్త్వం పురుషో మతో మే॥ ౧౮

—• భా ష్య మ్ •—

ఏవ మపర మప్యతర్క్య మహిమత్వం తత్ర దర్శయ న్వ్యాశినష్టి। త్వమక్షరమితి। తత్ర తావత్ప్రణవాద్యక్షరంపరమం తద్వేదితవ్యం శివ మద్వైతం చ త్వమేవ తథాస్యవిశ్వస్య పరం నిధానం త్వమేవే త్యర్థః । అతఏవ త్వ మవ్యయో నిత్యశ్శాశ్వ తస్య వేదప్రతిపాద్యస్య ధర్మస్య గోప్తా తతఏవ సనాతనః పురు షోమతో విదితో మేసీతి పరమార్థః॥ ౧౮॥

—• ల ఘు టి ప్ప ణీ •—

ప్రణవాద్యక్షరమితి తదిదం వాచ్య వాచకయో ర్భదేతి యథో క్త రీత్యా యచ్ఛ్రితం తదిదం వేదకం ప్రమాణవాద్యాక్షరం తద్వేద్యంచ శివమద్వైతం దదర్శే త్యాద్య వధార్యం॥ ౧౮॥

—• ఆ న్ధ్ర తా త్ప ర్య ము •—

మరియొక ప్రకారముగా అచింత్య మహిమ భావమును వర్ణించు చున్నాడు. ప్రణవాద్య క్షరము ఉత్కృష్టమైనది. అదే తెలియదగినది॥శృతి, ప్రణవో హి ధను శ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే అప్రమత్తేన వేద్ధవ్యం శరవ త్తన్మయో భవేత్ అను శృతి ప్రకారము బ్రహ్మ ప్రాప్తికి ప్రణవము సాధనము యీ ప్రణవము వాచకమునూ మద్వైతమనెడి శివుడు వాచ్యమున్నూ నీవె సర్వభువనములకు దగిన యాధారము నీవే గనుక నే

నీవు అవ్యయుండవు. నిత్యుడవు. వేద ప్రతిపాదితమైన ధర్మమును రక్షించు వాడవు గనుకనే సనాతనుడవు. పురుషుడవని తెలుసుకుంటినని పరమార్థము (వాచ్య వాచకములకు భేదము రీతిచే యేప్రణవాద్యక్షరము వినబడ్డదో అట్టి వేదకమును అద్వైత శివ రూపమైన వేద్యమునున్నూ చూచెనని తెలియవలెను॥ ౧౮॥

శ్లో॥ అనాది మధ్యాంత మనంతవీర్య ।
మనన్త బాహుం శశిసూర్యనేత్రం ।
పశ్యా మిత్వాం దీప్త హుతాశవక్త్రం ।
స్వతే జసావిశ్వమిదంత పంతమ్॥ ౧౯

—♦ భాష్యమ్ ♦—

అథేహ యచ్ఛ్రీకృష్ణాయ మహాత్మనే మహావిశ్వ రూపం పరమశివేన దర్శితం తత్సదృశ మేతద్విశ్వరూప మత్ర బీజం స్పష్టమేవ దర్శయ న్నప్యాహ - అనాదీతి । తమాది మధ్యాన్త విహీన మేక మిత్యాది శ్రుత్యంతరాదితి భావః ఏవం 'చంద్రా ర్కా గ్ని విరోచన' మిత్యాది స్మృత్య న్తరాచ్చ దివ్యోహుతాశనో వక్త్రమిన నేత్రం యస్యత త్తథా స్వతేజసా చిదంబరాత్మనా విశ్వమిదం తపంత మిత్యర్థః॥౧౯॥

—♦ లఘుటిప్పణీ ♦—

తమాదీతి ! ఏవ మిహ యతాశ్రితమ స్తత్ర దివా న రాత్రి రిత్యాది శ్రుతిత్యా సవితు ర్వరేణ్య మిహోమా చిదంబరశక్తి రేవ కార్య కారిత్వేన సహాయస్యే త్యర్థః । ఏవం త్రీణి జాగ్రత్స్వప్న సుషుప్తే రూపాణి త్రీణి లోచనాని యస్య సత్రిలోచనః ఏవం నీలం మాయాఖ్య మజ్ఞానం కంఠే

ఏకదేశే యస్య స సదాశివ ఇతి తస్య విరాడ్రూపత్వ మప్యవగతం బోధ్యమ్॥ ౧౯॥

—• ఆంధ్ర తాత్పర్యము •—

పరమశివునిచేత మహాత్ముడైన శ్రీకృష్ణుని కొరకు విశ్వరూపము చూపించబడ్డది. దానితో సమానమైన యీవిశ్వరూపమును దీని బీజమును చూపించుచు పలుకుచున్నాడు. నిన్నే యాది మధ్యాంత రహితునిగను అనంత ప్రభావునిగను అనంతబాహునిగను సూర్య చంద్ర నేత్రునిగను దీప్తాగ్ని ముఖమువంటి తృతీయనేత్రము గలుగునట్లుగా చిదంబర స్వరూపమయిన నీతేజస్సుచేత నే భువనమంతయు దపించుచున్న వానిగను గనుచుంటిని (సృష్టిగాక పూర్వము దివా రాత్రి విభాగము లేకయున్న సమయమందు శివుడొక్కడె యుండెను. సూర్యునికి ప్రభవలె నే చిదంబర శక్తి కార్యమును జరుపుటకు సహకారిగా నుండెను. త్రిలోచనుడనగా జాగ్రత స్వప్న సుషుప్తి రూపమైన మూడు నేత్రములు గలవాడు। నీల కంఠుడనగా నీలమనగా మాయయనె అజ్ఞానము కంఠమనగా ఒక్క ప్రదేశమందు గల సదాశివుని యొక్క విరాడ్రూపమును జూపించినందున దెలిసినదని యభిప్రాయము॥ ౧౯॥

శ్లో॥ ద్యావా పృథివ్యో రిద మంతరంహి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః।
దృష్ట్వా ద్భుతం రూపమిదం తవోగ్రం।
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్॥ ౨౦

—• భాష్యమ్ •—

ఏవం ప్రకృతస్య విశ్వరూపస్య వ్యాప్తి మప్యాహ—ద్యావేతి। తత్ర తావద్ద్యావా పృథివ్యో రన్తర మన్తరిక్షం

యత స్త్వయైకేన వ్యాప్తం దిశశ్చ సర్వా వ్యాప్తా ఇత్యర్థః। తథా హే మహాత్మం స్తవా ద్భుతం రూప మిద ముగ్రం దృష్ట్వా లోకత్రయంచ ప్రవ్యథిత మత్య న్తం భీత మిత్యర్థః॥ ౨౦

—♦ లఘుటిప్పణీ ♦—

అత్య న్త భీతమితి॥ భీషాస్మా ద్వాతః పవతే భీషోదేతి సూర్యః భయాదగ్నిశ్చ వాయుశ్చేత్యాది శ్రుతి స్మృత్యంతరా దితి భావః॥౨౦॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఈ ప్రకృతమైన విశ్వరూపముయొక్క వ్యాప్తిని చెప్పుచున్నాడు. ఓ మహాత్మా! ఈ భూమ్యాకాశముల యొక్క మధ్యభాగమెల్లను దిక్కులెల్లను నీ యొక్కనిచేతనే నిండియున్నవి కదా! అబ్బురమును భయమును గలిగించునట్టి నీ స్వరూపముంగని మూడులోకములును భయపడియున్నట్లు కాంచుచుంటిని. (నీకు భయపడి వాయువు విసరుచున్నది. నీభయముచేతనే సూర్యుడుదయించుచున్నాడు. అగ్నియు ఇంద్రుడును పనులు చేయుచుండిరి. మృత్యువు నీకు ఝడిసి పారిపోవుచున్నది॥ ౨౦॥

శ్లో॥ అమీ హి త్వాం సురసంఘా విశన్తి ।
కేచిద్భీతాః ప్రాంజలయో గృణన్తి ।
స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధసంఘాః ।
స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః॥ ౨౧

—♦ భాష్యమ్ ♦—

ఇదానీంతు భూభార సంహార కారిత్వ మప్యాత్మనః ప్రకటయన్నాహ—అమీతి ॥ తత్రి తావదమీ సురసంఘా స్త్వాం. కేచిద్విశన్తి కేచిత్తు భీతాః సన్తః ప్రాంజలయో

గృణన్తి స్తువన్తి అథ కేచిత్స్వస్తీ త్యుక్త్వా మహర్షి సిద్ధసంఘా
స్త్వామేవ పుష్కలాభిః స్తుతిభిః స్తువన్తీ త్యర్థః॥ ౨౧॥

—◆ ఆంధ్ర తాత్పర్యము. ◆—

ఇప్పుడు భూభారము నంతను సంహరించుటను ప్రకటించుచు చెప్పుచున్నాడు. ఈ దేవతలెల్లరు భీతిం జెందినవారై గుంపులు గుంపులుగా నీశరణమును గోరుచున్నారు. వారిలో కొంతమంది దోసిలొగ్గి జయ శబ్దంబులతో రక్షింపుమని వేడుకొనుచుండిరి. ఇంకను మహర్షులు సిద్ధులు స్వస్తి వాచనంబుల నెక్కుడుగ స్తోత్రంబులచె స్తుతి సల్పుచుండిరి॥ ౨౧॥

శ్లో॥ రుద్రా దిత్యా వసవో యేచసాధ్యా।
విశ్వేఽశ్వినౌ మరుత శ్చోష్మపాశ్చ।
గన్ధర్వ యక్షా సుర సిద్ధసంఘా।
వీక్షన్తే త్వాం విస్మితా శ్చైవ సర్వే॥ ౨౨

—◆ భాష్యమ్ ◆—

ఏవమపరమప్యాహ—రుద్రా ఇతి। ఏవ మిహైకాదశేం ద్రియాధిపా రుద్రా స్తథాదిత్యా వసవః సాధ్యా దేవగణా స్తథాశ్వినౌ నాసత్య దస్రౌ మరుత స్తథోష్మపాః పితర స్తథా గంధర్వాదీనాం సంఘాశ్చ త్వామేవ సర్వే విస్మితాః సన్తో వీక్షన్త ఇత్యర్థః॥ ౨౨।

—◆ లఘు టిప్పణీ. ◆—

నాసత్యదస్రావితి॥ తత్ర తావన్నాసత్యం యస్యే త్యర్థే 'నభ్రాణ్న పాన్నాసత్యేతి' పాణిని సూత్రేణ ప్రకృతి భావేన సాధుః ఏవం

 

దసు మోక్షణ ఇత్యర్థే దసో రజ్ ప్రత్యయేన దస్ర స్తత్ర నాసత్యశ్చ దస్రశ్చేతి తావిత్యర్థః । ఉష్మపా ఇతి । తత్రోష్మణః పితృక్లేశా త్పాన్తి రక్షయ న్తీ త్యుష్మపాః పితర ఇత్యర్థః॥ ౨౨॥

## —♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

ఈప్రకారము పరిన్నీ చెప్పుచున్నాడు । ఏకాదశేంద్రియాధిపతులయిన ఏకాదశ రుద్రులు ద్వాదశాదిత్యులు అష్టవసువులు సాధ్యులు, విశ్వేదేవులు, అశ్వినీదేవతలు, మరుద్గణములు పితృదేవతలు, గంధర్వులు యక్షులు, రాక్షసులు, సిద్ధులు నాశ్చర్యమున నిన్నుం గాంచుచుండిరి॥ ౨౨

శ్లో॥ రూపం మహత్తే బహువక్త్రనేత్రం ।
మహాబాహో బహుబాహూరుపాదం।
బహూదరం బహుదంష్ట్రాకరాళమ్ ।
దృష్ట్వా లోకాః ప్రవ్యధితా స్తథాఽహమ్॥ ౨౩

## —♦ భాష్యమ్ ♦—

అథ లోకత్రయం ప్రవ్యధిత మిత్యుక్త ముపసంహరన్ స్వస్యాపి తదంతర్గతత్వేన వృత్తమాహ—రూపమితి । అత్రతు హే మహాబాహో బహువక్త్ర నేత్ర మిత్యాది విశేషణ విశిష్టం మహత్తే తవ రూపం దృష్ట్వా లోకాః ప్రవ్యధితా స్తథాఽహంచవ్యధిత ఇతి పరమార్థః॥ ౨౩॥

## —♦ లఘు టిప్పణీ ♦—

ప్రవ్యధితా ఇతి । తత్ర నలోకాః ప్రవ్యధితాః కిన్తు మమైవ తథా భాతీ త్యర్థః । అథవా ప్రత్యక్షలో యే లోకాః ప్రవ్యధితా స్తే త్వత్త ఏవేతి వార్థః॥ ౨౩॥

## —♦ ఆ ం ధ్రి తా త్ప ర్య ము ♦—

తరువాత మూడు లోకములు భయపడు చున్నవని చెప్పిన దానిని ఉపసంహరించుచు తానును లోకత్రయములో వాడగుటచే తన వృత్తాంత మునున్నూ జెప్పుకొను చున్నాడు. వాసుదేవా! పెక్కు మోములు నేత్ర ములు, చేతులు, తొడలు, పాదములు, కడుపులును గలదియు, పెక్కు కోరలచే భయంకర మైనదియు ఘన మైనదియు నైన నీ స్వరూప దర్శన మున జగంబులన్నియు నేనును మిగుల భీతిం జెంది చుంటిమి. లోకములు భయపడుట లేదు. మరేమంటె నాకట్లు తోచుచున్నది. అథవా ప్రత్యక్ష ముగా యేలోకములు భయపడుచున్నవో అవి నీవలన ఉత్పన్న మైనవే గదా॥ ౨౩॥

శ్లో॥ నభః స్పృశం దీప్త మనేకవర్ణం ।
వ్యాత్తాననం దీప్త విశాలనేత్రం ।
దృష్ట్వాహి త్వాం ప్రవ్యథితాంతరాత్మా ।
ధృతిం నవిన్దామి శమంచ విష్ణో॥ ౨౪

## —♦ భా ష్య మ్ . ♦—

ఏవమత్ర భయానకత్వమేవ ప్రపంచయతి । నభ ఇతి । తత్ర తావద్ధేవిష్ణో నభః స్పృశం దీప్తమనేకవర్ణ మిత్యాది విశేషణ విశిష్టం త్వాం దృష్ట్వా ప్రవ్యథితాన్తరాత్మా హం యతో ధృతిం ధైర్యం శమం శమత్వేన శాన్తించ నవిన్దామి ఇత్యర్థః॥ ౨౪॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

ఇహ విశేష గుణవత్త్వేన వ్యాపకత్వా దాహ—విష్ణో ఇతి ఏవంనానావ తారాణాం నిధానం బీజ మవ్యయమ్ యస్యాంశాంశేనసృజ్యన్తే దేవతిర్య జ్నరాదయ ఇత్యాది ద్రష్టవ్యమ్॥౨౪॥

—◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ◆—

భయంకరమని చెప్పుచున్నాడు. విశ్వ వ్యాపకుడవైన ఓ కృష్ణ అంతరిక్ష వ్యాపివి. తేజో యుతుండవు బహు వర్ణములు గలవాడవు తెరవబడిన నోరులుగల వాడవు ప్రకాశించునవియు విశాలములు నైన నేత్రములు గలవాడవు నైన నిన్నుంగాంచి భీతినొందని చిత్తము గలనేను ధైర్యశాంతులం జెంద లేకుండ నుంటిని. విశేషగుణములుండుటచే వ్యాపకుడని చెప్పుచున్నాడు. అనేకావ తారములకు ముఖ్యబీజమైన నీ యవతారము యెవని యంశలో అంశచే దేవ తిర్యక్ నరులు మొదలగువారు సృజింపబడుచుండిరో అట్టి యవతారమే నీవు. కృష్ణుడు శివుని యొక్క అంశలో అంశయని తెలియనగును ॥౨౪॥

శ్లో॥ దంష్ట్రా కరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానల సన్నిభాని ।
దిశో నజానే నలభేచ శర్మ !
ప్రసీద దేవేశ జగన్నివాస॥ ౨౫

—◆ భా ష్య మ్ ◆—

ఏవ మిహా మద్భయ ప్రదత్వేనా పరమపి వృత్తమాహ దంష్ట్రేతి । తత్రైవంసతి । హేదేవేశ జగన్నివాస దంష్ట్రా కరాళాని చ తే ముఖాని త్యాది దృష్ట్వా దిశోదిగ్విభాగాన్న జానే శర్మ సుఖంచ నలభ ఇత్యుపసంహార ప్రసీదేత్యర్థః॥౨౫॥

—◆ ఆన్ధ్ర తాత్పర్యము. ◆—

నాకు భయముగా నున్నది గాన మరొక సంగతిని చెప్పుచున్నాడు. ఓ దేవేశ! ఓ జగన్నివాస! కోరలచే భీతిని బుట్టించు నవియు, ప్రళయాగ్ని సదృశములు నగు నీ మోములం గాంచగానే నాకు దిశలు తెలియకుండ నున్నవి. సౌఖ్యముం జెంద జాలకుంటి ప్రసన్నుడవు గమ్ము చాలించుము॥ ౨౫॥

శ్లో॥ అమీచ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రా।
సర్వే సహైవా వనిపాల సంఘైః।
భీష్మో ద్రోణ స్సూతపుత్ర స్తథాసౌ।
సహాస్మదీయై రపి యోధముఖ్యైః॥ ౨౬

—◆ భాష్యమ్ ◆—

అథ పరమశివానుగ్రహా దర్జునేన సహ స్వస్యాపి జయం ప్రదర్శయ న్నాహ—అమీతి। తత్రైవంసతి। హేగుడాకేశ సర్వే ధృతరాష్ట్రస్య పుత్రా స్స్వవనిపాల సంఘైః సహ త్వామేవ విశన్తి ధావన్తీతి పశ్యామీ త్యర్థః। తత్ర న కేవలం దుర్యోధనా దయ ఏవ కిన్తు సర్వైః సంభావితో యోభీష్మ స్తథా ద్రోణః సూతపుత్రః కర్ణశ్చా స్మదీయై రపి పరకీయైరివ ధృష్టద్యుమ్నాదిభి ర్యోధముఖ్యై స్సహ త్వామేవ విశన్తీ త్యాశయః॥ ౨౬॥

—◆ లఘుటిప్పణీ ◆—

స్వస్యాపీతి ఏవమేవ రామచంద్రాయ సదాశివేనాపి దర్శితమ్। తద్యథా "రావణస్య సమం సైన్యం సుమ దంష్ట్రాకరాన్యథ। సంవిలగ్నా

న్యతో రామ పౌలస్త్యం జహిసాంప్రత'' మిత్యేకాదశ రుద్రారాధనోత్త
రం రామచంద్రస్యాపి జయో దర్శిత ఇత్యవధేయమ్॥ ౨౬॥

## —♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

పరమశివానుగ్రహమువలన అర్జునుడు తనకున్నూ జయమును జూపిం
చుచు చెప్పుచున్నాడు. ఎల్ల రాజులతోడను ధృతరాష్ట్ర కుమారులెల్ల
రును భీష్మ ద్రోణులును కర్ణ శిఖండి దృష్టద్యుమ్నలును మున్నగాగల
యోధ వరులు నిన్ను ప్రవేశించు చుండిరి. (అర్జునుడు తనకున్నూ జయ
మును జూపించుచు అనగా, రామావతారమందు సదాశివునిచే రాముని
కొరకు విశ్వరూపము జూపించ బడినది. అప్పుడు రామునితో సదాశివు
డిట్లు చెప్పెను. రామా, రావణ సైన్యము నాదంత స్థానములను ప్రవే
శించి యున్నది. ఇప్పుడు రావణుని సంహరించ గలవని చెప్పినట్లును
ఏకాదశ రుద్రుల నారాధించిన తర్వాత రామచంద్రునికి జయము గలిగి
నది గాన ఇప్పుడు నాకును జయమని యభిప్రాయము॥ ౨౬॥

శ్లో॥ వక్త్రాణి తే త్వరమాణా విశన్తి।
దంష్ట్రాకరాళాని భయానకాని।
కేచిద్విలగ్నా దశనాన్తరేషు।
సన్దృశ్యన్తే చూర్ణితై రుత్తమాంగైః॥ ౨౭

## —♦ భా ష్య మ్ ♦—

నను కథం జానామి మే మహాభారతే జయో భవి
ష్యతీత్యాహ। వక్త్రాణీతి తత్రైవం సత్యమీ యేధృతరాష్ట్ర
స్య పుత్రప్రభృతయ స్తే సర్వేపి దంష్ట్రాకరాళానిభయానకాని
యథాస్యు స్తథా త్వరమాణాని విశన్తీతి సంధృశ్యన్త ఇత్యర్థః

ఏవమేవ కేచిదుత్తమాంగై ర్దశనాంతరేషు విలగ్నా ఇవ సందృశ్యన్త ఇత్యతోఽపి తే జయఏవేతి సూచితం భవతీతి భావః॥ ౨౭

—♦ లఘుటిప్పణీ ♦—

తచ్చైవం సత్యేతావతాపి స్వస్య జయే సందిహానం ప్రత్యాహ। ఇత్యతో పీతి। యతో జయ పరాజయయో ర్విరాడ్రూపేణా ప్యవగమస్య ప్రమాణీ కృతత్వా దితిభావః॥ ౨౭॥

—♦ ఆంధ్రితాత్పర్యము ♦—

ఓయీ మహా భారతమందు జయమగునని నా కెట్లు తెలుసునంటే చెప్పుచున్నాడు. ఈ ధృతరాష్ట్రి పుత్రులు మొదలగు వారలు త్వరపడుచున్నవారలై కోరలచే భీతిని బుట్టించునవియు భయంకరములును నైన నీ మొగముల యందు బ్రవేశించుచుండిరి. ఇంకం గొందరు నీ దంతముల నడుమ దగులుకొనినవారై చూర్ణములైన తలలతోగూడిన వారై యగపడుచుండిరి. (ఇంతమాత్రముతో తనకు జయమందు సందేహించు వానిని గూర్చి చెప్పుచున్నాడు. యెందువల్ల ననగా జయ పరాజయములు విరాడ్రూపముచే తెలియుట ప్రమాణ మగుటవలన జయమె గలుగునని నిశ్చయము॥ ౨౭॥

శ్లో॥ యథా నదీనాం బహవోఽంబువేగాః ।
సముద్రమేవా భిముఖా ద్రవన్తి ।
తథా తవామీ నరలోక వీరా ।
విశన్తి వక్త్రాణ్యభితో జ్వలన్తి॥　　౨౮

—♦ భాష్యమ్ ♦—

నను చ కథం తే ప్రవిశన్తీత్యత్ర దృష్టాన్త మప్యాహ-యథేతి।ఏవం తర్హి యథా సముద్రగానాం నదీనాం విస్తరశోం

బువేగా జలాగాధం సముద్రమేవా భిముఖాద్రవన్తి తథామీ యోద్ధుకామా నరలోకవీరా విశ్వరూపస్య వక్త్రాణ్యేవా భిజ్వలన్తి ప్రకాశన్త ఇత్యాశయః॥ ౨౮॥

—♦ లఘుటిప్పణీ. ♦—

అభిజ్వలన్తీతి॥ ఇదంచ తవ విశ్వరూపేమమైవ ప్రతిభాతి నత్వన్యేషాం తేషాం జ్ఞానచక్షుషో ఉభావా దితి భావః॥౨౮॥

—♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

ఓయీ! యేప్రకారము వారుప్రవేశించుచున్నారనగా దృష్టాంతము నున్నా చెప్పుచున్నాడు. యేవిధమున ననేకములగు నదీప్రవాహములు ఎదురుగా బోయి సముద్రమునం గలియుచున్నవో ఆట్లె యీరాజులెల్లరును ప్రజ్వలించు చున్నట్లున్న నీముఖముల యందుజొచ్చుచుండిరి. (ఇదిన్ని నీ విశ్వరూప మందు నాకె కనుపించుచున్నది. ఇతరులకు జ్ఞానదృష్టి లేకపోవుట వలన కనుపించుట లేదు॥ ౨౮॥

శ్లో॥ యథాప్రదీప్తం జ్వలనం పతంగా।
విశన్తి నాశాయ సమృద్ధ వేగాః।
తథైవ నాశాయ విశన్తి లోకా।
స్తవాపి వక్త్రాణి సమృద్ధ వేగాః॥ ౨౯

—♦ భాష్యమ్ ♦—

ఏవం ప్రకారాన్తరేణాపి దృష్టాన్తమాహ । యథేతి తత్రైవంసతి యథా ప్రావృట్కాలే సమృద్ధ వేగాః పతంగాః ప్రదీప్త జ్వలనం స్వనాశాయ స్వయ మేవ విశన్తి తథైవైతే తవ విశ్వరూపస్య వక్త్రాణి విశన్తీతి మేప్రతిభాతీతి భావః॥౨౯॥

—◆ లఘుటిప్పణీ. ◆—

మే ప్రతిభాతీతి॥ ఏతేన భవత్సహ కారిత్వేన మమ జయోపి ప్రతి భాతీ త్యాశయః ౨౯॥

—◆ ఆంధ్రితాత్పర్యము ◆—

మరియొక ప్రకారముగా దృష్టాంతమును చెప్పుచున్నాడు। వర్ష కాలమందు తొందర పడుచున్నవై చచ్చుటకు మిడుతలు మండుచున్నట్టి వహ్ని జ్వాలయందెట్లు జొచ్చునో ఆవిధముగనే త్వరపడుచున్నవారై వీరెల్లరు చావుకొరకు నీముఖములం జొచ్చుచుండిరి. (ఇందువల్ల నీసహాయముచే నాకు జయము గలుగ వచ్చునని తోచుచున్నది)॥ ౨౯॥

శ్లో॥ లేలిహ్యసే గ్రసమానః సమన్తా।
　　ల్లోకా స్సమగ్రా న్వదనై ర్జ్వలద్భిః ।
　　తేజోభి రాపూర్య జగత్సమగ్రం।
　　భాస స్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో॥　　30

—◆ భాష్యమ్ ◆—

అథా దిత్యస్య గతాగతై రివ జగత్సర్వమపి త్వయ్యేవ విశ్వరూపే లేలిహానం దృశ్యత ఇత్యప్యాహ। లేలిహ్వస ఇతి। ఏవంసతీదానీం సమగ్రాన్ లోకా న్సమంతా జ్జ్వలద్భి ర్వదనై ర్గ్రసమానః సం స్త్వమేవ లేలిహ్యస ఇత్యర్థః। ఏవమిహా। హేవిష్ణో స్వతేజోభి శ్చిదంబరాభాసరూపై ర్జగత్సమగ్ర మా పూర్య భాస స్తవోగ్రాః ప్రతపన్తీతి పరమార్థః॥30॥

## —♦ ఆం ధ్ర తా త్ప ర్య ము . ♦—

సూర్యోదయ అస్తమయ ముల చేతనువలె సర్వజగత్తు విశ్వరూప మైన నీయందు ఆస్వాదించ బడినట్లు చూడబడు చున్నదనిస్నీ చెప్పుచు న్నాడు. ఇప్పుడు అన్నిలోకములను మండుచున్న ముఖములతో నలు దిక్కుల నుండి భుజించుచుంటివి. ఓ విష్ణో! చిదంబరాభాస రూపమునైన నీకాంతులచె లోకములను నిండించి నీయుగ్రకాంతులు తపింప జేయుచు న్నవి. (కాలో నయాతో వయమేవ యాతా స్తృష్ణా నజీర్ణా వయమేవ జీర్ణాః) అనునట్లు కాలము గడవలేదు. మేమేగడచిపోవు చుంటిమి. తృష్ణ జీర్ణముకాలేదు. మేమే జీర్ణమై పోతిమను నట్లు జగత్తు నంతను నీవే నాకి వేయుచున్నట్లు గనుపించుచున్నది॥ ౩౦॥

శ్లో॥ ఆఖ్యాహి మే కో భవా నుగ్రహరూపో ।
నమోస్తు తే దేవవర ప్రసీద ।
విజ్ఞాతు మిచ్ఛామి భవ న్త మాద్యం ।
నహి ప్రజానామి తవ ప్రవృత్తిమ్॥ ౩౧

## —♦ భా ష్య మ్ ♦—

నను యస్మా దేవం తస్మా త్కో భవానితి నజానీమ ఇత్యాహ।—ఆఖ్యాహీతి । తత్రైవం సతి హే దేవప్రవర ప్రసీద కో భవా నుగ్రరూపోసీ తి భవ న్త మాద్యం పురుషం విజ్ఞాతు మిచ్ఛామీతి నమోస్తుతే తుభ్యం యత స్తవ ప్రవృత్తిం నహి ప్రజానామీ త్యాశయః॥ ౩౧॥

## —♦ లఘు టిప్పణీ. ♦—

నమూగ్రోగ్ర శాసనా దేవభీతః॥ సూర్యో ప్యుదేత్యయం భీషాగ్ని ర్వాయు రిందశ్చ మృత్యు ర్ధావతి పంచమ ఇత్యాది శ్రుత్యా పరమశివ రూప మేవం శ్రుతం భవంతంతు దేవకీ సుతత్వేన సంబంధా న్మమ భ్రాతృత్వేనచ ప్రసిద్ధ ఇదానీం నజానేఽహ మిత్యభి ప్రేత్యాహ కో భవానితి పూర్వో పదర్శితా గ్ని నేత్రత్వేన సంశయా త్పృచ్ఛామీ త్యాశయః॥౩౧॥

## —♦ ఆంధ్ర తాత్పర్యము. ♦—

ఓయీ! ఈవిధ మెందువల్లనో అందువలన నీ వెవరవో తెలియమని చెప్పుచున్నాడు. కౌవున నింతభియంకరమగు రూపమాత్రో నున్న నీవెవ్వరవో నాకుందెలుపుము. నీకొక్కనమస్కారము దేవ దయ గల వాడవు కమ్ము. పురాణ పురుషుడ వగు నిన్ను చక్కగా నెరుంగ నెంచుచుంటిని ఎందుల కిట్లు చరించుచుంటివో యెరుంగ కున్నవాడను. నీయుగ్ర శాసనము వలన భయపడి సూర్యుడుదయించు చున్నాడు. అగ్ని వాయు, ఇంద్రుడు పనులు జేయుచున్నారు. మృత్యువు పరుగెత్తు చున్నది. గాన నిది పరమ శివరూపమిట్లు వినబడుచున్నది. నిన్ను దేవకీ సుతుడ వని నాకు సంబంధము వలన సోదర భావములో ప్రసిద్ధుడవై తివి. ఇప్పుడు నేనుయెరుగ ననే యభిప్రాయముతో చెప్పుచున్నాడు. ఇదివర కిచ్చిన అగ్ని నేత్రముచే సంశయము గలిగి నీవెవ్వరవని యడుగుచున్నాను॥

శ్రీ భగవాను వాచః—

శ్లో॥ లోకాస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో।
లోకా న్సమాహర్తు మిహ ప్రవృత్తః
ఋతేపి త్వాం న భవిష్యన్తి సర్వే।
యేవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥ ౩౨

—◆ భా ష్య మ్ ◆—

ఏవ మిహా ర్జునస్యా శంకామపి సమాధాతు మాహ- కాల ఇతి । తత్రతావ దిదానీం కాలః కాలతరో హర ఇత్యా ద్యుక్త్వా కాలస్సదాశివో హమస్మి నతు దేవకీసుత శ్రీకృష్ణో యతో లోక క్షయ కృత్ప్రవృద్ధః సన్ లోకాన్న మాహర్తుం ప్రవృత్త ఇత్యర్థః । యతశ్చ యే ప్రయత్నీనీకేషు ప్రకృత సైన్య వర్గేష్వవస్థితా యోధా యోద్ధుమిచ్ఛన స్తే సర్వేపి త్వామృతే నభవిష్య న్తి త్యాశయః॥ ౩౨॥

—◆ ల ఘు టి ప్ప ణీ◆ —

నతు దేవకీ సుత । ఇతి అతఏవో క్తం వోపదే వో క్తే భాగవతేపి । తద్యథా, 'మన్యే త్వాం కాల మీశాన' మిత్యాది ద్రష్టవ్యమ్॥ ౩౨॥

—◆ ఆ ం ధ్రి తా త్ప ర్య ము ◆—

శ్రీకృష్ణుం డిట్లనియె॥ అర్జునుని యొక్క శంకను సమాధానము చేయు కొరకు చెప్పుచున్నాడు. నేను లోకక్షయము కొరకు వృద్ధినందిన కాలుడనగు సదాశివుడను, దేవకీ సుతుండను గాను. లోకములను సంహ రింప నీలోకంబున జరించు చుంటిని. ఈసైన్య వర్గముల యందున్న యోధు లెల్లరును నీవు చంపకున్నను ఉండువారు కారు. (కాల మనగా ఈశాను డని యర్థమన్నట్లు భాగవత మందు ప్రమాణములు)॥ ౩౨॥

శ్లో॥ తస్మాత్త్వ ముత్తిష్ఠ యశోలభస్వ ।
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।
మయైవైతే నిహతాః పూర్వమేవ ।
నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్॥ 33

—◆ భా ష్య మ్ ◆—

తత్రైవం యస్మాదేవం వ్యాపార మంతరేణైవ యద్యేతే వినంక్ష్యన్త్యేవ। తర్హి జిత్వా వాలప్స్యసే మహీ మిత్యాది స్మర న్యుధ్యస్వే త్యాహతస్మాదితి। ఏవం తర్హీదానీం శత్రూన్జిత్వా సమృద్ధ మకంటకం రాజ్యం భుంక్ష్వ యశశ్చ లభస్వే త్యర్థః। యతః పూర్వమేవ మయైవైతే శత్రవ స్సదాశివ వర దానేనైవ నిహతా ఇత్యత స్త్వం సవ్యేన వామేనాపి హస్తేన శరాన్ సంధాతుం భవేతి నిమిత్తమాత్రత్వ మర్జునస్య స్ఫుటీ కృతమ్॥ 33॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

వరదానేనేతి। ఇహ పూర్వమేవ నరనారాయణయో ర్ధర్మస్య దక్షదుహితరీ త్యాదౌ తపశ్చరణస్యో క్తత్వా దితి తత్వమ్॥ 33॥

—◆ ఆం ధ్ర తా త్ప ర్య ము ◆—

యెందుకిట్లు చెయ్యవలె నంటె వ్యాపారము లేక వీరలు నశించరు జయించిన యెడల రాజ్యము నొందగలవని జ్ఞాపకముంచుకుని యుద్ధమును జేయుమని చెప్పుచున్నాడు, కాబట్టి నీవు యుద్ధ సన్నద్ధుడవు కమ్ము యశస్సు నందుము, విరోధుల మడియించి ఘనమైన అకంటకమైన రాజ్యము ననుభవింపుము. నీవు చంపక పూర్వమే సదాశివుని వరదాన ముచే చచ్చినట్లు భావింపుము, నీవు యెడమ చేతితో బాణములను సంధించిననూ సరే నిమిత్త మాత్రిముగా నుండుము। పూర్వమందు నరనారాయణులకు ధర్మమునకు దక్షకుమార్తె మొదలయిన వారలకు సదాశివుడు వరమిచ్చినట్లు చెప్పబడినది. అదన్నిగాక గుప్తవననాసమందు విష్ణుని

వరాహముగా చేసి తాను కిరాతరూపధారియై వచ్చి సామర్థ్యముం గనుకొని వరమిచ్చి పాశుపతాస్త్రము నొసంగె నని భారతము॥ ౩౩॥

శ్లో॥ ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ ।
కర్ణం తథాన్యానపి యోధముఖ్యాన్ ।
మయా హతాం స్త్వం జహి మావ్యథిష్ఠా ।
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్॥ ౩౪

—♦ భా ష్య మ్ ♦—

నన్వేతేషు ప్రబల వీరేషు సత్సు కథం శత్రూన్ జిత్వా రాజ్యం భోక్ష్యే కథంవా యశో లప్స్య ఇత్యాశంకాయా మాహ । ద్రోణంచేతి । తత్రైవం సత్యేతాన్ ద్రోణాదీన్ కథంభీష్మమహం సంఖ్యేద్రోణంచమధుసూదన ఇత్యాద్యాశంక విషయీ భూతాన్ సర్వానేవ యోధవీరాన్ కాలాత్మనా మయా హతానేవ త్వం జహి తత్ర త్వేవం హతానాం హననే కోస్తి తవ దోషః । కోవా పరిశ్రమ ఇతి మావ్యథిష్ఠా వ్యథాం మాకుర్వ్వత్యేవం రణే సపత్నా న్జేతాస్మీతి కృత్వా యుధ్యస్వే త్యాశయః॥ ౩౪॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నను యత్రి యోద్ధుంవా చాప్యనుచితం తత్రాపి షుభిః కథం యోత్స్యే౽హ మిత్యర్జునస్య హృదయగ్రంథిం నిరాకరోతి । తత్రైవం సతీతి । ఏవం సతి మయా హతానేవయది నహనిష్యే త్వ ర్హి తైరేవ హతే త్వయి కాకీ ర్తిః కింఫలం కీదృశో ధర్మఇత్యవధార్యమ్॥ ౩౪॥

—♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

ఓయీ! వీరలు ప్రబల వీరులగుచుండగా శత్రులను జయించి రాజ్యము నెట్లనుభవించ గలను? కీర్తినెట్లు బొందుదునని శంకయందు చెప్పుచున్నాడు. కాలరూపమగు సదాశివుడైన నాచే జంపబడిన ద్రోణ భీష్మజయద్రథ కర్ణులును దక్కిన యోధవీరుల నెల్లరిని శివ రూపమైన నాచే జంపబడినవారలనే నీవు జంపుము అందు నీకేమి దోషమున్నది? యేమి పరిశ్రమ యని వ్యథను బొందకుము యుద్ధమందు శత్రులను జయించితివని సాహసించి సంగరంబొనర్పుము (యెవరిపట్ల యుద్ధము వాక్కు చేతనైనను కూడదో అట్టి వారి యెడల నేను బాణములతో యుద్ధమెట్లు జేయునని యర్జునుని సంశయమును బోగొట్టుచున్నాడు। నేను చంపిన వారలనే నీవు చంపకుంటె వారంతట వారు చస్తె నీకేమికీర్తి యేమిఫలము యెక్కడి ధర్మము॥ 3౪॥

సంజయ ఉవాచః—

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య ।
కృతాంజలి ర్వేపమానః కిరీటీ ।
నమస్కృత్వా భూయఏ వాహ కృష్ణం ।
సగద్గదం భీతభీతః ప్రణమ్య॥　　3౫

—♦ భాష్యమ్ ♦—

అథైతద్వృత్తమపి సంజయేన ధృతరాష్ట్రాయ స్మారిత మిత్యాహ—ఏతత్ శ్రుత్వేతి । తథైవం సత్యేతత్పూర్వోక్తం కేశవస్య వచనం శ్రుత్వా కిరీటీ వేపమాన సస్మిత భీతశ్చసన్ భూయఏవ శ్రీకృష్ణం ప్రణమ్య సగద్గదం వచనం పునరాహే త్యర్థః॥ 3౫॥

## —♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

సంజయుం డిట్లనియె॥ ఈ వృత్తాంతమునున్నా సంజయుడు ధృత రాష్ట్రుని కొరకు చెప్పెనని చెప్పుచున్నాడు. ఈ విధంబుగ పలికిన శ్రీకృష్ణుని పలుకు లాలించి వణకుచు చేతులుమోడ్చి నమస్కరించి యర్జునుండు భీతినందుచున్నవాడై గద్గద స్వరముతో దిరుగ శ్రీకృష్ణుని నమస్కరించి తిరిగి పలుకు చున్నాడు॥ ౩౫॥

అర్జున ఉవాచః—

శ్లో॥ స్థానే హృషీకేశ తవప్రకీర్త్యా ।
జగత్ప్రహృష్య త్యనురజ్యతేచ ।
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి ।
సర్వే నమస్యన్తిచ సిద్ధసంఘాః॥ ౩౬

## —♦ భాష్యమ్ ♦—

నను తతః కిమాహే త్యాహ—స్థాన ఇతి । తత్రతావద్ధేహృషీకేశ । సర్వేంద్రియ ప్రవర్తక యతస్తవ ప్రకీర్త్యా ప్రకృష్టయా కీర్త్యా న కేవల మహమేవ ప్రవృష్యామి కిన్తు సర్వమేవ జగచ్చేతనమాత్రంరక్షోవిరోధి ప్రహృష్యతి యత్తత్ స్థానే యుక్తమిత్యర్థః । తథా సర్వజగదనురజ్యతే యత్తదపి తథా భీషాస్మా ద్వాతః పవత ఇత్యాది శ్రుత్యా రక్షాంసి భీతానిదిశో ద్రవన్తి యత్తదపి తథా సర్వేసిద్ధసంఘా నమస్యంతి! యత్తదపి యుక్తమేవే తి సర్వత్రా న్వయః॥౧౬॥

—♦ లఘుటిప్పణీ ♦—

తత్రైతావతాపి జయ పరాజయయోః స్సన్దిహానః ప్రభావం దృష్ట్వా నిశ్చయం చ మన్వాన ఆహ । తత్రతావదితి । ఇహ మూలే స్థాన ఇతి । సప్తమ్యంత ప్రతిరూపకం యుక్తార్థక మవ్యయం బోధ్యమ్॥ ౩౬॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

అర్జునుం డిట్లనియె॥ అటుతరువాత యేమని పలికెనంటె చెప్పు చున్నాడు. ఓ సర్వేంద్రియ ప్రవర్తకుడవైన కృష్ణా! నీ యుత్కృష్టమైన కీర్తిచేతను నేనొక్కడనె సంతసించుట కాదు. రాక్షసులకు విరోధియైన చేతనమాత్రమైనసర్వజగత్తు సంతసించుచున్నది. యుక్తమైసర్వజగత్తు అను రాగమునున్నూ బొందుచున్నది. అదిన్ని యుక్తమె రాక్షసులుభయపడి దిక్కులకు పారిపోవు చుండిరి. అదిన్ని మంచిదె. సిద్ధసంఘములన్నియు నమస్కరించుచున్నవి. అదిన్ని అనుకూలమె యని భావము॥ (ఇంతమాత్ర ముచే జయపరాజయముల యందు సందేహించుచు ప్రభావమును జూచి నిశ్చయమని తలచుచున్నాడు॥ ౩౬॥

శ్లో॥ కస్మాచ్చ తేన నమేర న్మహాత్మన్ ।
గరీయసే బ్రహ్మణో ప్యాదికర్త్రే ।
అనంత దేవేశ జగన్నివాస ।
త్వమక్షరం సదస త్తత్పరం యత్॥ ౩౭

—♦ భాష్యమ్ ♦—

నన్వేవం భృగు వశిష్ఠ గర్గాదేశ్చ విష్ణో ర్గురుత్వేన కథం సిద్ధాది పూజ్యత్వం తస్యేతి విస్మయం పరిహార న్నేవదస్తౌతి వ త్పరమశివ స్వరూపత్వేన శ్రీకృష్ణం స్తౌతి । కస్మాచ్చేతి ।

తత్త్రివంసతి। పరమశివ రూపఏవా హాంగిరో పాసనయా భవాం స్త్వర్హి కస్మాచ్చ హేతో స్తే తుభ్యం భృగ్వాది సిద్ధ సంఘా న నమేర న్నిత్యర్థః। యతశ్చ సర్గా త్పురా నిరాలోకం నిర్మలం నిష్కలం పరం చిదానందమయం జ్యోతి స్స ఆద్యః కేవలః శివః సఏవాదా రజో రూపం సృష్ట్వా బ్రహ్మాణ మాత్మనా సృష్టి కర్మ నియుక్తాయ తస్మై వేదాంశ్చ దత్త్వా నిత్యాది స్మృత్యా బ్రహ్మణో ప్యాతి కర్త్రే పరమ శివాయ నమస్కార ప్రయోజ్యాయ గరీయసే హేమహాత్మన్ కస్మాచ్చ త్వాం సదాశివరూపం సిద్ధాదయో న నమేరన్ని త్యర్థః। యతశ్చ హేదేవదేవేశా నన్త జగన్నివాస సదసద్భ్యాం పరం మూలకారణం యదక్షరం బ్రహ్మ పరమశివాఖ్యం తత్త్వమేవేతి సర్వాధిష్ఠానత్వాత్ త్వద్భిన్నం కిమపి నాస్తీత్యర్థః॥ ౩౭॥

—♦ లఘు టిప్పణీ ♦—

ననుచ "ఉపమన్యుస్తు కృష్ణస్య గర్గస్త్వస్తి పురోహితః పాదావనేజనై ర్గేహం సించనీయం తయోః" ఖల్వితి పూర్వమేవో క్తత్వా త్కథ మిదానీం సర్వైః పూజ్యత్వం కృష్ణస్యే త్యాశంకతే॥ నన్వేవమిత ఏవం తర్హి "కృష్ణఏవహి యష్టవ్యో యజ్ఞై శ్చైవ సనాతనం పూర్వ రూపం శివం జ్ఞాత్వా లింగే యోర్చయతి ప్రభు" మితి స్మృతిన్యాయేన శైవం పాశుపతమత్వా పూజనీయ ఇత్యాశయః॥ ౩౭॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఓయీ! విష్ణువునకు భృగువశిష్ఠ గర్గాములు గురువులగుటచేనతనిని భృగ్వాదిసిద్ధు లెందుకు పూజించెదరనే యాశ్చర్యమును పరిహరించు వేదస్తో

త్రమువలె పరమ శివ రూపమగుటచే శ్రీ కృష్ణుని స్తోత్రము చేయుచున్న
ది. నీవుఅహంగిరో సాసనచే పరమశివ రూపముగలవాడవై అయినయెడల
భృగ్వాది సిద్ధసంఘములు యెందువలన నీకొరకు నమస్కరించరు. సృష్టికి
పూర్వమందు లోకములు లేవు. నిర్మలము నిష్కళమున్ను అయి చిదానం
దరూపమైన పరంజ్యోతి రూపమయినశివుడు మాత్రమే మొదటివా
డు. ఆశివుడే, మొదట ఆత్మచే రజోరూపమైన బ్రహ్మను సృష్టించి
ఆతనికొరకు వేదముల నిచ్చి సృష్టి చేయుమని నియోగించెను.
గనుక బ్రహ్మకున్ను ఆదికర్తయైనట్టిన్ని నమస్కరించ తగిన
(వంద్యత్వే నిగమాః) నమో హిరణ్య బాహవ ఇత్యాద్యవధార్యం
ఈశ్వరునకె నమస్కారము చేయవలయు నని వేదములు సాక్ష్యములు గా
నున్నవి.) గొప్పవాడైన పరమశివునికే నమస్కార యోగ్యత గలదు.
ఓ మహాత్మా! అట్టి సదాశివ రూపమైన నిన్ను సిద్ధాదు లెందు కు
నమస్కరించరు? హే దేవేశ! జగన్నివాస! సత్తు కన్నను అసత్తు
కన్నను పరమైనట్టిన్ని మూల కారణమై నట్టి నాశరహితమైనట్టిన్ని
పరమశివు డను పేరు గల ఆ బ్రహ్మము నీవే. సర్వపదార్థముల
యందు వ్యాపించి యున్నందున నీ కంటె భిన్నమైనది యేదియు
లేదని యర్థము (ఉపమన్యువు కృష్ణునికి గురువు, గర్గముని పురోహితుడు
వీరియొక్క పాదప్రక్షాళన జలముచె గృహము శుద్ధి చెయ్య వలయును
గదా? కృష్ణునకు సర్వులు పూజించుట యెట్లు అనెశంకకు సమాధానము
కృష్ణుడె యజ్ఞములచే పూజనీయుడు. మొదటి వాడైన శివుని లింగమందు
పూజించుచున్నాడు గాన పూజ్య పూజకులకు భేదము లేనందున పూజ
నీయుడు॥ శ్లో॥ పూజ్య పూజకయో! ర్భేదం వివృణ్వానో నరాధమః ।
ప్రయాతి నరకం ఘోరం యావదాభూత సంప్లవం॥ ౩౭॥

శ్లో॥ త్వమాదిదేవః పురుషః పురాణ ।

త్వ మస్య విశ్వస్య పరం నిధానం ।

వేత్తాసి వేద్యం చ పరంచ ధామ।
త్వయా తతం విశ్వ మనన్తరూప॥ ౩౮

—♦ భా ష్య మ్ ♦—

తథైవ పరమశివ తాదాత్మ్యేనైవ పునరప్యాహ।త్వమాదీతి। తదేనంసతి సర్గాత్పురే త్యాది యథోక్త రీత్యాజగతాం త్వమేవా దిదేవః 'పురుషో హవై రుద్ర' ఇత్యాది శ్రుతివేద్య సహస్ర శీర్షే త్యనేన గీయమాన శ్చ త్వమేవ పురుషః పురాణోఽస్య జగతో నిధానం లయస్థాన మిత్యర్థః। యతశ్చ త్వమనన్తరూప స్తతఏవ త్వయా విశ్వం తత స్తథా జగతామ్వేత్తా వేద్యం తత్పరంచ ధామ త్వమేవే త్యర్థః॥౩౮॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

లయస్థానమితి। త్రతాతమ స్తత్రి దివా న రాత్రి రిత్యాది శ్రుతేరితి భావః॥ ౩౮॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

అట్లుగానె పరమ శివ తాదాత్మ్యముచే మళ్లీ చెప్పుచున్నారు॥ సృష్టికి పూర్వమందున్నవాడవు గనుక జగత్తులకు ఆదిదేవుడవు నీవే. పురుష సూక్తమునందును ఇతర శృతులయందును ప్రతిపాద్యమైన పురుషశబ్దము రుద్రపర్యాయము గనుక పురాణ పురుషుడవు నీవే. యీ జగంబునకు లయస్థానమునీవే. యీ జగంబంతయు నెరిగినవాడవు నీవే. యేది పరమ పదమో అది నీవే. అనంతరూపుడవగు నీచే నీజగంబెల్ల బరిపూర్ణమై యుండెను. (దివా.రాత్రి) విభాగము లేనప్పుడున్నవాడు శివుడు. అట్టి శివుడవు నీవే) శైవంకేవల శాంతం ప్రణమత గోవిందం పరమానందం॥ అను స్మృతినిబట్టి నీవు శివరూపమని భావము॥ ౩౮॥

శ్లో॥ వాయు ర్యమో ౾గ్ని ర్వరుణః శశాంకః।
ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ।
నమో నమస్తే స్తు సహస్ర కృత్వః।
పునశ్చ భూయోపి నమో నమస్తే॥ ౩౯

—♦ భాష్యమ్ ♦—

ఏవమస్య రూపేణాహ— వాయురితి, ఏవంసతి త్వమర్క- స్త్వంసోమ ఇత్యాది స్మృతిన్యాయేనవాయుర్యమో౾గ్ని రిత్యాది సర్వం త్వమేవేతి కృత్వానమో నమస్తే తుభ్య మస్తు పునశ్చభూయో నమో నమస్తే స్త్విత్యర్థః ౩౯।

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఈ ప్రకారమే మరియొక రూపముతో చెప్పుచున్నాడు. వాయువు యముడు అగ్ని వరుణుడు చంద్రుడు పితామహ ప్రపితామహులు వీరెల్ల రు నీవే. కాబట్టి యిటువంటి నీకు వేయి పర్యాయములు నమస్కరించు చుంటిని. తిరుగనమస్కరించుచుంటిని.మరియునమస్కరించుచుంటిని.॥ ౩౯॥

శ్లో॥ నమః పురస్తా దథపృష్ఠతస్తే।
నమోస్తుతే సర్వ తఏవసర్వ।
అనన్త వీర్యామితవిక్రమ స్త్వం
సర్వం సమాప్నోషిత తో౾సి సర్వః। ౪౦

—♦ భాష్యమ్ ♦—

అథ తద్దూరే తద్వదన్తికే తను సర్వస్య బాహ్యత ఇత్యాది శ్రుతివేద్య తయా శివమద్వైతం దర్శయ న్నునరాహ

నమఇతి తత్రైవం సతి తే తుభ్యం పురస్తా దథ పృష్ఠతశ్చ నమోస్తు తథైవ సర్వత స్సర్వాసుదిక్షుస్థితాయ హేసర్వవీర్యో ప్యమితవిక్రమ స్త్వంసర్వం జగత్సగమ్యగాప్నోష్య తస్సర్వ స్త్వ మసీతి త్వదతిరిక్తం కిమపి నాస్తీత్యర్థః॥ ౪౦॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

అధేతి।తత్రితావదో న్తస్సదితినిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతఇతిస్మృతేస్త దిత్యుపలక్షితంసకలాధిష్ఠానం చైతన్యం దూరే ఏవం తదేవ చైతన్య మునామ శివమంతికే ఏవ మేవం తమనామ శివం సర్వస్యపదార్థజాతస్య బాహ్యత ఇతిమంత్రార్థః॥౪౦॥

—◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ◆—

శృతి ప్రమాణముచె అద్వైతమైన శివుని చూపించుచు తిరిగి చెప్పు చున్నాడు. కృష్ణా ! ముందరను వెనుకను నమస్కరించు చుంటిని. సకల దిశల యందును, నమస్కరించు చుంటిని. నీవనంత వీర్యము గలవాడవు. మితిలేని పరాక్రమము గలవాడవు. ఇట్టి నీవు భువన మెల్ల నిండి యుం టివికావున సర్వ స్వరూపుడవు బ్రహ్మ వాచకమైన పదములు ఓం-తత్- సత్ - అని మూడు, తత్, అనగాసకలమునందున్న చైతన్యము-దూరమం దున్నది. అదేచైతన్యము. ఉ. అనెడి శివుడు సమీపము (తనయందు) ఈప్రకారమె - తత్. ఉ - అను శివుడు సర్వ పదార్థములకు బాహ్య మందున్నాడని మంత్రార్థము. సర్వ వ్యాపకమైన పరమాత్మ జీవరూప ముగా తనయందుండి యీరెండును ఏకమై దేహ త్రయమునకు బాహ్యము నందుండెనని యభిప్రాయము॥ ౪౦॥

శ్లో॥ సఖేతి మత్వా ప్రసభం యదుక్తం।
హేకృష్ణ! హేయాదవ! హేసఖేతి।

అజానతా మహిమానం తవేదం ।
మయా ప్రమాదాత్ప్రణయేన వాపి॥ ౪౧

—♦ భా ష్య మ్ ♦—

అథచ శివధ్యానా ర్చన జ్ఞానా చ్ఛివరూపోసి నతు దేవకీ సుతత్వేన విష్ణు రిత్యత స్సమకక్షత్వేనమన్యమానం మాం క్షమస్వే త్యాహ। సఖ ఇతి ఏవంసతి । హేకృష్ణ హేయాదవ తవ మహిమానం పరమశివైక్య తాదాత్మ్య లక్షణ మజానతా మయా ప్రసభం బలాత్ వచనం యదుక్తం తత్సర్వం సఖేతి మత్వా ప్రణయేన స్నేహేన క్షమస్వే త్యాశయః॥౪౧॥

—♦ ల ఘు టి ప్ప ణి. ♦—

నను యథా తుష్టః పినాకీ దశభి శ్శిరోభి స్తుష్టోనచైకాదశమో హి రుద్రి ఇత్యాద్యుక్త్యైతథా 'హనూమ న్నంజనీనూనో వాయుపుత్రి మహా బల । సర్వ సంకష్ట హరణ విపత్తౌ శరణం భవే త్యాది రామచంద్రోక్త్యా చ హనూమతః స్వామిత్వం తథేహాపి కృష్ణస్య స్వామిత్వే స్థితే కథం తస్యే హా ర్జునసేవ్యకత్వ మిత్యాశంకాం నిరాకుర్వ న్నాహ । సఖేతి మత్వేతి। తద్యథా, 'సంకటే సమనుప్రాప్తే త్రియ స్తే సహాకారిణః । స్వామిన స్సేవకా శ్చైవ సఖాయ శ్చేతి నాన్యథే త్యాది ద్రష్టవ్యమ్॥౪౧॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓకృష్ణా! శివ ధ్యానము వలనను శివపూజన వలనను శివజ్ఞానము వలనను శివరూపుడవే నీవు. దేవకీ సుతుడవైన విష్ణువుగావు. అందువలన నాతో సమానుడవని తలంచి నందునన్ను క్షమించుమని చెప్పుచున్నాడు. పరమశివ తాదాత్మ్యతారూపమైన నీమహిమ నెరుంగకమిత్రుండవని యెంచి ప్రమాదము

వలన గాని మైత్రి వలనగాని కృష్ణా! యాదవా మిత్రమా యని పిలచితిని దానిని క్షమింపుడు (ఈశ్వరుడు రావణుని పదిశిరములు హోమము చేయుటచే సంతుష్టుడయ్యెను (ఏకాదశ రుద్రులలో పదిమంది సంతసించిరి. పదకొండవ రుద్రుడు సంతసించలేద నెడి స్మృతి చేతనున్నా॥ ఓ హనుమన్ ఆంజనిపుత్ర వాయుపుత్ర మహాబల సకల కష్టములను పోగొట్టువాడా. ఆపత్తునందు రక్షింపుమని రాముడు పలుకుటచే హనుమంతుడు స్వామియై యెట్లుండెనో ఇక్కడనున్నా కృష్ణుడు స్వామియైతే అర్జునుకు సేవకుడుగా నెందుకుండె నను శంకను నిరాకరించుచున్నాడు. ఆపద లొచ్చినప్పుడు స్వామి సేవకులు మిత్రులు యీముగ్గురు సహకారులగుదురు. మరియొకరుగారు॥ఇత్యాది ప్రమాణములు గలవు॥౪౧॥

శ్లో॥ యచ్చావహాసార్థమసత్కృతోఽసి ।
విహారశయ్యాసన భోజనేషు ।
ఏకోఽథవాప్యచ్యుత తత్సమక్షం ।
తత్ క్షామయే త్వా మహమప్రమేయమ్॥ ౪౨

—♦ భాష్యమ్. ♦—

ఏవమేవ ప్రకారాంతరేణాప్యాహ । యచ్చేతి । ఇహైవం సతి యదప్యవహాసార్థం మయా విహార శయ్యాసన భోజనేష్వే కాక్యథవా సఖీనాం పరిహసతాం సమక్షంవా త్వాం శివాత్మకత్వేన హే అచ్యుత యదసత్కృతోఽసి తత్సర్వ మప్రమేయ మపరాధజాతం క్షామయే క్షమస్వేతి త్వాం ప్రతి నివేదయామీ త్యాశయః॥ ౪౨॥

—♦ లఘుటిప్పణీ. ♦—

శివాత్మకత్వేనేతి॥ యతశ్చకామ దహనత్వా చ్ఛివాత్మ కత్వేనా చ్యుతత్వమిత్యాశయః॥౪౨॥

—♦ ఆస్థ్రతాత్పర్యము ♦—

మరియొక ప్రకారము చెప్పుచున్నాడు ఇంకను సంచరించు నపుడు పరుండు నపుడు కూర్చుండునపుడు తినునపుడు ఒంటిగా నుండునపుడు కోడిగంబుసేయు మిత్రుల నడుమను వేళాకోళముగా నిందించితిని. నీవు శివ స్వరూపమగుటచె అచ్యుతా అటువంటి నాయపరాధంబు లెల్ల క్షమింప వలయునని చింతింప శక్యముగాని ప్రభావము గల నిన్ను వేడు కొను చుంటిని (శివునికి అచ్యుతా యనే పేరు యెట్లనగా మన్మథుని భ స్మంచేసిన వాడు చ్యుతి లేని వాడుగనుక అచ్యుతుడనగా శివుడేయని య ర్థము॥౪౨॥

శ్లో॥ పితాసి లోకస్య చరా చరస్య।
త్వమస్య పూజ్యశ్చ గురు ర్గరీ యాన్।
నత్వత్సమో స్త్యభ్యధికః కుతోన్యో।
లోకత్రయే ప్యప్రతిమ ప్రభావ॥ ౪3

—♦ భాష్యమ్ ♦—

అథ పరమశివైక్య తాదాత్మ్యేనా హంగిరోపాసనయా మహాదేవం చిదాకాశం గుహూనాం ప్రథమం గురు మిత్యాది స్మృత్యాచ బ్రహ్మాది ద్వారా సర్వ జనకత్వాచ తవైవేత్యా హ పితాసీతిఏవం సతి చరాచరస్య త్వమేవాస్య లోకస్య

సర్వాధిష్ఠానత్వేన పూజ్యో గరీయాన్ గురుశ్చేతి పరమశివైక్య తాదాత్మ్యేన విజానామీత్యర్థః ౪౩॥

## —♦ లఘుటిప్పణీ ♦—

పరమశివైక్యేతి । స్వతస్తు సర్వథా సర్వతః పరత్వేన శివస్యైవ గరీయస్త్వేన గురుత్వమితి రాజాధిరాజ స్సర్వేషాం త్ర్యంబక స్త్రిపురాంతకః । తస్యైవా నుచరాస్సర్వే బ్రహ్మ విష్ణు సురాదయః ఇత్యాదిపాద్మ స్కాందయోః బహుశో ద్రష్టవ్యమ్॥ ౪౩॥

## —♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

తరువాత అహంగ్రహోపాసనచే పరమశివ తాదాత్మ్యముతో చిదంబర రూపుడైన మహాదేవుడు గురువులలో మొదటి గురువనెడి స్మృతినిబట్టి అందరికి జనకుడవు నీవే యని చెప్పుచున్నాడు. ఉపమానరహిత ప్రభావముగల వాసుదేవా! ఈ చరాచర భువనంబునకు నీవే తండ్రివి, పూజ్యుడవు, ఘన గురుండవు. చరాచరంబైన యీలోకమునకు సర్వాధిష్ఠానమగుటచే పూజ్యుడవు, గొప్పవాడవు, గురుడవు అని పరమశివునియందైక్యరూపముతో తెలియుచున్నాను॥ నీకు తుల్యుడు లేనపుడింక గొప్పవాడెట్లుండును. (శివుడు స్వయముగా అన్నివిధములచేతను అంతటను పరుడగుటచే శివుడే గొప్పవాడగుటచే గురుత్వమని॥ శ్రుతి॥ రాజాధిరాజాయ॥ స్మృతి॥ రాజాధిరాజ స్సర్వేషాం త్ర్యంబక స్త్రిపురాంతకః తస్యైవానుచరాస్సర్వే బ్రహ్మ విష్ణు సురాదయః॥ అనే పద్మపురాణ వచనము చేతనున్నూ, శివుడు త్రినేత్రుడు త్రిపురహారియు గనుక రాజాధిరాజనిన్నీ, అట్టి (మహారాజాయనః అను శ్రుతిని బట్టి మహారాజునకు బ్రహ్మ, విష్ణు, సురలు, అనుచరులని పద్మపురాణ స్కాందపురాణముల యందనేకచోట్ల చూడదగును॥ ౪౩॥

శ్లో॥ తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం ।
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్ ।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ।
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్॥౪౪॥

—♦ భా ష్య మ్ ♦—

అథ యస్మాదేవం తస్మాత్సర్వ భావేన త్వామేవ ప్రసాదయామీ త్యాహ । తస్మాదితి । ఏవం త్వర్హి మన్యే త్వాం కాలమీశాన మనాదినిధనం విభు మిత్యాది స్మృతి న్యాయేన త్వామేవ సదాశివ రూప మీశమీడ్యం కాయం ప్రణిధాయ ప్రసాదయే యత స్త్వామేవ పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియాయ చ ప్రియశ్చత్వమేవార్హసి మమా పరాధం సోఢు మిత్యన్వయః॥౪౪॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

యెందుకు నీయెడల యపరాధము జేసితినో అందువలనఅన్ని విధముల చేతను నిన్ను ప్రసాదింప చేసుకుంటున్నాను. ఆద్యంతములు లేనట్టిన్ని కాలస్వరూపుడైన ఈశానుడవనియెడి స్మృతిని బట్టి సదాశివ రూపమైన-స్తుతింపదగిన, శివుడవైన నిన్ను గూర్చి సాష్టాంగ నమస్కారము లొనరించి నేను నిన్ను ఉయగలవానినిగా నొనర్చు కొనుచుంటిని. పుత్రుని యపరాధమును తండ్రి వలెను. స్నేహితుని యపరాధమును స్నేహితునివలె నున్నూ. ప్రియుని యపరాధమును ప్రియునివలెనున్నూ నాయపరాధమును శ్రీ సహించుటకు తగుదున్నావు॥౪౪॥

శ్లో॥ అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా।
భయేనచ ప్రవ్యథితం మనో మే।
తదేవమే దర్శయ దేవరూపం।
ప్రసీద దేవేశ జగన్నివాస॥ ౪౫

—♦ భా ష్య మ్ . ♦—

ఏవమిహ విశ్వరూపోపసంహారేణ పునరపరాధం క్షమాపయ న్నేవాహ—అదృష్టపూర్వమితి । తత్రైవాసతి పూర్వ మదృష్టం విశ్వ మత స్తద్రూపం దృష్ట్వా హృషితోఽహ మస్మి పరన్తు తత్ర వికృతరూప దర్శన జన్యేన భయేన ప్రవ్య థితం మనో మే తతశ్చ ప్రాచీన మేవ సౌమ్యం రూపం మే దర్శయ హేదేవ దేవేశ సదాశివ హేజగన్నివాస ప్రసీదే త్యర్థః ౪౫॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

విశ్వరూపమును చాలింపుమనిన యపరాధమును క్షమింపుమని మళ్ళీ కోరుచున్నాడు, దేవా యెప్పుడుం గనని నీరూపముం గని సంతసించితి మరేమి యనగా వికృత రూపమును జూచుటచే జనించిన భయముచె నా మనస్సు జలించినది. కాబట్టి నీపూర్వ రూపమునె చూపింపుము. ఓదేవా దే వేశ సదాశివ జగన్నివాస ప్రసన్నుడవుకమ్ము॥ ౪౫॥

శ్లో॥ కిరీటినం గదినం చక్రహ స్త।
మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ।
తేనైవరూపేణ చతుర్భు జేన।
సహస్ర బాహో భవ విశ్వమూర్తే॥ ౪౬

—♦ భా ష్య మ్ ♦—

నస్త్వేవం త్వత్తః కీదృశం తద్రూపం ధారయామీత్యాహ-కిరీటినమితి, అతశ్చాభయప్రదేన తేనైవ రూపేణ చతుర్భుజత్వేన వాసుదేవాత్మజత్వేనవా హేదేవ సహస్రబాహో భవేతి తదేవ కిరీటిన మిత్యాది లక్షణలక్షితం త్వాం ద్రష్టుమిచ్ఛామీత్యర్థః॥ ౪౬॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ! యెటువంటి రూపమును ధరించు చున్నానంటె చెప్పు చున్నాడు. పూర్వపు రీతినె భయము లేనట్టి కిరీటము, గద, చక్రమున్నూ గలిగి చతుర్భుజ యుక్తమైన రూపమును గాని వసుదేవ పుత్ర రూపమును గాని గనుంగొన నెంచుచుంటిని. వేయి చేతులు గలవాడవును విశ్వరూపుండవు నగు నోకృష్ణా నాల్గుచేతులు గల రూపముతోనె యగుపడుము॥౪౬॥

శ్రీకృష్ణ ఉవాచ—

శ్లో॥ మయా ప్రసన్నేన తవార్జునేదం ।
రూపం పరం దర్శిత మాత్మయోగాత్ ।
తేజోమయ మ్విశ్వ మనంత మాద్యం
యన్మే త్వదన్యేన నదృష్టపూర్వమ్॥ ౪౭

—♦ భా ష్య మ్ ♦—

ఏవమిహార్జునేన ప్రసాదితో విష్ణు ర్భయబాధితేన వచసా త్వాహ మయేతి । తత్రైవంసతి హే అర్జున మాభైషీ ర్యతో మయా ప్రసన్నేన విశ్వరూపం ద్రోణపర్వస్థం శైవేన మహత

పసా లబ్ధమితి శివప్రధానం పరమం యోగం విద్ధి ధనంజయ ఇత్యాది వచస్యత్ర భారతేష్యుక్తత్వా దితి భావః । తస్మా త్కేనా ప్యదృష్ట పూర్వం విశ్వరూపం భవతే నుగ్రహాదేవ దర్శిత మిత్యాశయః॥౪౭॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నను పూర్వం విశ్వరూపే ప్రియాప్రియత్వేనో భయ మపి దర్శిత మిదానీం తు'మత్స్యః కూర్మో వరాహశ్చ బౌద్ధః కల్కిచ వామనః । రామః కృష్ణో నృసింహశ్చ పరశురామో దశాకృతా' । ఇత్యాద్యవతారే ష్వపి కేన రూపేణ వాంఛసీ త్యభిప్రేత్యాహ । అత శ్చేత । ఏవంసతీదానీ మనేనైవ రూపేణ వాంఛామీతి తద్దర్శయే త్యాశయః॥౪౭॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

శ్రీకృష్ణుం డిట్లనియె: భయముతో గూడిన వాక్కుతో అర్జునునిచే ప్రసాదింప బడిన విష్ణువు పలుకుచున్నాడు. ఓ అర్జునా ! భయపడకుము. నీవిషయమై ప్రసన్నుండనై ద్రోణ పర్వము నందు శివసంబంధమగు మహా తపముచే లబ్ధమైనదానినినీకొరకుచూపించితిని. దీనినిశివప్రధానమైనఉత్కృష్టయోగమునుగా తెలుసుకొనుము. నీవుగాక యితరులు కని యెరుంగని విశ్వరూపమును గనపరచితిని. ఓయీ! ముందుగా విశ్వరూపమందు మంచి చెడుగులు రెండును గనపరచితిని. ఇప్పుడు మత్స్య, కూర్మ, వరాహ. బౌద్ధ, కల్కి, వామన, రామ, కృష్ణ, నృశింహ, పరశురామ. ఇవి దశావ తారములు. ఇందులో యేరూపము రావలె నని యడుగగా పూర్వ రూప మునే కోరుచున్నాను. దానినె జూపుము॥౪౭॥

శ్లో॥ నవేద యజ్ఞా ధ్యయనై ర్నదానై।
ర్నచ క్రియాభి ర్నతపోభి రుగ్రైః ।

ఏవం రూపశ్శక్యఅహం నృలోకే ।
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర॥　　౪౮

—♦ భా ష్య మ్ ♦—

అథ పరమశివ ప్రసాదేన లబ్ధ మిదం విశ్వరూప మతి దుర్లభం భవతే దర్శిత మిత్యాహ । నవేదేతి । తత్రైవం సతి। హే కురుప్రవీర యదేత ద్విశ్వరూపం తే దర్శితం తదజ్ఞా ధ్యయనైరపి యత్నై స్త్వదన్యేన నద్రష్టుం శక్యమిత్యర్థః। ౪౮॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నను కో౽స్తి సర్వతఃప్రబలో దేవో యత్ప్రసా దాల్లబ్ధం త్వయా మమాపి దర్శిత మిత్యాహ-అథేతి । తత్రైవంసతి మహాత్వస్యచ సంకోచో నాస్తి సమ్య గ్నిరూపణే, "అస్తిచే దప్రమాణం స్యా చ్ఛ్రుతి స్సతాత్పర్య వాదినీ । తస్మా దస్తి మహాదేవ ఏవ సాక్షా త్స్వయం ప్రభుః । ఆనంద రూపః సంపూర్ణో నతతో న్యత్ర కించన । ఇయ మేవహి తర్కాణాం నిష్ఠా కాష్ఠా సురోత్తమాః । ప్రత్యక్షాది ప్రమాణానాం వేదాన్తానా మపీ శ్వరా ఇత్యతః శివస్య సర్వతః పరత్వే స్థితే స్వస్యాపి ముక్తిప్రదం జ్ఞానం శివప్రసాదాదేవే తిల త్రైవోక్తమ్ । తద్యథా । "ప్రసాదాదేవ శంభోశ్శైవ శివాయాశ్చ తథైవచ । పరమాద్వైత విజ్ఞానం విష్ణో స్సాక్షా న్మమాపి చే"త్యా దిస్కాన్దే బ్రహ్మగీతాయాం దేవేభ్యో బ్రహ్మణోక్త మవధార్యమ్॥ ౪౮॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము . ♦—

పరమశివ ప్రసాదముచె లబ్ధమైన ఈ విశ్వరూపమును నీకొరకు చూపించితిని. ఇది అతిదుర్లభమైనదని చెప్పుచున్నాడు॥ ఓ కురుశ్రేష్ఠ! వే

విశ్వరూపమును నీకొఱకు చూపించితినో అది వేదాధ్యయనములచే గాని యజ్ఞ విద్యాధ్యయనములచే గాని దానములచే గాని కర్మలచే గాని ఘోరతపస్సులచే గాని మనుజ లోకమున యిట్టి రూపమును నీవుగాక యితరులెవ్వరును గనజాలరు. (ఓయీ! యే పరశివానుగ్రహము వలన లబ్ధమైన దానిని నీవు నాకును జూపించితివో అట్టి ప్రబలమైన దేవుడు యెవడు గలడంటె చెప్పుచున్నాడు, ప్రబలమైన దేవుడు ఫలాని వాడు గలడని చెప్పుటకు సంకోచము లేదు, ఒకవేళ సంకోచమున్న యెడల సత్యమయిన యర్థమును జెప్పు శృతి అప్రమాణమె యగును అందువలన యెవడనగా మహాదేవుడె సాక్షాత్తు స్వయం ప్రభువు। ఆనందరూపుడు జగదంతను నిండియున్న వాడు అతను గాక మరియొకరు లేరు తార్కికుల యొక్క నిశ్చయు గతియును ఇదియె వేదాంతులకు ప్రత్యక్షాది పమాణములకును ఇదియె. అందరికంటె శ్రేష్ఠుడు శివుడున్నందు వలన నాకును ముక్తినిచ్చు జ్ఞానము శివప్రసాదము వలననే గలిగిన దని అక్కడనె చెప్పిన దెట్లంటె పార్వతీ పరమేశ్వరుల యొక్క అనుగ్రహము వలననె పరమశివ జ్ఞానము సాక్షాత్తు నాకును విష్ణువునకును గలిగిన దనిస్కాంద పురాణమందు బ్రహ్మగీతలో దేవతుల కొరకు బ్రహ్మ చెప్పినట్లున్నదని తెలియవలెను॥ ౪౮॥

శ్లో॥ మా తే వ్యథా మాచ విమూఢ భావో।
దృష్ట్వా రూపం ఘోర మీదృఙ్మమే దమ్॥
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం।
తదేవమే రూపమిదం ప్రపశ్య। ౪౯

—♦ భాష్యమ్ ♦—

ఎవమేవ పున రర్జునం ప్రసాంత్వయా న్నైవాహ—మాత ఇతి। తథాచ। హేఅర్జున మమేదం విశ్వాఖ్యం ఘోరరూపం

దృష్ట్వా వ్యపేతభీ స్సన్విగత మూఢభావస్సన్ మావ్యథా వ్యథాం మాకాఙ్క్షీః కింతు ప్రీతమనా స్సం స్తదేవ రూపం ప్రపశ్యే త్యర్థః॥౪౯॥

—◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ◆—

ఈప్రకారము పునః అర్జునుని ఓదార్చుచు చెప్పుచున్నాడు. ఓఅర్జునా! ఇటువంటి విశ్వమనునట్టి యుగ్రరూపమును గాంచి నీవుభీతినందకుము మోహముం జెందకుము భీతిని విడిచి సంతసమును జెందుచున్నవాడవై తిరుగ నా తొల్లిటి రూపమునే కనుము॥౪౯॥

సంజయ ఉవాచ;—

శ్లో॥ ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా ।
స్వకం రూపం దర్శయామాస భూయః ।
ఆశ్వాసయామాస చ భీతమేనం ।
భూత్వా పున స్సౌమ్యవపు ర్మహాత్మా॥ ౫౦

—◆ భా ష్య మ్ ◆—

అథైతదపి వృత్తం ధృతరాష్ట్రాయ సంజయోఽప్యాహ— ఇత్యర్జునమితి । తత్రతావద్వాసుదేవో ర్జునాయ ప్రాగుక్తం వృత్త మిత్యుక్త్వా యథాపూర్వ మాసీ త్తథా సౌమ్యం వపు ర్దర్శయామాస। సచ భూయో భీతమేన మాశ్వాసయామాసే త్యాశయః॥౫౦॥

—◆ ఆం ధ్ర తా త్ప ర్య ము . ◆—

సంజయుండిట్లనియె। యీ వృత్తాంతమునున్నూ సంజయుడు ధృతరాష్ట్రుని కొరకు చెప్పుచున్నాడు. శ్రీ కృష్ణుం డివ్విధముగా నర్జునునితో

బలికి తనతొంటె రూపమును నగపరచెను. మహాత్ముండగు కేశవుండు తిరుగ సౌమ్య శరీరమును దాల్చి భీతి నొందిన ధనంజయు నూరడించెను॥౫౦॥

శ్లో॥ దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన।
ఇదానీ మస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః॥ ౫౧

—♦ భాష్యమ్ ♦—

అథ చ తతో యథాస్థితం రూపం దృష్ట్వా నిర్భయస్స న్నర్జునః కిమువాచేత్యాహ—దృష్ట్వేదమితి॥ తత్రైవం సతి హేజనార్దన తవ సౌమ్యం మానుషం రూపం దృష్ట్వా సంవృత్తోఽస్మి స్వాస్థ్యం గతోఽస్మీతి సచేతాస్సన్ స్వాం పూర్వోపలబ్ధాం ప్రకృతిం చ గతోఽస్మీత్యర్థః॥ ౫౧॥

—♦ లఘుటిప్పణీ ♦—

మానుషమితి। అతఏవ లక్ష్మీం ప్రతిస్వయం విష్ణునైవ పాద్మేప్యుక్తం తద్యథా। 'మాయా మయ మిదం దేవి వపుర్మేం నహి. తాత్వికం సృష్టిస్థిత్యుప సంహారం క్రియా జాలో పబృంహితం' ఇత్యుక్త్వా శివశ్యస్వాత్పృథక్త్వ మప్యతో న్యదాత్మనో రూపం రూపం ద్వైత వివర్జిత మిత్యనేన దర్శిత మత్యవధేయమ్॥౫౧॥

—♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

అర్జునుండిట్లనియె। పూర్వమున్నట్లుగా రూపమును జూచి నిర్భయుడై అర్జును డేమని పలికెనంటె చెప్పుచున్నాడు. ఓ జనార్దనా! ఏ సౌమ్య మానుష రూపమునుగని ఇపుడు స్వస్థచిత్తుడనైతిని. పూర్వపు ప్రకృతిని చిత్తముతో బొంది యుంటిని. పద్మపురాణమందు విష్ణువు స్వయముగా లక్ష్మిని గురించి చెప్పిన వాక్యమేమనగా ఓ దేవి! యీనాశరీరము

మాయా వికార మయినదిగాని యథార్థమైనదిగాదు. సృష్టి స్థితి సంహార రూపమైన కర్మలుచేయుటకుగానుధరించ బడినదని చెప్పి శివుడు నాకంటె వేరుగా నున్నాడు శివరూపమై ఆత్మగా నున్నాడని స్మృతినిన్న తెలియ వలెను॥౫౧॥

శ్రీకృష్ణ ఉవాచ—

శ్లో॥ సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి యన్మమ ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శన కాంక్షిణః॥ ౫౨

—♦ భా ష్య మ్ . ♦—

తతశ్చ స్వాస్థ్యేనార్జునం దృష్ట్వా కృష్ణః పునః కి మువాచే త్యాహ—సుదుర్దర్శమితి। తత్రైవమసతీ దం దుర్ద ర్శం రూపం ద్రుష్టవానసియన్మమ పరంపదాఖ్యం రూపం దేవా అపి మహేంద్రాదయో దర్శన కాంక్షిణ ఇత్యర్థః ౫౨॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

పరంపదాఖ్యమితి । తద్యథా, 'పదం యత్పరమం విష్ణో స్తదేవా ఖిలదేహినాం । పదం పరమ మద్వైతం సశివ స్సాంబవిగ్రహః' । ఇత్యా దినా స్కాందాదౌ దర్శితత్వాదితి భావః॥౫౨॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

శ్రీకృష్ణుండిట్లనియె: తరువాత స్వస్థుడైన యర్జునుని జూచి కృష్ణుడు మళ్లీ యేమనె నంటె చెప్పుచున్నాడు. ఈనా చూడవశము గాని రూపముం గాంచితివో అనా పరమపదమను రూపమును మహేంద్రాదులయిన దేవ తలు సతతంబును గాంచం గోరుదురు. (విష్ణువుకంటె పరమై యేరూపము గలదో అదియే సమస్త జీవులకు మోక్షస్థానము. అదియె పార్వతితో

గూడిన శరీరము గల పరమ శివుడు అని స్కాందపురాణము మొదలగు వాటియందు చూపించ బడినది॥ ౫౨॥

శ్లో॥ నాహం వేదై ర్నతపసా నదానేన నచేజ్యయా।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా॥ ౫౩

—♦ భా ష్య మ్ ♦—

అథచ। 'షష్టి వర్ష సహస్రాణి తప స్తప్తం పురా మయా మహావిశ్వం తతో దృష్టం శివస్య పరమాత్మనః। ఇత్యాదినా పాద్మేపి ద్రోణపర్వణ్యుక్త్యా కథమ న్యై ర్దేవై రపి ని స్తపస్కై ర్ద్రష్టుం శక్య మిత్యాహ। నాహమితి। తత్రైవం సతి। నాహమేవం పరమశివ ప్రసాదజం విశ్వరూపం వేదై ర్నవాతపసా నదానేన యజ్ఞే నవా విశ్వాత్మానం ద్రష్టుం శక్యోహం యథా మాం దృష్టవానసీ త్యర్థః॥ ౫౩॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

అర్జునా! నేను అరువదివేల సంవత్సరములు తపము చేసి పరమాత్మయైన శివుని యొక్క మహా విశ్వరూపమును జూచితిని. (ఇట్లు ద్రోణపర్వమందున్నట్లే పద్మపురాణ మందును గలదు.) తపము చేయని ఇతర దేవతలచే నెట్లు చూడనగునని చెప్పుచున్నాడు. ఇట్లు నేను పరమశివుని ప్రసాదము వలన లభ్యమయిన విశ్వరూపమును వేదములచే గాని తపముచేగాని దానముచేగాని యజ్ఞముచేగాని విశ్వరూపమునుచూచుటకు సమర్థుడగాను. నావలె, నీవును నన్ను చూచిన రీతిని యెవరును చూడలేరు॥ ౫౩॥

శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోర్జున।
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప॥ ౫౪

—◆ భా ష్య మ్ ◆—

ఇదానీంతు 'దత్తాత్రేయ మయు శాన్తం శివం విద్ధి సనాతనం' ఇత్యాద్యుపకల్పం ప్రతి దత్తాత్రేయోక్త్యా 'మన్మయం విద్ధి మానవ్య జగత్సర్వం చరాచర మిత్యాది భాగవతే దేవ హూతిం ప్రత్యహంగిరోపాసనయా పరమశివ తత్వాత్పరతరం కించిన్నాస్తీ త్యుపదిశన్నాహ—భక్త్యేతి । తత్రైవంసతి నాన్యో విద్యతే యస్యాం సా తయా నన్యయా భక్త్యా సర్వాత్మ రూపయా హామేవం విధ స్తస్య భావ స్తత్వం తేన తత్వేన పరమశివా త్మరూపేణ సర్వైరపి జ్ఞాతుం శక్య ఇతి పరమార్థః॥౫౪॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

'యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ'। ఇత్యాది శ్రుత్యుక్త న్యాయేన తాదృశం సనాతనం గురూణాం ప్రథమగురుం సర్వాత్మనా భజే దిత్యవధార్యమ్। నాన్యేతి। బ్రహ్మాతం పరా దాదో న్యత్రాత్మనో వేద క్షుయం తం పరాదాదో న్యత్రాత్మనో వేదే త్యాది బృహదారణ్యక శ్రుతే రప్యనన్యత్వ ముపపాదనీయమ్॥ ౫౪॥

—◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ◆—

అపకల్పుని గూర్చి దత్తాత్రేయు డిట్లుపదేశించెను. సనాతనుడై శాంతుడైన శివుని దత్తాత్రేయ రూపముగా తెలిసికొనుము. ఓమానవుడా! స్థావర జంగమాత్మకమైన జగదంతయు నావికారమని తెలియుము. ఇట్లు భాగవతమందు దేవహూతికి ఉపదేశించెను. అహంగిరోపాసనచే పరమ శివ తత్వముకంటె గొప్పది యెంతమాత్రమున్నా లేదని ఉపదేశించుచు చెప్పుచున్నాడు. సవ్యసాచీ! యిటువంటి రూపము గల నన్నుం గాంచు

టకు గాని నిజముగా నెరుగుటకు గాని పరమశివ రూపమయిన తత్త్వముచే నందరును సర్వాత్మ రూపమయిన అనన్య భక్తిచే తెలుసుకొన శక్యమగును గాని మరొక సాధనము లేదు. దేవుని యందు భక్తి నుంచినట్లు గురువు నందును భక్తి నుంచవలెను. దేవభావనయే గురువునందును చెయ్యవలె యునను శ్రుతిని బట్టి గురువులకు గురువైన సనాతనుని సర్వాత్మనా భజించవలెను॥ ౫౪॥

శ్లో॥ మత్కర్మ కృన్మత్పరమో మద్భక్త స్సంగ వర్జితః।
నిర్వైర స్సర్వభూతేషు యస్సమామేతి పాండవ॥ ౫౫

ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే విశ్వరూప
దర్శనమ్ నామైకాదశోధ్యాయః॥

—◆ భాష్యమ్ ◆—

నను కథం తద్భక్తి యోగం కుర్యా దితి సంక్షేపత స్తద్భక్తవ్య మిత్యాహ—మత్కర్మేతి। తథాచాహాంగిరో పాసనయా మదర్థం పరమశివార్థం వేదవిహితం కర్మ కరోతీతి మత్కర్మకృది త్యర్థః ఏష మాకాశాదపి విస్తీర్ణ శుద్ధ సూక్ష్మోఽవ్యయ శ్శివో య ఆత్మా సకథం రామ జాయతే మ్రియతే థవే త్యాదినా వసిష్ఠేనాప్యహాంగిరో పాసనయా రామచంద్రాయ చోపదిష్ట మిత్యతస్తావత్సర్వభూతేషు శాస్త్రమర్యాదయా నిర్వైరస్సన్ మాం పరమశివాత్మనై తీతిసిద్ధాన్తార్థః॥

ఇతి శ్రీ శ్వేతాచార్య గురుచరణ శిష్య భావ సమాసాదిత శైవసిద్ధాంత ప్రవర్తక శ్రీ శ్రీకంఠ శివాచార్య విరచితే తత్త్వైక దర్శన నామకే గీతాభాష్యే విశ్వరూప దర్శనమ్నామైకాదశోధ్యాయః

## —◆ ల ఘు టి ప్ప ణీ ◆—

ననుసహ్యాన్య జ్ఞానా దన్యగతా నర్థనివృత్తి రిత్యాహ - వసిష్ఠేనా హంగిరేతి । తథాచ హేరామచంద్ర త్వమప్యాత్మానం యోగజ ధర్మేణా హంగిరోపాసనయా శివం విజానీహి త్యాశయః॥ ౫౫॥

ఇతి శ్రీ శ్రీకంఠశివాచార్య శిష్య విశ్వేశ్వర శివాచార్య
విరచితాయాం లఘుటిప్పణ్యాం విశ్వరూప
దర్శనయోగః

## —◆ ఆ ం ధ్రి తా త్ప ర్య ము ◆—

ఓయీ! ఆభక్తి యోగము నేట్లు చెయ్యవలెనో సంక్షేప ముగా దానిని జెప్పవలెనంటె చెప్పుచున్నాడు । అహంగిరోపాస నచే పరమశివ ప్రీతికొరకు వేదవిహిత కర్మను చేయుచు. ఆకాశము కంటెను పొడవైనట్టిన్ని శుద్ధమైనట్టిన్ని సూక్ష్మమైనట్టిన్ని (శ్రుతి ॥ అణో రణియ్యా న్మహతో మహీయ్యా నాత్మా గుహాయాంనిహితో స్యజంతోః॥ నాశరహితమైన శివ రూపమైన ఆత్మ యెట్లుపుట్టును యెట్లు చచ్చును. ఇట్లుయోగవా శిష్టమందురామునికొరకువశిష్ఠుడుచెప్పి అహంగిరో పాసనయే ఉపదేశించెను. గనుక సర్వ భూతముల యందు వైరమును మాని శాస్త్రోక్తమైన పరమశివ రూపముతో భావించి సంగరహితుడై యున్నట్టులైన నన్ను పొందుచున్నాడని సిద్ధాంతము. (ఒకరిని తెలియుట వలన మరియొకనికి అనర్థముతొలగదంటె చెప్పుచ న్నాడు.) ఓ రామ చంద్ర! నీవున్నూ ఆత్మను యోగాభ్యాసము వల్లను అహంగిరో పాసనతో శివుని తెలుసుకొనుమని యోగవాశిష్టమంను రామునికి వశిష్ఠు డుపదే శించెను॥౫౫॥

ఇట్లు తత్త్వైక దర్శనమను శ్రీకంఠీయ గీతాభాష్యమునకు బోధా
నంద మహర్షిచేరచింపబడిన భావబోధమను నాంధ్రి
తాత్పర్యమున విశ్వరూపదర్శనయోగ
మను పదునొకొండవ అధ్యాయము
సమాప్తము.

ఓమ్

## శ్రీమచ్ఛ్రీకంఠాచార్యకృతే

# శ్రీ భగవద్గీతాభాష్యే

### భక్తియోగః - ద్వాదశోఽధ్యాయః.

అర్జున ఉవాచ—

శ్లో॥ ఏవం సతత యుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే।
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః॥

—♦ భాష్యమ్ ♦—

'పరా చైవాపరా చేతి భక్తిస్తు ద్వివిధామతా। విజ్ఞానాఖ్యా పరా ప్రోక్తా ద్వాదశే సా సమీర్యతే'॥ నన్విహ కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయ ఇత్యాది పూర్వోక్త్యా కర్మోపాసనయా శివజ్ఞానం సాధ్య మితవా సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజే త్యాద్యుక్త్యా సర్వకర్మాణి త్యక్త్వాఽక్షర మవ్యక్తాఖ్యం కేవలం శివ మద్వైత ముపాసనీయ మితి కిం తయో ర్న్యాయ మితి సందిహానః పృచ్ఛతి। ఏవమితి॥ తత్రైవం సతి యమేవైష వృణుతే తేనలభ్య ఇత్యాది శ్రుత్యా త్మార్పణభక్త్యా యేసతత యుక్తా స్త్వాం యథోక్తం పరమశివ రూపేణోపాసతే। అథ యేచాక్షర మవ్యక్తం

ధ్యానయోగేనైవ కేవల ముపాసతే తయో ర్మధ్యే కేయోగ విత్తమాః శ్రేష్ఠా ఇతి ప్రశ్నాశయః॥ ౧॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నను మోక్ష సాధనసామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ భక్త్యా జ్ఞానం ప్రజాయతే తతో మోక్షః స్సుసిద్ధ్యతీ త్యాది స్మృత్యా భక్తే రావశ్య కత్వే స్థితే సాచ కతివిధేతి ప్రతిజానీతే। పరాచైవేతి॥ తత్రైవం సతీహ భక్త్యా జ్ఞానం ప్రజాయేతేతి యదుక్తం తదేవ జ్ఞానం పరా భక్తిత్వేనే హానిరూప్యతే। యచ్చ తద్వ్యా మన శ్శంభు పదారవిందయో రిత్యాద్యుచ్యతే సా శమదమాది షట్సంపత్తి రూపా సా జ్ఞానసాధనా కాంక్షాయా మపరా భక్తి రిత్యుచ్యత ఇతి వివేకః॥ ౧॥

—♦ ఆ స్థ్రి తా త్ప ర్య ము ♦—

పన్నెండవ అధ్యాయ మందు భక్తి చెప్పబడుచున్నది. భక్తి యనగా వినిర్ముక్త సకలేతరదేవతా రాధనా త్రివిధ కరణ సంపాద్యా విశిష్టాష్టాంగయోగినీ పరమశివ పరిచర్యా మయీ వైదికీ క్రియా భక్తిః॥ శివుని కంటే ఇతరమైన సమస్త దేవతా పూజను వదలి శ్రవణ మనన నిదిధ్యాసలు సేయుచు, యమ నియమా సన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధులతో పరమశివుని యొక్క సేవా రూపమైన వేద చోదిత కర్మ భక్తి యనిపించుకొనును. అట్టి భక్తి పరాభక్తి అపరాభక్తి అని రెండు విధములు. అందు విజ్ఞాన రూపమయినది పరాభక్తి। శమాది షట్సంపత్తితో శివపదారవింద ధ్యానము చేయుచు జ్ఞానాపేక్ష గలది అపరాభక్తి.

అర్జునుండిట్లనియె। ఓయీ! జనకాదులు కర్మచేతనే సిద్ధినొందిరని ఇదివరకు చెప్పబడ్డది. కర్మోపాసనచే శివజ్ఞానము సాధ్యమగునా? లేక అన్ని ధర్మములను వదలి నన్నె శరణు బొందుమనియెడి వాక్యముచే అన్ని కర్మలను వదలి నాశరహితమై అవ్యక్తమనునట్టి కేవల అద్వితీయ

మైన శివుని యుపాసించుటచే జ్ఞానములక్ష్యమగునా?ఇందులో ఏది న్యాయ మైనదని సందేహము గలవాడై అడుగుచున్నాడు। శ్రవణం కీర్తనం చైవ స్మరణం పాదసేవనం।అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనం అను నవ విధమైన శ్రవణాది యుక్తమైన ఆత్మార్పణ భక్తిచే యెవరు సర్వదానిన్ను పరమ శివరూపునిగా చెప్పినట్లు ఉపాసనచేయుచున్నారో॥ యెవరు అక్షరమైన అవ్యక్తమును ఒక్క ధ్యానయోగము చేతనే ఉపాసన చేయుచున్నారో వారిద్దరిలో యెవరు యోగశ్రేష్ఠులని అర్జుని ప్రశ్నాభిప్రాయము॥ (ఓయీ! మోక్షమును గురించిన సాధన సామగ్రిలో భక్తియే గొప్పది। భక్తిచే జ్ఞానము గలుగును దానివలన మోక్షము సిద్ధించుననెడి స్మృతి ప్రమాణముచె భక్తి అవశ్యకమై యుండగా ఆభక్తి యెన్ని విధములని యడుగుచున్నాడు॥ పరా ఉపరా భక్తుల రెంటిలోను భక్తిచే గలిగిన జ్ఞానమునకు పరాభక్తి యనిన్ని। శంభుచరణముల యందున్నదే మనసనే స్మృతి ప్రకారము శమము, దమము తితీక్షా ఉపరతి శ్రద్ధా సమాధానమనె షట్సంపత్తితో జ్ఞాన సాధనము జేయునది అపరా భక్తియనియు తెలియదగినది॥ ౧॥

శ్రీకృష్ణ ఉవాచ:—

శ్లో॥ మయ్యావేశ్య మనో యేమాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరమోపేతా స్తేమే యుక్తతమా మతాః॥ ౨

—◆ భాష్యమ్ ◆—

తత్రతావదాద్య ఏవ పక్షో న్యాయ్య స్తమేవాహ॥ మయీతి॥ తత్రైవం నిశ్చితే సతిమయి సదాశివే మన ఆవేశ్య తద్రూపేణైవ మాం యే నిత్యయుక్తా మన్యేత్వాం కాల మీశాన మిత్యాది స్మృతి న్యాయేన పరయా శ్రద్ధయోపేతా స్సంత ఉపాసతే తే మే యుక్తతమా మతా ఇత్యర్థః॥౨॥

## —♦ లఘుటిప్పణీ ♦—

న్యాయ్య ఇతి॥ నహి సాధనసంపత్తిం వినా కస్యాపి సిద్ధి రిత్యత స్తావద్భక్తి పక్ష ఏవ న్యాయ్య ఇత్యాశయః॥౨॥

## —♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

శ్రీకృష్ణుండిట్లనియె. ఆ రెండింటిలో మొదటి పక్షమె అనగా శ్రవణాది యుక్తమై యాత్మార్పణముతో పరమ శివోపాసనమై న్యాయమని చెప్పుచున్నాడు శ్రవణమనగా పరమేశ్వరుడు పంచవింశతి దివ్యావతారములచే లీలావినోద క్రియలాచరించిన కథాశ్రవణ కుతూహల మానసులై యుండుట-కీర్తనమనగా అట్టి లీలావినోద క్రియాన్వితుడయిన భగవంతుని దివ్యనామములను సంకీర్తన జేయుచు వర్ణింపుచు ప్రత్యక్షముగ తల్లీలను జూచిన చందమున చింతింపుచు అడుగడుగునకు నానందబాష్పములతో గూడి పులకాంకిత శరీరులై గద్గదస్వరముతో కీర్తన చేయుట స్మరణమనగా పరమేశ్వరుని యొక్క అనంతనామములలో సారభూతమైన సహస్రనామములందలి నమశ్శివాయ అనెడి ముఖ్యనామము ఆపో జ్యోతి రూపంబై కేవల పరమహంస రహస్యంబై యోగిధ్యేయంబై భక్తజన ముక్తిప్రదంబై బిందూర్ధ్వంబై శృతిమధ్య గతంబై యుండును గావున అట్టి శివనామస్మరణచే అనుస్యూతంబుగా తృప్తులై యుండుట పాదసేవన మనగా అట్టి భగవంతునిపాద కమలంబులను హృదయమునందు సేవజేయుచుండుట అర్చనమనగా అట్టి శివుని హృదయమందు గాంచి మానస పూజా విధంబున నర్చించుట వందనమనగా మానసపూజానంతరమున పరమేశ్వరుని యొక్క అవయవములను వేరువేరుగా ధ్యానించి వందనంబు లొనర్చుట దాస్యమనగా వందనానంతరమున పరమేశ్వర సన్నిధి నెడబాయకుండుట అనగా యనుస్యూతంబుగా ధ్యానమును తప్పక నిలుపవలెననుట సఖ్యమనగా శివధ్యానంబునం దేక చిత్తము గలిగి విషయ సంగంబులు

వదలియుండుట. ఆత్మ నివేదనమనగా అట్టి ధ్యానైక చిత్తము ఈశ్వరుని యందర్పించి పరవశులై సౌఖ్యానంద మయులై యుండుట.

ఈ ప్రకారము నిశ్చయించుకొని సదాశివుడనయిననాయందుమనసు నుంచి తద్రూపముతో నిత్యయుక్తులై నన్నుకాలరూపుడైన ఈశానునిగా అత్యంత శ్రద్ధతో ఉపాసించిన వారు మిక్కిలి తగిన వారు (సాధనసంపత్తి లేక సిద్ధియెవరికి లేదు గనుక భక్తి పక్షమే న్యాయము॥౨॥

శ్లో॥ యేత్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే।
సర్వత్రగ మచిన్త్యంచ కూటస్థ మచలం ధ్రువమ్॥ 3

శ్లో॥ సంనియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః।
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూత హితేరతాః॥ ౪

—♦ భా ష్య మ్ ♦—

తత్రాప్యేవంసతి సర్వకర్మాణి మనసా నియమ్యారభతేఽర్జున ఇత్యాద్యుక్త్వా కేవలంధ్యాన యోగేనైవ సర్వత్రగ మక్షర మవ్యక్తాఖ్యం బ్రహ్మ యేసంనియమ్యేంద్రియగ్రామ ముపాసతే తేపి మామేవ యథోక్త పరంపదాఖ్యం శివరూపం సర్వభూతహితే దత్తాస్సంతః ప్రాప్నువంతీతి ద్వయోరర్థః॥౪॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నను కర్మోపాసనాభ్యాం శుద్ధ చిత్తశ్చేత్కథం కుర్యా దిత్యాహ। కేవలమితి॥ తస్మాత్ 'పూజాకోటి సమం స్తోత్రం స్తోత్రకోటి సమో జప' ఇత్యాది స్మృతిన్యాయేన కేవలం ధ్యానేనా ప్యత్యంతత స్తత్పదం ప్రాప్నో తీతి ద్వయో రర్థః॥ ౪॥

## —♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

అందులోనున్నా కేవల ధ్యానయోగముచె యెవరు ఇంద్రియముల నియమము చేసి అంతటః సమబుద్ధి గలవారగుచు శబ్దముచే నెరిగింపరాని దియు రూపాదులు లేనిదియు అంతటను వ్యాపించినదియు చింతింప శక్యము గానిదియు మాయా ప్రపంచమున కధిష్ఠాన స్వరూపమున నున్న దియు నిశ్చలమైనదియు నిత్యమయినదియు అక్షర మగు నవ్యక్తమను బ్రహ్మమును నుపాసించెదరో వారును సర్వభూత హితులగుచు పరమ పదమనెడి శివరూపమైన నన్నె పొందుచున్నారు. అని రెండు శ్లోకము లకు తాత్పర్యము. (ఓయీ! కర్మో పాసనలచె శుద్ధ చిత్తుడైన వాడేమి చేయుననగా చెప్పుచున్నాడు. కోటి పూజలకు ఒక స్తోత్రము సమానము. కోటిస్తోత్రములకు ఒక జపము సమానమను న్యాయముచే కేవల ధ్యానము చేత నున్నా ఆఖరున పరమపదమును పొందును॥ ౪॥

శ్లో॥ క్లేశోధికతర స్తేషా మవ్యక్తా సక్త చేతసాం ।
అవ్యక్తాహిగతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే॥ ౫

## —♦ భాష్యమ్ ♦—

నన్వేవమపి । తయో రుపాసనయోః పరిశ్రమే కో విశేష ఇతి పున రవధారయతి॥ క్లేశఇతి॥ తత్రి తావత్కేవల మవ్యక్తా సక్త చేతసాం తు యదేతన్మనుష్యా శ్శైనం నవిద్యు రితి దేవాః కుర్వంతీత్యాది శ్రుత్యా తత్కృత విఘ్న బాహుళ్యా త్కర్మోపాసనాం వినా విజ్ఞాన సిద్ధి ర్దుర్ఘటైవేతి తత్పూర్వకైవ ధ్యానా త్సాసిద్ధి ర్యుక్తె త్యాశయః॥ ౫॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నను యది విహిత కర్మాకరణాదేవ సిద్ధి స్తర్హ్యవిద్యాయాం గర్భవా వా కర్మాభావా త్సర్వేషా మేవ నైష్కర్మ్య సిద్ధ్యా ముక్తి స్యాదిత్య తః స్వజాత్యనుసారేణ కర్మావశ్యం సిద్ధయే కర్తవ్య మిత్యాహ దుర్ఘటైవేతి తస్మా దశుద్ధాంతఃకరణ స్యధ్యానే విఘ్నబాహుళ్యా దుభయతో భ్రష్టత్వా ద్దుర్ఘటైవ సిద్ధిరితి భావః॥ ౫॥

—♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ! ఈప్రకారము కర్మ ధ్యానోపాసనల రెంటిలో అభ్యాసము చేయుటకు యేదిమంచి దంటె మళ్ళీచెప్పుచున్నాడు. అందులో కేవల అవ్యక్త బ్రహ్మోపాసకులకు కష్ట మధికమగును. ఏమనగా విఘ్నము లనేకములు వచ్చును. కర్మోపాసన లేక విజ్ఞాన సిద్ధి దుర్ఘటము గనుక కర్మతో గూడిన ధ్యానము సిద్ధించును. (ఓయీ! యథోక్త కర్మలను జేయకనె సిద్ధి గలిగే యెడల అవిద్యయందు గాని గర్భవాస మందు గాని కర్మలేకపోవుటవలన అందరికి నైష్కర్మ్య సిద్ధి చే ముక్తి గలుగ వలసినదే. అట్లు లేదు గనుక స్వజాతికి చెప్పబడిన కర్మల నవశ్యముగా సిద్ధికొరకు చెయ్యవలసిన దని చెప్పుచున్నాడు. కర్మ చేయక పోయి నందున అంతఃకరణ శుద్ధి లేక ధ్యానములో ననేక విఘ్నములు ప్రాప్తమై ఉభయ భ్రష్టు డగుచున్నాడు గాన సిద్ధి దుర్ఘటమని భావము॥౫॥

శ్లో॥ యేతు సర్వాణి కర్మాణి మయిసన్న్యస్య మత్పరాః ।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే॥ ౬

—♦ భా ష్య మ్ ♦—

తథా చేహ యద్రూపేణ సౌలభ్యం తదాహ॥ యేత్వితి తస్మా ద్బ్రహ్మార్పణ బుద్ధ్యా ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగ

చ్ఛాన్తి రనన్తర మిత్యాది వక్ష్యమాణ రీత్యా కర్మణైవ విజ్ఞానాఖ్యా పరాయా భక్తే స్సిద్ధి స్స్యక్తేతి నిశ్చయః॥ ౬॥

—♦ లఘుటిప్పణీ ♦—

కర్మణైవేతి॥నను కైస్తత్కృతం యదిహ కర్తవ్య మితి చే చ్ఛృణు। ఇహాముత్ర తతె పూజ్యం తల్లింగం దేవదానవైః। గార్హస్థేనచ లింగేన తస్మా త్సర్వార్థ సిద్ధిద'మిత్యాది పాద్మోక్త్యావధార్యమ్॥

—♦ ఆంధ్రితాత్పర్యము ♦—

ఇక్కడ యేది సులభమో దానిని చెప్పుచున్నాడు । ధ్యానము కంటే కర్మఫలత్యాగము మంచిది. కర్మఫలత్యాగము తరువాత శాంతి (ముక్తి) యని యని చెప్పినందున కర్మలను చేసి బ్రహ్మార్పణము చేయుట వలన విజ్ఞానమను పరాభక్తి సిద్ధించును గనుక పార్థా ఎల్ల కర్మముల నెవ్వరు నాకర్పించి నాయందాసక్తి గలవారగుచు నేకాంత వాసముల నన్ను ధ్యానింతురో వారు సంసార సాగరమును దాటగలరు. ఇక్కడ ఆకర్మను యెవరు చెయ్యవలెనంటె చెప్పుచున్నాడు । ఇహాముత్రార్థ ఫల భోగ విరాగము గలవాడు దేవదానవులచే పూజనీయుడు గృహస్థాశ్రమములో నుండి నిష్కామ కర్మలు చేసి నట్లైన సర్వార్థ సిద్ధి గలుగునని పద్మపురాణ వాక్యమును తెలియవలెను.

శ్లో॥ తేషా మహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్।
భవామి నచిరాత్పార్థ! మయ్యావేశిత చేతసాం॥ ౭

—♦ భాష్యమ్ ♦—

అథైతదేవ పున ర్నిశ్చినోతి॥ తేషామితి॥ ఏవంసతి। మయ్యావేశిత చేతసాం సంసార సాగరా దహం మృత్యుమాపా త్సముద్ధర్తా శీఘ్ర మేవ స్యా మిత్యాశయః॥ ౭॥

—◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ◆—

దానినే మళ్ళీ నిశ్చయించుచున్నాడు॥ అటువంటి నాయందు మనసు నిల్పిన వారికి మృత్యువుతో గూడిన సంసార సాగరము నుండి వేగముగా నే నేను లేవదీయుచున్నాను॥ ౭॥

శ్లో॥ మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం నసంశయః॥ ౮

—◆ భా ష్య మ్ ◆—

తదేవం కర్మోపాసనాభ్యా మేవ విజ్ఞానసిద్ధే రావశ్య కత్వే సత్యాహ—మయ్యేవేతి॥ తథాచాహంశబ్దేన విఖ్యాత స్త్వేక ఏవావ్యయ శ్శివ ఇత్యాది స్మృత్యా హంగిరోపాసనయా మయ్యేవ సదాశివేసర్వసాక్షిణి సంకల్పాత్మన ఆధత్స్వ మయ్యే వచ యథోక్తే తద్వై మన శ్శంభు పదారవిందయో రిత్యాది రీత్యావ్యవసాయిలక్షణాం బుద్ధిం నివేశయేతి తతో మయ్యేవ। కేవలేనిష్కళే శివేఽతఊర్ధ్వం నివసిష్యసీతినసంశయ ఇత్యర్థః॥౮

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

తత్రైవంసతి వేదస్య త్రికాండత్వేన తత్రిద్వయోస్తు జ్ఞాన సిద్ధ్యర్థత్వేనా వశ్యకత్వా దాహ॥ తదేవమితి॥ తథా 'ఉభాభ్యామేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతి స్తథైవ భక్తి కర్మభ్యాం ప్రాప్యతే బ్రహ్మ శాశ్వత మిత్యాద్యవధార్యమ్॥ ౮॥

—◆ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ◆—

విజ్ఞాన సిద్ధికి కర్మ, భక్తి, అవశ్యక మని చెప్పుచున్నాడు. అహం అనగా శివుడు గనుక అహంగిరోపాసనచే సర్వసాక్షియై సదాశివుడనై

నాయందే సంకల్ప రూపమైన మనస్సును నాకు అర్పింపుము. (అనగా కృష్ణుని యభిప్రాయము తనలో నున్న పరమశివాభిప్రాయము గాని తన యభిప్రాయము గాదు.) శంభు పదారవిందముల యందున్నదె మనస్సనెడి స్మృతిచే సాధన లక్షణము గల బుద్ధిని ప్రవేశపెట్టుము. ఆటుపైన, (అంతమందు) కేవల నిర్గుణ శివరూపమైన నాయందె నివసించ గలవు. (సాయుజ్యము నొందగలవు) సంశయము లేదు. (వేదము మంత్రము, బ్రాహ్మణము, ఉపనిషత్తు, అని మూడు భాగములు. అందు మంత్రభాగ మందు కర్మయు బ్రాహ్మణ భాగమందు భక్తియు, ఉపనిషత్తుల యందు జ్ఞానమున్నూ చెప్పబడినది. అందు మొదటివి భక్తికర్మలను తెలియజేయు మంత్ర బ్రాహ్మణ భాగములు. తద్ధర్మానుష్ఠానము జ్ఞానసిద్ధికి ఆవశ్యకమని చెప్పుచున్నాడు. ఆకాశమందు పక్షుల యొక్క గతి రెండు రెక్కల చేతను యెట్లగునో, అట్లె భక్తికర్మలచే శాశ్వతమైన శివపదము ప్రాప్తించును. కేవల ఉపనిషద్భాగమందు చెప్పిన జ్ఞానము కర్మ భక్తులు సలుపక నిలవదని యనుభవ శిద్ధాంతము|| ౮||

శ్లో|| అథ చిత్తం సమాధాతుం నశక్నోషి మయి స్థిరమ్।
అభ్యాస యోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ ! ౯

—♦ భాష్యమ్ ♦—

తదేవం పూర్వోక్తమేవ సిద్ధాంతం వక్తుం పునః ప్రకారాంతరేణాభిధత్తే। అథేతి॥ నను యది కర్మణా చిత్త శుద్ధత్వేనే హాముత్ర ఫలభోగతో వైరాగ్యే ప్యాత్మని శివే చిత్తం సమాధాతుం స్థిరం కర్తుం నశక్నోషి. తతోభ్యాస యోగేనైవ మాం యథోక్త మాప్తు మిచ్ఛేత్యర్థః॥ ౯॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

ఆత్మని శివఇతి॥ నన్వాత్మ శబ్దేన పరబ్రహ్మణ శ్శివస్య అభిధాన మిత్యత్ర కిం ప్రమాణ మితిచే చ్ఛృణు॥ తద్యథా, 'ధారయిష్యతి తేవేగం రుద్రస్త్వాత్మా శరీరిణాం యస్మి న్నోత మిదం ప్రోతం విశ్వం శాటీవ తంతుషు' ఇత్యాది భాగవతే జాహ్నవ్యుద్ధరణే నవమే ద్రష్టవ్యమ్॥౯॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

పూర్వోక్త మైన దే సిద్ధాంతమని చెప్పేకొరకు మరియొక ప్రకార ముగా చెప్పుచున్నాడు. ఓయీ! కర్మచే చిత్తశుద్ధికలుగగా ఇహలోక భోగములైన స్రక్చందన వనితాదుల నుంచిన్నీ పరలోక భోగములయిన రంభా సంభోగాదికము నుంచిన్నీ విరాగముగలిగినప్పటికి ఆత్మయైన శివుని యందు చిత్తమును స్థిరము చేయలేని యెడల యోగాభ్యాసముచె నన్నుం జెంద ప్రయత్నింపుము.(ఓయీ! ఆత్మ శబ్దమునకు పరబ్రహ్మయైన శివుడని అర్థము చెప్పుటకు ప్రమాణమేమంటె చెప్పుచున్నాడు॥ శరీర ధారులకు ఆత్మయైన రుద్రుడు నీవేగమును కట్టివేయగలడని గంగను గురించి చెప్ప బడినది. తంతువుల యందు వస్త్రమున్నట్లు శివునియందు పడుగు పేక వలెనే స్థావరజంగమాత్మక మైన విశ్వమున్నదని భాగవతములో జాహ్న వ్యుద్ధరణమందు నవమ స్కంధమున జూడనగును॥౯॥

శ్లో॥ అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మ పరమోభవ।
మదర్థమపి కర్మాణి కుర్వ న్సిద్ధి మవాప్స్యసి॥ ౧౦

—♦ భా ష్య మ్ ♦—

నను యది సత్కర్మ నిష్ఠా లస్యైనా భ్యాసే ప్యసమర్థ స్స్యాత్ కిం కుర్యా దిత్యాహ॥ అభ్యాసేపేతి ఏవం సత్యభ్యాసె ప్యసమర్థోఽసీతిచే న్మత్కర్మ పరమో భవేత్యర్థః। తద్యథా,

'శైవస్సతు విజ్ఞేయ శ్శివభక్తి పరాయణః శివైకతత్వత శ్చాపి యస్య కస్యా ప్యుపాసన' మిత్యాద్యవధార్యమ్॥ ౧౦

—♦ లఘుటిప్పణీ ♦—

యస్య కస్యాపీతి॥ తద్యథా, 'శ్రుతిః కా సర్వభావేన పూజనీయో మహేశ్వరః। నహి చాన్య త్వరిభావేన పూజ్య శ్శంభు స్సనాతనః। అమాత్యే రాజబుద్ధిస్తు నదోషాను ఫలాయ తత్। రాజ్ఞి చామాత్య బుద్ధిస్తు దోషాయ నార్థసిద్ధయే। పృథగ్భావేన వా పూజ్య శ్శంభు ర్నైవ నచాన్యథా। యతశ్చాపి హి గౌర్యాద్యా యజ్ఞాదౌ పూజ్యతే శివైః' ఇత్యాది పాద్మోక్త్యా వధార్యమ్॥ ౧౦॥

—♦ ఆంధ్రితాత్పర్యము ♦—

ఓయీ! సత్కర్మాచరణమందు అశక్తుడయినట్లయితె యేమి చెయ్యవలె నంటె చెప్పుచున్నాడు॥ అవిఘమున యోగాభ్యాసము జేయుటకు శక్తి లేని వాడవైన నన్నుం గూర్చి కర్మంబుల నాచరింపుము । నన్నుగూర్చి కర్మముల నొనర్చినను మోక్షముం గాంచ గలవు. అది యెట్లనగాయెవడు శివభక్తియందాసక్తి గలవాడో వాడే శైవుడు । శివుని యందు తత్వ ముంచి యెవరినైనను పూజించుగాక (సర్వము శివుడె యను భావనచే మహేశ్వరుడే పూజనీయుడై యున్నందున హాని యేమి । సనాతనుడైన శంభువు అన్యదేవతా ప్రభావముచె పూజనీయుడు గాడు । శివ స్వరూప ముగా అన్యదేవతులను పూజింప దగును గాని అన్యదేవతెగా శివుని పూజింపరాదు। అమాత్యుని యందు రాజబుద్ధి ఫలము నిచ్చును గాని, దోష మివ్వదు । రాజు నందమాత్య బుద్ధి దోషమె గలుగును గాని పురుషార్థము కొరకు గాదు. యజ్ఞాదుల యందు గౌరీ గణేశాదులను ప్రారంభ మందె సర్వులు పూజించు నట్లు పద్మపురాణమందు గలదు. పృథక్కుగా నైనను శంకరుడె పూజనీయుడు గాని అన్యులు గారు. యీ గౌరీ గణేశా

ములు శంకరునికంటె భిన్నులుగారు. అభేదముగా పూజింపవచ్చును. ఇది యే శైవ సిద్ధాంతము శైవులు ఏక దేవతో పాసకులు శివుని గాక ఇతర దేవతలను పూజించరు. పూజించినను శ్లో॥ శివావరణ దేవాంశ్చ సర్వాన్ సంపూజయే ద్గుహ పృథక్ స్థాన స్థితాన్ దేవా న్నార్చయెదన్యదేవతాః ఇతి వాతులాగమె శివాలయ పరివారములో నున్న సర్వదేవతలను శివ భావముతో బూజింతురు. ప్రాకార బాహ్యమందున్న అన్య దేవతలను శుద్ధ శైవులు (ఆదిశైవులు) పూజింపరు॥౧౦॥

శ్లో॥ అథై తదప్యశక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః,
సర్వ కర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్॥ ౧౧

—♦ భా ష్య మ్ ♦—

నన్వేతావతాపి యథోక్త రీత్యా సర్వథా కర్తుమశక్తశ్చే త్తదా ప్యాహ।— తథైతదితితథైవంసతి,సమనంతరోక్త్యాక్ర కర్తు మశక్తశ్చే త్తదా ప్రజహాతి యదా కామానిత్యాది రీత్యా నియతాత్మవాన్ భూత్వా సర్వకర్మణాం ఫలత్యాగం కుర్వ న్నమృతత్వ మాప్స్యసీతి బోధ్యమ్॥ ౧౧॥

—♦ ఆ ం ధ్రి తా త్ప ర్య ము ♦—

ఓయీ! ఈ ప్రకారము శివారాధన యున్నూ అన్నివిధములచే జేయ నశక్తుడైనట్లైతే అప్పుడు చేయవలశినది చెప్పుచున్నాడు. తరువాత చెప్పిన విధమునను చేయుట కసమర్థుండయ్యేనేని కోరికలను వదల వలయుననని చెప్పినట్లు యతంబగు మనంబున సకల కర్మఫలములను వదలి వేసిన యెడల అమృతత్వమును బొందగలవు॥ ౧౧॥

శ్లో. శ్రేయోహి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే
ధ్యానాత్కర్మ ఫలత్యాగ స్త్యాగాచ్ఛాన్తి రనంతరం॥ ౧౨

—◆ భాష్యమ్ ◆—

తదేవం క్రమేణ యథోక్త మేవ నిశ్చేతుం పున రాహ శ్రేయోహీతి యుక్తత్వేన కేవలాభ్యాసా చ్ఛాస్త్ర జన్యం జ్ఞానం తద్దోష త్రయ నివర్తకత్వేన శ్రేయ ఇత్యర్థః ఏంసతి తాదృశ జ్ఞానా దపి శ్రవణా ద్యనంతరం సిద్ధ్యుపయోగిత్వేన ధ్యానం విశిష్యతే తతోపి కర్మఫలత్యాగః పరే బ్రహ్మణి శివే శాంతి ప్రయోజకత్వా ద్గరీయా నిత్యర్థః॥ ౧౨॥

—◆ ఆంధ్రి తాత్పర్యము ◆—

ఈ ప్రకారము క్రిమముగా ఇదివరకు చెప్పిన వాటినె నిశ్చయించే కొరకు మళ్లీ చెప్పుచున్నాడు. జ్ఞానము లేని కేవల యోగాభ్యాసము కన్న శాస్త్రజన్య జ్ఞానము, సంశయ, విపర్యయ, అసంభావనా దోషమునను పోగొట్టు నదగుటచే యుక్తమైనది. అట్టి శాస్త్ర జన్య జ్ఞానము కంటె శ్రివణమైన తర్వాత సిద్ధికి ఉపయోగించే దగుటచె ధ్యానము విశేష మయినది. అట్టి ధ్యానము కంటె కర్మ ఫల త్యాగము, పరబ్రిహ్మమైన శివుని యందు శాంతిని గలిగించు నది గాన గొప్పది అట్టి త్యాగంబు వలన శాంతి కలుగును॥ ౧౨॥

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ ।
నిర్మమో నిరహంకార స్సమ దుఃఖ సుఖః క్షమీ॥ ౧౩

—◆ భాష్యమ్ ◆—

నను త్రిభిః ప్రకారై ర్విజ్ఞాత తత్వస్య మహాత్మనః కిం లక్షణమిత్యాహ । అద్వేష్టేతి॥ తథాచసర్వభూతానామిహ ప్రతి కూలబుద్ధ్యా భావా న్నద్వేష్టా కింతుమైత్రఃస్నిగ్ధత్వేన కరుణో

దుఃఖితేషు శాస్త్రోక్త మర్యాదయా దయావాన్ నిత్యర్థః। ఏవం నిర్మమో మమేత్యభినివేశ వర్జితః తథాదేహాద్యహంకార వర్జితస్సన్ సమ దుఃఖ సుఖః క్షమీ చేతి హేతుగర్భిత విశేషణ మవధార్యమ్॥ ౧౩॥

—♦ ల ఘు టి ప్ప ణీ. ♦—

దేహాద్యహంకారఇతి॥ తద్యథా, అహం శబ్దేనవిఖ్యాతస్త్వేక ఏవా వ్యయ శ్శివః దేహేంద్రియాదే రనిత్యత్వా త్కథం తే బ్రహ్మశబ్దితా ఇత్యాది స్మృతే రితిభావః॥ ౧౩॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ! మూడు ప్రకారములచె తత్వమును తెలిసిన మహాత్ముని లక్షణ మేమంటె చెప్పుచున్నాడు. సర్వ భూతముల యందు ప్రతికూల బుద్ధి లేకపోవుటచె ద్వేషము లేనివాడున్నూ స్నేహము గలుగుటచె మిత్రిత్వము గలవాడున్నూ దుఃఖపడు వారియెడ శాస్త్రమర్యాదచే దయగలవాడున్నూ నేను దేహమనెడి అహంకారమును నాదియనెడి మమకారమును వదలి సుఖ దుఃఖములను సరిగ చూచుచు ఓర్పు గలిగి యుండును. (అహంఅనగా అవ్యయుడైన శివుడు। దేహేంద్రియాదులు అనిత్యములుగనుక బ్రహ్మమనిపించు కొనవు॥ ౧౩॥

శ్లో॥ సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢ నిశ్చయః।
మయ్యర్పిత మనోబుద్ధి ర్యోమద్భక్త స్సమే ప్రియః॥ ౧౪

—♦ భా ష్య మ్ ♦—

తస్యైవం విశేషణాంతరాణ్యాహ—సంతుష్ట ఇతి। తస్యైవం సతి॥ శరీరస్థితి కారణ లాభేఽలాభేచ సతతం సంతుష్టో

యతో యోగీ యతాత్మా సంశయాది త్రివిధ దోష రహిత త్వేన ధృఢ నిశ్చయశ్చే త్యర్థః । ఏవ మిహ యథోక్త రీత్యా మయి శివే త్వర్పిత మన శ్శంభుపదా రవిందయో రితి స్మృతి న్యాయేనా ర్పితం మనో బుద్ధిశ్చ యస్య స వైష్ణవ స్సతు! విజ్ఞేయ ఇతి స్మృతి న్యాయేనచ మద్భక్తో మమ ప్రియ ఇత్యర్థః॥౧౪॥

—♦ లఘు టిప్పణీ ♦—

త్రివిధ దోషేతి॥ సచా యం త్రివిధోపి దోష శ్శాస్త్ర సజ్జన సంప ర్కా విచారోఽసంగభావనా సమతా స్వచ్ఛతా సౌమ్యా సప్తధా భూమికా మతే త్యాది రీత్యా యోగారూఢస్యైవ నివృత్తో భవిష్యతీతి భావః॥ ౧౪॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

మహాత్ముని యొక్క విశేషణములను ఇంకా చెప్పుచున్నాడు. శరీరము నిలుచుటకు కారణమైన అన్న పానములు దొరికినను దొరక కున్నను సంతుష్టి గలవాడు. మనసును ఒకచోట నుండునట్లు నియమించిన వాడు గనుక యోగి. సంశయ విపర్యయా సంభావనలగు దోషములు మూడును లేనివాడు గనుక దృఢ నిశ్చయము గలవాడు. (సంశయమనగా తాను దేహేంద్రియాదులతో గూడుకుని సర్వ వ్యాపారములకు కర్తనై యున్నాను. నాకు కర్తృత్వము లేకుండిన వ్యాపారము శూన్యము గావ లదా. నీవే యాత్మ స్వరూప మని శాస్త్రములు బలుకుచున్నవి యని తెలిసియు అనుభవముచే నాత్మగా నెరుగక శాస్త్ర ప్రమాణముచే నాత్మగా నెరుగుట॥ శాస్త్రమెంత జెప్పినను యనుభవమె ప్రమాణము సంశయము గలవాడు చెడును. అనగా మృత్యువును పొందును. విపర్యయ

మనగా ప్రాణము లేకుండిన నేమైనను న్నదా, మనము కంటిమా యని యు, నిద్రయందు ప్రాణమున్నది గదా! ప్రాణము లేకున్న బ్రతికి యుందుమా, గనుక ప్రాణమే యాత్మ యనియు, దేహముండగా సకలము తెలిసెను. దేహము పడిపోయిన నేమి యున్నది, గాన దేహమే యాత్మ యనుట. అసంభావన యనగా ఆత్మ జ్ఞాన స్వరూపమని శాస్త్రార్థము గనుక జ్ఞాన మనగా నెరుక గదా. యెరుకయె చిత్తము గదా చిత్తమె యాత్మ యనియు, ఆత్మ నిష్ప్రపంచ స్వరూపమును సుఖ స్వరూపమును గనుక నిద్రయందు ప్రపంచము లేదు. అంతకు మించిన సుఖము లేదు గనుక సుషుప్తియే ఆత్మ యనియు. మనసుండిన నంతయు గలదు. మనసు లేకుండిన నేమియుం గానము కాబట్టి మనసే ఆత్మ యనుట. ఇట్టి సంశయ విపర్యయా సంభావనలను విడిచి గురువాక్యమును శాస్త్రమును అనుభవ మును నొక్కటిగా చేసెడి మననము చే సంశయమును పారదోలి నిది ధ్యాస చె విపరీత భావనను తరిమి, సమాధిచే నసంభావనను పోగొట్టి, ఆరూఢ జ్ఞాన నిష్ఠ యందుండ గలిగిన వాడు గనుక దృఢ నిశ్చయము గలవాడు) యథోక్త రీతి చేతను శివ పదారవిందముల యందున్న నె మనస్సను న్యాయముచె శివుడనైన నాయందు మనో బుద్ధు లర్పించిన వాడు వైష్ణవుడను స్మృతిచే నాయందు భక్తి గలవాడు నాకిష్టుడు. శాస్త్ర సంపర్కము - సజ్జన సంపర్కము - విచారము - అసంగభావన, సమతా, స్వచ్ఛతా, సౌమ్యా, యీ సప్తభూమికా ప్రకారము యోగా రూఢు డయిన వానికె త్రివిధ దోషములు నివృత్తి యగును॥ ౧౪॥

శ్లో॥ యస్మా న్నోద్విజతే లోకో లోకా న్నోద్విజతే చ యః
హర్షా మర్ష భయో ద్వేగై ర్ముక్తో యస్సచ మేప్రియః॥ ౧౫

—♦ భా ష్య మ్ ♦—

ఏవమన్య ప్రకారేణాపి తల్లక్షణమేవాహ ! యస్మాదితి తత్రైవం సతి । యస్మా త్తత్వజ్ఞాన యుక్తా ల్లోకో నోద్విజతే

నతప్యతే నవా లోకాదపి స ఉద్విజత ఇత్యర్థః । ఏవమేవ హర్షా మర్షాదిభి రపి యో ముక్త స్సచ సోపి మే ప్రియ ఇత్యర్థః॥ ౧౫॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నతప్యతఇతి తద్యథా సుఖంచ దుఃఖంచ భవా భవౌచ లాభాలాభౌ మరణం జీవితంచ పర్యాయశ స్సర్వ మేతే స్పృశంతి తస్మా ద్ధీరోన హృష్యే న్నశోచే దిత్యాది లక్షణయుక్త్యా బోధ్యమ్. ౧౫

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

మరియొక ప్రకారముచే మహాత్ముని లక్షణమును చెప్పుచున్నాడు. ఏ తత్వజ్ఞాని వలన ప్రపంచము భయ సంక్షోభముల జెందదో ప్రపంచము వలన నెవడు భయమును గాంచడో సంతోషము కోపము భయము క్షోభము వీటిచే నెవడు విడువ బడెనో వాడు నాకు ప్రియుడు (సుఖము దుఃఖము అగుట కాకపోవుట లాభించుట నష్టమువచ్చుట పుట్టుట చచ్చుట ఇవి పర్యాయముగా వచ్చునవని ధీరుడు సంతసించడు, దుఃఖించడుఅనే లక్షణ యుక్తిచే తెలియవలెను॥౧౫॥

శ్లో॥ అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।
సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్త స్సమే ప్రియః॥ ౧౬

—♦ భా ష్య మ్ ♦—

ఏవ మన్య ప్రకారేణాపి పునరాహ— అనపేక్షఇతి॥ తద్వైవేహ సర్వ భూతేషు యదృచ్ఛయోపనీతేష్వపి భోగేషు నిరపేక్షః తథైవ శుచి ర్బాహ్యా భ్యంతర శౌచ సంపన్నః । ఏవం దక్షో యథోపస్థితేషు జ్ఞాతవ్యేషు కర్తవ్యేషు చ సర్వజ్ఞ

త్వేన జ్ఞాతుం కర్తుంచ సమర్థ స్తథా మిత్రా రిపక్షేషూ దాసీనః ఏవ మన్యథా కారణేష్వపి సత్స్వనుత్పన్న వ్యథ ఇత్యర్థః। తథేదం మే స్యా దిదం మే కర్తవ్య మద్యైవ ఇత్యాది రీత్యా సర్వారంభ పరిత్యాగేతి జానామి ధర్మ మితి స్మృతి న్యాయేన గర్గాది వద్వసిష్ఠాది వచ్చ వర్తితవ్య మితి సమే గురుత్వేన భక్తత్వేనవా ప్రియ ఇత్యవధార్యమ్॥ ౧౬॥

—◆ లఘుటిప్పణీ ◆—

బాహ్యాభ్యంతరేతి॥ తత్రితావదేకాలింగే గుదే త్రిసః పాదయో శ్చ కరేదశ ఉభయో స్సప్త దాతవ్యా మృదశ్శుద్ధే చ మజ్జన మిత్యాదినా బాహ్యశుద్ధిః ఏవం నిర్వ్యాజీ స్వీయ ధర్మజ్ఞో వేదజ్ఞ స్తత్వ పారగో విరక్తో విషనిర్ముక్త షడ్భి ర్యోగీ ముని ర్భవే దిత్యాదినా భ్యంతర శౌచ సంపన్న ఇత్యర్థః॥౧౬॥

—◆ ఆంధ్రి తాత్పర్యము ◆—

మరియొక ప్రకారముగా చెప్పుచున్నాడు సర్వుల వలన భోగ ములు దైవ యోగముచే ప్రాప్తమైనను అపేక్ష లేనివాడున్నూ బాహ్య శుద్ధి అంతరశుద్ధి గలవాడున్నూ ఉపస్థితములయిన తెలియ దగిన వాటి యందును చేయదగిన వాటియందును సర్వజ్ఞు డగుటచే తెలుసుకనే కొర కున్ను చేసేకొరకున్నూ సమర్థుడైన వాడున్నూ. శత్రు మిత్ర పక్షముల యందు దాసీనుడున్నూ యేలాగైనను కారణ మున్నను చిత్తమందు దుఃఖము లేనివాడు, ఇది కావలెను. ఇది నాకు కర్తవ్య మను ఆరంభము లన్నియు వదలినవాడు ధర్మాధర్మములను తెలిసి గర్గాదిమునుల వలె వశిష్ఠాది ఋషుల వలె నుండువాడు గురువని గాని భక్తుడని గాని నాకు ప్రియుడు (బాహ్యశుద్ధి లింగస్థావ మందొక మారు గుదమందు మూడు

మార్లు పాదములయందు పదిమార్లు చేతులయందు యేడుమార్లు మృత్తికా లేపనముచేసి స్నానము చేయుటచే బాహ్యశుద్ధి। కపటము లేకయుం డుట స్వధర్మమును తెలిసిన వాడు వేదము జదివిన వాడు తత్వమును దెలిసినవాడు విరక్తుడు విషయము లేనివాడు యీయారును గలుగుటచే యోగియు మునియు నగుచున్నాడు. అనునట్లుఅంతరశుద్ధి గలవాడు॥౧౬॥

శ్లో॥ యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి।
శుభా శుభ పరిత్యాగీ భక్తిమాన్యస్సమే ప్రియః॥ ౧౭

—♦ భా ష్య మ్ ♦—

అథా పరమప్యాహ యో। నేతి । తత్త్రైవంసతి।యశ్చ ప్రియం ప్రాప్య నహృష్యతి నచాప్రియం ప్రాప్య ద్వేష్టి తథైవ ప్రాప్తేష్ట వియోగేచ నశోచతి నచాప్రాప్తేష్ట సంయోగేచ కాంక్షతీ త్యర్థః । ఏవం రీత్యా సర్వారంభ పరిత్యాగీ తి శుభా శుభ పరిత్యాగౌ త్యనేనోక్త మిత్యాది లక్షణ లక్షితో య స్సమే భక్తః ప్రియ ఇత్యాశయః॥౧౭॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నశోచతీతి। నను॥ యచ్చింతితం తదిహ దూరతరం ప్రయాతి యచ్చేతసాపి నకృతం తదిహా భ్యుపైతి త్యాదినా కథం రామచంద్రస్య శోక ఇతిచే న్నైవం। తత్త్రైవం సత్యహమేవ పరంబ్రహ్మ శివమేక మనానుయ మితి స్యా న్నిశ్చయో ముక్త్యై బద్ధఏవా న్యథా భవేదిత్యేవం తస్య నిశ్చయే సతి బహిష్కృత్రమ సంరంభో హృది సంరంభ వర్జితః కర్తా బహి రకర్తాంత శ్లోకే విహార రాఘవే త్యాది రీత్యా వధార్యం॥ ౧౭॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

మరియొక రీతినిన్ని చెప్పుచున్నాడు। ప్రియముం గాంచి యెవ్వండానందింపడో అప్రియముంగాంచి యెవ్వండు ద్వేషపడడో ఇష్టార్థనాశనమున నెవ్వండు విచారింపడో లభించని యిష్టవస్తువు దొరికినను యెవ్వండు కోరడో శుభా శుభములు వదలు స్వభావము గలవాడై నాయందు భక్తిగలిగి యెవడుండునో వాడు నాకు ప్రియుడు. (చింతితము దూరముగా పోవును. అచింతితము దగ్గరకు వచ్చునను న్యాయముచే రామునకు దుఃఖమేల? అనామయమై ఏకమైన పరబ్రహ్మమైన శివుడే నేనను నిశ్చయము ముక్తికొరకున్ను, నేను సుఖిని దుఃఖిని అనుకున్న యెడల బంధము కొరకును అగును. కాబట్టి హృదయ మందాడంబరము లేక బాహ్యమునకాడంబరము జూపుము. అంతర్యమందు కర్తృత్వము లేక బాహ్యమునకు కర్తృత్వము గలిగి రాఘవా లోకమందు విహరింపుమని వశిష్ఠవాక్యము॥౧౭॥

శ్లో॥ సమ శ్శత్రౌచమిత్రేచ తథా మానా వమానయోః।
శీతో ష్ణ సుఖ దుఃఖేషు సమ స్సంగ వివర్జితః. ౧౮

—♦ భాష్యమ్ ♦—

ఏవ మపరమపి విష్ణుభక్తి లక్షణం వైష్ణవస్సతు విజ్ఞేయ శ్శివభక్తి పరాయణ ఇత్యాది స్మృతి న్యాయేనాహ। సమ ఇతి॥ తత్రతావచ్ఛేతనేష్వపి సర్వత్రౌ దాసీన్యేనహర్ష విషాద శూన్యేన వర్తితవ్యమితి స్పష్ట మన్యత్॥ ౧౮॥

—♦ లఘు టిప్పణీ ♦—

శివభక్తి పరాయణ ఇతి॥ నన్వేవం తర్హి, విష్ణుభక్త్యైవ వైష్ణవ స్స కుతో నస్యాదితిచే చ్ఛృణు 'వినా శివప్రసాదంహి భ్రాంతిః క్వాపి నన

ష్యతీ' త్యాదినా నారదం ప్రతి స్కాందే శ్రీకృష్ణోక్త్యా యదా చర్మ వదాకాశం వేష్టయిష్యంతి మానవా స్తదా శివ మవిజ్ఞాయ దుఃఖస్యాంతో భవిష్యతీ త్యాది శ్వేతా శ్వేతరో పనిష చ్ఛ్రుత్యాచ వివేక్తవ్యమ్॥౧౨॥

## —♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

శివభక్తిపరాయణుడై వైష్ణవుడని విష్ణుభక్తి లక్షణమును చెప్పుచున్నాడు. శత్రులయందును మిత్రులయందును మానముగలిగి నప్పుడును అవమానము గలిగినప్పుడును శీతోష్ణ సుఖ దుఃఖములుగలిగి నపుడును ఏవందు సముడై సంగరహితుడై యుండునో చేతనా చేతనముల యందు దాసీన భావముచే హర్ష విషాదములు లేకయున్నవాడు నాకు ప్రియుడు ఓయీ. విష్ణుభక్తిచే వైష్ణవుడెందుకు కాదంటె వినుము శివప్రసాదము లేక భ్రాంతి యెవరికిని నశించదను వచనము స్కాందమునందు నారదునిగూర్చి శ్రీకృష్ణవాక్యము చేతనున్నూ మానవులు ఆకాశమును చర్మము వలె చుట్టబెట్టి నపుడు శివుని తెలియక దుఃఖాంతము గాగ లదను శ్వేతాశ్వతర ఉపనిష త్ప్రమాణముచేతనున్నూ, శ్లో॥ మహాపాపవతాం పుంసాం పూర్వజన్మసు సువ్రితాః। విష్ణు స్సర్వాధికో భాతి నసాక్షా త్పరమేశ్వరః॥ విష్ణు స్సర్వాధికో నాన్య ఇతి చింతయతాం నృణాం నాస్తి సంసార విచ్ఛిత్తిః కల్పకోటి శతైరపి॥ సూతసంహిత, యజ్ఞవైభవ ఖండము. ౨ అధ్యాయము ౫౯-౬౦ శ్లోకములు' వెనుకటి జన్మలయందు మహాపాపములు చేసిన వారలకు విష్ణువే గొప్పవాడని తోచును. సాక్షాత్తు పరమేశ్వరుడు గొప్పవాడని తోచదు. విష్ణువె సర్వాధికుడని చింతించు జనులకు నూరుకోట్ల బ్రహ్మకల్పములకైన సంసారము తొలగదు. శ్లో॥ శివప్రసాదేన హి భుక్తి రుత్తమా, శివప్రసాదే నహిముక్తి రుత్తమా శివప్రసాదేన వినానభుక్తయ శ్శివప్రసాదేన వినా నముక్తయః॥ శివరహస్యఖండం॥ శివానుగ్రహముచేతనే భుక్తియు ముక్తియు గలుగును. శివప్రసాదములేక భుక్తియుముక్తియు దొరకదు. గాన శివుని యందుభక్తి

లేక వైష్ణవుడు గాజాలడు. శివభక్తి లేని వైష్ణవులకు ముక్తి లేదని శ్రుతి స్మృతులు కేకలిడుచున్నవి॥ ౧౮॥

శ్లో॥ తుల్యాం నిందా స్తుతి ర్మౌని సంతుష్టో యేన కేనచిత్।
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః॥ ౧౯

—♦ భాష్యమ్ ♦—

ఏవ మిహా పరమపి సంసృతి సంగ విని ర్ముక్తస్య యోగినో లక్షణం పునరాహ। తుల్యేతి తత్రతావ న్నిందా పర గుణేషు దోష స్తుతిశ్చ దోషవత్స్వపి గుణక థన మితి తేచ సుఖ దుఃఖ జనక తయా తుల్యే యస్య స తథేత్యాత్మాను సంధానపరత్వేన మౌనీ సంయతవాక్ నతు శరీరయాత్రా నిర్వాహాయాపి బహుశో వాగ్వ్యాపారో పేక్షిత ఇత్యాహ। సంతుష్ట ఇతి॥ శరీరభరణాం ప్రారబ్ధ కంతార్పిత మితి స్మృతిన్యా యేన భక్తిమా నిత్యర్థః ఏవమనికేతో నామ గృహేషున స్వతంత్రో నవా పుత్రా ద్యధీనః కింతుగృహే ష్వతిథి వత్తిష్ఠే త్పుత్ర దారా ప్తిసంగమః పాంథ సంగమ ఇతి స్మృతి న్యాయే న యస్తిష్ఠే త్స మే ప్రియో నర ఇత్యాశయః ॥౧౯॥

—♦ లఘు టిప్పణీ. ♦—

తుల్యాఇతి॥ తత్రతు గుణ దోషౌ బుధో గృహ్ణా న్నిందు క్ష్వేడా వివేశ్వర ఇతి న్యాయేన స్తుతి నిందయో స్తుల్య ఇత్యర్థః॥ ౧౯॥

## —◆ ఆ న్వ థి తా త్ప ర్య ము ◆—

మరిన్ని సంసార బంధ ముక్తుడైన యోగియొక్క లక్షణమును మళ్లీ చెప్పుచున్నాడు. నిందయనగా పరుని గుణములయందు దోషమును చెప్పుట, స్తుతి యనగా దోషవంతుల యందు గుణములను చెప్పుట. ఇవి సుఖ దుఃఖ ములను గలిగించెడి వగుటచే నిందా స్తుతులను సమముగా జూచుచు ఆత్మాను సంధాన పరుడగుటచె నిర్వాసనా మౌనము గలవాడై (మౌనము మూడు విధములు వాఙ్మౌనము, అక్ష మౌనము, కాష్ఠమౌనము, వాఙ్మౌ నము, కేవల వాక్కును బంధించుట. అక్ష మౌనము ఇంద్రియములను విష యాముల యందు పోనీయకుండుట, కాష్ట మౌనము స్వస్తికా ద్యాసనము ములచె దేహమును కదలకుండునట్లు చేయుట) సంత్యక్త వాసనా న్మౌనా దృతే నాస్త్యుత్తమంపదం॥ నిర్వాసనా మౌనము లేక ఉత్తమ పదవి దొరకదు. మౌనమనగా నిధిధ్యాసన మని తాత్పర్యము. బాల్యేన తిష్ఠా సెత్, బాల్యంచనిర్విద్య పాండిత్యేన తిష్ఠాసేత్, బాల్యం పాండిత్యంచ నిర్విద్య మౌనేన తిష్ఠాసేత్. బాల్యాం పాండిత్యం మౌనంచ నిర్విద్యా దథ బ్రాహ్మణః । ఇతిశృతి॥ బాల్య మనగా శ్రవణము, పాండిత్య మనగా మననము మౌన మనగా నిధిధ్యాసనము. యచ్ఛే ద్వాఙ్మనసి ప్రాజ్ఞ స్తద్య చ్ఛే ద్జ్ఞాన ఆత్మని । జ్ఞాన మాత్మని మహతి నియచ్ఛె త్తద్యచ్ఛే చ్ఛాంత ఆత్మని॥ వాగాది సర్వేంద్రియాత్మను మనసు నందును । మనసును బుద్ధియందును బుద్ధిని కర్త్రాత్మయందును కర్త్రాత్మను కేవల పరమాత్మ యందును నియమించి పరమాత్మను తెలుసు కొనవలయును గాన మౌనము లేక ఆత్మ సాక్షాత్కారము గలుగ నేరదు॥ శరీర యాత్ర నిర్వహించు కొరకు అనేక విధముల వాక్కు యొక్క వ్యాపారము ఉపేక్షించ తగి నది కాదని చెప్పుచున్నాడు । ప్రారబ్ధ ముండునంతవరకె శరీరముం డును గనుక అసిరమని దలచి భక్తి గలవాడై గృహమందు స్వాతంత్ర్య ముంచు కొనక పుత్రాదుల యొక్క అధీన మందునూ ఉండక తానొక

అతిధివలె నుండవలెను. (అతిధి, గృహ కార్యములను జూడడు) దారా పుత్రాది సంగమమును మార్గస్థుల యొక్క కూటమి వలె చూచి వలె నన్ను స్మృతి న్యాయముచె యెవడుండునో వాడు నాకు ప్రియుడు (ఈశ్వ రుడు చంద్రునిన్ని విషమునున్నూ కూడా గ్రహించి నట్లు పండితుడు గుణమును దోషమునున్నూ గ్రహించ వలయు నన్ను స్మృతి ప్రకారము నిందాస్తుతులయందు సమానుడు గావలయును॥ శ్లో॥ చండాలోయ మథ ద్విజాతి రధవా శూద్రో(?) ధకిం తాపసః కింవా తత్వవివేక పేశలమతి ర్యోగీశ్వరః కోపికిం। ఇత్యేవం సవికల్ప జాల ముఖరై రాభాష్యమాణా జనై ర్నకృద్ధాః పధి నైవ తుష్ట మనసో యాంతి స్వయంయోగినః॥ భర్తృహరిః॥ ౧౯

శ్లో॥ యేతు ధర్మ్యామృత మిదం యథో క్తం పర్యుపాసతే।
శ్రద్ధధానా మత్పరమా భక్తా స్తేతీవ మే ప్రియాః॥ ౨౦

ఇతి శ్రీభగవద్గీతాసూ పనిషత్సు బ్రహ్మ విద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే భక్తి
యోగోనామ ద్వాదశోధ్యాయః॥

—♦ భాష్యమ్ ♦—

ఏతదేవ స్థిత ప్రజ్ఞస్య లక్షణ మవధార్యో పసంహరతి యేత్వితి॥ఏవం సత్యద్వేష్టా సర్వభూతానా మిత్యాది యథోక్తం యే పర్యుపాసతే తఏవ శ్రద్ధదానా మత్పరమా భక్తా మేతీవ ప్రియా ఇత్యర్ధః॥౨౦॥

ఇతి శ్రీ శ్వేతాచార్య గురుచరణ శిష్య భావ సమాసాదిత శైవసిద్ధాంత ప్రవర్తక శ్రీ శ్రీకంఠ శివాచార్య విరచితే తత్త్వైక దర్శన నామకే గీతాభాష్యే భక్తియోగో నామద్వాదశోధ్యాయః

## —◆ లఘుటిప్పణీ ◆—

అద్వేష్టేతి॥ తత్ర రాజధర్మ మర్యాదా తిరిక్త ద్వేష వివర్జిత ఇత్యర్థః॥ ౨౦॥

ఇతిశ్రీ శ్రీకంఠశివాచార్య శిష్య విశ్వేశ్వర శివాచార్య విరచితాయాం లఘుటిప్పణ్యాం భక్తియోగః

## —◆ ఆంధ్రి తాత్పర్యము ◆—

ఇదియే స్థిత ప్రజ్ఞుని లక్షణమని చెప్పి విరమించుచున్నాడు. ఇది వరకు నేనుడివిన సర్వభూతములను ద్వేషింపరాదను మొదలయిన ధర్మ స్వరూపామృతమును ఎవరుపాసింతురో అట్టి శ్రిద్ధాళువులు నాయందా సక్తులు నగుచు నాకు భక్తులైన వారు నాకు మిగుల హితులు॥ ౨౦॥

ఇట్లు తత్త్వైక దర్శనమను శ్రీకంఠీయ గీతాభాష్యమునకు బోధానంద మహర్షిచేరచింపబడిన భావబోధమను నాంధ్రి తాత్పర్యమున భక్తియోగమనుపదిరెండవ అధ్యాయము సమాప్తము.

---

 

ఓమ్

# శ్రీమచ్ఛ్రీకంఠాచార్యకృతే

# శ్రీ భగవద్గీతాభాష్యే

## క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగః - త్రయోదశోధ్యాయః



శ్రీకృష్ణ ఉవాచ—

శ్లో॥ ఇదం శరీరం కౌన్తేయ క్షేత్ర మిత్యభిధీయతే ।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥ ౧

—♦ భాష్యమ్ ♦—

క్షేత్ర క్షేత్రజ్ఞయో ర్జ్ఞానంతదన్యస్య వివేకతః । పరాత్మానం తతో జ్ఞేయం కైవల్యం తత్త్రయోదశే॥ నను కస్త్వం భవాన్నైవ కుత ఆగతోసి కుతో హి గన్తా క్వచ సమ్యసిష్యసీత్యాద్యుత్తర శూన్యానాం కథం పరాభక్తి రుపపద్యత ఇత్యాహ—ఇదమితి । తత్రైవంసతి । హేకౌన్తేయ ఇద మింద్రియాన్తః కరణ సహితం భోగాయతనం శరీరజాతం క్షేత్ర మిత్యభిధీయత ఇత్యర్థః । తథాచ బుద్ధి ర్మనోహం చ్చిత్తంచేత్యాది పంచవింశతి తత్వాత్మక మిదం సంఘాత స్వరూపమహం

మమేతి యో వేత్త్యభిమన్యతే తం క్షేత్రజ్ఞం క్షేత్రక్షేత్రజ్ఞయో ర్వివేక విదో మహాన్తః ప్రాహు రిత్యర్థః॥ ౧॥

## —◆ లఘుటిప్పణీ ◆—

నను యచ్చ కించ జగత్యేతేత్యాది శ్రుత్యా సర్వస్య చిజ్జడాత్మకస్య ప్రపంచజాతస్య విష్ణురూపత్వే స్థితే తత్ర వివేకార్థ మాహ। క్షేత్రే ఇతి। తత్ర తావ దచేతన మాత్రస్య శరీర జాతస్య క్షేత్రత్వం తద్యైక ఏవపిః భూతాత్మేతి ద్వా సుపర్ణేతి శ్రుతిభ్యాం సమష్టి వ్యష్టి రూపేణచ క్షేత్రజ్ఞత్వ మిత్యుభయో ర్జ్ఞాన మిత్యర్థః ఏవం తదన్యస్య యో వేదా వితి శ్రుతి వేద్యస్య చిదంబరాత్మనో వివేకతో జ్ఞానేన తతః పరం పరాత్మానంచ నిష్కలం విజ్ఞేయ మిత్యర్థః॥ ౧॥

## —◆ ఆంధ్రతాత్పర్యము ◆—

పదమూడవ అధ్యాయంబున క్షేత్ర క్షేత్రజ్ఞుల యొక్క వివేక జ్ఞానమున్ను వీరికంటె నన్యమైనవాడు పరమాత్మ యనియు అదియే కైవల్యమనియు, తెలియ నగును. శ్రీకృష్ణుం డిట్లనియె. ఓయీ! నీ వెవ్వరవు. నీ వెక్కడనుండి వచ్చితివి. యెక్కడకు వెళ్ళెదవు, యెక్కడ నివసించుచున్నావు. ఇత్యాది ప్రశ్నలకు ఉత్తరువు లేనివార్లకు పరాభక్తి యెట్లు కుదురునంటే చెప్పుచున్నాడు. ఓ అర్జునా! ఈ ఇంద్రియాంతః కరణలతో గూడి భోగమునకు స్థానమైన శరీర సముదాయము క్షేత్ర మనిపించుకొనును. జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము, వాయుపంచకము శబ్దాదిపంచకము, మనో బుద్ధి చిత్తా హంకారములు, మూలప్రకృతి, ఇట్టి యిరువది యైదు తత్వాత్మకమైన సముదాయ రూపమైన క్షేత్ర (శరీర)ము నేను నాది యని యెవడు అభిమానించు చున్నాడో వాడు క్షేత్రజ్ఞు (జీవు) డని క్షేత్ర క్షేత్రజ్ఞ విదులైన మహాత్ములు పలుకుచున్నారు. ఓయీ!

(ఈదృశ్యమాన శూన్యమాణ మై చేతనా చేతనాత్మక మైన జగత్తు విష్ణు రూపమై యున్న దగుచుంటె అందు వివేకము కొరకు జెప్పుచున్నాడు. అచేతనమైన శరీర సముదాయమును క్షేత్రమనిన్ని, భూతములను సృష్టించిన వాడొకడె ప్రతిభూత మందును ఉన్నాడను నట్టి శృతిని బట్టిన్ని, రెండు పక్షులు స్నేహము గలిగి ఒకే వృక్షము నందున్నవని చెప్పిన శృత్యర్థము జీవేశ్వరు లిద్దరును సమష్టి వ్యష్టి రూపముగా ఈ క్షేత్ర (శరీర) మును దెలియుటచే క్షేత్రజ్ఞు డనిన్ని తెలియవలెను. పంట భూమి యందు సస్యాదులు ఫలించు నట్లు శరీరమందు పుణ్య పాపములు ఫలించును గాన దీనికి క్షేత్ర మని పేరు. అందు ఫలించిన పుణ్య పాపములను సుఖ దుఃఖ రూపముగా తెలియువాడు గాన క్షేత్రజ్ఞుడు. ఈ క్షేత్రజ్ఞుడు జీవుడని యు ఈశ్వరుడనియు రెండు విధములు. విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు. ఇది జీవలక్షణము. విరాట్టు, హిరణ్యగర్భుడు, ఈశ్వరుడు, ఇది ఈశ్వర లక్షణము. జీవుడు, వ్యష్టి, ఈశ్వరుడు సమష్టి, వ్యష్టి రూపముగా విజ్ఞానమయ కోశమందు జీవుడును ఆనందమయ కోశమందు ఈశ్వరుడును శరీరమం దున్నారు. వీరిద్దరును సగుణ స్వరూపులు. వీరిద్దరి కంటెను అతిరిక్తమై నిర్గణమైన పరశివుడు ప్రణవాతీతుడై యున్నవాడు. స్థూల సూక్ష్మకారణ ములకు సాక్షిగా నున్నాడు. అతనిని పరాత్మనుగా నున్నూచిదాకాశ రూపునిగానున్నూ కైవల్య రూపునిగాను తెలియవలెను॥ ౧॥

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వ క్షేత్రేషు భారత ।
క్షేత్ర క్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ॥

—◆ భాష్యమ్ ◆—

నను తద్విద ఇత్యనేన కిముచ్యత ఇత్యప్యాహ–క్షేత్రజ్ఞ మితి । ఏవం తత్త్వైకపవహిభూతాత్మే, త్యాది శ్రుత్యా వ్యష్టి

భావేన జీవః సమష్టి భావేన చేశ్వర ఇతి ద్వాసుపర్ణేత్యాది శ్రుత్యా చ జీవేశ్వరయోః సర్వక్షేత్రేష్వవస్థితి రిత్యర్థః । నన్వే తయోః పరం కిమ స్తీ త్యాహ—క్షేత్రేతి।తథాచహే భారత క్షేత్రం యథోక్తం శరీరం క్షేత్ర క్షేత్రజ్ఞౌచ వ్యష్టి సమష్టి భావేన జీవేశ్వరాత్మకా ద్వౌ సంకలనయా తేభ్యశ్చ పరం మోక్షసాధనత్వా దప్యవిద్యా విరోధి చిందబరాఖ్యం జ్ఞానం మమ పరంపదత్వేన మత మిత్యవధార్యమ్॥౨॥

—♦ లఘుటిప్పణీ ♦—

అవిద్యా విరోధీతి॥ నను జ్ఞానవతాం తయో ర్విరోధా భావేపి మే చక దత్త జ్ఞానమేవ న స్యాయ్యః తద్యథా మేచకాగ్నింధేన తుల్యంచే న్మేచకానాం తదిష్యతామిత్యాది ద్రష్టవ్యమ్॥౨॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

ఓయీ! దానిని తెలియవలెనని చెప్పుటచే యేమిచెప్పబడుననగా చెప్పుచున్నాడు. భూతాత్మ ఒక్కడే వ్యష్టిభావముతో జీవుడయినాడు. సమష్టిభావముతో ఈశ్వరుండయినాడు (వ్యష్టి సమష్టిలోనిదే గనుక) జీవే శ్వరులు సర్వక్షేత్ర (శరీర)ములయందు నున్నారు. ఓయీ! వీరిద్దరికంటె పరేమున్నదంటె చెప్పుచున్నాడు. ఓ భారతా శరీరము క్షేత్రమని చెప్ప బడినది క్షేత్ర క్షేత్రజ్ఞులున్నూ వ్యష్టిసమష్టి భావముతో జీవేశ్వర స్వరూపు లిద్దరని వప్పుకొనుటచే క్షేత్ర క్షేత్రజ్ఞులకంటె పరమైనట్టిన్ని మోక్షసాధన మగుటవల్లను అవిద్యనుపోగొట్టె చిదంబరమనే జ్ఞానము నాపరంపద మనిన్ని నామత మనిన్ని తెలియుము॥౩

శ్లో॥ తత్క్షేత్రం యచ్చయాదృక్చ యద్వికారి యతశ్చయత్ ।
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శ్రుణు॥ 3

## — భాష్యమ్ —

అథ సంక్షేపేణోక్త మర్థ మ్విస్తరేణేహ వక్తుమాహ-తత్ క్షేత్రమితి । తత్రైవం సతి తదిదం ప్రాగుక్తం శరీరం క్షేత్రం యచ్చ స్వరూపేణ పరిచ్ఛిన్నాది స్వభావం యాదృక్ చేచ్ఛాది ధర్మకం యద్వికారి యైశ్చేన్ద్రియాది వికారై ర్వ్యక్తం యతశ్చ చిదచిద్విశిష్ట కారణ ముత్పద్యతే తద్వర్ణయామీతి శేషః । ఏవం సచ తచ్ఛబ్దేన లక్ష్యోఽఖండ శ్చిదంబరాత్మా యత్ప్రభావశ్చ స్వప్రకాశానన్ద స్వభావ స్తద్యథాత్మ్యం సంక్షేపేణ మమ వచసా చ్ఛృణు శ్రుత్వా చావధారయే త్యాశయః

## — లఘుటిప్పణీ —

యుక్తమితి । తద్యథా । 'బుద్ధి ర్మనో హం చిత్తం చ మూలాఖ్యా ప్రకృతి స్తథా । ద్విషేంద్రియాణి భూతాని వాయవః పంచవింశతిః' । ఇత్యాది స్మృత్యా తత్తద్వికారై ర్వ్యక్త మిత్యర్థః॥ 3॥

## — ఆంధ్రతాత్పర్యము —

తరువాత సంక్షేపముగా చెప్పినదానినే విస్తరించి చెప్పుచున్నాడు. ఈ చెప్పబడిన శరీరమను క్షేత్ర మెటువంటిదో యెట్లు పరిచ్ఛిన్నమైనదో ఇచ్ఛా రాగము మొదలయిన ధర్మము లెందువలన గలిగినవో యెందుకు షడ్భావ వికారముల నొందినదో ఇంద్రియ వికారములతో నెందుకు గూడుచున్నదో చిదచిద్విశిష్ట కారణమై యెందుకు పుట్టుచున్నదో దానిని వర్ణించు చున్నాను. ఈప్రకారము తచ్ఛబ్ద లక్ష్యమై అఖండమైన చిదంబర స్వరూప మెట్టిదో యెట్టి ప్రభావము గలదియో తన్నుతాను తెలుసుకొని ఆనందించుటయె స్వభావముగాగల ఆస్వరూపమును సంక్షేపముగా

నావాక్యము వలన విని నిశ్చయించు కొనుము (బుద్ధి మనసు అహంకారము చిత్తము మూలప్రకృతియు జ్ఞాన కర్మేంద్రియములు, భూతములు వాయువులు, గలిసి యిరువదియయిదు. వీటి వికారములతో గూడు కొనిన దని యర్థము॥ ౩॥

శ్లో॥ ఋషిభి ర్బహుధా గీతం ఛందోభి ర్వివిధైః పృథక్ ।
బ్రహ్మసూత్ర పదై శ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః　౪

—◆ భా ష్య మ్ ◆—

నను కై ర్వ స్తరేణో క్తం యద్భవతో చ్యత ఇత్యాహ ఋషిభిరితి ॥ తదిత్థం యదృషిభి ర్వసిష్ఠాదిభి ర్యోగశాస్త్రేణ యమ నియమాది సాధనై ర్బహుధా గీతం తథోక్తా త్యుక్తేత్యాదిచతుర్వింశతి ఛందోభి స్తతోధికై ర్వావివిధైః బ్రాహ్మణైః కరోస్మపాస నాకరుభి రు క్తమేవ మథాతో బ్రహ్మజిజ్ఞాసా జన్మాద్యస్యయత ఇత్యాది బ్రహ్మస్రూతపదైః సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ యతోవా ఇమాని భూతాని జాయన్త ఇత్యాదిశ్రుతి మూలక తయాహేతు మద్భిర్వి నిశ్చితైశ్చో పక్రమోప సంహారై షడ్విధ సిద్ధాన్త నిర్ణయకై ర్లింగైశ్చ జ్ఞానకాండస్థై ర్బహుధా గీత మిత్యర్థః॥౪॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

అధాతఇతి తత్ర తావదథ వేదాధ్యయనానంతర మత శ్శమ దమాది షట్సంపత్తే స్సత్వేనాంతః కరణస్య శుద్ధత్వాత్ బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యేత్యర్థః ఏవంసతి నహ్యన్య జ్ఞానా దన్యగతా నర్థ నివృత్తి రితిజీవబ్రహ్మణో

రేకత్వ మపి స్ఫుటీకృతం ఏవ మపర మప్యాహ జన్మాదీతి తథాచ యతో
ఽజ్ఞానానాం జగతో జన్మాది జన్మస్థితి భంగం భవతి తదిదం బ్రహ్మ
విజ్ఞాతవ్య మిత్యాద్యర్థ యుక్తైర్బ్రహ్మ సూత్రపదై రిత్యర్థః॥౪॥

## —◆ ఆంధ్ర తాత్పర్యము ◆—

ఓయీ! యెవరు విస్తరించిన దానిని నీవు చెప్పెదవంటె చెప్పుచు న్నాడు. దానిని ఈ ప్రకారము వశిష్ఠాది ఋషులు యోగ శాస్త్ర మందు యమ నియమాది సాధనములచే ననేక విధములుగా వర్ణింపబడినదిన్ని ఉక్తా అత్యుక్తా మొదలయిన యిరువదినాల్గు చందస్సులచే గాని ఇంకా యెక్కువగాగాని కర్మోపాసన జేసినఅనేక విధములయిన బ్రాహ్మణులచే పృథక్కుగా చెప్పబడినదిన్ని అథాతో బ్రహ్మజిజ్ఞాసా జన్మాద్యస్య యతః ఇత్యాది బ్రహ్మసూత్ర పదములచేత యీ భూతములన్ని దేనివలన పుట్టుచున్నవో అదియె సచ్చిదానంద రూప బ్రహ్మమను పరమశివుడని శృతి మూలకముగా జ్ఞానకాండయందుఉపక్ర మోపసంహారములచే షడ్విధ సిద్ధాంతములను నిర్ణయించు లింగములచే నిశ్చయింపబడిన బ్రహ్మసూత్ర ములచే అనేక ప్రకారములుగా తెలియ తగినటువంటెది. (వేదాధ్యయనా నంతరమందు శమాది షట్సంపత్తి గలుగుటచే అంతఃకరణ శుద్ధమగుట వలన బ్రహ్మజిజ్ఞాస చేయవలయును. మరియొక పదార్థమును దెలియుటచె యన్యగతమైన యనర్థము నివృత్తియైనదని చెప్పుట వలన జీవ బ్రహ్మలు ఒక్కరని స్పుటమైనది. అజ్ఞానులకు జగత్తుయొక్క సృష్టిస్థితి సంహార తిరో భావా నుగ్రహములు యెవనివలన గలుగుచున్నవని దోచుచున్నదో అదియె బ్రహ్మమను పరశివుడని యర్థముతో గూడిన బ్రహ్మసూత్రపదములచే దెలియదగిన వాడు॥౪॥

శ్లో॥ మహాభూతాన్యహంకారో బుద్ధి రవ్యక్త మేవచ ।
ఇంద్రియాణి దశైకంచ పంచ చేన్ద్రియ గోచరాః॥ ౫

—♦ భా ష్య మ్ ♦—

అథేహ క్షేత్ర స్వరూపమపి తావదాహ । మహేతి । తత్రైవం సతీహ । తావన్మహాన్తి భూతాని భూమ్యాదీని పంచ తథా హంకార స్తత్కారణ భూత మేవం బుద్ధి రధ్యవసాయ లక్షణం మహత్తత్త్వం । తథైవ । తత్కారణంతు బిందు ప్రకృత్యాత్మక మవ్యక్త మిత్యర్థః ఏవం(శ్రోత్ర) త్వక్చక్షు ర్జిహ్వా ఘ్రాణాఖ్యాని పంచ జ్ఞానేంద్రియాణి తథా వాక్పాణి పాద పాయూ పస్థాఖ్యాని పంచ కర్మేంద్రియాణిచేతి మిళిత్వా దశేన్ద్రియాణి చే త్యర్థః । ఏవ మత్రై క మర్ధ మాత్రకం బిందాధార భూతం మహా ప్రకృతి లక్షణ మవ్యక్తమేక మేవే త్యర్థః । ఏవ మేవ శబ్ద స్పర్శ రూప రస గంధాః పంచ జ్ఞానేంద్రియ గోచరాః ఏవం వచనా దాన గమన విసర్గ మేహనాని చేతి పంచ కర్మేంద్రియ గోచరా విషయా శ్చేత్యర్థః॥ ౫॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

బిందుప్రకృత్యేతి । తద్యథా । క్రియాశక్తిప్రధానా యాశ్శబ్ద శబ్దార్థ కారణంప్రకృతే ర్బిందురూపిణ్యా స్ఫోట బ్రహ్మ భవ త్పరే త్యాది స్మృత్యా పరా పశ్యన్తి మధ్యమా । వైఖరీత్యేవం క్రమేణాకారోకార మకారాభ్యా మష్టధా ప్రకృతి రిత్యపిబోధ్యమ్॥ ౫॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఈశ్లోకమందు క్షేత్రము యొక్క స్వరూపమునున్నూ చెప్పు చున్నాడు. పృథి వ్యాప స్తేజో వాయు రాకాశ ములు అయిదు. అహం

కారము, దానికి కారణమైన బుద్ధియు । అధ్యవసాయ లక్షణము గల మహత్తత్త్వము దానికి సాధనమైన బిందు ప్రకృతి రూపమైన అవ్యక్తము శ్రోత్రత్వక్ చక్షు జిహ్వా ఘ్రాణము లయిన జ్ఞానేంద్రియము లయిదు. వాక్కు పాణి పాద పాయూపస్థలను కర్మేంద్రియము లయిదు. ఇక్కడ అర్ధమాత్ర ఒక్కటే బిందువుకు ఆధార భూతమై మహాప్రకృతి లక్షణము గలిగిన అవ్యక్తమొక్కటియే । శబ్ద స్పర్శ రూప రస గంధము లయిదును జ్ఞానేంద్రియ గోచరములు. వచనా దాన గమన విసర్గ మేహనము లయిదును కర్మేంద్రియ గోచరములున్నూ విషయములున్నూ క్రియాశక్తి ప్రధానమైనట్టిన్ని. శబ్దమునకు అర్థమునకున్నూ కారణమైన బిందు రూపమైన ప్రకృతి వలన స్ఫోటబ్రహ్మము ముందుగా పుట్టెనను స్మృతిచేత పరా - పశ్యంతీ - మధ్యమా - వైఖరీ. శ్లో॥ అర్థరూపా పరావిద్యా పశ్యంతీ వర్ణరూపిణీ - మధ్యమా పదరూపాస్యా ద్వైఖరీ వాక్యరూపిణీ॥ పరాఅనగా ఒక అభిప్రాయమును మనసు యందు నిశ్చయించుకొనుట పశ్యతీ- ॥ అనగా - ఆయభిప్రాయమును పైకి చెప్పుటకు యేమేమి అక్షరములను కూర్చవలెనో అట్లుకూర్చుట - మధ్యమా, యనగా - అట్లుకూర్చినది పదముగా చేయుట - వైఖరీ యనగా నట్టి వాక్యమును వాక్కుతో పైకి ఉచ్చరించుట । వీట్లతోటిన్ని అకార - ఉకార - మకారములు గలసి ప్రకృతి యెనిమిది విధములని తెలియవలెను. ఇదిన్ని ఒకపద్ధతి యని తెలియ వలెను॥ ౫॥

శ్లో॥ ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం సంఘాత శ్చేతనా ధృతిః ।
ఏతత్క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్। ౬

—♦ భాష్యమ్ ♦—

ఏవమిహ పూర్వోక్త విషయ ప్రయోజక మప్యాహ- ఇచ్ఛేతి । తత్ర తావ దిచ్ఛానామ సుఖేతత్సాధనేచ్ఛేదం మే

స్యాదితి స్పృహాఖ్యా చిత్తవృత్తిః తథా ద్వేషో నామ పూర్వో
క్తేచ్ఛా విరోధినీ చిత్తవృత్తిః । ఏవం సుఖంనామ నిరుపాధి
కేచ్ఛా విషయీభూత చిత్తవృత్తిః । ఏవం దుఃఖమపి సోపా
ధికా చిత్తవృత్తిః తత్ర సంఘాతస్తు పంచ మహాభూత పరి
ణామః । తత్ర జ్ఞానాఖ్యా చిత్తవృత్తిస్తు ధృతి రిత్యర్థః । ఏవం
సత్యేతత్సర్వం క్షేత్ర మితి సమాసేన సంక్షేపేణ మహాభూ
తాది ధృత్యన్త ముక్త మిత్యాశయః॥౬॥

## —◆ లఘుటిప్పణీ ◆—

పరిణామ ఇతి । తద్యథా । ద్విధా విభజ్య చైకైకం చతుర్ధా విభజే
త్పునః స్వాంశం త్యక్త్వా పునస్తేషు యోజనా త్పంచపంచత । ఇత్యాది
స్మృత్యా పంచీకరణేన పృథివ్యాది సూక్ష్మ పంచభూతానా మపి మహా
భూతత్వం స్ఫుటీకృతమ్॥ ౬॥

## —◆ ఆంధ్రతాత్పర్యము ◆—

పూర్వోక్తమైన విషయములకు ప్రయోజనము నున్నా చెప్పు
చున్నాడు. ఇచ్ఛయనగా సుఖమందును అట్టి సుఖమునకు సాధనమైన
పరికర మందును, ఇది నాకు కావలయునను చిత్తవృత్తికి స్పృహ యని
పేరు. ద్వేషమనగా ఇచ్ఛకు విరోధమయిన చిత్తవృత్తి. సుఖమనగా
ఉపాధి రహితమైన ఇచ్ఛకు విషయమైన చిత్తవృత్తి. దుఃఖమనగా
ఉపాధి సహితమైన చిత్తవృత్తి. సంఘాతమనగా పంచభూత పరిణామ
మైన శరీరము. జ్ఞానమను పేరు గల చేతనయు ధృతియు ఇవన్నియు గలసి
క్షేత్రమని, మహాభూతములు మొదలుకొని ధృతివరకు సంక్షేపముగా
చెప్పబడెను. (పంచభూత పరిణామ మనగా ఒక్కొక భూతమును

రెండుభాగములు చేసి అందొక భాగమును నాల్గు భాగములు చేసి పెట్టి భాగమును వదలి మిగిలిన నాల్గు భాగములను నాల్గు భూతములలో కలుపుట వలన యిరువది యయిదు తత్వము లయినవి. ఇదియే పంచీకరణ, సూక్ష్మ భూతములయిన శబ్దాదులున్నూ మహాభూతములని తెలియ చేయబడెను॥ ౬॥

శ్లో॥ అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాన్తి రార్జవం ।
ఆచార్యో పాసనం శౌచం స్థైర్య మాత్మ వినిగ్రహః॥ ౭

—◆ భా ష్య మ్ ◆—

ఏవమిహ క్షేత్రా ద్వివేకేన క్షేత్రజ్ఞం ప్రతిపాద్య తదో జ్ఞానార్థం సమాధాన మప్యాహ అమానిత్వమితి। తత్ర తావద్విద్యమానై రవిద్యమానై ర్వా గుణై శ్లాఘనం మాని త్వం తథా ర్థలాభ పూజా ఖ్యాత్యర్థం స్వధర్మస్య ప్రకటీకరణం దంభిత్వం। ఏవం కాయ వాఙ్మ నోభిః ప్రాణినాం పీడనం హింసా తథైవ తేషాం నివ ర్తనం త్వమానిత్వ మదంభిత్వ మహింసే త్యు క్తం భవతి। తథైవా పరాపరాధ సహనం క్షాన్తిః । ఏవమకౌటిల్యం తు హృదయ మార్జవమువ క్రతేతి యావత్ । ఏవమేవా చార్యో త్ర శ్రవణాదినా యమ నియమాదినాచ మోక్ష సాధనో పదేష్టా తథా తస్యో పాసనంచ ప్రాణా ర్థ ధీ వాగ్భి ర్నమస్కారాదిభి శ్చోపసేవనం తథా శౌచంచ మృజ్జల లాభ్యాం బాహ్యం। విషయేషు దోషదర్శనేన చాంతరం । ఏవం స్థైర్యస్తు పునః పున ర్విఘ్నబాహుళ్యేపి

త్రా భ్యాసే యత్నాధిక్యమ్ । తథాత్మనో దేహేంద్రియాది సంఘాతం మనసా నిరుధ్య మోక్షసాధనే వ్యవస్థాపన మితి వివేకః॥ ౭॥

## —♦ లఘుటిప్పణీ ♦—

ప్రకటీకృతమితి తద్యథా కర్మనాశా జలస్పర్శా త్కర్మనాశా విలంఘనా ద్గండకీ బాహు తరణా ద్ధర్మః క్షరతి కీర్తనా దితి స్మృత్యన్త రాదపి స్వధర్మస్య ప్రకటీకరణం నోచిత మితి భావః॥ ౭॥

## —♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

క్షేత్రమువలన వివేకముచే క్షేత్రజ్ఞుని చెప్పి క్షేత్ర క్షేత్రజ్ఞుల నెరుగుట కొరకు సమాధానమును న్నూ చెప్పుచున్నాడు. ఉన్నవిగాని లేనివిగాని గుణములచే పొగడుట మానిత్వము ఆదిలేకుండుట అమానిత్వము. ధనలాభ పూజాఖ్యాతుల కొరకు తనధర్మమును ప్రకటన చేయుట దంభిత్వము. అట్లు చేయకుండుట అదంభిత్వము.మనోవాక్కాయములచే ప్రాణులను పీడించుట హింస. అట్లు చేయకుండుట అహింస. ఇతరులయొక్క అపరాధమును సహించుట క్షాంతి. కుటిలత్వము లేని హృదయము ఆర్జవము శ్రవణాదుల చేతను అష్టాంగయోగముల చేతను మోక్షసాధనమును ఉపదేశించిన వాడు ఆచార్యుడు. అట్టియాచార్యుని యుపాసనయనగా ప్రాణ ధన బుద్ధి వాక్కుల చేతనున్నూ నమస్కారాదుల చేతనున్నూ సేవించుట మృజ్జలాదులచే జేయునది బాహ్యశుచి విషయములందు దోషముండుటచే విషయ విముఖత ఆంతరశుద్ధి స్థిరత్వము గలిగి యుండుట యనగా మాటిమాటికి విఘ్నములొచ్చినను ప్రయత్నమెక్కువ చేయుట ఆత్మవినిగ్రహమనగా దేహేంద్రియాది సముదాయమును మనసుతో గూడా అరికట్టి మోక్ష సాధనమందుండుట యని తెలియవలెను. (జలస్పర్శ లేక కర్మ నశించిపోవును. విధ్యుక్తముగా చేయని యెడల కర్మనాశమగును. గండకీ

నదిని బాహువులతో ఈదినను స్వధర్మమును ప్రకటన జేయుట వలనను ధర్మము నశించి పోవును. ఇట్లు స్మృతిని బట్టి తాను చేసిన ధర్మమును చెప్పుకొన గూడదని యభిప్రాయము॥౭॥

శ్లో॥ ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవచ ।
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషానుదర్శనమ్॥ ౮

—♦ భాష్యమ్ ♦—

అథాపరమపి తత్త్వప్రాప్తి సాధన మాహ—ఇంద్రియార్థేష్వితి । తత్ర తావచ్ఛబ్దాదిషు దృష్టేష్వా నుశ్రవికేషు వేన్ద్రియార్థేషు భోగేషు వైరాగ్యమ్ । తథా గర్భోఽహంకార భావోపీతి చా దమానిత్వాదీనా మపి సంగ్రహ ఏవ జన్మాదివ్యాధ్యన్తేషుచ దుఃఖదోషా నుదర్శన మప్యాత్మప్రాప్తి సాధనత్వేనా పేక్షిత మితిభావః॥౮॥

—♦ లఘుటిప్పణీ ♦—

వైరాగ్యమితి । తద్యథా । 'ఔదాసీన్యామృతేనాపి వర్ధమానే దినే దినే । ఉన్మూలితే మనోమూలే జగద్వృక్షః పతిష్యతీ' త్యాది రీత్యావధార్యమ్॥౮॥

—♦ ఆంధ్రతాత్పర్యము. ♦—

మరియొక విధముగా తత్వప్రాప్తి సాధనమును చెప్పుచున్నారు. శబ్దాదులయిన ఇంద్రియ భోగములయందు వైరాగ్యము గలిగి యుండుట, శ్రోత్రిముచే శబ్దమును వినక త్వగింద్రియముచే స్పర్శమును తెలియక, నేత్రేంద్రియముతో రూపమును చూడక, జిహ్వేంద్రియముచే రుచిని

గ్రహించక ఘ్రాణేంద్రియముచే సుగంధ దుర్గంధముల నాఘ్రాణించక అమానిత్వాది గుణములతో అహంకారమును వదలి, జన్మ, మృత్యువు, ముదిమి - వ్యాధి, వీట్లయందు దుఃఖము - దోషము, గలదని చూచుట, ఆత్మ ప్రాప్తికి సాధనమని యపేక్షించ బడినది. జగత్తను వృక్షము ఉదాసీనత్వమను జలముచే దినదినము వృద్ధి నొందినది. ఊరకుంటె జగత్తు పెరిగినది. జలముచే వృక్షము పెరిగినట్లని తాత్పర్యము. మనస్సనే వేరు నూడబెరికినయెడల జగద్వృక్షము పడిపోవును, మనస్సునుతీసివేసినజగత్తు లేకుండును. వేరును తీసివేసినచెట్టు పడిపోవును । అని తెలియవలెను॥ ౮॥

శ్లో॥ అసక్తి రనభిష్వంగః పుత్ర దార గృహాదిషు ।
నిత్యంచ సమచిత్తత్వ మిష్టా నిష్టో పపత్తిషు॥　　౯

## —♦ భా ష్య మ్ ♦—

ఏవ మపరమపి తత్సాధన మాత్మ తత్వ ప్రాప్త్యర్థ మాహ । అసక్తిరితి । తత్ర తావ త్పుత్ర దార గృహాదిష్వ సక్తి ర్నామా న్యస్మి న్సుఖిని దుఃఖినివా హమేవ సుఖీదుఃఖీ చేతి తదాగ్రహిత్య మసక్తి రిత్యర్థః । ఏవ మన్యే ష్వప్యత్యంత తాటస్థ్య మభిష్వంగ స్తద్రహిత మిత్యర్థః । ననుచ తస్యై తాదృశస్య జిజ్ఞాసోః కిమప్యపేక్షిత మపీత్యాహ—నిత్యంచేతి। తథాచా స్యేష్టా నిష్టో పపత్తిషు నిత్యం సమచిత్తత్వ మితి భావః॥ ౯॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నన్వస్తి భాతి ప్రియం రూపం నామ చేత్యంశ పంచక మాద్యం త్రియం బ్రహ్మరూపం జగద్బీజం తతో ద్వయ మిత్యాది శ్రుత్యా నామ

రూపయో ర్జగద్బీజత్వా త్తయోశ్చ మాయా రూపత్వా త్తస్యాశ్చ తస్య కారణ మాహు స్త్వాం సాంఖ్యా స్తత్త్వవిదో హరే । ఇత్యాది స్మృత్యా విష్ణు రూపత్వే స్థితే కిం తస్య భ క్తే రిత్యభిప్రేత్యాహ । తథాచేతి ! ఏవం తర్హి సగుణ భావేనాపి సీతాంచ పార్వతీం పశ్యే ద్రామం చైవ త్రిలోచన మిత్యాది రీత్యైవ భజే దిత్యనవద్యమ్॥ ౯॥

## —♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఆత్మ తత్త్వ ప్రాప్తి కొరకు మరియొక సాధనమును చెప్పుచున్నాడు. పుత్ర, దార, గృహాదుల యందు ఆసక్తి లేకుండుట అనగా పుత్రాదులు సుఖముగా నుండిన తాను సుఖిననియు వారు దుఃఖముతో నుండిన తాను దుఃఖి ననియు అనకుండుట, ఇతరుల యందు అత్యంతము తటస్థముగా నుండుట (ఇతరులకు సుఖ దుఃఖములు గల్గినప్పుడు తాను తటస్థముగా నుండుట.) అదిలేకుండవలయును. ఓయీ! ఇటువంటి ఆ జిజ్ఞాసునకు యేమి కావలయు నంటే చెప్పుచున్నాడు. ఈ జిజ్ఞాసునకు కష్ట సుఖములు ప్రాప్తించినప్పుడు నిత్యము చిత్తము సమముగా నుండవలయును. (ఓయీ! అస్తి, భాతి, ప్రియము, నామము, రూపము. ఇవి అయిదు అంశములు, మొదటివి మూడును బ్రహ్మస్వరూపము, మిగిలిన రెండును జగద్బీజమను శృతిచే నామరూపములు రెండును జగద్బీజ మగుట వలన మాయా స్వరూపము గనుక. మాయకు కారణము విష్ణువని స్మృతి యుండుట వలన విష్ణువునకు భక్తి వలన ప్రయోజన మేమనే యభిప్రాయమున చెప్పుచున్నాడు. సగుణ భావముతో నున్నా సీతను పార్వతిని గాను రాముని శంకరుని గాను చూడవలె ననే శృతి చొప్పున తప్పులేదు॥ ౯॥

శ్లో॥ మయిచా నన్య యోగేన భక్తి రవ్యభి చారిణీ ।
వివిక్త దేశ సేవిత్వ మరతి ర్జనసంసది॥ ౧౦

—◆ భా ష్య మ్ ◆—

ఏవ మపరమపి తత్సాధన మాహ— మయీతి తథాచా హంగిరో పాసనయా మస్యే త్వాం కాల మీశాన మితి స్మృతి న్యాయేన మయి సదాశివే త్వనన్య భావేనా వ్యభిచారిణీ భక్తి ర్నతు దక్షాదివ ద్దేవ తాంతర త్వేన చలిత భక్తి రితి తాత్పర్యం। ఏవం యస్మి న్దేశే హి తత్త్వజ్ఞో నాస్తి సజ్జన పాదప స్సఫలః శీతలచ్ఛాయో సతత్ర దివసం వసే దిత్యాది స్మృత్యుక్త దేశత్వంవివిక్తదేశ సేవిత్వమితి తథైవ వసే దితి భావః। ఏవమేవ। నథావతి జనాకీర్ణం నాగణ్య ముప శాంతిధీ ర్యథా తథా యత్ర తత్ర స్థిత ఏవో పశామ్యతీ త్యాదినా త్వరతి ర్జన సంసదీత్య నేనో క్త మవధార్యం॥౧౦॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

దక్షాదివదితి తద్యథా దశవర్ష సహస్రాణి దక్షో నైయజ్ఞ మాహర త్తే ద్యజ్ఞమదహ చ్ఛంభోః ప్రసాదేన వినా క్షణాత్’ ఇత్యాద్యస్యత్ర విస్తరః

—◆ ఆం ధ్ర తా త్ప ర్య ము ◆—

మరియొక సాధనమును చెప్పుచున్నాడు. అహంగిరో పాసనచే నిన్ను కాలస్వరూపుడైన ఈశ్వరునిగా తలచుచున్నానను భారతోక్త కుంతీ వచనముచే సదాశివుడనైన నాయందు అనన్యభావముచే అవ్యభిచార భక్తి గలిగి యుండుము. దక్షాదులు వలె దేవతాంతరము నుపాశించి చంచల భక్తుడవు గాకుమని తాత్పర్యము. యే దేశమందు తత్వమును తెలిసినట్టిన్ని ఫలములతో గూడుకొని యున్నట్టిన్ని చల్లని నీడగలిగిన సజ్జన వృక్షము లేదో ఆదేశమందు ఒక్క రోజైనను ఉండకూడదను స్మృతి ప్రకారము

చెప్పబడిన దేశమందుండుటయే ఏకాంతవాసమందుండుట. జనులు గుంపులుగా నున్నచోటికి పరుగెత్తరాదు. అరణ్యముననున్నా పరుగెత్తరాదు శాంతినొందిన బుద్ధిగలవాడగుచు యెక్కడనో ఒక్కచోట నుండి శాంతి నొందుమనను స్మృతి చెప్పిన ప్రాకృత జనులయందిచ్ఛ లేకుండుట (దక్షుడు పదివేల సంవత్సరములు యజ్ఞమును చేసెను, అట్టి యజ్ఞము ఈశ్వరానుగ్రహము లేనందున దగ్ధమైపోయెను. ఇత్యాదులు మరియొక చోట విస్తరించి వ్రాయబడెను॥౧౦॥

శ్లో॥ అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ ।
ఏత జ్జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం తదతోఽన్యథా॥ ౧౧

—♦ భా ష్య మ్ ♦—

నన్వతః పరమపి తస్య కి మపేక్షిత మిత్యాహ-అధ్యాత్మేతి । తత్ర తావదాత్మాన మధికృత్య ప్రవర్తత ఇత్యధ్యాత్మం జ్ఞానం తస్మి న్నిత్యత్వ మిత్యర్థః । తత్రైతేషు సతి వివేక నిష్ఠస్య హ్యమానిత్వాది తత్త్వజ్ఞానార్థ దర్శనాంతం వింశతి సంఖ్యాకం శాస్త్రజన్యం జ్ఞానం ప్రోక్త మతోఽన్యథా త్వజ్ఞానం మోక్షానుపయోగిత్వా దితి భావః॥౧౧॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

అధికృత్యేతి । ఇహ ఆత్మశబ్దేన బుద్ధి ర్మనో హం చిత్తం చే । త్యాది స్మృత్యా పంచవింశతి తత్త్వాత్మకం శరీరం గృహ్యతే । తచ్ఛరీర మధికృత్యైవ యది దేహం పృథక్ కృత్యేత్యాది రీత్యా బ్రహ్మవిద్యా ప్రవర్తతే తచ్చా త్మావారే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్య ఇత్యాది వేదాంతాదేవే త్యధ్యాత్మ విద్యా శబ్దేన వేదాంత మేవోచ్యత ఇత్యాశయః॥ ౧౧॥

## —♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ! అటుపైన అర్జునునకు కావలసినదేమంటె చెప్పుచున్నాడు. శరీరమును గురించి ప్రవర్తించునట్టిది అధ్యాత్మము. అట్టిజ్ఞానమునందు నిత్యత్వము నున్నూ (అనగా మోక్ష మన్నిటికన్న గొప్పదని యెంచు చుండుట) తత్వజ్ఞానముచే నాత్మసందర్శనమున్నూ । వివేకము గలవానికి అమానిత్వము అదంభిత్వము మొదలుకొని తత్వ జ్ఞానార్థ దర్శనాంతము యిరువది లెక్కగల శాస్త్ర జన్య జ్ఞానము చెప్పబడినది. వీటి కంటె విపరీత గుణములు అజ్ఞానము, మోక్షమున కుపయోగము లేనివి. ఇక్కడ ఆత్మశబ్దముచే మనో బుద్ధ్యాది పంచవింశతి తత్వములుగల శరీరమును తెలిసి వేరు చేసి ఆత్మను గ్రహించ వలెనన్న స్మృతి ప్రమాణముచే బ్రహ్మవిద్య ప్రాప్తమగుచున్నది. ఆత్మ సందర్శనము చెయ్యవలెను. శ్రవణ మనన నిదిధ్యాసలు చెయ్యవలె నన్న శ్రుతులు వేదాంతము నందున్నవియె గాన అధ్యాత్మమనగా వేదాంతమనియె అర్థము. ఉత్తర మీమాంసా శాస్త్రమునకు శారీరక మీమాంస యని యే పేరు. శరీరము తెలిస్తే నే గాని శరీరియైన ఆత్మ తెలియదు. అందుకు వేదాంత శాస్త్రమే ముఖ్యము॥ శ్లో॥ శైత్యైరావత శాంతి ధేను దమ సన్మందార బంధూ న్సదా మైత్ర్యాద్యప్సరసో వివేక తురగం సంతోష చింతామణిం ।। ఆత్మజ్ఞాన మహామృతం సమరసం వైరాగ్య చంద్రోదయం వేదాంతార్ణవ మాశ్రయాన్యనుదినం శ్రేయ స్స్వముక్తిప్రదం॥　　౧౧

శ్లో॥ జ్ఞేయం యత్త త్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వా మృత మశ్నుతే।
అనాది మత్పరంబ్రహ్మ నసత్త న్నాస దుచ్యతే॥　　౧౨

## —♦ భా ష్య మ్ ♦—

నను చ జ్ఞాన శబ్దైతై రేభి స్సాధనైః కిం జ్ఞేయమిత్యత ప్రతిజానీతే జ్ఞేయమితి నన్వీహ షట్సంపత్తిభి స్సా

ధనై ర్యజ్ఞేయం జ్ఞాత్వాచా మృతమశ్నుతే నామ సంసారా ద్విముచ్యతే తద్బ్రహ్మ కింస్వరూపం భవతీ త్యాహ - అనాదిమదితి ఏవం తర్హి ప్రధమం సహజం బ్రహ్మ మాయయా శూన్య మాగతం శూన్యా త్ప్రకృతి రీశశ్చ మహదాద్యా స్తతో జగది త్యాది స్మృత్యా మాయయా శూన్యాఖ్య మసదాగతం తతశ్చ బింద్వాఖ్యా కార్యా ప్రకృతి రీశశ్చేతి ద్వాసుపర్ణే త్యాది శ్రుతి వేద్యం కల్పితం సదాగతమితి సదసద్భ్యాం విహీనం త్రైకాలా బాధ్యత్వేనా నాది మధ్యాంత రహితం సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ ఈశం తం జ్ఞాత్వా, అమృతా భవంతీతి శ్రుతివేద్య మవధార్య మితి పరమార్థః॥ ౧౨॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

సదసద్భ్యామితి॥ తత్ర తావ చ్చిరకాల స్థాయిత్వేన సత్వం స్వల్పకాల స్థాయిత్వేన చాసత్వం తాభ్యాం విహీనం త్రైకాలా బాధ్యత్వలక్షణం సత్వ మనాది రిత్యర్థః॥ ౧౨॥

## —♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ! జ్ఞాన మను పేరుగల వెనుక జెప్పిన యిరువది సాధనముల చేతను దేనిని తెలియవలెనంటె చెప్పుచున్నాడు । శమాది షట్క సంపత్తి గల అమానిత్వాది సాధనములచే తెలియ దగిన దేనిని తెలిసి అమృతము ననుభవించు చున్నాడో అనగా సంసారము వలన ముక్తుడగు చున్నాడో అట్టి బ్రహ్మమును తెలియవలెను. అది యెట్టి దనగా చెప్పుచున్నాడు. మొదట సహజమైన బ్రహ్మమును పరమశివుడు ఉన్నాడు. అట్టి పరమ

శివునికి మాయా సంబంధము వలన శూన్యమను అసత్తు పుట్టినది. శృతి॥ అసద్వా ఇద మగ్ర ఆసీత్॥ శూన్యము వలన ప్రకృతియు ఈశ్వరుడును పుట్టిరి. వారి వలన మహత్తు అహంకారము మొదలయినవి పుట్టినవి. వాటి వలన జగత్తు పుట్టినదను నట్టి స్మృతిచే మాయచే శూన్యమను అసత్తు పుట్టినది. దానినుంచి బింమువను పేరు గల కార్యప్రకృతియు ఈశ్వరుడున్నూ పుట్టిరి. (అనగా జీవుడు, ఈశ్వరుడు) సుపర్ణ శ్రుతిచే తెలియదగిన జీవేశ్వర రూపముగా కల్పితమైన సత్తు, పుట్టినది. శృతి॥ తతోవైసద జాయత॥ భూత భవిష్య ద్వర్తమాన కాలముల యందుండు నట్టిన్నీ ఆది మధ్యాంతములు లేనట్టి సత్యము జ్ఞానము, అనంతమును ఆత్మ రూపమైన పరమ శివుని తెలిసి సంసారము నుండి విముక్తులగుచున్నారు. శ్రుతి॥ జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః । (చిరకాల ముండునది సత్తనిన్నీ, అల్పకాల ముండునది అసత్తనిన్నీ యున్నది. గనుక పరమాత్మ సత్తునూ గాదు. అసత్తునూ గాదని వచింతురు॥ ౧౨॥

శ్లో॥ సర్వతః పాణి పాదం తత్సర్వతోఽక్షి శిరోముఖం ।
　　సర్వతః శ్రుతి మల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి॥ ౧౩

—♦ భాష్యమ్ ♦—

ననుచ సదసద్భ్యాం విహీనం త్రైకాలా బాధ్యత్వేన విలక్షణాం స్వరూపం బ్రహ్మ కథ మిహా ధ్యస్తే జగతి భాసత ఇత్యాహ—సర్వతఇతి । తత్ర తావశ్చేత నశ్చేతనానా మేకో బహూనామి త్యాది శ్రుత్యా చేతనత్వేన ప్రతిభాసమానానాం క్షేత్రజ్ఞానాం మధ్యే చేతన స్సర్వ ప్రతిబింబక రూపస్తథా బహూనాం ప్రకృత్యాది మహాభూతానాం క్షేత్రాణాం మధ్యే సర్వాధిష్ఠాన రూపంచ పరబ్రహ్మైవే త్యధ్యస్త సత్త

యాపి రజ్జుసర్పవ త్సర్వతః పాణయః పాదాశ్చయస్య పరబ్రహ్మ
ణ స్సదాశివస్యే త్యాది సర్వ మావృత్య తదేవ సహజం
బ్రహ్మ పరాత్పర తరం తిష్ఠతీత్యర్థః॥ ౧౩॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

రజ్జుసర్పవదితి తద్యథా రామాయణేప్యుక్తమ్ తద్యథా, 'యదన్య
దన్యత్ర విభావ్యతే భ్రమా దధ్యాస ఇత్యాహు రముం విపశ్చితః అసర్ప
భూతేపిహి సర్పభావనా రజ్జ్వాదికే తద్వ దపీశ్వరే జగత్' ఇత్యాద్యధిక
మన్యత్ర విస్తరః॥౧౩॥

## —♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ సత్తును అసత్తును గాక త్రికాలా బాధ్య మగుటచే విలక్షణ
మై సద్రూపమైన బ్రహ్మము యీ అధ్యస్తమైన జగత్తునందు యేలాగు
కనిపించుచున్నదంటే చెప్పుచున్నాడు. చేతనశృతిచేత, చేతనముగా ప్రకా
శించు చున్న క్షేత్రజ్ఞులలో జీవరూపముగానున్నూ అనేకములైన ప్రకృతి
మొదలగు మహాభూతములయిన క్షేత్రములలో సర్వాధిష్ఠాన రూపముగా
నున్నూ పరమాత్మయె అధ్యస్త సత్తాచేత రజ్జువునందు సర్పమువలె యెటు
జూచినను పరబ్రహ్మమైన సదాశివుని యొక్క రూపము జేతులును కాళ్ళును
గలిగిఎటుచూచినను కన్నులు, శిరస్సులు,ముఖములును, కలిగిఎటుచూచినను
చెవులుగలిగి జగత్తునందున్నిటినియావరించుకుని యున్నది. అదియెఅన్నిటి
కంటె పరమైన సహజమైన బ్రహ్మమును పరశివుడు ఉంటున్నాడని తెలి
యవలెను. అధ్యాసమనగా ఒకవస్తువును భ్రాంతిచే మరియొక వస్తువుగా
జూచుట సర్పముకాని రజ్జువు మొదలయిన వాట్లయందు సర్పభావన
గలిగినట్లు ఈశ్వరుని యందు జగద్భానమున్నూ అట్లే గలిగినదని రామా
యణమందు చెప్పబడినది॥౧౩॥

శ్లో॥ సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితం ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ॥　　౧౪

—♦ భా ష్య మ్ ♦—

నను వ్యావహారిక సత్తయా సద్రూపమపి జగద్వస్తుతోఽసదిత్యధ్యారోపాపవాదాభ్యాం నిరూపయన్నాహ-సర్వేంద్రియేతి । తథాచేహ ధ్యాయతీవ తద్బ్రహ్మేత్యాది శ్రుత్యా పరమార్థత స్సర్వేంద్రియ వివర్జిత మపి తద్బ్రహ్మ మాయయా సర్వేంద్రియ గుణాభాసమపి భవతీ త్యన్వయః । ఏవం పరమార్థత స్సకల సంగ శూన్యమపి మాయయా సర్వాధిష్ఠానత్వేన సర్వభృచ్చ భవతి తథైవ పరమార్థతో నిర్గుణమపి గుణానాం సత్వ రజ స్తమసాం శబ్దాది ద్వారా సుఖ దుఃఖాది గుణ కార్య భోక్తృచ తద్బ్రహ్మ జ్ఞేయ మిత్యర్థః॥౧౪॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

అధ్యారోపాపవాదాభ్యా మితి । తద్యథా । ఉపాయా శ్శిక్షమాణానాం బాలానా ముపలాలనాః । అసత్యే వర్త్మని స్థిత్వా తత స్సత్యం సమీహత । ఇత్యాది ద్రష్టవ్యం॥ ౧౪॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ వ్యవహారమందు ప్రత్యక్షముగా గనుపించు జగత్తు పారమార్థికమందు లేదని అధ్యారోపా ఽపవాదములచే నిరూపించుచు చెప్పుచున్నాడు. పరమార్థము వలనసర్వేంద్రియవర్జితుడైన బ్రహ్మము మాయచే వ్యావహారికములో సర్వేంద్రియగుణములున్నట్లు అగుచున్నది. ఇటులనే పరమార్థము వలన సకల సంగ రహితమైన బ్రహ్మము మాయచే స్సర్వ

హారికమందు సర్వమునందు ఉండి సర్వమును భరించు చున్నట్లు అగు చున్నది (స్థూల సూక్ష్మ కారణముల నంటి నడిపించు చున్నట్లున్నది) అటులే పరమార్థము వలన నిర్గుణమైన బ్రహ్మము సత్వ రజస్తమో గుణములు గలిగి శబ్దాదుల ద్వారా సుఖ దుఃఖాది గుణములను కార్యముగ నేది అనుభవించు చున్నదో దానిని బ్రహ్మమని తెలియవలెను. (అధ్యారోపా ఉపవాదము లనగా, పిల్లవాళ్ళు అబద్ధమాడుట అధ్యారోపము। శిక్షించినప్పుడు నిజము చెప్పుట అపవాదము॥ ౧౪॥

శ్లో॥ బహి ర న్తశ్చ భూతానా మచరం చరమేవచ ।
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చా న్తికేచ తత్ ॥౧౫॥

—♦ భా ష్య మ్ ♦—

ఏవమేవ రజ్జు సర్పవత్త్వేనైవ సర్వం వ్యాప్త మిత్యాహ బహిర న్తశ్చేతి । తత్రైవం సతి సదస ద్రూపాణాం సర్వేషాం కల్పితానా మధిష్ఠాన మేకమేవేతి, తద్దూరే తద్వదంతిక ఇత్యాది శ్రుత్యా సర్వత్ర తస్య విద్యమానత్వేపి సూక్ష్మత్వా త్త దవిజ్ఞేయం సాధన శూన్యై స్సర్వసాధారణజనై రిత్యవ ధార్యం॥ ౧౫॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

సర్వం వ్యాప్తమితి । తద్యథా, 'యద్య ద్దృశ్య మిదం సర్వం నేతి మం త్యజ్య యుక్తిభిః । పారిప్యా వశిష్ట చిన్మాత్రం యో స్తి సో స్మీతి భావయ । ఏకం బ్రహ్మ చిదాకారం సర్వాత్మక మఖండితం । నిష్కంపం భూరివా శేషమితి భావయ రాఘవ ఇత్యాద్యాత్మార్చన ప్రకరణే యోగవాశిష్ఠే ద్రష్టవ్యమ్॥ ౧౫॥

## —◆ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ◆—

రజ్జువునందు సర్పమున్నట్లు పరమాత్మ సర్వమునందునూ ఉన్నాడని చెప్పుచున్నాడు. భూతములకు లోపల పైని అయ్యది నిండి యున్నది. చరా చరము లదియె అయినందున సూక్ష్మమగుటచే నదియే ఇదియని యెరుంగ శక్యముగాదు. మూఢులకు దూరముగను జ్ఞానులకు చేరువుగను ఉండును. సద్రూపములు కల్పితములునైన యన్నిటికి అధిష్ఠానము ఒక్కడే. దూరముగాను దగ్గరగాను ఉండు వాడొక్కడే. సర్వత్ర ఉన్నప్పటికి సూక్ష్మ మగుటచే సాధనము లేని సర్వసాధారణ జనులచే తెలియ శక్యము గానివాడని నిశ్చయించ దగినది. (తెలియ దగిన దానిని గూర్చి, శ్లో॥ నాహం దేహో నేంద్రియా ణ్యంతరంగం నాహంకారః ప్రాణవర్గో నబుద్ధిః । దారాపత్య క్షేత్ర విత్తాది దూర స్సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోహం. ఇట్టి యుక్తిచే దేహేంద్రియాదులను వదలి మిగిలిన చైతన్యమేదియో అదియే నేనని భావింపుము. చిద్రూపమైన బ్రహ్మమొక్కటె సర్వవ్యాపకమై అఖండితమై యున్నది. భూమివలె చలనము లేనిదై సర్వము తానై యున్నదని భావింపుమని యోగవాశిష్ఠ మందు రామునకు ఆత్మార్చన ప్రకరణమందు చెప్పెను. చూడనగును॥౧౫॥

శ్లో॥ అవిభక్తం చ భూతేషు విభక్త మివచ స్థితమ్ ।
　భూతభర్తృచ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ॥　　౧౬

## —◆ భా ష్య మ్ ◆—

అథ యదుక్త మేకమేవ సర్వ మావృత్య తిష్ఠతీతి తద ప్యాహ । అవిభక్తమితి । తత్త్రైవం సతి క్షేత్ర క్షేత్రజ్ఞేషు సర్వ భూతేషు చాకాశవ దవిభక్త మపి విభక్త మివచ స్థిత మిత్యర్థః ఏవం గుణత్రయేణ భిద్యన్తే బ్రహ్మ విష్ణ్వాదయ స్సమే వస్తుత

స్త్వేక మద్వైతం శివ మిత్యాహ హి శ్రుతి రిత్యాది శ్రుత్యా భూతానాం ప్రాణినాం భర్తృ గ్రసిష్ణుప్రభవిష్ణుచ బ్రహ్మాది రూపేణ తద్బ్రహ్మైవే త్యాశయః॥ ౧౬॥

## —♦ ల ఘు టి ప్ప ణీ . ♦—

బ్రహ్మాదిరూపేణేతి । తద్యథా, 'బ్రహ్మ విష్ణు సురేంద్రాద్యా యద్యత్కుర్వన్తి సర్వతః । తదేత చ్ఛివ్వపు స్సర్వం కరోతీ త్యేవ భావయే త్యపి బోధ్యమ్॥ ౧౬॥

## —♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఒక్కడే సర్వమును ఆవరించి యేది ఉంటున్నదని చెప్పెనో దానిని చెప్పుచున్నాడు. క్షేత్ర క్షేత్రజ్ఞుల యందునూ సర్వభూతముల యందునూ ఆకాశమువలె విభాగము లేక పోయినను ఘటాకాశ మఠా కాశముల వలె విభాగ మున్నట్లున్నదిన్నీ । బ్రహ్మ విష్ణు మహేశ్వరులు గుణత్రయముచేతను భేదము గలిగి యుండిరి, యథార్థముచె అద్వైతమైన శివుడొక్కడే యని శృతి చెప్పెనను శృతిచే భూతముల సృష్టి స్థితి సంహారములు చేయు బ్రహ్మ విష్ణు మహేశ్వరుడు ఆబ్రహ్మమేయని అభి ప్రాయము. బ్రహ్మ విష్ణు ఇంద్రాదులు దేని దేనినంతటనూ చేయు చున్నారో దానినంతను యీచిద్రూపుడె చేయుచున్నాడని భావింపుమని చెప్పిన వాక్యమును తెలియ దగినది॥ ౧౬॥

శ్లో॥ జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్॥ ౧౭

## —♦ భా ష్య మ్ ♦—

నను యది సర్వప్రకాశకం సర్వత్ర విద్యమానమపి నోపలభ్యతే చే త్తర్హి కిం తతస్స్యా దిత్యత ఆహ - జ్యోతిషా

మపీతి। తత్రైవం సత్యస్తమిత ఆదిత్యే ౨ స్తమితే చంద్ర
మసా వస్తమితాయాం వాచి కిం జ్యోతిరేవాయం పురుష
ఇతి ప్రశ్నేస్వయం జ్యోతి రేవా యం పురుష ఇత్యాది
శ్రుత్యా నాగ్న్యాది జ్యోతి ర్వజ్జ్యోతి స్తమస్యన్ధం యతో
భవే దిత్యాది స్మృత్యాచ తత్తమసః పరం జ్యోతిషా మపి
జ్యోతి ర్యేన తేజసేద్ధ స్సూర్య స్తపతి తస్య భాసా సర్వ
మిదం విభాతీ త్యాది శ్రుత్యాపి తత్పర మిత్యర్థః। ఏవం సతి
తదేతదితి మన్యన్తే ఆత్మా నం బ్రహ్మవాదిన ఇత్యాది శ్రుత్యా
గురు శాస్త్రాభ్యాం హృది సర్వస్యా ధిష్ఠితం జ్ఞేయత్వేన
స్థితం। జ్ఞానం తత్వవిదాం ప్రత్యక్షమేవే త్యాశయః॥ ౧౭॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

ఓయీ! జ్ఞానము సర్వమును తెలియజేయునది యైనట్లైతే సర్వత్ర
ఉండిన్ని లభించక పోయినట్లైతే ఆట్టి జ్ఞానము వలన ప్రయోజన మేమ
నగా చెప్పుచున్నాడు. పురుషునకు ప్రకాశమానమైనదేది? సూర్యుడు.
సూర్యుడస్తమించగా ప్రకాశించునదేది చంద్రుడు. చంద్రుడస్తమించగా =
అగ్ని అగ్నిలేనప్పుడు = నేత్రము చీకటిలో ప్రకాశించునదేది = నోటితో
మాట్లాడ వచ్చును. గనుక వాక్కు ప్రకాశించునది. వాక్కును ప్రకాశింప
జేయునదేది? మనసు = మనసును ప్రకాశింపజేయునది బుద్ధి = బుద్ధిని
ప్రకాశింపజేయునది చిత్తము = చిత్తమనగా నెరుక ఆయెరుక యెవరిది
పురుషునిది గాన పురుషుడు స్వయంజ్యోతి అనగా తనంతట తాను ప్రకా
శించువాడు. పురి శేత ఇతి పురుషః హృదయ పురమునందున్న పరమాత్మ
యే పురుషుడు॥ సహస్రశీర్‌షా పురుషః అపరమాత్మయే సూర్యచంద్రుల
ప్రకాశింపజేయునది తమస్సుకంటె పరమైయుండునది దానిని బ్రహ్మ

వేత్తలు ఆత్మయనిరి. అదిసర్వుల యొక్క హృదయమందు జ్ఞానరూపమై యుండినది. గురూపదేశమువల్లను శాస్త్రము వల్లను తెలియదగినదిగా నున్నది. అదియె జ్ఞేయము. అట్టిజ్ఞానము తత్త్వవేత్తలకు ప్రత్యక్షముగా నున్నది॥౧౭॥

శ్లో॥ ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః ।
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే॥ ౧౮

—♦ భాష్యమ్ ♦—

అథైవమిహ పూర్వోక్తం సర్వ ముపసంహరన్నాహ- ఇతీతి । తథాచేహ సమనంతరమేవ మహాభూతానీత్యాదినా క్షేత్రం తథా జీవేశ్వరలక్షణం క్షేత్రజ్ఞం జ్ఞానం జ్ఞేయంచ తతో ధికం పరబ్రహ్మేతి త్రివిధం సమాసత శ్చోక్త మిత్యర్థః । నను కేన మార్గేణ తద్బ్రహ్మ విజానీయా దిత్యత అహ-మద్భక్త ఇతి । తత్రైవం సత్య హంగిరోపాసనయా మయి సదాశివే వసత్యర్థాతు సర్వత్రేతి స్మృతి న్యాయేన వాసుదేవే పశుపతౌ వా గురుత్వేన భక్తి ర్యస్య సచైవం మద్భక్త ఏతద్యథోక్తం క్షేత్ర క్షేత్రజ్ఞయో ర్జ్ఞానం విజ్ఞాయ మద్భావః పరం పదరూప స్తదర్థ ముపపద్యత ఇత్యర్థః॥ ౧౮॥

—♦ లఘుటిప్పణీ ♦—

అధికమితి । యోదేవానాం ప్రభవ శ్చోద్భవశ్చ విశ్వాధికో రుద్రో మహర్షి ర్హిరణ్యగర్భం జనయామాస పూర్వ మిత్యాది శ్రుతే రిత్యర్థః। పరంపద రూపమితి, యదేతదుక్తం స్కాందే । తద్యథా. 'పదం

యత్పరమం వి-　స్తదవా ఖిలదేహినాం పరంపరమ మద్వైతం　సశివ స్సాంబ విగ్రహ, । ఇత్యాది ద్రష్టవ్యం॥ ౧౮॥

—♦ ఆంధ్రతాత్పర్యము ♦—

ఈశ్లోకమందు వెనుక చెప్పిన దాని నుపసంహరించుచు చెప్పు చున్నాడు॥ క్షేత్రమును । జీవేశ్వర రూపమైన క్షేత్రజ్ఞుని । జ్ఞానమును, జ్ఞేయమును, అంతికంటె నధికమైన పరబ్రహ్మనున్నూ మూడు విధములుగా చెప్పబడినది. (క్షేత్రక్షేత్రజ్ఞులు - జ్ఞాన జ్ఞేయములు । పరబ్రహ్మము) ఓయీ! అట్టి పరమాత్మను యేమార్గముచే తెలియవలె నంటె చెప్పు చున్నాడు । అహంగిరోపాసనచే సదాశివుడయిన నాయందుగాని వశు పతియందుగాని. గురుత్వముచేత భక్తిగలవాడు నాభక్తుడు. ఇదివరకు చెప్పిన క్షేత్రక్షేత్రజ్ఞుల యొక్క జ్ఞానమును తెలుసుకుని నాపరంపద మును పొందుచున్నాడు. ప్రపంచమును పుట్టించిన వాడున్ను హిరణ్య గర్భుని ముందుగా గన్నవాడునూ గనుక రుద్రుడు విశ్వాధికుడన బడును. విష్ణువుకంటె పరమై యున్న పదము అత్యంతము అద్వైత రూపమైన సాంబశివుడు అతనె. అఖిల దేహులకు పరమ పదము॥ ౧౮॥

శ్లో॥ ప్రకృతిం పురుషంచైవ విద్ధ్య నాదీ ఉభావపి ।
　వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్॥ ౧౯

—♦ భాష్యమ్ ♦—

అథ పరబ్రహ్మణః సదాశివస్యా వినాశిత్వేన సత్యత్వ మనాదిత్వం చే త్యుభయం ప్రకృతి పురుషయో స్త్వనాదిత్వ మేవ నసత్యత్వ మిత్యాది వివేచయ న్నాహ—ప్రకృతిమితి । తథాచేహ । నైవాది ర్జన్మ యయో స్తౌ అనాదీ ప్రకృతిం పురుషంచ విద్ధీ త్యర్థః । ఏవం సతి జన్మాభావా త్కుతః స్థితి

రిత్యాది స్మృతి న్యాయేన భాతీతిచే ద్భాతు నామ మిథ్యా స్వప్న గజాదివదితి స్మృతి న్యాయేన చోభావ ప్యనాదీ విద్ధీ త్యర్థే పర్యనస స్నేతద్వికారాన్ గుణాంశ్చ ప్రకృతి సంభవా న్విద్ధీ త్యర్థః॥ ౧౯॥

—♦ లఘు టిప్పణీ ♦—

అనాదిత్వమేవేతి । తథాచ సదేవసోమ్య ఇద మగ్ర ఆసీదితి యతాౖ తమ స్తన్నదివా నరాత్రి రిత్యాది శ్రుత్యా ఏవ మాదా వంతేచ యన్నాస్తి మధ్యే యదపి తత్తథా అసత్యం తత్తమః ప్రోక్తం యథైవాస్తి మరీచికే త్యాది స్మృత్యాచ న ఆది జన్మయయోః ప్రకృతి పురుషయోస్తౌ అనాదీ తయో ర్భావ స్తత్వ మితి సిద్ధాన్తః॥ ౧౯॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

తరువాత పరబ్రహ్మమైన సదాశివునికి నాశము లేక పోవుటచే సత్యత్వమును అనాదిత్వమును రెండును గలవు. ప్రకృతి పురుషుల యొక్క అనాదిత్వమే నిజము గాదని వివేచన జేయుచు చెప్పుచున్నాడు. జన్మ యెవరికి లేదో వారు అనాదులు. ప్రకృతి పురుషుడు అని తెలియవలెను. అయితే జన్మ లేకుండుటచే స్థితి మాత్రము యెక్కడినుంచి రాగలదనెడి స్మృతి చెప్పినట్లు. స్థితి లేదంటె గపించు చున్నదనగా గనుపించుగాక స్వప్నమందు గనుపించిన యేనుగు మిథ్య యయినట్లు, ప్రకృతి పురుషులిద్దరూ అనాదులని యుండగా వాళ్లయొక్క స్థితి దేహేంద్రియ వికారములను గుణములను ప్రకృతి వలన బుట్టిన వాటినిగా తెలుసుకొనుము. (సత్తే ముందు ఉన్నది. దివా రాత్రి విభాగము లేనప్పుడు ఆద్యంతములు లేకున్న మధ్యయందును అట్లై గనుక, దానిని తమస్సనిరి. మరీచికయె (వెలుతురు) ఉన్నదను స్మృతిచే, ప్రకృతి పురుషులకు జన్మలేదు. గనుక అనాదులుగా తెలియవలెనని సిద్ధాంతము॥ ౧౯॥

శ్లో॥ కార్య కారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే।
పురుష స్సుఖ దుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే॥౨౦

## —♦ భా ష్య మ్ ♦—

తత్ర తావద్వికారాణాం ప్రకృతి సంభవత్వమపి వివేచయన్నాహ। కార్యేతి। తత్రైవంసతి। కార్యం శరీరం కరణమేవ కారణం తదూరిపాణీంద్రియాణి తేషాం కర్తృత్వే హేతుశ్చ ప్రకృతి రుచ్యత ఇత్యర్థః। ఏవం పురుషః క్షేత్రజ్ఞస్తు తత్ర సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రిత్యర్థః॥ ౨౦॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

కర్తృత్వఇతి। తదుక్తం స్కాందే'కర్తృత్వం చైవ భోక్తృత్వం యదుక్తం జీవయోరివ కర్తృత్వే తు హరి ర్హేతు ర్భోక్తృత్వే తు సదా శివః'। ఇత్యాదినా వాంతరత్వేన కర్తృత్వ భోక్తృత్వాదీనాం సర్వసాక్షి తయా సదాశివస్యైవ సర్వాధిష్ఠాన తయా హేతత్వమితి. 'భోక్తారః పశవ స్సర్వే శివో భోజయితా పరః'। ఇత్యాదినా సిద్ధాంతిత మిత్యవధేయం॥ ౨౦॥

## —♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

దేహేంద్రియ వికారములు ప్రకృతివలన పుట్టినవని వివేచన చేయుచు చెప్పుచున్నాడు. కార్యమేమనగా శరీరము. కరణమె సాధనమైన ఇంద్రియమె కారణము. అటువంటి కార్య కారణములైన దేహేంద్రియములనుజేసినది ప్రకృతి। పురుషుడైన క్షేత్రజ్ఞుడు (సుఖ దుఃఖముల ననుభవించువాడు (కర్తృత్వ భోక్తృత్వములు జీవేశ్వరులకు చెప్పబడినవి.) కర్తృత్వమందు హరియు భోక్తృత్వమందు సదాశివుడును చెప్పబడిరని

స్కాందపురాణమునం దున్నందున వారి ప్రకృతియనియు వారుడు పురుషు డనియు భావము. అవాంతరముగా కర్తృత్వము భోక్తృత్వము మొదలయిన వాట్లకు సర్వసాక్షిగా సదాశివుడై అన్నింటియందునూ ఉన్నవాడగుటచే హేతువయి యుండెను. పశువు (జీవు) లందరు భోక్తలు. (అనుభవించు వారు) శివుడు అనుభవింప జేయువాడు (అనగా కర్మఫలము నిచ్చువాడు) అని శ్రుతి స్మృతులవలన సిద్ధాంతము చేయబడెను॥ ౨౦॥

శ్లో॥ పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజా న్గుణాన్ ।
కారణం గుణసంగోఽస్య సదసద్యోని జన్మసు॥ ౨౧

—♦ భాష్యమ్ ♦—

అథ పురుషస్య సుఖ దుఃఖాది భోక్తృత్వా త్సంసారి త్వ మిత్యుక్తం తత్ర కింనిమిత్త మిత్యాహ—పురుషఇతి। తత్ర తావ త్ప్రకృతిస్థ ఏవహి పురుషః ప్రకృతిజాం శ్శబ్దాది గుణా న్భుంక్తే తత్ర కారణంతు సత్వ రజ స్తమో గుణై స్తాదాత్మ్యేన సంగఏవేతి తతాఽపి సద్యోనయః సాత్వికా దేవాద్యా స్తథాఽసద్యోనయ స్తామసత్వా త్పశ్వాద్యాః। ఏవం సదసద్యోనయో విమిశ్రితత్వా దుభయ గుణవత్వేన మనుష్యాద్యా స్తత్ర తు సదసద్యోనిషు జన్మాదినా సంగో స్యేతి బోధ్యమ్॥ ౨౧॥

—♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

పురుషుడు సుఖ దుఃఖముల ననుభవించు వాడు గనుక సంసారి యని చెప్పబడినది. సంసారి యెందుకయినాడనగా చెప్పుచున్నాడు. పురుషుడు ప్రకృతియం (దేహేంద్రియాదులం) దున్నవాడై ప్రకృతి యందు

పుట్టిన శబ్ద స్పర్శాది గుణముల ననుభవించుచున్నాడు. కారణ మేమంటె, సత్వ రజ స్తమో గుణములతో తదూపమైన సంగమె కారణము. అందు లో నున్న సద్యోనియందు పుట్టిన వారు సాత్వికులు దేవతలు. అసద్యోని యందు పుట్టినవి తామసములు. పశువులు మొదలగు నవి సదస ద్యోనులు సత్వ తామసములు గల వగుట వలన ఉభయ గుణములు గలవారు మను ష్యాదులు. సదసద్యోనుల యందు జన్మాదులతో గూడుటయే సంసార కారణము-గుణములను బట్టి మానవులు పుణ్య పాప కర్మలు జేయుదురు. సత్వ గుణముచే నంతయు పుణ్యమే చేసి సద్యోని యందు పుట్టి దేవత లయిరి. తమో గుణముచే నంతయు పాపమే చేసి అసద్యోని యందు పుట్టి పశ్వాదులయినవి. సత్వతమో గుణములు గలసినందున పుణ్య పాప కర్మలు రెండును చేసి సదసద్యోని యందు మానవులై పుట్టి సుఖ దుఃఖ ములనుభవించు చున్నందున సంసారము ప్రారబ్ధమై వచ్చుచున్నది॥ ౨౧॥

శ్లో॥ ఉపద్రష్టా నుమంతాచ భర్తాభోక్తా మహేశ్వరః ।
పరమాత్మేతి చా ప్యుక్తో దేహేస్మిన్ పురుషః పరః॥ ౨౨

—♦ భా ష్య మ్ ♦—

నను కిం తత్వాస్య సంగో హ్యయం పురుష ఇత్యాది శ్రుతి వేద్యం శివ మద్వైతం తురీయం బ్రహ్మే త్యాహ। ఉప ద్రష్టేతి। తత్రైవం సతి। యథా ఋత్విగ్యజమానేషు యజ్ఞ కర్మ వ్యాపృతేషు సత్సు సమీపస్థో ద్రష్టా నతు కర్తాఽసంగో హ్యయం పురుష ఇత్యాది శ్రుతేః। ఏవం సాక్షితయా స్వయ మప్రవృత్తోపి ప్రవృత్త ఇవసన్నిధి మాత్రేణ తదనుకూలత్వా దనుమంతా తథా స్వసత్తయా సర్వాధిష్ఠానత్వేన భర్తా ఏవం జీవేశ్వరమో ర్భోక్తృత్వ ప్రకాశకత్వా ద్భోక్తా స్వతంత్ర

 

త్వాచ్చ మహేశ్వర ఇత్యుత్తమః పురుష స్త్వన్య ఇత్యాదా వపి వక్ష్యతే॥ ౨౨॥

—♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

ఓయీ సంగము గలవాడైతే పురుషుడు అసంగుడని చెప్పిన శృతి యందు తెలియఁబడగిన పురుషుని శివుడని అద్వైతమని, తురీయమని, బ్రహ్మ మని యెందుకు చెప్పిరనగా చెప్పుచున్నాడు. ఋత్విక్కులు యజమానులు యజ్ఞకర్మనుచేయుచుండగాసమీపమందుండి చూచువాడుయెట్లుకర్తగాడో పురుషుడసంగుడనె శృతిని బట్టి సాక్షిగా తాను చెయ్యక పోయినను సన్నిధి మాత్రమున చేసినట్లై సమీపమున నుండి చూచువాడును అనుకూలు డగుట వలన అనుమంతయు తనయొక్క సత్తాచేత సర్వమునందునున్నాడు గనుక భరించువాడును జీవేశ్వరులకు భోక్తృత్వమును ప్రకాశింప జేయు వాడగుట వలన భోక్తయు స్వతంత్రుడగుట వలన మహేశ్వరుడును పర మాత్మయు నని వచింప బడు పురుషుడు శరీరమందున్నను దాని కన్న వేరే యని తెలియవలెను॥ ౨౨॥

శ్లో॥ యఏవం వేత్తి పురుషం ప్రకృతించగుణైస్సహ।
సర్వథా వర్తమానోపి న స భూయోభిజాయతే॥ ౨౩

—♦ భాష్యమ్ ♦—

తదేవం యజ్ఞాత్వా మృతి మశ్నుత ఇత్యుక్తమ ప్యు పసంహరతి। యఏవ మితి। తత్రైవం సత్యాకాశాదపి విస్తీర్ణ శ్శుద్ధః సూక్ష్మో వ్యయ శ్శివ ఇత్యాది స్మృత్యాచ ఏవ ముక్త ప్రకారేణ పురుషం సదాశివం తురీయం వేత్తి సాక్షాత్కరోతి స సర్వథా స్వేచ్ఛయా వర్తమానోపి న జన్మభాగ్భవే దితి పరమార్థః॥ ౨౩॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

పరమార్థఇతి । అతఏవ 'యో వైష్ణవ స్సోపిచ యోగకాలే శక్తి స్వరూపేణ విచింత్య విష్ణుం । శివాత్మకే ధామ నియోజయే త్స్యాదత శ్చిదానంద మయోహి భక్త' ఇత్యాది శ్రుత్యాపి శివజ్ఞానినాం పున స్సంసరణా భావో మహాభారతే ఽన్యత్రాపి దర్శితః । తద్యథా, యే సంప్రాప్తాః పరం జ్ఞానం జ్ఞానయోగ రతా నరాః । నతేషాం పునరావృత్తి ర్ఘోరే సంసార మండల ఇత్యాది పరమార్థత్వేన ద్రష్టవ్యమ్॥౨౩॥

## —♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఈప్రకారము దేనిని తెలిసిన సంసార విముక్తులగుదురని చెప్పెనో దానినిన్ని ఉప సంహరించు చున్నాడు. ఆకాశముకంటెను, విశాల మైనట్టిన్ని శుద్ధమైనట్టిన్ని సూక్ష్మమైనట్టిన్ని నాశ రహితమైనవాడు శివుడని చెప్పినటుల సదాశివుడైనట్టిన్ని తుర్యరూపుడైన పురుషునిన్ని ప్రకృతి నిన్ని గుణములతో గూడ నెవడెరుంగుచుండునో అతడు విధి నతిక్రమించినను తిరుగ జన్మింపడు (వైష్ణవుడున్ను యోగాభ్యాస కాలమందు విష్ణుని శక్తిస్వరూపముగా చింతన చేసి శివధామము నందు సంయోజన చేయుచున్నాడు. అందువలన భక్తుడు చిదానంద రూపుడగుచున్నాడు. అనగా కుండలీ శక్తిని సహస్రార మందు చేర్చి యానందించుట । ఇత్యాది శ్రుతి ప్రమాణముచే శివజ్ఞానులకు పునరావృత్తి లేదని మహాభారత మందును అన్యగ్రంథములయందు గలదు. ఎట్లనగా జ్ఞానయోగ నిరతు లయ్యు యేనరులు శివజ్ఞానము నొందిరో వారు ఘోర సంసారమందు మళ్ళీ జన్మించరు । ఇది పరమార్థమని తెలియవలెను॥ ౨౩॥

శ్లో॥ ధ్యానేనా త్మని పశ్యన్తి కేచిదా త్మాన మాత్మనా ।
　అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే॥　　౨౪

—◆ భా ష్య మ్ ◆—

అతాత్మదర్శనే సాధన వికల్పానప్యధికారి భేదేనా హ-ధ్యానేనేతి ।తత్ర తాపత్కేచిద్ధ్యానేనశ్రవణ మనన నిదిధ్యాసన శబ్దితేనాత్మని శుద్ధాంతః కరణే సత్యాత్మనా జీవాత్మనాత్మానం యథోక్త మీశ్వరం పశ్యంతి । సాక్షాత్కుర్వన్తీత్యర్థః । ఏవ మన్యే సాంఖ్యేన యమ నియమా ద్యష్టాంగ యోగాత్మకేన జ్ఞానేన తథా పరేతు సంధ్యా స్నానం జపో హోమ ఇత్యాది షట్కర్మణా దేవారాధనేన పూజాకోటి సమం స్తోత్ర మిత్యాది క్రమేణ యథా యథా ప్రత్యగవస్థితం మన స్తథా తథా ముంచతి బాహ్య వాసనేతి' స్మృతి న్యాయేనచ పశ్యన్తీ త్యవధార్యమ్॥ ౨౪॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

పశ్యంతీతి ననుకథం తే పశ్యంతీతిచే చ్ఛృణు తద్యథా, 'యద్బ్రహ్మనిత్యం విరజం సనాతనం శ్రద్ధా తపో మంగళ మౌన సంయమా స్సమాధినా విశ్రబలిహార్ధ దృష్టయే యతేంద్రద మాదర్శ ఇవావభాసతే' ఇత్యాదిరీత్యా పశ్యన్తి త్యర్థః॥ ౨౪॥

—◆ ఆం ధ్ర తా త్ప ర్య ము . ◆—

ఆత్మ సాక్షాత్కారమందు సాధనమును వికల్పమును అధికారి తారతమ్యమును బట్టి చెప్పుచున్నాడు. కొందరు శ్రవణ మనన నిధిధ్యాసలచే బ్రతిధ్వనించు నట్టి ధ్యానముచేత శుద్ధాంతః కరణయందు జీవాత్మలోటి పూర్వోక్తమైన ఈశ్వరుని దర్శించు చున్నారు. మరికొందరు యమనియమా ద్యష్టాంగ యోగ రూపమైన సాంఖ్యజ్ఞానముతో సాక్షాత్కరింమ

చున్నారు. మరికొందరు స్నానము సంధ్యా జపముహోమము వైశ్వదేవము దేవతారాధన రూపమైన షట్కర్మలచే చూచుచున్నారు. కోటి పూజలకన్న ఒకస్తోత్రముగొప్పది. కోటి స్తోత్రములకన్నఒక్కజపము శ్రే ష్ఠము కోటి జపములకన్న ఒక ధ్యానము శ్రేష్ఠము. కోటి ధ్యానములకన్న ఒక్క మనోలయ మధికము. మనసు ప్రత్యగాత్మలో ప్రవేశించిన కొద్ది బాహ్య వాసనలు వీడుచుండు. (ఓయీ వారు యెట్లు చూచుచున్నారంటే వినుము నిత్య స్వరూపము పాపరహితము ఉపాధి రహితమున్నూ అయిన బ్రహ్మమును అద్దము వలె నిర్మలమైన అంతఃకరణయందు శ్రద్ధాతపస్సు నిర్వాసనామానము ఇంద్రియ నిగ్రహము. సమాధి వీట్లచేత ప్రేమ పూర్వ కమైన దృష్టితో చూచుచున్నారు॥ ౨౪॥

శ్లో॥ అన్యే త్వేవ మజానంత శ్శ్రుత్వాన్యేభ్య ఉపాసతే।
తేపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥ ౨౫

— భాష్యమ్ —

నను శాస్త్ర నభిజ్ఞత్వే నైతె రుపాయై ర్జ్ఞాతు మశ క్తౌశ్చే త్తదా తదర్థ మప్యుపాయమాహ అన్యేత్వేవమితి। తథాసత్యే వం క్రమ మజానంతోప్యా చార్యేభ్యో న్యేభ్యః కారుణికేభ్య శ్శ్రవణాది ప్రకారం శ్రుత్వేదం తత్వ ముపా సతే చే త్తేపి శ్రుతిపరాయణా మృత్యు మతిశయేన తర న్త్యేవే త్యర్థః॥ ౨౫॥

— లఘుటిప్పణీ —

తరంత్యేవేతి। నానుధ్యాయే ద్బహూంశ్శబ్దా న్వాచో విగ్లాపనం తదిత్యాది బృహదారణ్యకశ్రుతేః వృథాలాపశ్రమం మానతః। ఇత్యాది

స్మృతేశ్చ ఏవ మాత్మానంచే ద్విజాసిథా స్సర్వభూత గుహాశయం శ్లోకేన యదివార్థేన క్షీణం తస్య ప్రయోజన మిత్యాది స్మృతేశ్చా న్యోపదేశాదపి వినాశాస్త్రం ధ్యాత్వా త్మానం తరంతీ త్యర్థః॥ ౨౫॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

ఓయీ ! శాస్త్రమును తెలియక పోవుటచే ఈ యుపాయమును తెలుసుకోలేని యెడల వారల కొరకున్నూ ఉపాయమును చెప్పుచున్నాడు. ఈ క్రమమును యెరుగనివారై గురుమూలంబున నెరిగి కొందరు ధ్యానము చేయుచుందురు. వినుట యందాశగలవారై దయచూపిన ఇతరుల వల్ల శ్రివణ మనన నిది ధ్యాసనా ప్రకారమును విని యాతత్వమును ఉపాసించి లేని సంసార రూప మృత్యువును మెల్లగా దాటుదురు. (అనేక వాక్యములను మాట్లాడ కూడదు. వాగింద్రియమునకు ఆయాసము గలుగు నని శృతి. వ్యర్థ సంభాషణ యందు శ్రమనొందక మౌనము నవలంబించు మని స్మృతి. అట్టి మౌనముచే సకల భూతాంతర్యామి యైన ఆత్మను తెలుసుకొనుమని శృతిని బట్టి శ్లోకమునుగాని అర్థశ్లోకమునుగాని తెలియక పోయినను అందు ప్రియోజనము గలుగక పోయినను ఇతరుల యుపదేశముచే శాస్త్రము రాకపోయినను ఆత్మను ధ్యానించి తరించుచున్నారు॥ ౨౫॥

శ్లో॥ యావ త్సంజాయతే కించి త్సత్వం స్థావర జంగమం ।
క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగా త్తద్విద్ధి భరతర్షభ॥ ౨౬

—♦ భా ష్య మ్ ♦—

తత్రతు సంసృతి బంధస్యా విద్యాత్మకత్వా త్తన్మోక్షస్యా వశ్యకత్వే సత్యాహ—యావదితి । తత్రైవం సతి సదసద్యోని జన్మస్వి త్యే తన్ప్రాగు క్తం క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగా దేవ గుణసంఘా ద్యావత్కి మపి స్థావర జంగమం వస్తు జాయతే

తావత్సర్వమపిహే భరతర్షభ పరమశివ జ్ఞాన నిమిత్త మేవే త్యవధార్యమ్। ౨౬॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

అవధార్యమితి॥ ఇహచే దవేదీ దథ సత్యమస్తి నచే దవేదీ న్మహతీ వినష్టి। రిత్యాది శ్రుతేశ్శివజ్ఞానస్యా వశ్యకత్వా దవధార్యమిత్యర్థః॥ ౨౬॥

—◆ ఆం ధ్ర తా త్ప ర్య ము ◆—

సంసారబంధము అవిద్యాత్మక మగుటవలన అవిద్యా విముక్తి అవశ్యకమని చెప్పుచున్నాడు. స్థావర జంగమాత్మకమైన పదార్థమంతయు క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగము వలన గుణముల ననుసరించి యెంతలో పుట్టుచున్నదో, ఓభరత శ్రేష్ఠా అదంతయు పరమ శివజ్ఞాన నిమిత్తమె యని తెలుసుకొనుము. (శ్రుతి ప్రమాణమునుబట్టి శివజ్ఞాన మావశ్యకమని తెలియుచున్నది॥ ౨౬॥

శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం ।
వినశ్య త్స్వవినశ్యంతం యః పశ్యతి సపశ్యతి॥ ౨౭

—◆ భా ష్య మ్ ◆—

ఏవ మవిద్యాత్మకం సంసృతి బాధన ముక్త్వా తన్నివృత్యర్థికాం విద్యా మప్యాహ సమమితి। ఏవం సతి సర్వేషు భూతేషు వినశ్య త్స్వప్య వినద్య ర్భావేన తిష్ఠంత మాత్మాన మవినాశినం శివం పరమేశ్వర మాత్మానదీ సంయమ తోయపూర్ణే త్యాది స్మృతి న్యాయేన యః పశ్యతి సఏవ విజ్ఞాన చక్షుష్మత్వా త్పశ్యత్య న్యథా త్వనృతం పశ్యతీతి భావః॥ ౨౭.

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

విద్యామపీతి । సాచ శాస్త్ర సజ్జన సంపర్కో విచారోఽసంగ భావనా । సమతా స్వచ్ఛతా సౌమ్యా సప్తధా భూమికామతే । త్యాది సప్తభూమికా క్రమేణ ప్రాప్యత ఇతి తయాత్మానం యః పశ్యతి సఏవ పశ్యతీ త్యర్థః॥ ౨౭॥

—◆ ఆం ధ్ర తా త్ప ర్య ము ◆—

ఈ ప్రకారము అవిద్యా రూపమయిన సంసారబంధమును జెప్పి దానిని తొలగించు విద్యనున్నూ చెప్పుచున్నాడు. పరమేశ్వరుడు సకల భూతములయందు సమముగా నుండువాడు. సకలభూతములు నశించినను తాను జెడనివాడు శివుడు. ఆత్మనదియందు ఇంద్రియ నిగ్రహరూపమైన జలధారలు గలవని స్మృతి ప్రకారము యెవడు చూచుచున్నాడో వాడే విజ్ఞానచక్షుస్సు గలవాడు అక్షిలేనివాడు. శివుని జూడలేక అసత్యమైన ప్రపంచమును జూచును. (విద్యయనగాఁ శాస్త్రసంపర్కము. సజ్జన సంపర్కము, విచారము, అసంగభావనా, సమతా, స్వచ్ఛతా, సౌమ్యా ఇవి సప్తభూమికలు. యీ సప్తభూమికా క్రమముచే ఆత్మను యెవడు చూచుచున్నాడో వాడే మంచి చూపుగలవాడు॥ ౨౭॥

శ్లో॥ సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్ ।
సహినస్త్యాత్మనా త్మానం తతో యాతి పరాంగతిం॥ ౨౮

—◆ భా ష్య మ్ ◆—

అథై తదాత్మ దర్శనం ఫలేనా ప్యుపపాదయ న్నుపసంహరతి। సమమితి। తత్రైవం సత్యాకాశాదపి విస్తీర్ణ ఇత్యాద్యుక్త రీత్యా సర్వత్ర సమవస్థిత మీశ్వరం యః పశ్యతి సహ్యేవం విత్పురుషో య స్తిష్ఠతి స పరాం జన్మ మరణాది

సంసృతి విసర్జితాం గతిం యాతీ త్యర్థః॥ నత్వాత్మనా త్మానం హినస్తి యోన్యధా కృత మాత్మాన మితి శ్రుతేః అసూర్యా నామేతి శ్రుతే శ్చే త్యనేక శో వివేక్తవ్యః॥ ౨౮॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

శ్రుతేరితి। తత్రైవ స్మృతించ। వరం శరావ హస్తస్య చాండాలాగార వీథిషు భిక్షార్థమటనం రామ నమూర్ఖ్యం హత జీవితం। ఇత్యాది బహుశో ద్రష్టవ్యమ్॥ ౨౮॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఆత్మ సందర్శనమును ఫలముతో కూడా ఉపపాదించుచూ మళ్లీ చెప్పుచున్నాడు. ఆకాశముకంటెను విశాలమైన వాడను చెప్పినట్లు సర్వత్ర వ్యాపించి ఉన్నట్టి ఈశ్వరుని యెవడు చూచుచున్నాడో వాడు జనన మరణ రూపమైన సంసారము లేని గతిని పొందుచున్నాడు. యే హేతువునను దానాత్మను నాశముచేయడో ఆ హేతువుచె మోక్షము నొందునని శ్రుతి ప్రమాణములున్నవి. స్మృతి ప్రమాణమున్నూ గలదు. (ఓ రామా! మృత్పాత్రి చేతనిడికొని చండాల వాటికలో వీధులయందు భిక్షాటనమైనను మంచిదే గాని, తన యాత్మను తాను చంపుట మంచిది గాదు. (తాను బ్రహ్మమై యుండగా దేహేంద్రియాదు లనుట హత్యా కాళ మానదు.) ఇత్యాదులు వశిష్ఠుడు రామునకు పదేశించినట్లు యోగవాశిష్ఠమందును అనేక గ్రంథములయందును జూడవచ్చును॥ ౨౮॥

శ్లో॥ ప్రకృత్యైవచ కర్మాణి క్రియమాణాని సర్వశః।
　　యః పశ్యతి తథాత్మాన మకర్తారం సపశ్యతి॥　　౨౯

## —♦ భా ష్య మ్ ♦—

ననుచ కథం త మాత్మానం జనో ద్రక్ష్యతీ త్యాహ-ప్రకృత్యైవేతి। ఏవంసతి। యది దేహం పృథక్ కృత్యచితి విశ్రామ్య తిష్ఠతీతి స్మృతి న్యాయేన య స్తమాత్మాన మకర్తారం పశ్యతి సఏవ క్రియమాణాని కర్మాణి సర్వశః ప్రకృత్యైవ కృతాని పశ్యతీత్యర్థః॥౨౯॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

ప్రకృత్యైవ కృత్యేతి తద్యథా ఆత్మానం రథినంచాహు శ్శరీరం రథమేవచ ఇంద్రియాణి హయాన్యాహు ర్విషయా స్తేషు గోచరః ఇద్యారీత్యా పశ్యన్నప్యతః పరం పరాత్మానం సర్వసాక్షిణం యోగజ ధర్మేణా కర్తారం పశ్యతీ త్యర్థః॥౨౯॥

## —♦ ఆం ధ్రి తా త్ప ర్య ము ♦—

ఓయీ జనుడు అట్టియాత్మను యెట్లుచూస్తాడంటేచెప్పుచున్నాడు. దేహేంద్రియాదులను వేరుచేసి చైతన్యమందు విశ్రమించు చున్నాడను న్యాయము చే యెవడు ఆత్మను అకర్తనుగా (కర్తనుగాదని) చూచుచున్నాడో ప్రకృతచేతనే కర్మలన్నియు చేయబడుచున్నవని చూచుచున్నాడో వాడే మంచి చూపుగలవాడు (దేహా ధిష్టితాత్మను రధికునిగాను దేహముసె రధమును గాను బుద్ధిని సారధినిగాను మనసును గుఱ్ఱపుత్రాటినిగాను ఇంద్రియములను గుఱ్ఱములనుగాను శబ్దాది విషయములను సంచార మార్గములను గాను తెలియవలెను. కర్తృత్వాదికములు లేని యాత్మ దేహేంద్రియ మనస్సులతో గూడుకొని కర్తృత్వాదికమును బొందుచున్నదని జ్ఞానులు చెప్పిరి. యెవడు ఏకాగ్రత లేని మనసు గలవాడై యవివేకి యగుచున్నాడో వానికినింద్రియములు, సమాహితుడుగాని యసమర్థుడగుసారధికి

-దుష్ట రథాశ్వములెట్లు స్వాధీనములు గావో ఆవిధముగానే స్వాధీనము లు గావు. ఏకాగ్రచిత్తము గల జ్ఞానికి మంచిగుఱ్ఱములు రథసారథికివలెనే స్వాధీనములగు చున్నవి. జ్ఞానహీనుడై మనోనిగ్రహము లేని మనుజుడు పరిశుద్ధత లేనివాడై అక్షర స్వరూపమును బొందక సంసారమును బొందుచున్నాడు. యుక్తమనసు గల పరిశుద్ధుడగు జ్ఞాని ఏస్థానమును బొంది మరల పుట్టడో అట్టిస్థానమును బొందుచున్నాడు తపో వివేకా త్మక మగు బుద్ధి సారథిగల సమాహిత చిత్తుడగు విద్వాంసుడు సంసార గతికి నంతమైన శ్రేష్ఠమగు సర్వవ్యాపక పరశివునియొక్క స్థానమును బొందుచున్నాడు॥౨౯॥

శ్లో॥ యదా భూత పృథగ్భావ మేకస్థ మనుపశ్యతి ।
తత ఏవచ విస్తారం బ్రహ్మ సంపద్యతే పరమ్। ౩౦

—♦ భా ష్య మ్ ♦—

నను కథం దేహా త్పృథగ్భావేనా త్మానం పశ్యన్నపి సంసృతి జాతం చ పశ్యతీ త్యాహ—యదేతి।తధాచ యథోక్త రీత్యా దేహా త్పృథగ్భావేన యదా భూతపృథగ్భావ మేకస్థం చిదంబరస్థ మనుపశ్యతి । తతఏవచ విస్తారం సర్వగం పరబ్రహ్మ నిష్కల మేకీభావేన సంపద్యత ఇత్యర్థః॥౩౦॥

—♦ ఆ న్వ తా త్ప ర్య ము ♦—

ఓయీ దేహముకంటె వేరుగా ఆత్మను చూస్తూన్నప్పటికి సంసార మునున్నూ యెందుకు చూచుచున్నాడంటె చెప్పుచున్నాను. ఇదివరకు చెప్పినట్లు దేహముకంటే వేరుగా భూతములను వేరువేరుగా ఈశ్వర సత్వ మగు నొక్క ప్రకృతియందున్నదానినిగా చూచుచున్నాడో ఆప్రకృతి వలననె భూతములు వ్యాపించిన వాటెనిగానున్నూ యెప్పుడు చూచున్నో

అప్పుడు నిష్కళ పరబ్రహ్మను ఏకత్వముతో పొందుచున్నాడు. అనగా సాత్విక బుద్ధితో పృథివిని జలమందును జలము నగ్నియందును అగ్నిని వాయువునందును వాయువు నాకాశమందును ఆకాశమును ప్రకృతి యందును ప్రకృతిని బ్రహ్మమందును ఉన్నదానినిగా నున్నూ ప్రవిలాపనము చేసి పరబ్రహ్మము తానై యుండి సృష్టియందు బ్రహ్మవలన ప్రకృతి ప్రకృతివలన ఆకాశము ఆకాశమువలన వాయువు వాయువువలన అగ్ని అగ్ని వలన జలము జలమువలన పృథివి పృథివివలన అన్నము అన్నమువలన పురుషుడున్నూ పుట్టుచున్నవని గాన ప్రకృతియందె ఉత్పత్తి లయము లను చూచుచు తాను ప్రకృతి కంటె పరమైన బ్రహ్మ మగుచున్నాడు॥

శ్లో॥ అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మా య మవ్యయః।
శరీరస్థోపి కౌన్తేయ నకరోతి నలిప్యతే॥ ౩౧

—♦ భాష్యమ్ ♦—

అద్వైక మేవా ద్వితీయ మితి శ్రుతిస్థ పదత్రయేణ సిద్ధ మర్థం పూర్వోత్తరాభ్యాం నిర్ధారయతి—అనాదిత్వాదితి। తత్ర తావదేకస్థ మితిపూర్వోక్తేన సజాతీయః ఏవ మనా దిత్వాది త్యనేన త్విహోక్తేన విజాతీయః నిర్గుణత్వా దిత్యనేన తు స్వగతశ్చ భేదః పరమశివైక తాదాత్మ్యేననిరస్త ఇత్యతో హే కౌన్తేయ శరీరస్థోపి సబ్రహ్మభూతో నకరోతి నవాకర్మభి ర్లిప్యత ఇత్యవధార్యమ్॥ ౩౧॥

—♦ లఘు టిప్పణీ ♦—

నిరస్త ఇతి॥ అతఏవయో ఽన్యాందేవతాముపాస్తే ఽన్యోసావన్యోహ మస్మీతి నసవేద పశురేవచ సదేవానా మిత్యాది బృహదారణ్య శ్రుత్యాపి

త్రివిధ భేదనిరస్తా ద్వైత సిద్ధిరిత్యర్థః నన్వేవం యద్యద్వైత భావ స్తర్హి కథం సేవ్య సేవక భావోపపత్తి రితి చేచ్ఛృణు । తద్యథా, 'దేహభావేన దాసోహం జీవభావే తదంశకః । స్వాత్మభావే తదేవాహ మితి జానిహి రాఘవే । త్యాది రీత్యా వివేక్తవ్యమ్॥ ౩౧॥

—◆ ఆంధ్ర తాత్పర్యము ◆—

తరువాత, ఏకమేవా ద్వితీయమనె శృతియందున్న మూడుపదముల త్రోటి సిద్ధమైన అర్థమును నిర్ధారణ చేయుచున్నాడు. పూర్వశ్లోకమందు ఏకంఅనుటచే సజాతి భేదమున్నూ (అనగా ఒక్క మానవజాతియందు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులనె నాల్గుభేదములు తోచుట) ఈ శ్లోకమందు అనాదిత్వనుటచే, విజాతీయ భేదమున్నూ (దేవతలు. మానవులు, పశువులు, పక్షులు, క్రిమికీటకాదులు అనేక భేదములుగా తోచుట) నిర్గుణమనుటచే స్వగతభేదమున్నూ (ఒక్క శరీరమందు. శిరము భుజములు. వక్షము పాదములు మొదలయిన భేదముతోచుట) పరమ శివతాదాత్మ్యముచే తీసివేయబడినది. గనుక, ఓ కౌన్తేయా! అట్టివాడు శరీరమందున్నను బ్రహ్మమైనవాడై యేమియు చేయడు. చేసినను కర్మలనంటడని తెలియవలెను. దేవతవేరు నేను వేరు అనే భావనతో ఉపాసించిన వాడు పశువని బృహదారణ్య శృతియందున్నందున సజాతి, విజాతి, స్వగతభేదములు లేకుండినయెడల అద్వైతసిద్ధి కలుగును. ఓయీ అద్వైత భావమైతే సేవ్య సేవక భావ మెందువల్లననగా వినుము. దేహభావనచే నేను దాసుడను జీవభావనచే దాని యంశగలవాడను. ఆత్మభావనచే అదే నేనని రాఘవా తెలుసుకొనుమని చెప్పినట్లు వివేచన చేయవలయును॥ ౩౧॥

శ్లో॥ యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే ।
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే॥　　౩౨

—♦ భా ష్య మ్ ♦—

అత్రైవార్థే దృష్టాంత మప్యాహ - యథేతి । తత్రై
వంసతి । యథాసర్వగత మప్యాకాశం సౌక్ష్మ్యా న్నోపలిప్యతే।
తథా శరీరస్థో ప్యయమాత్మా తత్కర్మణా నోపలిప్యత
ఇత్యర్థః ॥ ౩౨॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

ఆకాశమితి । తథాచా త్రార్థే శ్రుతిరపి । తద్యథాఏవ మాకా
శస్యా ప్యాకాశో యదే తద్భాతి మండల మిత్యఖండం మండలాకార
మిత్యాది స్మృతి రపి శ్రుత్యనుగ్రాహికే త్యవధేయమ్॥ ౩౨॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఈ యర్థమునందు దృష్టాంతమునున్నూ చెప్పు చున్నాడు. ఆకా
శము సర్వత్ర వ్యాపించినదై నప్పటికి సూక్ష్మమగుట వలన (చేతికి దొరక
నందున) యెట్లు అంటి యుండదో అటులే ఆత్మ, శరీర మందున్నను.
శరీర కర్మచేత అంటి యుండబడదు. ఇందుకు శృతి స్మృతులు ప్రమా
ణములు॥ ౩౨॥

శ్లో॥ యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః।
క్షేత్రం క్షేత్రీ యథా కృత్స్నం ప్రకాశయతి భారత॥౩౩

—♦ భా ష్య మ్ ♦—

తదేవం న కేవల మాకాశ వన్నిరవయవ మేవ కిన్తు
తజ్జ్ఞాన రూపత్వేన సత్యం ప్రకాశక మపీతి పునరాహ -
యథేతి । ఏవంతర్హి । యథా రవి రేక ఏవ లోక మిమం

కృత్స్నం ప్రకాశయతి నచ ప్రకాశ్య ధర్మై ర్నవా తద్భేదా ద్భిద్యతే తథా క్షేత్రీ నామ క్షేత్రజ్ఞోపి సమష్టి రూపేణైకఏవ హేభారత సర్వ భూతాంతరాత్మా నలిప్యతే కథం తర్హి తతః పరమాత్మా శివో లిప్యే ద్వా భిద్యేద్వే త్యాశయః।33॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఆ బ్రహ్మము ఆకాశమువలె అవయవములు లేనిదే గాదు. మరే మనగా జ్ఞాన రూప మగుటచే సత్య మయినదనిన్ని ప్రకాశింప జేయునదిన్ని యని తిరిగి చెప్పుచున్నాడు. ఓ భారతా! యేప్రకారము సూర్యుడొకడే ఈ సమస్త లోకమును ప్రకాశింప జేయుచు లోక ధర్మములచే గాని లోక భేదములచే గాని భేదము నొందక యుండెనో, అటులే క్షేత్రజ్ఞుడున్ను సమష్టి రూపముచే (ఈశ్వరత్వముచే) నొక్కడే సర్వభూతముల యందు అంతర్యామిగా నుండి అంటియుండలేదు. అయితే అందువలన పరమాత్మయైన శివుడు యెందుకు అంటియుండును! యెందుకు భేదము నొందును? దేహత్రయమును అంటియున్ను యుండడు. సజాతి, విజాతి, స్వగత భేదములనున్ను బొందడని యభిప్రాయము॥ 33॥

శ్లో॥ క్షేత్ర క్షేత్రజ్ఞయో రేవ మంతరం జ్ఞాన చక్షుషా ।
భూత ప్రకృ త్తి మోక్షంచ యేవిదు ర్యాంతి తే పరమ్॥

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే క్షేత్ర
క్షేత్రజ్ఞవిభాగయోగోనామ
త్రయోదశోధ్యాయః॥

—◆ భా ష్య మ్ ◆—

నన్వస్త్వేవం పరన్తు క్షేత్ర క్షేత్రజ్ఞయోః పరతరం పరాత్మానం శివ మద్వైతం తురీయం కథం విజానీయా మిత్యాహ- క్షేత్రేతి। తథా చాన్తతః క్షేత్ర క్షేత్రజ్ఞయో రంతర మేకఏవ హి భూతాత్మే త్యాది శ్రుతి న్యాయేన యేవిదు స్తఏవ భూత ప్రకృతిం క్షేత్రక్షేత్రజ్ఞయో స్సంయోగ జనికాం తన్మోక్షంచ విదురితి తఏవ తత్పరం పదం యాన్తీతి పరమార్థః। ౩౪॥

ఇతి శ్రీ శ్వేతాచార్య గురుచరణ శిష్య భావ సమాసాదిత శైవసిద్ధాంత ప్రవర్తక శ్రీ శ్రీకంఠ శివాచార్య విరచితే తత్త్వైక దర్శన నామకే గీతాభాష్యే క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగో నామ త్రయోదశోధ్యాయః

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

న్యాయేనేతి। నను తర్కా ప్రతిష్ఠానాదితి సూత్రపదేన న్యాయ శాస్త్రస్యా ర్థనై నాశికత్వేన నిరాసా దిహ బహుస్థలేసు న్యాయేనే త్యుక్తమితి చేచ్ఛృణు। సుతర్కస్యేహ శ్రుతి స్మృత్యనుకూలస్య న్యాయ శబ్దేన గ్రహణా న్నతథతి రిత్యాస్తాం విస్తరః ॥౩౪॥

ఇతశ్రీ శ్రీకంఠ శివాచార్య శిష్య విశ్వేశ్వర శివాచార్య విరచితాయాం లఘుటిప్పణ్యాం క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగః

—◆ ఆం ధ్రి తా త్ప ర్య ము ◆—

ఓయీ అట్లే అవుగాక మరేమనగా క్షేత్రక్షేత్రజ్ఞుల కంటె పరమైనట్టిన్ని పరమాత్మ యైనట్టిన్ని తురీయా ద్వైత రూపుడైన శివుని యెట్లు తెలుసుకొన గలనంటె చెప్పుచున్నాడు. క్షేత్రక్షేత్రజ్ఞుల యొక్క తార

తమ్యమును భూత స్వరూపుడొకడేయని చెప్పిన శృతి న్యాయముచే యెవరు తెలియుచున్నారో వారే క్షేత్రక్షేత్రజ్ఞుల యొక్క సంయోగము వలన బుట్టిన భూతప్రకృతినిన్ని దానిమోక్షోపాయమునున్నూ యెవరు తెలియుదురో వారే పరంపదమును పొందుదురని పరమార్థము (ఇందు అనేకచోట్ల న్యాయము యెందుకు చెప్పినాడగా వినుము. న్యాయ మనగా శృతిస్మృతుల కనుకూలమయినది న్యాయమని గ్రహించుట వలన బాధలేదు. చాలును. విస్తారము॥ ౩౪॥

ఇట్లు తత్త్వైక దర్శనమను శ్రీకంఠీయ గీతాభాష్యమునకు బోధా
నంద మహర్షిచే రచింపబడిన భావబోధమను నాంధ్ర
తాత్పర్యమున క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ
యోగమనుపదమూడవ అధ్యా
యము సమాప్తము.

---

ఓమ్

# శ్రీమచ్ఛ్రీకంఠాచార్యకృతే

# శ్రీ భగవద్గీతాభాష్యే

## గుణత్రియ విభాగయోగో నామ-చతుర్దశోధ్యాయః.



శ్రీకృష్ణ ఉవాచ—

శ్లో॥ పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానినాం జ్ఞాన ముత్తమం ।
యద్జ్ఞాత్వా మునయ స్సర్వే పరాం సిద్ధి మితో గతాః

—♦ భాష్యమ్ ♦—

'గుణత్రయ మయం సర్వం ప్రకృతిశ్చ గుణాత్మికా ।
తతో తీతం భవే ద్బ్రహ్మ వేదితవ్యం చతుర్దశే'॥ అథపూర్వేష్వ ధ్యాయేష్వ సకృదుదుక్తమపియత్ జ్ఞానంజ్ఞాత్వా సుష్ఠు యచ మునయో మననశీలాః పరాం గతి మాగతాస్త మప్యాహ! పరమితి॥ తత్ర తావద్ జ్ఞాయతే నేనేతి జ్ఞానం తదపి జ్ఞానానా మపి పరం శ్రేష్ఠ ముత్తమంచ ప్రవక్ష్యామీ త్యర్థః । తత్ర తావద్యద్ జ్ఞాత్వా మునయ స్సర్వే పరాం కైవల్య ప్రదాం సిద్ధిమిత స్సంసార సాగరతో గతాః ప్రాప్తాః ఇత్యర్థః॥ ౧॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నను యది బుద్ధిర్మనో హం చిత్తంచే త్యాదినా పంచ వింశతి తత్వాత్మక మేవ సాధన జాలంతర్హి కథం తద్గతో పాయై స్తదతో భవిష్యతీత్యాహ । తతో తీతం భవేదితి॥ తద్యథా, 'దేహేంద్రియాది సంఘాతం లబ్ధ్వా సత్సాధనై ర్బుధః । సద్గుణేనే తరాం స్త్యక్త్వా గుణాతీతో భవేద్ధ్రువం' ఇత్యాద్యవధార్యమ్॥ ౧॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

పదునాల్గవ అధ్యాయమందు సర్వప్రపంచము సత్వరజస్తమో గుణాత్మకము ప్రకృతియు త్రిగుణ స్వరూపమే. దానికి (ప్రకృతికి) అతీతమైనది బ్రహ్మస్వరూపమని తెలియదగినది॥ శ్రీకృష్ణుం డిట్లనియె. తరువాత వెనుకటి అధ్యాయములయందు జ్ఞానమునుగూర్చి అనేక పర్యాయములు చెప్పితిని. అయినను మననశీలురయిన మునిపుంగవులు యే జ్ఞానము నెరింగి అనుష్ఠించిన్ని సంసారబంధమునుండి విముక్తులయిరో అట్టి సిద్ధినిన్ని చెప్పుచున్నాను. జ్ఞానమనగా తెలివి అట్టిజ్ఞానములలో నుత్తమజ్ఞానము నున్ను చెప్పుచున్నాను. యేజ్ఞానమును తెలిసి మునులందరు సంసారబంధమునుండి కైవల్యమునిచ్చు సిద్ధినిబొందిరో అట్టి జ్ఞానమని వెనుకకు అన్వయము. (ఓయీ! మనోబుద్ధి మొదలయిన పంచవింశతి తత్వములేసాధనములన్నియు అయిన యెడల అట్టి మాయోపాయములచే జ్ఞానమెట్లు గలుగునంటె చెప్పుచున్నాడు. పండితుడు దేహేంద్రియ సముదాయమునుపొంది మంచి సాధనములతోగూడి సద్గుణముల నవలంబించి దుర్గుణములను వదలి గుణాతీతుడు నిశ్చయముగానగునని యున్నది. అదియెట్లనగా శ్లో॥ అజ్ఞానం త్యజ హే మనోమమల సద్బ్రహ్మాత్మ సద్భావనా త్సంకల్పా నఖిలా నపి త్యజ జగ్మని ధ్యాత్వా సంభావనాత్ । కామాన్ సాధన సాధ్య దుఃఖ నివహా ధ్యానాదజస్రం త్యజక్రోధం తం క్షమయాసదాజహి బలాల్లోభంతుసంతో

షతః॥ ఇత్యాదిశ్లోకములు దూర్వాసవిరచిత ప్రతీకార దశకమందున్నవి గానవచ్చును. గ్రంథవిస్తర భీతిచే వ్రాయలేదు॥ ౧॥

శ్లో॥ ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమసా ధర్మ్య మాగతాః।
సర్గేపి నోపజాయంతే ప్రళయే న వ్యథంతిచ॥ ౨॥

—♦ భా ష్య మ్ ♦—

తత్ర తస్యాః సిద్ధే ర్విష్ణుధర్మ తాదాత్మ్యానైకాంతికత్వం దర్శయతి॥ ఇదమితి। తత్రైవం సతి యథోక్త జ్ఞాన విజ్ఞాన సాధన ముపాశ్రిత్యా నుష్ఠాఘుచ శివస్యార్థం స్థితా గౌరీ తదర్థో హరి రిష్యతే। తదర్థా ర్ధేవ సంయుక్తో హరి రర్ధ శరీర భాగి' త్యాది స్మృతి న్యాయేన మమ విష్ణో స్సాధర్మ్యం పరమశివత్వ మాగతాః। ప్రాప్తా స్సంతస్సర్గేపి సృష్టావపి నోపజాయంతే తథా సర్వగ్రాసో మహాదేవ స్సర్వాండాస్య ఖిలం జగదితి మహాప్రయళయేపి నవ్యథంతీ త్యర్థః॥ ౨॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

విష్ణో స్సాధర్మ్య మితి॥ అతఏవ కూర్మపురాణె 'దృష్ట్వా సింహాసనాసీనం దేవ్యా నారాయణేచ। ప్రణమ్య దేవ మీశానం పృష్టవంత్యో వరాంగనాః। కస్త్వం విభ్రాజసే కాన్త్యా కేయం బాలా రవిప్రభా కోన్వయం భాతి పురుషః పంకజాయత లోచన ఇత్యాది ప్రశ్నోపన్యాసేన కాసాంచి ద్దేవకన్యానాంవిష్ణో స్సాధర్మ్యం పరమశివస్య స్పష్టమేవ దర్శితమ్॥ ౨॥

## — ఆ స్థ్రీ తా త్ప ర్య ము —

అట్టి సిద్ధి, విష్ణుధర్మము యొక్క తాదాత్మ్యముచే రహస్య భావ మును చూపించుచున్నాడు. పూర్వమందు చెప్పిన జ్ఞాన విజ్ఞాన సాధనము నాశ్రయించి అనుష్ఠించి, శివుని యొక్క సగము శరీరము గౌరి యనియు గౌరిలో సగము శరీరము విష్ణువనియు, సగములో సగము శరీరము గల వాడు గనుక హరి అర్ధశరీరము గలవాడు (అనగా ఈశ్వరున కర్ధాంగి) అనునట్టి స్మృతి న్యాయము చేత విష్ణువైన నాయొక్క సాధర్మ్యమయిన పరమశివత్వమును బొందిన వారగుచు సృష్టికాలమందు జన్మించరు. 'అత్తా చరాచర గ్రహణాత్' అను సూత్రమును బట్టి సకల బ్రహ్మాండములను మహాదేవుడు భక్షించు నట్టి ప్రళయ మందును మరణము నొందరు. (పార్వతి తోటెన్ని నారాయణుని తోటెన్ని సింహాసన మందు గూర్చుని యున్న శంకరుని చూచి దేవకన్నియలు నమస్కరించి యిట్లడిగిరి. ఓయీ! నీశెవ్వరవు? సూర్యకాంతి గల యీబాల యెవరు? యీ పుండరీకాక్షు డెవరు. ఇట్లు కూర్మపురాణమందు దేవకన్నియల ప్రశ్నోపన్యాసముచే విష్ణువు పరమశివునకు సహధర్మిణీ యని స్పష్టమయినది॥ ౨॥

శ్లో॥ మమ యోని ర్మహ ద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్।
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత ! ॥ ౩

## — భా ష్య మ్ —

తదేవం పూర్వోక్త జ్ఞానోపలబ్ధ్యర్థ మప్యారోపేణ సర్వ భూతోత్పత్తి మపి దర్శయన్నాహ। మమేతి॥ తథాచేహ యచ్చ కించ జగత్యస్మి న్నిత్యాది శ్రుత్యా మాయారూపీ జనార్దన ఇత్యాది కూర్మ స్మృత్యాచ మమ విష్ణో రర్ధచం ద్రాత్మికాయా మూల ప్రకృత్యాఖ్యాయా యా యోని

ర్బింద్వాత్మికా యాకార్యా ప్రకృతి స్తస్యా మవ్యక్తా ప్రకృతి ర్దేవీ బ్రహ్మవిజ్ఞాన మాదిత ఇత్యాది స్మృత్యా మహతి జగ ద్బృంహణ కర్తృత్వా ద్బ్రహ్మణి నామ బ్రహ్మాఖ్యాయాం యోనౌ గర్భం సర్వభూతకారణ మేకో౾హం బహుస్యా మితీక్షణరూపం సంకల్పం దధామ్య హ మిత్యత స్సర్వ భూతానాం సంభవో భవతీతి భావః ॥ 3॥

## —◆ ల ఘు టి ప్ప ణీ. ◆—

విష్ణో రితి॥ తత్రవిష్ణో రర్ధచంద్రాత్మక ప్రకృతి రూపత్వంచ 'సత్వం రజస్తమో విష్ణో జగదండం జనార్దన తస్యకారణ మాహు స్త్వాం సాంఖ్యా స్తత్వవిదోహరే' ఇత్యాది నోక్తత్వా దితి భావః॥3॥

## —◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ◆—

ఈ ప్రకారము పూర్వోక్తమైన జ్ఞానము లభించు కొరకున్నూ అధ్యారోపముచే సర్వభూతోత్పత్తి నిన్ని చూపించుచు చెప్పుచున్నాడు- ఓ భారతా! శృతిస్మృతులయందు విష్ణువు మాయారూపుడని చెప్పినట్లు విష్ణువైన నాయొక్క అర్ధచంద్రరూపమైన మూలప్రకృతియను యోని యందు బిందురూపమై కార్యప్రకృతియైన చిదాభాసుని సర్వజగద్వ్యాపక మయిన బ్రహ్మము వలన సర్వభూత కారణమైన నేను ఒక్కడనే అనేక మంది అగుచున్నానను సంకల్పరూపమయిన గర్భమును ధరించుచున్నాను- అందువలన బ్రహ్మమొదలగు సర్వభూతములు పుట్టుచున్నవని భావము- (విష్ణువే అర్ధచంద్రాత్మకమయిన ప్రకృతి యను యోని అందు సత్వరజస్త మో గుణములను జగదండము (గర్భము) దానికి కారణము శివుడని తత్వ విదులయిన సాంఖ్యులు చెప్పుచున్నారని స్మృతులు గలవు॥3॥

శ్లో॥ సర్వయోనిషు కౌన్తేయ ! మూర్తయ స్సంభవన్తియాః।
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా॥ ౪

—♦ భాష్యమ్ ♦—

నను కథం సర్వభూతానాం తతః సంభవ ఇత్యాహ। సర్వయోనిష్వితి॥ తత్రతావత్ హేకౌన్తేయ! దేవ పితృ మనుష్య పశు మృగాది సర్వయోనిషు యా మూర్తయ స్తాసాం మూర్తీనాం తత్తత్కారణ భావాపన్నం మహద్బ్రహ్మ యోని ర్యా బిందావాత్మికా ప్రకృతి స్తస్యా మహామే వమేవా ర్ధచంద్రాత్మక ప్రకృతిరూపః పుంభావేన విష్ణుస్సన్ బీజప్రదః పితేతి భావః॥ ౪॥

—♦ లఘు టిప్పణీ ♦—

పుంభావేనేతి॥ భోగ్యే భవానీ పురుషేచ విష్ణుః క్రోధేచ కాళీ సమరే చదుర్గే' త్యాదినా స్పష్టమేవ పుంభావస్యోక్తత్వా దితి భావః॥౪॥

—♦ ఆంధ్రి తాత్పర్యము. ♦—

ఓయీ! అందువలన సర్వభూతములు యెట్లు పుట్టుచున్నవనగా చెప్పుచున్నాడు. ఓకౌన్తేయా! దేవతలు, పితరులు, మనుష్యులు, పశువులు మృగములు మొదలగు సర్వయోనులయందు గేమూర్తులు పుట్టుచున్నవో ఆమూర్తులకు కారణమయిన మహత్ బ్రహ్మమను యోనిగల బిందు ప్రకృతి తల్లివంటిది. నేను అర్ధచంద్రాత్మక ప్రకృతి రూపుడనైన విష్ణునై పురుష భావముతో బీజమును ఇచ్చుచున్నాను॥ అందువలన తండ్రిని. ప్రకృతి తల్లి సర్వులు సంతానము భోగ్యమయినప్పుడు, పార్వతి పురుషుడయినప్పుడు

విష్ణుక్రోధమువచ్చినపుడు కాళి, యుద్ధముచేయునపుడు దుర్గ యని స్మృతిని బట్టి విష్ణువునకు పురుషభావము చెప్పబడినది॥ ౪॥

శ్లో॥ సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః।
నిబధ్నంతి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్॥ ౫

—♦ భాష్యమ్ ♦—

నను కథం తర్హి దేహిన మవ్యయం ప్రకృతి ర్నిబధ్నాతీ త్యాహ సత్త్వమితి। తత్ర తావ త్సత్వ రజ స్తమసాం గుణానాం సామ్యావస్థా ప్రకృతి ర్మాయా ద్వివిధా యథోక్తా తతశ్చ ప్రకృతి సంభవాః। సత్వాదయో గుణా దేహేస్మి న్దేహినం జీవం నిబధ్నంతీ త్యర్థః॥ ౫॥

—♦ లఘుటిప్పణీ ♦—

సత్వాదయఇతి॥ తత్ర తావ త్సత్వా ద్రజోభూ ద్రజస స్తమ స్తేభ్యోఽభవ జ్జగది త్యాది రీత్యా దేహాది రూపేణ దేహినం నిబధ్నాతీ త్యాశయః॥ ౫॥

—♦ ఆంధ్రతాత్పర్యము ♦—

ఓయీ! నాశరహితమైన దేహిని ప్రకృతి యెట్లు బంధించు నంటె చెప్పుచున్నాడు. ఓమహాబాహో సత్వగుణము రజోగుణము తమోగుణము యీమూడును సమముగా నుండునది ప్రకృతియనియు గుణములయొక్క హెచ్చుతగ్గులు గలది మాయ యనియు రెండువిధములుగా చెప్పబడెను. యీమాయకు రెండు రూపములు విక్షేపశక్తి, ఆవరణశక్తి. విక్షేపశక్తి లింగాది బ్రహ్మపర్యంతము సృష్టి చేయును. ఆవరణ శక్తి దానిని మరి పించును. సత్వగుణము వలన చతుర్ముఖ బ్రహ్మ మొదలగు ముప్పది మూడు

కోట్లదేవతలు పుట్టిరి. రజోగుణము వలన మనుష్యులు మృగములు, పశువులు పక్షులు పురుగులు జలచరములు లోనగునవి పుట్టెను. తమోగుణము వలన భూమి పర్వత వృక్ష పాషాణములు మొదలగుస్థావరములు పుట్టెను. యీ వివరములు ౪ వ అధ్యాయమయిన బ్రహ్మార్పణ యోగమందు ౧౩ వ శ్లోకమున విస్తరించి వ్రాయబడి నందున ఇక్కడ ముగించి నారము. తరువాత ప్రకృతి వలన పుట్టిన సత్వాది గుణములు ఈ దేహమందలి దేహిని కట్టివేయుచున్నవి. (సత్వగుణమువలన రజోగుణము. దానివలనతమోగుణము యీ మూటివలన జగత్తంతయు పుట్టెను. యీరీతిగా దేహాదుల రూపకముచే దేహిని కట్టివేయుచున్నవి. యిదే బంధము ॥౫॥

శ్లో॥ తత్ర సత్వం నిర్మలత్వాత్ప్రకాశక మనామయం ।
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ॥ ౬

—♦ భాష్యమ్ ♦—

నను తత్ర కోఽస్తి గుణః కేనచ సంగేన నిబధ్నాతీత్యాహ । తత్రేతా । తత్ర తావత్తేషు గుణేషు మధ్యే సత్వం నిర్మలత్వాత్ప్రకాశకం చిద్బింబగ్రహణ యోగ్యత్వాదనామయం చేతి సుఖసంగేనచ బధ్నాతీ త్యర్థః॥ ౬॥

—♦ లఘుటిప్పణీ ♦—

నిబధ్నాతీతి । తత్ర విమల సత్వంతు చిత్తాఖ్యం తద్యోగజ ధర్మేణ నిస్త్రైగుణ్య సాధకత్వాత్సంసృతి బంధ నివర్తక మేవ భవతీతి వివేక్తవ్యమ్॥ ౬॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఓయీ! ఆబంధమందు యేగుణమున్నది, దేనిసంబంధముతో బంధించుచున్నదంటే చెప్పుచున్నాడు. ఓ అర్జునా! ఆ మూడు గుణముల యందు

సత్వగుణము నిర్మల మగుటం బట్టి చైతన్యము యొక్క బింబమును గ్రహిం చుటకు తగినదైనందున ప్రకాశరూపమై నిరుపద్రవమైనది. కాబట్టి ఆత్మను సుఖ జ్ఞానములతో బంధించు చున్నది. (అందు విమల సత్వము చిత్తమును యోగాభ్యాసముచే త్రిగుణ రహితముగా చేయగలదు. గనుక సంసార బంధమును తొలగించునది యని తెలియవలెను॥

శ్లో॥ రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సంగసముద్భవం।
తన్నిబధ్నాతి కౌంతేయ। కర్మసంగేన దేహినం॥ 7

## —♦ భాష్యమ్ ♦—

ఏవ మపరస్యాపి బంధన ప్రకారమాహ రజఇతి। తత్రైవంసతి యత స్తృష్ణా సంగ సముద్భవ మతో రజో రాగాత్మకం విద్ధి తతశ్చ తం దేహినం హేకౌంతేయ! రజసః ప్రవృత్తి హేతుత్వా త్కర్మసంగేన నిబధ్నాతీ త్యర్థః॥ 7॥

## —♦ ఆ ర్థి తా త్ప ర్య ము ♦—

ఈ ప్రకారమే రజోగుణము యొక్క బంధన ప్రకారమును చెప్పు చున్నాడు. ఓ కౌంతేయా! రజోగుణము తృష్ణా సంగము వలన బుట్టినదై నందున రాగ స్వరూపమైన దానినిగా నెరుగుము. అది కోరికను ప్రేమను గలిగించునది యైనందున ప్రవృత్తి హేతువు గనుక కర్మ సంగములో నాత్మను బంధించును॥ 7॥

శ్లో॥ తమ స్త్వ జ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినాం।
ప్రమాదా లస్య నిద్రాభి స్తన్నిబధ్నాతి భారత!॥ 8

—◆ భా ష్య మ్ ◆—

ఏవం తమసుభయో ర్విరోధి తృతీయ మప్యాహ।- తమ స్త్వితి। తత్రేత్థం సతి యతః సర్వ దేహినాం తను స్తతో౽ జ్ఞానజం తత్తమో విద్ధీతి తత్తమః ప్రమాదా లస్య నిద్రాభి ర్దేహినం నిబధ్నాతీత్యర్థః॥ ౮॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

సర్వదేహినామితి॥ ఏవంసతి, సత్వా జ్జాగ్రద్రజ స్స్వప్న స్సుషుప్తి స్తమసో భవే న్నిద్రా లస్యాదిభి ర్జీవో నిబద్ధో నాశ్నుతే పదమిత్యాది రీత్యా దేహినం తమస్తు విశేషేణ నిబధ్నాతీ త్యర్థః॥౮॥

—◆ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ◆—

ఈప్రకారము సత్వరజో గుణములకు విరోధియయిన తమోగుణము నున్నూ చెప్పుచున్నాడు. తమోగుణమును అజ్ఞానమువలన పుట్టినదానినిగా నెరుగుము. కాబట్టి సకలాత్మలను మోహింపజేయుచుండును. అది ప్రమాదము, ఆలస్యము, నిద్ర మొదలగువాటితో దేహిని బంధించుచున్నది. (సత్వమువలన జాగ్రత్తు, రజస్సువలన స్వప్నము, తమస్సువలన సుషిప్తియు గలుగుచున్నది గాన తమస్సు నిద్రా లస్యామలచే జీవుని బంధించును గాన పరంపదమును బొందలేడు. తమోగుణము విశేషముగా బంధించునని యర్థము॥ ౮॥

శ్లో॥ సత్వం సుఖె సంజయతి రజః కర్మణి భారత।
జ్ఞాన మావృత్యతు తమః ప్రమాదే సంజయత్యుత. ౯

—◆ భా ష్య మ్ ◆—

అథోక్తానాం సత్త్వాది గుణానాం మధ్యే కస్మిన్కార్యే కస్య గుణస్యోత్కర్ష మిత్యాహ। సత్త్వమితి। తత్ర తావ త్సత్త్వం దుఃఖకారణ మభిభూయ సుఖే సంజయతి సంయోజ యతీ త్యర్థః। ఏవం సత్త్వమభిభూయ రజః కర్మణి సంజయతి తథా తమస్తు దేహినో జ్ఞాన మావృత్య ప్రమాదా లస్యాదౌ సంజయతీ త్యర్థః॥ ౯॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

కస్మిన్కార్యఇతి॥ తద్యథా 'సత్త్వాది గుణవైషమ్యా త్కార్య వైషమ్య మిష్యతే। సంఘాతస్యపరార్థత్వా త్పుంసో భోక్తృత్వ మిష్యతే ఇత్యాద్య వధార్యమ్॥ ౯॥

—◆ ఆం ధ్ర తా త్ప ర్య ము ◆—

తరువాత, ఇదివరకు చెప్పిన సత్త్వాది గుణములలో యే కార్యమందు దేనికి గుణోత్కర్ష గలదంటె చెప్పుచున్నాడు. ఓ భారతా। సత్వ గుణము దుఃఖకారణములను త్రోసిపుచ్చి దేహిని సుఖమందు ప్రవేశ పెట్టుచున్నది. రజోగుణము సత్వగుణమును త్రోసి దేహిని కర్మలు జేయించుచున్నది. తమోగుణము దేహియొక్క. జానమును గప్పిపెట్టి ప్రమాదాలస్యాదులలో బడవేయుచున్నది (సత్వాది గుణముల యొక్క వైషమ్యము వలన ఒక దానికి మరియొకటి సరిపడదు) కార్య వైషమ్యము గలుగుచున్నది, గుణ సముదాయము పదార్థమగుట వలన పురుషునకు భోక్తృత్వము కలుగు చున్నదని తెలియవలెను॥ ౯॥

శ్లో॥ రజ స్తమశ్చా భిభూయ సత్త్వం భవతి భారత !
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజ స్తథా॥ ౧౦

—◆ భా ష్య మ్ ◆—

నను పరస్పరాంగాంగి భావేనో క్తం కార్యం గుణాః కథం కుర్వంతీ త్యాహ॥ రజ స్తమ ఇతి । తథాచేహ రజ స్తమశ్చ యుగప దుభావపి గుణా వభిభూయ సత్త్వం భవతి వర్ధతే ఏవం రజోపి సత్త్వం తమశ్చేతి గుణద్వయ మభిభూయ వర్ధతే తథా తమోపి సత్త్వం రజశ్చేతి గుణద్వయ మభిభూయ వర్ధత ఇత్యవధేయమ్॥౧౦॥

—◆ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ◆—

ఓయీ! ఒకదానికొకటి అంగమునుగాను అంగినిగాను చెప్పినకార్యము ను గుణములు యెట్లు చేయుచున్నవంటె చెప్పుచున్నాడు. సత్వగుణము రజస్తమస్సుల రెంటి నొక్కమారుగా ధిక్కరించి వృద్ధినొందుచుండును. రజస్సు సత్వ తమో గుణముల తిరస్కరించి వృద్ధినొందు చుండును. తమస్సు సత్వ రజస్సులను దిరస్కరించి వృద్ధినొందుచుండునని తెలియవలెను॥౧౦॥

శ్లో॥ సర్వద్వారేషు దేహేస్మి న్ప్రకాశ ఉపజాయతే
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్వ మిత్యుత॥ ౧౧

—◆ భా ష్య మ్ ◆—

ఇదానీం తూద్భూతానాం తేషాం లింగాన్యాహ । సర్వద్వారేష్వితి। తథాచా స్మి న్భోగాయతనే దేహే సర్వే

ష్వపి శ్రోత్రాదీంద్రియ ద్వారేషు శబ్దాది విషయోపలబ్ధి సాధనేషు యద్జ్ఞాన ముపజాయతే। తదనేన శబ్దాది విషయక జ్ఞానాఖ్యా ప్రకాశేన లింగేన ప్రకాశాత్మకం సత్త్వం వివృద్ధ ముద్భూత మితి విద్యా ద్విజానీయా దిత్యర్థః॥౧౧॥

—♦ ల ఘు టి ప్ప ణీ. ♦—

సత్త్వంవివృద్ధమితి॥ తద్యథా'సత్త్వా త్సుఖంచ జ్ఞానంచ శాస్త్రేలోకే విశారదః తస్మాద్విశేషత స్సత్త్వాత్ కైవల్యం యోగతః ఖల్వి' త్యాది స్మృత్యా విమల సత్త్వేన చేతసా కైవల్య మపీత్య నవద్యమ్॥౧౧॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఇప్పుడు వృద్ధినొంది పైకివచ్చిన యీగుణముల యొక్క హేతువులను జెప్పుచున్నాడు. భోగస్థానమైన యీ శరీరమందు శబ్దాది విషయములు పుట్టుటకు సాధనమైన శ్రోత్రాదీంద్రియ ద్వారముల యందు యే జ్ఞానము పుట్టుచున్నదో అది శబ్దాది విషయక జ్ఞాన ప్రకాశమను హేతువుచే పరికాశరూపమయిన సత్త్వము వృద్ధినొందినదని తెలియవలెను. (సత్త్వము వలన సుఖమున్నూ జ్ఞానమున్నూ గలిగి లోకమందు చాల నేర్పుగల వాడగును. అందువలన విశేషముగా సత్త్వగుణమువలన యోగద్వారా కైవల్యము గలుగునను స్మృతిచే విమల సత్త్వమైన చిత్తముతో కైవల్యమును న్నూ పొందుననుటలో తప్పు లేదు॥౧౧॥

శ్లో॥ లోభః ప్రవృత్తి రారంభః కర్మణా మశమః స్పృహా।
రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ !॥ ౧౨

—♦ భా ష్య మ్ ♦—

ఏవం రజస్యపి పరివృద్ధే వృత్తాంత మాహ, - లోభ ఇతి తత్రైవం సతి। రజసి పరివృద్ధే సతి సత్యపి ధనే ధనా

కాంక్షా గార్ధ్యం లోభో నిత్యం ప్రియత్నేన ప్రివృత్తి రారంభశ్చ। ఏవ మిదం కృత్వేదం కరిష్యామీతి సంకల్ప ప్రివాహః కర్మణా మశమః తథాన్యాయేనా ప్యుచ్చావచేషు ధనేషూ త్పితాసె స్పృహే త్యాది రజసీ రాగాత్మకే వివృద్ధే సత్యేతాని రాగాత్మకాని జాయంత ఇత్యర్థః॥ ౧౨॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

అన్యాయే నేతి॥ ఏవంసతీ ద మనర్థ సాధక మపీతి ధర్మ నిబంధే ప్యుక్తం। తద్యథా, 'అన్యాయోపార్జితం విత్తం దశవర్షాణి తిష్ఠతి ప్రాప్తే త్వేకాదశే వర్షే సమూలంచ వినశ్యతీ త్యాది ద్రష్టవ్యమ్॥ ౧౨॥

—♦ ఆ ం ధ్రి తా త్ప ర్య ము ♦—

రజోగుణము వృద్ధియగుచుండగా వృత్తాంతమును జెప్పుచున్నాడు. రజోగుణము వృద్ధియైతే ధనమున్నను ధనకాంక్ష గల లోభమున్నూ, ఈపనిని నెరవేర్చి యీపనిని జేతునను సంకల్పరూపమైన ప్రవృత్తియున్నూ కర్మారంభమున్నూ, శాంతిలేమియు అన్యాయముచేతనున్నూ, ధనరాసులు సంపాదింతునను స్పృహయు, ఓ భరతశ్రేష్ఠ! రాగ స్వరూపమైన రజోగుణ వృద్ధియందు రాగాత్మకమైన యీగుణములన్నియు పుట్టుచున్నవి (అన్యాయముచే సంపాదించిన ధనము పదిసంవత్సరము లుండును. పదు నొకొండవ సంవత్సరమున సమూలము నశించుననియు అనర్థమును గలిగించు ననియు ధర్మ నిబంధము నందు చెప్పబడినది॥ ౧౨॥

శ్లో॥ అప్రకాశో ప్రివృత్తిశ్చ ప్రిమాదో మోహఏవచ।
తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునందన!॥ ౧౩

—◆ భా ష్య మ్ ◆—

ఏవం తమస్యపి పరివృద్ధే వృత్తాంతమాహ। అప్రకాశ ఇతి॥ తత్రైవ మప్రకాశ స్తూపదేశేపి సర్వథా బోధాయోగ్యత్వం। ఏవ మప్రవృత్తి ర్నామ వర్ణా శ్రమ ధర్మేషు సత్స్వప్యు పదేశేప్రవృత్త్యభావత్వం। తథా ప్రమాదస్తు తత్కాలా వచ్ఛేదేన క ర్తవ్యత్వా నుసంధానాభావః ఏవం మోహస్తు నిద్రా క ర్తవ్య కర్మణాం విపర్యయో వేత్యాది తమసి ప్రవృద్ధే త్వేతాని లింగాని జాయంతే హేకురునందనే త్యర్థః॥ ౧౩॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

విపర్యయో వే॥ తద్యథా, 'అపూజ్య పూజనేచైవ పూజ్యస్యైవా ప్యపూజనే। సద్యో దైవకృత స్తత్ర దండః పతతి దారుణ' ఇత్యాది దక్షయజ్ఞ ప్రథమనా దవధార్య మిత్యధిక మన్యత్ర విస్తరః॥ ౧౩॥

—◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ◆—

ఈప్రకారము తమోగుణమున్నూ వృద్ధినొందితే వృత్తాంతమును చెప్పుచున్నాడు. తమోగుణ వృద్ధియందు ఉపదేశించినను అన్నివిధముల బోధకు యోగ్యుడు గాకుండుట. అప్రకాశము. వర్ణాశ్రమ ధర్మము లున్నను ఉపదేశమందు ప్రవృత్తి గలుగకుండుట అప్రవృత్తి। తత్కాలమందు చేయవలసిన దానిని చేయకుండుట ప్రమాదము । నిద్రగాని కర్మలయొక్క వ్యత్యాసముగాని మోహ మనిపించుకొనును. ఓకురునందనా తమోగుణ వృద్ధియం దీహేతువులు పుట్టుచున్నవి (పూజించదగని దానిని పూజించుట । పూజ్యమయిన దానిని పూజించకుండుట । యిట్లు లేల

క్రింపు కర్మ చేయుటచే తత్కాలమందు దైవకృతమైన దారుణమైన దండము పడుచున్నదని దక్షయజ్ఞ ఖండమునందు జూడనగును॥ మరియొక చోట విస్తరించి చెప్పెదము॥ ౧౩॥

శ్లో॥ యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రళయం యాతి దేహభృత్।
తదోత్తమవిదాం లోకా నమలా న్ప్రతిపద్యతే॥　　౧౪

—♦ భాష్యమ్ ♦—

అథేదానీంతు పంచత్వే ప్రాప్తే సత్వాదీనాం వివృద్ధానాం ఫలవిశేష మప్యాహ॥ యదేతి॥ తత్రైవం సతి యదా సత్త్వే ప్రవృద్ధే దేహభృ ద్దేహాభిమానీ జీవః ప్రలయం యాతి తదోత్తమవిదాం హిరణ్యగర్భాదీనా మమలాన్ లోకాన్ యథా సుకృత తారతమ్యేన ప్రతిపద్యత ఇత్యర్థః॥ ౧౪॥

—♦ లఘుటిప్పణీ ♦—

తారతమ్యేనేతి॥ తత్రైత్థంసతి। భూలోకేష్వై భువర్లోకే స్వర్లోకేచ యథాయథం జనోలోకే తపోలేకే సత్యలోకే యథాక్రమ' మిత్యాదిరీత్యా విశుద్ధా నమలాన్ లోకాన్ యథాసుకృత తారతమ్యేన గచ్ఛంతీ త్యధిక మన్యత్ర విస్తరః॥ ౧౪॥

—♦ ఆన్ధ్రి తాత్పర్యము ♦—

అనంతరమందు ఇప్పుడు సత్వాది గుణములు వృద్ధిగా నుండగా మరణము ప్రాప్తించితే ఫలవిశేషమును చెప్పుచున్నాడు। సత్వగుణ వృద్ధియందు దేహాభిమానియైన జీవుడు యెప్పుడు మృత్యువుం గాంచునో అప్పుడు ఉత్తములైన హిరణ్యగర్భాదుల యొక్క నిర్మలమైన లోకము లను సుకృతము యొక్క తారతమ్యము ననుసరించి పొందుచున్నాడు.

భూలోకము భువర్లోకము సువర్లోకము జనోలోకము సత్యలోకము ఇట్టి లోకములను పుణ్యము ననుసరించి పొందుచున్నారు॥ చాలాచెప్పితిమి మరియొకచోట విస్తారముగలదు॥ ౧౪॥

శ్లో॥ రజసి ప్రళయం గత్వా కర్మ సంగిషు జాయతే
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే॥ ౧౫

—♦ భాష్యమ్ ♦—

ఏవమేవ రజసి తమసిచ ప్రవృద్ధే మృతోః ఫలమాహ రజసీతి॥ తథా సతి। తదానీం రజసి ప్రవృద్ధేతు ప్రళయం గత్వా కర్మసంగిషు మనుష్య యోనిషు జాయతే। ఏవం తమసి ప్రవృద్ధే ప్రలీన స్తు మూఢయోనిషు పశ్వాదిషు యథా యథం కర్మానుగుణ్యేనో చ్చావచేషు జాయత ఇతివివేకః॥౧౫॥

—♦ లఘుటిప్పణీ ♦—

తథారజసి తమసిచ ప్రవృద్ధే సతి పంచత్వస్య ఫలమాహ। ఏవమేవేతి॥ తస్మా న్మనుజై స్సత్వవృత్త్యైవ వర్తితవ్య మిత్యాశయః॥ ౧౫॥

—♦ ఆంధ్రితాత్పర్యము ♦—

ఈ ప్రకారమే రజోగుణము తమోగుణము వృద్ధిలో నుండగా మరణించిన వానికి ఫలమును చెప్పుచున్నాడు. రజోగుణము వృద్ధిలో నుండగా మృతినొందిన వాడు కర్మ సంగము గల మనుష్య యోనుల యందు పుట్టుచున్నాడు. తమోగుణ వృద్ధియందు మృతినొందిన వాడు మూఢ యోనులయిన పశ్వాదుల యందు కర్మానుగుణ్యముగా ఉచ్చనీచములు గలిగి పుట్టుచుండునని తెలియవలెను. (అందువలన మనుజులు సత్వవృత్తిలోనే ఉండవలయునని యభిప్రాయము॥ ౧౫॥

శ్లో॥ కర్మణ స్సుకృతస్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలం
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలం॥　౧౬

—♦ భా ష్య మ్ ♦—

ఇదానీంతు సత్త్వాదీనాం విచిత్ర ఫలతాం దర్శయతి॥ కర్మణఇతి॥ తత్రైవంసతి। సుకృతస్య కర్మణో ధర్మాఖ్యస్య సాత్త్వికం నిర్మలం ఫల మాహు రిత్యర్థః। ఏవం రజసో రాజస స్యతు కర్మణః పాపమిశ్రస్య పుణ్యస్య రాజసం దుఃఖబహుళ మల్పం సుఖం। తథా తమస స్తామసస్య త్వజ్ఞానజన్యత్వా ద్బహుతరందుఃఖ మేవా హు రిత్యాశయః॥౧౬॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నిర్మలమితి॥ అతఏవ, 'మృగై రజయం జరసో పదిష్ట మదేహ బంధాయ పునర్బంధే' త్యాదిరీత్యా మలినే కర్మణి నైవ ప్రీతింకుర్యా దన్యథా పూర్వాభ్యాసేనై వాంత్యకాలేపి తత్రైవ ప్రవృత్త్యా తజ్జన్మ భాగినో భవిష్యంతీ త్యవధేయమ్॥ ౧౬॥

—♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఇప్పుడు సత్త్వాది కర్మలు విచిత్ర ఫలము గలవని చెప్పుచున్నాడు. ధర్మమనే సుకృత కర్మకు సత్త్వప్రధానమై నిర్మలమైన సుఖమే ఫలము. రాజస కర్మయైన పాపముతో గూడిన పుణ్యమునకు దుఃఖమధికము. అల్ప మైన సుఖము ఫలము తమోగుణ మజ్ఞాన జన్యమై నందున కేవల పాప రూపమైన తామసకర్మకు అనంతమైన దుఃఖమే ఫలము. (మలిన కర్మ యందు ప్రీతినుంచరాదు. అలాఉంచిన యెడల పూర్వాభ్యాసముచే నంత్య కాలమందును అదేఅభ్యాసము వచ్చి జడభరతుని వలె పశుజన్మను బొందిన వారగుదురు॥ ౧౬॥

శ్లో॥ సత్త్వా త్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ ।
ప్రమాద మోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవచ॥ ౧౭

—◆ భా ష్య మ్ ◆—

నన్వేతాదృశ ఫలవైచిత్ర్యే కో హేతు రిత్యాహ।— సత్త్వాదితి॥ తత్ర తావ త్సాత్త్వికస్య కర్మణః ప్రకాశ బహుళం సుఖజ్ఞానరూపం ఫలం సత్త్వా త్సంజాయతే ఏవం రజసో లోభోఽభిలాష విశేషో గార్ధ్య లక్షణో జాయతే తథా ప్రమాద మోహౌ తమసః సకాశా త్భవతో జాయేతే అథచ వృథాయః కృపణః క్షిపే దిత్యేవం కర్మసు ప్రవృత్తి శైథిల్యే నాజ్ఞానం ప్రవృత్త్య భావ శ్చేత్యా శయః॥ ౧౭॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

సత్త్వాత్సంజాయతఇతి॥ తస్మాత్సాత్త్వికై స్సహ సంసర్గేణ సాత్త్వికబుద్ధి మేవ వర్ధయేదిత్యుచితం తథ్యథా, ఖ్యాయికయోక్త మవధార్యమ్। 'అహం మునీనాం వచనం శ్రుణోమి శ్రుణోమి రాజన్ స గవాసినాం వచః నైవాస్య దోషో నచ మద్గుణోవా సంసర్గజా దోషగుణా భవంతీత్యాది ద్రష్టవ్యమ్॥౧౭॥

—◆ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ◆—

ఓయీ ఇటువంటి విచిత్రఫల ప్రాప్తి యందు హేతు వేమి యనగా చెప్పుచున్నాడు. సాత్త్విక కర్మయొక్క విస్తారమైన ప్రకాశ గల సుఖము జ్ఞానము నయిన ఫలము సత్త్వగుణమువలన బుట్టుచున్నది. రజోగుణము వలన సర్వభక్షణరూపమైన విశేషాభిలాష గల లోభము పుట్టుచున్నది. అట్లే తమో గుణము వలనప్రమాదము మోహమున్నూ పుట్టుచున్నవి. కృపణుడు

తన ఆయువును వ్యర్థము చేసుకొను నను స్మృతిని బట్టి కర్మలయందు ప్రవృత్తి లేకుండుటచే అజ్ఞానము పుట్టుచున్నది. (సాత్త్వికులతో సంసర్గజేయుట వలన సాత్త్వికబుద్ధి వృద్ధియగునను వచనము తగియున్నది. మరియు నేను మునుల యొక్క వాక్యమును వింటున్నాను. గోమాంసమును దిను చండాలుర వాక్యమునున్నూ వింటున్నాను. ఓరాజా యీదోషము గాని గుణము గాని నాదికాదు. సంసర్గదోషము లగుచున్నవి. యని స్మృతి గలదు॥౧౭॥

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛన్తి సత్వస్థాః మధ్యే తిష్ఠంతి రాజసాః
జఘన్య గుణ వృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః॥ ౧౮

—♦ భా ష్య మ్ ♦—

ఇదానీంతు సత్వాది వృత్యా కర్మ కర్తౄణాం స్పష్టమేవ ఫలం దర్శయతి॥ ఊర్ధ్వమితి॥ తత్ర తావత్సత్వస్థాః సత్వ వృత్యా కర్మకుర్వన్తః సత్యలోక పర్యంత మూర్ధ్వం గచ్ఛంతి నామ తే జ్ఞాన కర్మ తారతమ్యేన దేవలోకేషూ త్పద్యంతే తథైవ రాజసా రజోవృత్యా ఉత్తిలోభేన కర్మనిరతా జఘన్య గుణ వృత్తిస్థాః కర్మ తారతమ్యేన మధ్యే తిష్ఠంతీ త్యర్థః। ఏవమేవ తామసా స్తమో గుణ వృత్యా కర్మకుర్వన్తః పశ్వాది ష్వధోవా కర్మ తారతమ్యేన గచ్ఛన్తీ త్యర్థః॥౧౮॥

—♦ ల ఘు టి ప్ప ణీ . ♦—

జ్ఞానకర్మతారతమ్యేనేతి॥ తథాచైవంసతి 'శివోదేవోద్విజో బ్రహ్మక్షత్రియస్తుహరి స్మృతః। ఇందోవైశ్య స్తథైవాన్యే యక్షాద్యాశ్యూద్రజాతయః' ఇత్యాది భారతస్మృత్యాయథాయథం జ్ఞానకర్మానురూపేణ తారతమ్యేన దేవలోకేష్వప్యుత్పద్యన్త ఇత్యర్థః॥ ౧౮॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఇప్పుడు సత్వ - రజస్తమో గుణ వృత్తులచే కర్మ చేయువారల ఫలమును స్పష్టముగా జెప్పుచున్నాడు. సాత్విక వృత్తితో కర్మ చేయు వారలు సత్యలోక పర్యంతము ఊర్ధ్వలోకములకు వెళ్ళి జ్ఞాన కర్మల తారతమ్యమునుబట్టి దేవలోకముల యందు బుట్టుచున్నారు. రజో గుణ వృత్తితో అతిలోభులై కర్మ చేయవారలు సంభోగాది గుణవృత్తులు గల వారై కర్మ తారతమ్యముచే మధ్య (భూలోకము) యందు మానవులై పుట్టుచున్నారు. తమో గుణవృత్తితో కర్మ చేయువారలు తారతమ్యముగా అధో లోకముల యందు గాని పశ్వాది యోనులయందు పుట్టుదురు. (శివుడు దేవుడు - బ్రహ్మ బ్రాహ్మణుడు. విష్ణువు క్షత్రియుడు ఇంద్రుడు వైశ్యుడు-ఇతరమైన యక్షాదులు శూద్రులనుభారత వచనాను సారము జ్ఞాన కర్మల తారతమ్యమును బట్టి దేవ లోకముల యందు బుట్టుచుందురు॥౧౮॥

శ్లో॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాను పశ్యతి।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి॥ ౧౯

—♦ భా ష్య మ్ ♦—

అథేదానీంతు పూర్వోక్త గుణేభ్యః కథం మోక్షణం కింవా తస్య లక్షణ మిత్యాహ ।- నాన్యమితి॥ ఏవంసతి యది దేహం పృథక్కృత్య చితి విశ్రామ్య తిష్ఠతీతి స్మృతి న్యాయేన యథా ద్రష్టా ఽఽత్మ విచార కుశలో దేహేంద్రియాది తత్తదవస్థా పన్నేభ్యో గుణేభ్యో నాన్యం కర్తార మనుపశ్యతి తదా తు త్రివిధ గుణేభ్యః పరం చిదంబరాత్మానం పశ్యతి సచ తదుత్తరం మద్భావం మత్పరంపదం గచ్ఛతీ త్యర్థః॥ ౧౯॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

అథ 'వినాశివ ప్రసాదంహి భ్రాంతిః క్వాపి న నశ్యతీ'త్యాది స్కాంద స్మృత్యా యదాచర్మవదాకాశ' మిత్యాది శ్రుత్యాచ శివోపాస నాయా అవశ్యకత్వే స్థితే సత్యాహ । మత్పరం పరమితి॥ తద్యథా 'పదం యత్పరమం విష్ణో స్తద్దేవా ఖిలదేహినాం । పదం పరమ మద్వైతం సశివ స్సాంబవిగ్రహ' ఇత్యాద్య వధార్యమ్॥ ౧౯॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

ఇప్పుడు వెనుక చెప్పిన సత్వాదిగుణములనుండి విడుచుట యెట్లు? దాని లక్షణ మేమని యడిగి నందున చెప్పుచున్నాడు. దేహమును వేరు చేసి చైతన్యమందు విశ్రమించి ఉంటున్నాడను స్మృతిన్యాయముగా నాత్మవిచార మందు కుశలుడైన వాడున్నూ దేహేంద్రియాదులు, జాగ్రి దాదులునైన గుణముల కంటె కర్త వేరుగా లేదని చూచునట్టివాడు, త్రివిధగుణములకంటె అతీతుడై చిదంబర స్వరూపుడైన యాత్మను చూచు వాడున్నూ, జన్మాంతమందు నాపరంపదమును బొందును. (శివప్రసాదము లేక భ్రాంతి యెవరికిని నశించదనునట్టి స్కాంద పురాణమును బట్టిన్ని ఆకాశమును చర్మమువలె చుట్టునపుడు శివుని తెలియక ముక్తి గలుగు నసె శ్రుతిని బట్టి శివోపాసన యావశ్యకమై యుండగా చెప్పుచున్నాడు. నాపరం పదమనగా, నాకంటె పరమైన సాంబశివుడే నా పరమపదము. అతనె సర్వదేహులకు ముక్తి నిచ్చువాడు అని తెలియవలెను॥ ౧౯॥

శ్లో॥ గుణానేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।
జన్మ మృత్యు జరా దుఃఖైర్విముక్తో మృత మశ్నుతే॥ ౨౦

—♦ భా ష్య మ్ ♦—

నన్వేతావతాపి కథం పర మమృతాఖ్యం శివం గచ్ఛతీ త్యాహ। గుణానితి॥ తత్రైవం సత్యేతా న్మాయాత్మకాం స్త్రీ

న్సత్త్వరజ స్తమో నామ్నో దేహ సముద్భవాన్ దేహోత్పత్తి బీజభూతా నతీత్య జీవన్నేవ శివైక తత్త్వజ్ఞానేన జన్మ మృత్యు జరా దుఃఖై ర్విముక్తః సన్ మద్భావం సాంబశివం సమశ్నుత ఇత్యర్థః॥ ౨౦॥

—♦ లఘుటిప్పణీ ♦—

అమృతాఖ్యమితి॥'శృణ్వంతి విశ్వేఅమృతస్య పుత్రా ఆయే ధామాని దివ్యాని తస్థు' రిత్యాది శ్రుతిరితి భావః। శివైక తత్త్వజ్ఞానేనేతి తద్యథా'శివ జ్ఞానసమం జ్ఞానం యథానాస్తి శ్రుతావిత్యాది శ్రుతే రితిభావః॥ ౨౦॥

—♦ ఆంధ్రితాత్పర్యము ♦—

ఓయీ! ఇంతమాత్రముచె అమృతమను పరమశివుని యెట్లు పొందునంటె చెప్పుచున్నాడు. దేహి, దేహోత్పత్తికి కారణములై దేహాకారముగా పరిణమించి దేహమందుండునట్టిన్ని మాయాస్వరూపములైన సత్వ రజస్తమోగుణముల మూటిని అతిక్రమించి జీవించియుండియే శివతత్వజ్ఞానముచే జనన మరణ ముదివి దుఃఖములచే విడువడి నాభావమైన సాంబశివుని పొందుచున్నాడు. (అమృతమనగా శివుడని శృతి ప్రమాణముగనుక శివ జ్ఞానముతో సమమయిన జ్ఞానము శృతులయందెక్కడను గాన్పించదనిన్ని శృతులే చెప్పుచున్నవి॥ ౨౦॥

అర్జునఉవాచ—

శ్లో॥ కైర్లింగై స్త్రీన్ గుణా నేతా నతీతో భవతి ప్రభో।
కిమాచారః కథం చైతాం స్త్రీన్ గుణా నతి వర్తతే॥ ౨౧

—♦ భాష్యమ్ ♦—

నను కథం జానీమో గుణాతీతో యం పురుష ఇతి తస్య లక్షణ మపృచ్ఛదర్జునః పృచ్ఛతి॥ కైరితి॥ ఏవంసతి హే

ప్రభో! సత్వ రజ స్తమో గుణా నేతాన్ కై ర్లింగై రతీతో భవతీతి ప్రథమః ప్రశ్నః। తథైవ క ఆచారోఽస్యేతి కి మాచారః కిం యథేష్ట చేష్టః కింవా కర్మ నియంత్రిత ఇతి ద్వితీయః ప్రశ్నః। ఏవం కేన ప్రకారేణై తాన్ స్త్రీన్ గుణా నతిక్రమ్య వర్తత ఇతి గుణాతీతత్వోపాయః క ఇతి తృతీయః ప్రశ్న ఇత్యాశయః॥ ౨౧॥

అర్జునం డిట్లనియె—

ఓయీ ఈ పురుషుడు (శివుడు) గుణాతీతుడని మేమెట్లు తెలియ గలమో దానికి లక్షణ మేమని యర్జును డడుగుచున్నాడు. దేవా ఈ సత్వ రజ స్తమో గుణములను అతిక్రమించిన వానికి గుర్తులెవ్వి యని మొదటి ప్రశ్న. ఆచారమేమి, యెట్టి చేష్టగలవాడు. యే కర్మలు చేసునని రెండవ ప్రశ్న. త్రిగుణములను దాట నుపాయమేదని మూడవ ప్రశ్న॥ ౨౧॥

శ్రీకృష్ణ ఉవాచ.—

శ్లో॥ ప్రకాశంచ ప్రవృత్తించ మోహమేవచ పాండవ!।
నద్వేష్టి సంప్రవృత్తాని ననివృత్తాని కాంక్షతి॥ ౨౨

—♦ భాష్యమ్ ♦—

నను నిస్త్రైగుణ్యో భవార్జున ఇత్యాది లక్షణ లక్షితస్య యోగినః కీదృశః సమాచార ఇత్యస్యోత్తర మప్యాహ ప్రకాశమితి॥ తత్ర తావ త్సమాధితో వా నిద్రాత శ్చోత్థానంవానద్వేష్టి కింతుసర్వఽసర్వత్ర సర్వదేతి న్యాయా దుపలభ్యమాన తత్త్వేన శారీరకర్మ ప్రవృత్తి లక్షణం నద్వేష్టి ఏవమేవ

మోహ నిద్రాకృతం వ్యావహారికంవా ప్రాప్తమప్యద్వేష్టి యతః సర్వత్రోపలభ్యమానత్వా న్నతన్నివృత్త్యా న్యపి కాం క్షతీ త్యర్థః॥ ౨౨॥

## —◆ లఘు టిప్పణీ ◆—

నన్విహ సత్వ రజస్తమసాం సాధారణ్యేన ఫలముక్తం తదిహ విమల సత్వస్యతు నిస్త్రైగుణ్య ప్రయోజక తావచ్ఛేదకీ భూతస్యాపి ఫల మాహ। తత్ర తావదితి॥ తత్రేత్థంసతి'నిమిషార్థం నతిష్ఠంతి।ప్రవృత్తిం బ్రహ్మ మయీం వినా । యథా తిష్ఠంతి॥ బ్రహ్మాద్యా స్సనకాద్యా శ్శుకాదయ' ఇత్యాది స్మృత్యా సర్వమిత్యాది రీత్యా సర్వం విజాన న్నద్వేష్టీ త్యాది రర్థః॥ ౨౨॥

## —◆ ఆంధ్రతాత్పర్యము ◆—

శ్రీ కృష్ణుం డిట్లనియె॥ ఓ యర్జునా నీవు త్రిగుణ రహితుడవు గమ్మ నిన స్మృతికి అనుసారముగా లక్షణములు గల యోగి యొక్క సమాచార మెట్లుండు ననగా దానికి నుత్తరమును జెప్పుచున్నాడు. సమాధి నుంచి గాని నిద్ర నుంచి గాని లేచుటను ద్వేషింపడు. అంతటను యెల్లపుడు సర్వము అను న్యాయము చొప్పున పొందబడిన తత్వముచే శారీర కర్మల యందు ప్రవృత్తి ధర్మమునున్నా ద్వేషింపడు. మోహము, నిద్ర, వీటిచే చేయబడు వ్యావహారికము నైనా పొందిన్నా ద్వేషింపడు. సర్వత్ర లభ్య మగునవి నివర్తించినను కోరడని యర్థము. (ఓయీ, సత్వ రజస్తమో గుణములకు సాధారణ ఫలము చెప్పబడినది. త్రిగుణ రహితమైన విమల సత్వము నకున్నూ ఫలమును చెప్పుచున్నాడు. బ్రహ్మాదులు, సనకాదులు, శుకాదులు బ్రహ్మాకార వృత్తిని విడచి అరనిమిషమైన నుండరను స్మృతిని బట్టి సర్వమును తెలియుచు ద్వేషింపరని యర్థము॥ ౨౨॥

శ్లో॥ ఉదాసీన వదాసీనో గుణై ర్యో నవిచాల్యతే
గుణా వర్తంత ఇత్యేవం యోవ తిష్ఠతి నేంగతే॥ ౨౩

—♦ భా ష్య మ్ ♦—

ఏవ మపరమపి లక్షణ మాహ॥ ఉదాసీన వదితి॥తథాచ యథా ద్వయో ర్వివదమానయో ర్యః కస్యచి త్పక్షం నభజతే తద్వ దయ మాత్మవి ద్రాగ ద్వేష విముక్తతయా పరమ శివానుసంధా నేనాసీనో భవతి నతు త్రివిధ గుణ జన్యై ర్గుణై ర్దోషైర్వా విచాల్యత ఇత్యర్థః ! కింతు 'ఛాయా శరీరే ప్రతిబింబగాత్రే యత్స్వప్నదేహే హృది కల్పితాంగ' ఇత్యాది స్మృతి న్యాయేన గుణా ఏవ దేహేంద్రియ విషయాకార పరిణతాః పరస్పరం ప్రవర్తంత ఇత్యేవం మత్వా యోఽవతిష్ఠతి సచ స్వయం జీవన్ముక్తత్వేన విముక్తస్స న్నేంగతే నవ్యాప్రియత ఇత్యవధేయమ్॥ ౨౩॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

గుణై ర్దోషై ర్వేతి॥ తద్యథా, అహౌవా హారేవా బలవతి రిపౌవా సుహృదివా మణౌవా లోష్ఠేవా కుసుమశయనేవా దృషదివా। తృణేవా స్త్రైణేవా మమ సమదృశో యాంతుదివసాః క్వచిత్పుణ్యారణ్యే శివశివ శివేతి ప్రలపత ఇత్యాద్యవధార్యం॥ ౨౩॥

—♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఈప్రకారమే మరియొక లక్షణమును చెప్పుచున్నాడు. ఇద్దరు వివాదమును చేయుచుండఁగా యెవరి పక్షమునకున్ను వెళ్ళనివాడు ఉదాసీనుడు. వానివలె యీఆత్మవేత్త రాగద్వేషములు లేనివాడగుటచే

పరమశివాను సంధానముతో గూరుచున్నవాడై త్రిగుణములవలన జనించిన గుణములచేతను గాని దోషములచేతను గాని చలించబడడు. ప్రతిబింబ శరీరము ఛాయామాత్రము. స్వప్నశరీరము హృదయమందు కల్పితము. ఇత్యాది స్మృతులయొక్క న్యాయము ననుసరించి గుణములే దేహముగాను ఇంద్రియములుగాను పరిణమించి పరస్పరము ప్రవర్తించు చున్నవని తలచి యెవడుఉంటున్నాడో వాడుస్వయముగా జీవించుచున్నను ముక్తుడగుటచే సంసారబంధ విముక్తుడగుచు యే వ్యాపారమును చెయ్యడని తెలియ వలెను. (గుణదోషము లనగా సర్పమునైనను, పుష్పమాలనైనను, బలవంతు డగు శత్రునైనను మిత్రునైనను, మణినైనను బెడ్డనైనను, పుష్పశయ్యనైనను, రాతినైనను, తృణమునైనను స్త్రీ సముదాయమునైనను సమానముగా జూచునట్టి నాకు యేదైన నొక పుణ్యారణ్యమందు శివ, శివ, శివ యని ప్రలాపమునుజెయుచు దినములు వెళ్ళుగాత॥ ఇత్యాదులను గుణదోషము లుగా తెలియవలెను॥ ౨౩॥

శ్లో॥ సమ దుఃఖ సుఖః స్వస్థః సమ లోష్టాశ్మ కాంచనః।
తుల్య ప్రియా ప్రియో ధీర స్తుల్య నిందాత్మసంస్తుతిః॥౨౪

— భాష్యమ్ —

ఏవ మపర మప్యధికం తల్లక్షణ మాహ। సుఖదుఃఖేతి తత్త్రైవం సత్యంత స్త్యాగేతి స్మృతి న్యాయేన సమే దుఃఖే సుఖేచ యస్యసః యతస్స్వస్థో యతశ్చ సర్వస్యప్రపంచజాలస్య కల్పితత్వేన సమ లోష్టాశ్మ కాంచన ఇత్యర్థః। ఏవం తుల్యే ప్రియాప్రియే సుఖ దుఃఖసాధనే యస్యసః యతశ్చ ధీరో ధ్యానశీలః అతఏవచ తుల్యే నిందాత్మ సంస్తుతీ యస్యసగుణాతీత ఇత్యర్థః॥ ౨౪॥

## —◆ ల ఘు టి ప్ప ణీ ◆—

ధ్యానశీలఇతి॥ తద్యథా. సజ్జాసనస్థో౽థపరివ్రజన్నా ముక్తః పరిక్షీణ వితర్కజాల స్సంసార బీజక్షయ మీక్షమాణ స్స్యాన్నిత్యముక్తో౽మృత భాగభోగీ' త్యాది స్మృత్యుక్త రీత్యా దుగ్ధం గీతామృతం మహదిత్యాత్రి ప్రతిజ్ఞాతస్యా మృతశబ్దాభిధేయస్య శివస్య ధ్యానశీలస్సన్ విహరేదిత్యవధేయమ్॥ ౨౪॥

## —◆ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ◆—

ఈప్రకారమే మరియొక గొప్ప లక్షణమును జెప్పుచున్నాడు. ఆంతర్యమందు త్యాగము గలిగియుండవలయునను న్యాయముచే సుఖదుఃఖములయందు తుల్యుండును, గనుక నే స్వరూపస్థితియందుండువాడును, సర్వప్రపంచము కల్పితమగుటచే మంటిని, రాతిని, బంగారమును సమముగా జూచువాడును, సుఖదుఃఖ సాధనములైన ప్రియము, అప్రియము గలిగినపుడు రెంటిని నొక్క విధముగా నెంచువాడును, ధ్యానశీలుడును నిందాస్తుతులను సమానముగా నుండువాడును, గుణాతీతుడనబడును, (ధ్యానశీలుడనగా ఆసనబంధమం దుండిగాని తిరుగుచూ గాని యెవఃతోను తర్కించక సంసార బీజమయిన అజ్ఞాన నాశమును చూచుచు అమృతభాగము ననుభవించువాడు ముక్తుడు. నిత్యముక్తుడు నన్న స్మృతిప్రకారము దుగ్ధం గీతా మృతం మహత్ అనుస్థలమందు ప్రతిజ్ఞచేయబడిన అమృతపర్యాయమైన శివునియొక్క ధ్యానమును జేయుచు విహరించవలయునని తెలియవలెను॥ ౨౪॥

శ్లో॥ మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారి పక్షయోః
　సర్వారంభ పరిత్యాగీ గుణాతీత స్సఉచ్యతే।　　　౨౫

—♦ భా ష్య మ్ ♦—

అథవా పరమపి యోగినో లక్షణ మాహ। మానా వమానయోరితి॥ ఏవ మిహ హర్ష విషాద జనకయో ర్లాభ హాని ప్రయోజకయో ర్మిత్రారి పక్షయోశ్చ తుల్య ఇత్యర్థః। ఏవ మిదం కృత్వేదం కరిష్యామీ త్యేవం రూపస్య సర్వా రంభస్య యస్తు పరిత్యాగీ సఏవ గుణాతీత ఇత్యర్థః॥౨౫॥

—♦ ఆంధ్రి తా త్ప ర్య ము ♦—

మరియొకరీతిగా యోగియొక్క లక్షణమును చెప్పుచున్నాడు. సంతోషమును దుఃఖమును గలిగించు మానావమానముల నొక్కవిధముగా నెంచువాడును లాభమును హానిని చేయు మిత్రులను శత్రులను ఏకరీతిం గనువాడును ఈ కార్యమును జేసి యీకార్యమును జేయుచున్నాననెడి యే యారంభమును లేనివాడును గుణాతీతుండన బడును॥౨౫॥

శ్లో॥ మాంచ యో ఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణా న్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥౨౬

—♦ భా ష్య మ్ ♦—

నను కథ మేత త్తత్వోపలబ్ధి రిత్యాహ।-మాంచేతి॥తథా చ నస్వయం ధ్యానతః కశ్చి త్సర్వజ్ఞ స్సిద్ధిపారగ ఇత్యాది స్మృతిన్యాయేన సద్గురో, రావశ్యకత్వే స్థితే మాంచ వసత్యా థాతు సర్వత్రేతి స్మృతిన్యాయేన వాసుదేవాఖ్యం పాశుపతం యోవ్యభిచారేణ 'యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా

గురో' వితిరీత్యా భక్తియోగేన సేవత్తే సఏవ తాన్ గుణాన్ సమతీత్య బ్రహ్మభూయాయ చిదంబరాత్మనా శివత్వాయ కల్పత ఇత్యర్థః॥౨౬॥

—◆ లఘుటిప్పణీ ◆—

సద్గురో రావశ్యకత్వమితి॥ తద్యథా, వేదాంత తర్కోక్తిభి రాగమైశ్చ నానావిధై శ్శాస్త్రకదంబకైశ్చ ధ్యానాదిభి స్సకరణైరపి నైవ గమ్యం చింతామణిం త్వేకగురుం విహాయే త్యాది ద్రష్టవ్యమ్॥౨౬॥

—◆ ఆంధ్ర తాత్పర్యము ◆—

ఓయీ ఈతత్వమెట్లు ప్రాప్తించుననగా చెప్పుచున్నాడు. గురువు లేక స్వయముగా ధ్యానించుట వలన యెవడును సర్వజ్ఞుడై సిద్ధి ముక్తుల నొందలేదనే న్యాయముచే సద్గురువుఆవశ్యకమై యుండగా నన్ను వాసుదేవునిగా (వసథాతువు అంతటా నుండునట్టి దేవుడు శివుడే దేవుడను పాశుపతునిగా శ్లో॥ దూర్వాస కౌశిక విరించి మృకండు పుత్రాన్ దేవేంద్ర బాణ హరిశక్తి దధీచి రామాన్ కణ్వాది భార్గవ బృహస్పతి గౌతమాదీ నేతా నహం పరమ పాశుపతాన్నమామి । యను స్మృతి బట్టి పాశుపతునిగా యెవడు అవ్యభిచార (ఏకాంత) భక్తితో దేవునియందు యెవనికి భక్తిగలదో దేవునియందువలెనే గురువునందును భక్తి నుంచవలెనన్న న్యాయముచె భక్తియోగముచే సేవించు చున్నాడో వాడే గుణముల నతిక్రమించి . చిదంబర స్వరూపముతో శివత్వమునకు దగినవాడు (తత్వము । చింతామణివంటి గురువులేక వేదాంత వాక్యముల చేతను తర్క యుక్తులచేతను ఆగమములచేతను అనేక శాస్త్రసమూహముల చేతను సాధనములతో గూడిన ధ్యానాదుల చేతనున్నూ ప్రాప్తించదు॥ ౨౬॥

శ్లో॥ బ్రహ్మణోహి ప్రతిష్ఠాహ మమృతస్యా వ్యయస్యచ ।
శాశ్వతస్యచ ధర్మస్య సుఖస్యై కాంతికస్యచ॥ ౨౭

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే గుణత్రయ
విభాగ యోగోనామ చతుర్దశోధ్యాయః.

## — భా ష్య మ్ —

అత్ర హేత్వంతర ముపసంహర న్నాహ । బ్రహ్మణోహీతి॥ తత్రైవంసతి । తద్విస్తారోయతో దేవా స్తతో భూతపతి స్త్వహ మిత్యాది స్మృత్యా హి యతో మృత్యుం జయత్వేనా మృతశబ్దా భిధేయస్యా వ్యయస్యచ పరబ్రహ్మణ స్సదాశివస్యా హం ప్రతిష్ఠేత్యర్థః । ఏవం తత్ప్రాప్తి సాధన భూతస్య శాశ్వతస్యైకాంతికస్య ధర్మస్య దక్షదుహితర్య జనిష్ట మూర్త్యా మిత్యత్రోక్తస్య భస్మ త్రిపుండ్ర రుద్రాక్షాది ధారణ పూర్వక శివారాధన రూపస్య ధర్మస్యా ప్యహం ప్రతిష్ఠా ప్రవర్తకఇతి పరమార్థః॥ ౨౭॥

ఇతి శ్రీ శ్వేతాచార్య గురుచరణ శిష్య భావ సమాసాదిత శైవసిద్ధాంత ప్రవర్తక శ్రీ శ్రీకంఠ శివాచార్య విరచితే తత్త్వైక దర్శన నామకేగీతాభాష్యే గుణత్రయ విభాగ యోగోనామ చతుర్దశోధ్యాయః.

## —◆ ల ఘు టి ప్ప ణీ ◆—

ప్రతిష్ఠేతి॥ అతఏవ రామేశ్వర మాహాత్మ్యే రామాయణేప్యుక్తం। తద్యథా। 'షష్ఠీతత్పురుషం జ్ఞాత్వా తిష్ఠ త్వం పరమేశ్వర। బహువ్రీహిమహం జ్ఞాత్వా తిష్ఠామి రఘునందనే'త్యాదిస్మృత్యా హరిహరయోస్సంవాదేన స్ఫుటీకృతం॥ ౨౭॥

ఇతిశ్రీ శ్రీకంఠ శివాచార్య శిష్య విశ్వేశ్వర శివా
చార్య విరచితాయాం లఘుటిప్పణ్యాం
గుణత్రయ విభాగయోగః.

## —◆ ఆం ధ్ర తా త్ప ర్య ము ◆—

ఇక్కడ మరియొక హేతువును న్నూ ఉపసంహరించుచు చెప్పుచున్నాడు. ఓదేవతలారా! భూతములను విస్తరింప జేసినందున నేను భూతపతినని శివుడు దేవతలకు చెప్పెనసెడి స్మృతిచేతనున్నూ మృత్యువును జయించుటచే అమృతమను పేరు గలినట్టిన్ని నాశరహితమైన పరబ్రహ్మమైన శివుని నేను ప్రతిష్ఠించితిని. ఈ ప్రకారము శివప్రాప్తి సాధనమైన శాశ్వతమై ఏకాంతమైనట్టిన్ని దక్షుకుమార్తె ధర్మమూర్తియైపుట్టెనన్న స్మృతిని బట్టి భస్మ త్రిపుండ్ర ధారణ రుద్రాక్షధారణ పూర్వకముగా శివారాధన రూపమైన ధర్మమునకు నేను ప్రవర్తకుడ (నడిపించువాడ) నని పరమార్థము (ప్రతిష్ఠయనగా రామేశ్వరమున శివలింగప్రతిష్ఠచేసి శంకరుని రాముడు షష్ఠీ తత్పురుషగా నుండుమని కోరెను. అనగా రామస్యనాథః రామనాథః రామునకు రక్షకుడుగా నుండుమని యర్థము) బహువ్రీహిగా నుందునని ఈశ్వర ప్రత్యుత్తరము (అనగా రామః నాథః యస్య స రామనాథః. యేశివునకు రాముడు నాథుడో వాడు రామనాథుడు) ఇట్లు రామాయణ మందును రామేశ్వర మహాత్మ్యము నందును గలదు. హరి హర సంవాద రూపముగా స్ఫుటమైనది. యేమనగా రాముడు లేకున్న రామ

నాధస్వామిని ప్రతిష్ఠించు వారు లేనందుననున్నూ శైవ ధర్మమును ప్రతిష్ఠించి యుండుటచే 'శివేనో త్పద్యతే శైవంశైవేనో త్పద్యతే శివః' అనుకారణాగమ శ్రుతిని బట్టి శివుడు శైవుని పుట్టించెను. గనుక శైవుడు శివుని స్థాపించుచున్నాడు. రాముడు శైవుడుగాన శివలింగ ప్రతిష్ఠచేసెను. కృష్ణుడున్నూ శివుని యారాధించి యనేక వరములను బడసెను. యిట్టి శివారాధన శివధర్మాచరణమున్నూ లేక శివతత్వము ప్రాప్తించదని శివ ప్రసాదేన వినా న ముక్తి యః నిశ్చయమః॥ ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే – అని చెప్పినట్లు ధర్మమును స్థాపించుచున్నాడు॥

ఇట్లు తత్త్వైక దర్శనమను శ్రీకంఠీయ గీతాభాష్యమునకు బోధా
నంద మహర్షిచేరచింపబడిన భావబోధమను నాంధ్రి
తాత్పర్యమున గుణత్రియ విభాగ
యోగమనుపదునాల్గవ అధ్యా
యము సమాప్తము.



ఓమ్

శ్రీమచ్ఛ్రీకంఠాచార్యకృతే

# శ్రీ భగవద్గీతాభాష్యే

పురుషోత్తమ యోగోనామ పంచదశోఽధ్యాయః.



శ్రీకృష్ణ ఉవాచ.—

శ్లో॥ ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్ ।
ఛందాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్॥ ౧

—♦ భాష్యమ్ ♦—

'పరత్వాపరభేదేన పురుషోహిద్విధామతః। తతోఽత్తమః పరః ప్రోక్తః ప్రోచే పంచదశేఖిలం'॥ నను కథం తదమృతశబ్దాభిధేయంపరబ్రహ్మ జ్ఞాతుం శక్యమిత్యతోఽధ్యారోపాపవాద న్యాయేనాత్మానాత్మవివేచమప్యాహ ఊర్ధ్వమితి॥ తత్రైవం సత్యూర్ధ్వం శిరో మూల మన్నపానాదినా వర్ధకం యస్య తథా దశ్శాఖా విరాడ్రూపేపి జఘనాదీని యస్యేతి ప్రాకృత వృక్షాణాం పాదపత్వేన స్ఫుటీకృతం । తదప్యేత ద్రజ్జు సర్పాదివ ద్వినా జ్ఞానం కేవల దండాది కర్మణా వినాశ రహితత్వా దవ్యయమిత్యర్థః । ఏవం యస్యాం గుళ్మాదీని పర్ణాని చందాంస్యా

చ్ఛాదకాని యస్యేతి తం జ్ఞానేనైవ చ్ఛేదనార్హం వృక్షం వేద సఏవ వేద తతోఽన్యథా త ముగ్ధ శ్రోత్రియోఽహిభక్షక న్యాయానభిజ్ఞ ఇత్యర్థః॥ ౧॥

## —◆ లఘుటిప్పణీ ◆—

నను 'ద్విపదాం వరిష్ఠ' ఇత్యాది స్మృత్యా పురుషోత్తమో నారాయణ ఇత్యయం పురుషోత్తమః। అథచ విశ్వాధికతయా పురుషోత్తమో రుద్ర ఇత్యయం పురుషోత్తమ ఇత్యనయోః కోఽన్యవస్థేతి నిరూపయితుం ప్రతిజానీతే, పరత్వా పర భేదేనేతి। ఏవం సతి సంసార రుక్ ద్రావకత్వా ద్రుద్రః తరతిశోక మాత్మవిదితి శృత్యా త్రివిధ దుఃఖా త్యంత నివర్తకత్వేన సహస్ర శీర్షేత్యాద్యా గీయమాన ఏవోత్తమః పురుష ఇతి వక్ష్యతే। ముగ్ధేతి, తత్ర తావత్తత్వ జ్ఞాన హీనత్వేన మూఢ స్తథా వాంచ శ్యంచే త్యాది వక్తృత్వేన శ్రోత్రియా శ్చే త్యర్థః। ఏవ మహిభక్షకో నటో యద్వ చ్ఛీర్షం పుచ్ఛంచ విహాయ శేష మహిం భక్షయతి తథా బ్రహ్మవిద పి నామ రూపే విహాయ శేషం బ్రహ్మే త్యవధారయతీ త్యర్థః॥ ౧॥

## —◆ ఆంధ్రి తాత్పర్యము ◆—

పంచమాధ్యాయము పురుషోత్తమును గురించి చెప్పుచున్నాడు. పురుషుడు, పరుడు, అపరుడు అని రెండు విధములు. అందు ఉత్తముడు పరుడు. శ్రీకృష్ణుం డిట్లనియె. ఓయీ! అమృత శబ్ద వాచ్యుడయిన అపర బ్రహ్మ యెట్లుగా తెలియ శక్య మగునంటె అధ్యారోపా ఉపవాద న్యాయముచే ఆత్మా ఉనాత్మ వివేకమునున్నూ చెప్పుచున్నాడు. ఊర్ధ్వ మనగా శిరము, మూల మనగా అన్న పానాదులచె వృద్ధి నొందించునది. అనగా గర్భమందు న్నపుడు బ్రహ్మరంధ్ర మార్గముగా ను జనన మైన తరువాత నోరు నుండియు అన్న పానములు గ్రహించి దేహమును వృద్ధి

నొందించునది యని యర్థము. అధః శాఖం విరాడ్రూపమందున్ను జఘనము ఊరువులు బాహువులు మొదలగు కొమ్మలు గలది సామాన్య వృక్షములన్ని పాదప ములని పేరొందినవి. అనగా వేరునుండి జలమును పానంచేసి వృక్షమును పోషించునవి. ఇక్కడ శరీరమును వృక్షమునుగా ఆరోపించినాడు. యీవృక్షము రజ్జు సర్పమువలె జ్ఞానము లేక దండాము లచే నశించదుగనుక అవ్యయమైనది. రజ్జు సర్పము రజ్జు జ్ఞానముగలిగి నప్పుడే నశించును గాని యెంతకొట్టినను నశించనట్లు యీ వృక్షమున్ను జ్ఞానము గలిగినపుడే నశించునుగాని ఛేదించినను నశించక యిలకలు మొలకలెత్తి మళ్ళీ వృక్షమగును. యీ వృక్షమునకు వేదము మొదలగు ఆకులు చందస్సులు ఆచ్ఛాదించునవి యిటువంటి అశ్వర్థము (రావిచెట్టు) ను జ్ఞానముచే ఛేదించుట కర్హమైన దానినిగా యెవడు తెలియుచున్నాడో వాడే తెలివిగలవారిలో తెలిసినవాడు. అట్లుగాకున్న మూఢుడనియు, శ్రోత్రియుడనియు అహిభక్షక న్యాయమును తెలియని వాడనియు వ్యవ హరింపబడును. (ఓయీ! ద్విపాదులలో శ్రేష్ఠమైన నారాయణుడే పురు షుడన దగునని శృతి శ్మృతులు గలవు. విశ్వముకన్న నధికుడైన రుద్రుడే పురుషుడనిన్ని ఇతను పురుషోత్తము డనిన్ని శృతులుగలవు॥ అథపురుషో హవై నారాయణో కామయత॥ పురుషో వై రుద్రః॥ అనునట్టి యిద్ద రిలోను భేదమేదియో నిరూపించు చున్నాడు। రుద్రుడు సంసార రోగ మును పోగొట్టువాడు, ఆధ్యాత్మికా ఽధిభౌతిక అధిదైవిక ములగు దుఃఖ ములను బోగొట్టువాడున్ను, సహస్ర శీర్షా పురుషః అనునట్టివాడే వృత్తమపురుషుడని శృతి చెప్పుచున్నది।మూఢుడనగాతత్వజ్ఞానము లేనివాడు గనుక మూఢుడు నీవు నేను అని చెప్పువాడు గనుక శ్రోత్రియుడు। అహి భక్షక న్యాయమనగా। పాములవాడు పాముయొక్క తలయు తోకయు వదిలి మధ్యను భక్షించు వట్లు బ్రహ్మ వేత్త నామ రూపములు రెంటిని వదలి మిగిలినదానిని బ్రహ్మముగా నిశ్చయించు చున్నాడు॥ ౧॥

శ్లో॥ అధశ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా ।
గుణప్రవృద్ధా విషయప్రవాళాః ।
అధశ్చ మూలాన్యను సంతతాని ।
కర్మాను బంధీని మనుష్యలోకే॥ ౨

—♦ భాష్యమ్ ♦—

ఏవ మిహ విరాడ్రూపేణ సంసార వృక్షం విశేషతో దర్శయతి । అధశ్చోర్ధ్వమితి । తత్రతావదేషు యే దుష్కృతిన స్తేఽధఃపశ్వాద్యారభ్యా ధోయోనిషు ప్రసృతా విస్తారంగతా స్తస్య శాఖాః యేతు రమణీయచరణాః సుకృతిన స్తే తూర్ధ్వం మనుష్యత్వ మారభ్య దేవాదియోనిషు ప్రసృతా విస్తారంగతా స్తస్య సంసార వృక్షస్య శాఖా ఇతి యావత్ తాశ్చపునః సత్వ రజ స్తమో భి ర్దేహేంద్రియ విషయాకారపరిణతై ర్జల సేచకై రివ ప్రవాళాః ప్రవృద్ధాః స్థూలీకృతా ఇతి యావత్। ఏవమిహ మనుష్యలోకే తథా న్యస్మిన్నపి లోకె ధర్మాధర్మ నిబంధీన్యస్య వృక్షస్య మూలానీవ మూలాన్య నుసంతానీ త్యాశయః॥ ౨॥

—♦ లఘుటిప్పణీ ♦—

జలసేచకై రితి। తత్ర జలసేచకైః పాదపై రివేత్యర్థః । నను కథ మస్యోర్ధ్వమూలత్వం మృషాత్వంచే చ్ఛృణు।ఊర్ధ్వమూలంయతో హ్యస్య పాదపత్వం వనస్పతేః। అసంభవోక్తిత శ్చాస్య మిథ్యాత్వంచా ప్యుదీరిత మిత్యాది శ్రుతి యుక్తిభ్యాం ద్రష్టవ్యం నిబంధీనితిఏతదప్యుక్తం

ఊర్ధ్వాధోమధ్య భేదేన గుణకర్మభిరుక్షితం న్యూనాధిక ప్రభేదేన విశ్వభే తన్నిదర్శిత మిత్యాద్య వధార్యమ్॥ ౨॥

—◆ ఆంధ్రి తాత్పర్యము ◆—

విరాడ్రూపముతో సంసారవృక్షమును విశేషముగా చూపించు చున్నాడు । యెవరు పాపాత్ములో వాళ్ళు అధోలోకములలో పశ్వాది నీచ యోనులయందు వ్యాపించిరి । యెవరు పుణ్యాత్ములో వారు ఊర్ధ్వ లోకములయందు మనుష్యులు మొదలు దేవాది యోనులయందు వ్యాపిం చిరి. ఇవే సంసారవృక్షమునకు శాఖలు పైకిన్ని క్రిందికిన్ని వ్యాపించిన వని నిశ్చయము । ఈశాఖలు సత్వ రజ స్తమో గుణములే దేహేంద్రియ ములుగాను విషయములే చిగుళ్లుగాను పరిణమించి పెద్ద వృక్షమైనవి ఆవి క్రిందను బైన గూడ వేళ్లు బారి యున్నవి। మనుష్యలోకము నందు ధర్మ అధర్మ రూపమైన కర్మలు చేసినందున ఊర్ధ్వ లోకమున దేవతా శరీర ప్రాప్తికిని అధోలోకమున పశ్వాది నీచ శరీర ప్రాప్తికిని అనుబం ధము గలవి। జలసేచకములనగా పాదపములని యర్థము । యీసంసార వృక్షము వ్రేళ్లు పైకిని కొమ్మలు క్రిందికిని గలిగి యున్నదనుట అబద్ధ మంటె వినుము । పాదపములనగా వ్రేళ్లతో నీరు త్రాగునవిగదా ఇదంత కంటె అబద్ధము, అసంభవము. ఇట్లు శృతి,యుక్తి, చూడనగును. అనుబంధ మనగా పైకి క్రిందికి మధ్య-దేవలోకము అధోలోకము మనుజలోకము యీ భేదముచేతను గుణములచేతను కర్మలచేతను పుట్టిన న్యూనాధిక్య భేదము గల విశ్వమంతయు చూపించ బడినది॥ ౨॥

శ్లో॥ నరూప మస్యేహ తథోపలభ్యతే
నాంతో నచాది ర్నచ సంప్రతిష్ఠా
అశ్వత్థమేనం సువిరూఢమూల
మసంగ శస్త్రేణదృఢేనఛిత్వా॥ 3

## —♦ భాష్యమ్ ♦—

నను య స్త్వయం సంసారవృక్షో వర్ణిత స్తస్య కిం వస్తుతః స్వరూప మితి, నేత్యాహ— నరూపమితి । తథాసతి, 'యత్రాతమ స్తన్నదివా నరాత్రి ర్నస న్నచాస చ్ఛివ ఏవ కేవల స్తదక్షరం తత్సవితుర్వరేణ్యం యతః ప్రవృత్తాః ప్రసృతా పురాతనీత్యాదా వంతేచ యన్నాస్తి మధ్యే తదపి తత్తథేతి న్యాయేనచా స్య విశ్వరూపం స్వప్న మరీచ్యుదకవ న్మిథ్యాత్వేన తన్నోపలభ్యతే । అతయేవ రజ్జుసర్పాదివ ద్వినా జ్ఞానం కేవల దండాది కర్మణా వినాశానర్హత్వా న్నాంతో నవా రజ్జుసర్పాదివ దేవాది ర్జన్మ నవా స్య జగతో తః ప్రతిష్ఠేత్యర్థః ఏవం సత్యశ్వత్థం నశ్వర మప్యేనం వృక్షం మాయయా సువిరూఢం దృఢమపి దేహేంద్రియేష్వ సంగశాస్త్రేణ సంగో హ్యయం పురుష ఇత్యేవం శివజ్ఞాన లక్షణేన దృఢేన జ్ఞానాసినా చ్ఛిత్వే త్యాశయః॥ 3॥

## —♦ లఘు టిప్పణీ ♦—

రజ్జుసర్పాదివదితి॥ తద్యథా, ఆత్మాంబురాశౌ నిఖిలోఽపి లోకో మగ్నోఽపి నాచామతి నేచ్ఛతేచ ఆశ్చర్య మేతన్మృగ తృష్ణికాభే భవాంబురాశౌ మృగతే మృషైవే త్యాదిస్మృత్యా మృగజలాదేరివ జన్మాభావాత్కుతస్థితి రిత్యవధేయం।3॥

## —♦ ఆంధ్ర తాత్పర్యము. ♦—

ఓయీ! యే సంసార వృక్షమును వర్ణించితివో దాని స్వరూపము నిజమేనా అంటె కాదని చెప్పుచున్నాడు. యత్రాతమ స్తన్నదివా యను శృతిని బట్టి సృష్టికిపూర్వమందు దివారాత్రి విభాగము సదసత్తులు లేక

శివుడొక్కడే సూర్యప్రభవలె ప్రకాశించుచు అక్షరుడై యుండెను. అతని వలన పూరాతనమైన ప్రకృతి వ్యాపించినదని చెప్పినందున ఆదియందు అంతమందును లేని జగత్తు మధ్యయందును లేదను న్యాయము చేతను ఈ విశ్వరూప సంసారవృక్షము స్వప్నమువలె యెండమావులయందు జలమువలె అసత్యమగుటచేతను ఊర్ధ్వమూలత్వాది పద్ధతిని ఆకారము కాన్పించదు. అంతము కాన్పించదు. ఏమనగా రజ్జు సర్పాదికము వలె జ్ఞానము లేక దండాదికముచే వినాశమునకు అర్హత లేకుండుటచే అంతమున్నూ లేదు. రజ్జు సర్పమువలె ఆదియు కాన్పించదు. గనుక జగత్తులేదు గనుకనే అశ్వద్ధమనిరి. అనగా శాశ్వతము గాదని యర్ధము. ఇట్టి చక్కగ వేళ్ళు బారి దృఢమైన రావిచెట్టును దేహేంద్రియాదుల యందు అహంకార మమకారా సంగ రూపమైన ఈ పురుషుడు అసంగుడను శృతిని బట్టి శివజ్ఞాన లక్షణమై దృఢమైన జ్ఞానఖడ్గముచె నరికి అనగా వేరుచేసి (ఆత్మ సముద్రమందు లోకమింతియు మునుగుచున్నప్పటికి కొంచెమైనను త్రాగదు. ఆచమనమైనను జేయదు. యెండమావులు జలముతో సమానమైన సంసార సముద్రమందు వ్యర్ధముగా లేనిదానిని వెతుకుచున్నది. హాశ్చర్యము! ఇది రజ్జు సర్పన్యాయము) ఈ శృతి ప్రకారము జన్మము మొదలగునవి యెండ మావుల జలము వలె లేనివి యని తెలుసుకొనుము॥ ౩॥

శ్లో॥ తతః పదం తత్పరి మార్గితవ్యం।
యస్మిన్ గతా ననివ ర్తంతి భూయః।
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే।
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ॥　　　　౪

—♦ భాష్యమ్ ♦—

నను. సర్వసంగాన్ పరిత్యజ్య జ్ఞాత్వా మాయామయం జగదిత్యాది స్మృత్యా హ్యసంగశస్త్రేణ ఛిత్వా కిం కుర్యా

దిత్యాహ తతఇతి । తథాచ స్కాందేపి ప్రద్యుమ్నం ప్రతి విష్ణునోక్తం తద్యథా, అపరంచ పదం రాజన్ పరమంచ పదం మమ । భస్మజ్యోతి ర్దిదృక్షూణాం శివంతం పరమం పదమిత్యుక్తోపి యస్మిన్ పరస్మిన్నిష్కళే పదే గతా భూయః పునర్న నివర్తంతి తచ్ఛివ మద్వైతం తురీయం పదం శమదమాదినా యోగరూఢః సన్మార్గితవ్య మిత్యర్థః। నన్వమునీ భగవద్రూపే మయా తే అనువర్ణితే । ఉభే అపి నగృహ్ణంతి మాయాసృష్టే విపశ్చిత ఇతి పాద్మోక్త్యా మనుష్యస్య దేవస్యవా తవ కథం పరబ్రహ్మ రూపత్వ మిత్యాశంక్యాహ । తమేవేతి॥ ఏవం సతి స సర్వధీవృత్యనుభూత సర్వ ఆత్మా యథా స్వప్నజనేక్షితైకః తం సత్య మానందనిధిం భజేత నాన్యత్ర సజ్జేద్యత ఆత్మపాతః ఇత్యాది ప్రమాణసిద్ధ మాత్మశబ్దాభిధేయం శివ మద్వైతం పురుష మహామపి హేఅర్జున । ప్రపద్యే యతశ్చ పురుషాద్యత్రాతమ స్తన్నదివా నరాత్రి రిత్యాది శ్రుత్యుక్త రీత్యా సర్వాపి జగతాం పురాణీ పురాతనీ ప్రసృతా విస్తృతాప్రవృత్తి రిత్యర్థః॥ ४॥

## —♦ లఘు టిప్పణీ ♦—

భస్మజ్యోతిరితి । తథాచశ్రుతిః । ఓమగ్నిరితి భస్మ జలమితి భస్మ స్థలమితి భస్మసర్వగ్ం హవా ఇదం భస్మ సర్వేంద్రియాణి చక్షూంషి భస్మాని తస్మాద్ వ్రత మేతచ్ఛాంభవం పశుపాశ విమోక్షణాయే త్యాది శ్రుత్యా భస్మశబ్దేన విజ్ఞానాఖ్య జ్యోతీ రూపస్యైవా వగమాదితి ద్రష్టవ్యమ్॥ ఆత్మశబ్దాభిధేయమి ॥ తదుక్తం భాగవతే ధారయిష్య తితే

వేగం రుద్రస్త్వాత్మా శరీరిణాం యస్మిన్నోతమిదం ప్రోతం తం సూత్రం శాటీవ తంతుష్వి త్యాదినా వధార్యమ్॥ ౪॥

## —◆ ఆంధ్ర తాత్పర్యము ◆—

ఓయీ! జగత్తును మాయాస్వరూపమునుగా తెలిసి దేహేంద్రియాది సంగమును వదలి। యనునట్టి అసంగశాస్త్రముచె సంసార వృక్షమును ఛేదించి యేమిచెయ్యవలయు నంటె చెప్పుచున్నాడు. స్కాందమునందు విష్ణువు ఇంద్రద్యుమ్న మహారాజును గూర్చి చెప్పిన వాక్యమెట్లనగా ఓరాజా! నావు పరమపదము అపరపదము అనిరెండు పదములు గలవు. భస్మజోతిని జూచువారలకు 'భస్మాంతతాసస్మృతేః' అను స్మృతినిబట్టి సంసారముబూడిదఅనే విజ్ఞాన దృష్టిగల జ్ఞానులకు శివుడే యాపరమ పదమని నుడివెను. యేనిష్కళ పరమపదమును బొందిన వారు తిరిగి యీలోకములలో పుట్టరో అదే అద్వైతము తురీయము అయిన శివపదము. అట్టి శివపదమును శమ దమాది సంపత్తో యోగాభ్యాసమందు అరూఢుడై వెతుకు కొనవలయును నాచేతను. ఈమానవ రూపము దేవరూపమున్నూ వర్ణింపబడినవి. విద్వాంసులు దేవమానవ రూపముల రెంటిని మాయచేసృజించ బడినవని గ్రహించరని పద్మపురాణ వచనముచే మనుష్యుడవయినా దేవుడవయినా నీకు పరబ్రహ్మ రూపమెట్లంటె చెప్పుచున్నాడు. జాగర స్వప్న సుషుప్తి వృత్తుల ననుభవించిన ఆత్మ యేలాగు నొక్కడో అట్టి సత్యరూపుడు ఆనందరూపుడైన ఆత్మ తానుగా తెలియవలెను. అట్లు తెలియక దేహేంద్రియములనుగా తెలిసిన ఆత్మ హత్యాపాతకము వచ్చునన్న ప్రమాణముల చేతను ఆత్మశబ్దవాచ్యుడయినట్టిన్ని శివుడు అద్వైతము అనునట్టి పురుషుని నేనున్నూ పొందుచున్నాను. ఓ అర్జునా! జగత్సృష్టికి పూర్వమందు యే పురుషు డుండెనో యనుశృతిచే జగత్తుల యొక్క ప్రవృత్తి పూర్వపు రీతిగా పురాతన ప్రకృతినుంచి యెవని వలన గలిగెనో అట్టి పురుషుని నేనున్నూ పొందుచు-

న్నాను (భస్మజ్యోతియనగా అగ్ని మొదలయినవిన్ని సర్వమున్నూ భస్మ మేసర్వేంద్రియములు నేత్రములున్నూ భస్మములే గనుక ఇది పశువుల యొక్క పాశముక్తి కొరకు శాంభవ వ్రతమని శృతియందు చెప్పటచే భస్మయనగా విజ్ఞాన రూపమైన జ్యోతియని తెలియవలెను. ఆత్మయనగా తంతువుల యందు వస్త్రమున్నట్లు రుద్రుని యందు స్థావర జంగమములు పడుగు పేక వలె నున్నవో అట్టి రుద్రుడే శరీరధారులకుఆత్మగానున్నాడు. అతనే ఏ వేగము నణచ గలడని స్కాందమున గంగావతరణ మందు గలదు గనుక ఆత్మ యనగా రుద్రుడని తెలియవలెను॥౪॥

శ్లో॥ నిర్మానమోహాః జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః
ద్వంద్వై ర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞైః
గచ్ఛన్త్యమూఢాః పద మవ్యయంతత్॥ ౫

—◆ భాష్యమ్ ◆—

నన్వన్యేపి కథం తహీర్ణ తద్వ్యావృత్తయ స్తత్పదం ప్రాప్స్యంతీ త్యాహ । నిర్మానేతి। తత్ర తావన్మానో హంకార స్సంశయ విపర్యయాభ్యాం మోహశ్చా ఒవివేక స్తాభ్యాం నిష్క్రాంతా స్తథా వివేక వైరాగ్యద్వారా జిత సంగదోషా ఏవ మధ్యాత్మని వేదాంతవేద్యే పరమశివే నిత్యాలోచన తత్పరాః అతఏవ వినివృత్తాః కామా విషయా యేషాం త ఇత్యర్థః । తత్రైవం సతి అతఏవ శీతోష్ణ క్షుత్పిపాసాదిభి స్సుఖ దుఃఖసంజ్ఞై ర్ద్వంద్వై ర్విముక్త త్వేనామూఢా స్సంత స్తద వ్యయం పదం గచ్ఛంతీ త్యర్థః॥౫॥

—◆ లఘుటిప్పణీ ◆—

జితసంగదోషాఇతి॥ తద్యథా, 'ఔదాసీన్యామృతేనాపి వర్ధమానే దినేదినే । ఉన్మూలితే మనోమూలే జగద్వృక్షః పతిష్యతీ' త్యాది స్మృత్యంతరా దితి భావః॥ ౫॥

—◆ ఆంధ్రితాత్పర్యము ◆—

ఓయీ! అయితె ఇతరులున్నూ పరమశివుని యందు వృత్తిగలవారలు ఆశివపదమును యెట్లు బొందెదరంటె చెప్పుచున్నాడు । సంశయ విపర్యయములు గల అహంకారమును అవివేకరూప మోహమును విడచినవారును వివేక వైరాగ్య ద్వారా పుత్రాది సంగదోషముల నిగ్రహించినవారును వేదాంత వేద్యుడయిన పరమ శివుని నిత్యము ఆలోచించుట యందు తత్పరులును గనుకనే విషయముల వర్జించిన వారును గనుకనే సుఖ దుఃఖములు శీతోష్ణములు క్షుత్పిపాసలు అనునట్టి ద్వంద్వ వర్జితులైన అవిద్యా రహితులైన జ్ఞానులు నాశరహితమైన యీ శివపదమును గూర్చి చెందెదరు (సంగదోషములు లేకుండుట యెట్లనగా ప్రతిదినము ఉదాసీనత్వమను జలముచె వృద్ధినొందు చున్న మనస్సనే వేరును పెరికివేసినయెడల జగత్తను వృక్షము పడిపోవునని స్మృతులు గలవు॥ ౫॥

శ్లో॥ నతద్భాసయతే సూర్యో నశశాంకో న పావకః ।
యద్గత్వా ననివర్తంతే తద్ధామ పరమంమమ॥ ౬

—◆ భాష్యమ్ ◆—

ఏతదేవం శ్రుతి స్మృతి పురాణేషు సర్వత్ర విష్ణోః పరం పదత్వేనా భిధీయత ఇత్యాహ । నతదితి । తథాచేహ శ్రుతిః 'నతత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో

భాంతి కుతో౽యమగ్ని స్తమేవ భాంత మనుభాతి సర్వ
మిత్యాది వేద్యం మమవిష్ణోః పరంపద రూపం భూమాఖ్యం
నిరతిశయం ధామే త్యవధార్యమ్॥ ౬॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

భూమాఖ్యమితి॥ తద్యథా, 'భూమానం యం సదానందం శివ
మేక మనామయం। విద్ధిత్వం శ్రుతిభి ర్గమ్యం దర్శయిష్యే పరంపద'
మిత్యర్జునాయ కృష్ణేనైవ భాగవతే దర్శిత మిత్యవధేయమ్॥ ౬॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

దీనిని శ్రుతి స్మృతి పురాణముల యందు విష్ణుయొక్క పరంపద
మని చెప్పబడు చున్నదని చెప్పుచున్నాడు॥ యేస్థలమును సూర్యుడు
ప్రకాశింపజేయజాలడో చంద్రుడు నక్షత్రములు మెరుపులు అగ్నియు
ప్రకాశింప జేయజాలవో యేపదమును బొంది పునరావృత్తి రహితులై
యుందురో విష్ణువైన నాయొక్క పరంపద రూపమైన భూమయను
(శివుడు) నిరతిశయ మైన స్థానము (భూమయనగా, ఓయర్జునా శ్రు
తులచె పొందదగినట్టిన్నీ భూమయను నట్టిన్నీ సర్వదా ఆనందము గల
దుఃఖ రహితమైన యేశివుడు గలడో అదే నాపరమ పదము చూపించు
చున్నాను చూడుమని కృష్ణునిచె అర్జునుని కొరకు చూపించబడెనని భాగ
వతమందు గలదు శ్లో॥ భూమా భవానితి గురూపనిష ద్వచోభిః కర్త్రా
త్మతా గళతి సిద్ధ్యతి భూమభావః। రాజాత్మజస్య నిజ తత్వ నిబోధనేన
వ్యాధాత్మతా విగళనాదివ రాజభావః॥

శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః ॥
మన షష్ఠానీం ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి॥ ౭

—♦ భా ష్య మ్ ♦—

సర్వమునీ భగవద్రూపే ఇత్యనేన మమ స్వల్ప బృహ ద్రూపయోరపి వస్తుతో హేయత్వ ముక్తం తత్రావాంతరా భాస భేదేనా ప్యాహ । మమైవేతి॥ తథా చైకఏవ హిభూ తాత్మేతి శ్రుత్యా ద్వాసుపర్ణేతి శ్రుత్యాచ జీవేశ్వర మాయాతోఽతిరి క్తమేవ తత్పరంపద మిత్యవధార్యమ్ । మమ విష్ణో ర్వ్యష్టిభావేనాం శో జీవలోకే జీవభూతో బహుకాలత్వా త్సనాతన ఇత్యర్థః । తథా వేదా నధ్యాపయామాస మహాః భారత పంచమా నిత్యాది వదనింద్రియేణాపి మనసా షట్త్వ సంఖ్యా పూరణా న్మనసా సహితాని షష్ఠాని శ్రోతాదీంద్రి యాణి ప్రకృతి రజ్ఞానం తత్ర స్థాని సజీవః కూర్మోంగానీవ ప్రవేశ నిస్సరణాభ్యాం విషయే ష్వేకాదశ రుద్రై రధిదై వతైః కృత్వా కర్షతీ త్యర్థః । తద్యథా, నిశ్చలాభిః కథం కింస్యా త్ప్రజాభి శ్చేతి చింతయన్ బ్రహ్మరంధ్రా త్తతః శంభుః ప్రాదుర్భూతా న్బ్రవీ ద్వచః మచ్ఛాయైకాదశా రుద్రా స్తవ సృష్ట్యుపకారకాః । మన షష్ఠేంద్రియాణాం వై చైతన్యం తద్గ మిష్యతీ త్యవధార్యమ్॥ ౭॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

వ్యష్టిభావేనాంశఇతి॥ తతరితావదేకఏ వహి త్యాది శ్రుతిభ్యాం వ్యష్టి సమష్టిభావేనా జీవేశ్వరయో నిర్ణీతే త్రివహ సమష్టి రూపస్య విష్ణో ర్వ్యష్టిభావేనాంశో జీవఇత్యర్థః । తయో రతిరిక్త శ్చిదంబరాత్మా ప్రతిబిం బక స్త్వన్యో విశ్వాధిక ఇత్యవధేయమ్॥ ౭॥

## —♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

ఓయీ! దేవ మనుష్య రూపములు రెండని చెప్పుటచే నాయొక్క స్వల్పరూపము గొప్పరూపమున్నూ నింద్యమైయున్నది. అందులో ఆవాంతరమైన ఆభాస (జీవ) భేదముతోనున్నూ చెప్పుచున్నాను. భూతాత్మ ఒక్కడే యను శ్రుతిచేతనున్నూ జీవేశ్వరు లిద్దరను శ్రుతిచేతనున్నూ జీవుడు, ఈశ్వరుడు, మాయ యీమూడింటికంటె అతిరిక్తమైనదే ఆ పరంపదమని తెలియవలెను. విష్ణువైన నాయొక్క వ్యష్టిభావము చేత నొక యంశము జీవలోకమందు జీవుడై బహుకాలమున్నాడు గనుక సనాతనుడు నాలుగువేదములు మహాభారతమున్నూ గలసి అయిదువేదములను చదివించెననినట్లు మనస్సుతోగూడ శ్రోత్రాదీంద్రియములు ఆరు. ప్రకృతి (అజ్ఞానము) యందున్న యీ ఆరింటిని ఆజీవుడు కూర్మము, తన యవయవములను లోపలను వెలుపలను చేసినట్లు విషయములయందు ప్రవేశించుట విడుచుటచేత ఏకాదశ రుద్రులను జ్ఞాన కర్మేంద్రియ మనస్సులకధిదేవతలుగా చేసి తిరుగ సంసారములోనికి లాగుచుండును బ్రహ్మరంధ్రమునుంచి శంకరుడావిర్భవించి చలనములేని యీప్రజలవలన యేమగునని ఆలోచించి యిట్లుపలికెను. నాయొక్క ఛాయయె ఏకాదశరుద్రులై నీ యొక్క సృష్టికి ఉపకారమగుదురు. మనసుతో గూడ నారు ఇంద్రియములకు చైతన్యమున్నూ అదేకాగలదని యున్నది. ఏకఏవహి భూతాత్మా ద్వాసుపర్ణేతి శ్రుతులచే వ్యష్టి సమష్టిభావములచే జీవేశ్వరులు నిర్ణయించబడిరి. ఇక్కడ సమష్టిరూపుడైన విష్ణుకు వ్యష్టిభావముచే నంశము జీవుడు వీరిద్దరికి ప్రతిబింబుడు చిదంబర స్వరూపము చిచ్ఛక్తి. విశ్వాధికుడైన పరమాత్మ యీముగ్గురుకంటె (జీవ-యీశ్వర-మాయా) వేరై విశ్వాధికుడై యుండెను॥ ౭॥

శ్లో॥ శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః ।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్॥

—♦ భా ష్య మ్ ♦—

ననుచ కదోత్క్రమతీ త్యాహ । శరీరమితి తత్రైతు యదా జీవో యచ్ఛరీరం జన్మకాలేఽవాప్నోతి యచ్చాప్యు త్క్రామతి బహిర్గచ్ఛతి తదేశ్వరో దేహేంద్రియ సంఘాత స్వామీ జీవో యతో దేహా దుత్క్రామతి తతో మనః షష్ఠా నీంద్రియాణి కర్షతీతి పూర్వేణాన్వయః । ఏవం పున రేతాని మనఃషష్ఠానీం ద్రియాణి గృహీత్వా వాయు ర్గంధా నివాశ యాత్సంయాతి జన్మే త్యర్థః॥ ౮॥

—♦ ఆ స్థి తా త్ప ర్య ము ♦—

ఎప్పుడు పైకిలాగునంటె చెప్పుచున్నాడు । యెప్పుడు కర్మవశము చేత నేశరీరమును జన్మకాలమందు బొందునో దేహమునుండి యెప్పుడు ఉత్క్రాంతిని జెందునో అప్పుడు దేహేంద్రియ సమూహమునకు ఈశ్వ రుడె (స్వామి) యైనజీవుడు, పుష్పమునుండి వాయువు సువాసనను గొని పోవునట్లు మనసుతో గూడ ఆరుఇంద్రియములను ఆజన్మలోనికి దీసుకొని పోవును॥ ౮॥

శ్లో॥ శ్రోత్రం చక్షుః స్పర్శనంచ రసనం ఘ్రాణ మేవచ ।
అధిష్ఠాయ మనశ్చాయం విషయా నుపసేవతే॥　　౯

—♦ భా ష్య మ్ ♦—

తత్ర తాన్యేవ ప్రత్యేకశో దర్శయన్నాహ । శ్రోత్రమితి॥ తత్రైవం సతి శ్రోత్ర మిత్యాదీని చాత్కర్మేంద్రియాణి మనః ప్రాణాంచా ధిష్ఠాయ విషయాన్ శబ్దాదీన్ జీవ ఉపసేవత ఇత్యర్థః॥ ౯॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

ఉపసేవతఇతి॥ ననుక యాసామ గ్రోప్యసేవతఇతి చేచ్ఛృణు। 'ఇంద్రియాణి హాయాన్యత్ర శరీరే ప్రగ్రహో మనః। బుద్ధింతు సారథిం విద్ధి విషయాస్తేషు గోచరా ఇత్యాదిరీత్యో పసేవతఇత్యాశయః॥౯॥

—♦ ఆం ధ్రి తా త్ప ర్య ము ♦—

వాటినె ప్రత్యేకముగా చూపించుచు చెప్పుచున్నాడు. శ్రోత్రము-చక్షు - స్పర్శ - జిహ్వ - ఘ్రాణము - వాక్కు - పాణి - పాదము - గుహ్యము - గుదము - మనస్సు - ప్రాణము - వీటిని అధిష్ఠించి శబ్ద స్పర్శ రూప రస గంధములను జీవుడు సేవించుచున్నాడు (యేసామ గ్రితో సేవించు చున్నాడనగా విను। ఇంద్రియములే గుర్రములు, శరీరమే రథము, మనసేపగ్గము బుద్ధియె సారథి, విషయములే సంచార మార్గములు - యీరీతచే సేవించు చున్నాడని యభిప్రాయము॥ ౯॥

శ్లో॥ ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితం
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞాన చక్షుషః॥ ౧౦

—♦ భా ష్య మ్ ♦—

నన్వేవం కస్మా ద్గంతా కుతః కోయం నైవ జానాతి ప్రాణభృ దిత్యాది స్మృత్యా ప్రత్యక్షతోపి జీవస్యా ల్పజ్ఞత్వే స్థితే క స్తర్హి సర్వం జానాతీ త్యపాహ। ఉత్క్రామంత మితి॥ తత్ర తావదుత్క్రామంతం పూర్వస్మా ద్దేహాంతరం గచ్ఛన్తం స్థితం వేత్యాది స్వస్యైవా వాంతరం వృత్తం విమూఢా నానుపశ్యంతి యే తజ్ఞాన చక్షుషో వివేకిన స్తేతు పశ్యంతీ త్యర్థః॥౧౦॥

## —♦ లఘుటిప్పణీ ♦—

పశ్యంతీతి॥ తత్ర తావ చ్ఛివస్థానే శరీరే ఽ స్మిన్ సంస్థిత స్త్వాత్మమాయయా దుఃఖాది సాగరే ఘోరే మహ్యమానంచ శోచతీ త్యేవంరూపేణా వివేకినో దుర్ఘటత్వే స్థితే వివేకిన స్త్వధిష్ఠానం సమ స్తస్య జగతస్సత్యచిద్ఘనం సో హ మస్మీతి నిశ్చిత్య వీతశోకో భవత్యయ మిత్యాది రీత్యా పశ్యంతీ త్యాశయః॥ ౧౦॥

## —♦ ఆంధ్రతాత్పర్యము ♦—

ఓయీ! జీవుడు ఎక్కడనుంచి వచ్చినాడో యెక్కడకు వెళ్ళునో తానెవరో తెలియలేడన్నస్మృతిని బట్టి జీవుడు అల్పజ్ఞుడు గాన సర్వ మును యెవడు తెలియు చున్నాడంటె చెప్పుచున్నాడు। పూర్వపు దేహమునుండి మరియొక దేహమునుగూర్చి వెళ్ళునప్పుడు గాని ఆశరీర మందె యుండునప్పుడు గాని విషయా నుభవమున గాని ఇంద్రియములు మొదలగు వానితో జేరిన జీవుని అజ్ఞానులు దిలకింపలేరు। జ్ఞానదృష్టి గల వివేకులు చూచుచున్నారు। శివస్థానమైన యీశరీరమందున్న జీవుడు తనయవిద్యచే ఘోరమైన దుఃఖసాగరమందు మునిగి మోహముచే నేడ్చు చున్నాడను స్మృతిని బట్టి అవివేకికి తెలియుట దుర్ఘటము। వివేకులైతే సమస్త జగత్తునకు అధిష్ఠానమై సత్యము - చిత్తు - ఘనము నైనవాడెవడో వాడే నేనని సోహంభావనతో దుఃఖరహితు డగుచున్నాడను రీతిగా చూచుచున్నారు॥ ౧౦॥

## —♦ అంతరార్థము ♦—

జీవుడు అవిద్యోపాధిగలవాడు గాన తాను యేపరమాత్మనుండి జన్మములకు వచ్చినాడో, తిరిగి యేబ్రహ్మమును గూర్చి వెళ్ళునో, తాను దేహమో బ్రహ్మమో తెలియకున్నాడు - ఆత్మానాత్మ వివేకులు తెలియు చున్నారు.

శ్లో॥ యతంతో యోగిన శ్చైనం పశ్యంత్యా త్మన్య వస్థితమ్
యతంతో ప్యకృతాత్మానో నైనం పశ్యంత్య చేతసః॥ ౧౧

—♦ భా ష్య మ్ ♦—

అథైవం తర్హి పశ్యంతి జ్ఞానచక్షుష ఇత్యేతదపి వివృణోతి॥ యతంతఇతి॥ తత్రతావ ద్ధ్యానాదిభి ర్యతంతో యోగిన శ్చైన మాత్మానం పరమశివ మాత్మన్యంతఃకరణె ఉవస్థితం స్వతఏవ పశ్యంతి యేతు యజ్ఞాదిభి రశోధితాంతఃకరణా స్తేతు యతమానా అప్యకృతాత్మన స్త్వచేతసో నైనం పశ్యంతీత్యర్థః॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

జ్ఞాన దృష్టి గలవారలు చూడగలర నే దానిని వివరణ చేయు చున్నాడు. యోగులు కొంతమంది ధ్యానము మున్నగు వానిచే యత్నము చేయు చున్న వారై ఆత్మయైన పరమశివుని అంతఃకరణ యందు వేరుగ నున్నట్లు కాంతురు. యజ్ఞాది కర్మలచె నంతఃకరణ శుద్ధి చేయబడని మలినాత్ములగు మూఢులు యత్నము జేసియు గాంచ నేరరు॥౧౧॥

శ్లో॥ యదాదిత్య గతం తేజో జగద్భాసయతే ఒఖిలమ్
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్॥౧౨

—♦ భా ష్య మ్ ♦—

ఏవమేవ చిదంబరా భాస రూపం చైతన్యం సమష్టి భావేన మమైవేశ్వరస్య వ్యష్టిభావేనాపీ త్యాహ । యదితి । తథాచ, 'యదాదిత్యగతం తేజో ఒఖిలం జగద్భాసయతే యచ్చంద్రమసి యచ్చాగ్నౌ త త్త చ్ఛ్రీమదూర్జితం ప్రధాన

మపి మామకమేవ విద్ధీత్యర్థః నతత్ర సూర్యోభాతి నచంద్ర తారకం నేమా విద్యుతో భాంతికుతో యమగిరితిశ్రుతే రిత్యాశయః॥౧౨॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

మామకమేవేతి॥ తద్యథా, 'సమష్టిరూపః పురుషోంతరాత్మా ఉచ్చావచై ర్భాతి గుణప్రభేదైః తస్యైవవాంశో వివిధో హి జీవ స్త్రయో ర్విభిన్న స్తు పరః పరస్తాది'తి రీత్యావధార్యమ్॥౧౨॥

—◆ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ◆—

ఈప్రకారమె చిదంబరాభాస రూపమైన చైతన్యమును సమష్టి భావముతో ఈశ్వరుడైన నాయొక్క వ్యష్టిభావమునున్నూ చెప్పుచున్నాడు. సూర్యుని యందున్నదై భువనమంతను నేతేజస్సు ప్రకాశింప జేయుచుండునో చంద్రునియం దేతేజస్సుండునో అగ్నియం దేతేజస్సుండునో ఆ సంపాదితమైన ప్రధానమైన తేజస్సంతయు నాసంబంధమైన దానినిగా నెరుంగుము. సమష్టిరూపుడై యంతరాత్మయైన పురుషుడు గుణభేదములచె హెచ్చుతగ్గులుగా ప్రకాశించువాడు. జీవులందరు ఆతనియొక్క అంశయె. ఇట్టి జీవేశ్వరులకంటె పరమాత్మవేరని తెలియవలెను॥౧౨॥

శ్లో॥ గామావిశ్యచ భూతాని ధారయామ్య హమోజసా ।
పుష్ణామి చౌషధీ స్సర్వాస్సోమో భూత్వా రసాత్మకః॥

—◆ భా ష్య మ్ ◆—

ఏవమపరమప్యాహ॥ గామావిశ్యేతి॥ తత్రైవం సతి । గాం పృథివీం యథోక్త చిదాభాస రూపేణౌ జసా విశ్య భూతాని ధారయామీ త్యర్థః । ఏవ మౌషధీః సర్వాఅపి రసాత్మకః సోమో భూత్వా విశ్య పుష్ణామీత్యర్థః॥ ౧౩॥

## —♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఈప్రకారము మరియొక దానినిన్ని చెప్పుచున్నాడు. నేను భూమి యందుండి చిదాభాస రూపముచే బలమువలన భూతములను ప్రవేశించి ధరించుచున్నాను. రస స్వరూపుడగు చంద్రుడనై సర్వ ఓషధులం ప్రవేశించి పెంచుచుంటిని॥ ౧౩॥

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః।
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్॥౧౪

## —♦ భా ష్య మ్ ♦—

అథారపరమప్యాహ॥—అహ మితి॥ ఏవ మీశ్వరఏవ వ్యష్టిభావేన వైశ్వానరో భూత్వా దేహ మాశ్రితఃసన్ ప్రాణాపాన సమాయుక్త శ్చచతుర్విధ మన్నం పచామీత్యర్థః ' అతఏవ గాయత్ర్యారాధనే బ్రహ్మరంధ్రే శివం ధ్యాయేద్బ్రహ్మాణం తుహృది స్థితం । నాభౌ విష్ణుం సమారాధ్య ప్రజపేత్పరదేవతా మిత్యప్యుక్తం సంగచ్ఛతే॥౧౪॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

బ్రహ్మరంధ్రఇతి॥నన్విహ ధ్యానక్రమే బ్రహ్మణస్తు విష్ణోర్లఘుత్వం కథమితిచేచ్ఛృణు । తద్యథా, 'దశావతారిణో మూర్తీ బ్రహ్మణశ్చ పృథక్కృతా । యదిచ్ఛయా లఘుర్బ్రహ్మ విష్ణోర్యాతః పురాఃఖల్విత్యవధారితేపరిచ్ఛేత్తుం యాతా వనల మనిలస్కంద వపుషేత్యాదితో పృథక్కార్యమ్॥ ౧౪॥

## —♦ ఆ స్థ్రి తా త్ప ర్య ము ♦—

మరియొక ప్రికారమునున్నూ చెప్పుచున్నాడు. ఈ ప్రికారము ఈశ్వరుడగు నేనే వ్యష్టిభావముచె జఠరాగ్ని రూపమున ప్రాణులు శరీరము నాశ్రియించి ప్రాణాపానములతో గలసి ప్రాణులనుభవించు భక్ష్య భోజ్య లేహ్య చోష్యములను నట్టి చతుర్విధాన్నములను పచనము జేయుచుంటిని. గనుక నే గాయత్రి ఆరాధనయందు బ్రహ్మ రంధ్రిమందు శివుని ధ్యానించవలెను. హృదయమందు బ్రహ్మను ధ్యానించవలెను. నాభియందు విష్ణునిధ్యానించి పరదేవతయైన గాయత్రినిజపించ వలయునని తెలియుచున్నది. ధ్యానక్రమమందు విష్ణువుకంటె బహ్మకు లఘుత్వమెయెందుకువచ్చినదంటె వినుము. విష్ణువునకుసైన షట్చ్రక్రములలోను అనాహతమందు బ్రిహ్మను మణిపూర్వకమందు విష్ణును జెప్పినందున బ్రహ్మకుక్రిందగానుండుట - బరువైన పదార్థము త్రాసులో క్రిందనుండును, లఘువైనది పైకి పోవును. బ్రిహ్మ, విష్ణుసమావేశమై కలహించు చుండగా శివుడు లింగరూపుడై యావిర్భవించి యిద్దరిని వేరుచేసెను। గౌరవమును కోలి బ్రిహ్మ తేలిపోయి పైకివెళ్ళెననియు విష్ణువు క్రిందకు వెళ్ళెననియు పురాణముగలదు॥ ౧౪॥

శ్లో॥ సర్వస్య చాహం హృది సంనివిష్టో ।
మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనంచ।
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో ।
వేదాంతకృ ద్వేదవిదేవ చాహమ్॥ ౧౫

## —♦ భా ష్య మ్ ♦—

ఏవ మపరమపి తతో విశేషమాహ । సర్వస్యేతి॥ ఏవం శక్తిః సర్వస్య ప్రాణిజాతస్య చాహం హృది సంనివిష్టో యతో

మత్త ఏవ ప్రాణినాం శబ్దాది విషయాంకా స్మృతి స్తజ్జ్ఞాన మపోహనంచ భవతీ త్యర్థః । ఏవం శివధ్యానార్చన జ్ఞానాదహ మపి శివరూప ఏవేత్యాహ । వేదైరితి॥ తథాచా హాంగిరోపాస నయా తత్వమస్యాది మహావాక్యై రహమేవ వేద్య ఇత్యాది రర్థః॥ ౧౫॥

## —♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

అంతకంటెను మరియొక విశేషమును చెప్పుచున్నాడు। సకల ప్రాణుల యొక్క హృదయమందు అంతర్యామినై నేనే ఉంటు న్నాను (నేననగా సదాశివుడని యర్థము) పరమేశ్వరుడే జ్యోతిర్మయ లింగరూపముతో ఉపాసకుల యొక్క హృదయ మధ్యమందున్నా డని బ్రహ్మసూత్ర భాష్యమున శ్రీకంఠ భగవత్పూజ్యపాదులు ప్రమితా ధికరణములో వ్రాసిరి॥ శ్లో॥ బ్రహ్మాండ దేవాలయ మధ్యసంస్థం పిం డాండ గర్భాలయ చిత్తపీఠే, విభాసమానం విలితం స్వకీయ చైతన్య లింగం శివమాశ్రయామః॥ ఇట్లు శివావతార దూర్వాసులు నిర్గుణ ధ్యానము చేయుచు ప్రపంచమునను, ఆలయము, లింగము, పూజ, యీ రూపముగా ముక్తికి మార్గమును జూపెట్టెను. బాహ్యపూజ చేయక మానస పూజ అలువడదు. మానస పూజ చేయక, భావనరాదు. భావన లేక భవబంధము (వీడదు) నావలననే ప్రాణులకు శబ్దాది విషయాకార మైన స్మృతి, జ్ఞానము, అనుమానమున్నూ (ఆరెంటియొక్క నాశమున్నూ) నావల్లనే గలుగుచున్నది. శివధ్యానము చేయుట వలనను శివార్చన జేసినందునను శివజ్ఞానమువల్లనేనున్నూ శివుడనే యని చెప్పుచున్నాడు. అహాంగిరోపాసనచే, తత్వమస్యాది మహావాక్యములచేతను సకల వేద ములచేతను యెరుగ దగిన వాడను నేనే। వేదాంత జ్ఞానమును గలిగించు వాడను నేనే॥. ఈశ్వరానుగ్రహాదేవ పుంసా మద్వైతవాసనా॥ వేదార్థ

వేదినన్ను నేనే యగుచుంటిని। ఈశాన స్సర్వవిద్యానాం అష్టాదశానాం విద్యానా మేతాసాం భిన్నవర్త్మనాం। ఆదికర్తా కవి స్సాక్షా చ్ఛూల పాణి రితి శృతిః ఇత్యాదిశృతులనుబట్టి సర్వవిద్యలు తెలిసినవాడు శంకరుడే॥ ౧౫॥

శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చా క్షర ఏవచ ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థో క్షర ఉచ్యతే॥　౧౬

—♦ భా ష్య మ్ ♦—

ఏవం ప్రోక్త మేవ జీవేశ్వరయోః స్వరూప మవధార యతి॥ద్వావిమావితి॥తత్ర తావదిహ లోకేసముష్టి వ్యష్టి రూపేణ జీవేశ్వర రూపౌ పురుషౌ వేకఏవహి భూతాత్మేతి ద్వాసు పర్ణా ఇతి శ్రుతిద్వయ వేద్యౌభవత స్తత్ర తావత్సము స్త కార్య జాతాని సర్వాణి భూతాని క్షరః ప్రత్యేకం నశ్వరాణీ త్యర్థః । ఏవం కూటే సర్వస్మిన్ సంఘాతే అవస్థితత్వా త్కూటస్థ ఈశ్వర ఇత్యర్థః॥ ౧౬।

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

భూతాని క్షరఇతి॥ నను సంభవతి సామానాధికరణ్యే వైయధి కరణ్య మన్యాయ్య మితి న్యాయా ద్విప్రతిషిద్ధ మేతదితిచే చ్ఛృణు । తద్యథా, 'ఆరోపితత్వేన రుషః ప్రమోహై ర్విరోధ లేశోపి నరాధి కాయామ్ । వేదాః ప్రమాణం పశవో ధనంచే త్యస్మిన్ బహుత్వేన నచై కతాయా' ఇత్యాదావేకత్రి ప్రకృత్యర్థతా వచ్ఛేదకే సంఖ్యాన్వయా త్ప్రత్యేకా భిప్రాయేణావా న్వయా న్నతుతి రిత్యాశయః॥ ౧౬॥

## ఆ స్థ్రీ తా త్ప ర్య ము

పూర్వోక్తమైన జీవేశ్వరుల యొక్క స్వరూపమును జెప్పుచున్నాడు ఈలోకమందు సమష్టి వ్యష్టి రూపముతో జీవ - ఈశ్వర అనునట్టి పురుషులు శృతి ప్రమాణములచే తెలియబడిరి. అందొకడు - క్షరుడు మరి యొకడు అక్షరుడు - క్షరుడనగా సకలభూతములు సకలకార్యములు, పిపీలికాది బ్రహ్మపర్యంతము ప్రత్యేకము నశించునదని యర్థము। అక్షరుడనగా సర్వమైన ఇంద్రియ సముదాయ మందున్నవాడు గనుక, కూటస్థుడు ! ఈశ్వరుడు నాశము లేనివాడని యర్థము:॥ ౧౬॥

శ్లో॥ ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః॥ ౧౭

## భా ష్య మ్

నన్వేవమపి, సర్వం ప్రపంచజాతం కల్పిత ముక్తం పరంతు తత్త్వమస్యాది చతుర్విధ మహావాక్య లక్షణం శివ మద్వైతంతుతురీయం నోక్తమిత్యాహ । ఉత్తమఇతి । ఏవం తహ్యుత్తమః పురుషస్తు హేఅర్జున। మత్తోన్యో హ మంతరాత్మా శివస్తు పరమాత్మేతి యోవేదాదౌ స్వరః ప్రోక్త ఇత్యాదా శ్రుతా వుక్తం వివేక్తవ్యమ్ । తతాభ్యాం క్షరా క్షరాభ్యాంవిలక్షణం పునస్స్వయమేవదర్శయతి॥యఇతి॥ఏవంసతి యశ్చైవ ముత్తమః పురుష స్తమసః పరస్తా త్పరమేశ్వరో ఽవ్యయోవిశ్వాధికః పరమశివో లోకత్రయా ధిష్ఠానత్వేనావిశ్య బిభర్తీ త్యర్థః॥౧౭॥

## —♦ లఘుటిప్పణీ ♦—

తమసఃపరస్తాదితి॥ తదాచాత్రి శ్రుతిః।'తమాది మధ్యాంత విహీన మేకం విభుం చిదానంద మరూప మవ్యయమ్। ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం ధ్యాత్వాముని ర్గచ్ఛతి భూతయోనిం సమస్త సాక్షిం తమసః పరస్తా' దిత్యాది కైవల్యోపనిషదా ద్రష్టవ్యమ్॥౧౭॥

## —♦ ఆర్థితాత్పర్యము ♦—

ఓయీ! సర్వ ప్రపంచము కల్పితమని చెప్పితిని. తత్వమసి మొదలయిన నాల్గు విధములైన మహావాక్య లక్షణమైన తురీయాద్వైత శివుని చెప్పలేదంటె చెప్పుచున్నాడు. ఓ యర్జునా! ఉత్తమపురుషుడు నాకంటె వేరు. నేను అంతరాత్మను శివుడు పరమాత్మ 'యోవేదాదౌ' అను శృతియందు చెప్పబడిన మహేశ్వరుడని తెలియవలెను. క్షరాక్షరముల కంటె విలక్షణమైన పురుషుని తిరిగి తానె స్వయముగా చూపించుచున్నాడు. యెవడు ఉత్తమ పురుషుడో తమస్సు కంటె పరుడో వాడే పరమేశ్వరుడు అవ్యయుడు విశ్వము కంటె నధికుడు నైన పరమ శివుడు లోకత్రయమునకు అధిష్టానముగా నుండి అందుప్రవేశించి భరించు చున్నాడు. తమస్సు కంటె పరుడనగా శృతి 'తమాది మధ్యాంత విహీన మేకం విభుం చిదానంద మరూప మవ్యయమ్। ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం'ధ్యాత్వామునిర్గచ్ఛతి భూతయోనిం సమస్త సాక్షిం తమసః పరస్తాత్ అని కైవల్యోపనిషత్తు మొదలయిన వాటియందు జూడ నగును॥౧౭॥

శ్లో॥ యస్మాత్ క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః।
అతోఽస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః॥ ౧౮

—♦ భా ష్య మ్ ♦—

ననుచ త్వం కస్మా త్కారణా ల్లోకే వేదేచ పురుషో త్తము త్వేన ప్రథిత ఇతి సంశయం నిరాకుర్వ న్నాహ॥ యస్మా దితి॥ తత్రైవం సతి తతః క్షీణమలం కృష్ణ ముపమన్యు ర్యథా విధి భస్మనోద్ధూల్య తం మంత్రై రగ్ని రిత్యాదిభిః క్రమాత్। అథ పాశుపతం సాక్షా ద్వ్రతం ద్వాదశ వార్షికం కారయిత్వా ముని స్తస్మై దదౌ జ్ఞాన మను త్తమమ్। తదా ప్రభృతి తం కృష్ణం మునయ శ్శంసిత వ్రతాః। దివ్యాః పాశుపతా స్సర్వే పరివవ్రుర్యోపతస్థిర ఇత్యాది కూర్మ స్మృత్యంతరా దప్యవగం తవ్యమ్॥ ౧౮॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

తత్రార్థే శ్రుతిశ్చ 'దృష్ట్వేశ్వరం భక్తిగమ్యం భస్మ భక్షయ దచ్యుతః, నమస్తే స్తు నమస్తేస్తు త్వామేవ శరణం గతః। తతః ప్రభృతి శుక్లాభో వాసుదేవః ప్రతాపవా' నిత్యాది శ్రుత్యా తసీ కుసుమోపమత్వే మేఘద్యుతి మత్వంచే త్యాద్యపి స్ఫుటీకృతమ్॥ ౧౮॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ! నీవు యేకారణము వలన లోకమందునూ వేదమందును పురుషోత్తముడవని ప్రసిద్ధినొందితి వనగా చెప్పుచున్నాడు. క్షరమును మించిన వాడనగుటం బట్టి యు అక్షరునికన్న శ్రేష్ఠుండ నగుటం బట్టియు ఉపమన్యు మహర్షి పాపరహితుడైన కృష్ణుని అగ్నిరితి భస్మ - వాయు రితి భస్మ మొదలయిన మంత్రములచే నభిమంత్రితమైన భస్మను యథా విధిగా శరీరమంతయు ఉద్ధూళనచేసి పదిరెండు సంవత్సరములు పాశుపత

వ్రతమును కృష్ణునిచే స్వయముగా చేయించి ఉపమన్యువు కృష్ణుని కొరకు అనుత్తమ మైన శివజ్ఞానము నుపదేశించెను । తదారభ్య వ్రతము నాచరించిన పాశుపతులైన ఋషులు దేవఋషులు కృష్ణుని పరివేష్టించి కూర్చునిరని కూర్మస్మృతి యందును అన్యత్రానున్నూ ఉండుటం బట్టియు లోకమందును వేదమందును పురుషోత్తమ నామంబున ఖ్యాతింబడసితిని. శ్రుతి ప్రమాణమున్నూ గలదు. భక్తిచే పొందదగిన ఈశ్వరుని చూచి భస్మను భక్షించి ఈశ్వరా! నీకు నమస్కారము నిన్నే శరణు బొందితి నని స్తుతించిన తర్వాత వాసుదేవుడు తెల్లనివాడై ప్రతాపవంతుడై యుండెనని శ్రుతిగలదు, అవిశెపువ్వువంటి కాంతి గలవాడనిన్ని మేఘము వంటి కాంతిగలవాడనిన్ని అన్యత్ర స్ఫుటముగా తెలిపెను॥ ౧౮॥

శ్లో॥ యో మా మేవమసంమూఢో జానాతి పురుషోత్తమమ్ ।
స సర్వ విద్భజతి మాం సర్వభావేన భారత!॥ ౧౯

—♦ భాష్యమ్ ♦—

నను త్వాం కేనరూపేణ విజానీయా దిత్యాహాయ ఇతి ఏవంసతి, తదా ప్రభృతి తే కృష్ణమిత్యాది పూర్వోక్త రీత్యా యథోక్త జ్ఞానేనా సంమూఢో యస్యైకథం శివధ్యానార్చన జ్ఞానా చ్ఛ్రీకృష్ణం పురుషోత్తమ మేవనవ విజానీయా దిత్యాశయః కింతు హేభారత స శివైక తాదాత్మ్యేన సర్వవిద్ భూత్వా మామపి సర్వభావేన భజతి భజే దిత్యర్థః॥ ౧౯॥

—♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

ఓయీ! నన్ను యేరూపముచేత తెలుసుకొన వలెనంటె చెప్పుచున్నాడు. గురువైన ఉపమన్యువు నొద్ద పాశుపత వ్రతంచేసి శివదీక్షనొంది

నది మొదలు పూర్వశ్లోకమందు చెప్పిన కృష్ణముపమన్యుర్యథావిధి. ఇత్యా ది కూర్మపురాణ వచనము వలన శివజ్ఞానముచే నన్ను పురుషోత్తమునిగా యెవడు తెలియుచున్నాడో అనగా శివధ్యానము శివార్చనము శివజ్ఞానము వలన శ్రీ కృష్ణుని పురుషోత్తముడని యెందుకు తెలియరాదు. పురుషోత్తము డనవచ్చునని యభిప్రాయము.. వాడు ఓ భారతశివైకతాదాత్మ్యముచే సర్వము తెలిసిన వాడై నన్నునున్నూ అన్ని రీతుల భజించునని యర్థము॥

శ్లో॥ ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయానఘ
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్స్యా త్కృతకృత్యశ్చ భారత॥ ౨౦

ఇతి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే పురుషోత్తమ
యోగోనామ పంచదశోధ్యాయః.

—◆ భాష్యమ్ ◆—

ఇదానీం త్వధ్యాయార్థ ముపసంహరతి । ఇతీతి॥ తత్త్రైవ సత్యనేన ప్రకారేణ గుహ్యతమం శాస్త్ర మిదం బుద్ధ్వా హే౽నఘ! కశ్చి దన్యోపి బుద్ధిమాన్ స్యాత్ కృతకృత్యశ్చే త్యాశయః॥౨౦॥

ఇతి శ్రీ శ్వేతాచార్య గురుచరణ శిష్య భావ సమాసాదిత శైవసిద్ధాంత
ప్రవర్తక శ్రీ శ్రీకంఠ శివాచార్య విరచితే తత్త్వైక దర్శన
నామకే గీతాభాష్యే పురుషోత్తమయోగోనామ
పంచదశోధ్యాయః.

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

ఉపసంహరతీతి॥ తద్యథా, 'ఇత్యాద్యర్థే సమాప్తౌచ విపర్యా మకృతేపిచ తథానేక వ్యవస్థార్థే నిపాతత్వా త్సమీరితః' మిత్యాది వాక్య పదీయాద ప్యవధార్యమ్॥ ౨౦॥

ఇతి శ్రీ శ్రీకంఠశివాచార్య శిష్య విశ్వేశ్వర శివాచార్య విరచితాయాం లఘుటిప్పణ్యాం పురుషోత్తమయోగః॥

## —♦ ఆ ం ధ్రి తా త్ప ర్య ము ♦—

ఇప్పుడు అధ్యాయమును ముగించు చున్నాడు. అర్జునా! ఈప్రకారము ఈరహస్య శాస్త్రమును నుడివితిని. పాపములేనివాడా, దీని నెఱింగిన వాడెవ్వడైనను జ్ఞానియు కృతకృత్యుడున్నూ అగును॥ ఇతి అనునది సమాప్తి యని యర్థము ఇక్కడ సంబంధము॥ ౨౦॥

ఇట్లు తత్త్వైకదర్శన మను శ్రీ కంఠీయ గీతాభాష్యమునకు బోధానంద మహర్షి చే రచింపబడిన భావబోధమను నాంధ్రితాత్పర్యమున పురుషోత్తమ యోగ మను పదునైదవ అధ్యాయము సంపూర్ణము.

---

ఓమ్

శ్రీమచ్ఛ్రీకంఠాచార్యకృతే

# శ్రీ భగవద్గీతాభాష్యే

## దైవాసుర సంపద్విభాగ యోగోనామ షోడశోధ్యాయః



శ్రీకృష్ణ ఉవాచః—

శ్లో॥ అభయం సత్వసంశుద్ధి ర్జ్ఞానయోగ వ్యవస్థితిః ।

దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్॥ ౧

—◆ భాష్యమ్ ◆—

దేవీ చైవాసురీ చేతి సంపద్ద్వేధా ప్రకీర్తితా । మోక్ష బంధ ప్రదత్వేన షోడశే తన్నిరూప్యతే । నను కైః ప్రకారైః సర్వోపి జనశివైకతత్వం ప్రాప్నోతీతి పంచవింశతి సాధనాన్యాహ । అభయమితి ॥ తత్ర తావత్ అభయం భయరాహిత్యం నిష్కామ కర్మణా సత్వస్యాంతఃకరణస్య శుద్ధి ర్నిర్మలతా సద్గురు వేదవాక్యై రాత్మతత్వస్యా వగమో జ్ఞానం యమ నియమాదినాచ యోగ స్తయో ర్వ్యవస్థితి రిత్యర్థః । ఏవం దానం శాఠ్యరహితం దమో బాహ్యేంద్రియ సంయమః తత్ర యజ్ఞస్తు దేవయజ్ఞః పితృయజ్ఞో మనుష్యయజ్ఞో భూత

యజ్ఞో బ్రహ్మయజ్ఞశ్చేతి పంచవిధః తత్ర స్వాధ్యాయోపి వేదాధ్యయనం ప్రణవాదిన గాయత్ర్యారాధనం తజ్జపశ్చేతి ద్వివిధః ఏవం తపశ్చ శారీరాది భేదేన త్రివిధం యథాంత స్తదా బహిశ్చే త్యార్జవ మవక్రతే త్యర్థః॥ ౧॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నన్వమృతసురయో రుభయోరపి సముద్రోద్భవత్వం చతుర్దశ రత్నాంతర్గతత్వంచేతి తయోస్సమానత్వ మేవేతి చేన్మైవ మిత్యాహ దైవీతి తథాచ నసురా విద్యతే యేషాంతే ఽసురా స్తృప్తి మాగతాః సురా స్త్వమృత మాసాద్య దైవీం సంపద మాశ్రితా ఇత్యాది స్మృత్యా ద్వయోరపి మోక్షబంధ హేతుత్వ మవధార్యం। పంచవిధఇతి తద్యథా దేవ పితృ మనుష్యాశ్చ భూత బ్రహ్మేతి పంచధా ప్రత్యహం బ్రాహ్మణః కుర్వన్నిహా ముత్రాది సాధయే దితి బోధ్యం॥౧॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము♦ —

దేవసంపత్తనియు ఆసుర (రాక్షస) సంపత్తనియు రెండువిధములు. అందుదేవసంపత్తు మోక్షహేతువనియు ఆసుర సంపత్తుబంధహేతువనియు చెప్పి యీ పదునారవ అధ్యాయము నందు దానిని నిరూపించుచున్నాడు శ్రీకృష్ణుండిట్లనియె॥ సర్వజనులు యే ప్రకారములచె శివునిలో నైక్యము నొందుదురో అందుకుగాను యిరువదిరెండు సాధనములను చెప్పుచున్నాడు. భయములేకుండుట ౧. నిష్కామకర్మచేత నంతఃకరణశుద్ధి ౨. నిర్మలత్వము సద్గురూపదేశము వేదవాక్యములతో ఆత్మతత్వమును తెలిసేజ్ఞానము యమ నియమాదికముచే యోగము ఇట్టిజ్ఞానము గలిగియుండుట ౩. శక్తివంచన లేనిదానము. ౪. బాహ్యేంద్రియనిగ్రహరూపమైనదమము ౫. దేవయజ్ఞము పితృయజ్ఞము మనుష్యయజ్ఞము భూతయజ్ఞము బ్రహ్మయజ్ఞము అనుపంచ మహాయజ్ఞములు. ౬; వేదాధ్యయనము. ౭. ప్రణవాదికముగా గాయత్రీ

 

ఆరాధనము తపస్సన్నా అతపస్సు వాచికమనియు ఉపాంశు యనియు మానసిక మనియు 3 విధములు. యెదటివానికి వినబడునట్లు జపించునది వాచికము. నెమ్మదిగా తనకేవినబడు నట్లుచ్చరించునదిఉపాంశు. మనసుతో జేయునది. మానసికము. ౮. వంకరలేకుండుట. ౯. (అమృతము- సుర- యీరెండును సముద్రములోనే పుట్టి పదునాల్గు రత్నములలో నంతర్భూతములే గాన ఆ రెండునూ సమానములే యంటే కాదనిచెప్పు చున్నాడు. సురలేక తృప్తినొందినవారు అసురసంపద నాశ్రియించిరి. దేవతలు అమృతమును గ్రోలి దేవసంపద నాశ్రియించిరనే స్మృతిచేతను రెండును మోక్షబంధ హేతువులని (దేవసంపద మోక్ష హేతువు అసురసంపద బంధహేతువు) చెప్పదగినవి బ్రాహ్మణుడు దేవ- పితృ-మనుష్య-భూత-బ్రహ్మ యజ్ఞములను పంచమహా యజ్ఞములను ప్రతి రోజునను చేయుచు ఇహ పరములను సాధించు నని తెలియదగినది॥౧॥

శ్లో॥ అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాంతి రపైశునం।
దయా భూతేష్వ లోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలం॥

—♦ భాష్యమ్ ♦—

ఏవ మిహా''పరమప్యాహ । అహింసేతి త్రత్రతానత్ ప్రాణి వృత్తి విచ్ఛేదాభావోఽహింసా ఏవ ధర్మా ననుసంబాధి సత్యమనన్యాయేనోక్తి రక్రోధో విషయేష్వనాసక్తి స్త్యాగః ఏవ మన్తఃకరణస్యో పశమ శ్శాంతిః పరదోష ప్రకాశనా భావోఽపైశునం ఏవం భూతేషు దుఃఖితేష్వ నుకంపా దయా విషయ సన్నిధానేష్వ విక్రియత్వ మలోలుప్త్వం మార్దవంచా క్రూరత్వం స్వధర్మ శైథిల్యాభావత్వం హ్రీః ప్రయోజనం వినాపి వాక్పాణ్యాది వ్యాపారయితృత్వం చాపల్యంతద భావస్త్వ నుచాపల మిత్యర్థః॥ ౨॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

అచాపలమితి తద్యథా దృష్టి స్థిరా యస్య వినైవ దృశ్యా ద్వపు స్థిరం యస్యవినా ప్రయత్నా చ్చిత్తంస్థిరం యస్య వినావలంబా త్సఏవ యోగీ సగురు స్సపూజ్యఇత్యాదిద్రష్టవ్యం॥ ౨॥

—♦ ఆం ధ్రి తా త్ప ర్య ము ♦—

ఈప్రకారమే తరువాయి వాటిని చెప్పుచున్నాడు. ప్రాణుల యొక్క వృత్తిని చెడగొట్ట కుండుట అహింస. ౧౦. ధర్మములను సంబంధించిన సత్యమును - అన్యాయములేక పలుకుట. ౧౧. కోపము లేకుండుట ౧౨. విషయములయందాసక్తి లేకుండుట త్యాగము. ౧౩. అంతః కరణ వృత్తిరహిత మగుట శాంతి. ౧౪. పరుల దోషగుణముల వెల్లడించ కుండుట అపైశునము. ౧౫. దుఃఖితులయిన భూతముల యందు అనుకంపము దయా ౧౬. విషయములు సమీపించినను వికారము నొంద కుండుట అలోలుపత్వము. ౧౭. క్రూరత్వము లేకుండుట మార్దవము. ౧౮. స్వధర్మమును వీడకుండుట లజ్జా. ౧౯. ప్రయోజనము లేక వాగాది ఇంద్రియముల వ్యాపారము లేకుండుట అచాపలము. ౨౦. యెవనికి దృశ్యము అనాగా దృష్టి స్థిరము గా నుండునో, యెవనికి ప్రయత్నము లేక శరీరము స్థిరముగ నుండునో, యెవనికి మంత్రాదులయొక్క అవలంబన లేక చిత్తము స్థిరముగ నుండునో, వాడే యోగి, వాడేగురువు, వాడేపూజ్యుడు. ఇత్యాది స్మృతులను చూడ నగును॥ ౨॥

శ్లో॥ తేజః క్షమా ధృతిశ్శౌచ మద్రోహో నాతిమానితా
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత॥ 3

—♦ భా ష్య మ్ ♦—

ఏవ మిహో పర మప్యాహ తేజఇతితత్ర తావత్తేజ స్స్వధర్మేషు ప్రాగల్భ్యం ఏవం క్షమా సహిష్ణుతా ధృతి ధైర్యం

శౌచం సబాహ్యాంభ్యంతర శ్శుద్ధిః ఏవముదోగ్రహః పరాపకార రాహిత్యంతథాత్మని పూజ్యత్వ తిశయ భావనా తిమాని తేశి వేదె బోధిత కర్మణా త్మజ్ఞానోపాయా నుష్టాన ప్రవృత్తిహేతు స్సాత్వికీ శుభ భావనా దైవీ సంపదితి తాందైవీం సంపద మభి జాతస్య హేభారత ఏతే పంచవింశ త్యభయాదయో ధర్మా భవంతీ త్యత్ర తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతీ త్యాది శ్రుతిరప్య నుకూలే త్యవధార్యం॥ 3॥

## — లఘు టిప్పణీ. —

ప్రాగల్భ్యమితి।తద్యథా ఉద్యమ స్సాహసం ధైర్యం బలంబుద్ధిః పరాక్రమః షడిమేయస్య తిష్ఠంతి ససర్వం ప్రాప్నుయాత్పుమానిత్యాది స్మృత్యా వధార్యం అవధార్యమితి తదుక్తం ధర్మనిబంధేష్వపి తద్యథా సత్యంచ ధర్మంచ పరాక్రమంచ భూతానుకంపాం ప్రియవాదితాంచ। ద్విజాతి దేవా తిథి పూజనంచ పంథాన మాహు స్త్రిదివస్య సంత ఇత్యవధ్యేయం॥ 3॥

## — ఆంధ్ర తాత్పర్యము —

తరువాయినిన్ని చెప్పుచున్నాడు. స్వధర్మముల యందు ప్రగల్భము గలిగియుండుట తేజస్సు. ౨౧. సహనమగు క్షమయు ధైర్యమగు ధృతియు గలిగియుండుట. ౨౨. బాహ్యశుద్ధి - అంతరశుద్ధి రూపమైన శౌచము. ౨3. పరులకు అపకారము చేయకుడుంట. ౨౪. నేనే పూజ్యుడనను భావన లేకుండుట. ౨౫ వేదచోదిత కర్మలచేత నాత్మజ్ఞానమునకు ఉపాయమైన అనుష్ఠాన మందు ప్రవృత్తిగలుగుటకు హేతువైన సాత్వికమైన శుభ వాసన దేవసంపత్తని పించుకొనును. ఓభారత! అట్టి దేవసంపద యందు బుట్టినవానికి ఇదివరకు చెప్పిన అభయము మొదలయిన యిరువది యైదు

ధర్మములు గలుగుచున్నవి. బ్రాహ్మణులు వేదవాక్యములచే ఆత్మజ్ఞానమును తెలియుచున్నారనే శృతియును అనుకూలమైనదే యని తెలియవలెను (ప్రగల్భ మనగా ఉద్యోగము, సాహసము ధైర్యము, బలము, బుద్ధి, పరాక్రమము యీ ఆరును యెవనివద్ద నున్నవో ఆపురుషుడు అన్నిటిని పొందగలడు - ఇత్యాదిస్మృతులచే తెలియ దగినది। ధర్మనిబంధమను ధర్మశాస్త్రమందును యిట్లె గలదు. సత్యము, ధర్మము, పరాక్రమము, భూతదయ, ప్రియవాక్యమును పలుకుట, దేవబ్రాహ్మణాతిథి పూజలు చేయుట, ఇవి స్వర్గమునకు సోపానములని సత్పురుషులు చెప్పిరి॥ ౩॥

శ్లో॥ దంభో దర్పో భిమానశ్చ క్రోధః పారుష్య మేవచ
అజ్ఞానంచా భిజాతస్య పార్థ సంపద మాసురీమ్॥　　　౪

—♦ భా ష్య మ్ ♦—

అథ ముముక్షుభి ర్గ్రాహ్యత్వేన దైవీం సంపద ముక్త్వేదానీం హేయత్వేనాసురీం సంపద మప్యాహ దంభఇతి । తత్ర తావద్ధార్మిక తయా త్మనః ఖ్యాపనం దంభః । ఏవం ధన స్వజనాది నిమిత్తో గర్వ విశేషో దర్పః। తథాత్మన్యత్యంత పూజ్యత్వాధ్యారోపో ఽభిమానః । అతఏవ స్వేష్వేవా స్యేష్వసురా జుహ్వత శ్చేరు స్తేతిమానేనైవ పరా బభూవు రితి శృతిరపీత్యాశయః ఏవం స్వపరాపకారత్వ ప్రవృత్తి హేతు రభిజ్వలనాత్మ కాంతఃకరణ ప్రవృత్తి ర్విశేషః క్రోధః । తథా ప్రత్యక్షమేవ రూక్షవ ద్దుశ్శీలత్వం పారుష్యం, ఏవం కర్తవ్యాకర్తవ్యాది విషయక వివేకాభావో అజ్ఞానంచేతి చకారేణచాపలాదీనా

మన్యేషామపి సంగ్రహో వేద్యఇత్యతో రజస్తమోమయీ మాసురీ సంపద మభిజాతస్య హేపార్థ దంభాద్యజ్ఞానాంతజన్యా నరకాద్యనిష్టా దోషా ఏవం భవంతీతి వివేకః॥౪॥

## —◆ లఘుటిప్పణీ ◆—

అభిమానమితి। తదుక్తం। అభిమానం సురాపానం గౌరవం ఘోర రౌరవం ప్రతిష్ఠా సూకరీవిష్ఠాత్రయం త్యక్త్వా సుఖీ భవేదితి ధర్మాధర్మ విషయభేదేనపూర్వవద్వివేక్తవ్యం॥ ౪॥

## —◆ ఆంధ్రితాత్పర్యము ◆—

ముముక్షులు గ్రహించదగిన దేవసంపదను చెప్పి యిప్పుడు నింద్య మైన అసురసంపదనున్నూ చెప్పుచున్నాడు నేను ధర్మాత్ముడనని చెప్పుకొనుట దంభము. ధనజనసంపత్తి విషయమైన గర్వము దర్పము నేనే పూజ్యుడననుకొనుట అభిమానము, తనకును ఇతరులకును అపకార మయె ప్రవృత్తిహేతువులచే మండుచున్న అంతఃకరణవృత్తి క్రోధము, ప్రత్యక్షముగా ప్రేమాభావముచే మార్దవములేని స్వభావము పారుష్యము కర్తవ్యాకర్తవ్యములయందు వివేకము లేకుండుట అజ్ఞానము చాపల్యము మొదలయినవాటినిన్ని గ్రహించవచ్చును. ఇట్టి రజస్తమోగుణరూపమైన అసురసంపద యందు పుట్టినవానికి దంభము మొదలు అజ్ఞానాంతమైన దోషములు గలిగి నరకము మొదలయిన అనిష్టములునూ అగుచున్నవని తెలియవలెను॥ ౪॥

శ్లో॥ దైవీ సంప ద్విమోక్షాయ నిబంధాయా సురీ మతా।
మాశుచ స్సంపదం దైవీ మభిజాతోసి పాండవ॥ ౫

—◆ భా ష్య మ్ ◆—

నన్వనయోః సంపదోః కీదృశః ఫలవిశేష ఇత్యాహ। దైవీతి। తత్ర తావ ద్దైవీ సంపత్సాం శృతి బంధ విమోక్షాయ కైవల్యాయ భవతి తత్రాసురీతు రాజసీ తామసీచ సర్వాప్యాసురీ సంపన్నియత సంసార బంధనాయ మతా సమ్మతే త్యర్థః నన్వేవం తర్హి అహం కిమాసుర్యా సంపదా యుక్త ఇతిచేన్నే త్యాహ । మాశుచ ఇతి తత్ర హేపాండవ పాండుపుత్రేష్వన్యేష్వపి దైవీ సంపత్ప్రసిద్ధాస్తి కింపున స్త్వయీతి త్వందైవీం సంపద మభిజాతోఽసీతి మాశుచః శోకం మాకార్షీ రిత్యాశయః॥ ౫॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

కైవల్యాయేతి। తద్యథా, పరబ్రహ్మేతదాఖ్యాతం మనో వాచామగోచరం పరమాత్మా శివశ్చేతి కైవల్యే నిష్కళశ్శివః ఇత్యాది లింగ పురాణోక్త్యా కైవల్యప్రదాయ శివాయచ దైవీసంప ద్భవతీ త్యాశయః॥౫

—◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ◆—

ఓయీ! ఈరెండు సంపదలలో ఫలవిశేష మెట్టిదనగా చెప్పుచున్నాడు, దేవసంపత్తు సంసార బంధమును విడిపించి ముక్తికొరకగును, అసుర సంపత్తు రాజసము తామసము కూడా సంసారబంధము కొరకే యని నిశ్చయము, ఓయీ! నేను అసుర సంపదలో గూడితినా అంటె లేదని చెప్పుచున్నాడు. ఓపాండవ! పాండవులందరి యందు దేవసంపత్తు ప్రసిద్ధమై యున్నది. నీయందు యేమి చెప్పుదును. నీవు దేవసంపదయందు

పుట్టినావు. దుఃఖ పడవద్దని యభిప్రాయము (పరమాత్మ యైన నిష్కళ శివుడే మనో వాచామగోచర మైన బ్రహ్మః ము 'అదియే కైవల్యము' ఇట్లు లింగపురాణ వచనమును బట్టి, దేవసంపత్తు కైవల్యము నిచ్చు శివునికొరకు అగుచున్నదని యాశయము॥ ౫॥

శ్లో॥ ద్వౌ భూతసర్గౌ లోకేస్మిన్ దైవ ఆసుర ఏవచ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు॥ ౬

—♦ భా ష్య మ్ ♦—

నను గుణత్రియ యుక్తా ప్రకృతి స్తత్ర కతివిధ స్సర్గో యేనా యం బంధ ఇత్యాహ। ద్వావితి । తత్ర తావదస్మిన్ లోకే శ్రుతి స్మృతి సంస్కార ప్రాబల్యేన రాగ ద్వేషా వభి భూయ యథా ధర్మ పరాయణో భవతి సతదా దైవీం సంపద మాపన్నో భవతీతి విస్తరో దర్శితః యదాతు శ్రుతి స్మృతి విరుద్ధ రాగ ద్వేష పరాయణో భవతి సతదా త్వాసుర ఇత్యత స్తమాసురం సర్గం హానోయార్థం హేపార్థ శృణ్వి త్యర్థః॥ ౬॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

సంస్కారేతి సచ సంస్కారః సత్సంగత్యా గురుదైవత భక్తి ప్రాబల్యా దేవేత్యభ్యుక్తం తద్యథా గురు ర్లభేత సంగత్యా గురో ర్మంత్రాది పూజనం ఇత్యాదినోక్తత్వాదితి భావః॥ ౬॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ! ప్రకృతి గుణత్రయముతో గూడినది, అందు సృష్టి యెన్ని విధములు। దేనిచే నీబంధము గలిగినదంటె, చెప్పుచున్నాడు. పార్థా, భూతసృష్టి। దైవమనియు, అసురమనియు, రెండువిధములు, అందు

ఈలోకమందు శృతి, స్మృతి, సంస్కారముల యొక్క బలిమిచే రాగ ద్వేషములను త్రోసిపుచ్చి యెప్పుడు ధర్మ మందాసక్తి గలవాడను చున్నాడో అప్పుడు దేవసంపత్తును బొందిన వాడగు చున్నాడు. ఇట్లు దైవము విపులముగా నుడువం బడినది। యెప్పుడు శృతి - స్మృతి విరుద్ధ మైన రాగద్వేషముల యందాసక్తు డగుచున్నాడో వాడు అప్పుడు ఆసుర డనిన్ని అట్టి యాసుర సృష్టి హేయమైనది చెప్పుచున్నాను వినుము (సంస్కారమనగా సత్సంగతి చేతను గురూపదేశము మంత్రానుష్ఠానము గురుపూజనము మొదలయిన రీతిగా చెప్పబడినదని భావము॥ ౬॥

శ్లో॥ ప్రవృత్తించ నివృత్తించ జనా నవిదు రాసురాః ।
　　నశౌచం నాపిచాచారో నసత్యం తేషు విద్యతే॥　　　౭

—♦ భాష్యమ్ ♦—

　　నను తర్హి కిమస్త్యసురాణాం లక్షణ మిత్యాహ। ప్రవృత్తిం చేతి॥ తత్ర తావ త్సకామేనా నిష్టేనాపి యజన పూజనాదినే హాముత్ర ఫలసాధికాం ప్రవృత్తిం తథా నిష్కామ కర్మణాతు శుద్ధచిత్తస్య యమ నియమాదినా యోగధర్మేణ కైవల్య ప్రదాం నివృత్తించా సురా జనా నవిదు రిత్యర్థః। యత స్తేషు శ్రుతి స్మృతి విహితం శౌచం సంధ్యాది షట్కర్మ రూపాచార విశేష స్సత్యంచ నవిద్యత ఇత్య వధార్యమ్॥ ౭॥

—♦ లఘుటిప్పణీ ♦—

　　షట్కర్మేతి తత్రతావత్ 'సంధ్యా స్నానం జపో హోమో దేవ తానాంచ పూజనం ఆతిథ్యం వైశ్వదేవంచ షట్కర్మాణి దినేదిన' ఇత్యాది

స్మృత్యా షట్కర్మణ ఆవశ్యకత్వే స్థితే తత్రాతిథ్యంతు దూరాచ్ఛేపగ తం శ్రాంతం క్షుధితం రిక్తవర్జితం ధర్మ మార్గైక తత్వజ్ఞం పూజయే త్స్వాగతాదినా నత్వపథం యథా కథంచి దపీ త్యవధేయమ్॥౭॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ! ఆయితే అసురుల యొక్క లక్షణ మేమంటే చెప్పుచున్నాడు. కామ్యముతో గూడి యనిష్టమైన యజన పూజనాదికముచే ఇహ పరముల యందు ఫలప్రాప్తిని గలిగించు ప్రవృత్తినిన్నీ నిష్కామకర్మచే చిత్తశుద్ధి గలిగి యమ నియమాద్యష్టాంగ యోగములచే కైవల్యము నిచ్చు నివృత్తిసిన్నీ అసుర జనులు తెలియరు. యెందుకనగా వారలయందు శృతి స్మృతులయందు చెప్పబడిన శౌచము సంధ్యాది షట్కర్మ రూపమైన యాచారము సత్యమున్నూ లేవు. షట్కర్మలనగా స్నానము సంధ్యా జపము హోమము దేవతార్చనము అతిథిసత్కారము వైశ్వదేవము యీ ఆరు కర్మలు ప్రతిరోజునను చేయవలయునని స్మృతివలన షట్కర్మలు ఆవశ్యక మైయుండగా ఆతిథ్యము యెట్టివానికి చేయవలయు నంటె దూరదేశము నుండి వచ్చినవాడు అలసినవాడు అకలిగొనినవాడు ద్రవ్యములేనివాడు ధర్మమార్గమందు ముఖ్యతత్వమును చెలిసినవాడు ఇట్టివానిని స్వాగతాదు లచే పూజించవలయును. పధికుడు గాని వానినియెట్లైనను పూజించరాదని తెలియవలెను॥౭॥

శ్లో॥ అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరమ్।
అపరస్పర సంభూతం కిమన్య త్కామహైతుకమ్॥ ౮

—♦ భా ష్య మ్ ♦—

అసత్యమితి॥ ధర్మాధర్మయోః ప్రవృత్తి నివృత్తి విష యయోః ప్రతిపాదకం వేదాఖ్యం నిర్దోషం ప్రమాణం తదుప

జీవి ఆగమాది పురాణాదిచ యత్ర నాస్తి తదసత్యం అతఏవ నాస్తి ధర్మా ధర్మ రూపా ప్రతిష్ఠా వ్యవస్థా హేతు ర్యస్య తదప్రతిష్ఠం తథా నాస్తి శుభాశుభ కర్మణో ఫల నియంతే శ్వరో యస్య తదనీశ్వర మిత్యసీశోవా కుర్యాద్ భువన జననే కః పరికర ఇత్యాది స్మృతి విరుద్ధం తే త్వసురా జగదాహు రిత్యర్థః। ఏవం తతశ్చ క్వ కర్మ ప్రధ్వస్తం ఫలతి పురుషా రాధనమృతే ఇత్యాది స్మృతి విరుద్ధా భిప్రాయేణా పరస్పర సంభూత మేవేదం రజోవీర్య సంయోగా దేవ కామ హేతుకం జాయమానం జగత్స్వాభావికం కిమన్యదృష్టం కారణమస్తి నాస్తీ త్యాశయః॥ ౮॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నిర్దోషమితి॥ ఏవం సత్యస్య మహతో భూతస్య నిశ్వసిత మేత ద్యదేతదృగ్వేదో యజుర్వేదః సామవేదో ఽథర్వవేదశ్చే త్యాది శ్రుత్యా వేదస్యే శ్వరో చ్చరితత్వేన స్వతోవా ప్రామాణ్యేన నిర్దో షత్వే స్థితే తతాప్రి పి ప్రామాణ్య జిజ్ఞాసాయాంమూల విప్ల। వాపత్తి ర్దోషః తద్యథాస్వతః ప్రమాణ భూతేస్మిన్ ప్రామాణ్యే మూలవిప్లవః తస్మా న్నాత్మ శ్రయోహ్యత్ర జ్యోతి ర్యద్వ త్ప్రకాశత ఇత్యాది ద్రష్ట వ్యమ్॥ స్వాభావికమితి॥ తదేతచ్చ 'దేవఏకో విశ్వస్య కర్తా భువనస్యగోప్తే' త్యాది శ్రుతివిరుద్ధమేవ తేవదంతీ త్యాశయః॥ ౮॥

## —♦ ఆ న్వ్ధి తా త్ప ర్య ము ♦—

చార్వాక మతమును చెప్పుచున్నాడు॥ ప్రవృత్తి మార్గమునకు విషయమైనది అధర్మమనిన్ని నివృత్తివిషయమైనది ధర్మమనిన్ని చెప్పేటటు

వంటి నిర్దోషమైన వేదమనే ప్రమాణము దానిని బతికించు కామికాద్యష్టా వింశత్యాగమములు. అష్టాదశ పురాణములునూ యేవాక్యమందు ప్రమాణము కావో అది యసత్యము। గనుకనె ధర్మాధర్మ రూపమైన వ్యవస్థ లేనిది. అప్రతిష్ఠము। పుణ్య పాప కర్మలకు ఫలము నిచ్చు ఈశ్వరుడు లేనిది అనీశ్వరము శ్రుతి స్మృతి విరుద్ధమైన దానినిగా జగత్తును అసురులు చెప్పుచున్నారు. మరిన్ని స్త్రీ పురుషులవలన బుట్టినవై శుక్ల శోణిత సంయోగము వలననె కామమునకు హేతువైన జగత్తు స్వాభావిక మైనది ఇతర కారణమేమి గలదు? యేమియు లేదనియర్థము (శ్రుతిప్రమాణముచె ఈశ్వరునిచె ఉచ్చరించబడి స్వతఃప్రమాణమైన వేదము నిరుష్టమై యుండగా అందులోను ప్రామాణ్యమును తెలుసుకొనుట యందు ఈశ్వరుడే లేడనుట వలన ఈశ్వరోచ్చరితమైన వేదమెట్లుండును గనుక మొదటికే మోసము వచ్చినది। జగత్తు స్వాభావికమె గాని ఈశ్వర సృష్టము గాదనుట విశ్వస్య కర్తా భువనస్య గోప్తా యను శ్రుతికి విరుద్ధముగానె అసురులు చెప్పుచున్నారని యభిప్రాయము॥ ౮॥

శ్లో॥ ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానో ఽల్పబుద్ధయః
ప్రభవంత్యుగ్ర కర్మాణః క్షయాయ జగతో ఽహితాః॥౯

—♦ భా ష్య మ్ ♦—

నను తే కీదృశా అనర్థవాదిన స్తదాహ। ఏతామితి। శత్రైవం సత్యేతాం ప్రాగుక్తాం వర్ణా శ్రమ ధర్మ విరుద్ధాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానో ఽల్పబుద్ధయ స్తథోగ్ర కర్మాణో హింసకా జగతోఽహితాశ్చ యత స్తత్క్షయాయ ప్రభవంతీతి శేషోర్థిభి స్సర్వథా సాదృష్టి ర్హేయైవే త్యర్థః॥౯॥

—◆ ఆంధ్ర తాత్పర్యము ◆—

ఓయీ! అనర్థ వాదులైన వారలెట్టి వారనగా చెప్పుచున్నాడు. వెనుక చెప్పిన వర్ణాశ్రమ ధర్మ విరుద్ధమైన దృష్టిని నిలిపి నష్టబుద్ధులు, అల్పబుద్ధులు, ఉగ్రకర్మలు జేయువారు, విరోధులై లోకనాశము కొరకు జన్మించు చుందురు॥ శ్రేయమును గోరువారట్టి దృష్టిని యన్నివిధముల నింద్యముగా జూతురు॥ ౯॥

శ్లో॥ కామమాశ్రిత్య దుష్పూరం దంభ మాన మదాన్వితాః
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః॥

—◆ భాష్యమ్ ◆—

నను తే కథంచి త్కర్మణా మనుష్యయోని మప్యాగతా శ్చేత్కథం లక్ష్యంత ఇత్యాహ। కామమితి॥ ఏవంసతి, తే దంభ మాన మదాన్వితా స్సంతో దుష్పూరం కామ మాశ్రిత్య మోహా దజ్ఞానా దేవా సద్గ్రాహా నశుభ నిశ్చయాన్ గృహీత్వా త్వశుచివ్రతా స్సంతో నరకే ఽశుచౌ ప్రవర్తంత ఇత్యగ్రిమేణా న్వయః॥౧౦॥

—◆ ఆంధ్ర తాత్పర్యము ◆—

ఓయీ! వారు యెప్పుడైనా కర్మవశముచే మనుష్య యోనిని గూర్చియున్న వచ్చినటులైతే యెటుల గుర్తించ వచ్చునంటె చెప్పుచున్నాడు దంభ మాన మదములతో గూడిన వారగుచు పూర్తిలేని కామము ననుసరించి మోహము వలన నశుచివ్రతులై దురాగ్రహములం బూని అశుచి వ్రతములు జేయుచు అశుచియైన నరకమందు బడుచున్నారు॥ ౧౦॥

శ్లో॥ చింతా మపరిమేయాంచ ప్రలయాం తా ముపాశ్రితాః।
కామోపభోగ పరమా ఏతావ దతి నిశ్చితాః॥ ౧౧

—◆ భా ష్య మ్ ◆—

ఏవమిహ తామేవ దృష్టిం పునరాహ। చింతామితి।
తత్రతావత్ చింతా మాత్మీయ యోగ క్షేమోపాయా
లోచనా త్మికాం పరమార్థ శూన్యా మపరిమేయాం ప్రళ
యాంతాం కదా స్యా ఉపరమో భవేదితి నిశ్చయ రహితా
ముపాశ్రితాః ప్రాప్తా స్తేషుతు నకదాచి త్పారలౌకిక చింతా
యుతాః కింతు కామభోగ ఏవ పరమః పురుషార్థో యేషాం తే
తథైతావదేవ దృష్టం సుఖం నాన్యదేత చ్ఛరీర వియోగేపీతి
నిశ్చితార్థా ఇత్యాశయః॥ ౧౧।

—◆ ఆం ధ్రి తా త్ప ర్య ము ◆—

ఆదృష్టిని గూర్చియె తిరుగా చెప్పుచున్నాడు. తాము మృతి
నొందు వరకు తమ యోగక్షేమములకు ఉపాయమును ఆలోచించు
నట్టిన్ని పరమార్థ రహితమైనట్టిన్ని అంతము లేనట్టిన్ని దీనికి నాశము
యెప్పుడు గలుగునో యనె నిశ్చయము లేనట్టి చింతను ఆశ్రయించిన
వారేగాని, పారలౌకిక చింత యెప్పుడూ లేనివారు, కామభోగమే
మోక్షసుఖమను వారలు దేహాంతమందును మరియొక సుఖము లేదను
నిశ్చయము గలవారలు॥ శ్లో॥ అవిదిత సుఖ దుఃఖం నిర్గుణం వస్తు కించి
జ్జడమతి రిహ కశ్చి న్మోక్షు ఇత్యాచచక్షే, మమతు మత మనంగ స్మేర
తారుణ్య ఘూర్ణన్మదకల మదిరాక్షీ నీ విమోక్షోహి మోక్షః॥ ఇట్టి
నిశ్చయము గలవారలు స్త్రీ బాలాంధ జడోపమా స్త్వహ మితి భ్రాంతా

శృశం వాదినః। స్త్రీలతోటి బాలురతోటి జడులతోటి సమానులు తానెవరో తెలియక మోసపోయి దేహాత్మవాదులగుచున్నారు॥ ౧౧॥

శ్లో॥ ఆశాపాశ శతై ర్బద్ధాః కామ క్రోధ పరాయణాః ।
ఈహంతే కామభోగార్థ మన్యాయేనా ర్థసంచయాన్॥ ౧౨

—♦ భా ష్య మ్ ♦—

ఏవ మపరానపి తద్దృష్టి యుక్తానాహ॥ ఆశేతి॥ తత్రాని నవగతోపాయా ర్థవిషయా త్వాశా తస్యాశ్చానేక రూపత్వా త్తచ్ఛతై స్సముహైర్బద్ధా స్తథా కామక్రోధ పరాయణా స్సంతః కామభోగార్థ మన్యాయేనా ప్యర్థసంచయా నీహంత ఇత్యన్వయః॥ ౧౨॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

అన్యాయేనేతి॥ ఇహాపి 'అన్యాయోపార్జితం విత్తం దశవర్షాణి తిష్ఠతీ త్యుక్త మేవస్మర్తవ్యమ్॥౧౨॥

—♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

మరిన్ని అట్టి దృష్టిగలవారిని చెప్పుచున్నాడు ధన విషయమందు ఉపాయము తెలియక పోవుట ఆశ. అదియే పాశము. అది అనేక రూపములు గలదగుటచె వందలకొలది యైన నాశాపాశములచె బద్ధులై కామ క్రోధముల యందాశ గలవారలగుచు కామాను భవమున కన్యాయముగా ధనార్జన సేయదలంచు చుందురు.(అన్యాయముచే సంపాదించిన విత్తము పదిసంవత్సరము లుండును. పదునొకొండవ సంవత్సరమున సమూలము నశించునన్న స్మృతిని స్మరించవలెను॥౧౨॥

శ్లో॥ ఇద మద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్ ।
ఇద మస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్॥　　౧3

## —♦ భా ష్య మ్ ♦—

నను కీదృశీ తస్యేహే త్యాహ॥ ఇదమితి॥ తత్ర తావదద్యేదానీ మిదం ధనాధికం వస్తు పురైవ మయా లబ్ధం తథేమంచ మనోరథం మయా లబ్ధం తథేమంచ మనోరథం మయా పునశ్శీఘ్రమేవ ప్రాప్స్యే తథేదంచ వస్తు మమ గృహే సంచితమస్తీదంచ పునర్మే ధనం భవిష్యతీ త్యాది పరమార్థ శూన్యం వదంతీతి తత్పాపా న్నరకే ప్యశుచౌ పతిష్యంతీ త్యాశయః॥ ౧౩॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

తత్పాపాదితి॥ తత్రైవం 'పాపప్రభావాత్తు భవే ద్దరిద్రో దరిద్రభావాత్ప్రకరోతి పాప' మితి న్యాయేనబద్ధాఏవేత్యాశయః॥ ౧౩॥

## —♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

వానియొక్క ఇచ్ఛ యెటువంటిదనగా చెప్పుచున్నాడు. ఈ ధనాది సామాగ్రి నాకు మునుపే ప్రాప్తించినది. ఇప్పుడు ఇదిలభించినది, ఇక నీకోరికను పూర్తిచేసుకుందును. పునః శీఘ్రముగానే ధనమునుపొందగలను, యీవస్తువు నాగృహమందు సంచితమై యున్నది, మరియెక్కువ ధనము నాకు లభింప గలదు. ఈప్రకారము తిలబీజ న్యాయముగా పరమార్థ శూన్యమయిన వాక్యములు పల్కుచుందురు. ఆపాపము వలన అశుచియైన నరకమందు పడుచుందురు। పాపప్రభావము వలన దరిద్రుడై పుట్టి దరిద్రభావముతో పాపమే జేసి నరకము దరిద్రము భ్రమిచక్రన్యాయముగా అవిచ్ఛిన్నముగా వచ్చుచుండును। యీన్యాయముచే బద్ధులని యభిప్రాయము॥ ౧౩॥

శ్లో॥ అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చాపరా నపి ।
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ॥ ౧౪

—♦ భా ష్య మ్ ♦—

ఏవమిహ లోభం ప్రపంచ క్రోధమపి ప్రపంచయ న్నాహ!—అసావితి॥ తత్రైవం సత్యసాదేవద త్తనామ దుర్జయ శ్శత్రు ర్హత స్తథా పరానపి సర్వాన్ హనిష్యామి యతో మహేశ్వరో రాజసంనిభః ప్రబలో నా స్తి మత్తుల్యః కశ్చి దహమేవచ భోగీ సర్వ భోగోపకరణై ర్యుక్తో భృత్యాదిభి స్సహాయై స్సిద్ధో బలవాన్ సుఖ్యప్యహ మే వే త్యర్థః॥ ౧౪॥

—♦ ల ఘు టి ప్ప ణీ. ♦—

శత్రుహన్ ఇతి॥ నను 'అధర్మ నిరతః శత్రుర్భాగ్యేనైవతు లభ్యతే' ఇత్యాది స్మృత్యా 'భీషాస్మాద్వాతః పవతే' ఇత్యాది శ్రుత్యాచ కామ క్రోధాదే రావశ్యక త్వే స్థితే కథమేత దితి చే చ్ఛృణు! తద్యథా, కామ శ్చే త్స్వస్త్రియం గచ్ఛే త్రో(?)ధోధర్మార్థ మాశ్రయేత్। లోభో ధర్మ స్యచాధిక్యే మోహాద్యా దైవ కర్మణీత్యాది స్మృత్యంతరా దితిభావః॥౧౪॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

లోభమును ప్రపంచక్రోధమును విస్తరించుచు చెప్పుచున్నాడు. దుర్జయు డైన దేవదత్తుడను శత్రువును నేను జంపితిని. అట్లె ఇంకా ఇతర మైన శత్రు లను జంపుచున్నాను. మహేశ్వరుండ నేనే. నాతో తుల్యుడైనవాడు రాజ సమానుడు, ప్రబలుడు లేడు. నేనేభోగిని సర్వమైన భోగోప కరణములుగల వాడనుభృత్యాదిసహాయులతోగూడిసిద్ధుడనుబలవంతుడనుసుఖిని నేనేఅధర్మ నిరతుడైన శత్రువు భాగ్యవశమున దొరకుననుస్మృతి చేతనున్నా భీషాస్మా

దను శ్రుతి ప్రకారము ఈశ్వరుని భయము చేతనె వాయువ వీచుచున్నదను ప్రమాణముచే క్రోధాదులావశ్యకమైయుండగా ఉండకూడదనుటయేల యనగా విను కామమున్న యెడల తనస్త్రీతో గమనించవలయును. క్రోధమున్న ధర్మాగ్రహముండవలయు. లోభమున్న ధర్మము వృద్ధిజేయుట యందుండవలయు మోహాదులున్న యెడల దైవకర్మయం దుండవలయునను స్మృతి ప్రమాణము గలదు॥౧౪॥

శ్లో॥ ఆఢ్యో౽భిజనవా నస్మి కో౽న్యో౽స్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞాన విమోహితాః॥౧౫॥

—♦ భా ష్య మ్ ♦—

ఏవం ధనాద్యభిమానేనా ప్యసద్వా దినాం ప్రాబల్య మాహ,-ఆఢ్యఇతి॥ తత్ర తావదాఢ్యో ధన్య భిజనవాన్ కులీ నశ్చాహమేవాస్మీతి కో౽స్తి మయా సదృశ ఇత్యర్థః। ఏవ నిరీశ్వర వాదినాం మీమాంసకానాం మత మప్యాహ। యక్ష్య ఇతి॥ ఏవంసతి। స్వర్గకామో యజే దిత్యాది కర్మణాం ఫలు శ్వకర్మప్రధ్వస్తం ఫలతీ త్యాది స్మృతి విరుద్ధం దేవ ఏకో విశ్వస్య కర్తా భువనస్య గోప్తే త్యాది శ్రుతి విరుద్ధం వా జ్ఞాన విమోహితా స్తే నిరీశ్వర వాదినో వదంతీ త్యర్థః॥౧౫॥

—♦ ల ఘు టి ప్ప ణీ. ♦—

నిరీశ్వరవాదినఇతి॥ తదుక్తం నిరీశ్వరే కుతో ధర్మ స్తర్కాచా ర్యాద్యతే శ్వరే సాంఖ్యయోగే వివాదో క్తః శాబ్దికాఃశబ్దవాదినః పాఖండివ త్స్మృతాః హ్యన్యేజ్ఞానవార్తా సుదుర్లభా ఏకం వేదాంత విజ్ఞానం కర్మో పాస్త్యా విరాజత ఇత్యాది ద్రష్టవ్యమ్॥ ౧౫॥

## —◆ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ◆—

ఈప్రకారము ధనాదుల యొక్క అభిమానము చేతనున్న అస ద్వాసనల యొక్క ప్రాబల్యమును చెప్పుచున్నాడు. ధనికుండ నేనే ఉత్తమ కులమందు జన్మించిన వాడను నేనే నాతో దుల్యుడెవడు॥ ఇట్లె నిరీశ్వర వాదులయిన మీమాంసకుల యొక్క మతమునున్నా చెప్పు చున్నాడు। యజ్ఞకర్తను నేనే దానముల నొనర్పగలను, సంతోషించ గలను. ఇట్లజ్ఞాన విమోహితులై యానిరీశ్వరవాదులు పలుకుచున్నారు (నిరీ శ్వర మతమందు ధర్మమెక్కడిది, తర్కాదియందు జడత్వము గలదు సాంఖ్యమందు వాదముగలదు. వైయాకరణులు శాబ్ద బోధ గలవారు ఇత రులు పాఖండులు జ్ఞానవార్త యె దుర్లభము. ఒక్కవేదాంతమె అనుభవ జ్ఞానము గలుగ జేయునది. అది కర్మోపాసన చే ప్రకాశించును॥ ౧౫॥

శ్లో॥ అనేకచిత్త విభ్రాన్తా మోహజాల సమావృతాః ।
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ॥ ౧౬

## —◆ భా ష్య మ్ ◆—

ఏవమిహ లోకేపి తేషాం వృత్తమవ్యాహ । అనేకేతి॥ తత్త్రైవసతి, యతశ్శ్రుతి మార్గ బహిర్భూతత్వేనా నేకచిత్త విభ్రాంతా మోహజాల సమావృతా స్సంతః కామభోగేష్వేవ కేవలం ప్రసక్తా నరకేపీహ దుష్కర్మణా త్వశుచౌ పతంతీ త్యవధార్యమ్॥ ౧౬॥

## —◆ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ◆—

ఈప్రకారము ఇహలోక మందును భ్రాంతులగువారి వృత్తాంత మును దెలుపుచున్నాడు। వేదమార్గమునకు విరోధమగుటచే పలుచెరం

గులగు కోర్కెలయందు ప్రవర్తించిన మనసు గలవారగుటం బట్టి విక్షేపము బొందుచు మోహజాలంబున దగుల్కొని కామము నందు భోగము నందు ఆసక్తి గలవారై దుష్కర్మ చేతను అశుచి నరకము నందు గూలుచుందురు॥ ౧౬॥

శ్లో॥ ఆత్మ సంభావితాః స్తబ్ధా ధన మాన మదా న్వితాః।
యజంతే నామ యజ్ఞైస్తే దంభేనా విధి పూర్వకమ్॥౧౭॥

—◆ భా ష్య మ్ ◆—

ననుః కథంతే యజ్ఞాదికం కుర్వాణా అపి పతిష్యంతీత్యాహ। ఆత్మేతిః తత్ర త్రయస్తే త్వాత్మ సంభావితా స్వయమేవా హంకారేణ పూజ్యత్వం ప్రాప్తా స్తథైవ స్తబ్ధాః కైశ్చిద్బ్రాహ్మణై రపి నృగాదివదనమ్రాః యతశ్చ ధనమాన మదాన్వితా యజంతేనామ ప్రసిద్ధిమాత్రమ్। కింతు దంభేనా విధి పూర్వక మేవ యజంతే దక్షాదివదితి భావః॥ ౧౭॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

ప్రసిద్ధిమాత్రమితి॥ తద్యథా, 'కర్మనాశాజలస్పర్శా త్కర్మనాశావిలంఘనాత్। గండకీబాహుతరణా ద్ధర్మః క్షరతి కీర్తనా' దిత్యాద్యుక్తమపి పునరవధార్యమ్, నహి మంత్రిణాం యామితాస్తీతి న్యాయేనోపదిష్టమపి పునరుపదిష్ట మిత్యవధార్యమ్॥ ౧౭॥

—◆ ఆం ధ్ర తా త్ప ర్య ము ◆—

ఓయీ! వారు యజ్ఞాదులను చేసినప్పటికి యెందుకు పతితు లగుచున్నారంటె చెప్పుచున్నాడు. ఆత్మ స్తవమును జేసికొనువారును కొంత మంది. బ్రాహ్మణులచేతనున్నూ నృగమహారాజువలెనే నమ్రులు గాని

వారు ను ధనగర్వముతోను మదగర్వముతోను గూడిన వారును యీ ముగ్గురును యజ్ఞమును జేయుచున్నారని ప్రసిద్ధిమాత్రమే. మరేమంటె డంబముతో విధి నెరుంగక దక్షాదుల వలె యజ్ఞమును జేయుచున్నారని భావము (జలస్పర్శలేక చేయు కర్మ నాశమగును. కర్మను దాటించిన కర్మ నాశమగును, గండకీనదిని బాహువులతో ఏదినను ధర్మమును జెప్పు కొనినను ధర్మము నశించి పోవునను చెప్పినది తెలియవలెను। మంత్రములు ఉపదేశమును బొందినప్పటికి మళ్ళీ ఉపదేశమునొందవచ్చును. మంత్రము లకు నియమము లేదని న్యాయము గలదు॥ ౧౭॥

శ్లో॥ అహంకారం బలం దర్పం కామంక్రోధంచ సంశ్రితాః ।
మమాత్మ పరదేహేషు ప్రద్విషంతో౽ భ్యసూయకాః॥

—♦ భా ష్య మ్ ♦—

ననుచకథంతే వినిష్టా ఇత్యాహ అహంకారమితి॥ తత్రైవంసతి దేహాదా వహంత్వాభిమాన మహంకారో బలశ్చ పరాభిభవ నిమిత్తం దర్పం శరీరగత సామర్థ్య విశేషం తథాభీ ష్టవిషయాభిలాషం కామ మనిష్టద్వేషం క్రోధంచ సంశ్రితాః ప్రాప్తా ఇత్యర్థః । తత్ర యత ఏవం భూతాః పరదేహేషు వ్యష్టిభావేశా మమే శ్వరస్యైవాత్మేత్యవిజానంతః శ్రుతి స్మృతి విరుద్ధత్వేన ప్రద్విషంతో భ్యసూయకాశ్చే త్యాశయః॥ ౧౮॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

అవిజానన్నితి॥ 'మమైవాంశో జీవలోకో జీవభూతః సనాతన' ఇత్యాద్యవిజానన్ని త్యర్థః॥ ౧౮॥

## —◆ ఆంధ్ర తాత్పర్యము ◆—

ఓయీ! వారు యెట్లు నశించిరంటె చెప్పుచున్నాడు । దేహేంద్రి యాదులు నేననే బుద్ధి, అహంకారము, యెదటివారిని తిరస్కరించునది, బలము, శరీరమందలి సామర్థ్య విశేషము దర్పము, ఇష్టమైన విషయముల యందు కోరిక కామము ఇష్టము కాని వారియందు ద్వేషము క్రోధము, వీటిని పొందిన వారై పర శరీరముల యందు వ్యష్టిభావముతో ఈశ్వరుండనైన నాయొక్క ఆత్మయని తెలియని వారై శృతి స్మృతులకు విరోధులగుటచే ద్వేషించుచు మంచివారి గుణముల యందు దోషారోపణ జేయుచుందురు (జీవలోకమందు జీవుడు ఉపాధి రహితమయిన నాయంశమని తెలియజాలక యాయువును బోగొట్టుకొను చున్నాడు. యెట్లనగా మనయాయుర్భాగము మనశ్వాసమేగాని సూర్యచంద్రాదులు తిరుగునట్టి దినములుగావు । ఒక్కొక్క మనుష్యునకు నిన్నికోట్ల శ్వాసములని జననకాలమునకు మునుపే పంచభూతములవలన సృష్టింపబడిన శరీరములోనే చేర్పబడియున్నది । ఇట్టి మహారహస్యమును బురుషులు తెలిసికొనలేక శ్వాసము నెట్లు నష్టపరచుచున్నారనగా:-

౧. సాధారణముగా మాటలాడునపుడు పండ్రెండు అంగుళముల శ్వాసము వెడలి, యెనిమిదంగుళముల శ్వాసములోపల బ్రవేశించి నాలుగంగుళముల శ్వాసము బయట నష్టమగుచున్నది.

౨. నడచునపుడు పదునారంగుళముల శ్వాసము వెడలి యెనిమిదంగుళముల శ్వాసములోపల బ్రవేశించి యెనిమిదంగుళముల శ్వాసము బయట నష్టమగుచున్నది.

౩. చేతపనులు జేయునపుడు యిరువది యంగుళముల శ్వాసము వెడలి పదియంగుళములు లోనికి బ్రవేశించి పదియంగుళముల శ్వాసము బయిట నష్టమగుచున్నది.

౪. వాదులాడునపుడు యిరువది నాలుగంగుళముల శ్వాసము వెడలి పండ్రెండంగుళముల శ్వాసములోపల ప్రవేశించి పండ్రెండంగుళముల శ్వాసము బయట నష్టమగుచున్నది.

౫. నిద్రపోవునపుడు నలువది యెనిమిది యంగుళముల శ్వాసము వెడలి ముప్పదియంగుళముల శ్వాసములోపల బ్రివేశించి పదునెనిమిది యంగుళముల శ్వాసము బయట నష్టమగుచున్నది.

౬. పరుగెత్తునపుడు యేబదినాలు గంగుళముల శ్వాసము వెడలి, యిరువదియే డంగుళముల శ్వాసములోనికి ప్రవేశించి, యిరువదియేడంగుళముల శ్వాసము బయిట నష్టమగుచున్నది.

౭. సంభోగ కాలమునం దఱువదినాలు గంగుళముల శ్వాసము వెడలి, యిరువదినాలు గంగుళముల, శ్వాసములోనికి బ్రివేశించి నలువది యంగుళముల. శ్వాసము బయట నష్టమగుచున్నది.

౮. ఈప్రకారముగా నొక్కొక్క పురుషుడు ప్రతిదినమును ముప్పది నలువదివేలుగా శ్వాసమును కర్చుపెట్టి నూరు సంవత్సరముల యాయువున్నవాడు డెబ్బది యెనుబది సంవత్సరములలో మృతినొందు చున్నాడు||

౯. దినమువక్కంటికి పురుషునకుండుశ్వాసములు|| ౨౧౬౦౦ యిరువదియొక్కవెయ్యి యారువందలు. ఇట్లుండగా యెవడుప్రతిదినము ౩౦-౪౦ వేల శ్వాసములను కర్చుపెట్టునో వాడు ౭౦-౮౦ సంవత్సరములకు పైని జీవించడు.

౧౦. ఈశ్వరుడు మనకు యాయువును సంవత్సరములు, మాసములు దినములు గడియలు వార్షియక శ్వాసములుగా వ్రాసెను. అందువలన మనము శ్వాసములను సరిగా వెడలించిన యెడల నూరు సంవత్సరములు జీవింతుము. ప్రాణాయామాదులచేమిగిలిచిన యెడల చిర జీవులగుదుము.

జ్ఞానము గలుగువరకు యాయువును పెంచుకొనవలయును. జ్ఞానము గలిగిన తర్వాత దేహత్యాగము చేసిన యెడల పునరావృత్తి లేదు.

శ్లో॥ తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।
క్షిపామ్యజస్ర మశుభా నాసురీ ష్వేవ యోనిషు॥ ౧౯

—♦ భా ష్య మ్ ♦—

నను తేషాం నరాధమానాం కాగతి రిత్యాహ— తానితి॥ తత్రైవం సత్యేతాన్ సంసారేషు ద్విషతః క్రూరాన్నరాధమా నశుభా నాసురీష్వేవ వ్యాఘ్ర సర్పాదిషు యోనిష్వహ మజస్రం క్షిపామీ త్యర్థః॥ ౧౯॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ! అట్టి నరాధములకు యేగతి ప్రాప్తించు ననగా చెప్పు చున్నాడు, సంసారముల యందు ద్వేషించు చున్న నరాధములై యశుభులైన క్రూరులను వ్యాఘ్ర సర్పాదులయిన అసుర యోనుల యందు నేనే యెల్లపుడు బుట్టించు చుందును॥ ౧౯॥

శ్లో॥ ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని
మామప్రాప్యైవ కౌంతేయ! తతో యాంత్యధమాంగతిమ్॥

—♦ భా ష్య మ్ ♦—

నన్వేవమపి జన్మాంతరత్వేన కదాచి చ్ఛ్రేయో భవిష్య తీతి, నేత్యాహ। ఆసురీమితి॥ తత్ర యేతు పూర్వోక్తా మాసురీం యోనిమాపన్నా మూఢా స్తే జన్మని జన్మన్యప్యధమాం గతిం ప్రాప్నువంతీ త్యర్థః। యతశ్చ మన్యే త్వాం కాలమీశాన

మిత్యాది స్మృతిన్యాయేన మాం మత్పరంపదంవా త్వప్రాప్యైవ తే ముద్రాజటారచన మాధ్యవతాం వృథైవేతి స్మృతిన్యాయేనా న్యథా వేద మర్యాదయా భజాతీత్యధికం విష్ణుపురాణే ద్రష్టవ్యమ్॥౨౦॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

ద్రష్టవ్యమితి॥తత్ర తావ ద్బృహన్నారదీయే 'గంగాస్నాన రతోవాపి అశ్వమేధ రతోపివా చక్రాంకిత తనుం దృష్ట్వా పశ్యేత్సూర్యం నరేశ్వర' ఇత్యాది ముద్రాధారిణాం తప్తముద్రాంకితానాం నిషేధః ఏవం కృత్రిమ జటాధారిణాం మాధ్యవతాంచా సురత్వం స్పష్టమేవోక్తం నవిస్మర్తవ్యమ్॥౨౦॥

—♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ! ఈప్రకారము అసురయోనులయందు పుట్టుచు జన్మాంతరములయందు యెప్పుడైనను ముక్తినొందుదురాఅంటే లేదని చెప్పుచున్నాడు. పూర్వోక్తమైన అసురయోనిని బొందిన మూఢులు జన్మజన్మములయందును నిన్ను కాలరూపుడైన ఈశానునిగా దెలియుచున్నానని స్మృతి ననుసరించి నన్నుగాని నాపరంపదమైన సాంబశివుని గాని బొందలేక తప్తముద్రా ధారణ కృత్రిమ జటాధారణ జేయు మూఢులజన్మ వ్యర్థమను స్మృతిని బట్టి వేదభిన్నమైన మర్యాదను బొందుచుందురను విష్ణుపురాణవచనమును బట్టి అధమ గతిని పొందుచున్నారు (గంగాస్నాన రతుడుగాని అశ్వమేధ రతుడుగాని చక్రాంకితుని చూచిన యెడల సూర్యునిగాని రాజును గాని జూడవలెనని యున్నందున తప్తముద్రా ధారణ నిషేధించబడినది। ఈప్రకారమే కృత్రిమ జటాధారులగు మూఢులకును అసురత్వము స్పష్టముగానే యున్నది। మరువరాదు॥ ౨౦॥

శ్లో॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేతత్రయం త్యజేత్.

—♦ భా ష్య మ్ ♦—

నన్వాసురీ సంపదనేక విధోక్తా సా కథం పురుషేణ పరిహర్తుం శక్యేతి సంక్షిప్యా హ । త్రివిధమితి॥ తస్మా దేత త్త్రివిధం నరకస్య ద్వారం సాధకం తథాత్మనో జీవాత్మనో ఉత్యంతాధమ యోని ప్రద త్వేన నాశన మిత్యర్థః। యస్మాచ్చ కామాది త్రితయ మేవ శ్రుతి స్మృతి విరుద్ధ త్వేనా నర్థ మూలం తస్మా దేత త్త్రితయం త్యజేదితి సర్వా ప్యాసురీ సంప త్త్యక్తా భవతీ తి భావః॥౨౧॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

అనర్థ మూలమితి॥ నన్వేవం చే త్కథం కామాదయో రచితా ఇతిచే న్నైవం, 'కామశ్చేత్స్వస్త్రియం గచ్ఛే త్క్రోధశ్చే చ్ఛత్రు నాశన' ఇత్యాదినా ధర్మమూలక త్వేన తేషా మావశ్యకత్వాదితి భావః॥౨౧

—♦ ఆ ం ధ్రి తా త్ప ర్య ము ♦—

ఓయీ! ఆసుర సంపత్తుఅనేక విధములుగా చెప్పబడినది. అది పురుషునిచే నెట్లు పరిహరింప నగునంటె సంక్షేపముగా జెప్పుచున్నాడు. కామ క్రోధ లోభములను మూడును నరక ద్వారములు గనుక జీవాత్మకు అత్యంతమైన అధమ యోనిని ప్రాప్తింప జేయును గాన నాశకములు । యీకామము మొదలు మూడును శృతి స్మృతులకు విరుద్ధము గాన అనర్థ మూలమగుట వలన యీమూటిని వదలిన యెడల సర్వమైన ఆసుర సంపత్తు వదలి పోవును, (ఓయీ ఈకామాదుల నెందుకు రచించి రనగా అట్లనగూడదు) కామమంటె స్వస్త్రీతో భోగించ వలయును.

క్రోధమున్న శత్రునాశనము జేయవలెను. ఇత్యాదులు ధర్మమూలమగుటచే వారికి అవశ్యకము॥ ౨౧॥

శ్లో॥ ఏతైర్విముక్తః కౌన్తేయ? తమోద్వారై స్త్రిభి ర్నరః
ఆచర త్యాత్మన శ్శ్రేయ స్తతో యాతి పరాంగతిమ్॥౨౨

—♦ భాష్యమ్ ♦—

నన్వేతత్త్రితయం త్యజతః కింస్యా త్ఫల మిత్యాహ। ఏతైరితి॥ ఏనం తద్వార్భూతైః కామాదిభి స్త్రిభి ర్విముక్తస్సన్ యస్త్వాత్మనో వేదబోధితం శ్రేయః పురుష ఆచరతి హేకౌంతేయ! సచైహికాముష్మికీంచ పరాం గతిం ప్రాప్నోతీ త్యర్థః॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఓయీ! యీమూటిని వదలిన వానికి యేమి ఫలమంటె చెప్పు చున్నాడు, ఓకుంతికుమారా ! నరకద్వారములగు యీమూడింటిచే వదల బడిన వాడు తనకు శ్రేయ స్సాధకములగు వేదచోదితమైన తపో యోగాది కర్మల నొనరించి ఐహికాముష్మిక రూపమైన గతినిపొంది తర్వాత ముక్తినొందు చున్నాడు॥ ౨౨॥

శ్లో॥ యశ్శాస్త్ర విధి ముత్సృజ్య వర్తతే కామచారతః।
నస సిద్ధి మవాప్నోతి నసుఖం నపరాం గతిమ్॥　　౨౩

—♦ భాష్యమ్ ♦—

నన్వేతావతాపి ప్రపంచేన యది కామాదిషు దోష ఏవ తర్హి తేషాముత్పత్తి రేవకథమిత్యాహ—యఇతి॥ తత్రైవం సతి, కామశ్చే త్స్వస్త్రియం గచ్ఛే త్క్రోధ శ్శత్రో ర్వినాశనే, లోభో ధర్మస్య రక్షార్థం శ్రుతి తత్రైవక శాలినా మిత్యాది స్మృతి విరుద్ధం కుర్వ న్నేవేహ కర్మాణీ త్యాది

శ్రుతి విరుద్ధంచ యః కామకారతః స్వేచ్ఛామాత్రేణవర్తతే కరోతివా సచ నైవసిద్ధి మవాప్నోతి నవా సుఖ మైహికం పరాం స్వర్గాదిగతిం మోక్షంచ ప్రాప్నోతీత్యర్థః॥ ౨౩

—♦ లఘుటిప్పణీ ♦—

తతోఽరితి॥ తత్రాప్యధర్మ నిరత శ్శత్రు ర్భాగ్యేనైవ తులభ్యతే యత్రోఽధర్మాత్స్వయం నష్టస్తన్నాశే వాధికః శ్రమఇత్యాది స్మృత్యను కూలశ్చే ద్వ్యక్త మేవేత్యాశయః॥ ౨౩॥

—♦ ఆంధ్రతాత్పర్యము ♦—

ఓయీ! కామాదులయందు దోషమే ఉన్నయెడల ఇంతప్రపంచ ముతో వారెందుకు జన్మించవలెనంటె చెప్పుచున్నాడు । వేదసారమును తెలిసిన వారలకు కామమున్నయెడల తన స్త్రీతో గూడవలయును. క్రోధ మున్నయెడల శత్రునాశనమందుపయోగ పడవలయును. లోభమున్నయెడల ధర్మరక్షణయం దుపయోగించ వలయునన్న స్మృతులకు విరుద్ధముగా నున్నా కర్మలను చేయుచునే యుండవలయునన్న శృతికి విరుద్ధముగాను తనయిష్టము చొప్పున నెవ్వండు సంచరించునో అతండు సిద్ధి నొంద జాలడు. స్వర్గాది సుఖమును బొందలేడు. మోక్షమునంతకంటె పొంద లేడు. (అధర్మము గల శత్రువు భాగ్యము వలన లభించును యేశత్రువు వలన ధర్మము నశించుచున్నదో వానిని జంపిన అధికశ్రమ లేదను స్మృతి యనుకూలమనియె యభిప్రాయము॥ ౨౩॥

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవ స్థితౌ । జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి॥

ఇతి శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే దైవాసుర సంపద్వి భాగయోగో నామ షోడశోఽధ్యాయః.

## — భా ష్య మ్ —

ఏతమేవ సిద్ధాంత ముపసంహరన్నాహ । తస్మాదితి॥ తత్ర యస్మా దేవం తస్మాద్ధే అర్జున! తే తవా న్యేషాంవా కార్యా కార్య వ్యవస్థితౌ శ్రుతి స్మృత్యాది శాస్త్రమేవ ప్రమాణ మితి స్థితే తదేవ జ్ఞాత్వా శాస్త్ర విధానో క్తం కర్మ కర్తు మిహా ర్హాసీతి పరమార్థః॥౨౪॥

ఇతి శ్రీ శ్వేతాచార్య గురుచరణ శిష్య భావ సమాసాదిత శైవసిద్ధాంత ప్రవర్తక శ్రీ శ్రీకంఠ శివాచార్య విరచితే తత్త్వైక దర్శన నామకే గీతాభాష్యే దైవాసుర సంపద్విభాగ యోగోనామ షోడశోధ్యాయః.

## — ల ఘు టి ప్ప ణీ —

శాస్త్రమేవేతి॥ తద్యథా, 'శ్రుతయః స్మృతయ శ్చైవ యుక్తయ శ్చేశ్వరేశ్వరమ్ । వదంతి తద్విరుద్ధం యో వదే త్తస్మా న్నచాధమ' ఇత్యాది స్మృత్యంతరా చ్ఛాస్త్రానుకూలా యుక్తిరపీత్య వధార్యమ్॥౨౪॥

ఇతి శ్రీ శ్రీకంఠశివాచార్య శిష్య విశ్వేశ్వర శివాచార్య విరచితాయాం లఘుటిప్పణ్యాం దైవాసుర సంపద్విభాగయోగః॥

## — ఆ న్ధ్ర తా త్ప ర్య ము —

ఈసిద్ధాంతమును ముగించుచు చెప్పుచున్నాడు. ఓఅర్జునా! ఈపని చేయందగు ఏపని చేయందగదను వ్యవస్థ విషయమై నీకు గాని అన్యులకు గాని శృతి స్మృత్యాది శాస్త్రమె ప్రమాణమని యుండగా దానిని తెలిసి శాస్త్రవిధానమందు జెప్పబడిన కర్మలను జేయనర్హుడవని పరమా

ర్ధము శ్రుతులు, స్మృతులు, యుక్తులు పరమశివుని చెప్పుచున్నవి, దానికి విరుద్ధముగా యెవడు చెప్పుచున్నాడో వానికంటె అధముడు లేడను నట్టి స్మృత్యంతరము వలన శాస్త్రాను కూలమైన యుక్తియును కావలె శివదే యని తెలియ వలెను॥ ౨౪॥

ఇట్లు తత్త్వైకదర్శన మను శ్రీకంఠీయ గీతాభాష్యమునకు
బోధానంద మహర్షి చే రచింపబడిన భావబోధమను
నాంధ్రతాత్పర్యమున దైవాసుర సంపద్విభాగ
యోగమను పదునారవ అధ్యాయము
సంపూర్ణము.

---

ఓమ్

# శ్రీమచ్ఛ్రీకంఠాచార్యకృతే

# శ్రీ భగవద్గీతాభాష్యే

## శ్రద్ధాత్రియ విభాగ యోగోనామ సప్తదశోధ్యాయః



అర్జున ఉవాచ—

శ్లో॥ యే శాస్త్రవిధి ముత్సృజ్య యజంతే శ్రద్ధయా న్వితాః ।
తేషాం నిష్ఠాతు కా కృష్ణ సత్వ మాహో రజ స్తమః॥౧॥

—♦ భాష్య మ్ ♦—

'శ్రద్ధాత్రి త్రివిధా ప్రోక్తా తత్తద్భేదై రనేకధా ।
న్యూనాధిక ఫలై స్సప్తదశే త్వేతన్నిరూప్యతే? నను వైదిక విధానం కథంచి దుపేక్ష్య యేపి శ్రద్ధయైవానుతిష్ఠంతి । తే కిందేవేష్వంతర్భవంత్యు తాసు రేష్వితి సందిహాన ఆహ । యఇతి॥ ఏవంసతి । సత్వ రజ స్తమసాం మధ్యే కేషాం కిం విషయణీ నిష్ఠేతి వివేకతో వక్తవ్య మితి ప్రశ్నాశయః॥౧॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నను ముద్రా జటా రచన మాధ్యవతాం వృష్టవే త్యాది విష్ణుపురాణో క్తానాం కలినోపహత చిత్తానాం వేదబాహ్యానాం వైదికధర్మానుష్ఠానం

యుక్తం నవేత్యాశంకతే । నన్విత॥ తద్యథా, స్వేషు శ్వేషుచ ధర్మేషు యత్ర వర్ణాశ్రమా స్తథా । నిష్ఠావంతో హితిష్ఠంతి శివతత్త్వైక శాలినః । శ్రుతిహీనా ద్విజానైవ దానహీనా నభూమిపాః । శివహీనా క్రియానైవ కలి స్తత్ర నచేక్షుత ఇత్యాదిద్రష్టవ్యమ్॥౧॥

## —♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

అర్జునుండిట్లనియె:

హెచ్చుతగ్గులైన ఫలములు గల్గి వాటివాటి భేదములచేతను శ్రద్ధ, మూడువిధములవి యీపదునేడవ అధ్యాయమందు చెప్పబడుచున్నది. ఓయీ! వైదిక విధానమును వదలియెవరు శ్రద్ధతోనే అనుసరించు యుందురో వారు దేవతలలో అంతర్భూతులా లేక అసురులలో నంతర్భూతులా యని సందేహించు వాడగుచు చెప్పుచున్నాడు. కృష్ణా! యెవరు శాస్త్రవిధిని వదలి శ్రద్ధాయుక్తులై యజ్ఞము నొనర్తురో వారిస్థితియెట్టిది? సత్త్వగుణాశ్రయమా రజోగుణాశ్రయమా తమోగుణాశ్రయమా ? సాత్త్వికరాజస తామసులలో యెవరినిష్ఠ యేవిధముగా నుండునో విడదీసి చెప్ప వలయు నని ప్రశ్నాభిప్రాయము. (తప్తముద్రాకృత్రిమజటాధారుల జన్మ వృథయని విష్ణుపురాణమందు చెప్పబడినట్టిన్ని పాపాక్రాంత చిత్తులైన వేదబాహ్యులకు వైదిక ధర్మానుష్ఠానము యుక్తమా అయుక్తమా యని శంకించుచున్నాడు. శివతత్త్వనిష్ఠ గల శైవులు వర్ణాశ్రమ ధర్మములు గలవారై తమతమ వైదికధర్మమునుంటున్నారు. వేదములేనివారు బ్రాహ్మణులుగారు. దానములేనివారు రాజులుగారు. శివునారాధింపనిది కర్మగాదు. యీమూడును గలచోట కలి ప్రవేశింపజాలదు.౧.

శ్రీకృష్ణ ఉవాచ:—

శ్లో॥ త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శ్రుణు॥ ౨

—♦ భా ష్య మ్ ♦—

అథచ సర్వప్రాణినాం యథా త్రిగుణాపన్నా యా స్వభావజా శ్రద్ధా రుచి ర్వా భవతి తథైవ తావదు త్తర మప్యాహ । త్రివిధేతి॥ తత్రైవం సతి।యాదృశీ శ్రద్ధా దేహినాం త్రిగుణాత్మికా స్తి తాదృశ్యేవ పునర్బ్రవీమీతి శృణ్వేత్యర్థః॥ ౨॥

—♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

శ్రీకృష్ణుం డిట్లనియె:—

అటు తర్వాతను సర్వప్రాణులకు త్రిగుణములచే ప్రాప్తించి నట్టిన్ని పూర్వజన్మ సంస్కారము వలన బుట్టిన యేశ్రద్ధ రుచించునో, శేనో, అంటే అంతలోనె ఉత్తరమును జెప్పుచున్నాడు । ఎల్లవారికిని శ్రద్ధ సాత్వికమని రాజసమని, తామసమని మూడువిధములు - అది పూర్వజన్మ సంస్కారమున జనించునది । కాబట్టి యాత్రివిధ శ్రద్ధను జెప్పెద నాలింపుము॥ ౨॥

శ్లో॥ సత్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ।
శ్రద్ధామయో యం పురుషో యో యచ్ఛ్రద్ధ స్సఏవసః॥

—♦ భా ష్య మ్ ♦—

నన్వేవం స్వభావజాపి తేషాం శ్రద్ధాకథం జా తేతి నజా నీమ ఇత్యాహ॥ సత్త్వేతి॥ ఏవం సత్యారబ్ధే జన్మని శుద్ధ కర్మ సంస్కార వశా త్సాత్వికేవ శ్రద్ధా మలిన సంస్కార వశాత్తు రాజస్యేవ తతోప్యతిమాలిన్యేన తామస్యేవేతి తాదృశ కర్మ సంస్కార వశా త్త దను రూపయా సర్వస్య జనస్య హేభారత!

శివునికి ప్రియమను స్మృతిననుసరించి సాంగం సాయుధం సవాహనం సశక్తిపరివారం సదాశివ మావాహయామీ త్యాది రీతిచే మహోపదార్థము లను గణపతినిన్నీ శైవులు పూజించు చున్నారు. రజోగుణము గలవారు యక్షులను రాక్షసులను పూజించు చున్నారు. ఇతరమైన తమోగుణము గలవారు భూతములయిన పూతనా ప్రభృతులనున్నూ భూత గణముల నున్నూ పూజించు చున్నారు. 'యో వేదాదౌ స్వరః' అను శృతిని బట్టి ప్రణవము సదాశివ బీజ మగుటచే సర్వత్ర ఓం అని ఉపన్యాసము, దాని యనంతరమందు గణానాంత్వా అని చెప్పియున్నందున సకల యజ్ఞముల యందు శివుడు అగ్రభోక్త యగుటచే తత్పుత్రుడైన గణపతికి గౌరికిని సాంగాయ సపరివారాయ సశక్తికాయ సాయుధాయ సవాహనాయ శ్రీసదాశివాయ నమః గంధపుష్పాదికం సమర్పయామి నమః ఇత్యాది ప్రకారముగా పూజించుట యుక్తము గాన శైవులు స్వార్థ పరార్థ ముల యందు శివుని పూజించి తాము తరించి పరులను తరింప చేయుచున్నారు గాన సాత్వికులని జెప్పబడు చున్నారు॥ ౪॥

శ్లో॥ అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః
దంభాహంకార సంయుక్తాః కామరాగ బలాన్వితాః॥ ౫

శ్లో॥ కర్షయంత శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః
మాంచైవాం తశ్శరీరస్థం తాన్విద్ధ్యాసుర నిశ్చయాన్॥ ౬

—♦ భాష్యమ్ ♦—

తత్రైవంసతి యేతు వేదబాహ్యా స్తామసా ధమా దప్య ధమాః స్సాత్విక మర్యాదయా దురాగ్రహేణ శాస్త్రీయ సాధ నేన తపోవృత్త్యా ప్రవర్తంతే వస్తుత స్తపవా సురా భవంతీతి

ద్వాభ్యాం నిదర్శయతి॥ అశాస్త్రేతి॥ ఏవం తహిఁ, ముద్రా జటా రచన మాత్యవతాం నృథైవే త్యాది విష్ణుపురాణోక్తా స్తత్సంప్రదాయానుగా శ్చేదానీం తనా దంభాహంకార యుక్తత్వేన భూతగ్రామం మాం చాప్యసద్వృత్త్యా శరీరాం తస్థం త్రిదండ ముపజీవతీతి స్మృతి న్యాయేన కర్షయంత స్తిష్ఠం తీతి తానప్యాసురనిశ్చయాన్ సుతరాం విద్ధీతి ద్వయోరర్థః॥౫-౬

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

తపోవృత్త్యేతి॥ నను కా తహిఁ తపోవృత్తిర్యయా వృత్త్యా ముద్రా జటే త్యాది వేదబాహ్యా అపి చరంతీతి చేచ్ఛృణు వన కూప తటాకాంతే సముద్రం లింగ మాశ్రితో యుక్తస్థానే సమాసాద్య కాల నేమి ర్వాడంబిత ఇత్యాద్యధిక మన్యత్ర విస్తరః॥౫-౬॥

—♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

వేదబాహ్యులైన తామసులు అధముల కంటె నధములై సాత్విక మర్యాదతో దురాగ్రహముతో శాస్త్రీయ సాధనముతో తపోవృత్తితో యెవరు ప్రవర్తించు చున్నారో వారె యదార్థముగా అసురులగుచున్నారని రెండు శ్లోకములచే చూపించు చున్నాడు. దంభ, అహంకార, కామ, రాగ, ఆగ్రహములతో గూడినవారు తప్తముద్రా జటాధారులు మొదలగు విష్ణుపురాణమందు జెప్పినవారును శ్లో॥ దరియా నాభా కబీరశ్చ నానక శ్సుధర స్తథా శఠకోపో భిషక్ చాష్టౌ కర్మచండాల భాగినః॥ దరియులు నాభులు, కబీరు, నానకుడు, సుధరుడు, తెంగలి, వడవాలి, వైద్యుడు యీ యెనమండ్రును కర్మచండాలురు. యీసంప్రదాయా నుయాయులును ఇప్పటి డంబాచారులున్నూ పృధివ్యాధి భూతములనున్నూ అంతర్యామి యైన నన్నున్నూ అసద్వృత్తితో మనోవాక్కాయ దండములను బ్రతికించు

చున్నాడను న్యాయముచే కృశింపజేయుచు ఉంటున్నారు. వారలనున్నా మిక్కిలిగా నిశ్చయమైన అసురులుగా తెలియుమని రెండు శ్లోకములకు అర్థము (తపోవృత్తియనగా యేవృత్తితో వేదబాహ్యులయిన తప్తముద్రా కృత్రిమజటా ధారులు సంచరించు చున్నారనగా విను. వనములు కూప ములు తటాక ప్రాంతమందు తప్తముద్రా చిహ్నమును ధరించి యొకచోట కూర్చుని డంబముచేసిన కాలనేమిని జ్ఞాపకము దెచ్చుకొనుడు.) అధికము అన్యత్ర విస్తరించెదము॥౫-౬॥

శ్లో॥ ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః ।
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేదమిమం శృణు॥ ౭

—♦ భాష్యమ్ ♦—

నను తత్ర న కేవలా శ్రద్ధైవ త్రివిధా కింతు సర్వ సాధారణ్యేనాహారోపి త్రివిధ ఇత్యాహ। ఆహార స్త్వితి। తత్త్రైవం సతి సర్వస్య జనస్యాహారోపి మితోహితః ప్రియశ్చ సాత్వికాది భేదేన త్రివిధో భవతి తథైవ యజ్ఞో దానం తపశ్చాపి త్రివిధ మితి తేషామపీమం త్రివిధం భేదం శృణ్విత్యర్థః

—♦ లఘుటిప్పణీ ♦—

ఆహారోపీతి॥ అతఏవ తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంత యజ్ఞేన దానేన తపసా నాశకేనేతి మంత్రే త్యాశకో భోక్తా యస్తు బ్రహ్మాహుతిం పంచప్రాణాహుతించ కృత్వా భుంక్తే సచానాశకో యత స్తత్ర దేవఏవ భుంక్తే స్వయంతు తపశ్చరతీతి భోక్తు రనాశకత్వం స్ఫుటీకృతమితి తత్రైవంసతీ త్యాదినా వధార్యమ్॥ ౭॥

## —♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ! ఒక్క శ్రద్ధయే మూడువిధములు గాదు. మరేమి యనగా ఆహారమున్ను మూడు విధములని చెప్పుచున్నాడు। సర్వజనులకు ఆహారము సాత్వికాది భేదముచేతను మితము హితము - ప్రియము, అని మూడు విధము లగుచున్నది, అటులే యజ్ఞము దానము తపస్సు మూడువిధములు. వానిభేదమును నుడివెద నాలింపుము. (వేదా నువచనముచె బ్రాహ్మణులు యజ్ఞము చేతను దానము చేతను తపస్సుచేతను అనాశకత్వముచేతను పరమాత్మను తెలియ నిశ్చయించు చున్నారు. ఆశకుడు। భోక్త। యెవడు బ్రహ్మహుతిని పంచ ప్రాణాహుతులను చేసి భుజించు చున్నాడో వాడు అనాశకుడు (యేమియు భక్షించనివాడు) వాడు భుజించునది దేవుడే భుజించు చున్నాడనియు తాను తపము జేయు చున్నాడనిన్ని భోక్తకు అనాశకత్వము స్ఫుటము చేయ బడినది॥ ౭॥

శ్లో॥ ఆయు స్సత్వ బలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనాః ।
రస్యా స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారా స్సాత్విక ప్రియాః॥

## —♦ భా ష్య మ్ ♦—

ఏవం తత్రాహారాదీనామపి పునః ప్రత్యేకం త్రివిధ భేదేనాహ। ఆయురితి! తత్రాయు శ్చిరజీవనం సత్వం చిత్త స్థైర్యం బలం శరీర మారోగ్యం వ్యాధ్యభావత్వ మిత్యైతైరిహా ముత్ర సుఖే ప్రీతిశ్చే త్యేతేషాం వివర్ధనా రస్యాః స్నిగ్ధా స్థిరాః స్థిరకాలసాయిత్వేన హృద్యాశ్చే త్యాహారాః సాత్విక ప్రియా భవంతీతి భావః॥ ౮॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

అందు ఆహారాదులకును తిరిగి ఒక్కొకదానికి మూడేసి భేదములను చెప్పుచున్నాడు. ఆయువు చిరకాలము జీవించుట। సత్వము, చిత్తస్థైర్యము బలము శక్తి, ఆరోగ్యము వ్యాధిలేకుండుట, వీట్లచేతను ఇహలోక పరలోక సుఖ ప్రీతిన్ని గలుగును. వీట్లనువృద్ధి నొందించునవియు చమురుగలవి, మృదువైనవి, స్థిరములైనవి. చిత్తమున కిష్టమైనవియు నైన యాహారములుసాత్విక గుణములు గలవారికి ప్రియములు॥ ౮॥

శ్లో॥ కట్వమ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః।
ఆహారా రాజస స్యేష్టా దుఃఖ శోక భయ ప్రదాః॥ ౯

—♦ భాష్యమ్ ♦—

ఏవం రాజస భేదానప్యాహ। కట్వామ్లేతి॥ తత్ర తావత్కట్వమ్లాదయ స్త్వాహారా రాజసస్యేష్టా స్తేచేహాముత్ర దుఃఖశోక ప్రదాశ్చే త్యర్థః॥ ౯॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఈప్రకారము రాజస భేదములనున్నూ చెప్పుచున్నాడు. మిగుల చేదు, పులుసు ఉప్పు, వేడి, తీక్ష్ణము, మోటు, విదాహము గల యాహారములు రాజసులకు ప్రియములు। ఇవి ఇహపరముల యందు దుఃఖ శోకముల నిచ్చునవి॥ ౯॥

శ్లో॥ యాత యామం గతరసం పూతి పర్యుషితంచ యత్
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామస ప్రియమ్॥ ౧౦॥

—♦ భా ష్య మ్ ♦—

ఎవమేవ తామసా నప్యాహ। యాతయామమితి। తత్ర తావ ద్యామమధ్యే నభోక్తవ్యం యామద్వయం నలంఘయే దిత్యాద్యాయుర్వేద విరుద్ధం యాత యామ మిత్యర్థః। తథా గతరసం సముద్ధృత సారం పూతి మద్దుర్గంధం పర్యుషితంచ యదిత్యర్థః। ఏవముచ్ఛిష్టం గురోరన్యత్ర భుక్తావశేష మమేధ్యం యజ్ఞానర్హం మాంసాది భోజనం చ తామస ప్రియ మిత్యర్థః॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

గురోరన్యత్రేతి॥ అతఏవస్కాందే, నారదోహి పురా భ్రాంత్యా కిరాతం గురుమావహం 'సనత్కుమారతః పశ్చా చ్ఛైవీం దీక్షాం సమాచరద' త్యాద్యధిక మన్యత్ర ద్రష్టవ్యమ్॥ ౧౦॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఈ ప్రకారమే తామస పదార్థముల నున్నూ చెప్పుచున్నాడు. యామమధ్యయందు భుజించగూడదు. రెండు యామములు దాటగూడదని ఆయుర్వేద విరుద్ధముగా జాముక్రిందట పచనము చేసినవిన్నీ సారము లేని విన్నీ దుర్గంధములు, నిలువపదార్థములు, గురువుగాక ఇతరుల భుక్తావశేషములునూ అపవిత్రమైన అనగా తినరాని మాంసాది పదార్థములు. తామస గుణము గలవారికి ప్రియములు (నారదుడు పూర్వమందు భ్రాంతిచేత కిరాతుని గురువుగా చేసుకుని తెలిసిన తర్వాత సనత్కుమారుని యొద్ద శైవదీక్ష నొందెనని గలదు.) అధికము మరియొక్క చోట చూచుకొనవలయును॥౧౦॥

శ్లో॥ అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో యఇజ్యతే।
యష్టవ్యమేవేతి మనస్సమాధాయ ససాత్త్వికః॥ ౧౧

—♦ భాష్యమ్ ♦—

తదిదానీం క్రమప్రాప్తేషు త్రివిధం యజ్ఞమప్యాహ । అఫలేతి॥ తత్ర తావదఫలాకాంక్షిభి స్త్వంతఃకరణ శుద్ధ్యర్థ తయా విధిదృష్టః శ్రుతిసిద్ధో యజ్ఞోయఇజ్యతే తథా తచ్ఛుద్ధ్యుత్తరమపి యష్టవ్యాం యజే దేవేతి మనస్సమాధాయ యః కురుతే ససాత్త్విక ఇత్యర్థః॥౧౧॥

—♦ లఘుటిప్పణీ ♦—

శ్రుతిసిద్ధఇతి॥ తద్యథా 'బాధయా రహితా గావో యత్ర సంతి మహీతలె స్త్రియ స్సంతిహి సుశ్రీకాః పాతివ్రత్య పరాయణాః । విధి యజ్ఞాః ప్రవర్తంతే పృథివ్యాంబహు దక్షిణాః । నిరాబాధం తపశ్శశ్వ ద్యత్ర చాస్తి తపస్వినాం । నిష్పత్త్యూహం పఠంత్యేవ సాంగా న్వేదాన్ ద్విజోత్తమాః । మహీపాలాః ప్రజా యత్ర ధర్మశీలా బభూవిరే' ఇత్యాది స్మృత్యా విధిదృష్ట శ్రుతిసిద్ధశ్చ యత్ర యజ్ఞః సఏవ దేశో వా గ్రామోవా మమహ్యేవా సాత్త్వికో భవతీతి భావః॥ ౧౧॥

—♦ ఆన్ధ్రతాత్పర్యము ♦—

ఇప్పుడు క్రమముగా వచ్చెడి త్రివిధ యజ్ఞములను చెప్పుచున్నాడు. ఫలాపేక్ష లేనివారిచే అంతఃకరణ శుద్ధి నిమిత్తము వేదచోదితమై విధి దృష్టమైన యేయాగము చేయబడు చున్నదో అంతఃకరణ శుద్ధి గలిగిన మీదటనున్నూ మనము యజ్ఞమే చేయవలయును ఫలాపేక్షులము గా కూడదని చిత్తమును సమాధాన పరచుకొని చెయ్యబడునో అది సాత్త్విక యజ్ఞము (భూతలమందు గోవులు బాధలేకుండగా యెక్కడ నుంటూ న్నవో, స్త్రీలు శోభావంతులై పాతివ్రత్య పరాయణులై యెక్కడ

నుంటున్నారో పృధివియందు బహుదక్షిణలతో విధియజ్ఞములు యెక్కడ జరుగు చున్నవో తపశ్శాలుర తపస్సులు మాటిమాటికి బాధలేకుండా యెక్కడగలవో, బ్రాహ్మణులు నిర్విఘ్నముగా సాంగవేదములను యెక్కడ పఠించు చున్నారో రాజులును ప్రజలును యెక్కడ ధర్మశీలురై యుండిరో ఇటువంటి స్మృత్యాదులచె విధిదృష్టము శ్రుతసిద్ధము నైన యజ్ఞము యెక్కడనో ఆదేశము గాని గ్రామము గాని మనుష్యుడు గాని సాత్వికు డగుచున్నాడని భావము॥ ౧౧॥

శ్లో॥ అభిసంధాయతు ఫలం దంభార్ధ మపి చైవ యత్ ।
ఇజ్యతే భరతశ్రేష్ఠ తంయజ్ఞం విద్ధి రాజసమ్॥　　　౧౨

## —♦ భా ష్య మ్ ♦—

ఏవం రాజసమపి యజ్ఞమాహ । అభిసంధాయేతి॥ తత్త్రైవం సతీ హాముత్రస్థం ఫల మభిసంధాయతు యత్క్రియతే తథైవ దంభోనామ లోకే ధార్మికత్వ ఖ్యాపనార్ధమపి యదిజ్యత్వేవ క్రియతే తదపి హేభరతశ్రేష్ఠ! తంయజ్ఞం రాజసం విద్ధీత్యర్థః॥౧౨॥

## —♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

ఈప్రకారమే రాజస యజ్ఞమునున్నూ చెప్పుచున్నాడు. ఓ భరతశ్రేష్ఠా! ఇహపరముల యందలి ఫలమును గోరిన్నిలోకమందు ధార్మికుడని పించుకొనుట కొరకున్నూ చేయబడు యాగము రాజసమని తెలియుము॥

శ్లో॥ విధిహీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణం
శ్రద్ధా విరహితం యజ్ఞం తామసం పరిచక్షతే॥　　　౧౩

—♦ భా ష్య మ్ ♦—

ఏవమేవ ప్రకారాంతరేణ తామసమప్యాహ । విధిహీన మితి॥ తథాచేహ విధిహీనం నామ. శ్రుతి స్మృతి విరుద్ధం తథా నసృష్టం త్యక్త మన్నం యస్మిన్నితి వైశ్వదేవాది రహితం తథా మంత్రహీనం స్వరతో వర్ణతోవా మిథ్యాప్రయుక్తం సర్వథా తద్రహితంవా తథైవా దక్షిణం కారయిత్రే దక్షిణా రహితం శ్రద్ధా విరహితంచ తామసం యజ్ఞమితి పరిచక్షత ఇత్యర్థః॥౧౩॥

—♦ ఆ న్ధ్రి తా త్ప ర్య ము ♦—

ఈప్రకారమే ప్రకారాంతరముచే తామస యజ్ఞమునున్నూ చెప్పుచున్నాడు. శృతిస్మృతులకు విరుద్ధమైనది వైశ్వదేవాదికము లేనిది స్వర వర్ణలోపములచె అబద్ధమైనమంత్రములచే జేయబడునది లేక వేదమంత్రమే లేకుండగా జేయునది యాగము చేయించిన అధ్వర్యునకు దక్షిణలేనిది శ్రద్ధ లేనిదిన్నీ తామస యజ్ఞమని చెప్పుచున్నారు॥౧౩॥

శ్లో॥ దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవం
బ్రహ్మచర్య మహింసాచ శారీరం తపఉచ్యతే॥ ౧౪

—♦ భా ష్య మ్ ♦—

ఇదానీంతు క్రమప్రాప్తేషు సామాన్యత స్తపః స్వరూప మపి త్రిభి ర్శ్లోకై రాహ । దేవేతి॥ తత్ర తావద్ధరే మధ్యగతే సూర్య గణేశ గిరిజా చ్యుతా నగ్ని నైరుత్య వాయవ్యే శానేషు పరిపూజయేదిత్యాది రీత్యా పూజార్హా దేవా స్తథా

ద్విజా బ్రాహ్మణా స్తత్రాపి గురవో జ్ఞానతః కర్మణావా గరిష్ఠా స్తత్రాపి ప్రాజ్ఞా ధర్మా ధర్మ వివేకశాలినః సర్వ సంశయ నివర్తకా స్తేషాం పూజనం యథాశాస్త్రంతో మృజ్జ లాభ్యాం తేషా మవసేచనం తేష్వార్జవంచ యుక్తమిత్యర్థః। ఏవం బ్రహ్మచర్యమపి శ్రుతిస్మృతి విరుద్ధత్వేన మైథున నివృత్తి స్తథైవా హింసాతు శాస్త్రవిరుద్ధప్రాణి పీడనాభావ శ్చేత్యాది శారీరం తప ఉచ్యతే శ్రుతి స్మృతి మర్యాదమే,త్యవధార్యమ్॥

—♦ లఘుటిప్పణీ ♦—

శాస్త్రతఇతి॥తద్యథా 'యైస్స ఎ్రప్టాని చాన్నాని క్షత్రియా నావ భుంజతే నవైశ్యా శ్చాపి చాన్యేచ కుతోన్యే బ్రాహ్మణోత్తమః యోవై సకలగోత్రాణాం మూలభూతో ద్విజోభవేత్ తత్రాపి శివపూజాయాం నిర తా బ్రాహ్మణోత్తమాః యతోవై క్షత్రియా స్సర్వే గోత్రిణో స్యేపి చానుగా ఇత్యాది శాస్త్రత ఇత్యర్థః॥౧౪॥

—♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

ఇప్పుడు క్రమముగా వచ్చినవాటిలో సామాన్యముగా తపస్సు యొక్క స్వరూపమునున్నూ మూడు భేదములతో చెప్పుచున్నాడు. శివుడు మధ్యను సూర్యుడు అగ్ని దిక్కున గణపతి నైఋతిదిశను పార్వతి వాయుకోణ మందును విష్ణు ఈశాన కోణమందును పూజ్యులైనపంచా యతన పూజాప్రకారము దేవతలను ద్విజులనుఅందులోను గురువులను అం దును జ్ఞానముచె కర్మచే గరిష్ఠులను అందును ధర్మాధర్మములను వివేకము చేయువారు సర్వసంశయములను పోగొట్టువారు అట్టివారియొక్క పూజయు మృజ్జలాదులచె వారికి శౌచమును వారియందు ఋజుత్వమున్నూ శృతి స్మృతి విరుద్ధమైన మైథున నివృత్తి గల బ్రహ్మచర్యమును శాస్త్ర

విరుద్ధమైన ప్రాణిపీడ లేని అహింసయు ఇత్యాదులు శృతి స్మృతి మర్యాదచే శారీర తపస్సని చెప్పబడిన దని తెలియవలెను. వైశ్యులు ముట్టిన యన్నమును క్షత్రియులు భుజింపరు. శూద్రులు ముట్టిన యన్నమును వైశ్యులుభుజింపరు, వీరలు ముట్టినయన్నమును బ్రాహ్మణుడెట్లుభుజించును? బ్రాహ్మణుడు ముట్టిన యన్నమును శివపూజా నిష్ఠగలవారు భుజింపరు. గాన శివపూజ చేయువారు బ్రాహ్మణులలో నుత్తమ బ్రాహ్మణులు గను కనే బ్రాహ్మణ క్షత్రియాదులు అన్ని గోత్రములవారు వీరికి ననుచరులై యుందురని శాస్త్రములందు నూ గలదని తెలియవలెను. ప్రస్తుతమున బ్రాహ్మణులలో ననేక తెగలు బయలుదేరి పంచద్రావిడ పంచగౌడులలో నవాంతర భేదములు సహస్రము గలవు. హరికృష్ణుడు బృహజ్యోతిషార్ణవ మను గ్రంధమునందు బ్రాహ్మణ వర్ణోత్పత్తి మార్తాండమను నొక భాగమును వేరుగా ముద్రించెను. అందుగాని మాచే రచింపబడిన బ్రాహ్మణ స్వరూ కధనమందు గాని దిలకింప వలయు. హరికృష్ణుని కాలమునకున్న బ్రాహ్మణ భేదములను వ్రాసెను. ఇప్పుడు అంతరాంతర జాతు లసంఖ్యాకములైనవి. అజ్ఞానము వృద్ధియైన కొలది భేదములు పెరుగుచునేయుండును. 'సర్వత్రోత్సృజ భేదజ్ఞానం' అను స్మృతిసత్యమయినప్పుడు యీ భేదములు నశించిపోవును॥౧౪॥

శ్లో॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితంచ యత్ ।
స్వాధ్యాయా భ్యాసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥

—♦ భా ష్య మ్ ♦—

ఏవం ప్రకారాంత రేణాపి తపశ్చరణ మీవాహ॥ అనుద్వేగేతి॥ తత్రి తావ చ్ఛాస్త్రి విరుద్ధత్వేనా నుద్వేగకరం వాక్యం ప్రిమాణ మూలత్వేన చ సత్యం తధా శ్రోతు స్తత్కాలా వచ్ఛేదేన సుఖకరత్వా త్ప్రియం పరిణామేపి

హితంచ యత్తథా స్వాధ్యాయో గాయత్ర్యాది వేద స్తస్యా భ్యసనం చేతి వాంగ్మయం తప ఉచ్యత ఇత్యర్థః॥ ౧౫॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

స్వాధ్యాయఇతి॥ తత్రతావత్సకలవేదమూలకత్వేన విప్రోవృక్ష స్తత్రమూలంచ సంధ్యేత్యాదినా తస్యా ఆ వశ్యకత్వాదితి భావః॥౧౫॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

మరియొక ప్రకారమైన తపస్సును చెప్పుచున్నాడు. శాస్త్ర విరోధము లేనందున అనుద్వేగ కరములును, ప్రమాణ మూలకమగుటచే సత్యములును, ఆలకించు సమయమున ప్రియమును, పరిపక్వమందును హితవునునగు వాక్యమును పలుకుటయు, గాయత్రి మొదలు వేదాభ్యాసమున్ను, వాగ్రూపమయిన తపస్సనబడును. బ్రాహ్మణుడు సకల వేదములకు మూల మగుటచే వృక్షమువంటి వాడు. సంధ్యా మొదలగునవి యావశ్యకములు గాన వేళ్ళుగా పరిగణింప బడుచున్నవి. శ్లో॥ ఉచ్చైర్గతి ర్జగతి సిద్ధ్యతి ధర్మత శ్చే త్తస్యప్రమాచ వచనైః కృతకేతరై శ్చేత్ । తేషాం ప్రకాశన దశాపి మహీసురై శ్చే త్తానంతరేణ నిపతే త్క్వను మత్ప్రణామః॥ ఇట్లు చంపూరామాయణము॥౧౫॥

శ్లో॥ మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మ వినిగ్రహః ।
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే॥　　౧౬

—♦ భా ష్య మ్ ♦—

ఏవం ప్రకారాంతరేణా ప్యాహ—మనఇతి॥ తత్ర తావ త్కదాచి చ్చిద్బ్రచితానందా భిషి క్తత్వేన మనః ప్రసాదః ప్రసన్నతా ఏవం శాస్త్ర సజ్జన సంపర్కే త్యాదా వంతిమ

భూమికా ప్రాప్తత్వేన సౌమ్యత్వం । ఏవం వాచా మౌనంతు బాలానాం సతాం సహజ సంజ్ఞిత మిత్యతోఽ క్తంచ మౌనమ్। ఏవమేవాత్మనో మనసోఽపి విశేషేణ సర్వవృత్తి నిరోధ స్తేన త్వసం ప్రజ్ఞాతః సమాధి ర్భవతీతి భావస్య హృదయస్య సం శుద్ధిరితి తపోమానస ముచ్యత ఇత్యర్థః॥ ౧౬॥

—♦ ల ఘు టి ప్ప ణీ. ♦—

అసంప్రజ్ఞాతఇతి॥ తద్యథా, పశ్యేత్తు చిన్మయం బ్రహ్మ జగ చ్చాపి నకించన । నతతో న్యత్పరంపశ్యే త్వసంప్రజ్ఞాత ఇష్యత ఇత్యాది స్మృత్యా వ్యవధార్యమిత్యధికం సర్వశాస్త్రార్థ దర్శనే చిదంబర భాష్యేచ తత్ప్రదీపే ద్రష్టవ్యమ్॥ ౧౬॥

—♦ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ♦—

మరియొక ప్రకారముగా నున్నూ చెప్పుచున్నాడు । ఒకానొక ప్పుడు ఆత్మసాక్షాత్కారము వల్లనైన ఆనంద జలముచే నభిషిక్తు డగుట వలన చిత్తము స్థిమితముగా నుండుట, శాస్త్రాభ్యాసము మొదలుగా గల సప్త భూమికలలో అంతిమ భూమిక యందుండుటచే సౌమ్యత్వ మున్నూ । బాలురకున్నూ సత్పురుషులకున్నూ వాఙ్మౌనము సహజమని చెప్పినట్లు మౌనమున్నూ ఆత్మయందు మనసును జేర్చి సర్వవిధములైన వృత్తులను నిరోధించుటచె అసంప్రజ్ఞాత సమాధి గలిగినందు వలన భావ మనగా హృదయము యొక్క సంశుద్ధియును ఇదియంతయు మానసిక తపస్సని చెప్పబడునని యర్థము, (అసంప్రజ్ఞాత మనగా చిద్రూపమైన బ్రహ్మమును జూచును జగత్తును (దేహేంద్రియాదులను) బొత్తిగా చూడడు. బ్రహ్మ భిన్నమైన వస్తువును జూడడు. ఇది యసంప్రజ్ఞాత

సమాధి యనదగునని సర్వశాస్త్రార్థ దర్శనము చిదంబర భాష్యము దాని ప్రదీపమందును చూడతగినది॥ ౧౬॥

శ్లో॥ శ్రద్ధయా పరయా తప్తం తప స్తస్త్రివిధం నరైః
అఫలా కాంక్షిభి ర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే॥　　౧౭

—♦ భా ష్య మ్ ♦—

అథ శరీరాది భేదేన తపస్త్రైవిధ్యస్యో క్తస్య పున స్త్రైవిధ్యం తు త్రిగుణ భేదేన దర్శయతి॥ శ్రద్ధయేతి॥ తత్ర తావ చ్ఛ్రద్ధయా స్తిక్య బుద్ధ్యా పరయా ప్రామాణ్యాశంకా శూన్యయా తప స్తప్తం జనైః ప్రశస్తైః కృత మిత్యర్థః। ఏవ మఫలాకాంక్షిభి ర్నామ ఫలాభిసంధి రహితై ర్యుక్తైః సమాహితైః సావధాన చిత్తైశ్చ యత్కృతం కర్మ తత్సాత్త్వికం శిష్టా మహాంతః పరిచక్షత ఇత్యర్థః॥ ౧౭॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

యత్కృతం కర్మేతి॥ యస్మిన్ కృతే నకించి త్కర్మ క్రియతే తస్మై మన శ్శివ సంకల్పమ స్త్వి త్యాది శ్రుతివేద్య మిత్యర్థః॥౧౭॥

—♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఈ ప్రకారము కాయిక వాచిక తపస్సులను చెప్పి మళ్లీ సత్వ రజ స్తమో గుణ భేదములచే మూడు విధములుగా తపస్సులను జూపెట్టు చున్నాడు. ఆ స్తిక్యబుద్ధి చే అప్రమాణము, శంకయు లేనట్టి శ్రద్ధతోటి నరులచే ప్రశ స్తముగా జేయబడు తపస్సు మూడువిధములు. ఫలాపేక్ష లేక సావధాన చిత్తులచేతను సమాహిత చిత్తులచేతను చేయబడు తపస్సు సాత్త్విక తపస్సని శిష్టులు చెప్పుచున్నారు. (యేకర్మచేసిన మరియొక

కర్మ చేయ నక్కర లేదో) యని చెప్పిన (శుతి చోదిత కర్మ నిష్కామ కర్మ యని తాత్పర్యము||౧౭||

శ్లో|| సత్కార మాన పూజార్థం తపో దంభేన చైవయత్
(క్రియతే తదిహ (ప్రోక్తం రాజసం చల మధ్రువమ్|| ౧౮

—♦ భా ష్య మ్ ♦—

ఏవమిహ తపస్త్రైవిధ్యేషు రాజస మప్యాహ । సత్కా రేతి|| తత్త్రైవం సతి జనైః సత్కారార్థం స్వమానేన పూజార్థంచ దంభేన చ యదిహ క్రియతే తద్రాజసం ఫలాంశైశ్చ తచ్చలమధ్రువం చేతి బోధ్యమ్||౧౮||

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

బోధ్యమిత్|| అకరణా త్కారణం (శ్రేయ స్తతో ప్యధిక తరం య దితి న్యాయేన బోధ్య మిత్యర్థః||౧౮||

—♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

మూడు విధములైన తపస్సుల యందురాజస తపస్సునున్నూ చెప్పుచున్నాడు.జనులచే సత్కారము కొరకును గౌరవముకొరకును పూజ కొరకును డాంబికము చే యేతపము చాయబడుచున్నదో అది రాజస తపస్సు. ఫలాంశములచే నయ్యది నియామకము లేనిదిన్ని క్షణికము నగును. (కర్మ చేయకుండుట కన్న చేయుట అంతకంటె మంచిది) యనే న్యాయముచే తెలియ దగినది యనియర్థము||౧౮||

శ్లో|| మూఢ (గ్రాహేణా త్మనో యత్పీడయా (క్రియతే తపః।
పరస్యో త్సాదనార్థంవా తత్తామస ముదాహృతమ్|| ౧౯

—◆ భా ష్య మ్ ◆—

ఏవ ముక్తేష్వేవ తపఃస్సు తామస మప్యాహ। మూఢేతి ఏవంసతి, మూఢ గురూపదేశేన మూఢగ్రాహేణ మూఢ గురూపదిష్టేనాత్మనో జంతుమాత్రస్య పీడయా యత్తపః క్రియతే యచ్చ పరస్య శత్రో రన్యాయేనో త్సాదనార్థ మభిచారేణ క్రియతే తదపి తామసం తప ఉదాహృత మిత్యర్థః॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

మూఢగురూపదిష్టేనేతి। తద్యథా. 'ధర్మహీనో గురుస్త్యాజ్యో మిథ్యావాదీ విడంబకః। స్వవిశ్రాంతిం నజానాతి పరేషాం సకరోతికిం' మిత్యేవ నిషేధే పర్యవసితే జన్మనా కర్మణా వాపి ప్రసిద్ధం బ్రహ్మణోత్తమం వ్రతైః పాశుపతై ర్యుక్తం గురుం కుర్యా ద్వివేకిత ఇత్యాద్యవధార్యమ్॥౧౯॥

—◆ ఆ న్ధ్ర తా త్ప ర్య ము ◆—

ఇదివరకు చెప్పిన తపస్సులలో తామస తపస్సును చెప్పుచున్నాడు. మూఢుడయిన గురువుచే నుపదేశింప బడిన వాడు మూఢ గురూపదిష్టుడు, అట్టివానిచే జంతు మాత్రమునకు పీడతోటి యేతపము చాయబడుచున్నదో మరిన్ని యేతపము అన్యాయముగా శత్రూచ్చాటన మారణార్థముగా చేయబడు చున్నదో అదిన్ని తామస తపస్సు. మూఢగురువనగా ధర్మహీనుడు, మిథ్యావాది, డంబాచారి యైన గురువును విడువ వలయును. తన విశ్రాంతిని తాను యెరుగడు. పరులకెట్లు విశ్రాంతి నివ్వగలడు? ఇవ్వలేడు గనుక విడువ వలయును. మూఢుని గురువుగా చెయ్యరాదు. మరెట్టివానిని చెయ్య వలయు నంటే జన్మచేత గాని కర్మచేత గాని ప్రసిద్ధుడైనట్టిన్ని పాశుపత వ్రతములతో గూడిన బ్రాహ్మణోత్తముని యెరిగి గురువునుగా చేసుకొన వలయును॥౧౯॥

శ్లో॥ దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే ।
దేశే కాలేచ పాత్రేచ తద్దానం సాత్వికం స్మృతమ్॥ ౨౦

—◆ భా ష్య మ్ ◆—

ఇదానీంతు పూర్వోక్త క్రమప్రాప్తస్య దానస్యాపి త్రైవిధ్యమాహ। దాతవ్యమితి॥ తత్రితావ, దభిగమ్యోత్తమం దాన మాహూయైవతు మధ్యమం అధమం యాచమానాయ సేవాదానంతు నిష్ఫల మిత్యాది స్మృతి న్యాయేన యద్దానం సత్పాత్రిదానం తదప్య నుపకారిణే యద్దానం తదపి దేశే కాలే పాత్రేచ యత్తదేవ సాత్వికం స్మృత మిత్యర్థః॥ ౨౦॥

—◆ ఆం ధ్ర తా త్ప ర్య ము ◆—

ఇప్పుడు పూర్వోక్తక్రమముగా వచ్చినదానమున్ను మూడువిధము లని చెప్పుచున్నాడు. యెదురుగ వెళ్ళియిచ్చిన దానము ఉత్తమము. పిలచి యిచ్చిన దానముమధ్యమము. యాచించిన వానికిచ్చిన దానమధమము. సేవకునికిచ్చినదానము నిష్ఫలమను స్మృతినిబట్టి ఇయ్యవలయునని ఉద్దేశముతో నుపకారి గానివానికి దేశమును కాలమును పాత్రతను యెరిగి చేసిన దానము సాత్వికమని చెప్పబడినది॥ ౨౦॥

శ్లో॥ యత్తు ప్రత్యుప కారార్థం ఫలముద్దిశ్య వాపునః ।
దీయతేచ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్॥ ౨౧

—◆ భా ష్య మ్ ◆—

ఏవమిహ ప్రకారాంతరేణాప్యాహ। యత్త్వితి॥ తత్రైవం సతి। యత్తు ప్రత్యుపకారార్థం కాలాంతరే మాముపకర్ష్యతీ

త్యైవ మర్థం స్వర్గాది ఫలముద్దిశ్య వా పరిక్లిష్టంవా కథమేతావ
ద త్తమితి పశ్చాత్తాప కరంవా యద్దీయతే తద్దానం రాజసం
స్మృత మిత్యర్థః॥ ౨౧॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

మరియొక ప్రకారముగానున్న చెప్పుచున్నాడు. మరియొకప్పుడు నాకుపకారము చేయగలడని ప్రత్యుపకారము నిమిత్తముగాని స్వర్గాది ఫలము నుద్దేశించి గాని చిత్తమునకు కష్టము గలుగునట్లు ఇంతమాత్రమిచ్చి నాడేమి యని పశ్చాత్తాప కరమగునట్లుగా గాని యేదాన మివ్వబడు చున్నదో అది రాజస దానమని చెప్పబడును॥ ౨౧॥

శ్లో॥ అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే
అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్॥ ౨౨

—♦ భాష్యమ్ ♦—

ఏవమిహ ప్రకారాంతరేణ తామస మప్యాహ-అదేశఇతి॥ ఏవం తదూర్ధ్వదేశే పాపకృత్తమత్వ హేతావశుచి స్థానే తథై వాకాలే పుణ్యహేతుత్వేనా ప్రసిద్ధె యస్మిన్ కస్మింశ్చిత్కాలే ఽశౌచకాలేవా విద్యా తపో రహితేభ్యో బ్రాహ్మణేభ్య స్తథైవా సత్కృత మవజ్ఞాతంచ యద్దానం తత్తామస ముదా హృత మిత్యర్థః॥ ౨౨॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

మరియొక ప్రకారముగా తామస దానమునున్న చెప్పుచున్నాడు. మహాపాపము చేయుటకు హేతువైన అశుచి స్థానమందు గాని, పుణ్య హేతువు గాకపోవుటచే నప్రసిద్ధమైన యేదైన నొక కాలమందు గాని,

ఆశౌచ కాలమందైనా విద్యా తపస్సులు లేని బ్రాహ్మణుల కొరకు సలి పిన దానము సత్కారములేని దానము. అవమానముతో నిచ్చిన దానము ఇవి తామస దానము లందురు॥౨౨॥

శ్లో॥ ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధ స్మృతః
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా॥౨౩॥

—♦ భా ష్య మ్ ♦—

అథేహ పూర్వోక్తానాం యజ్ఞ తపో దానానాం దృష్టాదృష్టార్థానాం ఫలవైగుణ్య పరిహారాయ త్వాహ—ఓం తత్సదితి । తత్రైవం సతీహ బ్రహ్మణః పరబ్రహ్మణః సదా శివస్యా వినాశిన స్త్రివిధోహి ఓం త త్స దితి నిర్దేశోనామ వాచ్య వాచకత్వేన స్మృతః ప్రసిద్ధ ఇత్యర్థః । యతో బ్రాహ్మ ణోఽస్య ముఖ మాసీ దిత్యాది శ్రుత్యా, ఏవం బ్రహ్మణో స్య ముఖా జ్జాతో వేదో ఽగ్ని ర్బ్రాహ్మణః ఖల్వి త్యాది స్మృత్యాచ ప్రాక్తనత్వేన బ్రాహ్మణాదీనాం యజ్ఞమూలత్వం స్ఫుటీ కృతం॥౨౩॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నన్విహ సత్వ రజస్తమో భేదేన తత్త జ్ఞాతి భేదేన శ్రద్ధా భేదేనచ ధర్మా దర్శితా స్తథాపి తేషాం స్వస్వ జాత్యాను గుణ్యేన కర్మారంభే ష్వాదౌకిం వక్తవ్యం యేన తత్కర్మఫలం స్యాది త్యాహ । అథేతి । తథాచ సర్వత్ర సంకల్పా దావోం తత్స దద్యనమః పురాణ పురు షోత్తమేత్యాది రీత్యైవ పఠేదితి భావః । వాచ్య వాచక త్వేనేతి । తత్రి

తావ ద్వాచ్య స్సదాశివో వాచక శ్చ విష్ణు స్తత్త్వేనే త్యర్థః । వేదో నారాయణ స్సాక్షా చ్ఛివే నేద్ధః ప్రకాశిత ఇత్యాది స్మృత్యంతరా దితి బోధ్యమ్॥ ౨౩॥

—• ఆంధ్ర తాత్పర్యము •—

పూర్వోక్తములైన యజ్ఞములు తపస్సులు దానములలో కొన్ని ప్రయోజకములు కొన్ని అప్రయోజకములు । అందు ఫలవిముఖతను పరిహరించుచు చెప్పుచున్నాడు । అవినాశి పరబ్రహ్మము నైన సదాశివునికి ఓం, తత్ - సత్ - అని మూడు విధముల నిర్దేశములు, అవి వాచ్యములని వాచకములని ప్రసిద్ధములైనవి. బ్రాహ్మణుడు బ్రహ్మయొక్క ముఖము నందు బుట్టెనను శ్రుతి చేతనున్నూ । వేదము అగ్ని, బ్రాహ్మణుడు బ్రహ్మ ముఖము వలన బుట్టిరను స్మృతి చేతనున్నూ సృష్ట్యాదిని బ్రహ్మచే నిర్మింప బడినందున బ్రాహ్మణ అగ్ని, వేదములు-యజ్ఞమునకు కారణము లని స్ఫుటమైనది । (ఓయీ సత్వ రజస్తమో భేదము చేతనున్నూ ఆయా జాతి భేదము చేతనున్నూ శ్రద్ధా భేదము చేతనున్నూ ధర్మములు చూపించ బడినవి. అయినప్పటికి అవి తమతమ జాతికనుకూలముగా కర్మారంభముల యందు మొదట యేమిచెప్పతగ్గది. దేనిచే నాకర్మ సఫల మగునంటె చెప్పుచున్నాడు । అన్ని స్థలముల యందు సంకల్పారంభమున ఓం-తత్ - సత్ - పురాణ పురుషోత్తమ యనురీతిచే పఠించ వలయునని భావము। వాచ్య వాచక మూలనగా, వాచ్యము సదాశివుడు । వాచకము విష్ణువు ఇదియతత్వము వేదము నారాయణ స్వరూపము - అది సాక్షాత్తు శివుని వలన బుట్టినదై ప్రకాశించు చున్నదని స్మృతులు గలవని తెలియ దగి నది॥ ౨౩॥

శ్లో॥ తస్మా దో మిత్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః ।
ప్రవర్తంతే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్॥ ౨౪॥

—♦ భా ష్య మ్ ♦—

తత్రయస్మాదేవంతస్మా దుపసంహరతి।తస్మాదితితత్ర।తావన్మంత్రాదిత్వేన సర్వత్రోమిత్యుచ్చార్యైవ యజ్ఞ దాన తపశ్చర్యా ది క్రియా స్తత్తద్విధానోక్తా బ్రహ్మవాదినాం సతతం ప్రవర్తంత ఇత్యవధార్యమ్॥ ౨౪॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఇట్లు యెందువల్లనో దానివలననె ఉప సంహరించు చున్నాడు. మంత్రముల ఆదియగుటచే అంతటను 'ఓం' అని ఉచ్చరించి పిదపబ్రహ్మవాదుల యొక్క ఆయావిధుల యందు చెప్పబడి నటుల యజ్ఞములు, దానములు, తపస్సులు మొదలయిన క్రియలు యెల్లపుడు విధ్యుక్తముగా వర్తించును॥౨౪॥

శ్లో॥ తదిత్యనభి సంధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః ।
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్ష కాంక్షిభిః॥ ౨౫॥

—♦ భా ష్య మ్ ♦—

ఏవమిహ పూర్వోక్తం తచ్ఛబ్దం వ్యాచష్టే-తదితి। చేతి। తత్రైవం సతి తత్త్వమసీ త్యాది వాక్యస్థేన తదిత్యనేనో ఫలక్షితం శివమద్వైతం తురీయం బ్రహ్మాభి సంధాయ యజ్ఞ తపో దానాది క్రియా మోక్ష ప్రభృతి కాంక్షిభిః క్రియంత ఇత్యర్థః॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

తత్త్వమసీతి తత్ర తావత్ తత్త్వమేవ త్వమేవ తదితి శ్రుత్యంతరాత్తచ్ఛబ్దేనలబ్ధోలక్ష్యో ఒఖండః పరాత్మా శివ స్త్వమసీత్యేవ శ్రుత్యర్థః॥

స్మృతిశ్చ దేహభావేన దాసోహం జీవభావే తదంశకః । స్వాత్మభావే తదేవాహ మితి జానీహి సత్తమే త్యవధార్యమ్॥౨౭॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

పూర్వోక్తమైన తచ్ఛబ్దమునకు వ్యాఖ్యానము చేయుచున్నాడు. తత్త్వమసి మొదలయిన వాక్యముల యందున్న 'తత్' అను పదముచె ఉపలక్షితమైన అద్వైతము తురీయము బ్రహ్మము నైన శివుని అనుసంధానము చేసి మోక్షమును గోరు వారిచే ఫలకాంక్షలేక బహువిధములయిన యజ్ఞములు, దానములు, తపస్సులు నొనర్ప బడుచుండును. (అదే నీవు నీవే ఆదియను శృతుల వలన తత్ అనగా అఖండ పరమాత్మమైన శివుడే నీవని శృత్యర్థము.) దేహభావనచే దాసుడను జీవభావనచే తత్పదార్థము యొక్క అంశగలవాడను. స్వాత్మభావనచే తత్ (అదే) నేను ఓరామా ఇట్లు తెలియుమని వశిష్ఠుడు రామున కుపదేశించెనని తెలియవలెను॥౨౭॥

శ్లో॥ సద్భావే సాధుభావేచ సదిత్యేత త్ప్రయుజ్యతే।
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే॥　　౨౬

—♦ భాష్యమ్ ♦—

ఏవమిహః పరమపి తృతీయం సచ్ఛబ్దం వ్యాచష్టేసద్భావఇతి॥ తథాచేహ సదేవ సత్యమితి। సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మేత్యాది శ్రుతివేద్యే సద్భావే సాధుభావే ప్రశస్తేచ కర్మణి హేపార్థ! సచ్ఛబ్దః ప్రయుజ్యత ఇత్యాశయః॥౨౬॥

—♦ లఘుటిప్పణీ ♦—

సాధుభావఇతి॥ తద్యథా 'సాధవో బ్రాహ్మణా శ్శాంతాః శివతత్త్వ పరాయణాః చరత్యఘం తేంగ సంగా త్తేష్వాస్తే హ్యఘభి చ్చివ ఇద్యవధేయమ్॥౨౬॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఈ ప్రకారము మరియొక మూడవదైన సచ్ఛబ్దమును వ్యాఖ్యానము చేయుచున్నాడు. ఓపార్థా! సత్తైసత్యమనిన్నీ సత్యమే బ్రహ్మమనిన్నీ శృతియందు తెలియదగిన సద్భావమందును సాధు భావమందును సత్కర్మయందును 'సత్' అను పద మొప్పునని యాశయము (సాధువులనగా శివతత్వపరాయణులై శాంతులైన బ్రాహ్మణులు సాధువులనబడుదురు. వారుదేహ సంయోగము వలన సంచరించు చున్నారు. వారల యందు పాపమును తొలగించు శివుడు ఉంటున్నాడని స్మృతి వలన నిశ్చయింప దగినది॥౨౬॥

శ్లో॥ యజ్ఞే తపసి దానేచ స్థితిః సదితి చోచ్యతే।
కర్మ చైవ తదర్థీయం సదిత్యేవా భిధీయతే॥ ౨౭

—♦ భాష్యమ్ ♦—

ఏవమిహ ప్రకారాంతరేణా ప్యాహ। యజ్ఞఇతి తత్ర తావ ద్యజ్ఞాదౌ సద్భావేన సదిత్యేత త్ప్రయుజ్యతే, ఏవం తదర్థీయం నామ తచ్ఛబ్దేన ప్రతిపాద్యో యః సదాశివ స్తదర్థం। తద్వై మనశ్శంభు పదారవిందయో రితి స్మృతి న్యాయేన యత్కిమపి కర్మ క్రియతే తదేత త్సదితి శబ్దేనాభిధీయత ఇత్యర్థః॥ ౨౭।

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

మరియొక ప్రకారముగానున్నూ చెప్పుచున్నాడు. యజ్ఞమునందును తపసునందును దానమందును ఉన్నట్టి స్థితిని 'సత్' అందురు. శంభు పదార

విందముల యందున్నదె మనస్సను స్మృతి న్యాయముచే సదాశివారాధన రూపమయిన కర్మను న్నూ సత్తనియే వచింతురు॥౨౭॥

శ్లో॥ అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చయత్ ।
అస దిత్యుచ్యతే పార్థ నచ తత్ప్రేత్య నో ఇహ॥　　౨౮

ఇతి శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే శ్రద్ధాత్రయ
విభాగయోగః సప్తదశమః

## —♦ భాష్యమ్ ♦—

తత్ర తావచ్ఛ్రద్ధా విరహితం సర్వం యజ్ఞాదికం కర్మ దక్షాది వన్నిష్ఫల మనర్థ ప్రదంచే త్యాహ। అశ్రద్ధయేతి॥ తత్రైవం సత్య శ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తంవా తథైవా న్యదపి యత్కృతం కర్మ హేపార్థ ! తదసదిత్యుచ్యతే తదిహ ప్రేత్యచ ఫలదం నభవతీతి భావః॥　　౨౮

ఇతి శ్రీ శ్వేతాచార్య గురుచరణ శిష్య భావ సమాసాదిత శైవసిద్ధాంత ప్రవర్తక శ్రీ శ్రీకంఠ శివాచార్య విరచితే తత్త్వైక దర్శన నామకే గీతాభాష్యే శ్రద్ధాత్రయ విభాగ యోగోనామ సప్తదశోధ్యాయః.

## —♦ లఘుటిప్పణీ ♦—

ఇతిశ్రీ శ్రీకంఠ శివాచార్య శిష్య విశ్వేశ్వర శివా
చార్య విరచితాయాం లఘుటిప్పణ్యాం
శ్రద్ధాత్రయ విభాగయోగః.

## —♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

శ్రద్ధలేక చేసిన హోమము. దానము, తపము, కర్మము దక్ష యజ్ఞమువలె నిష్ఫల మగుటయేగాక అనర్థమును గూర్చునవి. గనుక ఇది యెల్ల 'అసత్' అనినుడువం బడును. అది ఇహ పరముల రెంటను నుప యోగ పడదని భావము॥ ౨౮॥

ఇట్లు తత్త్వైక దర్శనమను శ్రీకంఠీయ గీతాభాష్యమునకు బోధా నంద మహర్షిచేరచింపబడిన భావబోధమను నాంధ్రి తాత్పర్యమున శ్రద్ధాత్రియ విభాగ యోగమను పదునేడవ అధ్యా యము సమాప్తము.

—

ఓమ్

# శ్రీమచ్ఛ్రీకంఠాచార్యకృతే

# శ్రీ భగవద్గీతాభాష్యే

## మోక్షసన్యాస యోగోనామ - అష్టాదశోధ్యాయః.

అర్జున ఉవాచ—

శ్లో॥ సన్న్యాసస్య మహాబాహో తత్త్వ మిచ్ఛామి వేదితుం ।
త్యాగస్యచ హృషీకేశ పృథక్ కేశినిషూదన॥ ౧

—♦ భాష్యమ్ ♦—

ఉపక్రమాదితో జ్ఞానం వినిశ్చిత్య వివేకజం । ఫలాసక్తిం వినా త్వష్టాదశే చైత న్నిరూప్యతే॥ నను నవేణుభి ర్భవేద్యతి రిత్యాదినా దండినాం తదనుయాయినాం తదన్యేషాంచ వేదబాహ్యానాం నిషేధా త్సన్న్యాస త్యాగయోః కో విశేష ఇత్యాహ సన్న్యాసస్యేతి.తత్రైవంసతి సన్న్యాస త్యాగ శబ్దయోః పర్యాయత్వేపి కర్మణః ఫలస్యవా త్యాగేన వైలక్షణ్యోక్తేః సంశయఇతితంపృథక్త్వేన వేదితు మిచ్ఛామీతి.ప్రశ్నాశయః ॥౧

## —• ల ఘు టి ప్ప ణీ •—

నను కైశ్చిల్లింగైః శాస్త్ర సిద్ధాంతో వర్ణనీయ ఇత్యాహ—ఉపక్ర మేతి। తత్ర తావదిహోపక్రమే అమృతశబ్దేన పరమ శివస్యైవా భిధానం। తథో పసంహారేతు సర్వత్రా ధ్యాయే తద్విష్ణోః పరమం పద మిత్యాద్యభి ధానమ్। ఏవమిహ పరంపదాఖ్య శివ జ్ఞానిన స్త్వనావృత్తిత్వేన పునః పునః కథన మభ్యాసః। తథోత్తమః పురుష స్త్వన్య ఇత్యాదినా పరమశివ జ్ఞానేనైవా పూర్వతాఫలమ్। ఏవ మవ్యక్తం వ్యక్తి మాపన్న మిత్యాదినా శివత్వేన విష్ణోర్జ్ఞాన మర్థవాదః। తథా మహేశ్వరే త్యనేన పరమ శివ స్యైవా వినాశిత్వా ద్గరిష్ఠత్వ మిత్యుపపత్తి శ్చేత్యాదిషడ్విధలింగైః శాస్త్ర సిద్ధాంతోర్థః। ప్రతిపాద్యతఇత్యవధార్యమ్। నిషేధాదితి। తద్యథా, నిర్వ్యాజో స్వీయ ధర్మజ్ఞో వేదజ్ఞ స్తత్త్వ పారగః। విరక్తో వేషనిర్ముక్త ష్షడ్భి ర్యోగే మునిర్భవే దిత్యాదినా సర్వేషాం పూర్వోక్తానాం నిషేధా దితిభావః॥ ౧॥

## —• ఆం ధ్ర తా త్ప ర్య ము •—

అర్జునుండిట్లనియె। పదునెనిమిదవ అధ్యాయమందు ఉపక్రమము, ఉపసంహారము, అభ్యాసము అపూర్వతా ఫలము అర్థవాదము ఉపపత్తి అను ఆరు విధములైన హేతువులచేతను, వివేకము వలన గలిగిన ఫలా సక్తిని వదలిన, జ్ఞానమును నిశ్చయించి చెప్పుచున్నాడు। ఓహృషీకేశా! ఓమహాబాహో! ఓకేశినిషూదనా ! వేణుదండములచే యతి గాజాలడను వచనములచే దండులను తదనుయాయులను తదితరులైన వేదబాహ్యులను నిషేధించుట వలన సన్యాసము త్యాగము యీరెంటిలో విశేష మేమనగా చెప్పుచున్నాడు. సన్యాసమన్నను త్యాగమన్నను ఒక్కటియె. రెండును పర్యాయ పదములైనప్పటికి కర్మ త్యాగముతో గాని ఫల త్యాగముతో గాని యని వేరుచెప్పుట వలన సంశయము గానదానిని వేరుగా తెలియ

నిచ్ఛయించు చున్నానని ప్రతిజ్ఞాభిప్రాయము. (ఓయీ! ఏహేతువులచే శాస్త్ర సిద్ధాంతము వర్ణించ దగిన దంటె చెప్పుచున్నాడు । అమృత శబ్దమునకు పరమ శివుడర్థమనుట, ఉపక్రమము, అదే విష్ణువునకు పరం పద మనుట, ఉపసంహారము పరంపదమును బొందిన శివజ్ఞానికి పునరావృత్తి లేదని మళ్ళీ మళ్ళీ చెప్పుట అభ్యాసము. ఉత్తముడైన పురుషుడు దేహత్రయముకంటె వేరను వాక్యముల వలన పరమశివుడను జ్ఞానము, అపూర్వతాఫలము అవ్యక్తమెవ్యక్తమైన దని విష్ణుని శివునిగా దెలియుట అర్థవాదము । మహేశ్వరు డనగా శివుడే, నాశ రహితు డగుట వలన గొప్పవాడనుట ఉపపత్తి. ఈప్రకారము ఆరు విధములైన లింగములచె శాస్త్ర సిద్ధాంతమైన అర్థము చెప్పదగినదని తెలియ వలయును । మిష లేనివాడు । స్వధర్మమును తెలిసినవాడు । వేదము తెలిసినవాడు । తత్వ పారంగతుడు । విరక్తుడు । వేషములేనివాడు । యీఆరింటిచేతను ముని - యోగి - అగుచున్నాడు ఇత్యాది వాక్యములచే పూర్వోక్తములైన వేద బాహ్యులు నిషేధించ బడిరని భావము॥ ౧॥

శ్రీకృష్ణ ఉవాచ—

శ్లో॥ కామ్యానాం కర్మణాం న్యాసం సన్యాసం కవయో విదుః
సర్వకర్మ ఫలత్యాగంప్రాహు స్త్యాగం విచక్షణాః॥　　౨

—♦ భాష్యమ్ ♦—

తత్రైతత్థంసతి సన్యాస త్యాగయో ర్మత భేదేన వ్యవస్థా మాహ—కామ్యానామితి । తత్ర తావ త్తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతియజ్ఞేన దానేన తపసా నాశకేనే త్యాది శ్రుతేర్నిత్య నైమిత్తిక కర్మణా మావశ్యకత్వే స్థితే స్వర్గకామోయజే దిత్యాది కామ్యానాం కర్మణాం క్షయిష్ణు ఫలకత్వేన సన్యాసం కవయః సూక్ష్మదర్శినో విదు రిత్యర్థః ।

ఏవ మనిష్ట మిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫల మిత్యాది స్మృత్యా కైవల్యార్థిభి రపి నిష్కామనయైవా నిష్టం త్యక్త్వా యజ్ఞదానాదికం కర్తవ్య మేవైహికంతు విక్రీతే కరిణి కిమం కుశే వివాద ఇతి న్యాయేన స్వతఏవ సిధ్యతీతి సర్వకర్మ ఫల త్యాగం విచక్షణాః ప్రాహు రిత్యాశయః॥ ౨॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

శ్రీ కృష్ణుండిట్లనియె:—

ఈలా అగుచునుండగా సన్యాస త్యాగముల యందు మతిభేదము చే వ్యవస్థను చెప్పుచున్నాడు. బ్రాహ్మణులు వేద యజ్ఞ దాన తపో నశనా దులతో ఆత్మను తెలియుచున్నారను శృతిని బట్టి నిత్య నైమిత్తిక కర్మలు ఆవశ్యకములై యుండగా స్వర్గ కాముడై యజ్ఞమును జేయవలయు నన్న శృతిని బట్టి కామ్యకర్మలు క్షయీ ఫలము గలవగుటచే సూక్ష్మజ్ఞానులైన కవులు సన్యాసమును తెలియుచున్నారు. కర్మఫలము అనిష్టము, ఇష్టము, మిశ్రము అని మూడు విధములు గలదను స్మృతిని బట్టి కైవల్యమును గోరువారు నిష్కామనచే అనిష్టఫలమును వదలి యజ్ఞ దానాదికమును చేయవలసినదే, ఐహికముమైతెయేనుగును విక్రయించినతర్వాత అంకుశము దగ్గర వివాదమేల యను న్యాయముచె ఐహికము స్వయముగానే సిద్ధించు నుగాన విద్వాంసులు సర్వకర్మ ఫల త్యాగమును చెప్పుచున్నారని యా శయము॥ ౨॥

శ్లో॥ త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః ।
యజ్ఞ దాన తపః కర్మ నత్యాజ్య మితి చాపరే॥౩॥

—◆ భా ష్య మ్ ◆—

నను సంన్యాస త్యాగయోః ర్వస్తుతోఽవిశేషస్యో క్తత్వేపీ హ విశేష మాహ—త్యాజ్యమితి॥ తత్రైవం సతి విజ్ఞానోత్తరం వాసో యథా పరికృతం మదిరా మదాంధః ఇత్యాది రీత్యా శుకాదివ జ్జడభరతాదివచ్చ సప్తమ్యాం భూమ్యాం తిష్ఠతాం యోగినాం ధ్యాన విచ్ఛేద హేతుత్వా ద్దోషవదేవ కర్మ త్యాజ్య మిత్యేకే మనీషిణో ధ్యానశీలాః ప్రాహు రిత్యర్థః। అథ ముముక్షుభిః కర్మాధికారిభి స్త్వంతః కరణ శుద్ధిద్వారా వివిదిషోత్పత్త్యర్థం యజ్ఞో దానం తపః కర్మ తునత్యాజ్య మితి చాపరే మనీషిణః పంచమ్యాం భూమ్యా మవస్థితాశ్చ ప్రాహు రిత్యర్థః॥ 3॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

ధ్యాన విచ్ఛేద హేతుత్వా దితి ఏవంసతి పూజా కోటి సమం స్తోత్రం స్తోత్ర కోటి సమోజపః జపకోటి సమం ధ్యానం ధ్యాన కోటి సమో లయః ఇత్యేవంక్రమేణ గరిష్ఠ త్వే స్థితే తత్ర, యథా యథా ప్రత్యగవస్థితం మన స్తథా తథా ముంచతి బాహ్యావాసనే' అన్యాయేన ధ్యాన విచ్ఛేద హేతుత్వా త్క్రియాః స్త్యజే దిత్యాశయః వివిదిషోత్పత్త్యర్థమితి తత్రైవం సత్యాత్మ వివిదిషోత్పతేః పూర్వం త్వంతః కరణ శుద్ధ్యర్థం కర్మోపాసనయో రావశ్యకత్వ మేవే త్యుభాభ్యామేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతి స్తథైవ భక్తి కర్మభ్యాం ప్రాప్యతే బ్రహ్మ శాశ్వత మిత్యాది ద్రష్టవ్యమ్॥ 3॥

## —♦ ఆంధ్రతాత్పర్యము ♦—

ఓయీ! యదార్థముగా సన్యాస త్యాగములలో విశేషము లేక పోయినప్పటికి ఇక్కడ విశేషమును జెప్పుచున్నాడు. విజ్ఞానముగలిగిన తర్వాత మద్యపాన మత్తుకు వస్త్రముకు యెరుగడనునట్లు శుకాదులవలె జడ భరతాదుల వలెనున్నా సప్తమ భూమికయందున్న యోగుల యొక్క ధ్యానమకు విచ్ఛిత్తి గలుగును గనుక కర్మదోష యుక్తమైనదే వదల వలయునని కొందరు ధ్యానశీలురు చెప్పిరని యర్థము. తర్వాత కర్మాధికారులైన ముముక్షువులు అంతఃకరణ శుద్ధిద్వారా వివిదిషత్వము కొరకు యజ్ఞ దాన తపః కర్మలు వదలకూడదని మరికొందరు పంచమ భూమిక యందున్న బుద్ధిమంతులు చెప్పిరని యర్థము (కోటిపూజలతో ఒకస్తోత్రముసమానము కోటి స్తోత్రములతో జపము సమానము. కోటి జపములతో ధ్యానము సమానము. కోటి ధ్యానములతో మనోలయము సమానమనునట్లు ఒకదాని కన్న నొకటి గరిష్ఠముగుచుండగా మనసు ప్రత్యగాత్మలో చేరినకొలది బాహ్యవాసనలు వీడుచుండునను న్యాయముచే ధ్యాన విచ్ఛిత్తికి హేతువగుట వలన క్రమముగా విడువవలయునని యాశయము. ఆత్మ వివిదిషోత్పత్తికి పూర్వమందు అంతఃకరణ శుద్ధి నిమిత్తము కర్మయు ఉపాసనయు అవశ్యకమె. పక్షులు రెండురెక్కల చేతను ఆకాశమందెగురునట్లు భక్తి కర్మల రెంటిచేతను శాశ్వతమైన శివపదము దొరుకునని యున్న శృతి స్మృతులను చూడవలయును॥ 3॥

శ్లో॥ నిశ్చయం శ్రుణు మే తత్ర త్యాగే భరతసత్తమ।
త్యాగోహి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః॥ ౪

## —♦ భాష్యమ్ ♦—

ఏవమిహా విప్రతిపత్తౌ సత్యాం ప్రత్యుత్తరం వక్తుం ప్రతిజానీతే । నిశ్చయమితి । తత్రైవంసతి హేభరతసత్తమ

కర్మణాం త్యాగే త్యాగవిషయే మే మమ వచనా న్నిశ్చయం పూర్వాచార్యైః కృతం శ్రుణ్విత్యర్థః । తత్రైవ హేపురుష వ్యాఘ్ర పురిణ్వతాం గరిష్ఠ సత్వ రజ స్తమో భేదై స్త్రివిధ స్త్యాగః సంప్రకీర్తిత స్త్వయాబోద్ధవ్య మిత్యర్థః॥ ౪॥

—• ఆంధ్రి తాత్పర్యము. •—

ఈప్రకారము ఈవిషయ మందు విప్రతిపత్తి గలిగిన దగుచు నుండగా ప్రత్యుత్తర మిచ్చుచున్నాడు. ఓభరతశ్రేష్ఠ! కర్మత్యాగము విషయమై నావాక్యము వలన పూర్వాచార్యులయిన శ్వేతాచార్యాదులు యిరువదియేడుగురుచేతను అనుష్ఠించ బడిన దానిని వినుము. ఓశ్రోత్రులలో గరిష్ఠుడా ! సాత్వికము-రాజసము, తామసము అనుభేదములచే త్యాగము మూడువిధము లని నీవు తెలుసుకొనవలయును॥ (యుగమునకు ఒక్కొక ఆచార్యుడు చొప్పున గతించిన యిరువది యేడు యుగములయందును యిరువది యేడుగురు యోగాచార్యులు అనుష్ఠించిన మార్గము భక్తియు కర్మయు । యీరెండింటిచే జ్ఞానము గలిగి ముక్తినొందగలరు. నామత మును నిదియె యని తెలియుము॥ ౪॥

శ్లో॥ యజ్ఞో దానం తపః కర్మ నత్యాజ్యం కార్యమేవ తత్ ।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్॥　　౫

—• భాష్యమ్ •—

నను తావతాపి కర్మణాం త్యాగ సంగ్రహయోః కోసౌ నిశ్చయ ఇత్యాహ । యజ్ఞ ఇతి తదిహాంతఃకరణం జ్ఞానాచ్ఛుధ్యతి కర్మణావేతి విప్రతిపత్తౌ ప్రాప్తాయాం జ్ఞానాత్మనస్తు పర బ్రహ్మణః సర్వదా వర్తమానత్వాత్ కదాప్యంతః కరణస్యా

శుద్ధి రేవ నస్యా త్తస్మా త్కర్మణై వా దర్శన త్తచ్ఛుద్ధి రపే క్షితేతి యజ్ఞో దానం తపః కర్మ నత్యాజ్యం కింతు తత్కార్య మేవా వశ్యకత్వాది త్యర్థః । యతో న్తః కరణస్య శుద్ధ్యుప యోగిత్వేన యజ్ఞాదీన్యేవ మనీషిణాం పావనానీ త్యాశయః॥౫॥

## —♦ లఘుటిప్పణీ . ♦—

శుద్ధ్యుపయోగిత్వే నేతి । ఇహతు యథా భూమ్యాదౌ సర్వత్ర ముఖప్రతిబింబస్య సత్వేపి నసర్వత్ర ప్రకాశతే । కింత్వా దర్శాదావేవ స్వచ్ఛత్వా త్ప్రకాశతే । ఏవం కర్మణా శుద్ధాన్తః కరణస్యైవా త్మోప లబ్ధి రితి యజ్ఞా దీనామంతః కరణ శుద్ధ్యుపయోగిత్వేన తదవశ్యమేవ తత్పర్యన్తం కర్తవ్యమ్ । తదు త్తరం త్వాత్మోపలబ్ధ్యా । జానామి ధర్మం నచమే ప్రవృత్తి । రిత్యాత్మోపదేశేనైవ వర్తితవ్య మిత్యాశయః॥ ౫॥

## —♦ ఆంధ్రితాత్పర్యము . ♦—

ఓయీ! కర్మత్యాగము కర్మసంగ్రహము వీటిలో యేది నిశ్చయ మంటె చెప్పుచున్నాడు । అంతఃకరణము జ్ఞానమువలన శుద్ధమగునా కర్మ వలన శుద్ధమగునా యను సంశయము ప్రాప్తమయిన దగుచు నుండగా జ్ఞానస్వరూపునకు పరమాత్మ యెల్లపుడు ఉన్నదగుట వలన యెప్పుడును అంతఃకరణకు అపరిశుద్ధతలేదు । అద్దమువలె అంతఃకరణశుద్ధి కర్మచేతనే కాదగినది గనుక యజ్ఞము, దానము । తపస్సు కర్మయు వీటిని వదల గూడదు. మరేమియనగా తప్పక వాటిని చేయవలయును. యజ్ఞాదులు బుద్ధిమంతులకు మనశ్శుద్ధిని గలిగించును । యెందువల్లననగా అంతఃకరణ శుద్ధికి ఉపయోగములు (భూమిమొదలగు వాటియందు అంతటను ముఖము యొక్క ప్రతిబింబము ఉన్నప్పటికి ప్రకాశించుటలేదు, స్వచ్ఛమగుట వలన అద్దమందె ప్రకాశించునట్లు కర్మచే పరిశుద్ధమైన అంతఃకరణ గల

వానికె ఆత్మసాక్షాత్కారమగును. యజ్ఞాదులు అంతఃకరణ శుద్ధికి ఉపయోగములు గాన అంతఃకరణ శుద్ధమయి ఆత్మసందర్శన మగునంతవరకు చేయవలసినవె । ఆత్మోపలబ్ధి యైనపిదప ధర్మమును తెలిసి ప్రవర్తించుటయూ లేదు- అధర్మమును తెలిసి నివర్తించుటయు లేదనిన స్మృతి ప్రకారము ఆత్మోపదేశముతో నుండవలయును॥ ౫॥

శ్లో॥ ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలానిచ ।
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మత ముత్తమమ్॥ ౬॥

—♦ భాష్యమ్ ♦—

నను 'కామ్యేపి శుద్ధి రస్త్యేవ భోగసిధ్యర్థమేవ సా । విద్వరాహాది దేహేన నహ్యైన్ద్రిం భుజ్యతే ఫలమిత్యాది స్మృత్యా సకామస్యాపి కర్మణోంతః కరణ శోధనే సామర్థ్య మస్తీతి కృతం ఫలాభిసంధి త్యాగేనే త్యాహ—ఏతాన్యపీతి । ఏవం త్వర్హి కామ్యేనాపి కర్మణా కృతేన తత్ఫల భోగోత్తరం వివిదిషయా విజ్ఞానస్య సిద్ధావ ప్యవిలంబేన తత్సిధ్యర్థం త్వేతాన్యపి యజ్ఞాదీని కర్మాణ్యా శాపరిత్యాశయోః సంగం ఫలానిచ త్యక్త్వా కర్తవ్యానీతి మే మమ నిశ్చితం మత ముత్తమ మిత్యర్థః॥ ౬॥

—♦ లఘుటిప్పణీ ♦—

భోగోత్తరమితి॥ అతఏవ త్ర్యంబకమితి మంత్రేపి ఉర్వారుకమివ బంధనా న్మృత్యోర్ముక్షీయేత్యుక్త మపి సంగచ్ఛత ఇత్యధికం యద్రకల్పే భాష్యేపి ద్రష్టవ్యమ్॥౬॥

—◆ ఆంధ్రతాత్పర్యము ◆—

ఓయీ! భోగసిద్ధి కొరకు కామ్య కర్మయందును శుద్ధి గలదియ్యేవే అ శుద్ధి విద్వరాహాది శరీరముచే ఇందద్రిలోక ఫలమనుభవింప బడదను స్మృతిచేతను కామ్య కర్మకును అంతఃకరణ శోధనయందు సామర్థ్యము గలదని చేసినది ఫలాభిసంధిని వదలుట చేతనే యని చెప్పుచున్నాడు. కామ్య కర్మనే చేసియాఫలమనుభవించిన పిదప వివిదిషత్వముచె విజ్ఞానము సిద్ధించినప్పటికి త్వరలో ఆత్మ సాక్షాత్కారమగుటకు ఈ యజ్ఞ దాన తపః కర్మలను కర్తృత్వాభి మానమును వదలిఫలకాంక్షలేక చేయదగిన వనియె నాయభిప్రాయము. త్రియంబక మంత్రమందు తొడిమివలన దోస పండు వీడినట్లు సంసార బంధమునుండి విడిపోవుచున్నాడను శ్రుతిని బట్టి వచ్చుచుండును. ఇంతకంటె అధికము రుద్రకల్ప మందును భాష్యమందును చూడవలయును॥౬॥

శ్లో॥ నియతస్యతు సంన్యాసః కర్మణో నోపపద్యతే ।
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః ॥౭

—◆ భాష్యమ్ ◆—

నను స్వర్గకామో యజే దిత్యాది శ్రుత్యా క్లప్తస్య స్వర్గాద్యుద్దేశ్యేన కామ్యస్య కర్మణః కదాచి త్క్షయిష్ణుత్వేన త్యాగోస్తు పరన్తు నిత్య నైమిత్తికాదేః శరీరస్యతు జ్ఞానినో ప్యావశ్యకత్వాత్త త్యాగానర్హత్వ మిత్యాహ-నియతస్యేతి । తత్త్రైవంసతి । నియతస్యతు తస్యస్వ స్వజాత్యను సారేణ నిత్య నైమిత్తికాదేః శారీరస్య కర్మణః । సంన్యాస స్త్యాగో నోప

పద్యత ఇతి తస్య కదాచి న్మోహా దజ్ఞానా దాలస్యాద్వా పరిత్యాగ శ్చే త్సపరిత్యాగ స్తామసః పరికీర్తిత ఇత్యర్థః॥ ౭॥

—◆ లఘుటిప్పణీ. ◆—

తామసఇతి। తదుక్త మాత్మ ప్రదీపే। తద్యథా, 'బుద్ధాద్వైత సతత్త్వస్య యథేచ్ఛాచరణం యది శునాం తత్త్వదృశాం చైవకో భేదో ఽ శుచిభక్షణ ఇత్యాది ద్రష్టవ్యమ్॥ ౭॥

—◆ ఆంధ్రతాత్పర్యము. ◆—

ఓయీ! స్వర్గకాముడై యజ్ఞమును చేయవలయునను శృతులచే స్వర్గమందు ఉద్దేశముచే చేసిన కామ్యకర్మ ఒకప్పుడు క్షయించేది యని త్యాగమే అగుగాక, నిత్యనైమిత్తిక కర్మజ్ఞానియొక్క శరీరమునకున్నూ ఆవశ్యకమగుటవలన అది వదల గూడదనుటను గూర్చి చెప్పుచున్నాడు నియమితమై తమతమ జాతి కనుకూలమైన నిత్య నైమిత్తిక శారీర కర్మలను వదలకూడదు। అట్టికర్మములను యెప్పుడైనను అజ్ఞానము వలనగాని ఆలస్యమువలనగాని వదలినయెడల ఆత్యాగము తామస మగును. అద్వైత తత్త్వముంటెలిసి స్వేచ్ఛాచరణమును జేసిన యెడల శునకములకును తత్త్వవేత్తలకును భేదమేమి యనగా అశుచి భక్షణమె ఇత్యాదులు చూడ వలయును॥ ౭॥

శ్లో॥ దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశ భయా త్త్యజేత్ ।
సకృత్వా రాజసం త్యాగం నైవత్యాగఫలం లభేత్ ॥ ౮

—◆ భాష్యమ్ ◆—

నను మృతా నారీ దరిద్రైస్తు దూషితాః పాపబిందవః స్వాద్వన్న భక్ష్య కామేన వేషం ధృత్వా పరాఙ్ముఖాః।

ఇత్యాద్యాది స్మృతి న్యాయేన కర్మ సన్న్యాసః కృతశ్చే త్తత్ దృశ స్త్యాగ ఇత్యాహ—దుఃఖమితి । తత్రైవంసతి।యథోక్త రీత్యాస్వస్వజాత్యనుసారేణసంధ్యాదికమపి కర్మతదపికాయక్లేశ భయా ద్దుఃఖమిత్యేవ మత్వా త్యజేచ్చే త్సరాజసం త్యాగం కృత్వా నైవ త్యాగస్య ఫల మిహాముత్రగం కైవల్యం వా లభే దిత్యాశయః॥౮॥

## —♦ ల ఘు టి ప్ప ణీ . ♦—

పాతబిందవఇతి॥ అతఏవ ప్రాప్త జ్ఞాన మార్తాండం కర్మజన్య ఫలం శుభం ఇతో్భ్రష్టా స్తతో్భ్రష్టా ధాతశ్చైవచ నిష్ఫలా ఇత్యతోపి పాపబిందు త్వమేవా వధార్యమ్॥౮॥

## —♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము . ♦—

ఓయీ! స్త్రీ మృతినొందిన పిదప పాపబిందువులు దరిద్రులచే దూషింపబడి రుచికరమైన యన్నమును భుజించుట యందు కోరికచే సన్న్యాసి వేషమును ధరించి వెడలిపోవుచున్నవి. ఇత్యాది స్మృతుల ననుస రించి కర్మ సన్న్యాసము చేసిన యెడల అది యెటువంటి త్యాగ మనగా చెప్పుచున్నాడు. చెప్పిన ప్రకారము తమ తమ జాతిననుసరించి సంధ్యా దుల నైన దేహము కష్టపడు నను భీతిచే దుఃఖమని తలచి యెవడు వదలు చున్నాడో వాడు రాజస త్యాగ మొనర్చినను త్యాగఫలమును గాని ఇహ పరములనుగాని కైవల్యమునుగాని పొందలేడని యాశయము (జ్ఞానమను సూర్యోదయమగువరకు కర్మజన్యమైన ఫలమె మంచిది. కర్మయు జ్ఞానము రెండునూ లేనియెడల ఇటునటు భ్రష్టులగుదురు. అప్పుడును పాపబిం దువులుగానే యుండుట నిశ్చయము॥౮॥

శ్లో॥ కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియ తేఽర్జున ।
సంగం త్యక్త్వా ఫలంచైవ సత్యాగ స్సాత్వికో మతః॥ ౯

—• భా ష్య మ్ •—

నను రాజస స్తామసశ్చ త్యాగో దర్శిత స్సాత్విక స్త్విహ కీదృశో భవతీ త్యాహ—కార్యమిత్యేవేతి । తత్రైవం సతినియతం స్వస్వజాత్యనుసారేణ నిత్యనైమిత్తికప్రాయశ్చిత్తా నుష్ఠానాఖ్యం యదవశ్యం కార్యమిత్యేవ మత్వా సంగం ఫలంచ త్యక్త్వా క్రియతే హేఅర్జున సత్యాగస్తు స్వధర్మ సాధ్య హేతుత్వేనే శ్వరప్రాప్తి హేతుత్వేనచ సాత్వికో మత ఇత్యర్థః॥ ౯॥

—• ల ఘు టి ప్ప ణీ . •—

ప్రాప్తిహేతుత్వేనేతి । నను యది సాత్వికస్య యథోక్త కర్మణ స్త్వీశ్వర ప్రాప్తి హేతుత్వం తర్హి కథ మసంగత్వ మితిచే చ్ఛృణు । తత్రి తావ న్నిష్కామస్య కర్మణ స్త్వేతావతైవా సంగత్వం యస్మాదీ శ్వర ప్రాప్త్యుత్తరం ప్రాప్తవ్యం నాస్తి నవాక్షయిత్వాశంకా స్వర్గాది ఫలాది వదితి యస్మిన్ కృతే నకించిత్కర్మ క్రియతే తస్మే మనః శివ సంకల్పమస్త్వి త్యవగతం భవ తీతి భావః॥ ౯॥

—• ఆ ం ధ్ర తా త్ప ర్య ము . •—

ఓయీ! రాజసత్యాగము తామసత్యాగము చూపబడినది. సాత్విక త్యాగ మెట్లుండునంటె చెప్పుచున్నాడు. నియమితమైన తమతమ జాతి కనుగుణమైన నిత్య, నైమిత్తిక ప్రాయశ్చిత్తా నుష్ఠానమను రేకర్మను

అవశ్యముగా చేయవగిన దని తలచి సంగమును ఫలమును వదలి చేయు చున్నాడో, ఓ అర్జునా! ఆత్యాగము। స్వధర్మమును సాధించుటకు హేతువగుట చేతనున్నూ ఈశ్వరప్రాప్తికి హేతువగుటచేతనున్నూ సాత్త్వికత్యాగమనబడును (యథోక్త కర్మాచరణ రూపమయిన సాత్త్వికత్యాగము ఈశ్వరప్రాప్తికి హేతువయిన యెడల అసంగత్వమెట్లనగావిను। నిష్కామకర్మకు ఇంతమాత్రమె అసంగత్వము యేఈశ్వరప్రాప్త్యనంతరము పొందదగినది లేదో స్వర్గాదిఫలమువలె క్షయమగునను శంకయు లేదో। యేనిష్కామకర్మ చేసిన మరియేకర్మయు జేయడను శ్రుతిని బట్టి సాత్త్విక త్యాగమని తెలియ నగునని భావము॥ ౯॥

శ్లో॥ న ద్వేష్ట్య కుశలం కర్మ కుశలే నానుషజ్జతే।
త్యాగీ సత్త్వ సమావిష్టో మేధావీ ఛిన్నసంశయః॥ ౧౦

—♦ భాష్యమ్ ♦—

నను తామసం రాజసం సాత్త్వికంవా కర్మాన్యైః క్రియమాణం తత్త్వజ్ఞః కిం నివర్తయే త్కారయేద్వే త్యాహ నద్వేష్టీతి। తత్రైవం సత్త్యన్యై స్తామసాదిభి స్త్వకుశలం కర్మ స్వసంస్కార వశేన క్రియమాణమపి తత్త్వజ్ఞో నద్వేష్టి నచ కుశలేనానుషజ్జతే వేతి సచత్యాగీ సత్త్వసమావిష్టో నబుద్ధిభేదం జనయే త్యాది స్మృత్యనుకూలత్వా న్మేధావీ ఛిన్నసంశయశ్చే త్యర్థః ౧౦॥

—♦ లఘుటిప్పణీ ♦—

నచకుశలే నేతి। తత్ర స్వస్య త్వాత్మజ్ఞానా త్పూర్వమేవ శుద్ధచిత్తత్వేనా కుశలే కర్మణి ప్రవృత్తిరేవ నభవతీతి భావః॥౧౦॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఓయీ! తత్త్వజ్ఞానము గలవాడు ఇతరులు జేయు సాత్త్విక రాజస తామస కర్మలను యెందుకు మళ్లించడు; యెందుకు చేయించడంటె, చెప్పుచున్నాడు. తామసాదుల చేతను కష్టతరమైన కర్మ జన్మాంతర సంస్కార వశముచే చేయబడు చుండగా తత్త్వజ్ఞుడు ద్వేషించడు, మంచి కర్మనున్నూ చేయించడు. అట్టి త్యాగి సత్త్వగుణముతో గూడి యితరుల బుద్ధిని భేదింపరాదను స్మృతికనుకూలముగా మేధావియు సంశయ రహితుడున్నూ అగుచున్నాడు. (తాను ఆత్మజ్ఞానమునకు పూర్వమె శుద్ధమైన చిత్తము గలవాడు గాన కష్టమైన పనులు జేయడని భావము.)౧౦.

శ్లో॥ నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః ।
యస్తు కర్మఫలత్యాగీ సత్యాగీ త్యభిధీయతే॥　　౧౧.

—♦ భాష్యమ్ ♦—

తదేవంసతి బుద్ధాద్వైత సతత్త్వస్య యథేచ్ఛాచరణం యదీత్యాది స్మృత్యా త్మజ్ఞానవతోఽపి నిత్య నైమిత్తికాది కర్మావశ్యకత్వ మేవేత్యాహ । నహీతి । ఏవంసతి దేహభృతాం కథమపి కర్మావశ్యకత్వే స్థితే తేషాం కర్మాణ్యశేషత స్త్యక్తుం నహిశక్య మిత్యర్థః । కింతు యః కర్మఫల త్యాగీ సఏవ త్యాగీతి విద్వద్భి రభిధీయత ఇత్యవధార్యమ్॥౧౧

—♦ లఘుటిప్పణీ ♦—

అశేషత స్త్యక్తుమితి । ననువిహితంకర్మ నకుర్యా దిత్యేవ తస్యాశయ ఇతిచే త్కుర్వన్నేవేహ కర్మాణీ త్యాది శ్రుతేరపి తత్రాకరణే ప్రత్యవాయ శాసనాది త్యవధార్యమ్॥౧౧॥

—◆ ఆంధ్ర తాత్పర్యము ◆—

అయితే అద్వైత తత్వమును తెలిసినవానికి స్వేచ్ఛాచరణ మయినట్లయితే తత్వజ్ఞానికిని శునకమునకును భేదమే లేదను స్మృతిచేతను ఆత్మజ్ఞానము గలవానికిని, నిత్య నైమిత్తికాది కర్మ ఆవశ్యకమే యని చెప్పుచున్నాడు. శరీరధారులకు యెటులయినను కర్మ ఆవశ్యకమై యుంటూండగా వాళ్ళకు సకల కర్మలను వదలుట శక్యముగాదు. మరేమియనగా యెవడు కర్మఫలమును విడుచునో వాడే త్యాగియని విద్వాంసులచే చెప్పబడు చున్నాడని తెలియవలెను. (విహితమైన కర్మ చేయనక్కర లేదనే యభిప్రాయమైతే, కర్మలను చేయుమనే యుండవలయు నని చెప్పిన శృతిన్నీ కర్మచేయకున్న ప్రత్యవాయమును శాసించు చున్నదని తెలియవలయును. ౧౧,

శ్లో॥ అనిష్ట మిష్టం మిశ్రించ త్రివిధం కర్మణః ఫలం ।
భవత్యత్యాగినాం ప్రేత్య నతు సన్యాసినం క్వచిత్॥ ౧౨

—◆ భాష్యమ్ ◆—

ననునిరర్థకం సకుర్యాద్వై బాలవ ద్బుద్ధివర్జిత ఇత్యాది స్మృత్యా సార్థకస్య కర్మణః కర్తు మావశ్యకత్వే స్థితే కతి విధం తదిత్యాహ । అనిష్టమితి । తత్రతావ త్కర్మ ఫలా త్యాగినా మనిష్ట మిత్యాది త్రివిధం కర్మణః ఫలం ప్రేత్య భవతీ త్యర్థః । ఏవం నిత్యానైమిత్తికాది కర్మ కుర్వతాం తత్ఫలాసంగినాం సంన్యాసినాం తు నైవానిష్టం నరకాదికం నవేష్టం స్వర్గాదికం నవా తదుభయ మిశ్రంచ లౌకికం తేషామనిత్యత్వేన తుచ్ఛత్వాది త్యవధేయమ్॥ ౧౨॥

## —♦ లఘుటిప్పణీ ♦—

తుచ్ఛత్వాదితి తథా 'చాత్మాంబురాశౌ నిఖిలోపిలోకో మగ్నోపి నాచామతి నేక్షతేచ ఆశ్చర్య మేత న్మృగతృష్ణికాభే భవాంబురాశౌ మృగతే మృషైవే త్యేవం రీత్యా జగత స్తుచ్ఛత్వే స్థితే తేషాం తత్త్వజ్ఞానినాం శరీరయాత్రాతు జానామి ధర్మం నచమే ప్రవృత్తి రితిన్యాయేన భవతీ త్యవధార్యమ్॥౧౨॥

## —♦ ఆంధ్రతాత్పర్యము ♦—

ఓయీ! బుద్ధిహీనుడు బాలునివలెకర్మను నిష్ప్రయోజనముగాజేసునను స్మృతిచే సార్థకమైన కర్మను చేయుట యావశ్యకమై యుంటె ఆ కర్మ యెన్నివిధములనగా చెప్పుచున్నాడు. కర్మఫలమును వదలని వారికి అనిష్టమని ఇష్టమని మిశ్రమని కర్మఫలము మూడు విధములు. నిత్యనైమిత్తికాది కర్మలు జేయుచు కర్మఫలమును వదలిన సన్యాసులకు అనిష్టమైన నరకాదికము లేదు. ఇష్టమైన స్వర్గాదికమున్నూ లేదు. ఇష్టానిష్టములు గల మిశ్రమైన లౌకికమునూ లేదు. ఇవి అనిత్యము లగుటచే తుచ్ఛములని తెలియవలయును. ఆత్మయను సముద్రమందు సమస్త లోకము మునిగియున్నదైనను ఆచమనమైనను చేయుటలేదు. కొంచెమైనను చూడదు. యెండమావుల జలముతో సమమైన సంసార సముద్రమందు వ్యర్థముగా వెతుకుచున్నది. ఇది యాశ్చర్యమను నట్లు జగత్తు తుచ్ఛమయ్యుండగా తత్త్వజ్ఞానుల శరీరయాత్ర ధర్మమను తెలిసి ప్రవర్తించుటయూ లేదనునట్లు అగుచున్నది॥౧౨॥

శ్లో॥ పంచైతాని మహాబాహో కారణాని నిబోధమే।
　సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్॥ ౧౩॥

—◆ భా ష్య మ్ ◆—

నను సాంసారికై ర్జీవై ర్దేవ తిర్యఙ్మనరాదిభి ర్వై తత్కర్మ కర్తవ్యం తత్ర కతివిధం కారణ మిత్యాహ। పంచై తానీతి। తత్ర తావ ద్వేదాన్తా న్నాపరం మాన మిత్యాది స్మృత్యా సాంఖ్యే నామ వేదాంతే కృతాంతే నామ సిద్ధాన్తే సర్వకర్మణాం ఫలసిద్ధయేఽధిష్ఠానం తథాకర్తే త్యాది వక్ష్య మాణాని పంచైతాని కారణాని జీవస్య సర్వానర్థ నివర్తకత్వేన హేమహాబాహో! మేమత్తో నిబోధే త్యర్థః॥ ౧౩॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

కర్మకర్తవ్యమితి। కుర్వన్నేవేహ కర్మాణిజిజీవిషే చ్ఛతం సమా ఇత్యాది శ్రుత్యనుకూలత్వా త్తదవశ్యం తైః కర్మ కర్తవ్య మేవ అన్యథా శ్రుత్యుల్లంఘనేన తేషాం ప్రాయశ్చిత్త భాగిత్వం స్యాదితి భావః॥౧౩॥

—◆ ఆం ధ్ర తా త్ప ర్య ము ◆—

ఓయీ! సాంసారిక జీవులు దేవతలు తిర్యగ్జంతువులు నరులు మొద లగు వారిచే నీకర్మచేయదగినది. అందుకు కారణము లెన్నివిధము లనగా చెప్పుచున్నాడు. వేదాన్తముకన్న రెండవ మానము లేదనునట్లు సాంఖ్య మను వేదాంత మందును కృతాంతమను సిద్ధాంత మందును ఓ ధనంజయా సకల కర్మ సిద్ధి కొరకు అధిష్టానము కర్తయని చెప్పబోవు అయిదు కార ణములను జీవునికి సర్వానర్థములను మళ్లించనవగుటచె నా వలన తెలుసు కొనుము (కర్మచేయుచు నూరు సంవత్సరములు జీవించవలయునన్న శృతికి అనుకూల మగుటచే ఆకర్మను తప్పక వారు జేయవలసినదే. అట్లుచేయకున్న శృత్యుల్లంఘన దోషముచే వారలు ప్రాయశ్చిత్తము జేసు కొన వచ్చును)

శ్లో॥ అధిష్ఠానం తథాకర్తా కరణంచ పృథగ్విధమ్ ।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్॥ ౧౪

—♦ భాష్యమ్ ♦—

నను కాని తర్హి పంచకారణాని వస్తుతో హేయత్వేన జ్ఞాతవ్యానీ త్యాహ—అధిష్ఠానమితి । తత్రేచ్ఛాద్యభివ్యక్త్యధిష్ఠానం శరీరం తథా మమేత్యభిమానవా న్కర్తా శ్రోత్రాదిశబ్దాదిచ విషయోపలబ్ధి సాధనం పృథగ్విధం కరణం, ఏవం ప్రాణాపానోదాన వ్యాన సమానత్వేన తదంతర్గత నాగ కూర్మ కృకరో దేవదత్త ధనంజయత్వేన చపృథగ్విధా శ్చేష్టా స్తథా పంచ దైవ మాకాశాది దేవతా జాతమితి । మిలిత్వే హాముత్రార్థ ఫల సాధక మిత్యాశయః॥ ౧౪॥

—♦ లఘుటిప్పణీ ♦—

శ్రోత్రాదీతి । తత్ర తావచ్ఛ్రోత్ర త్వ క్చక్షు ర్జిహ్వా ఘ్రాణేతి పంచ జ్ఞానేంద్రియాణి తథా శబ్ద స్పర్శ రూప రస గంధేతి తద్విషయాః । ఏవం వా క్పాణి పాద పాయూపస్థాఖ్యాని పంచ కర్మేంద్రియాణి తథా వచనాదాన గమన విసర్గ మేహనాని చతద్విషయ రూపాణీతి కర్తృత్వ సాధనం పృథగ్విధం కరణ మిత్యర్థః। ఏవం తేషాం చేష్టాః ప్రసిద్ధా స్తథా దిగ్వాతార్క వరుణ పృథివీ త్యాది భేదేన దేవ జాతమపి మిలిత్వా సర్వేష్ట సాధక మిత్య వధేయమ్॥౧౪॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఓయీ! అయితే యథార్థముగా హేయములు గాన పంచకారణము లను తెలియ దగినవని చెప్పుచున్నాడు. అధిష్ఠాన మనగా శరీరము నాది

యని యభిమానించిన వాడుకర్త. శ్రోత్రాదీం ద్రియములకు శబ్దాది విషయములు లభించుట, సాధనము వేరైన కరణము ఈ ప్రకారము ప్రాణాపాన వ్యానో దాన సమానము లగుటచే వాటికి అంతర్భూతములగు నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయము లనిన్ని వీటి చేష్టలు వేరు. అట్లు అయిదవది దైవము ఆకాశాది దేవతా సమూహము. ఇవి ఇహాముత్రార్థ ఫలసాధకములని తెలియ వలయును. (శ్రోత్ర త్వక్ చక్షు జిహ్వా ఘ్రాణములు పంచ జ్ఞానేంద్రియములు. శబ్ద స్పర్శ రూప రస గంధములు వాటికి విషయములు. వాక్ పాణి పాద పాయూ పస్థలు కర్మేంద్రియ ములు. వచన ఆదాన గమన విసర్గ మేహనములు వాటికి విషయములు. కర్తృత్వసాధనము వేరు సాధనము. ఈ ప్రకారము వాటి చేష్టలు ప్రసిద్ధ ములు దిక్కులు వాయువు సూర్యుడు వరుణుడు పృథివి యని భేదముగా దేవసముదాయమున్నూ గలసి సర్వేష్ట సాధక మగునని తెలియవలెను.౧౪.

శ్లో॥ శరీర వాఙ్మనోభి ర్యత్కర్మ ప్రారభతే నరః ।
న్యాయంవా విపరీతంవా పంచైతే తస్య హేతవః॥ ౧౫

—◆ భాష్యమ్ ◆—

సన్త్వేతైః పంచభిః కింక్రియత ఇత్యాహ—శరీరేతి ।
తథా చేహాముత్ర సిద్ధయే శారీరం వాచికం మానసంచ యత్త్రివిధం కర్మ శాస్త్రీయో క్తత్వేన న్యాయ్యంత ద్విపరీతంవా క్రియతే తస్యైతేఽధిష్ఠానాదయో హేతవ ఇత్యర్థః॥ ౧౫॥

—◆ లఘుటిప్పణీ. ◆—

త్రివిధమితి । అతఏవ వాగ్భిర్దత్తం మనో దత్తం దత్తం పాణికుశో దక మిత్యాదౌ ధర్మ నిబంధే త్రిభి రేవ కృతం విశేషతః పుణ్యపాపాదౌ ప్రయోజకం భవతీతి తత్ర తత్రద్రష్టవ్యమ్॥ ౧౫॥

—◆ ఆంధ్రి తాత్పర్యము. ◆—

ఓయీ! ఈ యైదింటిచేతనుయేమి చేయబడు ననగా చెప్పుచున్నాడు. మనుజుడు ఇహాముత్ర సిద్ధికొరకు దేహముచే గాని వాక్కుచేగాని మనసుచే గాని యీమూడు విధములయిన కర్మలు శాస్త్రీయములగుటచే న్యాయమైనదిగాని అన్యాయమైనది గాని, యేకర్మను మొదలుపెట్టునో దానికీయైదు అధిష్ఠానాదులును హేతువులు(వాక్కులచే నిచ్చినది. మనసుచే నిచ్చినది. హస్తముతో కుశోదక పూర్వకముగా నిచ్చినదిన్ని ధర్మనిబంధమను గ్రంథమందు యీమూటిచేతను చెసినది విశేషముగా పుణ్యపాపాదుల యందు ప్రయోజన మగుచున్నదని అక్కడక్కడ చూడనగును॥౧౫॥

శ్లో॥ తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః ।
పశ్య త్యకృత బుద్ధిత్వా న్న సపశ్యతి దుర్మతిః॥　　౧౬

—◆ భాష్యమ్ ◆—

తదిదానీ మధిష్ఠానాది పంచవిధ నిరూపణస్య తత్వజ్ఞానినః ఫలమప్యాహ—తత్రైవమితి । తత్రేత్థం సత్య ధిషానాది పంచవిధ సంఘాతస్య కర్తృత్వే స్థితే యస్తు సజాతీయాది త్రివిధ భేదరహిత మాత్మానం శివ మద్వైతం కర్తారం పశ్యతిసచాకృతబుద్ధిత్వా న్నసపశ్యత్యతోదుర్మతి రిత్యర్థః॥౧౬

—◆ ఆంధ్రి తాత్పర్యము ◆—

ఇప్పుడు అధిష్టానము మొదలయిన పంచవిధ నిరూపణ గల జ్ఞానికిని ఫలమునున్న చెప్పుచున్నాడు. అధిష్ఠానము మొదలయిన పంచవిధ నిరూపణకు కర్తృత్వేముండగా యెవడు సజాతి విజాతి స్వగత భేదరహితమైన ఆత్మను శివునిగా అద్వైతమునుగా కర్తనుగా చూచునో వాడు చెడ్డబుద్ధి గలవాడు గాన చూడ లేడు. అందుకే దుర్మతియగుచున్నాడు॥౧౬॥

శ్లో॥ యస్య నాహంకృతో భావో బుద్ధి ర్యస్య నలిప్యతే।
హత్వాపి సఇమాం లోకా న్నహంతి ననిబధ్యతే॥ ౧౭

—♦ భా ష్య మ్ ♦—

నన్వేవం వివేకతో యోగజ ధర్మేణా త్మప్రత్యక్షం కుర్వలోపి జన్మ మరణాదికంతు భవిష్యతీతిచే న్నైమ్రవ మిత్యాహ—యస్యేతి। తత్రైవం సతి యదిదేహ పృథక్త్వస్య చితి విశ్రామ్య తిష్ఠతీత్యాది స్మృత్యుక్తరీత్యా యస్య పూర్వవ దభిమానాది వివేకేన దేహాదావనాహంకృతో భావః కింత్వ సంగో హ్యాయం పురుష ఇత్యాది శ్రుత్యుక్త బోధేన చ యస్య దేహాది కృత కర్మణా. బుద్ధి ర్నలిప్యతే సచైవం తత్వ జ్ఞ స్సర్వానిమాంల్లోకాన్ హత్వాపి తేన కర్మణా ననిబధ్యతే కుత స్తే స్వల్పాహవ కృత కర్మణా బంధ ఇత్యలమ్॥౧౭॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

యోగజధర్మేణేతి॥ తత్ర తావ దాత్మా వారే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యోనిదిధ్యాసితవ్య ఇత్యాది శ్రుత్యా ర్థక్రమేణ శ్రవణాద్యనంతరం శమ దమాది షట్సంపత్యనంతరంచ యమ నియమాద్యష్టాంగ రూపేణ యోగజ ధర్మేణే త్యర్థః ఇత్యలమితి॥ తత్రైవం సతీహ తదుపదేశ దార్ఢ్యేన కృతయుద్ధశ్చే దిత్యలం సమర్థ ఇత్యర్థః నోచే దలం వ్యర్థ మిత్యర్థఇతి ద్వయ మప్యవధార్యమ్॥౧౭॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ! వివేకము గలిగి యోగాభ్యాసముచే నాత్మ సాక్షాత్కారము గన్నవానికిన్ని జనన మరణాదులున్నవా అంటె లేవనిచెప్పుచున్నాడు

దేహాదులను వేరుచేసి చిత్తునందు విశ్రమించి ఉంటున్నాడనె స్మృతిని బట్టి యెవడు పూర్వమువలె అధిష్ఠానాదులను విడదీసి దేహాదులు నేనుగా నని ఈ పురుషుడసంగుడను శ్రుతియందు చెప్పిన బోధచేత యెవనియొక్క దేహేంద్రియాదులు చేసిన కర్మచె, బుద్ధి, లేపన చేయబడదో వాడు తత్వ జ్ఞుడై సర్వమైన ఈలోకములను హతముచేసియు అకర్మచే బద్ధుడుగాడు నికు యీ స్వల్ప యుద్ధముచే నయిన కర్మతో బంధమెక్కడిది. (ఆత్మను చూడదగినది వినదగినది మనన చేయుదగినది నిధిధ్యాసన చేయుచుండ వలయు నన్న శ్రుతిచే అర్థమును క్రమముగా శ్రవణాదుల తర్వాతను శమ దమాది షట్సంపత్తి తర్వాతను యమ నియమాద్యష్టాంగ యోగరూప మైన యోగజ ధర్మము చేతనని యర్థము. అట్టియుపదేశ బలిమిచేయుద్ధము చేసితి వట్టాయెనా సమర్థుడవనిన్నీ లేకున్న వ్యర్థమనిన్నీ రెండును తెలి యవలెను॥౧౭॥

శ్లో. జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మ చోదనా।
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మ సంగ్రహః ॥ ౧౮

—◆ భాష్యమ్ ◆—

సన్న్వధిష్ఠానాది పంచాత్మ సంఘాతస్య కథం తత్కర్మ కర్తృత్వ మిత్యాహ—జ్ఞాన మితి తథాచేహ। శబ్దస్పర్శాది తత్తద్వస్తుత్వా వచ్ఛిన్న విషయ కం జ్ఞానం తత్తద్వస్తుత్వా వచ్ఛిన్నంచ జ్ఞేయం తాదృశజ్ఞానాధికరణం చాహ మిత్యభి మానవా న్పరిజ్ఞాతేతి త్రివిధా కర్మ ప్రేరణేతి భావః। సాచ కే న కుర్యా త్కథం కుర్యా త్కః కుర్యాదితి త్రివిధ స్త త్తత్కార్య కర్తృత్వే సంకర ఇత్యపి బోధ్యమ్॥ ౧౮॥

## —◆ ల ఘు టి ప్ప ణీ . ◆—

త్రివిధఇతి । తద్యథా, 'సాధ్యంచ సాధనంచైవ ప్రకారో వత్రయా దృశః । సేతి కర్త వ్యతా శాస్త్రే సర్వత్రైవ ప్రయుజ్యతే' ఇత్యాది ద్రష్టవ్యమ్ ॥౧౮॥

## —◆ ఆం ధ్ర తా త్ప ర్య ము . ◆—

ఓయీ! అధిష్ఠానము మొదలు పంచభూత సముదాయమును ఆకర్మ చేయుట యెట్లనగా చెప్పుచున్నాడు । శబ్దము స్పర్శము మొదలయిన ఆయా వస్తువుల యొక్క భేదమును తెలియునది జ్ఞానము । ఆవస్తువు యొక్క ధర్మమును వేరుగా తెలియుట జ్ఞేయము । అట్టి జ్ఞానమునకు అధిష్ఠానము నేనని యభిమానము గలవాడు పరిజ్ఞాత యని కర్మయొక్క ప్రేరణ మూడువిధములు. ఆప్రేరణ యెవనిచే చేయబడ వలయును యెట్లు చేయవలయును యెవరుచేయవలయు నని మూడు విధములై యాకర్మ చేయుట సంకర మనిన్ని తెలియ దగినది ॥౧౮॥

శ్లో॥ జ్ఞానం కర్మచ కర్తాచ త్రిధైవ గుణభేదతః ।
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావ చ్ఛృణు తాన్యపి॥ ౧౯

## —◆ భా ష్య మ్ ◆—

ఇదానీంతు జ్ఞాన జ్ఞేయ జ్ఞాతృ స్వరూపస్య కరణ కర్మ కర్తృ స్వరూపస్య చత్రిక ద్వయస్యత్రిగుణాత్మకత్వం వక్తవ్య మితీహ పునరాహ—జ్ఞానమితి । తత్రైవంసతి । జ్ఞానమిత్యాది త్రివిధం గుణ సంఖ్యానే గుణభేదత స్త్రిధైవ తాన్యపి యథావ చ్ఛృణ్వి త్యర్థః॥ ౧౯॥

—◆ లఘు టిప్పణీ ◆—

త్రిగుణాత్మక త్వమితి । తత్రతావ దజ్ఞానం ద్వివిధ మాగమోత్థం వివేకంచ తదిహ తావదాగమోత్థమేవ జ్ఞానం త్రివిధం వక్తవ్య మితి ప్రతిజ్ఞాత మిత్యాశయః । తద్యథా, 'ఆగమోత్థం వివేకోత్థం ద్విధా జ్ఞానం తదుచ్యతే । శబ్దబ్రహ్మ గమమయం పరబ్రహ్మ వివేకజం' ఇత్యాది స్మృత్యా వివేక్తవ్యమ్॥౧౯॥

—◆ ఆంధ్ర తాత్పర్యము ◆—

ఇప్పుడు జ్ఞానము జ్ఞేయము జ్ఞాతల స్వరూపమునకు సాధనము. కర్మకర్తల స్వరూపమునకున్నూ త్రిగుణాత్మకత్వము చెప్పవలయు నని తిరిగి చెప్పుచున్నాడు. జ్ఞానము, కర్మము, కర్త ఇవి గుణభేదమును బట్టి త్రివిధముగనె సాంఖ్య శాస్త్రమున జెప్పబడి యుండె. వానిని సావధానముగ నాలకింపుము (అజ్ఞానము, ఆగమోక్తము వివేకము అని రెండు విధములు. ఆగమోక్తమైన జ్ఞానమె మూడు విధములుగా చెప్పవలయునని ప్రతిజ్ఞ చేయబడినదని యాశయము. అజ్ఞానము ఆగమోద్ధము - వివేకము అని రెండు విధములు. శబ్దబ్రహ్మరూపము ఆగమోద్ధము వివేకము వలనపుట్టినది పరబ్రహ్మము ఇత్యాది స్మృతులచే వివేకము చేయవలయును.౧౯.

శ్లో॥ సర్వ భూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే।
అవిభక్తం విభక్తేషు తజ్జానం విద్ధిసాత్వికమ్॥ ౨౦॥

—◆ భాష్యమ్ ◆—

ఏవమిహ జ్ఞానస్య కర్మణః కర్తృశ్చ ప్రత్యేకం త్రైవిధ్యం పున ర్వక్తుమాహ- సర్వభూతేష్వితి। ఏవం త్రిసమష్టివ్యష్ట్యాత్మకేషు సర్వేషు భూతేషు విభక్తేష్వ విభక్త మవ్యయ మేక

మేవా ద్వితీయం భావం యేనేక్ష తే తజ్ఞానం సాత్వికం విద్ధీత్యర్థః॥ ౨౦॥

—♦ ఆంధ్రి తాత్పర్యము. ♦—

జ్ఞానమునకు కర్మకు కర్తకును ప్రత్యేకముగా త్రైవిధ్యమును చెప్పుటకు తిరిగి చెప్పుచున్నాడు। సమష్టి వ్యష్టి రూపమైన సర్వభూతములు విభక్తములయినను విభాగమునందనిది యును నొక్కటియు అవ్యయము నగు పరమాత్మ తత్వమును యే జ్ఞానముచేతను గాంచబడునో అది సాత్విక జ్ఞానమని యెరుంగ వలయును॥ ౨౦॥

శ్లో॥ పృథక్త్వేన తు యద్జ్ఞానం నానాభావా న్పృథగ్విధాన్
వేత్తి సర్వేషు భూతేషు తజ్ఞానం విద్ధి రాజసమ్॥ ౨౧

—♦ భాష్యమ్ ♦—

ఏవం ప్రకారాంతరేణా ప్యాహ - పృథక్త్వే నేతి। తత్రేత్థం సతి। యస్తు సర్వేషు భూతేషు నానాభావా న్పృథగ్విధా న్వేత్తి తస్య తజ్ఞానం రాజసం విద్ధీత్యర్థః॥ ౨౧॥

—♦ ఆంధ్రి తాత్పర్యము. ♦—

ప్రకారాంతరముతో చెప్పుచున్నాడు.। యెవడు సర్వభూతముల యందును అనేక భావములను వేరుగా తెలియు చున్నాడో వానికి ఆ జ్ఞానము రాజసమని యెరుంగ వలయును॥ ౨౧॥

శ్లో॥ యత్తు కృత్స్నవ దేకస్మి న్కార్యే సక్త మహేతుకమ్।
అతత్వార్థ వదల్పంచ తత్తామస ముదాహృతమ్॥ ౨౨

—◆ భా ష్య మ్◆ —

ఏవం తామసం తృతీయ మప్యాహ—యత్త్వితి । తత్త్వైవం సతి సర్వేషు భూతేషు విద్య మానేష్వప్యే కస్మి న్నేవ కార్యే వికారభూతే దేహే ప్రతిమాదావా హేతుకం హేతు రుపపత్తి స్తద్రహితం కృత్స్నవ త్పరిపూర్ణవ త్సక్త మేతావా నేవాత్మేశ్వరోవా నాతః పరమస్తీతి పరిచ్ఛిన్న భావన లగ్న మతత్త్వార్థవ దల్పంచ నతు సర్వభావేనేతి తత్తాదృశం సముదాహృత మిత్యర్థః॥ ౨౨॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

దేహే ప్రతిమాదావేతి తత్త్వైవం సతి. యథా, గురౌ నృబుద్ధించ మంత్రేష్వ ప్యక్షర బుద్ధిక్రి త్ప్రతిమాసు శిలాబుద్ధిం కుర్వాంతో యాన్త్యథ స్తమ' ఇత్యాది స్మృత్యా గుర్వాది దేహే ప్రతిమాదౌచ దేవబుద్ధి రేవోచి తా తత్ర తు శిలాది బుద్ధిం కుర్వం తఏవ జడబుద్ధయః తద్యథా, 'శిలాదౌ దేవతాం మత్వాపూజయంతి విధానతః జడత్వం యేఽత్ర మన్యంతే తఏవ జడబుద్ధయః' ఇత్యాది స్మృత్యా సఏవ తస్మిన్నేవ సర్వత్త్వైవేతి మత్వా మందమధ్య మోత్తమైః త్రివిధ భేదేన పూజ్యత్వ మవధార్యమ్॥౨౨॥

—◆ ఆం ధ్ర తా త్ప ర్య ము ◆—

మూడవదియైన తామసమునున్నూ చెప్పుచున్నాడు. సర్వభూత ములు ఉండగా ఒక్క కార్యమందు అనగా వికారమైన దేహమందు గాని ప్రతిమయందుగాని ఉపపత్తి రహితమై పరిపూర్ణము వలె తగిలి ఆత్మ గాని ఈశ్వరుడు గాని ఇట్లెయుండును. ఇంతకన్న మరేమియు లేదని భిన్నభావనయందు దగిలిన అర్థమువలె అల్పమై యుండునో నది తామస

జ్ఞాన మనబడును. (గురువునందు మానవబుద్ధినిన్నీ మంత్రముల యందక్షర బుద్ధినిన్నీ ప్రతిమలయందు శిలాబుద్ధినిన్నీ చేయువారు అధోలోకమందు జన్మింతురన్న స్మృతిని బట్టి గుర్వాది శరీరమందును ప్రతిమాదుల యందును దేవబుద్ధియే ఉచితమైనది. అక్కడ శిలాబుద్ధిని చేయువారు జడబుద్ధి గలవారలు శిలాదుల యందు దేవతను తలచి విధ్యుక్తముగా పూజచేయు చున్నారు. ఎవరా శిలయందు జడత్వమును దలచు చున్నారో వారే జడబుద్ధిగలవారు అను స్మృతిచే వారే దానియందు సర్వత్ర అని తలచి మంద-మధ్యమ, ఉత్తమమను త్రివిధ భేదములచే పూజ్యత్వమును నిశ్చయించ వలయును॥౨౨॥

శ్లో॥ నియతం సంగరహిత మరాగ ద్వేషతః కృతమ్।
అ ఫల ప్రేప్సునా కర్మ యత్త త్సాత్త్విక ముచ్యతే.

—♦ భాష్యమ్ ♦ —

తదేవం జ్ఞానే త్రైవిధ్య ముక్త్వా కర్మణ్యపి త్రైవిధ్య మాహ — నియతమితి। తత్ర తావత్తద్యే మనశ్శంభు పదార విందయో రిత్యాది స్మృతిన్యాయేనా త్మార్పణ బుద్ధ్యానియ తంధా రాగద్వేషాభ్యాంరహితత్వా త్సంగర హితం ఫలేప్సార హితత్వేన కృతంచే త్కర్మ యత్త త్పుర్వేష్ట ఫలప్రదత్వా త్సాత్త్విక ముచ్యతే। ఇత్యర్థః॥ ౨౩॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

జ్ఞానమందు మూడు విధములు చెప్పి కర్మయును మూడు విధము లని చెప్పుచున్నాడు. శంభు చరణముల యందున్నదే మనస్సను న్యాయముచే నాత్మార్పణ బుద్ధిచే నియమించ బడినట్టిన్నీ రాగద్వేషములు లేక

చేయ బడినదియు ఫలేచ్ఛ లేక చేయబడిన కర్మ సర్వులకు ఇష్టఫలముల నిచ్చున దగుటచే సాత్త్విక మని చెప్పబడును.౨౩.

శ్లో॥ యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణవా పునః ।
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్ ॥౨౪

—◆ భా ష్య మ్ ◆—

ఇదానీంతు కర్మణ్యేవ రాజస భేద మప్యాహ-యత్త్వితి। తత్రైవం సతి యత్కర్మ కామేప్సునా సాహంకారేణవా పున ర్బహులాయాసం తుథాస్యా త్తథా క్రియతే తదారాజస ముదాహృత మిత్యర్థః॥ ౨౪॥

—◆ ఆంధ్ర తాత్పర్య ము ◆—

కర్మయందు రాజస భేదమునున్నూ చెప్పుచున్నాడు. యేకర్మ కాముకునిచే అహంకారము గలవానిచే గాని మిక్కిలి శ్రమగలదై యేకర్మ మాచరింప బడునో అద్యది రాజస కర్మయని చెప్పబడును ౨౪.

శ్లో. అనుబంధంక్షయం హింసామనపేక్ష్యచ పౌరుషం
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామస ముచ్యతే॥ ౨౫॥

—◆ భా ష్య మ్ ◆—

ఏవం తత్ర తామస మప్యాహ— అనుబంధమితి। తథాచేహా నుబంధం పశ్చాద్భావ్య శుభం క్షయంచ శరీరా దర్శనమ్ తథా హింసాం పీడాం పౌరుషం చానపేక్ష్యకృతాం ప్రాణిపీడాం తథా కేవల మోహా దవివేకతో యదారభ్యతే కర్మ తత్తామస ముచ్యత ఇత్యర్థః౨౫॥

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

పౌరుషం చా నపేక్ష్యేతి । తద్యథా, 'విద్యా వివాదాయ ధనం మదాయ శక్తిః పరేషాం పరపీడనాయ । ఖలస్య సాధో ర్విపరీత మేతద్ జ్ఞానాయ దానాయచ రక్షణాయ' ఇత్యాది స్మృత్యుక్త రీత్యా కర్తవ్యం తదనపేక్ష్య కృత మిత్యాశయః॥ ౨౫॥

—◆ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ◆—

తామస కర్మనున్నూ చెప్పుచున్నాడు. తర్వాత జరగబోవు శుభమును, శరీర నాశనమును, హింసను, పౌరుషమును, చూడక చేయబడు ప్రాణిపీడను కేవల మోహము వలన యేకర్మ ఆరంభించ బడునో అది తామసమని చెప్పబడును (విద్య వివాదముకొరకు ధనము మదము కొరకు శక్తి పరులను పీడించుట కొరకు ఇట్లు దుష్టునకు ఉండును. సాధువునకు తలక్రిందుగా విద్య జ్ఞానము కొరకును ధనము దానము కొరకును । శక్తి రక్షణ కొరకును అగునన్న స్మృతి ననుసరించి చూడక చేయబడు నదియని ఆశయము॥ ౨౫॥

శ్లో॥ ముక్తసంగో నహంవాదీ ధృత్యుత్సాహ సమన్వితః ।
సిద్ధ్య సిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్విక ఉచ్యతే॥ ౨౬.

—◆ భా ష్య మ్ ◆—

తత్ర తావదిహ జ్ఞానకర్మణో స్త్రైవిధ్య ముక్త్వా కర్తర్యపి త్రైవిధ్య మాహ—ముక్తసంగ ఇతి । తత్రైవంసత్యహంకార శూన్యే నాహంవాదీ ధృత్యు త్సాహ సమన్వితశ్చ, ఫలాభి సంధి రహితత్వేన సిద్ధ్యసిద్ధ్యోశ్చసమం వీక్షమాణః కర్తా సాత్విక ఉచ్యతే కథ్యత ఇత్యర్థః॥ ౨౬॥

—♦ లఘుటిప్పణీ ♦—

అహంకార శూన్యత్వే నేతి । శుభాహంకార శూన్యత్వంచేత్థం శుభం త్వీశకృతం పశ్యే దశుభం త్వాత్మనా కృత మిత్యేవం న్యాయేనాహంకృతిం భక్తియోగేన త్యజే దితిభావః॥౨౬॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

జ్ఞాన కర్మలకు త్రైవిధ్యమును జెప్పి కర్తకును త్రైవిధ్యమును జెప్పుచున్నాడు. అభినివేశ రహితుండును, అహంకారము లేనివాడును ధైర్యోత్సాహ సమన్వితుడును ఫలాభిసంధి లేనివాడును గాన సిద్ధించినను సిద్ధింపకున్నను వికారము లేనివాడును అయిన కర్త సాత్త్వికుడని చెప్పబడుచున్నాడు. (అహంకార శూన్యత్వమన్నా శుభము అశుభము. శుభము ఈశ్వరకృతము అశుభము ఆత్మకృతమనె న్యాయముచే అహంకృతిని భక్తియోగముచే విడువ వలయునని భావము॥౨౬॥

శ్లో॥ రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకో ఽశుచిః।
హర్ష శోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః॥ ౨౭॥

—♦ భాష్యమ్ ♦—

ఏవమిహ ప్రకారాంతరేణ పునః కర్తుర్భేదమాహ—రాగీతి। తత్త్రైవంసతి। కర్మఫలేచ్ఛుః కామాద్యాకులితత్వేన రాగీ లుబ్ధత్వేన హింసాత్మకో ఽశుచి ర్హర్షశోకాన్వితశ్చకర్తా రాజసః పరికీర్తిత ఇత్యర్థః॥౨౭॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

మరియొక ప్రకారముగా కర్తృభేదమును చెప్పుచున్నాడు। కర్మఫలాభిలాషి కామాదులచే వ్యాకులమైన వాడు గాన ప్రేమగలవాడు

లుబ్ధుడు గనుక నేహింసించు స్వభావము గలవాడు అశుచి, లాభాఽలాభ ములయందు సంతోష దుఃఖములు గలవాడు రాజసకర్తయని నుడువం బడును॥ ౨౭॥

శ్లో॥ అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికో ఽలసః ।
విషాదీ దీర్ఘసూత్రీచ కర్తా తామస ఉచ్యతే॥ ౨౮

—◆ భాష్యమ్ ◆—

ఏవమేవేహ తామసత్వేనాపి తృతీయం కర్తార మాహ—అయుక్తఇతి । ఏవంసతి । సర్వదా విషయాపహృత చిత్తత్వేనా యుక్తస్తథా శాస్త్రాసంస్కృత బుద్ధిత్వేన ప్రాకృ తో గురు దేవతాదిష్వ నమ్రత్వేన స్తబ్ధః శఠశ్చ తదైవా నుపకారిత్వేన నైష్కృతికోఽలసో విషాదీచ ఏవమిహ యద్ది వసైః కర్తవ్యం తన్మాసేన కరోతీతి దీర్ఘసూత్రిచే త్యేవం రూపః కర్తా తామస ఏవోచ్యత ఇత్యర్థః॥ ౨౮॥

—◆ లఘుటిప్పణీ ◆—

ప్రాకృతఇతి తత్రైతావ 'దిహాముత్ర ఫలం లోకే కైవల్య మపి చధ్రువం । గురుదైవత భక్తానాం సర్వేషాం సులభం భవే' దిత్యాది స్మృత్యా గుర్వాదీనాం భక్తే రావశ్యకత్వే స్థితే తద్విముఖానాం ప్రకృ తత్వ మేవ స్ఫుటీకృతమ్ । ఏవమాత్మనాపు గురో ర్నామ నామాతి కృపణ స్యచ, శ్రేయస్కామో నగృహ్ణీయాత్ జ్యేష్ఠాపత్య కలత్రయో' రిత్యాది స్మృత్యాఽఽత్మప్రభృతీనాం నామగ్రహణే సుకృతహాని శ్శఠస్యా తికృపణస్య నామగ్రహణే త్వతిపాతకోత్పత్తి రితి తదపి నోచిత మిత్యా శయః॥ ౨౮॥

## —• ఆంధ్ర తాత్పర్యము •—

తామసత్వముచే మరియొక కర్తను చెప్పుచున్నాడు। యెల్లపుడు విషయములచే నపహరింపబడిన చిత్తము గలవాడగుటచే సావధానము లేనివాడు శాస్త్ర సంస్కారము లేనివాడు గాన ప్రాకృతుడు, గురు దేవతాదుల యందు నమ్రత లేనివాడు గాన స్తబ్ధుడు శఠుడు అనగా రహస్యముగా అపకారము జేయువాడు పరులకుపకారి గాడు గాన నైష్కృతికుడు అలసత గలవాడు దుఃఖస్వభావము గలవాడును చాలకాల మాలోచించి చేయువాడును. తామస కర్తయని వచింతురు ప్రాకృతుడనగా ఇహలోకఫలము పరలోకఫలము కైవల్యము, ఇవి నిశ్చయము। గురుదేవతల యందుభక్తి గలవారలకందరకు సులభమేయగుననునట్టి స్మృతిచే గుర్వాదుల యందు భక్తికి అవశ్యకత్వ ముండగా అట్టిభక్తి లేనివారు ప్రాకృతులే యని స్ఫుటము చెయబడెను. ఈప్రకారమే తనపేరును గురువుపేరును కృపణుని యొక్క పేరును పెద్దకుమారుని పేరును భార్యపేరును శ్రేయస్కాముడు ఉచ్చరించరాదను నట్టి స్మృతిచే తాను మొదలయిన వార్ల యొక్క పేరుచెప్పుట యందు సుకృతహానియు శఠుడు కృపణుడు వీర్ల యొక్క నామ గ్రహణమందు అతి పాతకోత్పత్తియు గాన అదియు పనికిరాదనియే యభిప్రాయము॥ ౨౮॥

శ్లో॥ బుద్ధే ర్భేదం ధృతే శ్చైవగుణతస్త్రివిధం శ్రుణు।
ప్రోచ్య మాన మశేణ పృథక్త్వేన ధనంజయ॥ ౨౯

## —• భాష్యమ్ •—

ఏవ మిదానీ మధ్యవసాయ రూపాయా బుద్ధే శ్శుభ సహకారిత్వేన తత్రధృతేశ్చ త్రైవిధ్య మాహ—బుద్ధేరితి తత్రతావదం తఃకరణస్య మనోబుద్ధి చిత్తాహంకార రూపత్వేన

చతుర్విధత్వ ముక్తం తథాపీహ బుద్ధే స్సర్వ వ్యవహారనిశ్చయ కర్త్వేన ధృతేశ్చ తత్సహకారిత్వేనా వశ్యకత్వా ద్బుద్ధే ర్ధృతేశ్చ భేదకథనేనైవా శేషేణ పృథక్త్వేన వాగుణతస్త్రివిధం భేదం హేధనంజయ శ్రుణ్విత్యర్థః ॥౨౯॥

—♦ లఘుటిప్పణీ ♦—

అధ్యవసాయరూపేతి॥ తత్ర తావ దధ్యవసాయ స్త్విహాముత్రాది వివేక శాలినీ బుద్ధి రధ్యవసాయ రూపే త్యర్థః॥౨౯॥

—♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

ఇప్పుడు అధ్యవసాయ రూపమైన బుద్ధికి సహకారి యగుటచే ధృతికిని త్రైవిధ్యమును జెప్పుచున్నాడు. ధనంజయా అంతఃకరణము మనో బుద్ధి చిత్తాహంకార రూపముగా నాల్గు విధములని చెప్పబడినది. అయి నప్పటికి ఇక్కడ బుద్ధికి సర్వ వ్యవహారములను నిశ్చయించే దగుటచే ధృతియు దానికి సహకారి యగుటచే నావశ్యక మగుటవలన బుద్ధికిని ధృతికిని భేదమును జెప్పుటచే అంతను గాని వేరుచేసి గాని గుణముల భేద ముల వలన త్రివిధ భేదమును వినుము (ఇహాఽముత్రాది వివేకము గల బుద్ధి అధ్యవసాయ రూపమైనదే యని యర్థము॥౨౯॥

శ్లో॥ ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యే భయాభయే ।
బంధం మోక్షంచ యావేత్తి బుద్ధిస్సా పార్థసాత్వికీ॥ ౩౦

—♦ భాష్యమ్ ♦—

తదిదానీంతావ ద్బుద్ధే స్త్రైవిధ్య మాహ—ప్రవృత్తి మితి । తత్రతావ త్కర్మణైవాంతః కరణ శుద్ధి ద్వారా జ్ఞానసిద్ధి రితి ప్రవృత్తి పూర్వికైవ స్వతో నివృత్తిరితి స్థితే

తత్ర తమోః ప్రవృత్త్యో ర్జ్ఞాత్రీ తత్ర స్వస్వ జాత్యనుసారేణ కార్యా కార్యే వ్యవసాయికాచ కపూయచరణాః కపూయాం యోని మాపద్యంత ఇత్యాది శ్రుత్యనుసారేణ భయాభయేచ విచార శాలినీ త్యర్థః । ఏవం ప్రవృత్తిమార్గే మిథ్యా జ్ఞాన కృతం మోక్షంచ యా వేత్తి హేపార్థ సా సాత్వికీ త్యర్థః॥

—♦ లఘు టిప్పణీ ♦—

ప్రవృత్తి పూర్వికై రిత్యర్థః । అన్యథా తు తత్ర ఋణత్రయ యుత్వేనా శుద్ధచిత్తత్వా దాత్మదర్శిత్వా భావేన ముక్తిరేవ నస్యాదితి భావః। మిథ్యా జ్ఞాన కృతమితి । కింతు నప్రాణో నోశరీరంహి నోమనో బుద్ధిరేవచ నాహంగిరో భవేదాత్మా జ్ఞప్తి మాత్రః పరశ్శివ ఇత్యాది స్మృత్యా య స్త్వయి తిష్ఠన్యం త్వం నవిజానాసి యస్య త్వమేవ శరీర మిత్యాది శ్రుతివేద్యంచ య స్తమాత్మానయా వేత్తీ త్యాశయః॥౩౦॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఇప్పుడు బుద్ధికి త్రైవిధ్యమును చెప్పుచున్నాడు. కర్మచేత నంతఃకరణ శుద్ధి రూపముగా జ్ఞానము సిద్ధించునని ప్రవృత్తితో గూడియె స్వాయముగా నివృత్తి యని యుండగా నాప్రవృత్తి నివృత్తుల యందు తెలుసుకునేది అందు తమ తమ యొక్క జాతి ననుసరించి చెయ్యతగినవి, చెయ్యతగనివి యీరెంటిని నిశ్చయించు కునేదిన్ని పాపులు పాపయోని యందు పుట్టుదురనిన శృతిననుసరించి భయాభయ ములనున్నూ విచారించుట యందు నేర్పుగలది ఈ ప్రకారము ప్రవృత్తి మార్గమందలి మిథ్యాజ్ఞాన కృతమైన మోక్షమునున్నూ యేది తెలియుచున్నదో అది సాత్త్విక బుద్ధి. (ప్రవృత్తిని యాచరించిన వారిచేతనని యర్థము. అట్లుగాకున్న దేవ, ఋషి

పితృఋణములతో గూడి యుండుటచే అశుద్ధ చిత్తుడగుట వలన ఆత్మ సందర్శనము లేనందున ముక్తియే లేకుండునని భావము. ప్రాణము గాను శరీరముగాను మనో బుద్ధులు గాను అహంగిరోపాసన గాను ఆత్మయై జ్ఞప్తిమాత్రమైన పరశివుడ నేను. ఏయందున్న దానినిన్ని నీవు తెలియజాలవను శ్రుతిప్రకారము తెలియదగిన యాత్మను యేది తెలియుచున్నదో అది సాత్త్వక బుద్ధియని యాశయము. ౩౦.

శ్లో॥ యయా ధర్మ మధర్మంచ కార్యం చాకార్య మేవచ।
అయథావ త్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ రాజసీ॥ ౩౧

—♦ భాష్యమ్ ♦—

ఏవం యథోక్తం బుద్ధిం రాజసీ మప్యాహ। యయేతి తత్రతావద్ధర్మ మధర్మంచ కార్యా కార్యంచ వ్యావహారికమేవ విజానాతి నతుకైవల్య ప్రదంతాత్వికం జ్ఞాన మిత్యయథావద్ జ్ఞానాద్బుద్ధి స్సా రాజసీ త్యర్థః॥ ౩౧॥

—♦ ఆంధ్రి తాత్పర్యము ♦—

యీప్రకారము రాజస బుద్ధినిన్ని చెప్పుచున్నాడు. ధర్మా ఽధర్మములు గాని, కార్యా ఽకార్యములు గాని, వ్యావహారికమునే తెలియునో కైవల్యమునిచ్చే తత్వజ్ఞానము దేనిచే యదార్థముగా తెలియదో అది రాజస బుద్ధియని తెలియవలెను ॥౩౧॥

శ్లో॥ అధర్మం ధర్మమితి యామన్యతే తమసా వృతా।
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ తామసీ॥ ౩౨

## —◆ భా ష్య మ్ ◆—

ఏవమేవ తామసీ మప్యాహ —అధర్మమితి। తత్త్రైవం సత్యన్యథా విద్యతే శాస్త్రం జనాః క్లిశ్యన్తి చాన్యథే త్యాది స్మృతి న్యాయేనా ధర్మమేవ ధర్మంమన్యమానా ముద్రా జటా రచన మాండ్య వతాం వృద్ధై వేత్యాద్యుక్తాన్పర్వానర్థమూలా శ్చరురుతి స్మృతి విపరీతా న్యాతమసా వృతా బుద్ధి ర్మన్యతే సా తామసీత్యర్థః ౩౨॥

## —◆ ల ఘు టి ప్ప ణీ ◆—

ముద్రాజటేతి । నను కథ మేషాం నిరయ గామిత్వ మితిచే చ్ఛృణు । గృహాస్థై ర్దత్తజన్మాది గృహస్థస్యా నుసేవకః । గృహాస్థై ర్దత్తమన్నాది గృహాస్థై ర్దత్తభూమికః । గృహస్థ ద్వార సేవీచ గృహస్థస్యా నునిందకః । గృహాస్థా త్సంగ్రహీ సోయంచా ధమోహి త్రిదండ భాగి త్యాదినా గృహాస్థేష్వపి తప్తముద్రాంకితా నిరయగామిన ఏవేత్యాధికమన్యత్ర విస్తరః॥ ౩౨॥

## —◆ ఆంధ్ర తా త్ప ర్య ము ◆—

ఈప్రకారమె తామసీ బుద్ధినిన్ని చెప్పుచున్నాడు । శాస్త్రము మరియొకలాగున ఉన్నది. జనులు మరియొక మార్గమున బడి కష్టపడుచున్నారు. అను స్మృతిని బట్టి అధర్మమును ధర్మమునుగా తలచే టటువంటిన్ని, తప్తముద్ర కృత్రిమ జటా రచన మాఢవృత్తి గలవారిజన్మ వృధయను నట్లును, సర్వార్థములను విపరీతము గను యేది తమోగుణ యుక్తమై దలచునో అది తామస బుద్ధి యని యెఱుంగుము (వీరలకు నరకప్రాప్తి యెట్లనగా వినుము గృహస్థుల వలన జన్మాదులు గలిగి,

గృహస్థులకు సేవకులై, గృహస్థులిచ్చిన యన్నమును దిని, గృహస్థుల వలన భూములను గ్రహించి, గృహస్థుల ద్వారమును సేవించుచు, గృహస్థులను నిందించుచు, గృహస్థులవలన ధనసంగ్రహము జేయు త్రిదండ సన్యాసి యధముడను నట్లు, గృహస్థుల యందును తప్తముద్రాధారులు నరకము నొందుదురు॥ ౩౨॥

శ్లో॥ ధృత్యాయయా ధారయతే మనః ప్రాణేంద్రియ క్రియాః
యోగేనా వ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ సాత్వికీ॥ 33

—♦ భాష్యమ్ ♦—

తదిదానీం ధృతే రపి త్రైవిధ్య మాహ-ధృత్యేతి। తత్రైవం సతి యోగేన సమాధినా నిరంతర సమాధి వ్యాప్తత్వేనా వ్యభిచారిణ్యా యయా ధృత్యా ప్రత్యయేన మనసః ప్రాణస్యేం ద్రియాణాంచ క్రియా శ్చేష్టా ధారయతే స బాహ్యాభ్యంతర యోగాభ్యాం నిరుణద్ధి యస్యాంచ సత్యా మవశ్యం సమాధి ర్భవతి యయాచ ధార్యమాణా మన ఆది క్రియా శ్శాస్త్ర మనతి క్రమ్య నార్థాంతర మవగాహన్తే ధృతి స్సాపార్థ సాత్వికీ త్యర్థః॥ 33॥

—♦ లఘుటిప్పణీ ♦—

అవ్యభిచారిణ్యేతి। తద్యథా,'సజ్జాసన స్తోథ పరివ్రజన్వాముక్తః పరిక్షీణ వితర్క జాలః సంసార బీజ క్షయ మీక్షమాణ స్స్యా న్నిత్యముక్తో ఽమృత భాగభోగీ'త్యాది స్మృత్యుక్త రీత్యా వ్యభిచారిణ్యా యయా ధృత్యే త్యర్థః॥33॥

—◆ ఆంధ్రతాత్పర్యము ◆—

ఇప్పుడు ధృతికిన్ని త్రైవిధ్యమును చెప్పుచున్నాడు. ఓపార్థా! నిరంతర సమాధిచే అవ్యభిచారియైన యే ధృతిచే మనస్సు యొక్కయు ప్రాణము యొక్కయు ఇంద్రియముల యొక్కయు చేష్టల నాతంక పెట్టునో, బాహ్యాభ్యంతర యోగములచె అరికట్టునది యేది గలిగిన దగుచుండగా అవశ్యము సమాధియగు చున్నదో, దేనిచే నాతంక పెట్టబడిన మనాదులయొక్క క్రియలు శాస్త్రమును అతిక్రమించక మరియొక విషయమును ప్రవేశింపవో అది సాత్వక ధృతి. (ఆసనమును బంధించి గూర్చుని గాని తిరుగుచు గాని వితర్కవాదములను వదలి ముక్తుడై సంసారమునకు బీజమైన అజ్ఞానమునకు నాశమును వెదుకుచు అమృత భాగమును అనుభవించు వాడు నిత్యముక్తుడు. ఇత్యాది స్మృతులయందు చెప్పినట్లు అవ్యభిచార ధృతిచేత నని యర్థము॥౩౩॥

శ్లో॥ యయాతు ధర్మ కామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున।
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతి స్సాపార్థ రాజసీ॥ ౩౪

—◆ భాష్యమ్ ◆—

ఏవం ప్రకారాంతరేణాపి తామాహ—యయాత్వితి॥ తదిహాయయా ధృత్యా మోక్షం ధారయన్నపి తత్రప్రసంగేన ధర్మం కామ మర్థంచ ధారయతే నిత్యం కర్తవ్యతయా వధారయతి నతు కైవల్యం కదాచి దపీతి ధృతి స్సాపార్థ రాజసీత్యర్థః ౩౪

—◆ లఘుటిప్పణీ ◆—

కదాచిదపీతి తదుక్తం స్మృతిసారే తద్యథా, 'ధర్మాధర్మశ్చకామంచేత్యేవం యేషాం వినిశ్చయః కైవల్యం నాభిజానంతిరాజసా లౌకికా జనాః' ఇత్యాద్యుక్తరీత్యా మోక్ష పర్యంతం నాభి జానంతీ త్యర్థః ॥౩౪॥

## — ఆంధ్ర తాత్పర్యము —

మరియొక ప్రకారము ధృతిని చెప్పుచున్నాడు. ఓ అర్జునా! యేధృతిచే మోక్షమును ధరించుచు దాని ప్రసంగముచే ధర్మమును అర్థమును కామమును నిత్యము చేయవలయునని ధరించుచు కైవల్యమును యెప్పుడును గోరడో అది రాజసధృతి (ధర్మమువలననె అర్థము కామమును గలుగునని యెవరికి నిశ్చయము గలదో వారు రాజసులు లౌకికజనులు కైవల్యమును యెరుగరు॥ ౩౪॥

శ్లో॥ యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవచ।
నవిముంచతి దుర్మేధా ధృతిస్సా పార్థ తామసీ॥ ౩౫

## — భాష్యమ్ —

ఏవమిహ తామసీ మప్యాహ-యయేతి। ఏవంసతి స్వప్నం నిద్రాం భయం త్రాసం శోక మిష్టవియోగ నిమిత్తం సంతాపం విషాద మింద్రియా వసాదం మదంచా శాస్త్రీయత్వేన సేవోన్ముఖత్వంచ యయా ధృత్యా వివేకాసమర్థో దుర్మేధాం నవిముంచతి హేపార్థ ధృతిస్సా తామసీ త్యర్థః॥

## — ఆంధ్రతాత్పర్యము —

తామస ధృతినిన్ని చెప్పుచున్నాడు. స్వప్నమును భయమును ఇష్టవియోగము వలన బుట్టిన శోకమును విషాదమును మదమునున్ను యేధృతిచే వివేకమం దసమర్థుడై దుష్టబుద్ధిగలవాడై వదలడోఓ పార్థ! వాడు తామస ధృతి గలవాడు॥ ౩౫॥

శ్లో॥ సుఖం త్విదానీం త్రివిధం శ్రుణుమే భరతర్షభ।
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి॥ ౩౬

—◆ భా ష్య మ్ ◆—

ఏవం క్రియా కారణం తత్కారణస్యచ త్రైవిధ్య ముక్త్వా తత్ఫలస్యాపి త్రైవిధ్యం వక్తుం ప్రతిజానీతే । సుఖమితి । తత్ర తావ ద్ధర్మస్మృత్యా ప్రతిజ్ఞా తదర్థ రూపయాచ యత్ర సమాధిసుఖే ఽభ్యాసా దతిపరిచయా ద్రమతేఽతితృప్తో భవతి నతు విషయసుఖమివ దుఃఖా న్తంనిగచ్ఛతీతితదిదమిత్యర్థః॥ ౩౬

—◆ ల ఘు టి ప్ప ణీ ◆—

నను విషయసుఖ మివేతి ! తదుక్తం పురాణాంతే శ్మశానాంతే మైథునాంతేచ యామతిస్సామతి స్థిరతా మేత్కో నముచ్యేత సంకటాదిత్య వధార్యమ్ । తదిదమితి ఏవంసతి తదిదం బ్రహ్మసుఖం నతాదృశ మిత్యర్థః। కింతు సర్వాఏవ కలా జంతోరనభ్యాసేన నశ్యతి ఇయం జ్ఞానకలా త్వంత స్సకృజ్జాతాపి వర్ధత ఇత్యాది యోగవాశిష్ఠేపి ద్రష్టవ్యమ్॥ ॥౩౬॥

—◆ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ◆—

ఈప్రకారము క్రియా కారణమును దానిసాధనమునకున్ను త్రైవిధ్యమును జెప్పి దాని ఫలమునకున్ను త్రైవిధ్యమును చెప్పుచున్నాడు। ఓభరతశ్రేష్ఠా! ఇంక త్రివిధ సుఖముం గూర్చి వచించు చుంటి వాలింపుము । ధర్మస్మృతిచే ప్రతిజ్ఞయు దాని యర్థ స్వరూపమైన సమాధి సుఖమందతిపరిచయము వలన అతితృప్తు డగుచున్నాడో విషయ సుఖమును వలె అంతమందు దుఃఖమును బొందడో అది సుఖమని యర్థము (పురాణాంతమందును శ్మశానాంతమందును మైథునాంతమందును ఉన్నబుద్ధి స్థిరమైనయెడల సంసార సంకటము వలన యెవడు ముక్తుడుగాడు! బ్రహ్మసుఖ మట్టిదిగాదు. విద్యలన్నియు అభ్యాస లేమిచే నశించును. ఈ జ్ఞానవిద్య ఒక్కమారు పుట్టిన వృద్ధినొందునని యోగవాశిష్ఠమందు జూడ వగును॥ ౩౬॥

శ్లో॥ య త్తదగ్రే విషమివ పరిణామే ఽమృతోపమమ్ ।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధి ప్రసాదజమ్॥ 32

—♦ భా ష్య మ్ ♦—

ఏతదేవ పున ర్విశేషేణ వివృణోతి । యత్తదగ్రఇతి తత్త్రైవం సత్యాదా యమ నియమాద్య భ్యాసారం విఘ్న బాహుళ్యా ద్విషమివో పశమ విశేషావహం భవతి పరిణామేతు యోగసిద్ధా వమృతోపమం ప్రీత్యతిశయాస్పదం భవతీతి తత్సుఖం బుద్ధి ప్రసాదజత్వా త్సాత్త్వికం భవతీతి భావః॥ 32

—♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

దీనినే తిరిగి విశేషముగా వివరణ చేయుచున్నాడు. ఆదియందు యమ నియమాదులు అభ్యసించు కాలమందు అనేక విఘ్నములు గలిగి విషమువలె శాంతనొందుటకు విశేష తాత్పర్యముండును. అది యోగసిద్ధి యందు అమృత ప్రాయమై ప్రీతియందు అతిశయమైన స్థానమై ఆత్మ విషయమైన బుద్ధి నైర్మల్యము వలన గలుగును. అది సాత్త్విక సుఖమగును.

శ్లో॥ విషయేంద్రియ సంయోగా ద్య త్తదగ్రేఽమృతోపమమ్।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్॥ 33

—♦ భా ష్య మ్ ♦—

తద్వై వే దానీం రాజస మప్యాహ— విషయఇతి తత్ర తావ ద్విషయేన్ద్రియ సంయోగా త్స్రక్ చందన వనితా సంగాది జాతం సుఖ మగ్రే ప్రథమారంభే ఽమృతోపమం భవతి పరిణామేతు తద్విషమివేతి తద్రాజసం సుఖమిత్యర్థః॥ 33

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

అటులే ఇప్పుడు రాజస సుఖమునున్ను చెప్పుచున్నాడు. ఏది విషయ శబ్దాదుల యొక్కయు ఇంద్రియ శ్రోత్రాదుల యొక్కయు కలయిక వలన స్రక్ చందన వనితా సంగాదికము వలన పుట్టిన సుఖము ప్రారంభమున అమృతమువలె కానుపించి క్రమముగ పరిపక్వ దశయందు విషము వలె నుండునో అది రాజస సుఖమని తెలియ వలెను. ౩౮.

శ్లో॥ యదగ్రే చానుబంధేచ సుఖం మోహన మాత్మనః ।
నిద్రా లస్య ప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్॥ ౩౯

—♦ భా ష్య మ్ ♦—

ఏవం తృతీయం తామస మప్యాహ—యదగ్రఇతి । తత్ర తావ దగ్రే ప్రథమారంభే తథానుబంధే పరిణామేచ యజ్జీవాత్మనో మోహాకరం సుఖం తన్నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామసం సుఖ ముదాహృత మిత్యర్థః॥ ౩౯॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఈ ప్రకారము తామస సుఖమును జెప్పుచున్నాడు. ఎయ్యది ఆదిని వెనుకను గూడ నాత్మను మోహమున ముంచుచుండునో ఆది నిద్రవలన ఆలస్యము వలన ప్రమాదము వలన జనించును గాన అది తామస సుఖమని తెలియవలెను ॥౩౯॥

శ్లో॥ నతద స్తి పృథివ్యాంవా దివి దేవేషువా పునః ।
సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం యదేభి స్స్యాత్త్రిభి ర్గుణైః॥ ౪౦

—♦ భా ష్య మ్ ♦—

తదిదానీ మనాత్మజాతం త్రిగుణత్వేన సంగృహ్ణాతి। నతద స్తీతి । తత్రైవంసతి ప్రకృతి ర్మాయా తత్ప్రకృతి జై స్త్రిభి రేభి ర్గుణై ర్బంధన హేతుభి ర్ముక్తం హీనం సత్వం ప్రాణిజాత మప్రాణివా యత్స్యా త్తత్పునః పృథివ్యాం మనుష్యాదిషు దేవేషువానా స్తి క్వాపి గుణత్రయ రహిత మిత్యర్థః॥౪౦

—♦ ల ఘు టి ప్ప ణీ . ♦—

నాస్తి క్వాపీతి। తద్యథా 'తదేవ త్సకలం విశ్వం గుణత్రయ మయం కిల నిస్త్రైగుణ్యం భవే త్త ద్వై యద్గుణై ర్నోవిచాల్యత ఇతి జానస్వరోదయేపి ద్రష్టవ్యమ్॥౪౦॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఇప్పుడు అనాత్మ సముదాయమును త్రిగుణములని చెప్పుచున్నాడు. ప్రకృతివలనం గలిగిన యీమూడు గుణములచే బంధన హేతువుగాన విడువబడిన ప్రాణి సముదాయము గాని మరియేదైన గాని పృథివి యందు గాని స్వర్గమందు గాని దేవతలయందుగాని గుణత్రయ రహితమైనది లేదు. (యీ సకల ప్రపంచము గుణత్రయరూపమైనదే యేది గుణములచె చెలింపబడదో అది నిస్త్రైగుణ్య మగునని జ్ఞాన స్వరోదయ మందు జూడనగును॥

శ్లో॥ బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాంచ పరంతప ।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవై ర్గుణైః॥ ౪౧

—♦ భా ష్య మ్ ♦—

నను సర్వస్య త్రిగుణాత్మకత్వే స్థితే బ్రాహ్మణాదిషు కథం తత్వం వర్ణనీయ మిత్యాహ–బ్రాహ్మణేతి । తత్ర తావ

ద్బ్రాహ్మణ స్వభావస్య ప్రశాన్తత్వేన సత్వగుణ ప్రభవత్వం క్షత్రియస్వభావస్య ప్రవృత్తి విషయత్వే సత్వోపసర్జన రజః ప్రభవత్వం వైశ్యస్వభావస్య చలాచల వృత్తిత్వేన రజస్త్వో పసర్జన తమః ప్రభవత్వం శూద్రస్వభావస్యచ మూఢవృత్తి త్వేన కేవల తమఃప్రభవత్వ మితి బ్రాహ్మణాదీనాం స్వభావ ప్రభవై ర్గుణైః కర్మాణి ప్రవిభక్తానీ త్యర్థః॥ ౪౧॥

—♦ ల ఘు టి ప్ప ణీ . ♦—

నన్వేవం సత్వగుణస్యాపి తదంతర్గత త్వామేవేతి కథం తస్య ప్రాశస్త్య మిత్యతో వివేచయ న్నాశంకతే॥ నన్వితి॥ తత్ర తావ ద్యద్యపి సత్వగుణస్యాపి తత్వమేవ తథాపి తత్ర నిమల సత్వస్య బ్రహ్మవిద్యో పయోగిత్వేన నిస్త్రైగుణ్య సంపాదకత్వ మేవేతి బ్రాహ్మణాదీనాం తస్య గరిష్ఠత్వ మవధార్యమ్॥౪౧॥

—♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ! సర్వము త్రిగుణాత్మకమై యుండగా బ్రాహ్మణాదుల యందు గల తత్వమును వర్ణించు మనగా చెప్పుచున్నాడు. బ్రాహ్మణ స్వభావము ప్రశాంత మయిన దగుటచే సత్వగుణము వలన బుట్టినదిగా నున్నా క్షత్రియ స్వభావము ప్రవృత్తి విషయమైన దగుటచే సత్వముతో గూడిన రజోగుణము వలన బుట్టినదిగా నున్నా వైశ్యస్వభావము చల అచల వృత్తి యగుటచే రజోగుణముతో గూడిన తమోగుణము వలన బుట్టిన దానినిగా నున్నా శూద్రస్వభావము మూఢవృత్తి యగుటచే కేవల తమోగుణము వలన బుట్టిన దానినిగాను దెలిసి వీరలకు వేరువేరు కర్మలు విభాగింప బడియున్నవాలింపుము. (ఓయీ! సత్వగుణమున్నా గుణత్రయాం తర్భూతమే గదా దానికి ప్రాశస్త్య మెట్లనగా వివేచన చేయుచు చెప్పు

చున్నాడు. సత్వ గుణము యొక్క తత్వమే విమల సత్వమై బ్రహ్మ విద్యకు ఉపయోగి యగుటచే నిస్త్రైగుణ్యమును సంపాదించునది గాన బ్రాహ్మణులు గొప్పవారనుట.౪౧.

శ్లో॥ శమో దమ స్తపః శౌచం క్షాన్తి రార్జవ మేవచ ।
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్॥ ౪౨

—♦ భాష్యమ్ ♦—

ననుతావ ద్బ్రాహ్మణస్య స్వభావికాని త్వర్మి గుణ కృతాని కర్మాణీ త్యాహ—శమఇతి। తత్రతావ చ్ఛమో నామాంతః కరణస్య విషయేభ్య స్తూపరమో దమోనామ బాహ్యేంద్రియో పరమః తపస్తు దేవ ద్విజ గురు ప్రాజ్ఞే త్యాదా వుక్తం తథా శౌచమపి బాహ్యా భ్యంతర భేదే నోక్తమ్. ఏవం క్షాన్తిః క్షమా తథా ర్జవ మకౌటిల్య మప్యు క్తమేవ ఏవం జ్ఞానం సాంగ వేదాధ్యయనం తత్కౌశల్యంచ విజ్ఞానం బ్రహ్మాత్మైక్యానుభవః సాత్వికీ శ్రద్ధా చాస్తిక్య మిత్యాది నవకం బ్రహ్మ బ్రాహ్మణజాతేః కర్మ స్వభావజ మిత్యర్థః॥ ౪౨

—♦ లఘుటిప్పణీ. ♦—

స్వాభావికానీతి। తదేత చ్ఛ్రుతిరపి. ఆహ తద్యథా, 'తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణో। నానుధ్యాయే ద్బహూం ఛ్ఛబ్దా న్వాచో విగ్లాపనంహితత్' ఇత్యాది బృహదారణ్యకేపి ద్రష్టవ్యమ్॥ ౪౨॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఓయీ! బ్రాహ్మణునికి స్వాభావికమైనట్టెన్ని గుణములచే చేయ బడు కర్మలు యేవనగా చెప్పుచున్నాడు। అంతఃకరణకు విషయ నివృత్తి.

శమము, బహిరింద్రియ నిగ్రహము, దమము, దేవబ్రాహ్మణ గురుప్రాజ్ఞులను పూజించుట తపస్సు. అంతరంగ శుద్ధి, బహిరంగశుద్ధి, శౌచము. ఓరిమి, కుటిలత్వము లేకుండుట, వేదవేదాంగములు చదువుట జ్ఞానము, బ్రహ్మైకాత్మ్యానుభవము - విజ్ఞానము, సత్వగుణ ప్రధానమైన శ్రద్ధ - ఆస్తిక్యము - యీతొమ్మిదిని బ్రాహ్మణజాతికి స్వభావ జన్యములు। బృహదారణ్యక శృతి ప్రమాణము॥ ౪౨॥

శ్లో॥ శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనం।
దాన మీశ్వర భావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్॥　　౪౩

—♦ భా ష్య మ్ ♦—

ఏవం క్షత్రియస్యాపి స్వగుణ కర్మాణి స్వభావ జాన్యాహ। శౌర్యమితి। తత్ర తావ చ్ఛౌర్యం పరాక్రమో ఽధర్మనిరత శ్శతుర్భి ర్భాగ్యేనైవ తు లభ్యత ఇత్యాది స్మృతి న్యాయేన బలవత్తరానపి ప్రహర్తుం సామర్థ్యమ్। ఏవం తేజః ప్రాగల్భ్యం ధృతి ర్ధైర్యం దాక్ష్యం దక్షత యుద్ధేచా ప్యపలాయనమపరాన్ముఖీ భావ ఇత్యర్థః। ఏవం దానం స్వవిత్తానుసారేణ దేవపరత్వం తథేశ్వర భావః ప్రజా పాలన మిత్యాది క్షాత్రం కర్మ క్షత్రియ జాతే స్స్వభావజం। సత్వోపసర్జన రజోగుణ స్వభావజ మిత్యర్థః॥ ౪౩॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

ప్రజాపాలన సామర్థ్యమితి తద్యథా, 'ప్రజాకరంద దాత్యర్థా పుత్రో భోక్తా ప్రసిద్ధిభిః పుత్రేభ్య స్త్వధిక స్తస్మా త్ప్రజా నైవాత్ర సంశయ' ఇత్యాది స్మృత్యాపి క్షత్రియాణాం తదన్యేషాం చ రాజ ధర్మవతాం వి

ప్రాజ్ఞయా ప్రజా పాలన మవశ్యమేవ యుక్తం ఏతదుక్తంభారతే 'శ్రుతి స్మృతి పురాణాని సేతిహాసా నికాన్యపి ద్విజ శ్శూద్రముఖా చ్ఛ్రుత్వా సచేలం స్నాన మాచరేత్' ఇత్యవధార్యమ్॥౪౩॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఈప్రకారము క్షత్రియునికిన్ని స్వభావ జన్యములైన గుణకర్మలను చెప్పుచున్నాడు. అధర్మ నిరతుడైన శత్రువు భాగ్యవశముచె లభించు చున్నాడను స్మృతి న్యాయముచె బలవంతులనున్ను కొట్టివేయు సామర్థ్యము గల పరాక్రమము శౌర్యము ప్రగల్భత్వము తేజస్సు ధైర్యము ధృతిసామ్యమర్థ దాక్ష్యము యుద్ధమందు పారిపోకుండుట విత్తానుసారముగా దానము ఈశ్వర పరతంత్రుడై యుండుట ప్రజాపరిపాలనము-క్షాత్రము ఇవి క్షత్రియులకు సత్వగుణముతో గూడిన రజోగుణము యొక్క స్వభావ జన్యమైన గుణములు ప్రజలు పన్ను చెల్లించువారు పుత్రుడు ప్రసిద్ధిగా ననుభవించువాడు రాజులకు ప్రజలు పుత్రులకంటె నధికులు సంశయము లేదనిన స్మృతిని బట్టి రాజులకును రాజధర్మము గల అన్యులకును బ్రాహ్మణుల యాజ్ఞచే ప్రజలను పరిపాలించుట అవశ్య కర్తవ్యము. శ్రుతి-స్మృతి పురాణ ఇతిహాసాదులను బ్రాహ్మణుడు శూద్రముఖమువల్ల విన్న యెడల సచేల స్నాన మాచరింప వలయునని భారతమందు గలదు॥౪౩॥

శ్లో॥ కృషి గోరక్ష వాణిజ్యం వైశ్య కర్మ స్వభావజం ।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్॥ ౪౪

—♦ భాష్యమ్ ♦—

ఏవం వైశ్యస్యాపి వృత్త మాహ—కృషీతి। తత్ర తావత్కృషీ ర్నామా న్నోత్పత్త్యర్థం భూమి ర్విలేఖనమ్ । ఏవం గోరక్ష్యం పశుపాలనం వాణిజ్యంతు క్రియ విక్రియాది లక్షణ

మిత్యాది రజస్స్వోపసర్జన తమస్స్వభావజ మిత్యర్థః । ఏవమిహ శూద్రస్యాప్యాహ । పరిచర్యేతి । తదిహ తావ త్పరిచర్యాత్మకం ద్విజాతి శుశ్రూషాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజం కేవల తమస్స్వభావజ మిత్యర్థః॥ ౪౪॥

—• లఘు టిప్పణీ •—

పరిచర్యాత్మకమితి । తద్యథా, 'పరిచర్యాం విహాయాథ యశ్శూద్రో విజితేంద్రియః । తపశ్చర్యా పరో మూఢో నిరయం యాత్యసంశయ మిత్యాది కృత్యసారేపి ద్రష్టవ్యమ్॥౪౪॥

—• ఆంధ్ర తాత్పర్యము. •—

ఈప్రకారము వైశ్యునకున్నూ వ్యాపారమును చెప్పుచున్నాడు. భూమిని దున్నుట-కృషి గోవులను రక్షించుట క్రయ విక్రయములుగలది వాణిజ్యము. ఇవి వైశ్యునకు రజోగుణముతో గూడిన తమోగుణము యొక్క స్వభావ జన్యమైన గుణములు. ఈ ప్రకారమె శూద్రునికిని చెప్పుచున్నాడు. బ్రాహ్మణసేవా రూపమైన కర్మ శూద్రునకు తమోగుణ స్వభావమైన కర్మయని తెలియవలెను. శూద్రుడు బ్రాహ్మణ పరిచర్య చేయక జితేంద్రియుడై తపస్సును జేయుచున్న యెడల, మూఢుడై నరకము నొందును. సంశయము లేదని కృత్యసారమను గ్రంథమందును జూడ గలదు. ౪౪.

శ్లో॥ స్వే స్వే కర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః
　　స్వకర్మ నిరత స్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు॥　　౪౫

—♦ భా ష్య మ్ ♦ —

నను స్వస్య జాత్యనుసారేణైతావంతి కర్మాణి కుర్వతః కింఫల మిత్యాహ—స్వేస్వేతి । తత్రైవంసతి । సర్వ ఏతే పుణ్యలోకా భవన్తి బ్రహ్మ సంస్థాశ్చామృతత్వం యాన్తీ త్యాది శ్రుత్యా కుటీచకో గృహస్థస్స్యాద్బ్రహ్మచారీ బహూదకః । వానప్రస్థో థహంస్స్యాత్పరహంసస్తు జ్ఞానవా నిత్యాది స్మృత్యా చతుర్విధ వర్ణధర్మేష్వేవా శ్రమధర్మోఽపి బ్రహ్మర్షి ,రాజర్షి గణ సేవితస్తేనచ కథ మిహాముత్ర కైవ ల్యాన్త సిద్ధిరితి తామపి సిద్ధిం యథావిందతి తత్తస్మాచ్ఛృణ్వి త్యర్థః॥౪౫॥

—♦ ల ఘు టి ప్ప ణీ . ♦—

సర్వఏతఇతి॥ తదుక్తం తత్వసారేపి । యో యద్ధర్మే రను ష్ఠేయ స్తత్తద్ధర్మానుగా గతిః । బ్రహ్మ క్షత్రాద్యనుక్రాన్తా గ్రహై ర్యోగాది వత్తథ్వీత్యుక్తే తత్రోత్తమా ధమ జాతీనాం సర్వాసా మిహా ముత్ర లోకేషు నైకైవ గతిః । కింతు యథా జ్యోతిషే బ్రాహ్మణేషు రాజయోగశ్చే న్మహత్వాధిక్యా ద్రాజమాన్యత్వం స్వతోవా రాజత్వం తథాక్షత్రియేషు తద్యోగా త్సుతరాం రాజత్వం వైశ్యేషు ధనాఢ్యత్వం శూద్రేషు రాజసేవకత్వం శూద్రేష్వా ధిపత్యాది వివేక్తవ్యమ్॥ ౪౫॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము . ♦—

ఓయీ! తమ తమ జాతికనుకూలమైన యిన్నికర్మలను చేసిన వానికి ఫలమేమిటి యనగా చెప్పుచున్నాడు । కుటీచకుడు గృహస్థుడుగాగలడు, బ్రహ్మచారి బహూదకుడు గావచ్చును వానప్రస్థుహంసగావచ్చునుజ్ఞానము

గలవాడే పరమహంస యను శృతి స్మృతులచే జాల్గు విధములైన వర్ణ ధర్మముల యందు ఆశ్రిమ ధర్మమున్ను బ్రహ్మర్షి రాజర్షి గణములచే సేవించబడు చుండును, కర్మాసక్తుడైన యెడల ప్రతిమానవుడును జ్ఞాన యోగ్యుండగును. అందున ఇహ - పర - కైవల్యములు యెట్లు సిద్ధించునో వచించెద నాలింపుము (యెవడు యేధర్మము ననుష్ఠించునో వానికి యా ధర్మము ననుసరించిన గతిగలుగును। గ్రహములచే యోగాదులచే యోగా దులవలె బ్రాహ్మణాదులచె ధర్మములు చేయుచుననట్లు ఉత్తమా ధమ జాతులకు అందరికి ఇహపరముల యందు ఒకేగతిగాదు। ప్రకాశముగల బ్రాహ్మణులకు రాజయోగము వచ్చినయెడల అధికమైన మహిమ గలు గుటచే రాజపూజ్యముగాని స్వయముగా రాజగుటగాని, క్షత్రియులకు రాజయోగము పట్టినపుడు అత్యంతము రాజగుట, వైశ్యులకు రాజ యోగము పట్టినపుడు ధనాఢ్యుడగుట శూద్రులకైతే రాజసేవకత్వము నౌకరి మొదలగునవి యని తెలిసి కొనవలెయును॥ ౪౫॥

శ్లో॥ యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందంతి మానవః॥　　౪౬

—♦ భా ష్య మ్ ♦—

సన్విహ స్వీయ ధర్మ పూర్వికైన ప్రవృత్తి రుక్తా తయాచ కథం కైవల్యాన్తస్య సిద్ధి రిత్యాహ—యతఇతి। తథాచేహ సంసారే యతో భూతానాం ప్రవృత్తి ర్యేన చేశ్వ రేణ సాక్షిణా సర్వమిదం త తమిహ సకలేష్టసిద్ధి ప్రదం పరమ శివం జ్ఞాతుమిచ్ఛాచే త్తదా స్వస్వధర్మ మార్గేణ సమర్చ్యే శ్వారుకమివేతి శ్రుతిన్యాయేన సిద్ధిం విన్దతి నాన్యథే త్యాశయః॥ ౪౬॥

## —♦ లఘుటిప్పణీ ♦—

సకలేష్టసిద్ధిప్రదమితి॥ తద్యథా । అత్యాశ్రమో య మాఖ్యాతో యత స్సర్వాశ్రమోగృహీ । త్రయో ప్యత్రైవ బోధవ్యా బ్రహ్మచర్యాదయో ప్యమీతి' పర్యవసితే । కుటీచకో గృహస్థః స్యా ద్బ్రహ్మచారీ బహూదకో । వానప్రస్థో ఒథహంసః స్యాత్పరహంసస్తు జ్ఞానవా నిత్యాద్యుక్త్యా గార్హస్థ్యాశ్రమస్యైవ వేదప్రణీతత్వేన సకలేష్ట సాధకత్వం స్ఫుటీకృతం । అతఏవ దేవోపాసనయా దైవం పైత్రం తు పుత్రతో జయేత్ 'వతోపాసనయా త్వార్షం త్రిభిస్తు పరమం జయేదిత్యాదినా మనునా ప్యుక్త మవధార్యమ్॥౪౬॥

## —♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఓయీ! ప్రవృత్తి యనగా స్వధర్మాచరణగలదే. దానిచే కైవల్యాఖ్యమైన సిద్ధి యెట్లు గలుగుననగా చెప్పుచున్నాడు. ఈ సంసారమందు యెవనివలన భూతము లుత్పత్తి యగుచున్నవో సాక్షిరూపమైన యేఈశ్వరునిచే యీసంసారమంతయు వ్యాప్తమయినదో ఇక్కడ సకలమైన ఇష్టసిద్ధులనిచ్చు పరమశివుని తెలియ నిచ్చ గలిగిన యెడల స్వధర్మ మార్గముచే పూజించి, దోసపండువలె సిద్ధిని బొందగలవు. మరియొక సాధనములేదు. గృహస్థు సర్వాశ్రమములు గలవాడు గాన అత్యాశ్రమివలె చెప్పవచ్చును. బ్రహ్మచారి, గ్రహస్థు, వానప్రస్థులు యీగ్రహస్థునందే తెలియనగును. కుటీకకుడు గృహస్థుడుగావచ్చును. బ్రహ్మచారి బహూదకుడు, వానప్రస్థు హంసయగును. జ్ఞానముగలవాడు పరమహంస గాగలడని స్మృతిచే గృహస్థాశ్రమమే వేదవిహిత మగుటచే సకలేష్టములను సాధించునదని స్ఫుటమైనది. గనుకనె దేవోపాసనచే దేవఋణమును పుత్రసంతానముచే పితృఋణమును వ్రతోపవాసా దులచే ఋషి ఋణమును దీర్చి యీమూడింటిచేతను పరంపదమును జయించ వచ్చునని మను వాక్యమును తెలియవలెను.౪౬.

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వభావ నియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్॥ ౪౭

## —♦ భాష్యమ్ ♦—

నన్వజ్ఞానా జ్జానతోపివా కేనాప్యపూర్వేణ జాత్యన్తర ధర్మేణ సంచరన్ కిం సిద్ధిం యాస్యతి, నైవ మిత్యాహ।శ్రేయా నితి॥ తత్రైవం సతి। పరధర్మాత్స్వనుష్ఠితా దపి స్వధర్మో విగుణః కించి న్న్యూనోపి శ్రేయా నిత్యర్థః । యత స్స్వభావ నియతం తపశ్శౌచాదికం కర్మ శాస్త్రోక్తంచ కుర్వన్ కిల్బిషం నాప్నోతీ త్యర్థః॥ ౪౭॥

## —♦ లఘుటిప్పణీ ♦—

కించిన్న్యూనోపీతి॥ తత్తజ్జాతి విశేషేణ కించి న్న్యూనోపి యోధర్మ సఏవ కార్యో నతిద్విపరీతం కుర్యా దిత్యర్థః తద్యథా పురాణ సముచ్చయే 'అసతాం ప్రగ్రహో యత్ర సతాంచైవావ మానతా దండో దైవకృత స్తత్ర సద్యః పతతి దారుణ' ఇత్యాదినా దక్షయజ్ఞప్రమథన వృత్తాంతేనాపి ద్రష్టవ్యమ్॥౪౭॥

## —♦ ఆంధ్రతాత్పర్యము. ♦—

ఓయీ! తెలియక గాని తెలిసిగాని క్రొత్తదియైన అన్యజాతి ధర్మము నాచరించిన యెడల సిద్ధి దొరకునా యంటె కాదని చెప్పుచున్నాడు. పరధర్మమును బాగుగా ననుష్ఠించిన దానికన్న స్వధర్మముకొంచెముతక్కువయైనను మంచిదేయని యర్థము. స్వధర్మనిరతుడై తపస్సు శౌచము మొదలయిన కర్మలను శాస్త్రోక్తముగా నాచరించుటవలన పాపముం గాంచడు (యేధర్మము అయాజాతి విశేషములచే కొంచెము తక్కువ యైనను

స్వధర్మమే చేయవలెను. దానికి విపరీతముగా అన్యధర్మము నాచరింప రాదు. దుష్టులను చేరదీసి సిష్టుల నవమానించి నందున తత్కాలమందు దైవకృతమైన దండన జరుగును. ఇత్యాదులను దక్షయజ్ఞ వృత్తాంతముచేత మన్నూ తెలియగలరు॥౪౭॥

శ్లో. సహజం కర్మ కౌన్తేయ సదోషమపి నత్యజేత్ ।
సర్వారంభాహి దోషేణ ధూమేనాగ్ని రివావృతాః॥ ౪౮

—♦ భా ష్య మ్ ♦—

అథ యథోక్త మేవావశ్యకత్వా దవధారయ న్నాహ సహాజమితి॥ తత్రైవంసతి హేకౌన్తేయ సహజం స్వభావజం యథోక్తం కర్మ సదోషమపి కించిన్న్యూన మపి నత్యజే త్స్వధర్మస్యా న్తఃకరణ శుద్ధ్యుపయోగిత్వా దితిభావః । నన్వే తావతాపి హింసాది యుక్తమపి నత్యజే దిత్యత్ర కోహేతు రిత్యాహ । సర్వేతి తథాచేహ త్యజేదేవేతి తనాగ్రహ స్తర్హి సత్వాది త్రివిధస్యాపి గుణస్య ప్రకృతి జన్యత్వేన మూలప్రకృతి మేవ త్యజేదితి ధూమేనాగ్ని రివసర్వకర్మణాం త్రైగుణ్యేన ప్రకృతిజ దోషేణా వృతత్వా త్కిమపి త్వయా నకార్యంతస్య చాశక్యత్వా దితిసిద్ధాంతః॥ ౪౮॥

—♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నన్విహ సర్వస్య ప్రపంచజాతస్యత్రిగుణాత్మకత్వే స్థితే తత్వేన కిమపి నకార్య మిత్యాగ్రహశ్చే త్తర్హి తస్యా శక్యత్వేనాహ—సిద్ధాన్తఇతి ఏకంతర్హి 'తామ సాద్రా జసం శ్రేష్ఠం రాజసా త్సాత్వికం మతం సాత్వికాన్నపరం కించి ద్యతః కైవల్య భాగ్భవేదిత్యాది స్మృత్యా తావ

త్కైవల్యా మ్యుపయోగిత్వేన సాత్త్విక మేవ కార్యం తత్రాశక్తశ్చే దిహా ముత్ర సాధకం రాజసం తత్రాప్యశక్తశ్చే త్కామ హైతుకం తామస మపీతి మాతృవచ్ఛ్రుతిః శ్రోతృహితైషిణీతి న్యాయేన కిమపి కార్యంచే చ్ఛాస్త్రోక్త మేవ కార్యమిత్యాశయః॥౪౮॥

—• ఆంధ్రతాత్పర్యము •—

విహితకర్మయే అవశ్యక మగుటవలన అవధరింప వలయునని చెప్పు చున్నాడు. ఓకౌంతేయా! సహజ కర్మము కొంచెము తక్కువయైనప్పటికి విడువరాదు. స్వధర్మము అంతఃకరణశుద్ధికి ఉపయోగించునది గనుక వదల రాదు. ఓయీ! ఈ చెప్పుటచేత హింసాదులతో గూడినప్పటికి వదలరాద నుట యందు హేతువేమి యనగా చెప్పుచున్నాడు. వదలవలయు నని నీకు అగ్రహము గలిగిన యెడల సత్వ రజస్తమో గుణములు ప్రకృతి జన్య ములగుట వలన మూల ప్రకృతినే వదలవలయును. ధూమముతోనగ్నిగప్ప బడినట్లు సర్వకర్మలు త్రిగుణాత్మకమై ప్రకృతియందు పుట్టిన దోషము తో నావరింప బడిన వగుటవలన యేమియు నీచేత చెయ్య శక్యముగాదు. చెయ్యలేవని సిద్ధాంతము. (ఓయీ సర్వప్రపంచ సముదాయము త్రిగుణా త్మకమై యుండగా యథార్థముగా యేమీ చెయ్యగూడదని అగ్రహము వస్తే దానికి శక్యముగాదని చెప్పుచున్నాడు. సిద్ధాంతమనగా తామసకర్మ కన్న రాజసకర్మ శ్రేష్ఠము రాజస కర్మకన్న సాత్త్విక కర్మ శ్రేష్ఠము సాత్త్విక కర్మ వలన కైవల్యమును బొందును గాన సాత్త్వికము కన్న మరి మంచి కర్మలేదు. ఇత్యాది స్మృతులచే సాత్త్విక కర్మనె చెయ్యవలయును. అది చెయ్యలేని యెడల ఇహలోక పరలోక సాధకమైన రాజసకర్మ చేయవలయును. అదిన్ని చెయ్యలేని యెడల కామహేతువైన తామస కర్మను చేయవలయును. తల్లివలె శృతి, వినువారికి హితవుగా నుండును న్యాయముచే యేమిచేసినను శాస్త్రోక్త కర్మనే చెయ్యవలయునని యాశయము॥ ౪౮॥

శ్లో॥ అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగత స్పృహః
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సంన్యాసేనా ధిగచ్ఛతి॥ ౪౯

—◆ భాష్యమ్ ◆—

నన్వేవం సర్వకర్మణాం త్యాగ సమర్థ స్తథా కామనయా కుర్వతస్తు ఫలాభిసంధినా బంధఏవేతి కింకుర్యాదిత్యాహ—అసక్తేతి। తత్రైవంసతి। శ్రుతి స్మృతి విహితం కర్మ కుర్వాణ శ్శుద్ధాంతః కరణస్సన్ శాంతో దాంత స్తితిక్షుస్సమాహితో భూత్వాత్మన్యేవా త్మానం పశ్యేదిత్యాది శ్రుత్యా శబ్దస్పర్శాదిషు సర్వత్రా సక్తబుద్ధి స్సన్విజితాత్మా విగతస్పృహశ్చ భూత్వా నైష్కర్యసిద్ధిం బ్రహ్మసాక్షాత్కార యోగ్యతాం నిస్త్రైగుణ్యాలక్షణాం పరమాం సన్న్యాసేన యథోక్తరీత్యాఫలాభిసంధి రహితేన కర్మణా ధిగచ్ఛతీ త్యర్థః సర్వ సంసార సౌఖ్యాని త్యక్త్వా చిత్తం శివేలయేత్। దండ కౌపీన కాషాయ జటా వల్కల ధారకః। ముండీవా శివచిహ్ణాని ధారయే దజినాదికం భిక్షాశీ నియతాహార స్సుఖ సంసార వర్జితః। కుటీచకో బహూదక్య హంసః పరమహంసకః తుర్యాతీతో వధూతశ్చ సన్యాసష్షడ్విధో భవేత్॥ సర్వే పాశుపతాస్సిద్ధా భస్మోద్ధూళిత విగ్రహాః। సర్వశాస్త్రార్థ తత్త్వజ్ఞా వేద వేదాంగ పారగాః। శివాశ్రమ రతా స్సర్వే శివజ్ఞాన పరాయణాః। సర్వసంగ వినిర్ముక్తా శ్శివై కాసక్త చేతసః। సర్వ ద్వంద్వ సహా ధీరా సర్వ భూత హితేరతాః। ఋజవో

మృదవ స్స్వస్థా జితక్రోధా జితేంద్రియాః। రుద్రాక్ష మాలా భరణా త్రిపుండ్రాంకిత మస్తకాః। శిఖాజటా స్సర్వజటా అజటా ముండ శీర్షకాః। ఫలమూలాశన ప్రియాః ప్రాణాయామ పరాయణాః। శివాభిమాన సంపన్నాః శివధ్యానైక తత్పరాః। సమున్మథిత సంసార విషవృక్షాంకురోద్గమాః। ప్రయాతుమేవ సన్నద్ధాః పరం శివపురం ప్రతి। ఆదిశైవా మహాశైవా శ్శోత్తమా స్త్వనుశైవకాః। ఏతే సన్న్యాస మర్హంతి శాపదగ్ధా స్త్వనర్హకాః। పతితా శ్చాంగవికలా స్సన్న్యస్తుం నాధికారిణః॥ ౪౯॥

## —• ఆంధ్ర తాత్పర్యము. •—

సర్వకర్మలను వదలుట యందు సమర్థుడైన వాడు కోరికలేక కర్మచేయడు. ఫలాభిసంధి బంధమేగదా యేమిచెయ్య వలయునంటె చెప్పుచున్నాడు. శృతి స్మృతుల యందు చెప్పబడిన కర్మను చేయుచు శుద్ధాంతః కరణ గలవాడై శాంతుడై దాంతుడై తితీక్షుడై సమాహితుడై ఆత్మయందాత్మను జూడవలయు నన్న శృతి ప్రకారము శబ్దస్పర్శాదుల యందును అంతటను ఆసక్తి లేనివాడగుచు జితేంద్రియుడై ఈషణాత్రయ మును వదలి, బ్రహ్మ సాక్షాత్కారమునకు దగినట్టిన్ని త్రిగుణ రహితమైన ఉత్కృష్టమైన నైష్కర్మ్య సిద్ధిని, సన్న్యాసముచె ముందుజెప్పబోవు రీతిగా ఫలాభిసంధిలేని కర్మచే, బొందుచున్నాడు॥ సన్న్యాసమును జెప్పుచున్నాడు సర్వమైన సంసార సౌఖ్యములను వదలి, చిత్తమును శివునియందు లయింప చేయవలయును. దండకమండలు కాషాయవస్త్రములు ధరించి జటా వల్కల ధారియై। లేక ముండియైననుసరె భస్మ రుద్రాక్షలను వ్యాఘ్ర చర్మాదికమును ధరించవలయును। నియమిత ప్రకారము లఘువుగా

భిక్షాటన చేయుచు సుఖసంసారము లేనివాడై కుటీచక - బహూదక, హంస - పరమహంస, తుర్యాతీత, అవధూత అని సన్యాసము ఆరు విధములు - అందు అవధూతా శ్రమము ఋషిసిద్ధయని రెండుభేదములు. వీరందరు పాశుపతులు సిద్ధులు భస్మచే పూయబడిన శరీరము గలవారు వేద వేదాంగములు సర్వశాస్త్రముల యొక్క తత్వమును దెలిసిన వారు శివాశ్రమ మందున్న వారు శివజ్ఞానమందు పరాయణులు । దేహాశ్రయ ముతో సంగమును వదలి శివుని యందాసక్తి గలవారలు. శీతోష్ణాది ద్వంద్వములను సహించు వారలు ధీరులు సర్వభూతములకు హితవు చేయుటయందాసక్తులు. ఋజువు మృదువులైన శరీరములు గలవారలు, స్వస్థులు, క్రోధమును జయించి ఇంద్రియముల నిగ్రహించు వారలు। భస్మ రుద్రాక్షలను ధరించువారు. కొందరు జటాజూటులు, కొందరు జడలను విరియబోసియుందురు, కొందరు జటలు లేనివారు. కొందరు ముండులు - కందమూల ఫలాశన మందు ప్రియులు, ప్రాణాయామాది యోగాభ్యాస ముల యందు నిపుణులు, శివాభిమానము గలిగి శివధ్యానము చేయుచుం దురు, సంసార విషవృక్షాంకురముల మధించివేసి శివపురమును జేరు టకు సన్నద్ధులై యుందురు ఇది సన్యాసము ఇట్టి శైవబ్రాహ్మణులు స్మార్తబ్రాహ్మణులు, క్షత్రియ వైశ్యులును సన్యాసమునకు అర్హులు : ఇందు శాపదగ్ధులైన వారును పతితులును అంగవికలురు సన్యాసమునకు అర్హులు గారు॥ ౪౯॥

శ్లో॥ సిద్ధింప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధమే।
సమాసేనైవ కౌన్తేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా॥ ౫౦

—• భా ష్య మ్ •—

నను కథం త్వార్హి నైష్కర్మ్య సిద్ధ్యుత్తరం బ్రహ్మ ప్రాప్నోతీ త్యాహ—సిద్ధిమితి । ఏవం సతి హేకౌన్తేయ

నైష్కర్మ్యసిద్ధిం ప్రాప్తో యథా శివ మద్వైతం భూమాత్మానం ప్రాప్నోతి తథా తంప్రకారం మేవచనా త్సమాసేనైవా వధారయ యాచ జ్ఞానస్య జ్ఞాతవ్యస్య నిష్ఠా పరా యదంతరం జ్ఞాతవ్యంనాస్తీతి తామప్య వధారయే త్యాశయః॥ ౫౦॥

—♦ లఘు టిప్పణీ ♦—

నైష్కర్మ్యసిద్ధిః॥ నను కాతర్హి నైష్కర్మ్య సిద్ధి రితిచే చ్ఛృణు ! 'యస్మిన్ కృతే నకర్మాస్తి కర్తవ్యం తత్కృతం యతః । నైష్కర్మ్యం తత్సమాఖ్యాతం యదుక్తం శాస్త్రకోటిభి రిత్యాది' స్మృత్యా యస్మిన్ కృతే నకించిత్కర్మ క్రియతే తన్మేమన శ్శివసంకల్పమస్తు । ఇత్యాది శ్రుత్యాచ శ్రుతేరివార్థం స్మృతి రన్వగచ్ఛదితి న్యాయేన చ నైష్కర్మ్య లక్షణ సిద్ధి రిత్యాశయః॥౫౦॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఓయీ! నైష్కర్మ్య సిద్ధి తర్వాత బ్రహ్మము నెట్లు పొందుచున్నాడనగా చెప్పుచున్నాడు. ఓకౌంతేయా ! నైష్కర్మ్య సిద్ధి నొందినవాడు అద్వైతమైన భూమాస్వరూపుడైన శివుని బొందినట్లు ఆప్రకారమె నావాక్యము వల్ల ముగించి కొద్దిగా వినుము. జ్ఞానముకు జ్ఞాతవ్యముయొక్క నిష్ఠ గాక, దేని తర్వాత తెలియ దగినది లేదో దానినిన్ని ధరింపుము. (ఓయీ! నైష్కర్మ్య సిద్ధి యనగా నేదియంటే వినుము. యే నిష్కామ కర్మ జేసిన యెడల చేయదగిన కర్మలేదో అది నైష్కర్మ్య మని కోటి శాస్త్రములచే జెప్పబడు చున్నది. యేది చేసిన మరి చేయనక్కరలేదో యని శివసంకల్పోపనిషత్తున్నూ నిష్కామ కర్మయే యని చెప్పినది, శ్రుతి స్మృతుల యొక్క అర్థము వక్కటియె యను న్యాయముచె నైష్కర్మ్య సిద్ధి లక్షణము నెరుగ వలయునని యాశయము.॥ ౫౦॥

శ్లో॥ బుధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యా త్మానం నియమ్యచ
శబ్దాదీ న్విషయాన్ త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్యచ॥ ౫౧

—◆ భాష్యమ్ ◆—

అథచ సేయం జ్ఞాననిష్ఠా సవ్యవస్థయో చ్యతే । బుద్ధ్యేతి॥ తత్ర తావత్ బుధ్యా న్తఃకరణవృత్తి విశేషరూపయా తయా పున ర్విశుద్ధయా సంశయ విపర్యయా సంభవ శూన్యయా యుక్త స్తథా ధృత్యా ధైర్య రూపయా త్మానం శరీ రేంద్రియ సంఘాతం నియమ్య శబ్దాదీ న్విషయాన్ రాగ ద్వేషౌ చవ్యుదస్యే త్యర్థః॥ ౫౧॥

—◆ లఘుటిప్పణీ ◆—

వృత్తివిశేషరూపయేతి॥ తద్యథా, 'సంఘాతమహ మాధత్తే బుద్ధి స్థైర్యం వ్రజత్యతః । మన శ్చాంచల్య వృత్తిస్స్యా చ్చిత్తం స్వానుభవాత్మక మితి' స్మృత్యా చిత్తావస్థాపన్నయా విశేషరూపయేత్యర్థః॥ ౫౧॥

—◆ ఆంధ్రతాత్పర్యము ◆—

ఆ యీ జ్ఞాననిష్ఠను వ్యవస్థతో కూడా చెప్పుచున్నాడు. అంతఃకర ణవృత్తి విశేషమైనట్టిన్ని సంశయము విపర్యయము అసంభావనా యీదోషములు లేక శుద్ధమైన బుద్ధితో గూడి ధైర్యముచే దేహేంద్రియ ముల నియమించి శబ్దాది విషయములను వదిలి రాగద్వేష ములనున్ను విడిచి, దేహేంద్రియాదులను అహంకార మభిమానించును. బుద్ధి స్థిరము జేసును. మనసు చంచలవృత్తి గలది చిత్తము స్వానుభవరూపమైనదని స్మృతిచే చిత్తము స్థిరమైన విశేష రూపముతో గూడిన బుద్ధికి వృత్తివిశే షమని పేరు॥ ౫౧॥

శ్లో॥ వివి క్తసేవీ లఘ్వాశీ యతవా క్కాయ మానసః ।
ధ్యాన యోగ పరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥౫౨

—◆ భాష్యమ్ ◆—

ఏవమపరమపి తత్ప్రకారమాహ—వివిక్తేతి । తథాచ వివిక్తం జనసంసర్గరహితం శుద్ధం దేశం సేవితుం శీలం యస్యేతిసవివిక్త సేవీ త్యర్థః । తథా లఘ్వాశీ నిద్రాలస్యాది రహితత్వాచ్చ యత వాక్కాయ మానసో యమ నియమాదినా ధ్యాన యోగపరో వైరాగ్యంచ నిత్యముపాశ్రిత ఇత్యర్థః॥ ౫౨॥

—◆ లఘుటిప్పణీ. ◆—

లఘ్వాశీతి । తద్యథా. 'సుస్నిగ్ధ మధురాహార శ్చతుర్థాంశ వివర్జితః। భుజ్యతే శివ సంప్రీత్యై మితాహార సఉచ్యతే' ఇత్యాది ద్రష్టవ్యమ్॥౫౨॥

—◆ ఆంధ్రతాత్పర్యము. ◆—

ఈ ప్రకారము మరియొక పద్ధతిని జెప్పుచున్నాడు. జన సంసర్గము లేని ప్రదేశమందుండి, నిద్రా, ఆలసత్వము లేకుండుటకు లఘుభోజనము జేయుచు, యమ నియమాదులచే మనో వాక్కాయముల నియమించి, ధ్యాన యోగముంజేసి కొనుచు. వైరాగ్యము నున్నా నిత్యము ఆశ్రయించి, లఘుభోజనమనగా, మృదు మధురమైన యన్నమును నాల్గవ భాగమును విడిచి శివప్రీతి కొరకు భుజించునది మితాహార మనబడును॥ ౫౨॥

శ్లో॥ అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహం
విముచ్య నిర్మమ శ్శాన్తో బ్రహ్మ భూయాయ కల్పతే॥౫౩

## —• భా ష్య మ్ •—

ఏవమిహా పరమపి తత్ప్రకార మాహ అహంకారమితి తత్రైవంసత్య హం మహతాం శిష్యః పండితో విరక్తశ్చ నాస్తి ద్వితీయో మత్సమ ఇత్యాద్యభిమానో ఽహంకారో బలంచా సదాగ్రహ రూపం తత్ర శరీరంచ దర్పం హర్ష జన్యంచ మదం ధర్మాతిక్రమణంచ కామం తథాయోగ ప్రతి బంధకం చ విషయాభిలాషం తదలాభేన క్రోధం పరిగ్రహంచ మనశ్చాలకం ధనాది సంచయంచ విముచ్య సశరీర మిదం విశ్వం నకించి దితి నిశ్చయా త్యాది సిద్ధాన్త స్మృతి న్యాయేనా హం మమే త్యాది సర్వాభినివేశ వర్జిత త్వేన శాన్త స్సమరసీ భూతో బ్రహ్మభూయాయ కల్పతే సమర్థో భవతీ త్యర్థః॥౫౩॥

## —• ల ఘు టి ప్ప ణీ •—

కామమితి॥ నను కీదృశీ కా సామగ్రీ కిమర్థంచ సాత్యక్తవ్యే తిచే చ్ఛృణు । 'ఉన్మిల త్త్రివళీ తరంగ వలయా ప్రోత్తుంగ పీన స్తన ద్వంద్వేనో ద్యత చక్రవాక మిథునా వక్త్రాంబుజోద్భాసినీ । కన్యాకార ధరా నదోపమ మితా క్రూరాశయే నే ష్యతే సంసారార్ణవ మజ్జనం యది తతో దూరేణ సంత్యజ్యతామ్' ఇత్యవధార్యమ్॥ సర్వాభినివేశేతి॥ తద్య థా,'దూరే ముంచతి బంధు మస్తమివ యః సంఘా ద్భుజంగాదివ త్రాసం యో విదధాతి వేత్తి సదృశం భోగంచ రోగంచయః । స్త్రైణేయ స్తృణవ ద్ఘృణాం ప్రకురుతే మిత్రేష్వ మిత్రేష్వపి స్వాన్తం యస్య సమంసమంగళ మిహాముత్రాపి మర్త్యోచ్యుత' యిత్యాది ద్రష్టవ్యమ్॥ ౫౩॥

## —◆ ఆంధ్ర తాత్పర్యము ◆—

ఇక్కడ మరియొక ప్రకారమును జెప్పుచున్నాడు. నేను మహాత్ముల శిష్యుడను పండితుడను విరక్తుడను నాతో సరియగు మరియొకడు లేడను అహంకారమునున్నూ అసత్సందాగ్రహరూపమైన బలమును, శరీరమును, సంతోషము వలన పుట్టిన దర్పమునున్నూ, ధర్మమును అతిక్రమించునట్టి మదమునున్నూ యోగమునకు ప్రతిబంధకమైన విషయాభిలాషగల కామమును, అది లభించనప్పుడు క్రోధమునున్నూ మనసును చలింపజేయు ధన సంచయమునున్నూ వదలి, యీశరీరముతో గూడిన విశ్వము కొంచెమునూ లేనిదానినిగా నిశ్చయించుచున్న సిద్ధాంత న్యాయముచే అహంకార మమకారములు లేక శాంతుడై సమరసము గలవాడై నేనే బ్రహ్మమని నిశ్చలుడై యుండదగినవాడు॥ ౫౩॥

శ్లో॥ బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతి నకాంక్షతి ।
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్॥ ౫౪

## —◆ భాష్యమ్ ◆—

ననుచ సకథం భూతో భవతీతి సంక్షేపతో వక్తవ్యమిత్యాహ—బ్రహ్మభూత ఇతి॥ తత్రైవం సతిసర్వం సర్వత్ర సర్వదేతి బ్రహ్మభూతస్సన్ కిమహం నాకరవమిత్యాది శ్రుత్యా నశోచతి పూర్ణో ద్వైతసతత్వామే త్యాది స్మృత్యా త్మకామత్వాన్నకాంక్షతీతి కృత్వాశాస్త్ర సజ్జనసంపర్కో విచారో ఽసంగభావనే త్యలోక్తి సప్తమ భూమికా ప్రాప్తత్వేన సమస్సర్వేషు భూతేష్వితి మమ పరం పదాఖ్యాం పరమ శివైకనిష్ఠాలక్షణాం భక్తిం లభత ఇత్యర్థః॥ ౫౪॥

## ఆంధ్ర తాత్పర్యము

ఓయీ! ఆబ్రహ్మ నిష్ఠుడు యెటువంటి వాడగుచున్నాడో సంక్షేపముగా చెప్పవలయు ననగా చెప్పుచున్నాడు. సర్వము సర్వత్ర, సర్వదా అనే న్యాయముచే శ్రుతి స్మృతులచె ఆత్మకాముడు గనుక యేమియు గోరడు. దుఃఖముం జెందడు, శాస్త్ర సంపర్కము, సజ్జన సంపర్కము, విచారము, అసంగభావనా, సమత్వము, స్వచ్ఛత్వము, సౌమ్యమని యేడు భూమికలు. సప్తమ భూమికను బొందిన వాడగుటచె సర్వభూతముల యందు సముడై నాయొక్క పరము పదమును, పరమ శివైకనిష్ఠాలక్షణము గల భక్తిని, బొందుచున్నాడు॥ ౫౪॥

శ్లో॥ భక్త్యా మామభిజానాతి యావా న్యశ్చాస్మి తత్వతః
తత్వతో మాం తతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్॥ ౫౫

## భాష్యమ్

నను వసత్యర్ధాతు సర్వత్రే త్యుక్త స్మృతి న్యాయేన మమ వాసుదేవస్య భక్తిం శిరోవ్రతేతి నామ్నీం పాశుపత వ్రతాఖ్యాం పరాం లభత ఇత్యాద్యుక్తం తత్రైవంసతి తయా భక్త్యా కథం మాం విజానీయా దిత్యాశంక్య పున రుపసంహరతి । భక్త్యేతి॥ తత్రైవం సతీహ సర్వేషా మేవ భక్తానాం శంభో ర్లింగ మనుత్తమ మిత్యాది స్మృత్యా మాం పాశుపతం యచ్చ కించ జగత్యత్రే త్యాది శ్రుత్యా యావా న్యశ్చాస్మీతి తత్వతో వస్తుతో మూలప్రకృతి రూపత్వేన సర్వాత్మనా యోఽభిజానాతి సపవో స్తత్స దితి నిర్దేశోక్త్యా తస్యాపి

మాయా త్మనో భావో వాచ్యం లక్ష్యంవా బ్రహ్మ యాథా
త్మ్యం యోవేదాదా విత్యాది శ్రుతివేద్యం తదూరివ్యైవా
హాంగిరోపాసనయా తత్వతో మాం జ్ఞాత్వా తతశ్చ మహే
శ్వరే పరే బ్రహ్మణి శివే విశతే సమరసో భూత్వో భవతీతి
భావః॥౫౫॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

అథేహాగ్ని రిత్యాది మంత్రేణ భస్మ తు ధారణం రుద్రి జపశ్చేతి
శిరోవ్రత నామ్నా పాశుపతవ్రితాఖ్యాభక్తి స్తామేవ వస్తు మాశంకతే।
వన్విత॥ స్మృతిశ్చ॥ 'అశేషో పనిషత్సారో రుద్రాధ్యాయ సముద్గతః॥
తథాపాశుపతం దివ్యం వ్రతం పాశ విమోచనం తదేత న్మునిభి స్సర్వై
ర్మరీచ్యత్రి పురోగమైః సహదేవై ర్ధృతం తేభ్యః సద్విద్యాం జగృహు
శ్చతే' ఇత్యాది ద్రష్టవ్యమ్॥ మూలప్రకృతి రూపత్వేనేతి॥ ఏతచ్చ సత్వం
రజ స్తమో విష్ణో జగదండం జనార్దన। తస్య కారణ మాహు స్త్వాం
సాంఖ్యా స్తత్వవిదో హర' ఇత్యాదినాపూర్వమేవ తద్రూపత్వే నోక్త
త్వాదితిభావః॥ ౫౫॥

## —♦ ఆం ధ్రి తా త్ప ర్య ము ♦—

సర్వవ్యాపకుడనైన నాయొక్క భక్తిని శిరోవ్రతమనే పేరుగలిగి
పాశుపత వ్రతమని ప్రసిద్ధిని బొందిన పరమభక్తిని బొందుచున్నాడని
చెప్పిన దానిలో అభక్తిచే నన్ను యెట్లు తెలుసు కొనునని శంకించుకుని
మళ్ళీ ఉపసంహారము చేయుచున్నాడు। భక్తులందరిలోను శివచిహ్నములు
ధరించిన భక్తుడుత్తముడను స్మృతిచే నన్ను పాశుపతునిగా శృత్యభిప్రాయ
ముచే నేనెట్టివాడనో యెవ్వండనో యథార్థముగా మూలప్రకృతి రూప
ముతో సర్వాత్మనా యెవడు తెలియుచున్నాడో వాడే, ఓం - తత్ -

సత్, అనే పేరుతో దానికిస్న మాయా స్వరూపముచే భావము - వాచ్య మని, లక్ష్యమని బ్రహ్మముయొక్క యథార్థము 'యోవేదాదౌ'అను శృతి యందు చెలియందగిన మహేశ్వరుని యహంగిరో పాసనచే తత్వమువలన నన్ను తెలిసి అటుపైన మహేశ్వరుడు పరబ్రహ్మము నైన శివుని యందు ప్రవేశించు చున్నాడు। సమరసము గలవాడగు చున్నాడని భావము 'అగ్నిరితిభస్మ వాయురితి భస్మ'యను మంత్రముచే భస్మ చిహ్నమును ధరించి రుద్రజపము చేయవలయునని శిరోవ్రతమని పేరుగలిగినట్టిన్ని పాశుపత వ్రతమను ప్రసిద్ధిగలది భక్తి. అభక్తినే చెప్పేకొరకు శంక చేయుచున్నాడు। సమస్తోపనిషత్తుల యొక్క సారము రుద్రాధ్యాయ మైనది. అటులె పాశుపత మను దివ్యమైనవ్రతము పాశమును విడిపించునది అట్టిదానిని మరీచి అత్రిమొదలగు మహర్షులందరును దేవతలందరును ధరించి సద్విద్యను పొందిరి. ఇత్యాదుల యందు చూడవలయును తత్వవిదు లైన సాంఖ్యులు సత్వ రజస్తమో గుణాత్మక మైన జగదండమునకు కారణ మును నిన్నుగా చెప్పుచున్నారు ఓహరి విష్ణో యని పూర్వమే మూలప్రకృతి రూపమని చెప్పడమైనది॥ ౫౫॥

శ్లో॥ సర్వ కర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః।
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్॥౫౬

## —♦ భాష్యమ్ ♦—

ననుచ కథం కర్మాణి కుర్వాణ స్తత్పదం విశత ఇత్యాహ - సర్వేతి॥ తత్రైవంసతి। తద్వైవ మన శ్శంభు పదారవిందయో రిత్యాది స్మృత్యుక్త రీత్యా సర్వాణ్యపి కర్మాణి సదా నిరంతరేణ కుర్వాణో మత్ప్రసాదాదేవ బుద్ధి ర్మనో హంచ చిత్తంచేతి పంచవింశతి తత్వాత్మకాత్ప్ర

వృత్తి లక్షణా స్మత్తో విశేషేణ యతః పృథగ్భూత ఏవ జన్మ మరణా శ్రియో యస్య స మద్వ్యపాశ్రయ స్సన్ శాశ్వతం నిరంతర మవ్యయ మవినాశినం వైష్ణవం పద మవాప్నోతీ త్యర్థః॥ ౫౬॥

—♦ లఘు టిప్పణీ ♦—

పృథగ్భూతఇతి। ప్రవృత్తి లక్షణో ధర్మో దేసుదేవ స్సమీరిత ఇత్యాద్యభ్యుక్తత్వా దిత్యవధార్యమ్॥౫౬॥

—♦ ఆం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ! కర్మలను జేయుచు పరమ పదమును యెట్లు బొందునంటె చెప్పుచున్నాడు. శంభుచరణముల యందున్నదే మనస్సను స్మృతి ప్రకారము సర్వకర్మలను నిరంతరము చేయువాడు నాయనుగ్రహము వలననే మనో బుద్ధి చిత్తా హంకారము మొదలగు పంచవింశతి తత్వములై ప్రవృత్తి లక్షణమైన నావలన విశేషముగా వేరయి జన్మమరణా శ్రయమై నన్నాశ్రయించి శాశ్వతమైనట్టి నిరంతరమైన అవ్యయము అవినాశి యయిన వైష్ణవపదమునుబొందుచున్నాడు (ప్రవృత్తిలక్షణము గల ధర్మము వాసుదేవుడని నివృత్తిలక్షణముగల ధర్మము సదాశివుడనిన్ని ఇదివరలో నే చెప్పియుంటిమి తెలియవలెను॥ ౫౬॥

శ్లో॥ చేతసా సర్వకర్మాణి మయి సన్యస్య మత్పరః ।
బుద్ధి యోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ॥　　౫౭

—♦ భా ష్య మ్ ♦—

ఏతదేవ పదం ప్రాప్తుం పున రవధారయ న్నాహ। చేతసేతి॥ తత్రైవం సతి చేతసా సర్వకర్మాణి పంచవింశతి

తత్త్వాత్మకే మయి సన్న్యస్య బుద్ధేః పర మాత్మానం విజానన్ బుద్ధియోగంచా ప్యాశ్రిత్య పృథక్కృత్య పరం పదం తురీయ మవాప్నోతీ త్యహమేవ హస్త పాదాది ప్రదత్వేన పరం సాధనం యస్య స మత్పర స్తథా మదుపదేశే శివైకతత్త్వే చిత్తం యస్య స మచ్చిత్తస్సన్ సతతం భవేతి స్వస్య గురుత్వ మవధారితమ్॥ ౫౭

## —♦ లఘు టిప్పణీ ♦—

అహమేవేతి॥ తత్రైవం సతి। 'సృజత్యేత జ్జగత్సర్వం విష్ణు స్తత్పశ్యతీ శ్వరః। ఇత్థం జగత్సర్వ మిదం రుద్ర నారాయణోద్భవ' మిత్యాది కూర్మ స్మృత్యా విష్ణో ర్జగత్కర్తృత్వేన ప్రాణినాం హస్త పాదాది ప్రదత్వేన శివజ్ఞానేన మోక్షోపకారిత్వ మితి ప్రవృత్తి పూర్వికైవ నివృత్తి రప్యవగతేతి భావః॥ ౫౭॥

## —♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఈపదమును పొందే కొరకు మళ్లీ ప్రారంభించి చెప్పుచున్నాడు. చిత్తముచే సర్వకర్మలను పంచవింశతి తత్త్వ రూపమైన నాయందు 'సమర్పించి బుద్ధికంటెను పరమైన ఆత్మను తెలియుచు బుద్ధి యోగమునున్నూ ఆశ్రియించి తత్త్వముల వేరుచేసి పరంపదమైన తురీయమును పొందుచున్నాడని నేనే హస్త పాదాదుల నిచ్చు వాడనుగాన ఉత్కృష్టమైన సాధనము నేనే గాన మత్పరుడై నా యుపదేశముచే శివైకతత్త్వమందు చిత్తము గలవాడగుచు యెప్పుడు నుండవలయునని తనకు గురుత్వము చెప్పబడినది. (విష్ణువు జగత్తునంతను సృష్టిచేయుచున్నాడు. అట్టి జగత్తును ఈశ్వరుడు చూచుచున్నాడు. ఈ ప్రకారము జగమంతయు రుద్ర నారాయణులచే నుత్పన్నమైనదనిన కూర్మస్మృతి వలన విష్ణువు జగత్కర్తయై

ప్రాణులకు హస్త పాదాదుల నిచ్చుటచేతను శివజ్ఞానము వలన మోక్షోప కారి యగును గాన నివృత్తికి పూర్వము ప్రవృత్తియె యని తెలియవలెను॥

శ్లో॥ మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యతి।
అథచే త్త్వ మహంకారా న్నశ్రోష్యసి వినజ్క్ష్యసి॥ ౫౮

## —♦ భాష్యమ్ ♦—

తదేవం నస్వయం ధ్యానతః కశ్చి త్సర్వజ్ఞ స్సిద్ధి పారగ ఇత్యాది స్మృతే స్తే తవ శివజ్ఞానోపదేష్టు ర్గురో రావశ్యకత్వ మితి నిశ్చినోతి॥ మచ్చిత్తఇతి॥ తత్రైవంసతి। మచ్చిత్తస్సన్ సర్వదుర్గాణి దుస్తరాణి సంసార దుఃఖాని యదుపదేశ ప్రసాదా త్తరిష్యసీ త్యర్థః। అథచేద్యది తు త్వంమదుక్తే విశ్వాస మకృత్వా ఽహంకారా త్పండితోఽహ మితి గర్వా న్నశ్రోష్యసి తతో వినజ్క్ష్యసి సదాశివ మప్యజాన న్పురుషార్థా ద్భ్రష్టో భవిష్యసీ త్యర్థః॥ ౫౮॥

## —♦ లఘుటిప్పణీ ♦—

పురుషార్థాద్భ్రష్టమితి॥యతోనస్వయం ధ్యానతః కశ్చి త్సర్వజ్ఞః సిద్ధి పారగ స్తస్మా ద్గురోః ప్రసాదేన వేదితవ్యః పరః శివ ఇత్యాది ద్రష్టవ్యమ్॥ ౫౮॥

## —♦ ఆంధ్రితాత్పర్యము ♦—

గురూపదేశములేక స్వయముగా ధ్యానము చేసికొని సర్వజ్ఞుడై సిద్ధి నొందిన వాడొక్కడును లేడను స్మృతివలన నీకు శివజ్ఞానమునుపదేశించు గురువు ఆవశ్యకమైయున్నాడని నిశ్చయించుచున్నాడు. నాయందుచిత్తము

నుంచి దుస్తరములైన సంసార దుఃఖములను యే ఉపదేశము వలన తరించ గలుగదువో ఒక వేళ నాయుపదేశమందు విశ్వాసముంచక అహంకారము వలన నేనే పండితుడనని గర్వము వలన వినవో అందువలన సదాశివుని తెలియక పురుషార్థము వలన భ్రష్టుడ వగుదువు. (స్వయముగా ధ్యానించి యెవడును సర్వజ్ఞుడుగాలేడు. సిద్ధినొందలేడు. అందువలన గుర్వనుగ్రహము వలన పరశివుడు తెలియ నగునన్న స్మృతులు జూడనగును॥

శ్లో॥ యదహంకార మాశ్రిత్య నయోత్స్య ఇతి మన్యసే
మిథ్యైవ వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి॥ ౫౯

—◆ భాష్యమ్ ◆—

అథేదానీం ధార్మికో హంకారం కర్మ కథం కరిష్యామీతి । తత్రాహ । తదహంకారమితి॥ తత్రైవం సతి యదహంకార మాశ్రిత్య క్రౌర్యం యుద్ధం కర్మ నకరిష్యామీతి మన్యసే చేన్మిథ్యైవ వ్యవసాయో నిశ్చయో యత స్తే ప్రకృతిః క్షత్రజాత్యారంభకో రజోగుణ స్వభావ రూప స్త్వాం తై ర్యుధ్యమానే సతి యుద్ధే స్వయమేవ నియోక్ష్యతీతి మదాభావః॥౫౯॥

—◆ లఘు టిప్పణీ ◆—

యుధ్యమానే సతీతి॥ తత్రైవం యది తైః సహ బలాత్కారేణ యుధ్యమానే త్వం పరాయిత శ్చే త్తదా తే ధర్మవిపర్యయః యది చావశః సం స్తై ర్యుధ్యమాన శ్చే త్తదాత్మావశ్యకత్వా త్త్వర్హి తత్కర్తృవ్యతైవా స్తీతి కృత్వా మదుపేశేనైవ తత్కృతో నక్రియత ఇతి మదాశయః॥ ౫౯॥

—• ఆంధ్రి తాత్పర్యము. •—

ఇప్పుడు నేను ధార్మికుడను క్రూరకర్మ నెట్లు చేస్తునంటె చెప్పుచున్నాడు। యే అహంకారము నాశ్రియించి క్రూరమైన యుద్ధమును చెయ్యనని దలచుదువో నీప్రయత్నము మిథ్యయే నిశ్చయము। యెందుకనగా నీయొక్క ప్రకృతి క్షత్రియ జాతి నారంభించిన రజోగుణ స్వభావము, నిన్నును, వారలు యుద్ధము చేయుచుండగా స్వయముగానె యుద్ధమందు నియోగించ గలదని నాయాశయము (వారలు బలాత్కారముగా యుద్ధము జేసిన నీవు పారిపోయిన యెడల ధర్మము తలక్రిందగును। నీవస్వాధీనుడవై వారలు యుద్ధముజేయగాఅప్పుడైనను నీవు యుద్ధముచేయుకతప్పదు నాయుపదేశముచే నిప్పుడేల చెయ్యవని నాయాశయము॥ ౫౯॥

శ్లో॥ స్వభావజేన కౌన్తేయనిబద్ధ స్స్వేన కర్మణా ।
కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్య స్యవశోపి తత్॥ ౬౦

—• భా ష్య మ్ •—

నను కాత్స్న్యై ప్రకృతి స్త్వామేవ విమృణోతి । స్వభావజేనేతి॥ తథాసతి । స్వభావజేన పూర్వోక్తేన క్షత్రియ ధర్మేణ శౌర్యాదినా నిబద్ధో వశీకృత స్త్వంస్వేన కర్మణా హేకౌన్తేయ యన్మోహా త్స్వాజ్ఞానా త్కర్తుం నేచ్ఛసి త త్త్వమీశ్వరపారతంత్ర్యా దప్యవశస్సన్ కరిష్యస్యేవేతి భావః॥ ౬౦॥

—• ల ఘు టి ప్ప ణీ . •—

పారతంత్ర్యాదితి॥ తద్యథా, 'బ్రహ్మా విష్ణు స్తథాన్యేపి దేవాస్సన్తీహ తేష్వథ । స్వతంత్రః శివ ఏవాస్తి నాత్రకార్యా విచారణేత్యాది స్మృతిత్యా త్త్వమప్య వశః సన్కరిష్యసీ త్యర్థః॥౬౦॥

## ఆంధ్ర తాత్పర్యము

ఓయీ! ప్రకృతి యనగా నేదంటె దానినె చెప్పుచున్నాడు. పూర్వోక్తమైన నీస్వభావ జన్యమైన క్షత్రియ ధర్మముతో శౌర్యాదులచే కట్టబడి వశమైన వాడవై నీవు యే అజ్ఞానము వలన యుద్ధము చేయ నిశ్చయించవో, అట్టి నీవు ఈశ్వరపరతంత్రుడవై అస్వాధీనుడవగుచు చెయ్యగలవు. బ్రహ్మ విష్ణు యితరమైన దేవతలందరును గలరు అందులో స్వతంత్రుడు శివుడొక్కడే మిగిలిన వారందరును పరతంత్రులే ఇందు సంశయము లేదనుస్మృతిచే నీవును పరతంత్రుడవైచెయ్యగలవని యర్థము.

శ్లో॥ ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి ।
భ్రామయ న్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥

## భాష్యమ్

నను క్వ తర్హీ శ్వర స్తిష్ఠతీ త్యాహ— ఈశ్వరఇతి॥ ఏవం తర్హి భర్గః శూలీ తథేశాన శ్చేశ్వర స్సర్వ దేహినా మిత్యాది స్మృత్యా గాయత్ర్యాదా దర్శిత ఈశ్వరో హే అర్జున సర్వభూతానాం హృద్దేశే ఽన్తఃకరణే తిష్ఠతీ త్యర్థః । ఏవ మిహ వినా శివప్రసాదంహి భ్రాన్తిః క్వాపి ననశ్యతీ త్యాది స్మృత్యా యంత్రారూఢానివ మాయయా సర్వ భూతాని భ్రామయ న్నీశ్వర స్తిష్ఠతీ త్యర్థః॥౬౧॥

## లఘుటిప్పణీ

హృద్దేశఇతి॥ తద్యథా॥ 'శివస్థానే శరీరేస్మిన్ సంస్థిత స్స్వాత్మ మాయయా దుఃఖాది సాగరే ఘోరే ముహ్యమాన శ్చ శోచతీ' త్యాది ద్రష్టవ్యమ్॥ ౬౧॥

—♦ ఆంధ్ర తాత్పర్యము ♦—

ఓయీ! ఈశ్వరు డెక్కడున్నాడనగా చెప్పుచున్నాడు. ఓ అర్జున! శ్లో॥ బ్రహ్మాండ దేవాలయ మధ్యసంస్థం పిండాండ గర్భాలయ చిత్తపీఠే। విభాసమానం వితతం స్వకీయ చైతన్యలింగం శివ మాశ్రయామః॥ భర్గుడు, శూలి, ఈశానుడు, ఈశ్వరుడు బ్రహ్మాండమను దేవాలయములో పిండాండమను గర్భాలయమున చిత్తమను పీఠమునందు చైతన్యమను లింగరూపముతో నున్నాడు. గాయత్రి ఆదియందు చూపించబడిన ఈశ్వరుడు సర్వభూతముల యొక్క అంతఃకరణయందుండుచున్నాడు. శివప్రసాదము లేక భ్రాంతి యెవరికిని నశించదను స్మృతిచే యంత్రారూఢులను వలె మాయచే సర్వభూతములను త్రిప్పుచ నీశ్వరుడే ఉంటున్నాడు. (శివస్థానమైనఈ శరీరమందుండి తన యొక్క ఆత్మ మాయచే దుఃఖ సాగరమందు మోహమున నేడ్చుచున్నాడను నట్టి స్మృతులు చూడవలయును॥ ౬౧॥

శ్లో॥ తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత।
తత్ప్రసాదా త్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥

—♦ భాష్యమ్ ♦—

ననుచ త్వంతు మయాప్రాప్తోసీతి తతః పరం కిం ప్రాప్తవ్య మస్తీత్యాహ — తమేవేతి॥ తతేర్థింసతి।తమేవ సదాశివం శరణం గచ్ఛ నతుమాం మాయామయం దేవకీసుతం కింతు మత్తః పరం తమేవేశ్వరం శివస్యార్థం స్థితా గౌరీ తదర్థో హరిరిష్యత ఇత్యాది స్మృత్యా శివశక్త్యాత్మకం జగదితి సర్వభావేన విజానన్హే భారత తం శరణం గచ్ఛే త్యర్థః। తథాసతి తస్య శంభోః ప్రసాదేన మో వైష్ణవ స్సోపి చ

యోగకాలే శక్తి స్వరూపేణ విచింత్య విష్ణు మిత్యాది. శ్రుత్యా వధారితాం పరాం శాన్తిం సప్తమ భూమికాం తల్లభ్యం శాశ్వతం శివ మద్వైతం స్థానంచ ప్రాప్స్యసీతి పరమార్థః॥ ౬౨॥

## —♦ ల ఘు టి ప్ప ణీ ♦—

నను సమష్టి భావేన యచ్చకించ జగత్యతేస్మి న్నిత్యాది శ్రుత్యా త్వమేవ సర్వాత్మనా ప్రత్యక్షోస్యేవ ఏవం వ్యష్టిభావేనాపి త్వం శ్రీకృష్ణ రూపతయా మయాప్రాప్త ఏవ। త్వమపీ త్యధికం కిం మాముపదేశం క రోషీ త్యుత్తరం వక్తు మాశంకతే। నన్విత్॥ ఏవంసతీహ। తేప్రాప్త వ్యంతు 'యోవేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతేచ ప్రతిష్ఠిత' ఇత్యాది శ్రుతసిద్ధాన్త వేద్యః పరశ్శివో మత్తోధికో వేద్య। ఇతి తమేవ సర్వభావేన సర్వాధిష్ఠానత్వేన జానీహీత్యర్థః॥ ౬౨॥

## —♦ ఆ ం ధ్ర తా త్ప ర్య ము ♦—

ఓయీ! నీవే నాకు ప్రాప్తమయితివి. నీకంటె మరేమి గావలయు నంటె చెప్పుచున్నాడు। ఆసదాశివునే శరణు బొందుము మాయా రూప మయిన దేవకీ సుతుడనయిన నన్నుగాదు, నాకంటె పరుడైన యా ఈశ్వ రుని శివునియొక్క సగము శరీరము గౌరి, గౌరిలో సగము నేనను స్మృతిచే జగదంతయు శివశక్త్యాత్మక మనునట్లు సర్వము శివుడే యను భావముతో తెలిసి శరణు బొందుము। అయితే ఈశ్వరానుగ్రహముచే వైష్ణవుండును యోగమును చేయునప్పుడు విష్ణును శక్తిస్వరూపముగాను చింతించుమనిన శ్రుతిచే చెప్పబడిన పరమ శాంతియైన సప్తమ భూమికను అందు లక్ష్యమగు శాశ్వతము శివము అద్వైతము అను స్థానమును బొంద గలవని పరమార్థము (ఓయీ! సమష్టి భావముచే యీజగతునందుండు

